## కథాసరిత్సాగరము ప్రథమభాగము

## విషయానుక్రమణిక.

### కథాపీఠలంబకము. 1

విషయము. | పుట.

శ్రీ

# కథాసరిత్సాగరము.

## కథాపీఠ మను ప్రథమలంబకము.

### ౧-వ తరంగము.

శా. శ్రీలం బల్కెడు మా కపూర్వవిజయశ్రీలోలదృక్పాత్రమై
నాళీకాస్త్రుఁడు శూలి వంప గిరికన్యాదృష్టి పాశంబుచే
హేలం గట్టెనొ నాఁగ భృంగహారినీలేందీవరశ్యామమై
లీలం గ్రాలెడుశంభుకంఠము కృపాలిందాంతరంగంబుతోన్.

శా. తారాసంఘము నెల్లఁ దొండమున సంధ్యాతాండవోత్సాహమం
దారూఢిన్ వెస నూడ్చి ప్రోసి కడు నవ్యం బైనసత్తారకా
వారంబున్ నిజశీత్కృతిప్రభవ మౌవార్బిందుపూరంబుచే
నీరంధ్రింబుగఁ జేయువేలు పొసఁగున్ నిర్విఘ్నముం బ్రీతితోన్.

క. సకలపదార్థాభిద్యో । తకదీపిక శారదాంబఁ దత్పరత భజిం
చి కడంగితిని బృహత్కథ । సకలంకత సంగ్రహముగ నభివర్ణింపన్.

కథాక్రమ వివరణము.

ఇందు మొదటిలంబకము కథాపీఠము, రెండవది కథాముఖము, మూఁడవది లావాణకము, నాలవది నరవాహనదత్తజననలంబకము, తరువాతిది చతుర్దారికాఖ్యము, ఆఱవది మదనమఞ్చుక, పిమ్మట రత్నప్రభాలంబకము, ఎనిమిదవది సూర్య

ప్రభ, తొమ్మిదవది అలంకారవతి, పిమ్మట శక్తియశ, పదునొ
కొండవది వేతాళలంబకము, తరువాత శశాంకవతీలంబకము,
అటుతరువాత మదిరావతీలంబకము, పిమ్మట పంచలంబకము,
దానివెంట మహాభిషేకలంబకము, పదునాఱవది సురతమంజరి,
తరువాత పద్మావతి, పదునెనిమిదవది విషమశీలలంబకము.

సంస్కృతగ్రంథప్రణేతృప్రతిజ్ఞ.

ఇది మూలమయిన పైశాచీబృహత్కథకు సరిగా నుం
డును. ఇంచుకయినను అతిక్రమింపదు. అందలి గ్రంథవిస్తరము
ఇందు సంక్షిప్తమగుటయు భాషయు మాత్రమే భేదము.
ఇందు శక్తికొలఁది ఔచిత్యము పోషింపఁబడియున్నది, కథా
రసమునకు భంగము లేకుండ కావ్యరసము చూపఁబడియున్నది.
ఈ నాప్రయత్నము నానాకథాజాలమును సులువుగా స్మరణలో
నుంచుకొనుటకే గాని పాండిత్యకీర్తికిఁ గాదు.

కథావతరణము.

కలదు గదా కిన్నర గంధర్వ విద్యాధర నివాసము
పర్వతచక్రవర్తి హిమవత్పర్వతము. ఆ హిమవంతుని మహి
మను వేఱె పొగడవలయునా? అన్నిపర్వతము లుండఁగా
త్రిలోకమాత అతనికే కూఁతురై పుట్టుటచేతనే తెలియ
లేదా? ఆ హిమాలయమునుయొక్క యుత్తరశిఖరమయిన మహా
గిరికి కైలాసమనిపేరు. అది అనేకసహస్రయోజనములు
ఆక్రమించి యుండును. 'సముద్రమును మథించినదయ్యును

మందరగిరి అమృతముచేత నైనను తెల్లఁబడదాయెను. నేను అప్రయత్నముగానే తెల్లఁగా నున్నాను.' అని నవ్వుచున్నదో యనునట్లు ఆకైలాసము తెల్లనివెలుఁగుచే దేదీప్యమానముగా నుండును. అందు సిద్ధవిద్యాధరాదులును ప్రమథగణములును కొలుచుచుండ చరాచరగురువు పరమేశ్వరుఁడు పార్వతితోఁగూడ నివసించుచుండును. ఏదేవుని యెఱ్ఱనిజటాజూటమందు బాలచంద్రుఁడు సంధ్యారాగముచే వెలుంగు నుదయగిరి శృంగమందలి విహారసుఖమును పొందుచున్నాఁడో, ఏభగవంతుఁడు అంధకాసురునిహృదయమును త్రిశూలమున గ్రుచ్చి ముల్లోకముల హృదయశూలమును వెలువరించినాఁడో, ఏదేవదేవునికి దండప్రణామములు చేసి సురాసురులు తమ చూడామణులయందు అతనిపాదనఖప్రతిబింబములచేత ప్రసాదప్రాప్తార్ధచంద్రులచేతనుంబలె ప్రకాశించుచుందురో, ఆపరమేశ్వరునిం ప్రాణనాయిక పార్వతి ఒకనాఁడు ఏకాంతంబున చనవుమెఱసి సన్నుతులచేత సంతోషపెట్టెను. ఆపొగడ్తలకు సంతసిల్లి చంద్రశేఖరుఁడు ఆమెను తొడమీఁద కూర్చుండఁబెట్టుకొని, 'ప్రాణనాయికా! నీ కేమిప్రియము చేయుదును' అని యడిగెను. అంతట గిరిపుత్త్రి 'నా యేలినవాఁడా, దేవా, నాకు ప్రసన్నుఁడవేని మనోహరమయిన యొక యపూర్వకథను చెప్పుము,' అనెను. అందుకు పరమేశ్వరుఁడు 'ఓసఖీ, లోకములో భూతము గాని వర్తమానము గాని భవిష్యత్తు గాని నీ వెఱుఁగని

దే మున్నది?, అనెను. అట్లన్నను పార్వతి ఆయనను నిర్బంధ పెట్టెను. మానినులచిత్తము ప్రియానురాగ పరీక్షా పరాయణము గదా? అంతట ఆమెను రంజింప వేఁడి మహేశ్వరుఁడు తన మహిమను ప్రకటించునదైన యీచిన్నికథను వక్కాణించెను.

పరమేశ్వరుఁడు పార్వతికి జ్వాలాలింగ కథను చెప్పుట.

పూర్వము నన్ను చూచుటకు బ్రహ్మయు నారాయణుఁడును భూలోకంబునం గ్రుమ్మరుచు హిమవంతుని పాదమూలముచేరి అక్కడ ఎదుట గొప్పజ్వాలాలింగమును గాంచిరి. అంతట దానియంతము కనుంగొనుటకు ఒకఁడు పైకిని మఱియొకఁడు క్రిందికిని పోయిరి. ఎంతదూరము పోయినను తుద గాన లేక మరలి వచ్చి నన్ను తపస్సులచేత మెప్పించిరి. నేనును ప్రత్యక్షమై వర మడుగు మంటిని. నన్ను తన కుమారుఁడను గమ్మని బ్రహ్మ యడిగెను. అట్లు తానే సర్వోత్కృష్టుఁడు గావలయు నని కోరిన దోషముచేత అతఁడు లోకములో అపూజ్యుఁడైనాఁడు. నారాయణుఁడు 'స్వామీ! నీకు శుశ్రూష చేయుచుందునుగాక' అని వర మడిగెను. అందుచే నతఁడు నాయర్ధశరీరమై నీవుగా జన్మించినాఁడు; నీవే ఆనారాయణుఁడవు, శక్తివి; నేనే శక్తిమంతుఁడను. మఱియు నీవు పూర్వజన్మమందుఁగూడ నాభార్యవు.

ఇట్లు చెప్పఁగానే శంకరుని 'నీకు నే నెట్లు జన్మాంతర

మంచు భార్య నైతినో చెప్పు మ'ని పార్వతి యడిగెను. అంత నాతం డిట్లు చెప్పెను.

## ద క్ష య జ్ఞ క థ.

దేవీ! పూర్వము దక్షప్రజాపతికి నీవును ఇంక పలువురును కొమార్తెలు పుట్టితిరి. అతఁడు నిన్ను నాకును తక్కిన వారిని ధర్మాదులకును ఇచ్చెను. ఒకానొకప్పుడు అతఁడు యజ్ఞము చేయుచు అందులకు కడమయల్లుండ్ర నందఱను పిలిచి నన్నుమాత్రము పిలువఁడాయెను. నీవు తండ్రిని 'నాయనా! నాభర్తనుమాత్రము పిలువలేదేమి?' అని యడుగఁగా 'నీ భర్త పునుకలపేరు ధరించువాఁడు, యజ్ఞములోని కెట్లు పిలుతును?' అని దక్షుండు ఉత్తర మిచ్చెను. ప్రేయసీ! ఆమాటలు నీచెవులకు సూదులై సోఁక, నీవు 'ఇతఁడు పాపాత్ముఁడు, వీనివలనఁ బుట్టినయీదేహము నా కేల?' అని కోపముచేత ఆదేహమును వదలి వైచితివి, జ్ఞప్తి తెచ్చుకొనుము, పిమ్మట హిమాలయమునకు నేను తపస్సుకై వచ్చితిని; మీతండ్రియు అతిథి నైన నాకు శుశ్రూషకై నిన్ను నియమించెను గదా? తారకాసురుని సంహరింపఁగల యొకపుత్త్రుఁడు నాకు కలుగుటకై మన్మథుఁడు దేవతలప్రేరణమీఁద అచ్చటికి వచ్చిన వాఁడు, నీవు నాచెంత నుండఁగా, సమయ మని నాపై బాణ మేసి, నామూఁడవచూపుచే భస్మ మాయెను. పిమ్మట సత్యుగ్ర తపస్సుచేత నన్ను నీవు దక్కఁగొంటివి. ఈప్రకారము నాకు

నీవు పూర్వమందును భార్యవు. మఱి యేమి చెప్పుదును నీకు?

ఇట్లని శంకరుఁడు ఊరకుండఁగానే దేవి అలుకఁజెంది 'నీవు మోసగాఁడవు, వేఁడుకొనినను మంచికథ చెప్పవు. నీవు అన్యాసక్తహృదయుఁడవు, గంగను నీవు నెత్తిమీఁద నెక్కించుకొనుటయు సంధ్యకు ప్రణమిల్లుటయు నేను ఎఱుఁగనా యేమి?' అని జంకించెను. ఆమాట విని శివుఁడు ఆమెను మంచిమాటలాడి దివ్యమయిన కథను చెప్పుటకు అంగీకరించెను. ఆమెయు అలుక మానెను. అంతట లోపలికి ఎవ్వరిని రానీవలదని దేవిచే ఆజ్ఞనొంది నందీశ్వరుఁడు ద్వారము కాచియుండఁగా ఈశ్వరుఁడు ఇట్లు చెప్పసాగెను.

పుష్పదంతాదుల శాపవృత్తాంతము.

దేవీ! 'దేవతలు కేవలసుఖులు, మనుష్యులు నిత్యదుఃఖితులు; దేవమనుష్యుల మిశ్రచరిత్రము పరభాగలాభముచేత మనోహరముగా నుండును. కాఁబట్టి విద్యాధరులచరిత్రమును నీకు చెప్పెదను వినుము.' అని సాంబమూర్తి పల్కునవసరంబున పుష్పదంతుఁ డనుగణోత్తముఁడు శివునియొద్ద మిగుల చనవుగలవాఁడు సేవార్థము వచ్చెను. ద్వారమందున్న నంది అతనిని ఆటంకపఱిచెను. అంత నతఁడు 'ఓహో! నిష్కారణముగా ఏమి యిప్పుడు నాకును గూడ ఆటంకము!' అని కుతూహలము గలిగి తత్క్షణమే యోగమాయచేత అదృశ్యుఁడై వారిసన్నిధిం బ్రవేశించి శివుఁడు వర్ణిం

చుచున్న యేఁగురువిద్యాధరులయు నద్భుతచరిత్రములను విని పోయి తనభార్య జయకు ఆకథలను చెప్పెను. అహాహా! ధనమునుగాని రహస్యమునుగాని స్త్రీలనుండి ఎవఁడు దాఁపఁగలఁడు! ఆఁడుదానినోట నువ్వుగింజయు నాన దనుమాటయు తప్పదుగదా! జయయు ఆశ్చర్యసముద్రములో నోలలాడినదై వెంటనే ఆకథలను పార్వతియెదుట చెప్పెను. అంత పార్వతి శివునిమీఁద 'అపూర్వకథను చెప్పనైతివి, ఇవిగో నీకథలు జయకుఁగూడ తెలియును' అని దెప్పరమాడెను. అంత నీశ్వరుఁడు యోగదృష్టిచేత సర్వ మెఱింగి గౌరితో 'దేవీ, మనయొద్దకు యోగముచేత అదృశ్యుఁడై ప్రవేశించి పుష్పదంతుఁడు ఈకథలను విని పోయి జయకు చెప్పినాఁడు. మఱి యొట్లు ఎవఁడు వీనిని ఎఱుఁగఁగలఁడు?' అనెను ఈమాట వినఁగానే దేవి అత్యంతకోపముతో పుష్పదంతుని పిలిపించి, భయముచే గడగడ వణఁకుచున్న యాతనిని 'ఓరి అవినీతుఁడా, నీవు మనుష్యుఁడ వై పోవలసినది'. అని శపించినది. పుష్పదంతుని క్షమింపు మని వానిపక్షముగా వేఁడుకొనిన మాల్యవంతుఁ డను ప్రమథునిఁ గూడ ఆప్రకారమే శపించినది. అంతట వా రిద్దఱును జయతోఁగూడ పాదములమీఁదఁ బడి మొఱపెట్టుకోఁగా కోపము తీఱి శర్వాణి యిట్లని శాపవిమోచనము ననుగ్రహించినది.—'కుబేరుని శాపముచేత వింధ్యారణ్యములో కాణభూతి యనుపేర పిశాచమై సుప్రతీకుఁ డను యక్షుఁ డున్నాఁడు.

ఓరి పుష్పదంతుఁడా! వానిని చూడఁగానే నీకు పూర్వజన్మ స్మరణ కలుగును. అంతట వానికి ఈకథను చెప్పుము; చెప్పిన వెంటనే ఈశాపము నీకు తొలఁగి పోవును. కాణభూతివలన ఈకథను మాల్యవంతుఁ డెప్పుడు వినునో ఆవెంటనే కాణభూతికి శాపవిమోచన మగును. మాల్యవంతుఁడును భూలోకములో దీనిని ప్రకటన చేసి శాపవిముక్తుఁ డగును.' ఇట్లని శైలపుత్త్రి విరమింపఁగానే ఆగణోత్తము లిద్దఱును మెఱపుఁదీఁగలరాసులో యన క్షణములో మెఱసి అదృశ్యులైరి.

ప్రమథులు భూమిలో జన్మించుట.

కొంతకాలమునకు పిమ్మట ఒకనాఁడు పార్వతి శంకరుని 'దేవా! నేను శపించిన యాప్రమథవరులు భూమిలో ఎక్కడఁ బుట్టినారో చెప్పు మ'ని కనికరముతో నడిగెను. చంద్రశేఖరుఁడును 'ఓప్రేయసీ! భూలోకములో కౌశాంబి యని యొక మహాపట్టణము గలదు; అందు పుష్పదంతుఁడు వరరుచి యను పేర జన్మించియున్నాఁడు. మాల్యవంతుఁడు సుప్రతిష్ఠిత మను పట్టణములో గుణాఢ్యుఁ డనుపేర జన్మించియున్నాఁడు. దేవీ, ఇది వారివృత్తాంతము.' అని చెప్పి, అనువృత్తులను సద్భృత్యులను క్లేశపెట్టినందులకు మిక్కిలి జాలిగొనియున్న తనప్రాణప్రియను కైలాససానువులయందలి కల్పలతల పొదరిండ్లలో సుఖగోష్ఠిం దేల్చుచు కాలము గడపుచుండెను.

---

## ౨ - వ త ర ం గ ము.

—ooo—

### వరరుచి కాణభూతిని దర్శించుట.

పిమ్మట నాపుష్పదంతుఁడు 'వరరుచి' 'కాత్యాయనుఁడు' అనుపేరుల భూలోకములో మనుష్యదేహముతో వర్తించుచు సకలవిద్యాపారంగతుఁడై నందునికి మంత్రియునై ఒకానొకప్పుడు మిక్కిలి ఖేదము పొంది వింధ్యవాసినిని దర్శించుటకు వింధ్యారణ్యమునకు వచ్చి తపస్సుచేత దేవిని మెప్పించెను. అంతట దేవి వానికి స్వప్నములో ప్రత్యక్షమై ఆసమీపమందే వింధ్యారణ్యములోనున్న కాణభూతిని పోయి చూడు మని యాజ్ఞాపించెను. అంతట వరరుచి ఎల్లెడల నీళ్లు లేక ఎండిపోయినచెట్లును వ్యాఘ్ర భల్లూక వానరాది దుష్టమృగములును గా నున్న యావింధ్యకాంతారమునందు ప్రవేశించి అందొకచోట అత్యున్నతమయిన మఱ్ఱిచెట్టును గాంచెను. దానిక్రింద నూఱు పిశాచములు చుట్టును గొలుచుచుండ పేరోలగం బున్న కాణభూతిని కోటగోడవంటి మహోన్నతాకారుని చూచెను. ఇతనిని చూడఁగానే కాణభూతి లేచి ఎదురుగా వచ్చి పాదములకు నమస్కరించి ఆసనమందుఁ గూర్చుండఁబెట్టెను. సుఖాసీనుఁడై వరరుచి కాణభూతిని 'ఓయి, నీనడవడి చూడఁగా ఉత్తమముగా నున్నది. నీకు పిశాచత్వము ఏల సంభవించినది?

చెప్పు మ'ని యడిగెను. ఆతనిచెలిమికి సంతసిల్లి కాణభూతి యిట్లనియె.

కాణభూతి వృత్తాంతము.

ఓమహాత్మా, నాకు స్వయముగా జ్ఞానము లేదు; మఱి యే మనిన, ఉజ్జయినిలో శ్మశానమందు సాంబమూర్తివలన నేను విన్నమాటను చెప్పెదను వినుము 'ఓదేవా, ఎందుచేత నీకు కపాలములయందును శ్మశానమందును ఈప్రీతి ?' అని పార్వతి యడుగఁగా శివుఁ డిట్లు ఉత్తరము చెప్పెను. 'తొల్లి కల్పావసానమందు ప్రపంచ మంతయు జలమయ మాయెను. అంతట నేను నాతొడను చీరి ఒక నెత్తురుబొట్టును క్రింద రాల్చితిని. అది నీళ్లలో పడి గ్రుడ్డాయెను. ఆగ్రుడ్డును రెండుగా పగుల్పఁగా అందునుండి పురుషుఁ డుదయించెను. అంతట నేను సృష్టికొఱకు ప్రకృతిని సృజియించితిని. ఆప్రకృతిపురుషులు ప్రజాపతులను సృజియించిరి. వారు ప్రజలను సృజించిరి. కాఁబట్టి ఆపురుషుఁడు లోకములో పితామహుఁడు (తండ్రులతండ్రి) అని చెప్పఁబడుచున్నాఁడు. అతఁడు చరాచరమైన విశ్వ మంతయు సృజించి గర్వపడెను. అందులకై నేను అతనితలను ఖండించితిని. పిమ్మట జాలిపుట్టి మహావ్రత మవలంబించి కపాలమును చేతఁగొని శ్మశానమందు సంచరించుచున్నాఁడను. మఱియు, ఓదేవీ! ఇప్పుడు చెప్పిన గ్రుడ్డుయొక్క చిప్పలే భూమ్యాకాశములై యున్నవి; కాఁబట్టి జగత్తు ఈకపాలస్వరూ

పమున నాచేతిలో నున్నది.' శంకరుఁడిట్లు చెప్పఁగా ఇంక నేమి మాటలాడుకొందురో విందునుగాక యని నేను కుతూహల పడుచుండఁగా, పుష్పదంతుఁ డెప్పుడు మరల మనయొద్దికి వచ్చు నని పార్వతి జీవితేశ్వరు నడిగెను. ఈశ్వరుఁడు గౌరితో నన్ను గురించి యిట్లనియె. "వీఁడు యక్షుఁడు, కుబేరునికింకరుఁడు; వీఁడు స్థూలశిరుఁడను రాక్షసునితో మైత్రి చేసినాఁడు. ఆపా పికి చెలికాఁ డగుట యెఱింగి కుబేరుఁడు వీనిని వింధ్యార ణ్యములో పిశాచమై యుండు మని శపించినాఁడు. వీనియన్న దీర్ఘజంఘుఁడు కుబేరునిపాదములలో పడి వేఁడుకోఁగా ధన దుఁడు వీనికి 'శాపముచేత భూమియందవతరించిన పుష్పదం తునివలన మహాకథను విని, శాపముచేతనే మనుష్యత్వమును పొందియున్న మాల్యవంతునికి ఆకథను చెప్పి, ఆ ప్రమథులతో కూడ వీఁడును శాపమును తరించును.' అని శాపావసానమును విధించినాఁడు. నీవును పుష్పదంతునికి ఆప్రకారమే శాపవి ముక్తిని అనుగ్రహించితివి, జ్ఞప్తిచేసికొనుము." సాంబమూర్తి పలికిన యీ మాటను విని నేను పరమానందభరితుఁడనై ఇక్కడికి వచ్చితిని. ఈప్రకారము నాశాపము పుష్పదంతుని దర్శనము కలుగువఱకు నుండును.

### వరరుచి కాణభూతికి బృహత్కథలను చెప్పుట.

ఇట్లతఁడు చెప్పఁగానే వరరుచి తన పూర్వజన్మమును స్మరించుకొని నిద్రనుండి మేలుకొన్నవానివలె అయి, 'ఆ పుష్ప

దంతుఁడను నేనే, నావలన ఆమహాకథను విను మ'ని లక్ష లక్ష పరిమితి కల యేఁడు మహాకథలను కాణభూతికి చెప్పెను. కాణభూతి మహాశ్చర్యభరితుఁడై 'దేవా! నీవు సాక్షాత్తు రుద్రుని యవతారమవు, మఱియెవరు ఇట్టి మహాద్భుతకథలు ఎఱుఁగ నేర్తురు! నీప్రసాదముచేత శాపము నాదేహమును వదలి నట్లే తోఁచుచున్నది, నాబోఁటివానికి చెప్పరానిది గాదేని, ఓమహాప్రభూ! నీవృత్తాంతమును పుట్టువు మొదలు చెప్పి నన్ను కృతార్థునిఁ జేయుము.' అని ప్రార్థించెను. ఇట్లతఁడు ప్రణమిల్లి మహావినయముతో వేఁడుకోఁగా వరరుచి తనవృత్తాంతమును జన్మప్రభృతి సవిస్తరముగా నిట్లు చెప్పందొడంగెను.

## వ ర రు చి జ న న క థ.

కౌశాంబీనగరమందు సోమదత్తుఁడు అగ్నిశిఖుఁడు అను నామముల ప్రసిద్ధుఁడైన బ్రాహ్మణోత్తముఁ డొకఁ డుండెను. ఆయనకు వసుదత్త యని భార్య యుండెను. ఆమె పూర్వ మొక మునికన్య, శాపముచేత ఈజన్మము పొందినది. నేనును, శాపముచేత ఈజన్మమున వారిపుత్త్రుఁడ నైతిని. నాకు అతి బాల్యమందే మాతండ్రి పరలోకగతుఁ డాయెను; మాతల్లియే మిక్కిలి కష్టపడి నన్ను పెంచుచుండెను.

## వ్యాడీంద్రదత్తులు వరరుచిం గలయుట.

ఒకనాఁడు ఇద్దఱు బ్రాహ్మణులు దూరప్రయాణమునడచి ధూళిగ్రమ్మినవేషములతో మాయింటికి నాఁటి బసకై వచ్చి

మద్దెలశబ్దము చేసిరి. అంతట మాయమ్మ మా నాయనను తలఁచుకొని గద్గదస్వరముతో నాతో 'నాయనా, మీనా యనగారిచెలికాఁడు నందుఁడు నటుఁడు నృత్యము చేయుచున్నాఁడు' అనెను. నేను 'అమ్మా, నన్ను పో నిమ్ము, చూచి వచ్చెదను. పాటతో కూడ ఆయాట సర్వమును నీకు చూపించెదను.' అని యడిగితిని. నాయీమాట విని ఆబ్రాహ్మణు లిద్దఱును ఆశ్చర్యపడసాగిరి. మాయమ్మ వారితో 'అయ్యా, యీమాట నిశ్చయమే; ఈశిశువు ఒక్కమాఱు విన్నమాత్రాన సర్వమును ధారణచేయఁగలఁడు.' అనెను. అంతట వారు పరీక్షార్థమై నాయెదుట ప్రాతిశాఖ్యను చదివినారు. నేనును ఆగ్రంథము నంతయు తత్క్షణమే ఒప్పగించితిని. తర్వాత వారితో పోయి నాట్య మెల్ల చూచి వచ్చి మాయమ్మ యెదుట సమస్తమును ఆడి పాడి చూపించితిని. వారిలో నొకఁడు వ్యాడి యనువాఁడు నన్ను శ్రుతధరునిఁగా నిశ్చయించి మాయమ్మకు ప్రణామము చేసి యిట్లు విన్నపించెను.

వ్యాడీంద్రదత్తుల వృత్తాంతము.

ఓతల్లీ, వేతస మనుపట్టణములో దేవస్వామి కరంభకుఁడు నని యిద్దఱు అన్నదమ్ములు పరస్పరము అతిస్నేహము గలవారు ఉండిరి. వారిలో ఒకరి కొడుకు ఈ యింద్రదత్తుఁడు; నేను రెండవాయన కుమారుఁడను, నాపేరు వ్యాడి. నేను పుట్టఁగానే మాతండ్రి కాలము చేసెను; ఆదుఃఖముచేత

ఇంద్రదత్తునితండ్రి మహాప్రస్థానయాత్ర వెడలెను. ఆదుఃఖము చేత మాతల్లులు దేహత్యాగము చేసిరి. అంత మేము ధనికుల మయ్యును దిక్కులేనివారమై విద్యార్థులమై కుమారస్వామిని గూర్చి తపస్సుచేయ బయలువెడలితిమి. తపోనిష్ఠులకు మాకు స్వామి స్వప్నములో ప్రత్యక్షమై 'నందరాజురాజధాని పాటలీపురమందు వర్షుఁడని యొకవిప్రుఁడు గలఁడు, అతనివలన మీరు సకలవిద్యలను నేర్వఁగలరు, అచ్చటికి పొండు.' అని యనుగ్రహించెను. అంతట మేము పాటలీపురమునకుఁబోయి అడిగితిమి. జనులు ఆపట్టణములో వర్షుఁడనుమూర్ఖుఁడు గలఁడేగాని ఆపేరుగలపండితుఁడు లేఁడని చెప్పిరి. అంతట మేము డోలాయమానమానసులమై వీథులం దిరుగుచు ఒకచోట అంతటను మెలుకకన్నముల జల్లెడయై చీమలపుట్టలును పగిలిపోయినగోడలును గలిగి కప్పులేక కళలేక ఆపదల జన్మభూమింబోని యొకయింట ధ్యాననిష్ఠుఁడై యున్న వర్షుని చూచినారము. లోపలికి పోయి అందు చినుఁగుల ప్రాఁత చీర కట్టికొని యున్నదానిని మిక్కిలి బక్కచిక్కినదానిని ఆయనభార్యను గుణానురాగముచేత ఆయనను వలచి వచ్చిన దారిద్ర్యదేవతయో యన నొప్పుచున్నదానిని చూచి ఆమెచే నాతిథ్యము పొంది ఆమెను చాఁగిలంబడి మ్రొక్కి మావృత్తాంతమును వర్షునిమూర్ఖతాఖ్యాతిని విన్నవించితిమి. ఆపతివ్రత

'ఓరి బాలకులారా! మీరు నాకు పుత్త్రులు, మీముద్ద లజ్జయేమి?' అని యీకథను చెప్పెను.

## వర్షోపాధ్యాయుల వృత్తాంతము.

ఈనగరములో శంకరస్వామి యని ఒక బ్రాహ్మణోత్తముఁ డుండెను. నాభర్తయు ఉపవర్షుఁడును ఆయనకుమారులు. ఇతఁడు మూర్ఖుఁడును దరిద్రుఁడును; తమ్ముఁడు ఇందులకు విపరీతమయినవాఁడు. అతఁడు తనభార్యకు ఇతని కుటుంబమును కూడ పోషింపవలసిన దని యాజ్ఞాపించెను. ఇట్లుండఁగా ఒకానొకప్పుడు వర్షాకాలము వచ్చినది. ఈపట్టణములో స్త్రీలు బెల్లమును పిండియు కలిపి గుహ్యాకారముగా ఒకపాదుపిండివంట చేసి మూర్ఖబ్రాహ్మణునికి దానము చేయుదురు. ఆదానముచే స్త్రీలకు శీతకాలమందు స్నానశ్రమయు వేసవియందు తాపమును కలుగవు. ఆపాదుదానమును వివేకులెవ్వరును పుచ్చుకొనరు. ఆదానమును నాతోడికోడలు సదక్షిణాకముగా నాభర్త కిచ్చినది. దానిని పుచ్చుకొని ఆయన యింటికి రాఁగాఁ జూచి నేను మిక్కిలి విసుగుకొంటిని. అంతట ఆయన తన మూర్ఖతకు మిక్కిలియు వగచి శ్రీకుమారస్వామిమొక్క పాదములే శరణ మని పోయి తపస్సుచేత భక్తవత్సలుఁడైన యాదేవుని మెప్పించెను. అంతట దేవుఁడు ప్రసన్నుఁడై ఈయనకు సకలవిద్యలను ఇచ్చి 'నీవు శ్రుతధరుఁడైన బ్రాహ్మణునికి మాత్రమే వీనిని చెప్పవలసినది' అని యాజ్ఞాపించెను. ఇట్లు

ఈయన దేవతానుగ్రహము పొంది అతిహర్షముతో ఇంటికి వచ్చి ఆవృత్తాంత మంతయు నాకు చెప్పి అది మొదలు సదా జపధ్యానపరాయణుఁడై కాలము గడపుచున్నాఁడు. కాఁబట్టి మీరు పోయి శ్రుతధరు నొకని వెదకి తెండి. అట్లు చేసిన మీకు సర్వార్థములును సిద్ధించును, సందేహము లేదు.

వ్యాడీంద్రదత్తులు వరరుచిం దోడ్కొని వర్షోపాధ్యాయులకడ కేఁగుట.

వర్షభార్యవలన ఈవృత్తాంతమును విని ఆమెకు నూఱు వరహాలిచ్చి తాత్కాలిక దారిద్ర్యమును పోఁగొట్టి అక్కడి నుండి వచ్చినారము. లోక మంతయు తిరిగియు శ్రుతధరుని ఎందునుం గానక విసిగి వేసారి ఇప్పటికి మీయింటికి వచ్చినారము. ఇంతకాలమునకు శ్రుతధరుఁడు నీకుమారుఁడు మాకు దొరకినాఁడు. వీనిని మా కిమ్ము, విద్యాధనమును సాధింపఁబోయెదము. వ్యాడి పల్కిన యీమాటకు మాతల్లి ఆదరముతో నిట్లనియె. "మీరు చెప్పిన దంతయు చక్కఁగానే యున్నది; ఇందు నాకు పూర్ణముగా నమ్మకము కలదు. నాయేకపుత్త్రుఁడు వీఁడు పుట్టగానే 'వీఁడు శ్రుతధరుఁడు, వర్షుని వలన సకల విద్యలను గ్రహించును, లోకములో వ్యాకరణ శాస్త్రమును ప్రతిష్ఠ చేయును; ఏదేది లోకములో వరమో (శ్రేష్ఠమో) అది యెల్ల వీనికి రుచించునుగావున వీనికి వరరుచి యని పేరు.' అని అశరీరవాణి పలికెను. ఈబాలుఁడు కొంచెము ఎదిగినది

మొదలు ఆవర్షోపాధ్యాయుఁడు ఎక్కడ నున్నాఁడో అని నేను రేయుంబగలు చింతించుచుండి యిప్పటికి మీవలన విని మహా పరితోషమును పొందితిని. వీనిని మీరు కొనిపొండు, చెఱు పేమి? వీఁడు మీ తమ్ముఁడు."

మాయమ్మ యిట్లు చెప్పఁగా వ్యాడీంద్రదత్తులు పట్ట రాని సంతోషముతో ఆరాత్రియెల్ల మేలుకొనియే క్షణముగా గడపిరి. అంతట వ్యాడి ఉపనయనోత్సవముకొఱకు మాయ మ్మకు ధనమిచ్చి నాకు వేదాధికారము గలుగుటకై తానే ఉపనయనము చేసినాఁడు. అంతట మాయమ్మ ఎట్లో కన్నీళ్లు ఆఁపుకొన్నదై వారికి 'నన్ను కొని పొండ'ని సెలవిచ్చెను. వ్యాడీంద్రదత్తులును ఆమెను ఉత్సాహవచనముల సమాధాన పఱిచినవారై కుమారస్వామి నాటిన ఆవరకల్పవల్లి పుష్పించిన దని తలఁచి త్వరగా బయలువెడలిరి.

## వ్యాడీంద్రదత్తకాత్యాయనుల విద్యాభ్యాసము.

క్రమముగా మేము వర్షునియింటికి వచ్చినారము. మా గురువు నన్ను మూర్తీభవించినదైన కుమారస్వామి ప్రసాదము నుగా గ్రహించెను. మఱునాఁడు మమ్ము ఎదుట కూర్చుండఁ బెట్టుకొని పవిత్రమయిన ప్రదేశమందు కూర్చుండి వర్షోపా ధ్యాయుఁడు దివ్యమయిన వాక్కుచేత ప్రణవము నుచ్చరించెను. వెంటనే ఆయనకు అంగములతోఁగూడ వేదములు స్ఫురించినవి. అంతట ఆయన మాకు వేదములను చెప్పసాగెను. ఒకమాఱు

విని నేనును, రెండుమాఱులు విని వ్యాడియు, ముమ్మాఱు విని ఇంద్రదత్తుండును, గురూక్తమును గ్రహించితిమి. అపూర్వమయిన దివ్యమయిన మా వేదనాదమును ఏమి ఈవింత యని బ్రాహ్మణోత్తములెల్ల వచ్చి విని పరమాశ్చర్యభరితులై వర్షోపాధ్యాయులవారిని స్తోత్రములతోను సాష్టాంగప్రణామములతోను పూజించిరి. ఆచిత్రమును చూచి ఆనందపరవశులై ఉపవర్షుఁడు దక్క పాటలీపురజనులందఱును మహోత్సవములు చేసిరి. మహైశ్వర్యవంతుఁడు నందమహారాజును ఆవిద్యావైచిత్ర్యమును గౌరీపుత్త్రుని వరప్రభావముగా నెఱింగి సంతోషించి వచ్చి ఆదరముతో మాయుపాధ్యాయులవారియిల్లు బంగారముతో నిండించి కృతార్థుఁ డాయెను.

---

## ౩-వ తరంగము.

---

మఱల నిట్లు వరరుచి చెప్ప సాగెను. కాణభూతియు ఏకాగ్రముగా వినసాగెను. ఒకనాఁడు స్వాధ్యాయము చెప్పుకొని యైనతర్వాత ఉపాధ్యాయులవారి యాహ్నిక మయిన పిదప వారిని 'స్వామీ! ఈనగరము ఇట్లు లక్ష్మీసరస్వతులకు ఆటపట్టుగా నుండుటకు ఏమికారణమో చెప్పుఁ డ'ని యడిగినారము. ఉపాధ్యాయులవారు ఇట్లు చెప్పఁదొడంగిరి.

## పాటలీపుత్త్రిక కథ.

ఓరి బాలకులారా! గంగాద్వారమందు కనఖల మనుపుణ్య తీర్థము కలదు. అందు పూర్వము కాంచనపాత మనువేల్పు టేనుఁగు ఉశీనరగిరిని శృంగమును భేదించి అందునుండి గంగా నదిని క్రిందికి పాతించినది. ఆతీర్థమందు దాక్షిణాత్యబ్రాహ్మణుఁ డొకఁడు భార్యతోఁగూడ తపస్సు చేయుచుండెను. అక్కడనే ఆతనికి ముగ్వురు కుమారులు కలిగిరి. కాలక్రమమున ఆయన భార్యతోఁగూడ స్వర్గస్థుఁడు కాఁగా ఆముగ్వురు పుత్త్రులును విద్యార్థులై రాజగృహ మనుపట్టణమునకుఁ జనిరి. అక్కడ విద్య నేర్చియు తమ యనాథత్వమునకు వగచుచు కుమార స్వామిని దర్శించుటకు దక్షిణాపథమునకుఁ బోయిరి. అక్కడ సముద్రతీరమందు చించిని యనుపట్టణమున కేఁగి భోజికుఁ డను నొక బ్రాహ్మణునియింట బసచేసిరి. అతఁడు వారికి ముగ్వురకు తన ముగ్వురు కొమారితలను,తనకు వేఱు సంతానము లేనందున తన యావద్ధనమును, ఇచ్చి తపస్సునకై గంగాతీరమున కరిగెను. వారును అచ్చట మామగారియింట నివసించి యుండఁగా వఱపు పట్టి దారుణ మయిన కాటకము వచ్చెను. అంతట వారు పతి వ్రత లయిన యాభార్యలను విడనాడి తమప్రాణములను మాత్ర ము కాపాడుకొనుటకు దేశాంతరము పోయిరి. క్రూరహృదయు లను బంధుస్నేహము అంటునా! ఆ స్త్రీలలో నడిమియామె గర్భిణియై యుండెను. అంత నా స్త్రీలు తమతండ్రికి మిత్త్రుఁ డైన

యజ్ఞదత్తునియిల్లు సేరి భర్తలను ధ్యానించుచు కష్టముగా కాలము గడపుచుండిరి. కులస్త్రీలు ఆపదయందైనను పాతివ్రత్యమును పోఁగొట్టుకొందురా? నడిమియామె పుత్త్రుని గనెను. వానియందు ఆముప్వురకును ఒకరికన్న నొకరికి ప్రేమ అధికముగా నుండెను. ఇట్లుండ నొకనాఁడు పరమేశ్వరుఁడు ఆకాశమార్గమున స్వారివెంచేయుచుండఁగా ఆయనతోడయందున్న పార్వతి కరుణార్ద్రహృదయయై ఆయనను 'ఓదేవా! చూడుము, ఈముగ్గురు తల్లులును ఈశిశువు తమ్ము రక్షించు నని వీనియందు ఎంతయు ప్రేమ యుంచి ఆశపెట్టుకొనియున్నారు, వీఁడు బాల్యమందే వీరి నెట్లుకాపాడునో ఆప్రకారము అనుగ్రహింపుము.' అని వేఁడెను. ప్రేయసి ఇట్లు చెప్పఁగా వరదుఁడు శంకరుఁ డిట్లనియె. 'ఆలాగే వీని ననుగ్రహించెదను; వీఁడు పూర్వము భార్యతోఁగూడ నన్ను ఆరాధించినాఁడు. అందుచేత వీఁ డిప్పుడు భోగార్థమై పుట్టియున్నాఁడు. వీనిభార్య పాటలి యను పేర మహేంద్రవర్మకు కూఁతురై పుట్టియున్నది. అది వీనికే మఱల ఈజన్మమందును భార్య యగును.' అనంతరము పరమేశ్వరుఁడు ఆముప్వురు పతివ్రతలకును స్వప్నములో అగపడి 'ఓపతివ్రతలారా! మీపుత్త్రునికి పుత్త్రకుఁ డనియే పేరు. వీఁడు నిద్ర మేల్కొనఁగానే తలగడక్రింద ప్రతిదినమును లక్షవరహాలుండును. వీఁడు రాజు సయితము కాఁగలఁడు.' అని ప్రసాదించెను. అంతట తెల్లవాఱఁగానే ఆముగ్గురు పతివ్రతలును బంగా

రమును జైకొని తమ పాతివ్రత్యము ఫలించిన దని మిక్కిలి యానందించిరి. అంత నాబంగారముచేత స్వల్పకాలములో గొప్ప భాగ్యము గలవాఁడై పుత్త్రికుఁడు రాజాయెను. ఇందు ఆశ్చర్య మేమి? సంపదలు తపోధీనములు గదా. ఒకనాఁడు యజ్ఞదత్తుఁడు ఏకాంతములో పుత్త్రికునితో ని ట్లనియె.

ఓ రాజా! నీతండ్రులు కాటకముచేత ఎక్కడికో పోయినారు. కాఁబట్టి సర్వదా బ్రాహ్మణులకు ఇచ్చుచుండుము. ఆ యీవిని విని వారును వత్తురు. ఇందులకు నిదర్శనముగా బ్రహ్మదత్తుని కథను చెప్పెదను వినుము.

## బ్రహ్మదత్తుని కథ.

పూర్వము వారాణసియందు బ్రహ్మదత్తుఁ డని యొక రా జుండెను. అతఁ డొకరాత్రి ఆకాశములో జాజ్వల్యమానము లైన రెండు బంగారపుహంసలను చూచెను. ఆరెంటిని నూర్లకొలఁది రాజహంసలు చుట్టును గొలుచు చుండినవి. అ ట్లారెండును అకాలశరన్మేఘములమధ్యను మెఱయుచున్న మెఱపుఁదీఁగెలో యనునట్లు విరాజిల్లుచుండెను. రాజునకు వానిని మఱల చూడఁ గోరిక ఎంత మిక్కుటముగా కలిగెనో! నారాజు మంత్రులతో నాలోచించి మనోహర మైన తటాక మొకటి త్రవ్వించి అందలి ప్రాణులకు అభయము నాజ్ఞాపించెను. రాజభోగములయందుఁగూడ ఆదరము తప్పిపోయెను. అంత పిమ్మట ఆహంసలు ఆతటాకమునకు రాఁగా చూచి రాజు

సంతోషించి బెదరు తీఱ వానిని చనవు చేసి బంగారపుదేహములు కలిగినందులకు వానిని కారణ మడిగెను. అంత నాహంసలు, స్పష్టమయిన వాక్కుతో రాజుతో నిట్లని చెప్ప సాగినవి. 'ఓరాజా! మేము పూర్వజన్మములో కాకులము. ఒకప్పుడు బలికై పరస్పరము పోరాడి పుణ్యమయిన యొక శూన్య శివాలయములో ఒకయరిణలోఁ బడి మృతిఁబొందితిమి. ఆపుణ్యంబున పూర్వజన్మజ్ఞానము గలిగి బంగారపుహంసలమై పుట్టినారము.' ఆమాట విని రాజు వానిని యథేచ్ఛముగా చూచుచు సంతోషించుచుండెను.

ఆప్రకారమే నీవును అపూర్వమయినదానమహిమచేత నీతండ్రులను కూడుకొందువు. యజ్ఞదత్తుఁ డిట్లు చెప్పఁగా అంగీకరించి పుత్త్రకుఁడును అట్లే చేసెను. ఆబ్రాహ్మణులును వచ్చి ఎఱుంగఁబడి ఉత్కృష్టమైనసిరిని భార్యలనుం బొందిరి. ఆశ్చర్యము! ఎట్టికష్టములు అనుభవించిననేనియు వివేకహీనులైన దుర్మార్గులకు స్వభావము మాత్రము మాఱదు. ఎట్లనఁగా, ఆబ్రాహ్మణులు రాజ్య మేలంగోరి పుత్త్రకుని చంప నిశ్చయించి వింధ్యవాసినిని దర్శించుట కని మిషపెట్టి అతనిని ఆమెగుడికి తోడుకొనిపోయిరి. అమ్మవారిగర్భగృహములో తలవరులను నిలిపి పుత్త్రకుని 'నీవు ముందు లోపలికిఁ బోయి అమ్మవారిని దర్శనముచేసికొని రమ్ము.' అని పంపిరి. అతఁడును వారిమాట యందు శంకింపక లోపలికి పోయెను; ఘాతకులును వానిని

చంప వచ్చిరి. అమ్మవారు పుత్త్రకునియందు కరుణించి వారి మతిని కలఁత పెట్టెను. అంతట పుత్త్రకుఁడు వారిని మీ రేల నన్ను చంపెద రని యడిగెను. వారు 'నీతండ్రులు మాకు బంగార మిచ్చి ఈపని కాజ్ఞాపించినారు.' అనిరి. 'నన్ను వదలి పెట్టుఁడు, మీకు అమూల్యమయిన నారత్నాలంకారము లిచ్చెద. మీరహస్యమును బయటఁ బెట్టను, దేశాంతరమునకుఁ బోయెదను.' అని పుత్త్రకుఁడు చెప్పెను. అందుల కంగీకరించి ఆయలంకారములు పుచ్చుకొని తలవరులు వెలువడి 'పుత్త్రకుని చంపివైచితి' మని వాని తండ్రులతో చెప్పి, తమయిండ్లకుఁ బోయిరి. ఆ బ్రాహ్మణులు ఇంటికి మరలి రాఁగానే వారిని రాజఘాతులనియు పుత్త్రఘాతులనియుపట్టి మంత్రులు ఉరిఁదివియించిరి. కాక, కృతఘ్నులకు మే లెన్నఁడైనం గలుగునా? సత్యసంధుఁ డాపుత్త్రకమహారాజు తన బంధువులమీఁద విరక్తుఁడై వింధ్యారణ్యములో ప్రవేశించి పోవుచుండెను. అక్కడ ముష్టియుద్ధము చేయుచున్న యిద్దఱు పురుషులను చూచి మీ రెవరని యడిగెను. 'మేము మయాసురుని కుమారులము. ఈ తబిలయు కఱ్ఱయు పావుకోళ్లును మాకు పిత్ర్యమైన యాస్తి. ఎవఁడు మాలో బలాధికుఁడో వాఁడు దీనిని గ్రహించును గాక యని మేము యుద్ధము చేయుచున్నారము.' అని వారు చెప్పిరి. ఆమాటకు పుత్త్రకుఁడు నవ్వి 'ఇది ఏపాటిధనము? దీనికోసము యుద్ధమా?' అనెను. అందునకు వారు 'ఈపావుకోళ్లను తొడుగు

కొనిన ఆకాశగమనము కలుగును. ఈకఱ్ఱతో నేల మీఁద గీచిన దంతయు గీచినట్టే వాస్తవమగును. తబిలలో అమృత ప్రాయములైన యాహారములు తలంచినమాత్రమున ఉదయించును.' అనిరి పుత్త్రకుఁడు 'యుద్ధ మేల? ఈపందెము వేయుఁడు; పఱుగులో ఎవఁడు గెలుచునో వాఁడు దీనిని హరించునుగాక.' అనెను. అందుల కంగీకరించి ఆముూఁడులు అక్కడినుండి పఱుగెత్తిరి.

అంతట పుత్త్రకుఁడు ఆపావుకోళ్లను తొడుగుకొని కఱ్ఱను తబిలను కైకొని ఆకాశమార్గమున ఎగిరిపోయెను. క్షణములో కడుదూరము పోయి ఆకర్షిక యను నొక చక్కని పట్టణమును చూచి అందు దిగెను. 'వేశ్యలు నా తండ్రులవలెనే మోసము చేయుదురు, వర్తకులు లుబ్ధులు, ఎవరియింట బస చేయుదును?' అని తలపోయుచు మనుష్యులు లేని యొక యింట నొకముసలిదానిని చూచి ధన మిచ్చి సంతోషపెట్టినవాఁడై ఆమెయు తన్ను ఆదరింపఁగా ఆపాడుగృహమందు రహస్యముగా నివసించియుండెను. ఒకనాఁడు ఆముసలమ్మ మిక్కిలి ప్రీతితో పుత్త్రకునిఁ జూచి ఇట్లనియె? 'నాయనా! నీ కెక్కడను తగిన భార్య లేదని నాకు మిక్కిలి చింతగా నున్నది. ఈపట్టణపురాజునకు పాటలి యని కూఁతురు గలదు. ఆమెను పైయంతఃపురములో ఒకయపూర్వరత్నమునుగా కాపాడుచున్నారు.' ముసలమ్మ చెప్పిన యీమాటను చెవులార పుత్త్రి

కుఁడు వినఁగానే దానివెంబడియే మనస్ఖుఁడు లబ్ధరంధ్రుఁడై హృదయము ప్రవేశించెను.

### పాటలీపుత్త్రికుల గాంధర్వవివాహము.

ఆ సుందరిని ఈదినమే పోయి చూచెదనుగాక యని నిశ్చయించుకొని పుత్త్రికుఁ డారాత్రి పావుకోళ్లు తొడుగుకొని ఆయంతఃపురమునకు పోయి కొండశిఖరమంతయెత్తున నున్న కిటికీగుండ ప్రవేశించినవాఁడై ఏకాంతమందు నిద్రించుచున్న పాటలిని చూచెను. మైదీఁగ నంటి ఎడలేక వెన్నెల సేవించుచుండఁగా లోకమునెల్ల జయించి విశ్రమించియున్న మదనాజ్ఞయుంబోలె తేజరిల్లుచున్న పాటలిని చూచి ఈమె నెట్లు లేపుదునని పుత్త్రికుఁ డాలోచించుచున్న యవసరములో ఆకస్మికముగా గస్తి తిరుగుచున్న తలవరి యిట్లు పాడెను.

కం. కలహంసకృత నేకతమున
నలసోన్మిషదీక్షణం బ్రియన్ నిద్రితఁ గాఁ
గిలి మేల్కొలుపుటకంటెన్
బళి! బళి! జాణనికి మేలుభాగ్యము గలదే?

ఈయుపోద్ఘాతమును విని రాగాతిరేకముచే అంగములు వడఁకుచుండఁ పుత్త్రికుఁడు ప్రేయసిని కౌఁగిలించుకొనెను. ఆరమణియు మేలుకొనెను. అతనికేసి రాకపోకలు సేయుచున్న యాలతాంగిదృష్టులలో లజ్జాకౌతుకములకు పరస్పరము మిక్కిలి సమ్మర్దమాయెను. అంత నాయిరువురును పరస్పరము సంభా

పించి గాంధర్వవిధిచేత వివాహమైరి. అప్పు డాదంపతులకు ప్రేమ హద్దులేక పెరుఁగుచునే యుండెనుగాని, రాత్రి మాత్రము ఆప్రకారము పెరుఁగదాయెను. నాలవజామమున పుత్త్రకుఁడు ఆమెను వీడ్కొని మనస్సునుమాత్రము ఆమెయొద్దనే యుంచి ముసలమ్మ యింటికి వచ్చెను.

ఈ ప్రకారము పుత్త్రకుఁడు రాకపోకలు సేయుచుండఁగా ఒకప్పుడు రక్షులు పాటలియొక్క యంగవల్లియందు సంభోగచిహ్నములను గాంచి దిగులుపడి ఆమెతండ్రితో విన్నవించిరి. అతఁడును పరిచారిక నొకతెను రాత్రి రహస్యమును కనిపట్టుటకై యంతఃపురములో దాఁగియుండ నియమించెను. యథాప్రకారము పుత్త్రకుఁడు వచ్చి నిద్రించియుండఁగా అతని వస్త్రమందు ఆపరిచారిక లత్తుకతో ఒకగుఱుతు చేసి, తెల్లవాఱఁగానే రాజునకు తెలియఁబఱిచెను. రాజు ఆగుఱుతు చెప్పి చారులను పంపెను. వారును ముసలిదానియింట నతనిని గని పట్టి రాజుకడకు కొని వచ్చిరి. కోపావిష్టుఁడైనరాజును చూచి పుత్త్రకుఁడు పావుకోళ్లచే ఎగిరి పాటలి యున్న యంతఃపురమునకు పోయి 'మనలను కనుఁగొన్నారు, లే పోదము, పాదుకల మహిమచేత' అని ఆమెను తొడపై కూర్చుండఁబెట్టుకొని ఆకాశమార్గమునఁ బోయెను. గంగయొడ్డున ఆకాశమునుండి దిగి ఆప్రయాణమునకు అలసియున్న ప్రియను ఆపాత్రమందు తలంచినమాత్రముననే పుట్టినయమృతప్రాయంపుటాహారములతో

నేదదేర్చెను. తనమహిమకు సంతోషించి ఆ స్త్రీ కోరఁగా చేతి కఱ్ఱతో చతురంగబలయుక్తమయిన పట్టణ మొకటి గీచెను. ఆ గీఁత వాస్తవ పట్టణముగాను వాస్తవ బలముగాను మహాప్రభా వముచే పరిణమింపఁగా అందు పుత్త్రికుఁడు రాజై రాజ్యము చేయుచు మామగారిని జోఁబఱుచుకొని ఆసముద్రాంతము భూ మండల మంతయు నేలుచుండెను. ఆ దివ్యనగరము ఇది, పౌరుల తోఁగూడ మాయచే సృజియింపఁబడినది, ఆదంపతులపేర పాటలీ పుత్త్రిక మని పేరు వడసి లక్ష్మీసరస్వతులకు నివాసమై యున్నది.

ఓ కాణభూతీ, ఇట్లని వర్షోపాధ్యాయులవారివలన మేము అపూర్వమైన యద్భుతకథను విని, చిరకాలము ఆశ్చ ర్యానందములలో మునిఁగియుంటిమి సుమా.

---

## ౪-వ తరంగము.

ఈప్రకారము వింధ్యారణ్యమందు వరరుచి కాణభూతికి అవాంతరకథను ముగించి మఱల ప్రకృత మనుసరించి యిట్లు చెప్పసాగెను.

### వరరుచి ఉపకోశను సందర్శించుట.

ఇట్లు వ్యాడీంద్రదత్తులతోఁ గూడ అక్కడ నివసించుచుండి క్రమముగా బాల్యమందే సకలవిద్యాపారగుఁడ నైతిని. ఒక నాఁడు మేము ఇంద్రోత్సవమును చూడఁబోయి అచ్చట నొక

కన్యను పుష్పముకాని మదనాస్త్రమును చూచినారము. ఈమె యెవతె యని నేనడుగఁగా ఉపవర్షునికూఁతురు ఉపకోశ యని ఇంద్రదత్తుఁడు చెప్పెను. ఆమెయు చెలికత్తెలవలన నన్ను తెలిసికొని అనురాగపూర్ణమయిన దృష్టితో నన్ను చూచుచు నామనస్సును వెంట నీడ్చుకొని ఎట్టకేలకు ఇంటికి పోయెను. మదనబాణములకు గుఱియై నాహృదయము జల్లెడతూంట్లు కాఁగా ఆరమణీమణియొక్క బింబాధర మాన నువ్విళ్లూరుచున్న నాకు ఆరాత్రి నిద్రయే రాదాయెను. తెల్లవాఱునవసరమున ఎట్లో కొంచెము నిద్ర రాఁగా స్వప్నములో నొకదేవత తెల్లనివస్త్రమాల్యములు ధరించినట్టిది వచ్చి 'పుత్రా! నీకు ఉపకోశ పూర్వభార్య, గుణజ్ఞురాలు, నిన్నేగాని మఱియొక పతిని కోరదు. కనుక నీవు ఈవిషయమై చింతింపవలదు. నేను సదా నీశరీరమందు వసించియున్న సరస్వతిని; నీవంతను చూడలేనైతిని.' అని చెప్పి అంతర్ధాన మాయెను. అంత నేను మేలుకొని ఆమాట నమ్ముకొని మెల్లఁగాఁ బోయి నా మనోనాయిక యింటిచెంగటి యెలమావిక్రింద కూర్చుంటిని. అంతట నాయొద్దకు ఉపకోశచెలి వచ్చి నానిమిత్తమై యుపకోశకుఁ గలిగిన మదనతాపవిజృంభణమును వర్ణించెను. అంత ద్విగుణీకృతతాపభరుండనై యే నాయింతితో 'తల్లిదండ్రు లీయక ఉపకోశను నే నెట్లు కూడుదును? అపకీర్తికంటె మృత్యు వయినను మేలు. నీచెలియిష్టము ఆసుందరి తలిదండ్రులకు తెలిసెనేని మే లగును.

ఆప్రకారము చేసి, ఓపుణ్యాత్ములారా! నీచెలిని నన్నును బ్రతికింపుము.' అని చెప్పితిని. అంత నాచెలి పోయి సమస్తమును ఉపకోశతల్లితో చెప్పెను. ఆమెయు తత్క్షణమే ఆవృత్తాంతమును తనభర్త యుపవర్షునికి తెలిపెను. అతఁడు పోయి వర్షునికి చెప్పెను. ఆయన అందులకు సంతోషించి అంగీకరించెను. వివాహము నిశ్చితము కాఁగానే వర్షాచార్యులయాజ్ఞమీఁద వ్యాడి కౌశాంబికి పోయి మాయమ్మను తీసికొనివచ్చెను. ఉపకోశను యథావిధిగా తల్లిదండ్రులవలనఁ బరిగ్రహించి తల్లితోను భార్యతోను అచ్చటనే సుఖముగా నివసించియుంటిని.

## పా ణి ని క థ.

కాలక్రమమున వర్షునికి శిష్యసంఘము బలమాయెను. అందులో పాణిని యనువాఁ డొకఁడు మహామందుఁ డుండెను. వాఁడు శుష్కశుశ్రూష చేయలేక అలసినవాఁడై వర్షభార్య పంపివైవఁగా విద్యార్థియై హిమాలయమునకు తపస్సుకై పోయి అచ్చట తీవ్రతపస్సుచేత చంద్రశేఖరుని మెప్పించి ఆదేవునివలన సర్వవిద్యాముఖమయిన యొక క్రొత్తవ్యాకరణమును పొంది వచ్చి నన్నే వాదమునకు పిలిచెను. ఏడు దినములు వాదించితిమి; ఎనిమిదవనాఁడు అతనిని నేను గెలిచితిని. అంతట ఆకాశమందుండి శంభుఁడు ఘోరముగా హుంకారము చేసెను. దానిచేత మాయైంద్రవ్యాకరణము భూలోకములో నష్టమైపోయెను, మే మందఱము పాణినికి ఓడి మూఢుల

మైతిమి. అంత నేను మిక్కిలి వగచి కుంటుబభరణమునకై నా ధనమును హిరణ్యగుప్తుఁడను వర్తకునిచేత నిచ్చి ఆవిషయము ఉపకోశకు తెలియంజేసి శంకరునిఁగూర్చి నిరాహారముగా తపస్సుచేయుటకై హిమాలయమున కేఁగితిని. ఉపకోశయు నా మేలునే కోరినదై ప్రతిదినము గంగాస్నానమును వ్రతము లును చేయుచు ఇంట నుండెను.

ఉపకోశయొక్క పాతివ్రత్యము.

ఒకానొకప్పుడు వసంతఋతువులో ఉపకోశ పాండుక్షామ మనోహరాంగియై విదియచంద్రరేఖవలె లోకలోచనము లెల్ల తనయందే పడ స్నానార్థమై గంగకు పోవుచుండఁగా ఆయువతిని వరుసఁగా రాజపురోహితుఁడును, కొత్వాలును, కుమార మంత్రియు, చూచి తత్క్షణమే మదనబాణములకు గుఱి యైరి. ఆదినము ఉపకోశ ఏలాగో స్నానములో చాలసేపు గడపెను. సాయంకాలమందు ఇంటికి వచ్చుచుండఁగా నాప్రియను కుమార సచివుఁడు బలిమిమెయి పట్టుకొనెను. ప్రతిభావంతురాలు ఉప కోశ వానికి ట్లనియె. 'చెలువుఁడా, ఇది నీ కెంతయిష్టమో నాకును అంతయిష్టము. అయినను నేను కులస్త్రీని, నాభర్త దేశాంతరము పోయియున్నాఁడు. నేను ఈరీతి నెట్లుందును? ఎవరైనను మనలను జూతురు. అంతట మన కిద్దఱకును తల వంపు లగును. కనుక పురజను లందఱు వసంతోత్సవపరవశు లయి యుండఁగా నీవు రాత్రి తొలిజామున మాయింటికి రా.'

ఇట్లు చెప్పఁగా వాఁడు నంగీకరించి నా ప్రియను విడిచి పెట్టెను. మఱి రెండడుగులు పోఁగానే రాజపురోహితుఁడు అడ్డపడి పట్టుకొనెను. వానికిని ఆప్రకారమే ఆరాత్రియే రెండవజాము న సంకేత మేర్పఱిచి తప్పించుకొని దిగులుతో పోవుచుండఁగా కొత్వాలు వచ్చి నిరోధించెను. వానికి మూఁడవజాము సంకేత మేర్పఱిచి వానినుండియు తప్పించుకొని గడగడ వడఁకుచు ఇల్లు చేరి ఉపకోశ చేయవలసినయేర్పాటు లెల్ల స్పష్టముగా తన చేడియలకు తెలియఁజేసెను. 'పతి దేశాంతరము పోయిన కుల స్త్రీకి అందగత్తెలమీఁద కన్నువైచు పాపులచూపులకు గుఱి యగుటకంటె మరణము మేలు.' అని తలంచి నన్ను ధ్యానించుచు తన సౌందర్యమునకు కుందుచు ఆరాత్రి నిరాహారముగాఁ గడపెను. ఆదినము ప్రాతఃకాలమందు నాప్రేయసి బ్రాహ్మణపూజార్థము కొంచెము ద్రవ్య మడిగి తెమ్మని ఒక చేడియను హిరణ్యగుప్తుని యొద్దకు పంపియుండెను. వాఁడును వచ్చి నాప్రియతో ఏకాంతములో 'నీమీఁద నాకు మన సున్నది, నాకోరిక తీర్పుము, నీభర్త నాయొద్ద ఇల్లడయుంచినధనమును ఇచ్చెదను.' అనెను. ఆమాట విని ఆపతివ్రత తనభర్త అతనియొద్ద ధన ముంచినందులకు సాక్షులు లేమి నెఱింగి వైశ్యుఁడు పాపహృదయుఁ డగుటయుఁ జూచి కోపమును దుఃఖమును పెనఁగొన వానికిని ఆరాత్రియే నాలవజాము సంకేత మేర్పఱిచి పంపివైచెను.

తరువాత ఉపకోశ చేడెలచేత విస్తారము కాటుక తెప్పించి దాని నంతయు నూనెలో రంగరించి కస్తూరికాదిపరిమళములు చేర్చి ఆకాటుకనూనెను ఒకగూనలో నింపించి పెట్టెను. నాలుగు గోచులు చింపించి ఆగూనలో ముంచి చిక్కఁగా ఆకాటుకతో తడిపించి యుంపించెను. బోషాణ మొకటి ఖాళీ చేసి వెలుపల గడియవైచి యుంచెను.

ఉపకోశయొక్క సమయస్ఫూర్తి.

అంతట నా వసంతోత్సవదినమందు మనోహరవేషము ధరించి రాత్రి మొదటిజామున కుమారసచివుఁ డరుగుదెంచెను. రహస్యముగా వచ్చి ప్రవేశించినయతనితో ఉపకోశ 'నీవు స్నానముచేసిననే గాని నిన్ను నేను ముట్టుకొనను. లోపలికి పోయి స్నానము కానిమ్ము.' అనెను. ఆమూఢుఁడు అందుల కంగీకరింపఁగానే చేడియలు వచ్చి చీకటికోణముగా నున్న లోపలియింటికి వానిని కొనిపోయి వాని వస్త్రాభరణము లూడ్చి స్నానార్థమై వానికి ఆగోఁచియొకటి యిచ్చి కూర్చుండఁ బెట్టి నఖశిఖపర్యంతము దేహమంతయు ఆకాటుక దట్టముగా పట్టించి నింపాదిగా మనోహరముగా దరువులు వైచుచు ప్రత్యవయవమును మర్దన చేయుచుండిరి. ఇంతలో రెండవజాము కాఁగా పురోహితులవారు వచ్చినారు. అంత నాచేడియలు 'ఓహో! వరరుచిగారి స్నేహితులు పురోహితులవారు వచ్చినారు! ఏమి చేయుదుము! నీవు ఇందులోపల దాఁగికొనుము.' అని భయ

పెట్టి ఆనూనెకాటుకమూనిసిని గోఁచిపాఁతరాయని ఆబోషాణ ములోఁ పెట్టి గడియవైచిరి. పురోహితులవారినికూడ స్నాన మిష చేత ఆచీఁకటికోణమునకు తెచ్చి ఆప్రకారమే వస్త్రాలంకార ములూడ్చి గోఁచి పెట్టి నోటిలోపలను కస్తురిగు[illegible] తక్కినదేహమెల్ల కాటుకనూనె పట్టించి ఇంతకాలమయిన [illegible] తెలియకుండ, దేహము ఆనందపరవశ మగునట్లొక్క[illegible] ము చూపుచు అంటుచుండిరి. ఇంతలో మూఁడవజాముని కొత్వాలు వచ్చెను. అతని రాకకు భయపడినట్లు నటించి పురో హితులవారిని అడలఁగొట్టి [illegible]రసచిన్నులవారికి [illegible]సా ర్థమై ఆబోషాణములోనికి త్రోసి గడియ వైచిరి. కొత్వా లుగారిని కూడ ఆప్రకారమే నూనెకాటుకగోఁచిపాతరాయని వారినిం గావించి కాటుకమర్దనములచేతను దరువుతాళముల చేతను ఒకజాము గడపి వర్తకుఁడు రాఁగానే అతఁడు చూచు నని భయపెట్టి బోషాణములో పెట్టి గడియ వైచిరి. ఆ ముగ్గురును ముందు తమకు రాఁబోవునట్టి యంధతామిస్రనరక నివాసమును ఇప్పుడే అలవాటు చేసికొనుచున్నారో యన బోషాణములో ఒకరి కొకరు తగులుచుండియు క్రుక్కుమిక్కు నరుగదా! అంతట దీపము వెలిఁగించి ఆచోటికి వర్తకునిఁ గొనివచ్చి ఉపకోశ 'నాభర్త నీయొద్ద నుంచిన ధనమును ఇమ్మ'ని యడిగెను. అందునకు ఆమోసగాఁడు నలువైపులఁ జూచి ఎవ్వరును లేరుగదా అని నిశ్చయించుకొని 'చెప్పితిని

గదా నీభర్త నాయొద్ద నుంచిన ధనమును ఇయ్యనే ఇచ్చెదను.' అనెను. ఉపకోశ వానిమాటను భోషాణమునకు వినిపించుచు 'ఓదేవతలారా! హిరణ్యగుప్తునిమాట విన్నారుగదా' అని పలికి దీపమార్పి చేడియలచేత ఇతరులకు జరిగినమర్యాద అతనికిఁగూడ చేయించెను. వారును వానిని తెల్లవాఱువఱకు ఘృతముగా అభ్యంగసేవ చేసి 'తెల్లవాఱినది. ఇఁక పోవోయి.' అని నెట్టిరి. వాఁడు పోఁక తటపటాయింపఁగా అర్ధచంద్రప్రయోగముచే వీథిలోనికి వెడలఁద్రోసి తలుపు వైచికొనిరి. గోఁచిమాత్రమే వస్త్రము, దేహమెల్ల కాటుక, అడుగడుగునకు కుక్కలు మీఁదబడి కఱచుచు ఎటువైపునను కదలనీయక ఆటంకపఱుచుట, ఈస్థితిలో హిరణ్యగుప్తుఁడు ఎట్లో మానముతోఁగాదుగాని ప్రాణముతోమాత్రము ఇల్లు చేరెను. అంతట వానిపరిచారకులు ఒడలెల్ల రుద్ది మసితుడిచి స్నానము చేయించుచుండఁగా హిరణ్యగుప్తుఁడు వారిని సయితము కన్నెత్తిచూడ లేక వంచినమొగము ఎత్తకయే యుండెను. తప్పుపనియొక్క పర్యవసానము దుస్సహము గదా.

ఉపకోశ ఒకచేడియను వెంటఁబిలుచుకొని పెద్దలతో చెప్పకయే ఆప్రాతఃకాలమందు నందమహారాజు నాస్థానమునకు పోయి అచ్చట రాజుతో స్వయముగా 'వర్తకుఁడు హిరణ్యగుప్తుఁడు తనయొద్ద నాభర్త ఇల్లడపెట్టిపోయిన ధనమును అపహరింపఁ దలఁచియున్నాఁడు.' అని పిర్యాదు చేసెను. అంత

రాజు హిరణ్యగుప్తుని పిలిపించి యడిగెను. అతఁడు 'ఓప్రభూ! ఈసొమ్మేమియు నాయొద్ద లేదు.' అనెను. 'దేవా, నాకు సాక్షు లున్నారు; నాభర్త దేశాంతరము పోవునప్పుడు మా గృహదేవతలను బోషాణములో ఉంచి పోయినాఁడు. ఆదేవతలయెదుట ఇతఁడు స్వయముగా నాధనమును ఒప్పుకొని యున్నాఁడు. ఆబోషాణము నిక్కడికి తెప్పించి దేవతలను నీవే స్వయముగా అడుగుము.' అని ఉపకోశ చెప్పుకొనెను. ఆ మాట విని ఆశ్చర్యపడి రాజు ఆబోషాణమును కొని రా భటుల కాజ్ఞాపించెను. క్షణములో పెక్కుమంది మనుష్యులు దానిని మోచి తెచ్చి ఆస్థానములో నుంచిరి. అంత ఉపకోశ ఇట్లనియె. 'దేవతలారా, ఈవర్తకుఁడు ఏమి యొప్పుకొన్నాఁడో దానిని సత్యముగా చెప్పుఁడు, మీరు ఇంటికి పోవచ్చును. సత్యము చెప్పరేని మిమ్ములను కాల్చియైన నైచెదను, సభలో బోషాణపుమూఁత తీసి మిమ్ము బయట నైనఁ దఱిమెదను.' ఆమాట విని గుండెలు తల్లడిల్లఁగా బోషాణములోని పురోహితాది దేవతలు 'సత్యము! సత్యము! మాయెదుట ఈవర్తకుఁడు ఈమె ధనమును ఒప్పుకొన్నాఁడు' అనిరి. అంతట వర్తకుఁడు ఉత్తరమేమియు చెప్పలేక సర్వమును ఒప్పుకొనెను. రాజు అతికుతూహలముచేత ఉపకోశను వేఁడుకొని బోషాణమును తెఱపించెను. ఆముప్పురును చీఁకటిదాసులవలె బోషాణమునుండి బయలువెడలిరి. వారిని రాజును మంత్రులును మిక్కిలి కష్టము

మీఁద తెలిసికొనిరి. వారిని చూచి సభలో అందఱు గొల్లు మని నవ్వుచుండఁగా రాజుచే ప్రార్థిత యైన మహాపతివ్రత యుప కోశ ఆనిర్భాగ్యులయొక్క యవినయమును తెలియఁబఱిచెను. 'పతివ్రతలైనకుల స్త్రీలచరిత్రము నూహింప నలవిగాదు.' అని సభాసదు లందఱును ఉపకోశను గౌరవించిరి. నందమహారాజు ఆపరదారకాముకుల నందఱను వారిసర్వధనమును హరించి దేశము వెడలఁగొట్టెను. దురాచారమువలన ఎవరికి కీడు గలు గదు? రాజు ఉపకోశను తనకు చెల్లెలినిగా పేర్కొని ప్రీతితో ఆమెకు బహుధన మిచ్చి సత్కరించి ఇంటికి పంపెను. వర్షో పవర్షులు ఆవృత్తాంత మెఱింగి ఆపతివ్రతను గౌరవించిరి. నగర ములో అందఱును ఆశ్చర్యానందములలో మునింగిరి.

వరరుచి వార్త్తికములు చేయుట.

ఈలోపల నేను మంచుకొండలో తీవ్రతపస్సుచేత వర దుని పార్వతీపతిని ఆరాధించితిని. ఆదేవుఁడు నాకు ఆపాణినీయ శాస్త్రమునే అనుగ్రహించెను. అతని యిచ్ఛానుగ్రహముచేతనే నేనును దానిని పూర్త్తిచేసితిని. అంత నేను మార్గాయాస మేమియు లేక యిందుకళాధరునిప్రసాదామృతలహరియందు ఓలలాడుచు వచ్చి ఇల్లుచేరి తల్లికిని గురువులకును పాద ప్రణామంబు చేసి ఉపకోశయొక్క ఆమహాద్భుతవృత్తాంతమును వింటిని. అందుచే నాకు ఆనందాశ్చర్యములును ప్రియయందలి సహజానురాగమును మితిలేని వాయెను. వర్షోపాధ్యాయుల

వారు నావలన ఆక్రాంత్తవ్యాకరణమును వినఁగోరిరి. కుమారస్వామియే ఆయనకు దానిని వెల్లడిచేసెను.

### ఇంద్రదత్తుఁడు పరకాయప్రవేశము చేయుట.

పిమ్మట వ్యాడీంద్రదత్తులు గురుదక్షిణార్థము విన్నవింపఁగా ఉపాధ్యాయులవారు కోటివరహాలు అడిగిరి. గురువాక్యము నకంగీకరించి వారు నాతో నిట్లనిరి. 'మిత్రమా! రమ్ము నందుని గురుదక్షిణ యాచింతము; మఱి యెక్కడను మనకు ఇంత బంగారము దొరకదు. ఆతనికి తొంబదితొమ్మిదికోటుల ధనము కలదుగదా, అతఁడు ఉపకోశను తనకు ధర్మభగినినిగా పలికియు నున్నాఁడు గదా. కనుక నీవు అతనికి బావమఱఁదివి. నీమూలముగా మనకు కావలసినధనము దొరకును.' అట్లే నిశ్చయించుకొని మేము సబ్రహ్మచారులము ముగ్గురమును అయోధ్యాపురమందలి నందకటకమునకు పోయితిమి. మేము పోయియుఁబోకముందే ఆరాజు కాలధర్మము నొందెను. రాష్ట్రమందు కోలాహలమును మాతు విషాదమును కలిగెను. అంత యోగసిద్ధుఁడైన యింద్రదత్తుఁ డిట్లనియె. ఈ 'రాజుదేహములో నేను ప్రవేశించెదను, నన్ను వచ్చి వరరుచి యాచింపవలసినది. కావలసినధన మిచ్చెదను. నేను మరల వచ్చువఱకు నాదేహమును వ్యాడి రక్షించుచుండునుగాక.' ఇట్లని ఇంద్రదత్తుఁడు నందరాజు దేహములో ప్రవేశించెను. రాజు మరల బ్రదుకఁగానే రాష్ట్రములో నంతట మహోత్సవ మాయెను. ఒకపాడుదేవాల

యములో ఇంద్రదత్తుని దేహమును వ్యాడి కాపాడుచుండఁగా నేను రాజాస్థానమునకు పోయి ఆశీర్వాదము చేసి యోగనందుని కోటివరహాలు గురుదక్షిణ యాచించినాఁడను. అతఁడును వాస్తవనందునిమంత్రిని శకటాలుని కోటిబంగారము నాకిమ్మని యాజ్ఞాపించెను. మృతి నొందినవాఁడు బ్రతుకుటయు వెంటనే యాచకుఁడు వచ్చుటయు మహాధనము వానికి ఈఁబడుటయు చూచి ఆమంత్రి మావృత్తాంతమును ఊహచే కనిపట్టెను. ప్రజ్ఞావంతులకు తెలియని దేమున్నది? అంత నామంత్రి 'ఇదిగో ఇచ్చెదను.' అని రాజుతోఁ బలికి తనలో నిట్లు చింతించెను. 'నందునికుమారుఁడా బాలుఁడు. రాజ్యమునకా శత్రువులు అనేకు లున్నారు. కనుక ఇప్పుడు ఇట్టిదాని నైనను అతని దేహమును కాపాడెదను.' అని నిశ్చయించి వెంటనే ఎక్కడ ఏ శవ మగపడినను కాల్పించి వైచెను. చారులు ఆపాడు గుడిలో ఇంద్రదత్త శరీరమును కని వ్యాడిని గెంటివైచి దానిని తగులఁబెట్టిరి. ఈలోపున 'కోటివరాలు ఇంక ఇచ్చితివా లేదా?' అని త్వరపెట్టుచున్న యోగనందునితో శకటాలుఁడు 'దేవా, పరిజను లందఱు ఉత్సవములో ఒడ లెఱుఁగక యున్నారు; క్షణము నిరీక్షింపుము; ఈ బ్రాహ్మణునికి ధనము ఇప్పించెదను.' అనెను. ఇంతలో వ్యాడి వచ్చి యోగనందుని యెదుట 'దేవా రక్షింపుము రక్షింపుము. నీయభ్యుదయములో రాజభటులు యోగస్థితుఁడైన యొకబ్రాహ్మణుని అనాథశవ

మని బలాత్కారము చేసి దహించివైచినారు.' అని మొఱ పెట్టెను. ఆమాట చెవిని పడఁగానే దుఃఖముచేత యోగనందునికి చెప్పరాని యవస్థాంతర మొకటి గలిగెను. దేహదాహముచేత ఆశరీరములో ఇంద్రదత్తుఁడు స్థిరుఁడు కాఁగా, మహామతి శకటాలుఁడు నాకు కోటిబంగారమును ఇచ్చివైచెను.

యోగనందుఁడు శకటాలుని అంధకూపములోఁ ద్రోయించుట.

అంతట యోగనందుఁడు ఏకాంతములో వ్యాడితో దుఃఖించుచు నిట్లనియె. 'అన్నా! శాశ్వత మయినను ఈసిరి నా కేల? బ్రాహ్మణ జన్మమెత్తియు శూద్రుఁడ నైతిని.' అది విని వ్యాడి అతనిని సమయోచితములు పలికి ఊఱడించి 'తమ్ముఁడా! శకటాలుఁడు నిన్ను కనిపట్టినాఁడు. కనుక ప్రకృతము నాలోచింపుము. ఇతఁడు మహామంత్రి, సులువుగా నిన్ను త్వరలోనే నాశముచేసి పూర్వనందునికుమారుని చంద్రగుప్తుని రాజుగ చేయును. కనుక వరరుచి ప్రధానమంత్రిని చేసికొనుము. అతని మహిమచేత నీకు రాజ్యము స్థిరముగా నుండును.' ఇట్లు చెప్పి వ్యాడి గురుదక్షిణ ఇచ్చుటకు పోఁగానే యోగనందుఁడు నాకు ముఖ్యమంత్ర్యధికారము నిచ్చెను. నేను నతనికి రహస్యముగా ఇట్లు బోధించితిని. 'నీకు బ్రాహ్మణ్యము పోనే పోయినది గదా? శకటాలుఁడు అధికారములో నున్నంతకాలము సామ్రాజ్యమైనను స్థిరము గాదు సుమా. కనుకయుక్తిచేత వీనిని నాశముచేయుము.' ఇట్లు నేను చెప్పఁగా

యోగనందుఁడు శకటాలునిమీఁద అతఁడు బ్రదికియే యున్న బ్రాహ్మణుని కాల్పించె నని నేరము చాటి వానిని వానిపుత్త్రులు నూర్గురను ఒకచీఁకటినూతిలోనికి త్రోయించెను. వారి కందఱకును దినమునకు ఒకమూఁకుడు పిండియు ఒకమూఁకుడు నీళ్లును ఆనూతిలోనికి దింపుచుండెను. అంతట శకటాలుఁడు పుత్త్రులతో 'పుత్త్రులారా! ఈపిండి ఒకనికే చాలదు; పలువురమాట చెప్పనేల? కనుక మీలో ఈ యోగనందునిమీఁద పగ దీర్చుకొనఁగలవాఁ డెవఁడో వాఁ డొక్కఁడే ఈయాహారమును గ్రహించి బ్రదుకునుగాక.' అనెను. పుత్త్రు లందఱును 'నాయనా! నీవే అందునకు సమర్థుఁడవు, నీవే వీనిని గొని బ్రదుకుము.' అనిరి. ఆహా! ధీరులకు ప్రాణములకంటెను పగ తీర్చుకొనుట ఎంత ప్రియమో! శకటాలుఁడు ప్రతిదినమును ఆపిండి తిని నీళ్లు త్రాగి శత్రునాశేచ్ఛచేత తా నొక్కఁడే బ్రదికియుండెను. 'ప్రభువులచిత్తము నెఱుఁగక విశ్వాసమును పొందక యథేచ్ఛముగా వ్యవహరించువానికి క్షేమము గలుగదు.' అని ఆ యంధకూపములో నుండి ఆలోచించుచు శకటాలుఁడు క్రమక్రమముగా నూర్గురు కుమారులును తనయెదుటనే మృతులు కాఁగా తానుమాత్రము వారి యెముకలనడుమ బ్రదికియుండెను.

### యోగనందుని సామ్రాజ్యము.

యోగనందుఁడు సామ్రాజ్యమందు స్థిరుఁ డాయెను. ఈలోపల వ్యాడి గురుదక్షిణయిచ్చి వచ్చి యోగనందుని 'నీకు

రాజ్యము చిరకాలము ఉండునుగాక' యని ఆశీర్వదించి తప స్సునకు పోయెద ననెను. యోగనందుఁడు కన్నీళ్లు కంఠములో అణఁచుకొని 'అన్నా! నీవు పోనలదు, నారాజ్యములో సుఖ ముగా యథేచ్ఛభోగము లనుభవించుచు ఉండుము.' అని వేఁడుకొనెను. అందునకు వ్యాడి 'రాజ్యమును శరీరమును క్షణభంగురములు, ఇట్టి యసారములయందు బుద్ధిమంతుఁడు అభిమాన ముంచునా? లక్ష్మి ఎండమావివంటిది, ప్రాజ్ఞులను మోహపెట్టఁజాలదు.' అని తపస్సునకే పోయెను.

అటుపిమ్మట యోగనందుఁడు తనరాజధాని యైనపాటలీ పుత్త్రమునకు సకలసైన్యములతోను నాతోను భోగార్థమై పోయెను. అచ్చట ఉపకోశ నాకు సకలోపచారములు సేయు చుండ, మంత్రియధికారమును చెల్లించుచు మాతల్లితోను పెద్దలతోను అఖండైశ్వర్యములో చిరకాలము సుఖముగా నుంటిని. నాకు దినదినమును గంగాభవాని నాతపస్సునకు ప్రసన్నురాలై విస్తారము బంగార మిచ్చుచుండెను. సరస్వతి నాదేహములో సాక్షాత్తుగా నివసించి నాకు కార్యాలోచనను ఎప్పటి కప్పుడు చెప్పుచుండెను.

---

## ౫-వ తరంగము.

### యోగనందునికి శకటాలుఁడు మంత్రి యగుట.

మరల నిట్లు వరరుచి చెప్పందొడంగెను. కాలక్రమ మున యోగనందుఁడు కామపరతంత్రుఁడై మదపుటేనుఁగువలె

ప్రపంచమును లక్ష్యపెట్టక యుండెను. నవమంతరపుసిరి ఎవనిని తలక్రిందుచేయదు. అంత నే నిట్లాలోచించితిని: 'ఈరాజు విశృంఖలుఁడై యున్నాఁడు, వీనికార్యములచింతచే నా స్వధర్మము చెడిపోవుచున్నది. కనుక బుద్ధిమంతుఁ డయిన యాశకటాలుని నాకు సహాయునిఁగా తెచ్చి యుంచుకొనియెదను. నే నుండఁగా అతఁ డేమివిరుద్ధము చేయనేర్చును?' ఇట్లు నిశ్చయించుకొని రాజును సమ్మతింపఁజేసి శకటాలుని అంధకూపము నుండి బయటికి తెప్పించితిని. శకటాలుఁడును మరల మంత్రియై నన్ననుసరించి రాచకార్యములను విచారించుచుండెను; యోగనందుని జయించుట, నే నుండఁగా తన కసాధ్యమని యెఱిఁగి వేతసవృత్తి నవలంబించి కాలము నెదురుసూచుచుండెను.

### వరరుచియొక్క ఇంగితజ్ఞానవిశేషము.

ఒకనాఁడు యోగనందుఁడు నగరమువెలుపల సికారి తిరుగుచుండఁగా గంగామధ్యమునుండి యొకచేయి అయిదు వ్రేళ్లను కదియఁబట్టియున్నట్టిది లేచెను. రాజు దానిని చూచి తత్క్షణమే నన్నుపిలిచి అదేమని యడిగెను. నేను ఆదిక్కున నే నా వ్రేళ్లను రెంటిని కలియఁబట్టి చూపితిని. అంతట ఆచేయి మాయమాయెను. రాజు ఆశ్చర్యపడి ఆరహస్యమును చెప్పుమని మరల నడిగెను. "ఆచేయి తనయైదువ్రేళ్లను బిగియఁబట్టి చూపి 'అయిదురు గనుక ఐకమత్యము గలిగి వ్యవహరించిన, ఈలోకములో వారికి అసాధ్య మొకటి యుండునా?' అని

యడిగినది. అందున కుత్తరముగా 'అయిదుగురు ణ్రేల ఇద్దఱకు అసాధ్య మొకటి కలదా?' అని నారెండు వ్రేళ్లను చేర్చి యుత్తరము ఇచ్చితిని." అని చెప్పితిని. ఇట్లు చెప్పఁగా ఆరహస్య విజ్ఞానమునకు రాజు సంతోషించెను. శకటాలుఁడు నాబుద్ధిని గెలువ నలవి గాదని తెలిసికొని విషాదము నొందెను.

ఎండుచేప నవ్వుట.

ఒకనాఁడు యోగనందునిపట్టపుదేవి మేడలో నున్నదై వీథిలో నిలువంబడి మొగమెత్తి చూచుచున్న యొక బ్రాహ్మణాతిథిని కిటికీనుండి కాంచెను. దానిని చూచి యోగనందుఁడు ఆగ్రహించి ఆబ్రాహ్మణునికి ఉరి కాజ్ఞ చేసెను. ఈర్ష్య ప్రవేశించినచోట వివేక ముండునా? తలవరులు ఆబ్రాహ్మణుని వధ్యభూమికి కొనిపోవుచుండఁగా దారిలో బజారులోని యెండు చేప యొకటి పకపక నవ్వసాగెను. దానిని వెంటనే తెలిసికొని యోగనందుఁడు ఆబ్రాహ్మణుని యురియాజ్ఞను నిలిపి, నన్ను మత్స్యము నవ్వినందులకు కారణ మడిగెను. నేనును తెలిసికొని చెప్పెద నని వెడలి వచ్చి యేకాంతమందు సరస్వతిని తలఁచుకొంటిని. ఆదేవి వచ్చి 'పుత్త్రా! ఈరాత్రి ఎవరికి నగపడక ఈతాటిచెట్టు మీఁద నుండుము, అక్కడ నిస్సంశయముగా మత్స్యహాస కారణమును విందువు.' అని యనుగ్రహించెను. ఆప్రకారమే నేను రాత్రి పోయి తాటిచెట్టుమీఁద ఎక్కియుండఁగా అచ్చటి కొక భయంకరాకార యైన రాక్షసి

పలువురు బాలపుత్త్రులతోఁ గూడ వచ్చెను. తినుట కేమయిన పెట్టు మని యడుగుచున్న కుమారులతోఁ దల్లి 'రేపటివఱకు ఉండుఁడు, తెల్లవాఱఁగానే మీకు బ్రాహ్మణమాంసము తెచ్చి పెట్టెదను. ఈదినము వానిని ఉరిఁ దివిచినారుగారు.' అని చెప్పఁగా, 'ఈదినముననే యేల ఉరిఁ దివిచినారుగార'ని బాలకు లడుగ, 'ఇక్కడ నొకయెండుచేప నవ్వినది, అందుచేత వానిశిక్ష నిలిచి పోయినది.' అనెను. మరల వారు ఎండుచేప యేల నవ్వె నని యడిగిరి. 'ఈరాణు లందఱును చెడిపోయినవారే. అంతఃపుర మం దంతటను స్త్రీవేషమున పురుషు లున్నారు. వా రందఱు సుఖముగా నుండఁగా అనపరాధుఁడైన బ్రాహ్మణునికి ఉరియాజ్ఞ అయిన దని చేప నవ్వినది.' అని రాక్షసి చెప్పెను. ఆమాటను విని నేను దిగివచ్చి ప్రాతఃకాలమందు మత్స్యహాస కారణమును రాజునకు విశదపఱిచితిని. రాజును అంతఃపురమందు ఆ స్త్రీవేష పురుషులను కనిపట్టి నన్ను మిక్కిలి గౌరవించి బ్రాహ్మణుని శిక్షనుండి తప్పించెను.

యోగనందుఁడు వరరుచిని చంపు మని శకటాలుని కాజ్ఞ యిచ్చుట.

యోగనందుని యిట్టి విశృంఖలచేష్టితములను చూచి నేను మిగుల ఖిన్నుఁడనై యుండఁగా, ఒకనాఁడు అక్కడికి చిత్రకారుఁ డొకఁడు వచ్చి పట్టపుదేవిని యోగనందునిని పటములో వ్రాసెను. మాటయు చేష్టయు మాత్రము లేవే గాని ఆచిత్తరువు సజీవముగ అగపడెను. రాజు చిత్రకారునికి బహుమాన

మిచ్చి పటమును తన పడకటింటిగోడకు తగిలింపించెను. ఒక నాఁడు ఆగదికి నేను పోయి చిత్రమందు మహాదేవికి లక్షణ మంతయు సంపూర్ణముగానే ఉండుట చూచి లక్షణాంతర సంబంధముచేత ఊహించి మొలత్రాటిచెంత లోపముగా నున్న యొకమచ్చను వ్రాసి లక్షణలోపము తీర్చి యింటికి పోయితిని. పిమ్మట యోగనందుఁడక్కడికి వచ్చి ఆమచ్చను చూచి ఈమచ్చ నెవఁడు వ్రాసినాఁడని అంతఃపురపాలకుల నడిగెను. నేను వ్రాసితి నని వారు చెప్పిరి. 'దేవియొక్క రహస్య ప్రదేశమం దున్న యీమచ్చ నాకుఁ దప్ప మఱియెవ్వరికిఁ దెలియదు. వరరుచికి ఇది యెట్లు తెలిసినది? ఇతఁడు గూఢముగా అంతఃపురద్రోహము చేయుచున్నాఁడు, కనుకనే ఇతఁడు పూర్వము అంతఃపురములోని స్త్రీరూపపురుషులను కనిపట్టినాఁడు.' అని నిశ్చయించుకొనెను. మూర్ఖులకు అగపడు నిదర్శనము లెల్ల వారిభ్రాంతినే దృఢపఱుచును గదా. అట్లు నిశ్చయించుకొని రాజు కోపముచేత మండిపడుచు శకటాలుని పిలిపించి 'వరరుచి అంతఃపురద్రోహము చేసినాఁడు, ఈక్షణమే వానిని చంపి వైవ వలసినది.' అని ఆజ్ఞాపించెను. అట్లే చేసెద నని శకటాలుఁడు వెలువడిపోయి తనలో నిట్లు చింతించెను.

'వరరుచి దివ్యప్రభావము కలవాఁడు, ఆతనిని చంపుటకు నాకు శక్తి లేదు. మఱియు నన్ను ఆపదలోనుండి ఉద్ధరించినవాఁడు. పెఁగా బ్రాహ్మణుఁడు, కనుక ఆతనిని రహస్యముగా దాఁచి కాపా

డెదను, అది మేలు.' ఇట్లు నిశ్చయించుకొని వచ్చి, నాతో రాజు యొక్క నిష్కారణకోపమును వధాజ్ఞను చెప్పి, శకటాలుఁడు 'మఱియొకనిని ఎవనినేని నిన్నే అని చంపించెదను. నీవు నా యింట దాఁగియుండుము.' అని ఆప్రకారమే చేసెను. నేనును అతనియింట దాఁగియుంటిని. అతని నీతికి సంతోషించి నే నతనితో నిట్లంటిని. 'ఓయి నీ వొక్కఁడవే మంత్రివి. ఎందుచేత ననఁగా నీకు నన్ను చంప బుద్ధి పుట్టలేదు. నన్ను చంప నొకరి తరము గాదు; నాకు రాక్షసుఁ డొకఁడు చెలికాఁడు కలఁడు. అతఁడు తలఁచుకొన్న మాత్రాన వచ్చి నాయిచ్చచేత లోకమంతయు దిగ్రమింగి పోఁగలఁడు. ఈరాజు నాసఖుఁడు ఇంద్రదత్తుఁడను బ్రాహ్మణుఁడు, కాఁబట్టి ఇతనిని చంపఁగూడదు.'

వరరుచి శకటాలునకు రాక్షసుని, గంగాదేవిని, గనఁబఱుచుట.

అంతట శకటాలుఁడు ఆరాక్షసుని చూపు మని నన్ను వేఁడుకొనెను. ఆప్రకారమే నేను తలఁచుకొన్న మాత్రాన ఆరాక్షసుఁడు వచ్చెను. అతనిని చూచి శకటాలుఁడు భయాశ్చర్యముల పాలాయెను. రాక్షసుఁడు అంతర్ధానము కాఁగానే శకటాలుఁడు నీకు అతఁ డెట్లు మిత్త్రమాయెనో చెప్పు మని యడిగెను. ఇట్లు చెప్పితిని. "పూర్వము ఈనగరములో గస్తి తిరుగుచు రాత్రి రాత్రియు ఒక్కొక్క కొత్వాలు మృతి పొందుచు వచ్చెను. ఆసంగతి యెఱిఁగి యోగనందుఁడు నన్ను కొత్వాలుగా నియమించెను. నేను రాత్రి గస్తి తిరుగుచుండఁగా ఈరాక్షసుఁడు

అగపడి నన్ను, ఈనగరములో నెల్ల అందగత్తె యెవత్తెయో చెప్పు, మనెను. నేను నవ్వి 'ఓరి మూర్ఖుఁడా, ఎవతె ఎవనికి ప్రియయో అది వానికి అందగత్తె.' అని యుత్తరము చెప్పితిని. ఆయుత్తరముచేత నాచావు తప్పెను. అంత నతఁడు 'నీ కొక నికే నేను ఓడితిని, నిన్ను నేను మెచ్చుకొన్నాఁడ. నీవు నా మిత్త్రుఁడవు. నీవు తలఁచుకొన్నప్పుడు వచ్చెదను.' అని చెప్పి అంతర్ధానము పొందెను. నేనును ఇంటికి అరిగితిని. ఈప్రకారము ఈరాక్షసుఁడు నాకు ఆపత్సహాయుఁడును మిత్త్రమును అయినాఁడు. పిమ్మట శకటాలుఁడు గంగాదేవిని చూపు మని ప్రార్థింపఁగా ఆమెను ధ్యానించితిని. ఆమెయు దేవతావ్యక్తిగా దర్శన మిచ్చి నాచేత స్తోత్రములు వడసి సంతోషించి అదృశ్యురా లాయెను.

ఒకనాఁ డామంత్రి నేను ఏకాంతములో చింతాక్రాంతుఁడనై యుండఁగా వచ్చి నాతో నిట్లనియె:—ఓమిత్త్రమా! సర్వజ్ఞుఁడ వయ్యును ఏల యిట్లు చింతించెదవు? రాజులకు వివేకము లేదని యెఱుఁగవా? త్వరలోనే నీపైదోషము తొలఁగి పోవును. ఇందుల కీదృష్టాంతమును వినుము:—

### శివవర్మ యనుమంత్రికథ.

పూర్వము ఇక్కడ ఆదిత్యవర్మ యని రాజుండెను. అతనికి శివవర్మ యని మహానిపుణుఁడు మంత్రి యుండెను. ఒకప్పుడు రాణి యొకతె గర్భిణి కాఁగా రాజు అంతఃపురపాలకులను

'ఈమెయొద్దకు మేము వచ్చి రెండు సంవత్సరము లయినవి. ఈమె గర్భిణి యెట్లయినది? చెప్పవలసినది.' అని యడిగెను. వారు 'ఓప్రభూ! ఇక్కడ పోతుటీఁగ కైనను ప్రవేశము లేదు. ఒక్క నీమంత్రి శివవర్మమాత్రము నిరాటంకముగా ప్రవేశించును.' అని విన్నవించిరి. అది విని రాజు అతఁడే తనకు ద్రోహి యని నిశ్చయించి అతనిని బహిరంగముగా చంపించిన తనకు అపవాద కలుగు నని శంకించి యుక్తిగా అతనిని తన మిత్త్రి మయిన భోగవర్మ యనుసామంతుని యొద్దకు పంపెను. అతనిని చంపవలసిన దని రహస్యముగా భోగవర్మకు జాబు పంపెను. మంత్రి పోయినయేడవనాఁడు ఆరాణి ఒక స్త్రీవేషపుఁబురుషునితో పరారియై పోవుచుండఁగా పహారాజవానులు పట్టుకొనిరి. అంత నాదిత్యవర్మ 'అయ్యో! అట్టి మంత్రిని చంపించితినిగదా!' అని మిక్కిలి పశ్చాత్తాపము పొందెను. ఈలోపల శివవర్మయు భోగవర్మయొద్దకు పోయెను, జాబు కూడ చేరెను. ఆజాబును భోగవర్మ ఏకాంతమందు శివవర్మకు చదివి వినిపించి విధివశమున అందున్నమరణాజ్ఞను తెలియఁజేసెను. మంత్రివరేణ్యుఁ డాశివవర్మ భోగవర్మతో 'నీవు నన్ను ఈక్షణమే చంపుము; లేదా నేను ఆత్మహత్య చేసికొనియెదను.' అనెను. అది విని ఆశ్చర్యపడి భోగవర్మ 'ఓబ్రాహ్మణోత్తమా! ఇట్లేల చెప్పెదవు? కారణము చెప్పుము. చెప్పవేని నీకు ఒట్టుసుమా.' అనెను. 'మఱేమి లేదు రాజా, నన్ను

ఎక్కడ చంపుదురో ఆదేశములో పండ్రెండు సంవత్సరములు వర్షము కురియదు.' అని శివవర్మ చెప్పెను. అంత నా రాజు తనమంత్రులతో ఆలోచించి 'ఆ రాజు దుర్మార్గుఁడు. మన దేశమును నాశముచేయఁ గోరినాఁడు అక్కడ లేరా ఏమి రహస్యముగా చంపునట్టి ఘాతకులు? కనుక ఈమంత్రిని మనము చంపఁగూడదు సరిగదా ఆత్మహత్య కూడ చేసికోనీఁగూడదు.' అని నిశ్చయించి భోగవర్మ శివవర్మను గొప్పబహుమానాలతో తనదేశమునుండి వెంటనే పంపివైచెను. ఆప్రకారము ఆమంత్రి తనప్రజ్ఞచేత బ్రతికి మఱల స్వస్థానమునకు వచ్చెను. ఈలోపలనే అతనిమీఁదిదోషముకూడ తీఱిపోయినదిగదా. ధర్మము ఎప్పటికిని అన్యథా కానేరదు. ఇట్లే నీకును శుద్ధి గలుగును. నా యింట సుఖముగా నుండుము. కాత్యాయనా, నిజము బైటఁబడి రాజు పశ్చాత్తాపమును పొందును.—

### వరరుచి హిరణ్యగుప్తునిశాపముం దీర్చుట.

శకటాలుని యీమాటప్రకారము నేనును అవసరము నెదురు చూచుచు అతనియింట ప్రచ్ఛన్నుఁడనై కాలము గడపుచుంటిని. ఇట్లుండఁగా ఒకనాఁడు యోగనందునికుమారుఁడు హిరణ్యగుప్తుఁడు అడవికి వేటకుఁ బోయెను. గుఱ్ఱమును ఎగవైచి కొనిపోయి పరిజనము నంతయు దూరమున వెనుకవదలి అతఁడు ఒంటరిగా అడవిలో చిక్కెను. సూర్యుఁడును అస్తమించెను. అంత నాకుమారుఁడు ఆరాత్రిని గడపుటకై ఒకచెట్టు

ఎక్కి కూర్చుండెను. ఆక్షణమందే సింహ మొకటి తఱుము కొనిరాఁగా ఎలుఁగుబంటి యొకటి ఆచెట్టునే ఎక్కెను. తన్నుఁ గని భయపడుచున్న రాజపుత్త్రునిఁ జూచి ఆయెలుఁగుబంటి ‘నాకు నీవు మిత్త్రుఁడవు, భయపడకు’ అని భయము తీర్చెను. అంతట నిర్భయముగా రాజపుత్త్రుఁడు నిద్రపోయెను. ఎలుఁగు బంటి మేలుకొని కాపుండెను. అంత సింహము ‘ఓయెలుఁగా, ఈ మానిసిని నాకు త్రోసి వైపుము, నేను పోయెదను;’ అనెను. ఎలుఁగు ‘ఓపాపీ, నేను మిత్త్రద్రోహము చేయను;’ అనెను. పిమ్మట ఎలుఁగుబంటి నిద్రించుచుండఁగా, సింహము మేల్కొని యున్న రాజపుత్త్రునితో ‘ఓమనుష్యుఁడా, ఆయెలుఁగుబంటిని నాకు పడవైవుము;’ అనెను. అందున కతఁడు తనప్రాణమునకు భయపడి సింహమునకు ఇచ్చకము చేయుటకై ఎలుఁగును క్రిందికి త్రోసెను. అయినను దైవయోగమున ఎలుఁగు మేల్కొని క్రిందఁబడక కొమ్మలలో నిలిచి, ‘ఓమిత్త్రద్రోహీ! నీకు పిచ్చియెత్తు నుగాక.’ అని శపించి, ఆవృత్తాంతము నెవ్వరైన నెఱిఁగి చెప్పి నప్పుడు శాపమోక్ష మగు నని యనుగ్రహించెను. మఱునాఁడు ప్రాతఃకాలమందు రాజపుత్త్రుఁడు నగరికి వచ్చి యున్మత్తుఁ డాయెను. ఆస్థితిలో నున్న తనయునిఁ గని యోగనందుఁడు దుఃఖ సముద్రములో మునిఁగి ‘ఈసమయములో వరరుచి యున్నచో ఇందులకారణమును తెలిసికొనఁగలఁడు. అయ్యో! అతనిని ఏల చంపించితిని? ఏమిపాడుపని చేసితిని!’ అని అఘోరించుచుండెను.

అది విని శకటాలుఁడు బళీ! కాత్యాయనుని బయటఁబెట్టుటకు ఇప్పటికి సమయము దొరకినది. అతఁడు మానవంతుఁడు, ఇంక నితనియొద్ద నుండఁడు; ఇతఁడును నాయందు విశ్వసించును. అని యాలోచించి రాజువలన అభయదానము పొంది 'ఓ ప్రభూ, చింతిల్లవలదు; వరరుచి బ్రదికియే యున్నాఁడు' అనెను. యోగ నందుఁడు వెంటనే అతనిని తోడ్కొని రమ్మనెను. శకటాలుఁడు నన్ను తోడ్కొనిపోఁగా నేను ఆయవస్థలో నున్న రాజపుత్త్రుని జూచి రాజుతో 'నీఁడు మిత్త్రద్రోహము చేసినాఁడు,' అని, సరస్వతీ ప్రసాదముచేత ఆవృత్తాంత మంతయు నెఱిఁగి చెప్పితిని; అంత రాజపుత్త్రుఁడు శాపమోక్షముపొంది నన్ను స్తుతించెను. నీ కీవృత్తాంత మెట్లు తెలిసెనని రాజు నన్నడిగెను. నేను రాజా! 'బుద్ధిమంతులు లక్షణములచేతను ఊహచేతను ప్రతిభచేతను సర్వమును కనుఁగొనుదురు. మచ్చను ఏప్రకారము తెలిసి కొంటినో దీనిని ఆప్రకారమే తెలిసికొంటిని.' అని చెప్పితిని. అంతట రాజు లజ్జితుఁడై పశ్చాత్తాపము నొందెను.

నేను అతని సత్కారములను అంగీకరింపక నామీఁది దోషము తొలఁగుటయే లాభముగా తలఁచి నాయింటి కేఁగితిని. విద్వాంసులకు సదాచారమే ధనముగాని బంగారమును ధనమా! నేను ఇంటికి పోఁగానే నన్నుఁ జూచి అక్కడివారెల్ల ఏడ్వసాగిరి. ఏమియుఁ తోఁపక భ్రాంతుఁడనై యున్న నాతో ఉపవర్షుఁడు 'అయ్యా, నిన్ను రాజు చంపించెనని

ఉపకోశ అగ్నిప్రవేశము చేసినది, నీతల్లి గుండె పగిలి చచ్చి పోయినది.' అని చెప్పెను. ఆనూతనశోకమునకు నేను తెలివి దప్పి గాలికి విఱిగిన చెట్టువలె నేల వ్రాలితిని. క్షణములో ప్రలాపరస మును ఎఱింగితిని. ప్రియబంధునాశహేతుక మయినశోకము ఎవరిని దహింపదు? వర్షాచార్యులవారు వచ్చి 'పుత్రా, సంసార మున్నంతకాలము ఈజగత్తులో అనిత్యత యొక్కటే నిత్య మయినది. ఈ యీశ్వరమాయను ఎఱింగియు ఏల యి ట్లజ్ఞాన ములో పడెదవు?' ఇత్యాది తాత్త్వికవచనములచేత తేర్పఁగా నేను ఎట్టకేలకు కొంచెము ధైర్యము తెచ్చుకొంటిని. అంతట విరక్తి చేత సర్వసంగమును వదలి ప్రశాంతియే శరణముగా తపో వన మాశ్రయించితిని. దినములు గడవఁగా ఆతపోవనమునకు ఒకనాఁడు అయోధ్యనుండి వచ్చిన యొకబ్రాహ్మణుఁడు నేను యోగనందుని వృత్తాంత మడుగఁగా నన్నానవాలుపట్టి శోకా క్రాంతుఁడై యిట్లు వక్కాణించెను.

చాణక్యుఁడు యోగనందుని పరిమార్చుట.

'నీవు పోఁగానే నందునిగతి ఏ మాయెనో విను చిర కాలమునకు శకటాలునికి అవకాశము లభించెను. అతఁడు యుక్తిచేత యోగనందుని వధింప నుపాయము వెదకుచు మార్గములో నేల త్రవ్వుచున్న బ్రాహ్మణు నొకనిని చాణక్యుఁ డను వానిని చూచి 'ఏల భూమిని త్రవ్వెదవు?' అని య డుగఁగా, చాణక్యుఁడు 'ఈదర్భ నాకాలికి గ్రుచ్చుకొన్నది.

దీనిని నిర్మూలనము చేయుచున్నాను.' అనెను. అంత మంత్రి ఆవిప్రుఁడు కోపనుఁడును క్రూరనిశ్చయుఁడు నని యెఱింగి యోగనందుని వధించుటకు అతఁడు మంచిసాధనమని తలంచెను. అతనిపే రడిగి తెలిసికొని 'ఓబ్రాహ్మణోత్తమా! నీకు నందుని యింట త్రయోదశీశ్రాద్ధ మిప్పించెదను, దక్షిణ లక్షవరహాలు దొరకును, అందఱికంటె ముందు భోజనము చేయుదువు; రమ్ము అందాఁక మాయింటికి.' అని శకటాలుఁడు చాణక్యుని తన యింటికి కొనిపోయి శ్రాద్ధదినమందు నందునికిఁ జూపెను. అతఁడును అంగీకరించెను. అంత చాణక్యుఁడు పోయి శ్రాద్ధములో మొట్టమొదట కూర్చుండెను. సుబంధు వను నొక బ్రాహ్మణుఁడు ఆయగ్రభోజనమును తా నపేక్షించెను. శకటాలుఁడు పోయి ఆవృత్తాంతమును చెప్పఁగా నందరాజు 'సుబంధువే అగ్రభోజనమునకు కూర్చుండవలసినది, అందున కతఁడే యోగ్యుఁడుగాని మఱియొకఁడుఁ పనికి రాఁడు.' అనెను. శకటాలుఁడు చాణక్యుని యొద్దకు వచ్చి భయముచేత వణఁకుచు ఆరాజాజ్ఞ నతనికి తెలిపి తనవలన అపరాధము లే దని మనవి చేసికొనెను.

అంతట చాణక్యుఁడు కోపముచేత మండిపడుచు తనజుట్టు ముడివిప్పి ఇట్లు ప్రతిజ్ఞ చేసెను. 'తప్పకుండ ఈనందుని ఏడుదినములలో కథావశిష్టుని చేసి పగతీర్చుకొని పిమ్మట ఈజుట్టును ముడివైచికొనియెదను.' చాణక్యుఁ డిట్లు చాటి యోగనందుని కోపమునకు వెఱచి పలాయితుఁ డాయెను. శకటాలుఁ డతనిని

తెచ్చి రహస్యముగా తనయింట నుంచుకొనెను. అక్కడనే కావలసిన సామగ్రి యంతయు ఆమంత్రియే తెప్పింపఁగా చాణక్యుఁ డెక్కడికో పోయి నందునిమీఁద ప్రయోగము చేసెను. అందు చేత యోగనందుఁడు దాహజ్వరము వచ్చి ఏడవదినమున మృతిఁ బొందెను. శకటాలుఁడు అతనికుమారుని హిరణ్యగుప్తుని చంపి, పూర్వనందునికుమారుఁడైనచంద్రగుప్తునికి రాజ్యాభిషేకము చేసి, అతనికి మంత్రినిగా బృహస్పతివంటి బుద్ధిమంతుని చాణక్యుని ప్రార్థించి స్థాపించి, యోగనందునినాశముచేత తాను కృతార్థుఁడై పుత్రశోకముచేత నిర్విణ్ణుఁడై మహావనము ప్రవేశించెను.

### వరరుచి దివ్యగతి నొందుట.

కాణభూతీ! ఇట్లు ఆబ్రాహ్మణునివలన విని సకలమును అనిత్యమగుట చూచి ఖేదమును పొందితిని. ఆఖేదముచేత వింధ్యవాసినిని దర్శించుటకు వచ్చి ఆదేవిప్రసాదముచే నిన్ను చూచితిని. నిన్ను చూడఁగానే పూర్వజన్మస్మరణయు దివ్యజ్ఞానమును కలిగినవి. చెలికాఁడా! నీకు మహాకథను చెప్పినాఁడను; ఇప్పుడు నాశాపము తీఱినది. ఇఁక నేను దేహమును త్యజింప యత్నించెదను. నీయొద్దకు మూఁడుభాషలను త్యజించినవాఁడు గుణాఢ్యుఁడు శిష్యులతో కూడ వచ్చువఱకును నీ విక్కడనే యుండుము. అతఁడు మాల్యవంతుఁ డనుప్రమథుఁడు, నానిమిత్తమై దేవిని ప్రసాదింప యత్నించి ఆదోషముచేత ఆయుమవలన

శాపము పొంది మనుష్యులై పుట్టి యున్నారము. మహేశ్వర ప్రోక్త మయిన యీమహాకథను అతనికి చెప్పుము, అంత మీ యిరువురకును శాపవిముక్తి యగును.

ఇట్లు వరరుచి కాణభూతికి చెప్పి దేహత్యాగము చేయుటకై పుణ్యమయిన బదరికావనమునకు పోవుచు గంగయొద్ద శాకభోజనుని ఒక మునిని చూచెను. ఆమునికి చేతిలో దర్భగ్రుచ్చుకొని రక్తము కారుచుండెను. ఆమునియొక్క యహంకారమును పరీక్షించుటకై ఆరక్తమును వరరుచి తన మహిమచేత శాకరసముగా మార్చెను. ఆశాకరసమును చూచి ఆముని, ఆహా సిద్ధుడ నైతి నని, గర్వించెను. అంత వరరుచి చిఱునవ్వు నవ్వుచు అతనితో నిట్లనియె 'అయ్యా! పరీక్షార్థము నీ రక్తమును నేను శాకరసము చేసితిని; ఓమునీ, ఇప్పటికిని నీకు అహంకారము పోయినది గాదు. జ్ఞానమార్గమునకు అహంకారము దాటరాని యడ్డుగడియ గదా. జ్ఞానములేక ఎన్ని వ్రతములు చేసినను మోక్షము కలుగ నేరదు. ముముక్షువుల చిత్తమును నశ్వరమయిన స్వర్గము హరింపజాలదు. కనుక నీవు అహంకారమును మాని జ్ఞానమును సాధింపుము.' ఆ మునికి ఇట్లుపదేశించి, అతనివలన ప్రణతులు స్తుతులును బడసి వరరుచి శాంత మయిన యాబదరికాశ్రమమునకు పోయెను. అచ్చట మనుష్యదేహమును వదలువాడై దృఢభక్తితో శరణాగతవత్సలను గౌరిని శరణు వేడెను. ఆమెయు ప్రత్య

క్షుమై అతనికి దేహత్యాగార్థము అగ్నిధారణను నేర్పెను. ఆధారణచేత వరరుచి దేహమును దహించుకొని దివ్యగతిని పొందెను. కాణభూతియు వింధ్యారణ్యములో గుణాఢ్యపండితుని ఎదురు సూచుచుండెను.

---

౬ - వ త రం గ ము.

మాల్యవంతుఁడు గుణాఢ్యుఁ డనుపేర మనుష్యజన్మమెత్తి, సాతవాహనరాజును కొలిచి, అతనియెదుట చేసిన ప్రతిజ్ఞచేత సంస్కృతము మొదలయిన మూఁడు భాషలను త్యజించి, ఖిన్నుఁడై వింధ్యవాసినిని దర్శించుకొనుటకు అడవికి వచ్చెను. అమ్మవారియాజ్ఞచేత పోయి అతఁడు కాణభూతిని చూచి, తన పూర్వజన్మము స్మరణకు రాఁగా, మూఁడుభాషలకును విలక్షణ మైన పైశాచీభాషతో కాణభూతితో తనపేరు చెప్పి 'మిత్త్రమా! పుష్పదంతునివలన విన్నదివ్యకథను చెప్పుము. మన మిద్దఱము దానివలన శాపమును దాఁటుదము గాక.' అని యడిగెను. ఆమాట విని కాణభూతి హర్షించి ప్రణతుఁడై 'మహానుభావా! అలాగే కథను చెప్పెదను గాని, నా కుతూహలము తీర్పుము. జన్మమొదలుకొని నీపుణ్యచరిత్రమును చెప్పి న న్ననుగ్రహింపుము.' అని వేఁడెను. గుణాఢ్యుఁ డిట్లు చెప్పం దొడంగెను.

## గు ణా ఢ్యు ని చ రి త్ర ము.

ప్రతిష్ఠానదేశమందు సుప్రతిష్ఠిత మనుపట్టణము గలదు. అందు సోమశర్మ యను బ్రాహ్మణోత్తముఁ డుండెను. అతనికి వత్సుఁ డనియు, గుల్మకుఁడనియు ఇద్దఱు పుత్త్రులు; శ్రుతార్థ యని యొకకూఁతురు. కాలక్రమమున ఆబ్రాహ్మణుఁడు భార్యతోఁగూడ పరలోకగతుఁ డాయెను. అతనికుమారులు చెల్లెలిని సంరక్షించుకొనుచు కాలము గడపుచుండిరి. ఆమె ఆకస్మికముగా గర్భిణి యాయెను. అంత వత్సగుల్మకులకు అచ్చట అన్యపురుషు లెవ్వరును లేమింజేసి ఒకరిమీఁద నొకరికి సంశయము కలిగెను. ఆ యింగిత మెఱిఁగి శ్రుతార్థ అన్నలతో 'అన్నలారా! మీకు పాపశంక వలదు. నాగరాజు వాసుకితమ్మునికి కీర్తిసేనుఁ డని కుమారుఁడు గలఁడు. అతఁ డొకనాఁడు నేను స్నానమునకు పోవుచుండఁగా చూచి మదనపరవశుఁడై తన కులగోత్రములు తెలిపి గాంధర్వవిధిచేత నన్ను వివాహమాడెను. కనుక నాకీగర్భము విప్రజాతివలననే కలిగినది.' అనెను. ఆమాట విని వత్సగుల్మలు 'అందున కేమి దృష్టాంతమ'ని యడిగిరి. అంత నామె ఏకాంతమున నాగకుమారుని తలఁచుకొనెను. అతఁడును వచ్చి వత్సగుల్మలతో నిట్లనియె. 'ఓవిప్రులారా! ఈ మీచెల్లెలు ఒకయప్సరస, శాపముచే ఈజన్మ మెత్తినది. మీరును శాపముచే భూలోకమున జనించితిరి: ఈమెకు పుత్త్రుఁడు గలుగును. అంతటితో మీకు

మువ్వురకు శాపవిముక్తి యగును.' ఇట్లని నాగకుమారుఁడు అంతర్హితుఁ డాయెను. పిమ్మట కొలఁది దినములలోనే ఆమెకు పుత్త్రుఁడు గలిగెను. ఆపుత్త్రుఁడనే నే నని తెలిసికొనుము. నేను పుట్టినవేళ ఆకాశవాణి 'వీఁడొక ప్రమథుని యవతారము, బ్రాహ్మణుఁడు; వీనిపేరు గుణాఢ్యుఁడు.' అని పలికెను.

పిమ్మట కొంతకాలమునకు నాతల్లియు మామలును శాపవిముక్తులై దేహత్యాగము చేసిరి. అంత నేను బాలుఁడనయ్యు ధైర్యము తెచ్చుకొని విద్యార్థినై దక్షిణాపథమునకు పోయితిని. అచ్చట క్రమముగా సర్వవిద్యలును నేర్చి ప్రసిద్ధి పొంది నామహిమను ప్రకటించుకొనుచు స్వదేశమునకు వచ్చితిని. బహుకాలమునకు శిష్యులతో కూడ నేను వచ్చి ప్రవేశించుచుండఁగా ఆ సుప్రతిష్ఠితనగరము అపూర్వమయినశోభతో తేజరిల్లుచుండెను. ఒకచోట సామగులు యథావిధిగా సామగానము చేయుచుండిరి. ఒకచోట వేదార్థములను గుఱించి బ్రాహ్మణులు వాదించుచుండిరి. మఱియొకచోట జూదగాండ్రు 'ఎవఁడు జూదమున నేర్పరియో వానిచేతిలో నున్నది నిధి' యని ఇట్టి టక్కుమాటలచేత జూదమును పొగడుచుండిరి. ఇంకొకచోట కోమట్లు వర్తకమందు తమనైపుణ్యమును పొగడుకొనుచుండిరి. అందులో నొకఁడు ఇట్లు చెప్పుకొనియె.

ఎలుకసెట్టికథ.

బుద్ధిమంతుఁడు ధనమువలన ధనము సంపాదించుట ఏమి యాశ్చర్యము? నేను పూర్వము ధనము లేకయే లక్ష్మిని సాధిం

చితిని. నేను గర్భములో నుండఁగానే మాతండ్రి కాలధర్మము చేసెను. పాపాత్ములు దాయాదులు నా తల్లియొక్క ఆస్తి నంతయు హరించినారు. ఆమె వారిభయముచేత గర్భమును కాపాడుకొనుచు తనతండ్రికి మిత్రుఁడయిన కుమారదత్తుని యింట నివసించియుండెను. ఆపతివ్రతకు నేను జన్మించితిని. నన్నామె నానాకష్టములుపడి పోషించుచు పరమదారిద్ర్యముచేత దీనురాలై ఒకబడిపంతులను బతిమాలుకొని నాకు వ్రాఁతయు లెక్కయు నేర్పించెను. ఒకనాఁడు అమ్మ నాతో నిట్లనియె 'నాయనా! నీవు కోమటిబిడ్డవు, కనుక ఇంక వర్తకము చేయవలసినది. ఈదేశములో విశాఖిలుఁడని మహాధనికుఁడొక కోమటి గలఁడు. ఆయన దరిద్రులైన గొప్పయింటి కోమట్లకు మూలధనము నిచ్చును. పోయి ఆయనను సంచి మొదలు అడుగుము.' వెంటనే నేను ఆయనకడకు పోయితిని. ఆసమయములో ఆయన ఎవనినో ఒకకోమటిచిన్నవానిని 'ఇదిగో చూడు, చచ్చి భూమిమీఁద పడి యున్నది ఈయెలుక. దీనిని కూడ సరకు చేసికొని బుద్ధిమంతుఁడు ధన మార్జింప నేర్చును. నీవు కేవలము పనికిమాలినవాఁడవు. నీకు ఎన్నియు దీనారము లిచ్చినాఁడను. దానికి వడ్డీ అటుండనీ, అసలుకూడ నీవు పోఁగొట్టినాఁడవు.' అని చీవాట్లు పెట్టుచుండెను. అది విని నేను 'అయ్యా! నీవలన ఈయెలుకను సంచిమొదలుగా పుచ్చుకొన్నాఁడను' అని చెప్పి ఆయనలెక్కలో దానిని వ్రాసి

అతఁడు నవ్వుచుండఁగా ఎలుకను పుచ్చుకొని వెడలితిని. ఆయెలుకను రెండుదోసిళ్ల సెనగలకు ఒకవర్తకునిపిల్లికి ఆహారముగా అమ్మితిని. ఆసెనగలను వేఁచి కుండెడు మంచినీళ్లను కొనిపోయి ఊరివెలుపల ఒకచోట నీడలో కూర్చుంటిని. ఆదారిని దప్పిగొని వచ్చిన కట్టెలమోపులవాండ్రకు మంచిమాటలతో రవన్ని సెనగలు పెట్టి కొంచెము చల్లని మంచినీళ్లు పోసితిని. కట్టెలమోపులవాండ్రు ఒకరొక్కరును నాకు రెండేసి కట్టెలు ఇచ్చిపోయిరి. వానిని నేను బజారునకు తెచ్చి అమ్ముకొంటిని. మఱునాఁడు ఆడబ్బులో కొంచెము పెట్టి సెనగలు కొని తొలినాఁటివలెనే మరల కాష్ఠికులకు ఇచ్చి వారివలన కట్టెలు పుచ్చుకొంటిని. ఈప్రకారమే ప్రతిదినము చేయుచు, చిట్టచివరకు ఆకాష్ఠికుల కట్టెమోపుల నన్నిటిని మూఁడుదినములు వరుసగా నేనే కొంటిని. అంతట అతివృష్టి కలిగి వంటచెఱకు ఊరిలోనికి బయట ఎక్కడనుండియు రాక మిక్కిలి ప్రియము కాఁగా నేను నా వంటచెఱకును మిక్కిలి లాభమునకు విక్రయించి ఆధనముతో దుకాణము పెట్టి, వర్తకము చేయుచు క్రమముగా మహాధనికుఁడ నైతిని. పిమ్మట బంగారముతో ఒకయెలుకను చేయించి కొనిపోయి విశాఖిలునికి 'ఇదిగో నయ్యా నీసంచిమొదలు వడ్డితో కూడ' అని చెప్పి యిచ్చితిని. అతఁడును నానేర్పునకు మెచ్చుకొని తన కొమారితను నాకు పెండ్లిచేసి పెండ్లికూఁతునకు అరుకొనుటకు ఆబంగారపు

టెలుకను ఇచ్చెను. ఇందుచేత నాకు ఎలుకసెట్టి యని పేరు వచ్చినది. ఈప్రకారము నేను చేత దమ్మిడి యైనను లేక ఎంతయు ధనమును సంపాదించితిని.—ఆకథను విని వర్తకు లందఱును మిగుల నాశ్చర్యపడిరి. గోడ లేకయే చిత్తరువు వ్రాసిన ఆశ్చర్యము కాదా!

సా మ వే ది మూ ఢు ని క థ.

మఱి యొకచోట ఎనిమిది మూడల బంగారము ఎక్కడనో దానము పుచ్చుకొని వచ్చిన యొక సామవేది బ్రాహ్మణునితో విటుఁ డొకఁడు 'ఓ బ్రాహ్మణుఁడా! నీవు బ్రాహ్మణుఁడవగుటచే ఎక్కడఁబట్టినను నీకు భోజనము సిద్ధముగా దొరకును; కనుక ఈబంగార మిచ్చి ఇక్కడ లోకయాత్రను నేర్చుకొని మంచి జాణఁడవు కారాదా?' అనెను. ఆమూఢబ్రాహ్మణుఁడు నా కెవరు నేర్పుదు రని యడుగఁగా, విటుఁడు 'ఇదిగో ఇక్కడ నున్నదే భోగముది చతురిక, దానియింటికిఁ బొమ్ము.' అనెను అక్కడికి పోయి నే నేమి చేయవలయు నని బ్రాహ్మణుఁడడుగఁగా 'బంగార మిచ్చి రంజించుచు ఏ దయిన సామ ప్రయోగింపుము.' అని విటుఁడు చెప్పెను. వెంటనే ఆసామవేది చతురికయింటికి పోయెను. అదియు ఆయనను ఎదుర్కొని గౌరవించెను. అంత నాయన కూర్చుండి దానితో 'ఇదిగో దీనిని పుచ్చుకొని నాకు లోకయాత్ర నేర్పుము;' అని యడిగి ఆబంగారము నిచ్చి వైచెను. అందుల కక్కడివా రందఱు

నవ్వుచుండఁగా ఆమూర్ఖబ్రాహ్మణుఁడు కొంచెము ఆలోచించు కొని చేతులను ఆబద్ధసారణములనుగా ఆవుచెవిరూపముగాఁ బట్టి బిగ్గరగా సామవేదమును పాడసాగెను. ఆహాస్యమును చూచుటకు విటులు ఎక్కడెక్కడనుండియు వచ్చి మూఁగిరి. 'ఈనక్క యిక్కడికేల వచ్చెనది? త్వరగా దీనికంఠమునకు ఒక యర్ధచంద్రము నిచ్చి పంపుఁడు.' అని విటులు పల్కిరి. అర్ధచంద్ర మనఁగా బాణవిశేష మనియు తనకు శిరశ్ఛేద మగు ననియు నడలి 'వచ్చిపోయినది పరలోకయాత్ర!' అని యఱచుచు అతఁడక్కడినుండి పాఱిపోయి, మొదట తన్నక్కడికి పంపినవాని యొద్దకుం జని జరిగినవృత్తాంత మంతయు అతనికి చెప్పెను. అతఁడును 'ఓబ్రాహ్మణుఁడా, సామ యనఁగా మంచిమాటలు; మంచిమాటలాడు మని నేను చెప్పితినే గాని వేశ్యాగృహములో వేదమునకు ప్రసక్తి యేమి? సరి! వైదికుల బుద్ధిజాడ్యము లోకప్రసిద్ధము గదా.' అని నవ్వి, ఆవిలాసినియొద్దకు పోయి 'ఈ రెండుకాళ్ల పసరమునకు దాని బంగారమును గట్టినవల పాలనైవుము.' అనెను. అదియును నవ్వుచు ఆబంగారము నిచ్చి వైచెను. బ్రాహ్మణుఁడు దానిని పుచ్చుకొని, చచ్చి మఱలఁ బ్రదికి నట్లు సంతోషించుచు, ఇంటికి పోయెను.

ఎక్కడఁ జూచినను ఇట్టివినోదములను చూచుచు నేను దేవేంద్రభవనమువంటిదైన రాజభవనమునకు వెళ్లితిని. ముందు శిష్యులచేత తెలియఁజేయించుకొని లోపలికి పోయి

ఆస్థానమందు శర్వవర్మ మొదలయినవారిచే పరివృతుఁడై దేవతలతోడి యింద్రుఁడునుం బోలె రత్నసింహాసనాసీనుఁడై యున్న సాతవాహనమహారాజును దర్శించితిని. రాజును ఆశీర్వదించి ఆసనమందు కూర్చుండిటిని; రాజు నన్ను గౌరవించెను; శర్వవర్మాదులును నన్ను ఇట్లు పొగడిరి: 'దేవా! ఈయన లోక మంతట ప్రసిద్ధి కెక్కినవాఁడు, సకల విద్యావిశారదుఁడు, అందుచేతనే ఈయనకు గుణాఢ్యుఁ డనుపేరు సార్థకమై యున్నది.' ఇట్లు మంత్రులు నన్ను పొగడఁగా ప్రీతుఁడై సాతవాహనుఁడు అప్పుడే నన్ను సత్కరించి మంత్రినిగా నియమించెను. అది మొదలుకొని నేను రాచకార్యములు విచారించుచు, శిష్యులకు పాఠములు చెప్పుచు, వివాహము చేసికొని అక్కడనే సుఖముగా నుంటిని.

## దేవీకృతోద్యానకథ.

ఒకనాఁడు వినోదార్థము గోదావరియొడ్డున సికారి పోయి అచ్చట దేవీకృతి యనుపేరిటి యుద్యానవనమును చూచితిని. అదియు భూలోకమునకు వచ్చిన నందనమో యన నతిరమణీయముగా నున్నందున ఉద్యానపాలుని ఆ యుద్యానమచ్చట నెట్లు కలిగెనో చెప్పు మని యడిగితిని. వాఁ డిట్లు చెప్పెను.—

స్వామీ! పెద్దలవలన ఈయితిహాసమును వినియున్నాను. పూర్వము వారానియు నిరాహారుఁడు నైన నబ్రాహ్మణుఁ డొకఁ

డిచ్చటికి వచ్చెను; ఆయన యీ దివ్యోద్యానమును ఈ దేవాలయముతో కూడ నిర్మాణము చేసెను. ఆచిత్రము చూడ బ్రాహ్మణు లందఱు వచ్చి ఆయనను తనవృత్తాంతము చెప్పు మని నిర్బంధపెట్టఁగా ఆతఁ డిట్లు వాక్రుచ్చెను—“ఇచ్చట నర్మదా నదీతీరమందు భరుకచ్ఛప మనుదేశము గలదు, అదే నాజన్మ భూమి. నేను దరిద్రుఁడ నయ్యు సోమరిగా నుంటిని, నా కెవ్వరును భిక్షమైనను పెట్ట రయిరి. అంత నేను నాజన్మము నకు విసుగుకొని యిల్లు వదలి నానాతీర్థములు సేవించి చివరకు వింధ్యవాసినిని దర్శించుటకు పోయితిని. ఆమెను దర్శించి ‘లోకులు వేఁటపోతులను బలి యిచ్చి యీదేవతను మెప్పించి వరములు పొందుచున్నారు, నేను మూర్ఖుఁని నన్నే పశువుగా ఈమెకు బలి యిచ్చెదను.’ అని నిశ్చయించుకొని శిరస్సును ఖండించుకొనుటకు కత్తి యెత్తితిని. ఆక్షణమే దేవి నాకు ప్రత్యక్షమై ప్రసన్నురాలై యి ట్లనియె. ‘వత్సా! సిద్ధుఁడ వయినాఁడవు, నిన్ను చంపుకొనకు, నాయొద్ద నుండుము.’ ఇట్లు దేవి వర మీఁగానే నాకు దేవత్వము గలిగినది; ఆఁకలియు దప్పియు అది మొదలుకొని నిలిచి పోయినవి. పిమ్మట నొకనాఁడు దేవి నన్ను ‘వత్సా! ప్రతిష్ఠానమునకు పోయి అందు రమణీయ మయినయుద్యానమును నిర్మింపుము.’ అని యాజ్ఞాపించి నాకు దివ్య మయిన గింజ యొకటి యిచ్చెను. అంతట నేను దానిని తెచ్చి యిచ్చట నాటితిని; దానిమహిమచేత

ఈ యుద్యానము పుట్టినది. దీనిని మీరు కాపాడవలయును.' అని చెప్పి ఆ బ్రాహ్మణుఁడు అదృశ్యుఁడై పోయెను. ఓ ప్రభూ! ఈ ప్రకారము ఈయుద్యానము దేవియొక్క మహిమచేత పూర్వము సృజియింపఁబడినది.

ఉద్యానపాలునివలన ఆచోట దేవికి కలిగినయనుగ్రహము విని ఆశ్చర్యపడి యింటికి పోయితిని.

## సాతవాహనుని పూర్వ వృత్తాంతము.

ఈకథ ముగియఁగానే కాణభూతి సాతవాహనునికి ఆపేరెట్లు కలిగెనో చెప్పుమని గుణాఢ్యుని అడిగెను. అంతట గుణాఢ్యుఁడు చెప్పందొడంగెను.—పూర్వము దీపకర్ణి యను రాజొకఁ డుండెను. ఆయనకు ప్రాణప్రియయైన శక్తిమతి యను భార్య యుండెను. ఒకరాత్రి ఆమెను కాముకేళిం దేలి నిద్రించి యుండఁగా పాము కఱచెను. అందుచేత నామె కాలధర్మము పొందెను. ఆమెయందే ప్రాణము లుంచియున్న దీపకర్ణి అపుత్త్రుఁడయ్యును ఆశోకముచేత బ్రహ్మచర్యవ్రత మవలంబించెను. పిమ్మట తనవెనుక రాజ్య మేలుటకు తగినపుత్త్రుఁడు లేనందులకు వగచుచున్న యాదీపకర్ణితో ఒకనాఁడు కలలో సాంబమూర్తి యిట్లానతిచ్చెను 'ఓ రాజా! ఈయడవిలో సంచరింతువేని అచ్చట సింహముమీఁద స్వారిచేయుచుండు నొక బాలుని గాంతువు. వానిని ఇంటికిఁ దెచ్చికొమ్ము; వాఁడె నీకు పుత్త్రుఁడగును.' అంతట రాజు మేలుకొని ఆకలను స్మరించుకొనుచు

సంతోషించుచుండెను. పిమ్మట నొకనాఁడు అడవిలో వేటతమి చేత బహుదూరము పోయి అచ్చట మధ్యాహ్నకాలమందు సింహారూఢుఁడై యున్న యొకబాలకుని సూర్యునివలె దేదీప్యమానముగా ప్రకాశించుచున్నవానిని ఒక తామరకొలనిదరి యందు చూచెను. చూడఁగానే రాజునకు స్వప్నము జ్ఞప్తికి వచ్చెను. సింహము బాలుని దించి నీళ్లు త్రాగుటకై ఆసరస్సు లోనికి పోవుచుండెను. దీపకర్ణియు సింహముపై బాణమును ప్రయోగించెను. తత్క్షణమే సింహము సింహదేహమును వదలి మనుష్యుఁడాయెను. ఈయాశ్చర్యమేమని రాజడుగఁగా సింహ మిట్లు చెప్పెను. "ఓరాజా! నేను కుబేరునిమిత్త్రుఁడను, యక్షుఁడను ; నాపేరు సాతుఁడు. నేను పూర్వము గంగలో స్నానము చేయుచున్న యొకమునికన్యకను చూచితిని. ఆమెయు నన్ను చూచి మదనునిబారికి నిలువలేకుండెను. అంత నామెను నేను గాంధర్వవిధిచేత వివాహమైతిని. ఆవృత్తాంత మెఱిఁగి ఆమెయొక్క బంధువులు క్రోధముతో 'ఓపాపులారా! స్వేచ్ఛా విహారులరైన మీ రిద్దఱును సింహముల రగుదురుగాక' అని మమ్ము శపించి, ఆమెకు పుత్త్రజననపర్యంతమును నాకు నీబాణము తగులుపర్యంతమును శాపావధి నేర్పఱిచిరి. అంతట మే మిద్దఱమును సింహదంపతులముగా పుట్టినారము. కాలక్రమమున నాదయిత గర్భిణియై ఈబాలకునిఁ గని కాలధర్మమునొందెను. నేనే వీనిని ఇతరసింహికలపాలతో పెంచితిని. నీ

బాణము తగులఁగానే నాశాపము తీఱినది. వీఁడుగో ఈమహా సత్త్వుని నీ కిచ్చెదను. వీనిని పుత్త్రునిఁగా గ్రహింపుము. ఈ ప్రకారమే జరుగు నని పూర్వము ఆ మునీశ్వరులే విధించి యున్నారు.' ఇట్లు చెప్పి సాతుఁడు అంతర్హితుఁడు కాఁగానే రాజు ఆబాలకుని ఇంటికి కొనిపోయెను. సాతుఁ డతనికి వాహన మైనందున సాతవాహనుఁ డని పేరు పెట్టి కాలక్రమమున పట్టాభిషిక్తుని చేసి దీపకర్ణి మహారాజు తపస్సుకై అరణ్యమునకు పోయెను. అది మొదలుకొని ఈమహారాజు సర్వభూమండల మును ఏలుచున్నాఁడు. ఇతనికి సాతవాహనుఁ డని పేరు కలి గినవిధము ఇది. ఈప్రకారము కాణభూతికి అవాంతరకథను చెప్పి గుణాఢ్యపండితుఁడు మరల ప్రకృత మనుసరించి ఇట్లు చెప్ప సాగెను.

### సాతవాహనుని రాణి అవమానించుట.

పిమ్మట నొకప్పుడు సాతవాహనుఁడు వసంతకాలములో ఆదేవీకృతోద్యానమునకు చని రాణివాసములతో కూడి నందనవనమందు మహేంద్రుఁడు దివ్యాంగనలతోనుం బోలె పెద్దయుంబ్రొద్దు వనవిహారము సల్పి వారితో కూడ జల క్రీడార్థమై పద్మసరస్సులో ప్రవేశించెను. అందు ఆప్రియలపై ఇచ్ఛావిలాసముగా నీళ్లు చల్లుచుండెను. వారును అతనిమీఁద కరేణువులు గజేంద్రునిమీఁదనుంబోలె నీళ్లు చల్లుచుండిరి. కాటుక కరఁగి కెంపెక్కిన కనుదోయియు స్నానముచే

మెఱుఁగెక్కిన ముఖాద్యంగములును తడిచీర లొడలికి అంటుకొని పోఁగా వ్యక్తమైన నిమ్నోన్నతవిభాగములును కలిగి ఆసుంద రులు అతని మనస్సును హరించిరి. వాయువు లతలనుం బోలె వనమధ్యమందు సాతవాహనుఁడు ప్రియులను గళితతిలకపత్త్రలను చ్యుతాభరణపుష్పలనుం జేసెను. వారిలో స్తనభరాలసయు శిరీషకుసుమసుకుమారాంగియు నొకదేవి జలక్రీడచే బడలినదై తనపై రాజు నీళ్లుచల్లుచుండ నోపలేక ఆయనను సంస్కృత భాషలో 'రాజన్, మోదకైః స్తాడయ' అని వేఁడెను. వెంటనే రాజు విస్తారముగా మోదకములు (మిఠాయి) తెప్పించెను. అంతట ఆరాణి నవ్వి ఇట్లనియె: "రాజా! నీళ్లలో మోదకములకు ప్రసక్తియేమి? 'మా ఉదకైః తాడయ' అనఁగా నీళ్లతో కొట్టకుము అనిగదా నేను వేఁడితిని, మాశబ్దోదకశబ్దముల సంధినేని ఎఱుఁగవు, అవసరమును కూడ ఎఱుఁగవు; నీ వేమి యింత మూర్ఖుఁడవు?" శబ్దశాస్త్రమందు విద్వాంసురాలైన యా రాణి పలికిన యీ మాటకు పరిజను లందఱును నవ్వసాగిరి. అంతట రాజు మనస్సులో మిగుల లజ్జాక్రాంతుఁడై తత్క్షణమే జలక్రీడను మాని ఉత్సాహ ముడిగి తనమీఁద తానే విసుగుకొనుచు తన నగరికి పోయెను. అచ్చట చింతాసక్తుఁడై భోజనము కూడ వర్జించి, ఎవ రేమి యడిగినను పటమునందలి బొమ్మవలె ఉత్తరము చెప్పక యుండెను. 'నాకు పాండిత్యమో మరణమో రెంటిలో నొక్కటే శరణము.' అని చింతిం

చుచు పాన్పునం బడి పరితపించుచుండెను. ఆకస్మికముగా రాజునకు కలిగిన యీయవస్థను చూచి పరిజను లందఱును ఏమియు తోఁపక దిగులుపడి యుండిరి.

శర్వవర్మ సాతవాహనుని విద్వాంసునిఁ జేయుట.

అంతట నేనును శర్వవర్మయు క్రమముగా ఆవృత్తాంతమును తెలిసికొంటిమి. ఆప్రకారము ఆదిన మంతయు గడచి పోయెను. అప్పటికిని రాజు స్వస్థుఁడు కాలేదని ఎఱిఁగి రాజహంసుఁ డనురాజభటుని పిలిచి రాజుయొక్క దేహస్థితిని అడిగితిమి. వాఁడు చెప్పిన దేమనిన 'ఏలినవారికి ఇంత మనోవ్యథ ఇంతకు ముందు ఎప్పుడును కలుగలేదు. విష్ణుశక్తికూఁతురు తన యల్పపాండిత్య గర్వముచేత ఏలినవారిని అవమానించిన దని తక్కినరాణిగార్లు సెల విచ్చినారు.' ఈమాట విని నేను మిగుల వగచి సంశయముచేత శర్వవర్మతో ఇట్లు చింతించితిని. 'రాజునకు వ్యాధియేని వైద్యులు వచ్చియుందురు; మనోవ్యాధియేని అందునకు కారణ మేమియు అగపడదు. రాజ్యము నిష్కంటకముగా నున్నది. శత్రు వనుమాటయే లేదు. ప్రజ లందఱును అనురక్తులై యున్నారు. ఎందును ఏలోపమును గానరాదు. ఆకస్మికముగా ఇతనికి ఇంతఖేదము ఏల కలిగినది?, అందునకు మహామతి శర్వవర్మ ఇట్లనియె. 'నాకు తెలియును, రాజు తాను మూర్ఖుఁడై సంపులకు దుఃఖించుచున్నాఁడు. ఇతఁడు తాను మూర్ఖుఁడని యెఱిఁగి పాండిత్యము తన కెట్లులైనకలుగునా యని

సర్వదా కోరుచుండును. అతని యీ యభిప్రాయమును నేను పూర్వమే తెలిసికొనియున్నాను. ఆమూర్ఖతకై రాణి ఇతనిని అవమానపఱిచె ననియు విన్నారముగదా.' ఇట్లొకరితో నొకరము ఆలోచించుకొని ఆరాత్రి గడపి మఱునాఁడు ప్రాతఃకాలమందు రాచనగరికి పోయితిమి. అక్కడ ఎవ్వరును లోపలికి రాఁగూడదని, ఆజ్ఞ అయియున్నను, ఏదో ఒకయుపాయముచే నేను లోపలికి పోయితిని. శర్వవర్మయు నావెంటనే శీఘ్రముగా ప్రవేశించెను. నేను పోయి దగ్గఱ కూర్చుండి 'దేవా! ఏల యిట్లు నిష్కారణముగా ఖేదపడుచున్నాఁడవు?' అనియడిగితిని. ఆమాటకును అతఁడుత్తరము చెప్పక యథాప్రకారము మౌనముగా నుండెను. అంతట శర్వవర్మ యీయద్భుత వాక్యమును చెప్పెను. 'దేవా! పూర్వము నీవు ఎట్లయినను నీకు విద్య లభించునా యని నన్నడిగి యుంటివి. అందునిమిత్తమె నేను రాత్రి స్వప్నమాణవకుని చేసితిని. స్వప్నములో ఆకాశమునుండి యొక కమలము రాలినది, దానిని దివ్యకుమారుఁడొకఁడు వికసిల్లఁ జేసెను; అంత నాకమలమునుండి తెలివలిపము దాల్చిన యొకదివ్యస్త్రీ బయలు వెడలి వెంటనే నీనోట ప్రవేశించినది' ఇట్లు కల గని తత్క్షణమే మేలుకొంటిని. ఆమె సాక్షాత్తు సరస్వతీదేవియే నిస్సంశయముగా నీ నోట ప్రవేశించినది.' ఇట్లు శర్వవర్మ తనస్వప్నమును తెలియఁ బఱుపఁగానే సాతవాహనుఁడు తత్క్షణమే మౌనము మాని

నాతో సాభిప్రాయముగా 'అయ్యా! శ్రద్ధతో చదువు చెప్పిన యెడల పురుషునికి పాండిత్యము ఎంతకాలమునకు గల్గునో చెప్పుము. విద్యలేక యీనాసిరి శోభింపక యున్నది; కోయ్యకు అలంకారములవలె మూర్ఖునికి విభవము లేల?' అని పల్కెను. నేనును 'లోకములో మనుష్యులు సర్వవిద్యలకును ముఖమయిన వ్యాకరణమును పండ్రెండు సంవత్సరములలో గ్రహింతురు. ఓప్రభూ! నేను నీకు దానిని ఆఱు సంవత్సరములలో నేర్పెదను. అని పలికితిని. ఆమాట వినియు వినకయే శర్వవర్మ ఈర్ష్యచేత ఇట్లనియె. 'సుఖాపరుఁడైన ప్రభువు ఇంతకాల మెట్లు విద్యాభ్యాస క్లేశము ననుభవింప నేర్చును. ఓప్రభూ! నేను నిన్ను ఆఱు నెలలలో పండితుని చేసెదను.' ఈ యసంభావ్యవచనమును విని నేను రోషముతో ఇట్లు ప్రతిజ్ఞ చేసితిని: 'నీవే గనుక ప్రభువునకు ఆఱు నెలలలో పాండిత్యము గలిగింతువేని నేను మనుష్యవ్యవహారములో నుండువానిని సంస్కృతము ప్రాకృతము దేశభాష యను నీమూఁడుభాషలను త్యజించినాఁడ నని తెలిసికొనుము.' 'నేను గనుక నామాటప్రకారము చేయలేక పోయితినా పండ్రెండు సంవత్సరములు నీ పాదరక్షలను నెత్తిమీఁద పెట్టుకొని మోచెదను.' అని శర్వవర్మ ప్రతిప్రతిజ్ఞ చేసెను. మే మిద్దఱము ఇట్లు ప్రతిజ్ఞలు చేసి యిండ్లకుఁ బోయితిమి. రాజు మా యిద్దఱివలనను తనకోరిక సిద్ధించు నని తలఁచి యూఱడిల్లి యుండెను.

పిమ్మట శర్వవర్మ తాను చేసిన యసాధ్యప్రతిజ్ఞను తలఁచుకొని దిగులు పడి, పశ్చాత్తాపము పొంది ఆకడగండ్లను తన భార్యతో చెప్పుకొనెను. ఆమెయు మిక్కిలి దుఃఖించి 'ప్రాణనాథ! సంకటములో పడినారము. మనకు ఈయపాయములో కుమారస్వామికన్న శరణము వేఱు లేదు.' అనెను. అదే నిశ్చయము చేసికొని శర్వవర్మ నిరాహారుఁడై ఆరాత్రియే నాలవ జామున కుమారక్షేత్రమునకే తరలెను. తెల్లవాఱఁగానే ఆవృత్తాంతమును నేను తెలిసికొనిపోయి రాజుతో చెప్పినాఁడను. రాజు విని ఇందుల పర్యవసాన మేమగునో అని చింతించుచుండఁగా సింహగుప్తుఁడను రాజపుత్త్రుఁడు ఎప్పుడును రాజునకు మేలే కోరినవాఁడు ఇట్లని, విన్నవించెను; "దేవా! ఏలినవారు ఖిన్నులై యున్నందులకు నాకు మహత్తర మయినదుఃఖము గలిగి నగరము వెలుపలికి పోయి తమశ్రేయస్సుకై చండికాదేవికి బలి సమర్పించుటకు నాతలను ఖండింపఁ బూనుకొంటిని. అంతట అంతరిక్షవాణి 'ఓరిబాలకా! సాహసము చేయకుము, నీదొరకోరిక సిద్ధించును.' అని పల్కి నన్ను సాహసమునుండి నివారించెను. ఇందుచేత నీకు సిద్ధి నిశ్చయ మని తలంచెదను.' ఇట్లు విన్నవించి రాజునొద్ద సెలవు పుచ్చుకొని పోయి సింహగుప్తుఁడు శర్వవర్మవెంబడి ఇద్దఱు చారులను పంపెను. శర్వవర్మయు వాయుమాత్రభక్షుఁడై మౌనము దాల్చి దృఢనిశ్చయముతో క్రమముగా కుమారస్వామిసన్నిధిం జేరి,

దేహముమీఁద నపేక్ష యుంచక తీవ్రముగా తపస్సు చేసి ఆదేవుని మెప్పించెను. అంతట ప్రసన్నుఁడై దేవుఁడు శర్వవర్మకు ప్రత్యక్షమై కోరినవరంబు లొసంగెను. శర్వవర్మ యొక్క యీయభ్యుదయవృత్తాంతమును సింహగుప్తునిచారులు వచ్చి రాజునకు నివేదించిరి. ఆవృత్తాంతము వినఁగానే రాజునకును నాకును మేఘమును చూడఁగా చాతకమునకును హంసకునుంబోలె హర్ష విషాదములు కలిగెను.

అంతట కుమారస్వామివరముచేత సిద్ధిమంతుఁడై శర్వవర్మ వచ్చి తలంపుమాత్రముననే రాజును సర్వవిద్యావిశారదునిఁ జేసెను. పరమేశ్వరుని యనుగ్రహ ముండిన నేయసాధ్యము సిద్ధింపనేరదు. రాజుయొక్క ఆయద్భుతవిద్యాలాభమును విని రాష్ట్రమంతటను ప్రజలు మహోత్సవములు చేసిరి. ఇంటింటిమీఁదను ఉత్సవంపుజెండాలను వాయుదేవుఁడు నృత్త మాడించుచుండెను. సాతవాహనుఁడు శర్వవర్మను గురు వని నమస్కరించి రాజార్హము లైన మణి కనక వస్త్రాలంకారములతో పూజించి నర్మదాతీరమందలి భరుకచ్ఛపదేశమునకు రాజును చేసెను. కుమారస్వామియొక్క వరవృత్తాంతమును చారులవలన తెలిసికొని నివేదించిన సింహగుప్తుని సాతవాహనుఁడు ఐశ్వర్యములో తనకు సమానునిఁ జేసెను. తనకు విద్య వచ్చుటకు కారణ మైన రాణిని విష్ణుశక్తి

కౌమారితను స్వయముగా పట్టాభిషేకము చేసి కడమ యందఱు రాణులపైని పట్టపుదేవిని చేసెను.

---

౭ - వ తరంగము.

అంతట నేను మౌన మవలంబించి రాజసన్నిధికిం బోయితిని. అచట నొక బ్రాహ్మణుఁడు తాను రచియించిన యొక శ్లోకమును చదివెను. దాని యర్థమును రాజు స్వయముగా సంస్కృతభాషలో చెప్పెను. దానిని చూచి అక్కడివారందఱు సంతోషించిరి. అంతట రాజు శర్వవర్మను వినయముతో ఆయనకు కుమారస్వామి ప్రసన్నుఁడైన ప్రకారమును చెప్పు మని యడిగెను. శర్వవర్మయు కుమారానుగ్రహమును ఈప్రకారము చెప్పసాగెను.

శర్వవర్మకు స్వామి ప్రసన్నుఁడైన ప్రకారము.

రాజా! నేను ఇక్కడినుండి నిరాహారుఁడనై మౌనము పూని తరలితిని గదా. మార్గము కొంచెము శేషించి యుండఁగా తీవ్రతపస్సుచేత కృశించి సొమ్మసిల్లి యొకచోట భూమిమీఁద మూర్ఛితుఁడనై పడిపోయితిని. అంతట ఈఁటెను చేతఁ బూనిన యొకమహాపురుషుఁడు అగపడి 'ఓరి వత్సా! లేరా, నీకోరిక యంతయు సిద్ధించునులే.' అని పలికెను. ఆమాటచేత నేను అమృతవర్షముచే తడుపఁబడినవాఁడనుంబోలె మూర్ఛ

దేరి ఆఁకలియు దప్పియు లేక స్వస్థముగా నుంటెని. పిమ్మట భక్తిపరవశుఁడనై దేవునిసన్నిధికి పోయి, స్నానము చేసి గర్భగృహములో ఔత్సుక్యముతో ప్రవేశించితిని. అక్కడ గర్భగృహములో దేవుఁడు నాకు దర్శనమిచ్చెను. అంతట నానోట సరస్వతి దేహముతో ప్రవేశించెను. అంతట స్వామి ఆఱు నోళ్లతోను స్పష్టముగా 'సిద్ధో వర్ణసమామ్నాయః' అని సూత్రమును ఉచ్చరించెను. దానిని విని, ఇపీ! నేను మనుష్యజాతిస్వభావమైన చాపలముచేత తరువాతిసూత్రము నూహించి చెప్పినాఁడను. అంత దేవుఁడు 'ఓరి, నీవు స్వయముగా రెండవసూత్రమును చెప్పకుంటివేని ఈ నీశాస్త్రము పాణినీయశాస్త్రమును అణఁచివైచును. నీవు రెండవసూత్రమును చెప్పినందువలన ఇది స్వల్పతంత్రమై కాతంత్ర మని పేరు పొందును, నావాహన మయిన నెమలిపేర కాలాప మనియు పేర్కొనఁబడును.' ఇట్లు చెప్పి నూతన మయినయాశబ్దశాస్త్రమును నాకు క్షణములో వెల్లడిచేసి ఆ దేవుఁడు సాక్షాత్తుగానే మరల నాకిట్లనియె. 'నీరాజు పూర్వ మొకఋషి, భరద్వాజులవారి శిష్యుఁడు, మహాతపస్వి; ఇతని కష్టుఁడు కృష్ణుఁడని పేరు, ఒకప్పుడా కృష్ణుఁడు తన్ను కామించిన యొకానొక మునికన్యను చూచి ఆకస్మికముగా మదనబాణ ప్రహారముయొక్క స్వారస్యమును గ్రహించినవాఁ డాయెను. అందులకు మును లెల్ల శపింపఁగా ఆయిరువురును మనుష్యులై పుట్టినారు. అతఁడే నీరాజు సాత

వాహనుఁడు, ఆమునికన్యయే అతని దేవి విష్ణుశక్తికూఁతురు. నిన్ను చూడఁగానే నీయిచ్ఛచేత నతనికి సకలవిద్యలును వచ్చెను. మహాత్ములకు ఉత్తమార్థము లెల్లను జన్మాంతరార్జితములై ఆసంస్కారముచేత ఇప్పుడు సిద్ధించునని క్లేశము లేకయే లభించునుగదా." ఇట్లు పలికి దేవుఁడు అంతర్హితుఁడు కాఁగా నేను బయట వచ్చితిని. నాకు అక్కడి పూజారులు బియ్యమిచ్చినారు. నేను వెంటనే బయలుదేఱి వచ్చినాఁడను. ఆబియ్యము దారిలో ప్రతిదినము వండుకొని భుజించుచువచ్చినను, అదేమి చిత్రమో! తఱుఁగక ఎప్పటియంతే అగుచుండెను.

ఈప్రకారము తన వృత్తాంతమును చెప్పి శర్వవర్మ విరమింపఁగానే సాతవాహనమహారాజు సంతోషించినవాఁడై మాధ్యాహ్నిక స్నానార్థమై సభ చాలించి లోపలికి పోయెను. అంతట నేను మౌనము పూనితినిగాఁబట్టి రాచకార్యములు చూచుటకు సాధ్యపడక రాజుతో శిరోనతిచేతనే పోయివచ్చెదనని అతనికి బొత్తిగా సమ్మతి లేకపోయినను ఆనగరమునుండి యిద్దఱే శిష్యులతో బయలువెడలి తపస్సుకై నిశ్చయించుకొని వింధ్యవాసినియొద్దకు వచ్చినాఁడను. దేవి కలలో నగపడి నన్ను నీయొద్దకు పొమ్మని యాజ్ఞాపించినది. ఆయాజ్ఞప్రకారమే నిన్ను చూటకై వచ్చి ఘోరమైన యీ వింధ్యకాంతారంబునం బ్రవేశించినాఁడను. దైవవశమున పులిందుఁడొకఁడు నా కొక బిడారును చూపించెను. దానితో ఇచ్చటికి రాఁగా

ఇక్కడ పిశాచము లనేకములు అగపడినవి. వాని సంభాషణ ములను దూరమునుండియే విని ఈ పిశాచభాషను నేర్చు కొంటిని. ఈభాష వచ్చినందున మౌనమును మానివైచితిని. ఇక్కడికి వచ్చియు నీవు ఉజ్జయినికి పోయితి వని విని నీవు వచ్చు వఱకు ఇక్కడనే కనుపెట్టుకొని యున్నవాఁడను: నిన్ను చూచి నాలవదైన భూతభాషలో నీకుశలప్రశ్న యడుగఁగానే నాకు పూర్వజన్మజ్ఞానము కలిగినది. ఇదే నా యీ జన్మము యొక్క వృత్తాంతము.

గుణాఢ్యుఁ డిట్లు చెప్పఁగానే కాణభూతి యిట్లనియె: నీ వాక ఆరాత్రి నాకు ఎట్లు తెలిసినదో చెప్పెదను వినుము:— భూతివర్మ యని నా కొక చెలికాఁడు రాక్షసుఁడు దివ్యదృష్టి కలవాఁడు గలఁడు. ఉజ్జయినిలో అతని నివాసస్థానమయిన యుద్యానమునకు పోయి యుండి నాశాపము ఎప్పుడు ముగియునో అని అతని నడిగితిని. అతఁడును పగలు తనకు ప్రభావము లే దనియు రాత్రివఱకు ఉండు మనియు చెప్పెను. ఆమాటనుబట్టి నేను అక్కడనే యుండి రాత్రి రాఁగానే అక్క డనే పరుగు లెత్తుచున్న పిశాచములయొక్క సంతోషమునకు కారణ మేమో ప్రస్తావవశముగా అడిగితిని. అందులకు భూతి వర్మ పూర్వము బ్రహ్మదేవునికి శంకరుఁడు చెప్పినదానిని చెప్పె దను వినుమని యిట్లనియె: 'సూర్యతేజస్సుచేత ఈ యక్షరక్షః పిశాచములకు పగలు ప్రభావము లేదు; కాఁబట్టి యివి రాత్రి

సంతోషించును. ఎక్కడ దేవతలకు పూజ జరుగదో, బ్రాహ్మ ణులు ఉచితాచారములను ఆచరింపరో, భోజనము విధి నతిక్ర మించి జరుగునో, అక్కడ వీనికి ప్రభావము. మాంసభక్షణము చేయనివాఁడు గాని పతివ్రత గాని యున్న చోటికి ఇవి పోవు. శుచులను శూరులను జ్ఞానులను ఇవి ఎప్పుడును ఆక్రమింపవు.'

ఇట్లు చెప్పి మరల భూతివర్మ 'ఇంక పొమ్ము, నీకు శాప మోక్షమునకు కారణమయిన గుణాఢ్యుఁడు వచ్చియున్నాఁడు.' అనెను. ఓ ప్రభూ! ఆమాట విని వచ్చినాఁడను, నిన్నును చూచినాఁడను. ఇఁకను పుష్పదంతుఁడు చెప్పిన కథను నీకు చెప్పెదను. నాకు ఇంకొక కుతూహలము కలదు, ఏమనఁగా, ఆయనకు పుష్పదంతుఁ డనియు, నీకు మాల్యవంతుఁ డనియు, నామములు ఏహేతువుచేతఁ గలిగినవో చెప్పుము.

### పుష్పదంతునికి ఆపేరు గలిగిన కారణము.

కాణభూతి యి ట్లడుగఁగానే గుణాఢ్యుఁడు చెప్పసా గెను:—గంగాతీరమందు ఒక యగ్రహారము కలదు. దానిపేరు బహుసువర్ణకము. అందు గోవిందదత్తుఁ డని మహావిద్వాం సుఁడు బ్రాహ్మణుఁ డొకఁ డుండెను. ఆయన భార్యకు అగ్ని దత్తయని పేరు, ఆమె మహాపతివ్రత. వారికి కాలక్రమమున అయిదుగురు పుత్త్రులు కలిగిరి. వారు మూర్ఖులుగాను అంద గాండ్రని గర్వితులుగాను ఉండిరి. ఒకనాఁడు గోవిందదత్తుని యింటికి వైశ్వానరుఁ డనుపేరుగలఁవాఁడు సాక్షాత్తు వైశ్వాన

రుఁడే అనఁదగినవాఁడు అతిథి వచ్చి అతని కుమారులకే నమస్కారము చేసెను. వారు అతనికి ప్రతినమస్కారము చేయక నవ్వసాగిరి. అంత నతఁడు కోపముతో ఆయింటినుండి వెడలిపోనుండెను. అంతలో గోవిందదత్తుఁడు వచ్చి 'ఏల కోపగించిపోయెద' వని యాబ్రాహ్మణుని బతిమాలుకొని యడుగఁగా ఆయన 'నీపుత్త్రులు పతితులును మూర్ఖులును, కనుక నీ యింట నేను భోజనము చేయను; చేసితినేని నేను ప్రాయశ్చిత్తము చేసికోవలసి వచ్చును.' అనెను. అంతట గోవింద దత్తుఁడు ఆయనతో 'ఈ దుష్టపుత్త్రులను ఇఁక నే నెప్పుడును ముట్టుకోను,' అని ఒట్టు పెట్టుకొని ఆయనను ఇంటికి రమ్మని బతిమాలుకొనెను. అతనిభార్య కూడ వచ్చి అతిథిభక్తిచేత ఆప్రకారమే వేఁడెను. అంతట ఎట్టకేలకు అంగీకరించి వైశ్వానరుఁడు వారియింట ఆతిథ్యము గ్రహించెను.

ఆకుమారులలో ఒకఁడు దేవదత్తుఁ డనువాఁడు అదంతయు చూచుటచేతను గోవిందదత్తుని నెనరులేమిచేతను పశ్చాత్తాపము పొందినవాఁడై తల్లిదండ్రులకు కిట్టని తన జీవితము వ్యర్థమని తలపోసి విరక్తుఁడై తపస్సుకై బదరికాశ్రమమునకుఁ బోయెను. అక్కడ సాంబమూర్తిని గూర్చి తపస్సు చేయుచు, మొదట మొదట ఆకలములు తినియు, పిమ్మట పొగత్రాగియు, జీవించుచు చిరకాల ముండెను. అతని యుగ్రతపస్సునకు మెచ్చి శివుఁడును దర్శన మిచ్చెను. ఆదేవునికే తాను అనుచరుఁడుగా

నుండ వలయు నని అతఁడు వరము వేఁడెను. 'విద్యలను పొందుము, భూలోకములో భోగము లనుభవింపుము, పిమ్మట నీకోరిక సర్వము నెఱవేఱును.' అని శంకరుఁడు వర మిచ్చెను.

అంత నతఁడు విద్యార్థియై పాటలీపుత్త్రమునకు పోయి-అందు వేదకుంభుఁ డను నుపాధ్యాయుని యథావిధిగా శుశ్రూష చేసెను. అక్కడ నుండఁగా అతని నొకనాఁడు ఆయుపాధ్యాయునిభార్య కామాంకులయై ఆకస్మికముగా మదనకేళికి ప్రార్థించెను. ఆశ్చర్య మేమి? స్త్రీబుద్ధి అతి చపలముగదా! మదనునిచేఁ గలిగిన యుపద్రవమువలన ఆచోటు వదలి దేవదత్తుఁడు తెలివి గలవాఁడై ప్రతిష్ఠాన మనుపట్టణమునకు పోయెను. అక్కడ మంత్రస్వామి యను నొక ముసలియుపాధ్యాయుని ముసలిభార్య గలవానిని ఆశ్రయించి చక్కఁగా విద్యలు గ్రహించెను.

పూర్ణవిద్యుఁడును అందగాఁడును ఐన యీదేవదత్తుని అక్కడ నొకనాఁడు ఆపట్టణపురాజు సుశర్మ యనువాని కూఁతురు శ్రీ యనునది నారాయణుని లక్ష్మియుంబోలె చూచెను. కిటికీయం దున్న యాకన్యను అతఁడును చూచెను. అతని కన్నుల కామె విమాన మెక్కి చరించుచున్న చంద్రుని యధిదేవతయో యన సందియము చేయుచుండెను. అంత నాయిద్దఱును, వారిచూపు లనెడుగొలుసులచే మదనునిచేత సంకెలలు వైవఁబడిరో యనునట్లు ఉన్న చోటనుండి అవతలికి కదలి పోనేరకుండిరి.

అంత నారాజకన్య మూర్తీభవించిన మదనాజ్ఞనుంబోని తన వ్రేలితో దగ్గఱకు రమ్మని ఆకుమారునికి సంజ్ఞ చేసినది. అతఁడు సమీపమునకు పోఁగానే ఆరమణి యంతఃపురమునుండి ఒక పువ్వును అతనికేసి దంతముతో ఎగఁజిమ్మెను. రాజకన్య చేసిన యీగూఢసంజ్ఞయొక్క యభిప్రాయమును ఎఱుఁగనేరనివాఁడై అతఁడు ఏమి చేయనుం దోఁపక యుపాధ్యాయులవారి యింటికి పోయి, దొంగలచే ధనము కోలుపోయి లోలోపలనే ఎరియుచున్న మూఁగవానివలె ఏమి చెప్పుటకును శక్తుఁడుగాక భూమి మీఁదఁ బడి దొర్లసాగెను. కామచిహ్నములను బట్టి ఊహించి బుద్ధిమంతుఁడైన ఆ యుపాధ్యాయుఁడు వీనియవస్థకు కారణమును యుక్తిగా అడుగఁగా దేవదత్తుఁడు ఎట్టకేలకు జరిగిన వృత్తాంతమును చెప్పెను. దానిని తెలిసికొని నేర్పరియైన యా యుపాధ్యాయుఁ డిట్లనియె: “ఆసుందరి నీకేసి దంతముతో పువ్వును చిమ్మి సంకేత మేర్పఱిచినది. ‘ఇదిగో కలదే సమృద్ధిగా పువ్వులుగలది పుష్పదంత మనుదేవాలయము, అక్కడికి వచ్చి న న్నెదురుచూడుము. ఇప్పటికి పొమ్ము.’ అని యాకన్యయభిప్రాయము.” అమాట విని సంకేతార్థము తెలిసికొన్నవాఁడై ఆకుమారుఁడు పరితాపమును మాని ఆదేవాలయములోపలికి పోయి నిలిచి యుండెను. రాజకన్యయు అష్టమినెపమున అక్కడికి వచ్చి దేవదర్శనార్థము ఒంటరిగా గర్భగృహము లోనికిఁ బోయెను. పోఁగానే ద్వారబంధము వెనుక ప్రియుఁడు

లాగపడి లేచి ఆమెకంఠమును కౌఁగిలించుకొనెను, 'ఆశ్చర్యము! నాసంజ్ఞ నీ కెట్లు తెలిసినది?' అని యాసుందరి యడుగఁగా 'నాకు తెలియలేదు, ఉపాధ్యాయులవారు చెప్పినారు.' అని యతఁడు చెప్పెను. 'అంత నాయువతి వదలు నన్ను, నీవు జాణఁడవు గావు' అని కోపముతోను రహస్యము బైటఁబడునను భయముతోను అక్కడినుండి వెడలిపోయెను.

పుష్పదంతునికి పంచశిఖుఁడు తోడ్పడుట.

అంత నతఁడు చేతికి తాఁకియు తప్పిపోయిన యాప్రే యసినిగూర్చి ఏకాంతములో వగచుచు విరహాగ్నిని భరింపలేక ప్రాణము విడువ నుద్యోగించెను. అతని యీయవస్థను చూచి పూర్వమే అతనికి వరమిచ్చియున్న శంకరుఁడు, అతని కోరికను నెఱవేర్పు మని పంచశిఖుఁ డను ప్రమథుని కాజ్ఞ యిచ్చెను. ఆప్రమథోత్తముఁడు వచ్చి దేవదత్తు నోదార్చి అతనికి స్త్రీ వేషము వేసి తాను ముసలిబ్రాహ్మణునివేషము దాల్చికొని అతనిని వెంటఁబెట్టుకొని ఆరాజకన్యతండ్రియైన సుశర్మయొద్దకు పోయి 'రాజా! నాకొమారుఁడు ఎక్కడికో దేశాంతరముపోయి నాఁడు, అతనిని వెదకుటకు నేను పోవుచున్నాఁడను, ఈమె నాకోడలు, ఈమెను నీయొద్ద ఇల్లడ యుంచెదను, ఈమెను నీవు కాపాడి నాకు ఈవలయును' అనెను. ఆరాజు శాపభీతి చేత బ్రాహ్మణుఁడు కోరినట్లు చేయుటకు అంగీకరించి భద్ర మయిన పహారా కలిగిన తన కన్యాంతఃపురములోనే ఆ స్త్రీవేష పురుషుని ఉంచెను. పంచశిఖుఁడు తనదారిని పోయెను.

దేవదత్తుఁడు తన ప్రేయసియొక్క యంతఃపురములోనే నివసించి స్త్రీవేషమహిమచేత ఆమెకు త్వరగానే అంతరంగ మిత్త్రి మాయెను. ఒకనాఁడు రాత్రి ఎవ్వరును లేనప్పుడు ఆమెకు తన్ను తెలుపుకొని యుత్సుకురా లయినయామెను గాంధర్వవిధిచేత వివాహ మాయెను.

ఆమెకు గర్భము కాఁగానే దేవదత్తుఁడు తలఁచిన మాత్రమున ఆగణోత్తముఁడు వచ్చి యతనిని ఎవరికిని తెలియకుండ అంతఃపురమునుండి కొనిపోయి ఆతని స్త్రీవేషమును తీసివైచి తాను మునుపటి బ్రాహ్మణవేషమే ధరించి తెల్లవాఱఁగానే దేవదత్తుని వెంటఁబెట్టుకొని సుశర్మయొద్దకువచ్చి 'రాజా! వీఁడుగో నాకుమారుఁడు దొరకినాఁడు, కోడలిని పంపుము,' అని యడిగెను. అంత ఆమె ఆరాత్రియే ఎక్కడికో పలాయనమైన దని ఎఱిఁగినవాఁడై రాజు విప్రశాపమునకు వెఱచి మంత్రులతో ని ట్లనియె:—

శిబిచక్రవర్తికథ.

మంత్రులారా! ఇతఁడు బ్రాహ్మణుఁడు గాఁడు, ఇతఁడు ఎవరో దేవుఁడు; నన్ను మోసము చేయుటకై ఈరూపమున వచ్చినాఁడు; ఎప్పటికిని ఇట్టివృత్తాంతములు కలవు. ఇందునకు నిదర్శనము చెప్పెదను వినుఁడు: పూర్వము తపస్వి కరుణాత్ముఁడు దాత ధీరుఁడు సకలప్రాణులకు అభయ మిచ్చువాఁడును అయిన శిబి యను మహారాజు ఉండెను. ఒకప్పుడు అతనిని

వంచించుటకు ఇంద్రుఁడు తాను డేగరూపమును ధరించి అట్లే మాయపావురమయిన యమధర్మరాజును తఱుముకొని వచ్చెను. పావురము గుండెలు తటతట కొట్టుకొనుచు పోయి శిబియొడిలోఁ దూఱెను. అంత నాడేగ మనుష్యవాక్కుతో రాజుతో 'రాజా! నాకు ఆఁకలిగా నున్నది, నాయాహార మయిన యీ పావురమును విడిచిపెట్టుము, విడువవేని ఇప్పుడే నాప్రాణము పోవును, అందువలన నీకేమి ధర్మము కలుగును?' అనెను. అంతట శిబిచక్రవర్తి 'ఇది నన్ను శరణుఁ జొచ్చినది, దీనిని వదలఁగూడదు; కనుక దీనికి సమాన మయిన వేఱుమాంసమును నీ కిచ్చెదను.' అనెను. అందునకు డేగ 'అట్లయిన యెడల నాకు నీమాంసమునే యిమ్ము' అనెను. అందులకు సంతోషముతో రాజు అంగీకరించెను. అంతట రాజు తన మాంసమును కాటాలో ఎంతెంత కోసి యుంచినను పావురము వైపుననే కాటా క్రమ్మొగ్గుచుండెను. రాజు తనయావచ్ఛరీరమును తులలో నుంపించెను. అంతట బళి బళి యని ఆకాశవాణి పలికెను. ఇంద్ర యములు సంతోషించి పక్షిరూపములు మాని నిజరూపములతో అగపడి రాజునకు వజ్రదేహ మిచ్చి ఇంకను వరము లిచ్చి అంతర్ధాన మైరి. అట్లే నన్నుఁ గూడ పరీక్ష చేయుటకు ఇతఁ డెవరో వచ్చియున్నాఁడు.

మంత్రులతో నిట్లు పలికి సుశర్మ ఆమాయబ్రాహ్మణునికి భయవినయములతో నిట్లనియె. 'అయ్యా! నాకు అభయదానము చేయుము, నీకోడలిని ఈరాత్రియే ఎవరో హరించు

కొనిపోయినారు. రేయుంబవలు మేము రక్షించుచున్నను మాయచేసి ఎక్కడికో పోయినది.' అంత నాబ్రాహ్మణుడు ఎట్టకేలకు కనికరించినవాడునుంబోలె 'అట్లయిన ఓరాజా! నాకుమారునికి నీకొమారితను ఇమ్ము' అనెను. అంత రాజు శాపమునకు భయపడి తనకొమారితను దేవదత్తునికి ఇచ్చి ఇల్లటము ంచుకొనెను. పంచశిఖుడు కైలాసమునకుపోయెను. ఇప్పుడు తనప్రియను బహిరంగముగా పొందినవాడై దేవదత్తుడు పుత్త్రహీనుం డయిన యామామగారి యైశ్వర్యము నంతయు తానే అనుభవించుచుండెను. కాలక్రమమున సుశర్మ తన దౌహిత్రుని పట్టాభిషిక్తునిం జేసి తాను తపస్సునకు పోయెను.

దేవదత్తుడు కూడ తన కుమారుని యైశ్వర్యమును చూచి సంతోషించి యారాజపుత్త్రితో కూడ తానును తపస్సునకై వనమునకు పోయెను. అచ్చట శంభు నారాధించి మనుష్యదేహమును వదలి శంభుప్రసాదముచేత ప్రమథుండాయెను. ప్రియ దంతక్షతికో పుష్పమును చిమ్మినసంజ్ఞను తెలిసికోలేకపోయినాడు గాన అతడు గణసమాజములో పుష్పదంతు డను పేర ప్రసిద్ధుం డాయెను. ఆతనిభార్య జయ యను పేర పార్వతికి ప్రతీహారి యైనది. ఈప్రకారము అతనికి పుష్పదంతుం డని పేరు గలిగినది.

### మాల్యవంతునికి ఆపేరు గలిగిన కారణము.

నా పేరుయొక్క కథను ఇంక వినుము. దేవదత్తునితండ్రి గోవిందదత్తుం డుండెను గదా, నేను ఆతనికుమారులలో మఱి

యొకఁడను, సోమదత్తుఁ డనువాఁడను. నేనును తండ్రి మ మ్మనాదరణచేసిన యాదుఃఖముచేతనే హిమాచలములో శంకరుని అనేకమాల్యములతో పూజించుచు తపస్సు చేసితిని. అంత చంద్రశేఖరుఁడు ప్రసన్నుఁడై నాకు దర్శన మిచ్చి నేను భోగములను కోరక గణత్వమునే కోరఁగా దానినే నాకు ప్రసాదించెను. 'మనుష్యులకు అగమ్యము లయిన వనభూముల నుండి తెచ్చిన పువ్వుల మాల్యములతో మమ్ము పూజించితివి గాన నీకు మాల్యవంతుఁ డని పేరు ఇచ్చినాఁడ' ననియు పార్వతీపతి నాకు ఆనతిచ్చెను. అంత నేను మనుష్యదేహమును వదలి వెంటనే ప్రమథుఁడ నైతిని. ఇది సుమా నాకు ధూర్జటిప్రసాదముచేత మాల్యవంతుఁ డని పేరు గలిగినక్రమము.

కాణభూతీ! నేను మరల నా యభాగ్యతచేత గౌరి శాపమువలన మనుష్యత్వమును పొందినాఁడను. ఇఁకను చెప్ప వయ్యా హరప్రోక్త మయినయీకథను, అందుచే మన కిద్దఱకు శాపమోక్షము కలుగునుగాక.

---

## ౮-వ తరంగము.

గుణాఢ్యుఁడు బృహత్కథను సాతవాహనునికి పంపుట.

ఇట్లు గుణాఢ్యుఁ డడుగఁగా ఏడుకథలుగా నున్న యీ మహాద్భుత దివ్యకథను కాణభూతి తనభాషలోనే చెప్పెను.

గుణాఢ్యుఁడును దానిని ఆపైశాచీభాషయందే ఏడు సంవత్సర ములలో ఏడు లక్షల గ్రంథముగా రచియించెను. విద్యాధరులు దానిని హరింపకుందురుగాక యనియు, అడవిలో సిరా లేనందుచేతను, ఆమహాకవి దానిని తనయొక్క రక్తముతోనే వ్రాసెను. అయినను దానిని వినుటకు వచ్చిన సిద్ధవిద్యాధరాదులచేత ఆకాశమున కొకచాందినీ కలిగినట్లుండెను. గుణాఢ్యుఁడు రచియించిన యీమహాకథను చూచి శాపవిముక్తుఁడై కాణభూతి తన దివ్యగతిని పొందెను. అతనితో నున్న యితర పిశాచములు కూడను ఆదివ్యకథను విని స్వర్గమునకు పోయిరి.

'ఈకథను నేను భూమిలో స్థాపింపవలసి యున్నది. నాకు ఆప్రకారమే శాపావసానమును దేవి యనుగ్రహించి యున్నది. దీనిని ఎట్లు ప్రకటింతును? ఎవనికి ఇత్తును?' అని యచ్చట నాగుణాఢ్యమహాకవి చింతించుచుండెను. అంతట ఆయనతో కూడ వచ్చినశిష్యులు గుణదేవుఁడు నందిదేవుఁడు ననువారు ఆయనతో ఇట్లనిరి. 'ఈకావ్యము నర్పించుటకు పాత్ర మయిన వాఁడు ఒక్క శ్రీసాతవాహనుఁడు, అతఁడు రసికుఁడు, పువ్వుల సౌరభమును వాయువు వహించునట్లు అతఁడు ఈకావ్యమును వహింపఁగలఁడు.' అందునకు గుణాఢ్యుఁడంగీకరించి ఆశిష్యుల నిద్దఱను ఆపుస్తకముతో సాతవాహనమహారాజు నొద్దకు పంపెను. తానును బోయి ప్రతిష్ఠానపురమునకు వెలుపలి దేవీకృతోద్యానమందు సంకేత మేర్పఱిచి కూర్చుండెను. శిష్యు

లును సాతవాహనమహారాజును దర్శించి గుణాఢ్యుఁడు చేసి నది యని యాపుస్తకమును అతనికి నివేదించిరి. వారు పిశాచ రూపులుగా నుండుటను గ్రంథము పిశాచభాషగా నుండుటను చూచి విద్యామదముచేత అతఁడు అసూయతో నిట్లనియె: 'పరిమితి ఏడు లక్షలు, భాష నీరస మయినపైశాచి, సిరా రక్తము, ఛీ! ఏమి పాడుకథ యిది!' అంత నాశిష్యులు పుస్తకమును పుచ్చుకొని వచ్చినవారు వచ్చినట్లే పోయి జరిగి నది జరిగినట్లు గుణాఢ్యునికి నివేదించిరి. గుణాఢ్యుఁడును దానిని విన్న వెంటనే ఖేదపడసాగెను. తెలిసినవాఁడు అవమానించిన ఎవఁడు దుఃఖపడఁడు?

అంతట గుణాఢ్యుఁ డక్కడికి విశేషదూరముగాని యొక పర్వతమునకు శిష్యులతోకూడ పోయి అందొక యేకాంత మయిన రమ్యప్రదేశములో తనయెదుట అగ్నికుండము చేసికొని కూర్చుండెను. అందు శిష్యులు కన్నీళ్లతో చూచుచుండఁగా ఒక్కొక్క యాకుగా చదివి మృగములకు పక్షులకును వినిపించి, శిష్యులకోసమై వారి కత్యంతప్రియమును లక్షగ్రంథాత్మక మును అయిన నరవాహనదత్తచరిత్ర మను నొక కథను తప్ప కడమ యంతయు కాల్చివైచెను. ఆప్రకారము ఆమహాకవి యా దివ్యకథను చదువుచును కాల్చుచును ఉండఁగా సారంగవరాహ మహిషాది సకలజంతువులు అక్కడికి వచ్చి చుట్టును బారులు తీరి గడ్డి మేయుట మాని కన్నీళ్లతో ఇటు నటు చలింపక ఏకాగ్రముగా వినుచుండెను.

ఈలోపల సాతవాహనమహారాజు అస్వస్థుఁ డాయెను. అందుల కారణము నీరసమాంసభోజన మని వైద్యులు చెప్పినారు. అంతట రాజు వంటవాండ్రను పిలిచి యదలింపఁగా వారు తమకు వేఁటకాండ్రు ఱట్టిమాంసమును తెచ్చి యిచ్చినారని పలికిరి. వేఁటకాండ్ర నడుగఁగా వారు 'ప్రభూ! ఇక్కడ ఈపర్వతములో ఒక బ్రాహ్మణుఁడు ఒక్కొక్కపత్త్రిమును చదివి నిప్పులో వైచుచున్నాఁడు. సకలప్రాణులును అక్కడికి వచ్చి మేఁతలు మాని వినుచున్నవి, అవతలికి పోవు, అందుచేత వానిమాంసము ఆఁకటివలన ఎండిపోయి యున్నది.' అని విన్నవించుకొనిరి. వేఁటకాండ్ర యామాటను విని వారినే ముందు నడువ నియమించి, కుతూహలముచేత రాజు స్వయముగా గుణాఢ్యుఁ డున్నచోటికి పోయి, శమింపఁగా మిగిలిన శాపాగ్నిధూమికలచేతనుంబోలె వనవాసమువలన నైనజటలచేత అంతట సమాకీర్ణుఁడై యున్న గుణాఢ్యమహాకవిని చూచెను. సబాష్పము లైనమృగములనడుమ నున్నయాతనిని ఆనవాలుపట్టి నమస్కరించి ఆవృత్తాంతమును రాజు అడిగెను. గుణాఢ్యుఁడు రాజునకు పుష్పదంతునిశాపము మొదలయిన కథావతారము నంతయు భూతభాషలోనే చెప్పెను.

అంత నతని ప్రమథావతార మని యెఱిఁగి పాదములకు మ్రొక్కి రాజు హరముఖోద్గత మయిన యాదివ్యకథను తనకు దయచేయు మని వేఁడుకొనెను. అంతట గుణాఢ్యుఁడు సాత

వాహనునితో నిట్లనియె: 'రాజా! ఆఱులక్షల గ్రంథమైన యాఱుకథలను కాల్చివైచితిని; ఇది లక్షగ్రంథము, ఆకథలలోనే ఒకటి, మిగిలి యున్నది; పుచ్చుకొమ్ము; నాశిష్యులు కూడ నీతో వచ్చి దానిని వివరింపఁగలరు.' ఇట్లు చెప్పి రాజును వీడ్కొని యోగముచేత ఆదేహమును వదలి గుణాఢ్యుఁడు శాపవిముక్తుఁడై తన దివ్యపదమును పొందెను. అట్లు గుణాఢ్యుఁ డిచ్చినదానిని బృహత్కథ యనుపేరిటి యాసరవాహనదత్త చరిత్రమును గ్రహించి రాజు తన నగరము చేరి, ఆకథ వ్రాసిన కవికి శిష్యు లయిన గుణదేవ నందిదేవులను మణికనకవస్త్ర వాహనగృహాగ్రహారాదిధనము లిచ్చి సత్కరించెను. ఆశిష్యులతో కూడి ఆకథను విభజించి ఆభాషలోనే కథావతారమును తెలుపుటకై యీకథాపీఠమును రచియించెను. ఆకథయు చిత్రరసము తొలఁకుచున్నదై దేవకథలను కూడ మఱపించి ఆనగరములో మాత్రమే గాక మూఁడులోకములలోను ఖ్యాతిఁ బొందిన దాయెను.

కథాపీఠలంబకము ముగిసినది.

———

శ్రీ

కథాముఖ లంబకము



ఉ. గౌరిని నాత్మసంగతిని గౌఁగిట గ్రుచ్చుము పేఁచుమేనిపైఁ
బూరిత మైనఘర్మలవపూరము మన్మథుఁ డాత్మభీయాద్వ
గ్భారితరానలార్చికనుభూతిభయంబున నేసినట్టి య
వ్వారుణ బాణరాజ మనఁ బాటిలునట్టిది ప్రోచు నిచ్చలుఁ.

శివుని ముఖమునుండి పుష్పదంతుని, వరరుచిగా నవత రించిన యాపుష్పదంతునివలననుండి కాణభూతిని, అతనినుండి గుణాఢ్యుని, గుణాఢ్యునినుండి సాతవాహనుని సంక్రమించిన మహాద్భుతమయిన యావిద్యాధరకథను వినుండు.

శ తా నీ కు ని క థ.

వత్స మని దేశ మొకటి కలదు. అది స్వర్గముయొక్క గర్వము నణఁచుటకు ప్రతిద్వంద్విగా బ్రహ్మదేవునిచే భూలోక ములో సృజియింపఁబడినదో యన భాసిల్లుచుండును. దానినడుమ భూమి యను కమలముయొక్క గద్దియయో యన లక్ష్మీవిలాస మున కాటపట్టయి కౌశాంబి యనురాజధాని కలదు. ఆపట్టణ మందు పాండవవంశ సంభవుండును పరీక్షిత్తునకు మనుమఁడును జనమేజయునకు కొడుకును అగు శతానీకుఁ డనురాజు ఏలుచుం డెను. ఎవని బాహుదండవిక్రమమును త్రిపురాంతకునిభుజ

స్తంభములు రుచిచూచినవో ఆయర్జునుఁడును అతని కుమారుఁ డభిమన్యుఁడును ఎవనికి మూలపురుషుఁడును ముత్తాతయు నైరో మహానుభావుఁడైన యాశతానీకునికి భూమియు, వసుమతియు, అను నిద్దఱు భార్యలున్నను వారిలో భూమిమాత్రము అనంతరత్నములను కన్నదే గాని వసుమతి చిరకాలమువఱకు పుత్త్రరత్నమును కన దాయెను.

ఒకప్పుడు వేఁటకై అడవిలో ఇక్కడికక్కడికి తిరుగుచున్న యారాజునకు అక్కడ తపస్సు చేయుచున్న శాండిల్యమునితో పరిచయము కలిగెను. పుత్త్రార్థియైన యారాజుతో కూడ ఆయన కౌశాంబికి వచ్చి పుత్త్రకామేష్టి చేసి మంత్రసిద్ధమైనపాయసము రాణికి త్రాగ నిచ్చెను. అంత నారాజునకు సహస్రానీకుఁడు ఉదయించెను. వానిచేత తండ్రి వినయముచే గుణముం బోలె శోభించుచుండెను. పిమ్మట ఆకుమారుని యువరాజునుగా నభిషేకించి శతానీకుఁడు తాను రాజ్యభారచింతల చేతఁ గాక భోగములచేతమాత్రమే రా జయి యుండెను.

శతానీకుఁడు దేవేంద్రునికి తోడ్పడుట.

అట్లుండఁగా ఇంద్రునికి రాక్షసులతో యుద్ధము సంభవింపఁగా అతఁడు శతానీకుని తోడి తెమ్మని మాతలిని రాయబారము పంపెను. అంతట ధురంధరుఁడైనయుగంధరుఁ డనుమంత్రిచేతిలో కుమారుని ఉంచి, రాజ్యమును అతనికిని సుప్రతీకుఁ డనుముఖ్యసేనాపతికిని ఒప్పగించి, శతానీకుఁడు

యుద్ధములో రాక్షసులను చంపువాఁడై మాతలితోఁ గూడ నింద్రసన్నిధికి పోయెను. అచ్చట ఇంద్రుఁడు ప్రత్యక్షముగా చూచుచుండఁగానే యమదంష్ట్రుఁడు మొదలయినయసురుల ననేకులను చంపి ఆయుద్ధములోనే శతానీకుఁడు మరణము నొందెను. అతనిదేహమును మరల మాతలి భూలోకమునకు తేఁగా వానితో అతనిపట్టపుదేవి సహగమనము చేసెను.

అంతట రాజలక్ష్మి అతనికుమారుని సహస్రానీకుని వరించెను. అంత నేమియాశ్చర్యమో, అతఁడు తండ్రిసింహాసనము నెక్కఁగానే రాజు లందఱయు తలలు వంగిపోయినవి. అప్పుడు ఇంద్రుఁడు శత్రుజయోత్సవము చేయుచు అందులకు తనమిత్రపుత్త్రుఁ డయినసహస్రానీకుని మాతలిచేత రావించుకొనెను. అక్కడ నారాజు నందనవనములో అప్సరసలతో విహరించుచున్న దేవతలను చూచి తనకు తగినభార్య లేక చింతాక్రాంతుఁడై యుండెను. అతని యాయభిప్రాయమును తెలిసికొని ఇంద్రుఁ డతనితో నిట్లనియె:

రాజా! చింతింపకుము, నీకోరిక సిద్ధించును. నీకై ఏర్పడినట్టిది నీకు తగినభార్య భూలోకములో పుట్టియే యున్నది. ఇదిగో నేను చెప్పెడు నీవృత్తాంతమును వినుము. పూర్వము బ్రహ్మదేవుని చూచుటకు ఆయనసభకు పోయియుంటిని. నా తర్వాత అక్కడికి విధూముఁ డనునొకవసువు వచ్చెను. మే మచ్చట నుండఁగా అక్కడికి అలంబుష యను నప్సరస

వచ్చెను. దానివస్త్రము గాలికి కొంచెము తొలిపోఁగా చూచి యీవసువు కామవికారమునకు పాలాయెను. దానిచూపులును అతనిరూపలావణ్యములలో తగులుకొనెను. దాని నెఱింగి బ్రహ్మదేవుఁడు నాముఖము చూచెను. నేనును ఆయనయభిప్రాయము నెఱిఁగి వారి నిద్దఱను అవినీతులారా! మీ రిద్దఱు మనుష్యలోకములో పుట్టి భార్యాపతులు అగుదురుగాక అని కోపముతో శపించినాఁడను. ఓ సహస్రానీకా అవసువవే నీవు, చంద్రవంశమునకు అలంకారముగా శతానీకునికి పుత్త్రుఁడవయి నాఁడవు. ఆయప్సరస మృగావతి యనుపేర అయోధ్యయందు కృతవర్మ యనురాజునకు కూఁతురై పుట్టి యున్నది. ఆమె నీకు భార్య కాఁగలదు.

ఈ యింద్రవచన మారుతముచేత అతనిమనస్సులోని మదనానలము మఱియు పెల్లుబ్బి జ్వలింపసాగెను. అంతట ఇంద్రుఁడు సమ్మానించి తనరథముననే యెక్కించి పంపఁగా సహస్రానీకుఁడు మాతలితో కూడ నిజనగరమునకుఁ బయలువెడలెను. పోవుచుండఁగా తిలోత్తమ యనునప్సరస అతనితో ప్రీతిచే 'రాజా! నీ కొకమాట చెప్పెదను క్షణము నిలువుము' అనెను. మృగావతినే ధ్యానించుచు శతానీకుఁడు ఆమాటయే వినఁబడక వెడలిపోయెను. అంత నాయప్సరస సిగ్గుపడినదై 'రాజా! ఎవతెను ధ్యానించుచు నామాటను వినకయే పోయితివో ఆమృగావతితో నీకు పదునాలుగు సంవత్సరములు

ఎడఁబాపు గలుగునుగాక' అని కోపముతో శపించెను. ఆశా పము మాతలికిమాత్రమే వినఁబడెను. రథము నడువఁగా రాజు ప్రియోత్సుకుఁడై దేహముచేత కౌశాంబికిని మనస్సుచేత అయోధ్యకును పోయెను.

### శతానీకుఁడు మృగావతిని పెండ్లి యగుట.

పోయి ఇంద్రునివలన మృగావతిని గుఱించి తాను విన్నవృత్తాంత మంతయు ఉత్సుకతతో యుగంధరాదిమం త్రులకు చెప్పెను. వెంటనే కాలక్షేపము నోర్వనివాఁడై తనకు వివాహార్థమై మృగావతి నిమ్మని యడుగుటకు ఆమె తండ్రి యైన కృతవర్మయొద్దకు అయోధ్యకు దూతలను పంపెను. కృతవర్మ ఆదూత్యమును సంతోషముతో తనదేవికి చెప్పెను. ఆమెయు ఆయనతో అవశ్యముగా సహస్రానీకునికి తమపిల్లను ఈవలసిన దనియు అట్లు తనకు స్వప్నములో ఒక బ్రాహ్మణుఁడు తెలిపె ననియు చెప్పెను. అంతట సంతో షించి రాజు మృగావతియొక్క అసమానము లయిన రూపలావ ణ్యములను నృత్తగీతాదికౌశలమును ఆదూతలకు చూపించిన వాఁడై చంద్రునియొక్క రమణీయ కళ లన్నియు ఒకటిగా మూర్తీభవించినదో యనున ట్లున్న యామృగావతిని సహస్రా నీకునికి ఇచ్చెను. ఆమృగావతీ సహస్రానీకులకూటమి ఒకరి గుణ ములు ఒకరిచేత భాసించుటవలన ప్రజ్ఞాశ్రుతములకూటమి వలె నొప్పుచుండెను.

పిమ్మట త్వరలోనే అతనిమంత్రులకు కుమారులు గలిగినారు. యుగంధరునికి యౌగంధరాయణుఁడును, సుప్రతీకునికి రుమణ్వంతుఁడును, హాస్యసచివుఁ డైనవానికి వసంతకుఁడును, గలిగిరి. క్రమముగా మృగావతీదేవికూడ గర్భము దాల్చి పాండుప్రభ వెదచల్లుచున్న ముఖముతో వెలుఁగుచుండెను.

గర్భిణిని మృగావతిని పక్షి తన్నుకొనిపోవుట.

ఒకనాఁడు వేవిళ్లచేత ఆమె తన్ను తెప్పవాల్పక తనివి తీఱక చూచుచున్నకాంతునితో తనకు నెత్తురుతో నిండిన క్రీడావాపికలో స్నానము చేయఁ గోరికగా నున్న దని చెప్పఁ కొనెను. ఆమెకోరికను తీర్చువాఁడై ధార్మికుఁ డైన యీ రాజు బావిని లత్తుకరసము మొదలయిన కృత్రిమసాధనముఁ చేత రక్తమయముగానే అగపడునట్లు సిద్ధము చేయించెను. అందు స్నానము చేయుచు లత్తుకమయిగా నున్నయాదేవిని మాంసభ్రమచేత గరుడవంశము దైన పక్షి యొకటి తన్నుకొని పోయెను. పక్షి తన్నుకొనిపోయినప్రియతమను వెదకుటకో యనునట్లు సహస్రానీకునిధైర్యము కూడ ఆక్షణమే వెడలిపోయెను. ప్రియానురక్తమయిన యతని మనస్సును కూడ నిశ్చయముగా పక్షి హరించెను; కానియెడల నిస్సంజ్ఞుఁడై అతఁ డేల భూమిమీఁద పడెను? క్షణములో రాజునకు మూర్ఛ తేరఁగా ఆవృత్తాంతమును దివ్యమహిమచేత నెఱిఁగినవాఁడై మాతలి ఆకాశమార్గమున వచ్చి రాజును ఓదార్చి తిలోత్తమా

శాపమును దానియంతమును చెప్పి వెడలిపోయెను. అంత నారాజు 'ఓప్రాణేశ్వరీ! ఆపాపాత్మురాలు తిలోత్తమకోరి కలు నిండినవి' ఇత్యాదివచనముల విలపించుచుండెను. శాప వృత్తాంతము తెలిసినందునను మంత్రులు ఓదార్చుటచేతను కొంచెము ధైర్యము తెచ్చుకొని మరల సమాగమము కలుగునుగదా యనునాశచేత ఎట్టకేలకు ప్రాణములు నిలుపుకొని యుండెను.

ఆపక్షీంద్రుండు ఆమెను క్షణములో కొనిపోయి బ్రదికి యున్న దని తెలిసికొని దైవయోగమున ఉదయపర్వతములో ఎడిచిపెట్టి పోఁగానే ఆమె శోకభయములచే కలంగుచు తాను దిక్కులేక నరులకు గమ్యముగాని యొక కొండచఱియ యం దుండుటను తెలిసికొనెను ఏకాకియు ఏకవస్త్రయునై విలపించుచున్న మృగావతిని ఒక గొప్ప కొండచిలువ ఆహారార్థము దిగమ్రింగ వచ్చెను. ఆమెకు ముందు విశేష శుభము రానున్నది గాన ఆసమయములో ఒకదివ్యపురుషుఁడు వచ్చి ఆయజగరమును చంపి అగపడియు అగపడకయే అంతర్ధానము పొందెను. అంత నామె ఏవిధమున నైనను ప్రాణత్యాగము చేయఁగోరినదై ఒక యడవియేనుఁగును చూచి దాని కాళ్లముందఱ పడెను. అదియు దయతో రక్షించెను. ఆశ్చర్యము! ఘాతుకజంతువుకూడ ఆమెను ఎదుటఁబడినను చంపదాయెను! ఆశ్చర్య మేమి? ఈశ్వరేచ్ఛ యున్నయెడల ఏమి జరుగదు!

అంతట గర్భభరాలసయైన యామృగావతి ప్రాణములు విడుచుటకై చఱియనుండి క్రిందికి పడఁదలఁచినదై భర్తను తలంచుకొని ఎలుఁగెత్తి యేడువసాగెను.

మృగావతి జమదగ్ని యాశ్రమమున నుండుట.

ఆరోదనమును ఆసమయములో సమీపమునకు కందమూలఫలములకై వచ్చియున్న మునికుమారుఁ డొకఁడు విని వచ్చి మూర్తీభవించిన వగపో యన నున్న యాదేవినిఁ జూచి దయార్ద్రహృదయుఁడై జమదగ్ని మహాముని యాశ్రమమునకు కొనిపోయెను. అచ్చట నాయుదయపర్వతమును తన తేజస్సు చేత సదా బాలసూర్యుఁడు కలదానినిగాఁ జేయుచున్న వానిని జమదగ్నిని కాంచి మృగావతి ఆయనపాదములకు మ్రొక్కెను. ఆశ్రితవత్సలుఁడును దివ్యదృష్టి కలవాఁడు నయినయాముని ఆమెను చూచి 'అమ్మా! వగవకమ్మా వగవకు, నీగర్భమున తండ్రికి వంశవర్ధనుఁడైన కుమారుఁడు కలుగును, మరల నీకు భర్తతో సంగమము కలుగును.' అని యనుగ్రహించెను. అంత నాపతివ్రత ఆయాశ్రమములోనే తాను నిలిచియుండి మనస్సునుమాత్రము ప్రాణేశ్వరునిమీఁద నిలిపి యుంచెను.

మృగావతి కుమారునకు ఆకాశవాణి ఉదయనుఁడని పేరుపెట్టుట.

పిమ్మట కొన్నాళ్లకు అక్కడనే ఆమెకు సత్సంగతికి ఆచారముంబోలె పుత్త్రరత్నము ఒకటి యుదయించెను. ఆసమయంబున మృగావతికి కర్ణోత్సవము చేయుచు ఆకాశవాణి

అంతట రాజు కాంతమీఁది చింతచేత ఎంతసేపటికిని ముగియని యాదినమును ఎట్టకేలకుఁ గడపి వానినే దారినడపు మని ప్రియతమను అతిశీఘ్రముగా చూడఁ గోరినవాఁడై సైన్య ములతోఁకూడ ఉదయాద్రియందలి యాజమదగ్నియాశ్రమ మునకు తరలెను.

---

## ౨-వ తరంగము.

అంత నారాజు ఆదినము కడుదూరము పోయి ఒక చోట అడవిలో నొకతటాకముగట్టున బసచేసి బడలిక చేత శయనమందు పరుండి సంగతకుఁ డనుకథకుని పిలిచి 'సంగ తకా! మృగావతీముఖకమలదర్శనోత్సవమునకై ఉవ్విళ్లూరు చున్న నాహృదయమునకు వినోదకర మయినకథ యొకటి చెప్పుము.' అనెను. సంగతకుఁ డిట్లనియె:—ప్రభూ! ఏల వృథా ఆయాసపడియెదవు, శాపముతీఱి దేవితోడి సమాగమము నీకు సమీపించియే గదా ఉన్నది. మనుష్యులకు సంయోగములును వియోగములును ఎన్నియేని కలుగును; అందులకు దృష్టాంత ముగా ఈ కథను వినుము.

### శ్రీ ద త్తు ని క థ.

పూర్వము మాళవములో యజ్ఞసేనుఁ డని బ్రాహ్మణుఁ డొకఁ డుండెను. ఆసజ్జనునికి జనప్రియము లయిన యిద్దఱుకుమా

రులు ఉండిరి. వారిలో ఒకనిపేరు కాలనేమి, రెండవవానిపేరు విగతభయుఁడు. తండ్రి స్వర్గస్థుఁడు కాఁగా ఆయన్నదమ్ములు బాల్యము దాఁటినవారై విద్యార్థము పాటలీపుత్రనగరము నకు పోయిరి. అచ్చట వారికి సకలవిద్యలును ముగియఁగానే ఉపాధ్యాయుఁడు వారిద్దఱకును తనకొమార్తెల నిద్దఱను మూర్తీభవించినవిద్యలనుం బోలె ఇచ్చి వివాహముచేసెను. పిమ్మట కాలనేమి ధనికు లయిన యితరగృహస్థులనుచూచి ఈర్ష్య పూని తాను వ్రతము చేసి హోమములచేత శ్రీదేవిని ప్రత్యక్షము చేసికొనెను. శ్రీదేవి సంతోషించి అతని కిట్లని వర మిచ్చెను: 'నీకు విస్తారము ధనము కలుగును, రాజు కాఁగల కొడుకు కొకఁడు నీకు పుట్టును. కాని చిట్ట చివర నీకు దొంగచావు సంభవించును. ఎందుచేత ననఁగా నీవు ఓర్వలేమిచే కలుషమయిన మనస్సుతో హోమము చేసితివి.' ఇట్లు చెప్పి మహాలక్ష్మి అంతర్హితురాలాయెను.

క్రమముగా కాలనేమియు మహాధనుఁ డాయెను, పుత్త్రుఁడును కలిగెను. శ్రీవరముచేత పుట్టినకారణమున వానికి పూర్ణమనోరథుఁడై తండ్రి శ్రీదత్తుఁ డని పేరు పెట్టెను. క్రమముగా ఆ శ్రీదత్తుఁడు వృద్ధి పొంది బ్రాహ్మణుఁ డయ్యును అస్త్రములయందును మల్లయుద్ధములయందును లోకములో ఈడు లేనివాఁ డాయెను. కాలనేమితమ్ముఁడు విగతభయుఁడు తనభార్య పాము కఱచి మృతిఁబొందఁగా వైరాగ్యముచేత తీర్థయాత్రాభి

లాషితుఁడై దేశాంతరము పోయెను. గుణగ్రహణ పరాయణుఁ డయిన వల్లభశక్తి యనురాజు శ్రీదత్తుని తనకుమారునికి విక్రమ శక్తికి చెలికానిఁగా చేసెను. మానియు బలియు నయిన యా శ్రీదత్తునికి బాల్యముందే దుర్యోధనునితో భీమసేనునికిఁ బోలె ఆరాజకుమారునితో సహవాసము కలిగెను. ఈబ్రాహ్మణ కుమారునికి బాహుశాలియు వజ్రముష్టియు ననువారిద్దఱు క్షత్రియకుమారులు అవంతిదేశస్థులు మిత్త్రములయిరి. బాహు యుద్ధములో అతనికి ఓడిపోయిన గుణగ్రాహులు దాక్షిణా త్యులు మహాబలుఁడు వ్యాఘ్రభటుఁడు ఉపేంద్రబలుఁడు నిష్ఠు రకుఁడు ననుమంత్రిపుత్త్రులు తాముగానే వచ్చి చెలిమి చేసి కొని అతని నాశ్రయించిరి.

ఒకనాఁడు వర్షాకాలములో శ్రీదత్తుఁడు మిత్త్రుల తోను రాజపుత్త్రునితోను గంగదరిని సికారిపోయెను. అచ్చట విక్రమశక్తిని అతనిభృత్యులు క్రీడార్థము రాజును చేసిరి. శ్రీ దత్తుని అతనిమిత్త్రులును రాజును చేసిరి. అంతమాత్రమునకే రోషము గలిగి రాజపుత్త్రుఁడు మదముచేత ఆబాపనవస్తాదును యుద్ధమునకు పిలిచెను. శ్రీదత్తునికి బాహుయుద్ధములో ఓడి అవమానదగ్ధమానసుఁడై విక్రమశక్తి దినదినమునకును బల పడుచున్న యా శ్రీదత్తుని కడతేర్పవలయు నని మనస్సులో నిశ్చయించుకొనెను. వాని యీయభిప్రాయము నెఱిఁగి శ్రీద త్తుఁడు భయపడి తనమిత్త్రులతో కూడ వానిదగ్గఱనుండి వెడలి

పోయెను. పోవుచు సముద్ర మధ్యగత యైనలక్ష్మియుం బోలె గంగాప్రవాహమధ్యమందు మునుఁగుచు తేలుచు కొట్టుకొని పోవుచున్న యొక్క స్త్రీని చూచి, బాహుశాలి మొదలయిన చెలికాండ్రను ఆఱుగురను గట్టున నుండుం డని తాను ఆమెను రక్షించుటకై గంగలో దిగెను. జడమాత్రము ఇతనికి దొరకినను ఆమె నీళ్లలో దూరాన మునిఁగిపోయెను. ఈవీరుఁడును కూడనే మునిఁగెను.

శ్రీదత్తుఁడు విద్యుత్ప్రభను దర్శించుట.

మునుఁగఁగానే శ్రీదత్తునికి ఒకశివాలయము అగపడెను. స్త్రీ అగపడలేదు. జలము అగపడలేదు. అందుల కాశ్చర్యపడి శివుని దర్శించి నమస్కరించి, రమణీయ మయినయక్కడి యుద్యానములో నారాత్రి విశ్రమించెను. తెల్లవాఱఁగానే స్త్రీగుణాతిశయములతోఁగూడ మూర్తీభవించిన సౌందర్యలక్ష్మియో యన నాచంద్రముఖి శివుని పూజించుటకై అక్కడికి వచ్చి శ్రీదత్తునికి నేత్రోత్సవము చేసి ఈశ్వరుని పూజించి తనయింటికి పోయెను. శ్రీదత్తుఁడును ఆమెవెంటనే ఆమెమందిరమునకు పోయెను. ఆమందిరము స్వర్గమును మించియుండెను. ఆమెయు ఆశ్చర్యపడి అవమానము పొందినదానివలె ఇల్లు చేరి వేయిమంది స్త్రీలు తనచుట్టునుం గొలుచుచుండ నతనితో మాటలాడకయే మంచముమీఁద కూచుండెను. శ్రీదత్తుండును అక్కడనే ఆమె సమీపమునఁ గూచుండెను. అంత

నాకస్మికముగా ఆతరుణి ఏడువసాగెను. స్తనములపై వేఁడి బాష్పములు రాలుచుండెను. దానిని చూచి జాలిగొని శ్రీద త్తుఁడు 'ఎవతెవు నీవు? నీ కీదుఃఖ మేల కలిగినది? చెప్పుము, ఓసుందరీ, నీకష్టమును నివారించుటకు నాకు శక్తి గలదు,' అనెను. ఆమె యెట్టకేలకు నూఱడిల్లి యిట్లనియె:—

'మేము దైత్యపతి యైనబలియొక్క మనుమరాండ్రము వేగురము, అందఱిలోను నేను పెద్దదానను, నాపేరు విద్యు త్ప్రభ. మాతాతను విష్ణువు శాశ్వతముగా ఖయిదు చేసి నాఁడు. మాతండ్రిని విష్ణువే బాహుయుద్ధములో చంపి మాపట్టణమునుండి మమ్ము వెడలఁగొట్టి మేము మరల ప్రవే శింపకుండుటకై అం దొకసింహము నుంచినాఁడు. ఆమానగర మును సింహము, మాహృదయమును దుఃఖము, ఆక్రమించి యున్నవి. ఆసింహము కుబేరునిశాపముచేత ఆరూపము పొం దినయొకానొకయక్షుఁడు. మేము మానగరము ప్రవేశించుటకు ఉపాయము చెప్పు మని విష్ణువును వేఁడుకొనఁగా మనుష్యుని చేత ఓడి పోవుటయే ఆయక్షునికి శాపాంత మని దేవుఁడు సెల విచ్చినాఁడు. కనుక ఆమాశత్రువును నీవు జయింపవలయును, అందులకే నిన్ను ఇక్కడికి కొనివచ్చితిని. వానిని గెలిచిన నీకు వానివలన మృగాంక మనుకత్తి దొరకును. దానిప్రభా వముచేత భూమి నంతయు జయించి రాజ వగుదువు.'

### శ్రీదత్తుఁడు పాతాళ సింహమును జయించుట.

ఆమాటకు సంతోషించి శ్రీదత్తుఁడు ఆదిన మక్కడఁ గడపి మఱునాఁడు దైత్యకన్యలను ముందుంచుకొని పట్టణమునకు పోయి బాహుయుద్ధములో సింహమును ఓడఁగొట్టెను. అంతట సింహము శాపము తీఱి పురుషరూపము ధరించి, తన శాపమును తీర్చిన శ్రీదత్తునికి సంతోషముతో తనఖడ్గ మిచ్చి యసురకన్యల దుఃఖముతోకూడ అంతర్ధానము పొందెను. అంత శ్రీదత్తుఁడు విద్యుత్ప్రభతోను ఆమెచెల్లెండ్రతోను ఆనగరోత్తమమును ప్రవేశించెను. అతనికి విద్యుత్ప్రభ విషహరమయినయుంగరమొకటి యిచ్చినది. శ్రీదత్తుఁడు నక్కడనే ఉండి ఆమెయందు అభిలాషపడెను. ఆమె యాతనియభిప్రాయ మెఱిఁగి అతనిని అక్కడిబావిలో స్నానము చేసి రమ్మనియు ఆకత్తితోనే మునిఁగిన మొసలిభయ ముండదనియు చెప్పెను. ఆప్రకారమే శ్రీదత్తుఁడు బావిలో మునిఁగి మొదట తాను ఎక్కడనుండి గంగలో దిగెనో అక్కడనే తేలెను.

### కాలనేమి కొలుతం బడుట.

అతఁడట్లు పాతాళమునుండి లేచి కత్తియు ఉంగరమును చూచుకొని ' మోసము చేసినదిగదా అసురకన్య ' అని చింతించుచు ఆశ్చర్యపడుచు తనమిత్త్రులను వెదకుకొనుచు తన యింటికి పోవుచు దారిలో నిష్ఠురకుని చూచెను. అతఁడును శ్రీదత్తుని నమస్కరించి త్వరగా ఏకాంతమునకుఁ గొనిపోయి

అతఁడు స్వజనవృత్తాంత మడుగఁగా' నిట్లు చెప్పెను: "నీ వట్లు గంగలో మునుఁగఁగానే నిన్ను బహుదినములు వెదకి ఎక్కడను కానక దుఃఖితులమై మాతలలను తఱుగుకొనుటకు ఉద్యమించి ఖడ్గముల నెత్తితిమి. అంత నాకాశవాణి 'ఓరి బాలురారా సాహసము చేయకుఁడు, మీచెలికాఁడు బ్రదికియే యున్నాఁడు, మరల మిమ్ము కలసికొనును,' అని పలికి ఆమూ ప్రయత్నమును మాన్పెను. అంత మేము నీతండ్రియొద్దకు పోవుచుండఁగా దారిలో ఒకపురుషుఁడు ఎదురుపడి ఇట్లు చెప్పెను: 'ఇప్పుడు మీరు ఈపట్టణములోనికి పోఁగూడదు. ఎందుచేత ననఁగా, వల్లభశక్తి చనిపోయినాఁడు. మంత్రులు విక్రమశక్తికి పట్టాభిషేకము చేసినారు. రాజ్యము రాఁగానే అతఁడు నిన్నటిరోజున కాలనేమియింటికి పోయి నీకుమారుఁడు శ్రీదత్తుఁ డెక్కడనున్నాఁ డని పట్టరానికోపముతో అడిగినాఁడు. ఆయన తా నెఱుఁగ నన్నాఁడు. అంత విక్రమశక్తి కుమారుని దాఁచిన నేరమిడి కాలనేమిని దొంగనుగా కొఱుత వేయించినాఁడు. ఆఘోరదండనకు ఆబ్రాహ్మణునిభార్య గుండె పగిలి చచ్చినది. క్రూరులు చేయుపాపము ఎప్పుడును మఱియొకపాపమును కూడ తెచ్చుచుండునుగదా? ఇప్పుడు విక్రమశక్తి శ్రీదత్తునిని వాని స్నేహితులను చంపుటకు వెదకించుచున్నాఁడు. కనుక మీకు ఇప్పుడు ఇక్కడికి వచ్చుటకు సమయము గాదు, పొండి త్వరగా' ఇట్లతఁడు చెప్పఁగా మన చెలికాండ్రు బాహుశాలి ప్రభృతులు

దుఃఖితులై కూడఁబలుకుకొని నీ కీవృత్తాంతమును చెప్పుటకై నన్నిక్కడ దాఁగి యుండుమని చెప్పి ఉజ్జయినికి పోయినారు. కనుక అక్కడికే మిత్త్రులయొద్దకు పోదమురా."

రాక్షసీశాపమోక్షము.

ఇట్లు నిష్ఠురకునివలన విని అతఁడు తల్లిదండ్రుల గతికి శోకించి పగ దీర్చుకొనుకోరికను బోలె దృష్టిని మాటిమాటికిని ఖడ్గముపై సాగించెను. అంత నతఁడు మంచికాలము నెదురు చూచువాఁడై నిష్ఠురకునితోఁ గూడ మిత్త్రులను చూచుటకు ఉజ్జయినికి బయలువెడలెను. తాను గంగలో మునుఁగుట మొదలుగా బావిలోమునుఁగుట తుదిగా తనవృత్తాంతము నిష్ఠురకునికి చెప్పుచు నడచుచు దారిలో ఒకచోట ఒక స్త్రీ ఏడ్చుచుండఁగాఁ జూచి 'ఏల యేడ్చెదవు' అని యడిగి ఆమె 'నేను మాళవము పోవుచు దారి తప్పితిని' అని చెప్పుకొనఁగా కరుణించి ఆమెనుకూడ వెంటఁగొని పోయెను. ఆమె దూరము నడవలే దనుదయచేత ఆమెతోకూడ ఆసమీపముం దొక పాడుపట్టణములో బసచేసెను. అచ్చట రాత్రి ఆకస్మికముగా అతఁడు మెలఁకువ కలిగి చూడఁగా ఆస్త్రీ నిష్ఠురకుని చంపి వానిమాంసమును తినుచుండెను. అంత నతఁడు కత్తిని చేతఁబూని లేచెను. ఆమెయు ఘోరమయిన రాక్షసీరూపమును దాల్చెను. అతఁ డారాక్షసిని చంపుటకు జుట్టు పట్టుకొనినంచెను. ఆక్షణమె ఆమె దివ్యరూపమును పొంది యతనితో

నిట్లనియె: "ఓమహానుభావా! నన్ను చంపకు, వదలు, నేను రాక్షసిని గాను. నాకు కౌశికమునివలన ఈశాపము కలిగినది. పూర్వము ఆయన కుబేరునిపదవిని గోరి తపస్సు చేయుచుండఁగా తద్విఘ్నార్థమై నన్ను కుబేరుఁడు పంపినాఁడు. అంత నేను సౌందర్యముచేత ఆయనను వలపించుటకు అసమర్థనై అవమానపడి, భయపెట్టి చూతమని భయంకర మయిన రూపమును తాల్చితిని. దానిని చూచి ఆముని 'ఓపాపాత్మురాలా, నీవు రాక్షసివి గమ్ము, మనుష్యులను తినుము,' అని శపించి నీవు నాసిగఁ బట్టుకొనఁగానే నాశాపము తీఱు నని యనుగ్రహించినాఁడు. ఈప్రకారము నా కీరాక్షసీభావము సంప్రాప్తమయినది. చిరకాలమునుండి ఈనగరము నంతయు నేనే మ్రింగివైచితిని. నీవలన నాకు శాపము తీఱినది. కనుక వర మడుగుము, ఇచ్చెదను." ఇట్లు ఆమె చెప్పఁగానే శ్రీదత్తుఁడు సాదరముగా 'వేఱువరము నాకేల? ఈనాచెలికాఁడు జీవించునుగాక' అని అడిగెను. ఆమెయు 'అట్లే అగునుగాక' అని వర మిచ్చి మాయమై పోయెను. నిష్ఠురకుఁడు అక్షతశరీరుఁడై బ్రదికి లేచెను. శ్రీదత్తుఁడు సంతోషించి ఆశ్చర్యపడి అతనితో కూడ మఱునాఁడు ప్రాతఃకాలమున బయలుదేఱి క్రమముగా ఉజ్జయిని చేరి తన్నెదురుసూచుచున్న చెలికాండ్రను మేఘుఁడు నెమళ్లనుంబోలె తనదర్శనముచేత ఆనందపఱిచెను. వారికి తనవృత్తాంత మంతయు చెప్పి బాహుశాలియింట ఆతిథ్యము

గ్రహించెను. అక్కడ బాహుశాలితల్లిదండ్రులు తనకు ఆదరముతో ఉపచారములు చేయుచుండఁగా చెలికాండ్రతో కూడ స్వగృహమందుంబోలె స్వస్థముగా నుండెను.

శ్రీదత్తుఁడు మృగాంకవతిని హరించుట.

ఒకానొకప్పుడు శ్రీదత్తుఁడు వసంతమహోత్సవములో ఉద్యానవనములో చెలికాండ్రతో కూడ జాతర చూచుటకు పోయి అక్కడ దేహధారిణియైన వసంతలక్ష్మియో యన నున్నదానిని శ్రీబింబకి యను రాజుకొమారితను చూచెను. ఆమెపేరు మృగాంకవతి. తన్ను చూడఁగానే వికసించిన శ్రీదత్తుని నేత్రములగుండ దారిచేసికొన్నదా యనునట్లు ఆమె వెంటనే అతనిహృదయములో ప్రవేశించినది. ఆమెదృష్టియు ప్రథమానురాగమును తెలుపుచు ఆమె పంపిన దూతికయో యన అతనివైపు రాకపోకలు చేయుచుండెను. చెట్లచాటుచే ఆమె అగపడక పోఁగానే శ్రీదత్తునికి ఏమియు తోఁపక దిక్కులు గూడ తెలియక పోయెను. 'మిత్రమా! నీమనస్సు నాకు తెలిసినది, నాయొద్ద దాఁపకుము, రాజపుత్త్రి ఎక్కడికి పోయినదో అక్కడికే పోదము రమ్ము,' అని యింగితజ్ఞుఁడయిన బాహుశాలి చెప్పఁగా శ్రీదత్తుఁడు అతనితో కూడ రాజకన్యయున్న చోటికి పోయెను. ఆక్షణములో 'అయ్యో! అయ్యో! రాజపుత్త్రిని పాము కఱచినది!' అని గొప్పయాక్రందనము శ్రీదత్తునికి హృదయజ్వరము కలుగఁజేయుచున్నదై వినఁబడెను. బాహు

శాలి పోయి కంచుకితో 'నాచెలికానియొద్ద విషహారమయిన యుంగరమును మంత్రమును కలవు' అనిచెప్పెను. వెంటనే కంచుకి శ్రీదత్తుని పాదములకు మ్రొక్కి అతనిని రాజకుమారిక యొద్దకు కొనిపోయెను. శ్రీదత్తుఁడు ఆమెవ్రేలికి యుంగరమునుపెట్టి మంత్రమును జపించెను. ఆమెయు బ్రదికినది. అందఱును సంతోషించి శ్రీదత్తుని స్తుతించుచుండఁగా బింబకి రాజు ఆవృత్తాంతము తెలిసి అక్కడికి వచ్చెను. అంతట శ్రీదత్తుఁడు ఉంగరమును పుచ్చుకొనకయే చెలికాండ్రతో కూడ బాహుశాలియింటికి వచ్చి, అక్కడికి బింబకి సంతోషించి పంపిన సువర్ణాదికము నంతయు బాహుశాలితండ్రికి సమర్పించెను.

### శ్రీదత్తుఁడు మృగాంకవతిని హరించుట.

అక్కడ ఆకన్యనే సదా చింతించుచు శ్రీదత్తుఁడు అనుభవించుచున్న పరితాపముచేత చెలికాండ్రు ఏమి చేయనుందోఁపక చింతించుచుండఁగా భావనిక యనునది రాజపుత్రిసఖి ఉంగరమును ఇచ్చుటకనుమిషచేత అచ్చటికి వచ్చి శ్రీదత్తునితో 'అయ్యో, అందగాఁడా నాచెలికి ఇప్పుడు కలిగినయవస్థను వినుము, ప్రాణమిచ్చిననీవు భర్తవు కావేని మరణము తప్పదు.' అని చెప్పెను. భావనిక యిట్లు చెప్పగానే శ్రీదత్తుఁడును ఆదియు, బాహుశాలియు కడను చెలికాండ్రును అందఱును గూడి ఇట్లాలోచన చేసిరి. 'రాజకన్యను మనము రహస్యముగా ఇక్కడినుండి అపహరించి కొనిపోయి ఇక్కడివారికి తెలియ

నీక మధురాపురములో నివసింతము.' ఇట్లు నిశ్చయించి కార్య సిద్ధికొఱకు పరస్పరము ఏర్పాటులు చేసికొనిరి. అంత భావనిక రాజకన్యయొద్దకు పోయెను.

మఱునాఁడు బాహుశాలి ముగ్గురుచెలికాండ్రతో వర్తకమున కని మిష పెట్టి మధురకు పయనమై పోయి దారిపొడుగునను అక్కడక్కడ రాజకన్య పలాయితయై వచ్చుటకు గూఢముగా చతురము లయినగుఱ్ఱములను అంచె యుంచెను. శ్రీదత్తుఁడు ఒకానొక స్త్రీని దానికొమార్తెతోకూడ సారాయి త్రాగించి రాజకన్యయొక్క పడకగదిలో రాత్రి యుంచెను. అంత భావనిక దీపోద్దేశమున పడకటింట నిప్పు పెట్టి మృగాంకవతితోకూడ ఎవరికిని తెలియకుండ పరారియై వచ్చి వెలుపల కనుపెట్టికొనియున్న శ్రీదత్తుని కలసికొనెను. శ్రీదత్తుఁడు ఇద్దఱు మిత్త్రులను భావనికను తోడిచ్చి రాజకన్యను ముందు పోయి యున్న బాహుశాలికడకు పంపెను. పడకటింట పడియున్న యా స్త్రీ కొమార్తెతో కూడ కాలిపోయినది. ఆ యిద్దఱుబుగ్గిని చూచి జనులు భావనికయు రాజసుతయు కాలిపోయి రని తలఁచినారు. మఱునాఁడు ఉదయమున శ్రీదత్తుఁడు ఆపట్టణము లోనే యథా ప్రకారముగా అందఱకును అగపడి రెండవరాత్రి మృగాంకమును చేతఁ గొన్నవాఁడై ముందు పోయి యున్న ప్రియతమను కలసికొనుటకై బయలు వెడలి ఆరాత్రియే ఉత్సుకతచే చాలదూరము పోయి మఱునాఁడు ప్రొద్దెక్కునంతలో వింధ్యారణ్యము ప్రవేశించెను.

అక్కడ నతనికి అపశకునము లయినవి. అంతలో మిత్త్రు లందఱును భావనికయు అగపడిరి. మిత్త్రు లందఱును దెబ్బలు తిని నలిఁగి యుండిరి. ఆ యవస్థలో నున్న తమ్ము చూచి ఏమియు తోఁపక దిగులుపడియున్న శ్రీదత్తునితో వారు 'మిత్త్రమా! ఇక్కడ మమ్ము గుఱ్ఱపుదండు కొట్టి దోఁచుకొన్నది, మేము దెబ్బలు తిని యీయవస్థలో నుండఁగా భయానుల యైనరాజ కన్యను ఒకరాతు తనగుఱ్ఱముమీఁద ఎక్కించుకొని పోయి నాఁడు, దూరము కొనిపోకముందే ఈదిక్కునఁ బొమ్ము, మాయొద్ద నుండకుము, అన్ని విధముల నామెసంగతిముఖ్యము.' అనిచెప్పి అతనిని పంపిరి. శ్రీదత్తుఁడు వారిని పలుమాఱు వెనుకకు తిరిగి చూచుచు పోయి త్వరలో ఆగుఱ్ఱపుదండును కలసికొని అందులో నడుమ ఆమెను కొనిపోవుచున్న క్షత్త్రియ కుమారుని చూచి అతనియొద్దకు పోయి మంచి మాటలతో నడుగఁగా అతఁడు ఆమెను ఈనందున అతనిని కాలితో తన్ని గుఱ్ఱమునుండి క్రిందికి లాగి ఒకరాతిమీఁద వైచి కొట్టి చూర్ణ ముచేసి ఆగుఱ్ఱమునే ఎక్కెను. తనమీఁదికి కోపించి దాడు తీసిన రాతుల ననేకులను సంహరించెను. హతశేషులు ఆవీరుని యద్భుతపరాక్రమమునకు భయపడి పాఱిపోయిరి.

శ్రీదత్తుఁడు మృగాంకవతిని కోలుపోవుట.

అంతట శ్రీదత్తుఁడు మృగాంకవతితో కూడ గుఱ్ఱ మెక్కి చెలికాండ్రయొద్దకు పోవుచు కొంచెము దూరము పోయి

భార్యతోఁ గూడ దిగఁగానే యుద్ధములో గాయములు తగిలి యున్న యాగుఱ్ఱము నేలఁబడి కాలధర్మము నొందెను. ఆ సమయమున మృగాంకవతి యుద్ధములో కలిగిన భయాయాసములచేత మిగుల డప్పి గొన్న దాయెను. ఆమె నక్కడ నొక చోట నుంచి నీళ్లు వెదకుచు శ్రీదత్తుఁడు దూరము పోయెను; ఇంతలో సూర్యాస్తమయ మాయెను. అతఁ డంతట నీళ్లుదొరకినను చీఁకటిలో దారి తప్పి చక్రవాకమువలె విలపించుచు ఆ రాత్రియెల్ల నడవిలో తిరుగుచుండెను. తెల్లవాఱఁగానే చచ్చి పడియున్న గుఱ్ఱపుగుర్తుచేత ఆచోటికి పోయినాఁడు గాని రాజపుత్రిమాత్రము అగపడలేదు. అంత నతఁడు పొరఁబాటుచేత మృగాంకమును భూమిమీఁద వైచి ఆమెను నలుదిక్కుల వెదకుటకు చెట్టుకొన కెక్కినాఁడు. ఆక్షణములో ఆదారిని ఒకచెంచునాయఁడు వచ్చి చెట్టుక్రింద నున్న యా మృగాంకమును పుచ్చుకొనెను. వానిని చూచి శ్రీదత్తుఁడు చెట్టు దిగి అతి దుఃఖముతో ప్రేయసివార్త నడిగెను. చెంచుదొర 'ఇక్కడి నుండి నాపల్లెకు పో, నీప్రియ అక్కడనే నున్నది, నేనును అక్కడికే వచ్చెదను, వచ్చి నీకత్తి నీ కిచ్చెదను' అని చెప్పెను. శ్రీదత్తుఁడును కాంతదర్శనోత్సుకుఁడై ఆచెంచుదొరయొక్క పరిజనులతోఁ గూడ ఆపల్లెకు పోఁగా, ఆపరిజనులు రవంత అలపు తీర్చుకొమ్మని చెప్పఁగా, నతఁడు చెంచువారియింట పరుండి క్షణములో నిద్రలో మునిఁగి పోయెను. మేల్కొని చూచుకొనఁ

గానే కాంతను వెదకుటకు యత్నించినవాఁడై ఆమె యున్నచోటికి పోనేరనియపరాధముచేతనా యనునట్లు పాదములు రెండును సంకెలలం బడియుండెను. అంత నతఁడు క్షణము సుఖమును క్షణము దుఃఖమును ఇచ్చునదై దైవగతివంటిదైయున్న ప్రేయసినే తలపోసి వగచుచు అక్కడనే పడియుండెను.

## శ్రీదత్తుఁడు చెంచుకన్యను వివాహ మగుట.

ఒకనాఁడు మోచనిక యనునొకచేటి అతనికడకు వచ్చి యిట్లనియె: 'ఓమహానుభావుఁడా! అయ్యో, ఇక్కడికేల వచ్చినాఁడవు? ఇక్కడ నీకు మృత్యువు తప్పదు. ఈశబరాధిపుఁడు ఏదో పనిమీఁద పోయియున్నాఁడు. వచ్చినవెంటనే నిన్ను అమ్మవారికి బలి యిచ్చును. ఇందునిమిత్తమే నిన్ను వింధ్యారణ్యమునుండి ఇక్కడికి తెచ్చి ఖయిదులో నుంచినాఁడు. అమ్మవారిబలికి ఉద్దేశించినందుననే నీకు మంచివస్త్రములు ఇచ్చి భోజనములు పెట్టి ఉపచరించుచున్నాఁడు. తప్పించుకొనుటకు నీకు ఒకటే ఉపాయ మున్నది; నీవు అంగీకరింతువేని అతనికి సుందరి యని కూఁతు రొకతె యున్నది. ఆమె నిన్ను చూచిన గడియ మొదలు అత్యంతము మదనాతురయై యున్నది. ఆనా చెలిని కూడుము. దాన నీకు మేలు కలుగును.' చేటి చెప్పిన యీమాట కంగీకరించి శ్రీదత్తుఁడు సుందరిని గాంధర్వవిధిచేత రహస్యముగా వివాహ మాడెను. ఆమె ప్రతిరాత్రియు అతని సంకెలలను తొలఁగించుచుండెను. కొలఁదిదినములలోనే ఆమెకు గర్భ మాయెను.

అంతట ఆవృత్తాంత మంతయు ఆమెతల్లి మోచనిక వలన విని అల్లుఁ డనుప్రేమచేత పోయి స్వతంత్రముగా శ్రీదత్తునితో 'నాయనా, ఈసుందరితండ్రి మహాకోపి. శ్రీచండుఁ డని సార్థకనాముఁడు; నిన్నతఁడు క్షమింపఁడు, ఇక్కడినుండి పాఱిపో; సుందరిని మాత్రము మఱవకు.' అని పల్కి బంధనము లూడ్చివై చెను.

శ్రీదత్తుఁడు మృగాంకవతిని మరల పొందుట.

అంత శ్రీదత్తుఁడు సుందరితో శ్రీచండునిచేతియాఖడ్గము తన దనిచెప్పి, అక్కడినుండి బయలువెడలి మరల మృగాంకవతి పోయినగతినే తెలిసికొనుటకై ఆమొదటివింధ్యారణ్యమునే ప్రవేశించి శుభశకునములు కాఁగా ఎక్కడ గుఱ్ఱము చచ్చి పడియుండెనో ఎక్కడ ఆమె అగపడక పోయెనో ఆచోటికే పోయి అక్కడ ఎదురుపడిన యొక బోయవానిని ఆకురంగాక్షివార్త నడిగెను. నీ వేమి శ్రీదత్తుఁడవా యని బోయ యడిగెను. ఔను ఆమందభాగ్యుఁడనే నేను అని నిట్టూర్పు నిగిడించుచు శ్రీదత్తుఁడు పలికెను. అంత నాబోయ యి ట్లనియె: 'ఓమిత్త్రుఁడా! నీప్రేయసి నిన్ను ఇట నలువైపులను వెదకుచు వచ్చుచుండఁగా నేను చూచి కనికరించి నాపల్లెకు కొనిపోయి అక్కడ నున్న కోడెకాండ్రకు ఆమె భయపడి దిగులుపడఁగా మథురాపురమునొద్ద నాగస్థల మను గ్రామములో విశ్వదత్తుఁ డనువృద్ధబ్రాహ్మణునియింట గౌరవముగా ఇల్లడ యుంచి ఆమె

వలన నీపేరు తెలిసికొని ఇచ్చటికి వచ్చినాఁడను. పొమ్ము వెంటనే నాగస్థలమునకు. అక్కడ ఆమెను చూడఁగలవు.'

శ్రీదత్తుఁడు వెంటనే బయలుదేఱి ఆరాత్రియే నాగస్థలము చేరి విశ్వదత్తునియింటికి పోయి 'అయ్యా! నీయొద్ద బోయవాఁడు ఉంచిననాభార్యను ఇమ్ము' అని యడిగెను. అందునకు విశ్వదత్తుఁడు 'మథురలో నాస్నేహితుఁడు గుణవంతులకు ప్రియుఁడు ఒకబ్రాహ్మణుఁడు కలఁడు; ఆయన శూరసేనమహారాజునకు ఉపాధ్యాయుఁడును మంత్రియు. నీప్రియను ఆయనచేతిలో ఒప్పగించి యున్నాఁడను. ఇది యొక నిర్జనగ్రామము. ఇక్కడ ఆమెను కాపాడుట సులువుగాదు. నీవు ఈదినము ఇక్కడ విశ్రమించి రేపు ఆమెయొద్దకు పొమ్ము.' అనెను.

శ్రీదత్తుఁడు ఆరాత్రి యక్కడ విశ్రమించి తెల్లవాఱఁగానే బయలుదేఱి మఱునాఁడు మథుర చేరెను. బహుదూరము నడచి దుమారము గ్రమ్మినవాఁడై బడలిక తీఱుటకు అక్కడ ఊరివెలుపల నొకనిర్మల మయినదిగుడుబావిలో స్నానముచేసి అందు ఎవరో దొంగలు కొంగున హార మొకటి ముడిచి పడవైచియున్న యొకవస్త్రమును చూచి హారపుముడిని మాత్రము చూడకయే ఏమియు సందేహము తోఁపక దానిని చేతఁబుచ్చుకొని ప్రియను చూడఁగోరి మథురాపురములో ప్రవేశించెను. అక్కడ తలారులు ఆవస్త్రమును ఆనవాలు పట్టి హారము కూడ కనిపట్టి వానిని దొంగ యనిపట్టుకొని పోయి కొత్వాలు

నెదుటఁ బెట్టిరి. కొత్వాలు రాజునకు తెలిపెను. రాజు ఇతనికి ఉరి కాజ్ఞ యిచ్చెను. తలారులు వెనుక డిండిమము వాయించుచు ఇతనిని వధ్యభూమికి తీసికొని పోవుచుండఁగా మృగాంకవతి దూరమునుండి చూచి వెంటనే పోయి తొట్రుపాటుతో. 'ఇదిగో నాభర్తను వధ్యభూమికి ఉరిఁ దీయుటకు కొనిపోవుచున్నారు!' అని ఎవరియింట తా నుండెనో ఆమంత్రిముఖ్యునితో చెప్పుకొనెను. అంత నాతఁడు తలవరులను నివారించి రాజుతో విన్నవించి శ్రీదత్తుని ఉరినుండి తప్పించి ఇంటికి తీసికొని వచ్చెను. 'ఏమి! నాపినతండ్రి విగతభయుఁడు పూర్వము దేశాంతరము పోయినవాఁడు దైవయోగమున ఇక్కడ మంత్రి యయినాఁడు! అని శ్రీదత్తుఁడు పినతండ్రిని ఆనవాలుపట్టి అడిగి తెలిసికొని ఆయనపాదములలో పడెను. ఆయనయు తనయన్నకొడుకును ఆనవాలుపట్టి పరమానందభరితుఁడై మెడ కౌఁగిలించుకొని వానివృత్తాంత మంతయు అడిగెను. శ్రీదత్తుఁడు తన తండ్రికి కలిగినవధ మొదలుకొని తనవృత్తాంత మంతయు పినతండ్రికి తెలియఁజేసెను. అంత విగతభయుఁడు ఏకాంతమందు శ్రీదత్తునితో 'నాయనా! నే నొకయక్షిణిని సాధించినాఁడను. పుత్రహీనుఁడనైన నాకు ఆమె అయిదువేల గుఱ్ఱములను అయిదుకోట్లవరహాలను ఇచ్చినది. ఆధన మంతయు నీదే.' అని చెప్పి శ్రీదత్తునికి ఆప్రియను ఒప్పగించెను. ఆవిభవ మెల్ల గ్రహించి శ్రీదత్తుఁడు ఆమెను వివాహమాడి, అక్కడనే రాత్రితో కలువ

కొలనుంబోలె ఆమెతో గూడి నివసించియుండెను. అతనికి సంపదలు పూర్ణ మయినను చంద్రునికి కళంకమువలె బాహుశాల్యాదులచింత హృదయమునకు సదా మాలిన్యమును కలుగఁజేయుచుండెను.

శ్రీదత్తుఁడు శూరసేనరాజకన్యను పరిణయమగుట.

ఒకనాఁడు పినతండ్రి శ్రీదత్తునితో ఏకాంతమం దిట్లనియె:—'ఈశూరసేన మహారాజునకు ఒకకూఁతురు గలదు. ఆమెను నేను అతనియాజ్ఞచేత అవంతీదేశములో ఇచ్చుటకు తీసికొని పోవలసియున్నది. కనుక ఆమిషచేతనే ఆమెను హరించి నీ కిచ్చెదను. అంత దానితో వచ్చుసైన్యమును నా సైన్యమును నీ కుండఁగా ఇంతవఱకు నీకు శ్రీదేవి చెప్పినట్టి రాజ్యము క్షణములో లభించును.' ఇట్లు నిశ్చయించి ఆకన్యను తోడ్కొని అక్కడినుండి శ్రీదత్తుఁడును అతనిపినతండ్రియు సైన్యములతోను భార్యలతోను పోయి వింధ్యారణ్యము ప్రవేశించిరి. అంతలోన ఆకస్మికముగా గొప్పదొంగదండు వారిని ముట్టడించి పాషాణవర్షము కురియింపసాగెను. శ్రీదత్తుని దండంతయు గాయపడుడు అతఁడును దెబ్బలు తిని మూర్ఛపోఁగా దొంగలు సకలధనమును కైకొని ఆతనిని కట్టి తమ పల్లెకు కొనిపోయి, అందు ఘంటానాదములచేత మృత్యువును పిలుచుచున్నదో యనునట్లున్న భయంకరమైన చండికాగృహములో నిలిపిరి. అక్కడికి అమ్మవారిదర్శనమునకు బాలపుత్త్రి

నితో కూడ వచ్చి సుందరి అతనిని చూచి ఆనందపూర్ణయై నడుమ నున్నదొంగలను అవతలికి పొమ్మని అతనిని ఇంటికి పిలుచుకొనిపోయెను. శ్రీచంద్రుఁడు పుత్రులు లేనివాఁడై సుందరికి తనపల్లీరాజ్యము నిచ్చి లోకాంతరగతుఁ డాయెను. దానికి ఇప్పుడు శ్రీదత్తుఁడు ప్రభు వాయెను. మఱియు దొంగల నుండి పినతండ్రిని విడిపించి వారు కొల్లగొనినధనము నంత యును ఆ మృగాంకఖడ్గమును మరల పొందినవాఁడై అక్కడనే శూరసేనునికూఁతును వివాహమై ఆనగరములో శ్రీదత్తుఁడు మహారాజుగా నేలుచుండెను. పిమ్మట తనమామ లయిన బింబకి శూరసేనులకు దూతలను పంపెను. వారును సేనాసమూహ ములతో ఆసంబంధమును విని సంతోషించి కొమార్తెల మీఁదిప్రేమచేత అతనియొద్దకు వచ్చిరి. ఆతని నెడఁబాసిన యా బాహుశాలి మొదలయిన చెలికాండ్రును గాయములు కుదిరి ఆవృత్తాంత మంతయు తెలిసికొని అతని యొద్దకు వచ్చి చేరిరి.

పిమ్మట శ్రీదత్తుఁడు మామలతో కూడి దండెత్తిపోయి తనతండ్రిని చంపినయావిక్రమశక్తిని తనక్రోధాగ్నికి ఆహుతిగా చేసెను. క్రమముగా సాగరమేఖల యయినభూమికి ప్రభువయి విరహమును దాఁటినవాఁడై మృగాంకవతితో కూడ భోగము లనుభవించుచుండెను.

ఓప్రభూ! ఈప్రకారము ధీరులు విరహసాగరమును దాఁటి కల్యాణమును పొందుదురు.

## సహస్రానీకుఁడు మృగావతిని కలయుట.

ఇట్లు సంగతకునివలన విని సహస్రానీకమహారాజు ప్రియతమకై ఉవ్విళ్లూరుచు ఆరాత్రిని ఎట్లో గడపెను. తెల్లవాఱఁగానే కోరిక యనురథ మెక్కి ముందుగా మనస్సనెడుతురుపును పంపి సహస్రానీకమహారాజు తనప్రియతమయొద్దకు బయలువెడలి కొలఁదిదినములలోనే ఎందు మృగములకు సయితము చపలత్వము లేదో శాంత మయిన యాజమదగ్న్యాశ్రమమును చేరి తపస్సులదియుంబోని పావనమయిన ప్రభగలిగిన యాజమదగ్నిని దర్శించి నమస్కరించెను. మునియును రాజునకు అతిథిసత్కారములు చేసి పుత్త్రునితో కూడ మృగావతిని ఆనందముతోడి నిర్వృతినింబోలె సమర్పించెను. శాపాంతమందు ఆదంపతులయొక్క యన్యోన్యదర్శనము ఆనందబాష్పపూర్ణము లయిన నేత్రములయందు అమృతమును గురిసి నట్లుండెను. ప్రథమదృష్టుఁ డయినయుదయనుని కౌఁగిలించుకొని సహస్రానీకుఁడు గగుర్పాటుచేత మేకుబందిచేయఁబడిన ట్లున్నయాతనిని ఎట్టకేలకు వదలిపెట్టెను.

పిమ్మట పుత్త్రుని భార్యను తోడుకొని పోవువాఁడై, తపోవనమునుండి లేళ్లుగూడ కన్నీళ్లు కురియుచు వెంట రాఁగా, జమదగ్నియొద్ద సెలవు పుచ్చుకొని తననగరమునకు బయలువెడలెను. ప్రియతమయొక్క విరహావృత్తాంతములను వినుచు తనవి చెప్పుచు, క్రమముగా తోరణపతాకాలంకృత మయిన

కౌశాంబికి పోయి, అచ్చటి పౌరజనులు నేత్రములతో త్రాగు వారుంబోలె రెప్ప వాల్పక తన్ను చూచుచుండఁగా భార్యా పుత్త్రులతో నగరప్రవేశము చేసెను. పుత్త్రునిసుగుణములచేత ప్రేరింపఁ బడినవాఁడై తత్క్షణమే అతనికి యువరాజపట్టాభి షేకము చేసి తన మంత్రులకుమారులైన వసంతక రుమణ్వాం తులను యౌగంధరాయణుని మంత్రులనుగా ఏర్పఱిచెను. అప్పుడు 'ఈమంత్రులచే ఇతఁడు సర్వభూమండలమును ఏలును.' అని అశరీరవాణి పలికెను, పుష్పవర్షము కురిసెను. ఇట్లు సహస్రానీకుఁడు రాజ్యభారమును కుమారునికి ఒప్పగించి చిర కాంక్షిత మయిన జీవలోకసుఖమును మృగావతితో కూడ అను భవించుచుండెను.

అంత నాఁటేని చెవికడకు ముక్తికాంతాదూతి యయిన ముదిమి రాఁగానే క్షణములో విషయస్పృహ అలిగినదై అత నిని వదలి దూరమునకు పోయెను. అంతట కల్యాణస్వరూపుఁ డయినయాకుమారుని ఉదయనుని అనురక్తప్రకృతికుని లోక క్షేమార్థము తన రాజ్యమం దుంచి సహస్రానీకుఁడు భార్య తోను మంత్రులతోను హిమవత్పర్వమునకు మహాప్రస్థాన యాత్ర పోయెను.

---

## 3 - వ తరంగము.



ఆప్రకారము ఉదయనుఁడు తండ్రి యిచ్చినవత్సరాజ్యమును పొంది కౌశాంబి తనరాజధానిగా ప్రజాపరిపాలనంబు సేయుచుండెను. కాలక్రమమున రాజ్యభారమును యౌగంధరాయణాదిమంత్రులచేతిలో పెట్టి కేవలభోగపరాయణుఁడై రేయుంబవలు వాసుకి యిచ్చినయావీణను ఘోషవతిని వాయించుచు సదా వేటలో మునిఁగినవాఁడై ఆవీణయొక్క మధుర నాద మనుమోహమంత్రమునకు వశ మయిన మదించిన యడవియేనుఁగులను కట్టి తెచ్చుచుండెను. వారస్త్రీముఖచంద్ర ప్రతిబింబములచే నలంకృత మయినసురను మంత్రులమోములు వెలవెలఁబాటుతో కూడ త్రాగుచుండెను. 'కులరూపముల యందు నాకనురూపురాలైనభార్య యెక్కడను లేదు; వాసవదత్త యనుకన్య యొకతె మాత్రము వినఁబడుచున్నది, ఆమె నాకెట్లు దొరకును?' అని ఉదయనుఁడు చింత దాల్చియుండెను.

### ఉజ్జయిని రాజా చండమహాసేనుని వృత్తాంతము.

చండమహాసేనుఁడు ఉజ్జయినిలో ఇట్లు చింతించుచుండెను! 'నాకొమారితకు సమానుఁడయినభర్త ఈలోకములో లేఁడు. ఉదయనుఁడు మాత్రము ఒకఁడున్నాఁడుగాని అతఁడు నాకు సదా శత్రువు. అతఁడు నాకు అల్లుఁడును వశ్యుఁ

డును ఎట్లు కాఁగలఁడు? ఇందున కొకటియే ఉపాయము; ఇతఁడు అడవిలో ఏనుఁగులను పట్టుకొనుచు వేఁటతమిచేత సదా ఒంటరిగా తిరుగుచుండును గదా. ఆరంధ్రముచేత ఇతనిని యుక్తిగా పట్టుకొని ఇక్కడికి తెచ్చెదను. గాంధర్వవిద్య నెఱిఁగిన అతనికి నాకొమారితను శిష్యనుగా చేసెదను. అంత నతని కన్ను స్వయముగానే ఆమెయందు ఆసక్తమగును, సందేహము లేదు. ఇట్లు అతఁడు నాకు అల్లుఁడై నిశ్చయముగా లోఁబడి యుండును. అతనిని వశపఱుచుకొనుటకు ఇంతకన్న వేఱె ఉపాయము లేదు.' ఇట్లు సంకల్పము చేసి అది నెఱవేఱుటకై అతఁడు చండికాలయమున కేఁగి చండిని పూజించి స్తుతించి ఆమెకు మ్రొక్కు కట్టెను. అంతలో 'రాజా! నీకోరిక త్వరలోనే సిద్ధించును' అని అశరీరవాక్కు వినఁబడెను. అంత సంతోషించి వచ్చి బుద్ధదత్తుఁడనుమంత్రితో ఆవిషయమునే విచారించెను. 'వత్సరాజు గర్వితుఁడు, లోభము లేదు, భృత్యులు అనురక్తులు, స్వయము మహాబలశాలి; సామాదులకు అసాధ్యుఁడు; అయినను మొదట సామమే ప్రయోగించి చూతము.' ఇట్లు నిశ్చయించి యారాజు దూత నొకనిని పిలిచి 'నీవు పోయి నామాటగా వత్సరాజుతో నాకూఁతురు అతనికి గాంధర్వమందు శిష్య యగుటకు కోరుచున్న దనియు మాయందు దయ గలదేని ఇక్కడికే వచ్చి నేర్పవలయు ననియు విన్నవింపుము' అని యాజ్ఞాపించెను.

దూతయు కౌశాంబికి పోయి వత్సరాజునకు ఆసందేశమును అట్లే విన్నవించెను. వత్సరాజు దూతవలన ఆ యనుచితసందేశమును విని ఏకాంతమందు యౌగంధరాయణుని 'ఏమి ఇంతగర్వముతో నాకు సందేశము పంపినాఁడు ఆరాజు? ఆదురాత్మునికి ఇట్లు కోరుటయందు అభిప్రాయ మేమి?' అని యడిగెను. వత్సరా జిట్లు పలుకఁగా యౌగంధరాయణుఁడు స్వామిహితపరాయణుఁడై యిట్లు పలికెను: 'మహారాజా! నీవు వ్యసనాసక్తుఁడ వని లోకములో నంతట వ్రాఁకియున్న యపఖ్యాతిలతయొక్క ఒగరుచేఁదుపండు సుమా యిది. అతఁడు నిన్ను స్త్రీలోలునిఁగా తలఁచి, కన్యారత్నముచేత లోభపెట్టి ఆకర్షించి పట్టి ఖయిదు చేసి వశపఱుచుకొనఁ గోరియున్నాఁడు. కాఁబట్టి నీవు వ్యసనములను మానుము. వ్యసనములలో మునిఁగినరాజులు ఓదంబులలో పడినయడవియేనుఁగులవలె మిగుల సులువుగా పట్టువడుదురు.' మంత్రి ఇట్లు చెప్పఁగా ధీరుఁడైన వత్సరాజు చండమహాసేనునికి 'నీకొమారితకు నాశిష్య కావలయు ననుకోరిక కలదేని ఆకన్యను ఇక్కడికే నాయొద్దకు పంపుము.' అని ప్రతిదూతద్వారా సందేశము పంపినవాఁడై 'ఇదిగో ఇప్పుడే పోయి చండమహాసేనుని పట్టి తెచ్చెదను' అని మంత్రులతో చెప్పెను. అందునకు యౌగంధరాయణుం డిట్లనియె:

చండమహాసేనుని ప్రభావము.

రాజా! ఇది సాధ్యము కాదు, ఉచితమును గాదు. ఆరాజు ప్రభావవంతుఁడు, నీకు స్వీకరింపఁ దగినవాఁడు. అతని వృత్తాంత మంతయు చెప్పెదను వినుము. భూలోకభూషణము ఉజ్జయిని యనునగరము కలదు. అది మేడలధావళ్యముచేత అమరావతిని పరిహసించు నట్లుండును. అందు విశ్వేశ్వరుండు మహాకాళస్వరూపమున వెలసి కైలాసనివాసాభిలాషను మాని యున్నాఁడు. పూర్వము ఆపట్టణమందు మహేంద్రవర్మ యను రాజశ్రేష్ఠుఁ డుండెను. అతనికి తగినకుమారుఁడు జయసేనుఁ డనువాఁడు కలిగెను. అతనికి అసమానబాహువీర్యము కల వాఁడు మహాసేనుఁ డను రాజకుంజరుఁడు జనించెను. ఆరాజు ఆపుర మేలుచుండి ఒకప్పుడు తనకు తగిన క్షత్రియ భార్యయు లేమికి చింతించి వానిని పడయుటకై చండికాలయమునకు పోయి నిరాహారవ్రత మవలంబించి చిరకాలము దేవిని ఆరా ధించి తనమాంసములను కోసి హోమము చేసెను. అంతట చండి ప్రసన్నురాలై ప్రత్యక్షమై యిట్లనియె: 'పుత్రా! నీభక్తికి మెచ్చుకొంటిని, ఈఖడ్గోత్తమమును పుచ్చుకొమ్ము. దీనిమహి మచేత నీవు అజయ్యుఁడ వగుదువు. మఱియు అంగారకాసురుని కూఁతురు అంగారవతి యను త్రైలోక్యసుందరి శీఘ్రము లోనే నీకు భార్య యగును. నీవు అతిచండ మయినకర్మ చేసి నాఁడవు గాన నీకు ఇఁక చండమహాసేనుఁ డని పేరు అగును.'

ఇట్లు సెప్పి ఖడ్గమిచ్చి దేవి యంతర్ధాన మాయెను. రాజునకు సంకల్పసిద్ధివలన సంతుష్టి యావిర్భవించెను.

అతనికి ఆఖడ్గమును నడగిరి యనుమదపుటేనుఁగును .ఇంద్రునికి వజ్రాయుధమును ఐరావతమునుంబోలె రెండురత్నములై యున్నవి: ఆ రెండింటిప్రభావముచేతను సుఖమున్నవాఁడై చండమహాసేనుఁడు ఒకప్పుడు వేఁటకై మహారణ్యమునకు పోయెను. అక్కడ పగలు ఒకటియే రాశియై యున్న రాత్రియొక్కచీఁకటియో యన మహాప్రమాణమయి భయంకరమైయున్న యొకయడవిపందిని చూచెను. ఆపంది ఇతని తీక్ష్ణబాణములకు గాయపడక ఇతని రథమును విఱుగఁగొట్టి పలాయితమై యొకగుహం దూఱెను. రాజుకూడ రథమును వదలి ఆపందినే వెంటఁదఱుముచు చాపమాత్రసహాయుఁడై ఆగుహలోదూఱి చాల దూరము పోఁగా రమణీయమైనగొప్ప పట్టణమొకటి అగపడెను. దానిని చూచి యాశ్చర్యపడి అచ్చటి దిగుడుబావిగట్టున కూర్చుండెను. అచ్చటికి నూఱుగురుచెలులు చుట్టునుం గొలువ నొకకన్యక ధైర్యనిర్భేదిని యగు సంచరించు న్న మదనాస్త్రమో యన నేతెంచి ప్రేమరసంపుజడివానను వర్షించుచున్న కన్నుదోయితో రాజును స్నానము చేయించుచు న్నదై మెల్ల మెల్లఁగా సమీపించి ఇతనిని 'ఎవ్వఁడవు నీవు అందగాఁడా! ఇక్కడికి ఏల వచ్చినాఁడవు?' అని యడిగెను. ఇతఁడు వాస్తవమును చెప్పెను. అంతట ఆమెకు ధైర్యము తూలి

భాగవంత మయిన కనుదోయినుండి బాష్పధారలు కురియఁ దొడఁగెను. రాజు 'ఎవ్వతెవు నీవు? ఏల యేడ్చెదవు?' అని యడుగఁగా ఆమె మన్మథాజ్ఞానువర్తినియై యిట్లు పలికెను. 'ఇక్కడ ప్రవేశించినపంది అంగారకుఁ డనుపేరిరాక్షసుఁడు. నేను అతనికూఁతురను, నాపేరు అంగారవతి. వజ్రసారమయుఁ డైన యితఁడు రాజుల యంతఃపురములనుండి యీనూఱుగురు రాజకన్యలను హరించి తెచ్చి నాకు పరివారముగా ఏర్పఱచినాఁడు. ఇతఁడు శాపదోషముచేత నైన మహాసురుఁడు, ఇప్పుడు డప్పిచేతను బడలికచేతను నిన్ను చేతికి దొరకినను వదలియున్నాఁడు. ఇప్పుడు పందిరూపమును మాని విశ్రమించి యున్నాఁడు. మేలుకొని నీవిషయమై నిశ్చయముగా పాపము చేయఁగలఁడు. ఇట్లు నీకు కలుగ నున్న యమంగళము తలంపునకు రాఁగా ఈ వేఁడి బాష్పములు సంతాపముచే నుడికిన నాప్రాణములుం బోలె నిర్గమించుచున్నవి.' అంగారవతియొక్క యీపలుకులు విని రాజు "నాయందు నీకు స్నేహము కలదేని నేను చెప్పునట్లు చేయుము. అతఁడు మేలుకొనఁగానే పోయి అతని యెదుట ఏడువుము. అతఁడు నిశ్చయముగా నీభయమునకు కారణ మడుగును. అంతట 'నాయనా నిన్నెవరయినను చంపుదురేని అప్పుడు నాగతి యే మగునో యని నాకు దుఃఖము కలుగుచున్నది' అని చెప్పుము. ఇట్లు చేసెదవేని నీకును నాకును ఇద్దఱకును శుభము కలుగును." అందుల కామె యంగీకరించి

రాజును అపాయభయముచే రహస్యముగా నొకచోట దాఁచి యుంచి నిద్రించుచున్నతండ్రియొద్దకు పోయి అతఁడు మేల్కొనఁగానే అతనియెదుట ఏడువసాగెను. 'ఏల యేడ్చెదవమ్మా?' అని యతఁ డడుగఁగా 'నాయనా, నిన్ను ఎవ్వరేని చంపిన యెడల నాగతి యేమగునో యని భయముచేత ఏడ్చుచున్నాను.' అని చెప్పెను. అందునకు నవ్వి 'అమ్మా! న న్నెవఁడు చంపఁ గలఁడు? నాదేహ మంతయు వజ్రమయము గదా. నా యెడమచేతిలో రంధ్ర మున్నది. దానిని ధనుస్సు సర్వదా రక్షించుచుండును.' అని చెప్పి ఆదైత్యుఁడు తనకొమారితను ఓదార్చెను. దీని నంతయు రాజు పొంచియుండి వినెను. పిమ్మట క్షణములో ఆదానవుఁడు లేచి స్నానముచేసి మౌనము దాల్చి శివపూజ ప్రారంభింపఁగా రాజు ఎదుటఁబడి వింట బాణమును సంధించి సమీపించి రాక్షసుని యుద్ధమునకు రమ్మని బలాత్కారముగా పిలిచెను. అతఁడు మౌనమందున్న వాఁడై ఎడమచేయి ఎత్తి, క్షణము వేచియుండుము, అని సంజ్ఞ చేసెను. రాజు హస్తలాఘవముచేత తత్క్షణమే ఆచేతియందలి యామర్మస్థానమును బాణముతో నేసెను. అంత నామహాసురుఁడు ఘోరముగా గర్జించుచు భూమిమీఁద పడి ప్రాణోత్క్రమణసమయములో 'దప్పిగొనియున్న నన్ను కూల్చినవాఁడు ప్రతిసంవత్సరమును జలముతో నాకు తర్పణము చేయఁడేని అతని యయిదుగురుమంత్రులు మృతిఁబొందుదురు.' అని చెప్పి

కాలధర్మము నొందెను. రాజు అతనికూఁతును అంగారవతిని తోడ్కొని ఉజ్జయినికి పోయి వివాహము చేసికొనెను. వారి ద్దఱకును గోపాలకుఁడు పాలకుఁడు నని ఇద్దఱు కుమారులు గలిగిరి. వారు పుట్టఁగానే రాజు ఇంద్రోత్సవము చేసినాఁడు. అందునకు ఇంద్రుఁడు సంతోషించి రాజుతో స్వప్నములో 'నాప్రసాదముచేత సాటిలేని యందగత్తె యయినకూఁతురు నీకు కలుగును.' అని యానతిచ్చెను. కాలక్రమమున నతనికి చంద్రునియొక్క వేఱుమూర్తిగా బ్రహ్మచే సృష్టింపఁబడినదో యన నొకకూఁతురు కలిగెను. ఆమెకు మన్మథుఁడు పుత్త్రుఁడుగా అవతరించి విద్యాధరులకు రాజగు నని ఆసమయములో ఆకాశవాణి పలికినది. ఆమె తుష్టుఁడైన యింద్రునిచేత ఈఁబడె నని రాజు ఆమెకు వాసవదత్త యని పేరు పెట్టెను. ఆమె యు ఇప్పుడు పెండ్లివయసు వచ్చి త్రచ్చుటకు ముందు లక్ష్మి సముద్రగర్భములో నున్నట్టు తండ్రియింట నున్నది. చండ మహాసేనుఁడు ఇట్టిప్రభావము కలవాఁడు; దుర్గమ మయినదేశ ములో నున్నాఁడు. అతనిని జయించుట సాధ్యముగాదు. మఱియు అతఁడు తనకొమారితను నీవు ఈఁ గోరియున్నాఁడు. పరువుగలవాఁడై తనపక్షముయొక్క యభ్యుదయమును కోరు చున్నాఁడు. అవశ్యముగా నీవు వాసవదత్తను వివాహము చేసికోవలయును.

ఇట్లు మంత్రి పలుకఁగా వత్సరాజు వాసవదత్తాహృత మనస్కుఁడాయెను.

———

## ౮ - వ తరంగము.

---

### యంత్రగజము.

ఈలోపల వత్సరాజు పంపిన ప్రతిదూత చండమహాసేనునికి ఆసందేశమును నివేదించెను. చండమహాసేనుఁడును 'వత్సరాజు మిగుల పరువు గలవాఁడు, ఇక్కడికి రాఁడు, కన్యను అక్కడికి పంపఁగూడదు, అట్లు చేయుట లాఘవముగా నుండును, కాఁబట్టి యుక్తిచేత ఆరాజును పట్టి యిక్కడికి తెచ్చెదను.' అని యూహించి మంత్రులతో కూడ ఆలోచించి సాటిలేని గొప్ప యంత్రపుటేనుఁగు నొకదానిని చేయించి దాని కడుపులో వీరపురుషులను దాఁచి యుంచి దానిని వింధ్యారణ్యములో నిల్పించెను.

ఏనుఁగులను బట్టుతమిలో మునిఁగి యున్న వత్సరాజును ఆశ్రయించి బ్రదుకువారైన చారులు దానిని దూరమునుండి చూచి శీఘ్రముగా పోయి 'దేవా! వింధ్యారణ్యములో ఒక యేనుఁగు తిరుగుచున్నది. భూలోకములో దానివంటిది మఱియొకటి లేదు. దానిదేహము ఆకాశమును వ్యాపించి యున్నది. అది వింధ్యాచలమే నడచుచున్నట్టు ఉన్నది.' అని వత్సరాజుతో నివేదించిరి. చారులమాటలను విని వత్సరాజు సంతోషించి వారికి లక్షవరహాలు పారితోషిక మిచ్చి 'ఆయేనుఁగును పట్టి

తినా అది నడగిరికి ప్రతిద్వంద్వి యగును. అంతట చండమహా సేనుఁడు నిశ్చయముగా వశ్యుఁ డయి వాసవదత్తను తానే నాకు సమర్పించును.' అని తలపోయుచు ఆరాత్రి గడపెను. తెల్లవాఱఁగానే మంత్రులమాటను పాటింపక ఏనుఁగుమీఁది. యాశచేత ఆ చారులనే ముందుంచుకొని వింధ్యారణ్యమునకు బయలుదేఱెను. మొదట ఖయిదు పిమ్మట కన్యాలాభమును ప్రయాణలగ్నమునకు ఫల మని గణకులు చెప్పఁగా వారి మాటనుకూడ లక్ష్యపెట్టఁడాయెను. వింధ్యారణ్యము ప్రవేశించినవాఁడై ఆయేనుఁగు బెదరకుండుటకై సైన్యమును దూరమందే నిలిపి చారులను మాత్రము తోడ్కొని ఘోషవతియను తనవీణను చేతఁ బుచ్చుకొని తన దుర్వ్యసనమువలె విస్తీర్ణ మయిన యామహారణ్యమును ప్రవేశించి అక్కడ వింధ్యమునకు దక్షిణపువైపున చారులు దూరమునుండియే చూపఁగా సత్య గజమువలె నాభాసించుచున్న యామాయాగజమును చూచి ఏకాకిగా వీణ వాయించుచు ఏనుఁగును బంధించు సాధనము లూహించుచు మధురముగా పాడుచు మెల్ల మెల్లఁగా దానిని సమీపించెను. మనస్సు గానమం దుండుటచేతను సాయం కాలపు చీఁకటిచేతను వత్సరాజు దానిని వనగజము కాదనియు మిథ్యాగజ మనియు తెలిసికో నేరఁడాయెను. ఆయేనుఁగు గీత రసముచేతనుంబోలె చెవులు ఱిక్కఁబెట్టుకొని దగ్గఱకు వచ్చి నట్టె వచ్చుచు, మరల దొరకక దూరము పోవుచు, అతని చాల

దూరము ఎలయించుకొని పోయెను. అంత నాయంత్రగజము నుండి పురుషులు సన్నద్ధులై బయటవచ్చి వత్సరాజును చుట్టుకొనిరి. వత్సరాజు సురియ దూసికొని ఎదుటివారితో పోరుచుండి వెనుకవారిచేత పట్టువడెను. ఆయోధులు సంకేతము ప్రకారము వచ్చినయితరసైనికులతో కూడ కలసికొని వత్సరాజును చండమహాసేనునియొద్దకు కొనిపోయిరి. చండమహాసేనుఁడు ఊరివెలుపలికి ఎదురు వచ్చి వత్సరాజును గౌరవించి అతనితో కూడ ఉజ్జయినీపురమందు ప్రవేశించెను. అవమానముచేత కళంకితుఁడై లోచనానందదాయకుఁడైన యా వత్సరాజును చంద్రునింబోలె చూచి పౌరజనులు అతనిగుణములయం దనురక్తులై అతనిని చండమహాసేనుఁడు చంపునని శంకించి చండమహాసేనుని యొద్దకు వచ్చి 'అతనిని చంపిన యెడల మేము నిశ్చయముగా ఆత్మహత్య చేసికొందుము' అని మొఱ పెట్టుకొనిరి. 'నాకు వత్సేశ్వరుఁడు చంపవలసినవాఁడు కాఁడు, సంధి చేయఁదగినవాఁడు,' అని రాజు వారికలకలమును నివారించెను. పిమ్మట చండమహాసేనుఁడు వాసవదత్తను అక్కడనే వత్సరాజునకు 'ఓప్రభూ! ఈమెకు సంగీతము నేర్పుము, పిమ్మట నీకు కల్యాణ మగును. చిత్తమందు ఆయాసపడకుము.' అని చెప్పి. శిష్యనుగా ఒప్పగించెను.

## వత్సరాజు వాసవదత్తకు సంగీతము నేర్పుట.

ఆకన్యను చూడఁగానే వత్సరాజు మనస్సు కేవలము స్నేహమయమయి ఆమెతండ్రిమీఁదికోపము నంతయు బొత్తుగా

మఱచి పోయెను. ఆమెకు చూపును మనస్సును రెండును అతని వైపు పోయినవి, అందు లజ్జచేత చూపుమాత్రము వెనుకకు మరలెను గాని, మనస్సుమాత్రము ఏవిధమునను మరల దాయెను. పిమ్మట వాసవదత్తకు సంగీతము నేర్పుచు ఆమెమీఁదనే దృష్టి కలవాఁడై అక్కడనే గాంధర్వశాలయందు వత్సరాజు నివసించి యుండెను అతనికి తొడమీఁద ఘోషవతి (యనువీణ)చే, కంఠమందు గీతశ్రుతిచే, ఎదుట వాసవదత్తచే, సదా వినోదము పెరుఁగుచుండెను. ఖయిదులో పడినను అతనిని ఛాయనిలక్ష్మియో యన వాసవదత్త తదేకాగ్రనిష్ఠతో అతనికి సదా పరిచర్య నొనరించుచుండెను.

యౌగంధరాయణుఁడు ఉజ్జయిని కేఁగుట.

ఈలోపల వత్సరాజుతో వేటకు వచ్చినదండు కౌశాంబికి పోయి చేరఁగానే రాష్ట్రమంతట ప్రభువు ఖయిదులో పడినాఁడన్నమాట తెలిసి కలఁతలు పుట్టసాగినవి. వత్సేశ్వరుని మీఁది యనురాగముచేత ప్రకృతులు కోపగించినవారై ఆక్షణమే ఉజ్జయినిని ముట్టడింప నుద్దేశించిరి. వారిని రుమణ్వంతుఁడు 'చండమహాసేనుఁడు బలముచేత సాధ్యపడువాఁడు కాఁడు, అతఁడు గొప్పవాఁడు, అట్లు చేయుటవలన వత్సరాజు శరీరమునకు కుశలము కలుగదు, కాఁబట్టి ముట్టడి యుక్తము కాదు, ఈకార్యము బుద్ధిచేత సాధింపఁ దగినది,' అని బోధించి నివారించెను. అంతట ధీరుఁడైన యౌగంధరాయణుఁడు

ప్రకృతులకు వత్సరాజుమీఁద నిశ్చల మయినయనురాగము కల దని యెఱిఁగినవాఁడై రుమణ్వాదాదులతో ని ట్లనియె: 'మీ రందఱు నిక్కడనే సర్వదా సప్రయత్నులరై యుండుఁడు. రాజ్యమును కాపాడవలయును. పరాక్రమమును సమయములో చూపవలయును. నేను వసంతకుని తోడుగా కొనిపోయి నా ప్రజ్ఞచేత వత్సరాజును విడిపించుకొని తెచ్చెదను, సందేహము లేదు. మెఱపుఁదీఁగకాంతి నీటిదెబ్బకు అధికముగా వెలింగినట్లు ఎవనిప్రజ్ఞ ఆపదలో స్ఫురించునో వాఁడే ధీరుఁడు. ఇందున కుపయోగముగా ప్రాకారములను పగులఁగొట్టు యోగములను,సంకెలలను ఊడఁగొట్టుయోగములను, అదృశ్యకరణులను, నే నెఱుఁగుదును.' ఇట్లు చెప్పి ప్రకృతులను రుమణ్వంతునిచేతిలో పెట్టి యౌగంధరాయణుఁడు వసంతకుని తోడ్కొని ఉజ్జయినికి వెడలి పోయెను. అతనితో తనబుద్ధివలె సత్త్వాఢ్యయు తననీతివలె దుర్గమయు నయినవింధ్యారణ్యము ను ప్రవేశించి, అచ్చట వింధ్యప్రాగ్భారమందు వత్సరాజు చెలికాఁడు పుళిందరాజు పుళిందకుఁ డనువానియింటికి పోయెను. అతనిని ఆదారిని రాఁబోవు నట్టివత్సరాజునకు రక్షణకై చాల దండుతో సన్నద్ధునిఁగా నుంచి అచ్చటినుండి బయలువెడలి క్రమక్రమముగా ఉజ్జయినియందు మహాకాళ శ్మశానము చేరెను.

యౌగంధరాయణునకు బ్రహ్మరక్షస్సు మిత్త్రమగుట.

అందు పొలకంపు వీచుచున్న బేతాళు రనేకులు అపర చితాధూమములో యనునట్లు చీకటివలె నల్లనివారు ఇటు నటు తిరుగుచు ముసరుకొని యుండిరి. అచ్చట ఇతనిని చూడఁగా. ప్రీతుఁడై యోగేశ్వరుఁ డనుబ్రహ్మరాక్షసుఁడు వచ్చి ఇతనితో స్వయముగానే చెలిమి చేసికొనెను. అతఁడు చెప్పినయుక్తిచేత యౌగంధరాయణుఁడు తత్క్షణమే మాఱురూపము దాల్చికొని గూనివాఁడు ముసలివాఁడు వెఱ్ఱివాఁడు బట్టతలవాఁడుగా అంద ఱకు నవ్వుపుట్టించునట్టి వికారవేషము కలవాఁ డాయెను. వసం తకుని ఆయుక్తిచేతనే నరములు పైకి తేలియున్న పెద్దబొఱ్ఱగాను నోటినిండ పండ్లుగాను వికారరూపునింగా చేసెను.

యౌగంధరాయణ వత్సరాజుల సమావేశము.

పిమ్మట వసంతకుని ముందుగా రాచనగరిద్వారము నొద్దకు పంపి తాను ఆరూపముతోనే ఉజ్జయినీపురము ప్రవే శించి అందు కుఱ్ఱవాండ్రు గుంపుగుంపుగా తనవెంట వచ్చు చుండఁగా అందఱును వినోదపడి చూచుచుండఁగా ఆడుచు పాడుచు రాచనగరియొద్దకు పోయి అక్కడ రాణులకు వేడుక చూపుచుండెను. క్రమక్రమముగా ఇతనిసంగతి వాసవదత్తచెవికి అంది ఆమె వెంటనే చేటిని పంపి ఇతనిని గాంధర్వశాలకు పిలు వంబంచెను; నవయౌవనము హాస్యైకపరాయణము గదా. యౌగంధరాయణుఁడు అక్కడికి పోయి సంకెలలఁ బడియున్న

వత్సరాజును జూచి వెట్టివేషములో నున్నను కన్నీళ్లు విడుచుచు వత్సరాజునకు సంజ్ఞ చేసెను. వత్సరాజు అతనిని మాఱువేషము దాల్చి వచ్చినయౌగంధరాయణునిగా తెలిసికొనెను. అంతట యౌగంధరాయణుఁడు యోగవిద్యచేత వాసవదత్తకును ఆమె చేడియకునుఅదృశ్యుఁడై రాజునకు మాత్రము అగపడుచుండెను. ఆ స్త్రీలందఱు అందుల కాశ్చర్యపడి 'ఉన్నట్టే ఉండి ఎక్కడికి మాయమై పోయినాఁడు ఈవెట్టివాఁడు!' అని పలుకుటను తన కంటికి మాత్రము అగపడుటను చూచి వత్సరాజు అదంతయు యౌగంధరాయణుని యోగమహిమ యని యెఱింగి వాసవదత్తను పిలిచి 'అమ్మాయీ! సరస్వతీపూజకు ద్రవ్యములు తీసికొనిరా' అని పంపెను. వాసవదత్తయు చేటికలతోకూడ లేచి వెడలిపోయెను.

అంతట యౌగంధరాయణుఁడు వత్సేశ్వరునికి సంకెలలు పగులఁగొట్టుయోగములను, వాసవదత్తను వశీకరించుటకై వీణాతంత్రులయం దుంపఁబడిన మఱికొన్ని యోగములను, ఇచ్చి 'రాజా! వసంతకుఁడు ఇక్కడికి మాఱురూపమున వచ్చి ద్వారములో నిలిచి యున్నాఁడు, వానిని నీచెంత బ్రాహ్మణునిగా నుంచుకొనుము; ఎప్పటికి వాసవదత్త నీయందు నమ్మకము పొందునో అప్పుడు నే నేమి చెప్పుదునో అట్లు చేయుదువు గాక, అంతవఱకు స్వస్థముగా నుండుము.' అని చెప్పి త్వరగా అట నుండి వెడలిపోయెను.

ఆక్షణములోనే వాసవదత్తయు పూజాద్రవ్యములు కొనివచ్చెను. ఆమెతో రాజు 'నగరిదర్వాజావెలుపల బ్రాహ్మణుఁ డొకఁ డున్నాఁడు. అతనిని సరస్వతీపూజలో దక్షిణ గ్రహించుటకై పిలిపింపుము.' అనెను. అలాగే అని వాసవదత్త ద్వారముదగ్గఱ నున్న వికృతరూపుని వసంతకుని పిలిపించెను. అతఁడు వచ్చుచునే వత్సరాజును చూచి దుఃఖముచేత ఏడువసాగెను. రహస్యము బయటఁ బడకుండుటకు అతనితో రాజు 'బ్రాహ్మణుఁడా! నీరోగవైరూప్య మంతయు నేను వైద్యము చేయించి మాన్పించెదను, ఏడువక నాయొద్ద నుండుము.' అనెను. 'దేవా, మహాప్రసాదము' అని వసంతకుఁడు పలికెను. రాజు అతని వికృతరూపము చూచి చిఱునగవు నవ్వెను. దానిని చూచి యాయభిప్రాయము నెఱిఁగి వసంతకుఁడు నోరు మహావికారముచేసి వెడవెడ నవ్వసాగెను. ఆరూపమున నవ్వుచున్న యతనిని చూచి వాసవదత్త మిక్కిలియు సంతోషించి నవ్వెను. పిమ్మట ఆమె అతనిని పరిహాసముచేత 'బ్రాహ్మణుఁడా, నీకేమి విద్య తెలియును? చెప్పుము.' అని యడిగెను. 'దేవీ, నేను కథలు చెప్ప నేర్తును' అని వసంతకుఁడు పలికెను. 'అట్లయిన ఒకకథ చెప్పుము' అని వాసవదత్త యడిగెను. అంత నారాజపుత్త్రిని రంజించువాఁడై వసంతకుఁడు హాస్యమై చిత్రములచే సరస మయిన యీకథను చెప్పం దొడంగెను.

## లోహజంఘునికథ.

శ్రీకృష్ణులవారికి జన్మభూమి మథుర యని యొకనగరము కలదు. అందు ప్రసిద్ధికెక్కిన భోగముది యొకతె రూపిణిక యనునది కలదు. దానితల్లి మకరదంష్ట్రి యనుముసలి తార్పుగత్తె. ఆభోగముదాని గుణములచే లాఁగఁబడినకోడెకాండ్ర దృష్టికి ఆముసలిది విషవర్షముగా నుండెను. ఒకనాఁడు రూపిణిక తన నౌకరీప్రకారము పూజాకాలమందు దేవాలయమునకు పోయియుండి అక్కడ దూరమున ఒకానొకపురుషుని చూచి చేటిని 'ఓసి నీవు పోయి అతనిని ఈరాత్రి నాయింటికి రమ్మనవే' అని యాజ్ఞాపించెను. చేటియు అట్లే చేసెను. అంత నతఁడును కొంచెము ఆలోచించి దానితో 'నాపేరు లోహజంఘుఁడు, నేను బ్రాహ్మణుఁడను, నాకు ధనము లేదు; ధనికులకు తగిన దైన రూపిణికాగృహమునకు వచ్చుటకు నే నెవఁడను!' అనెను. 'మాస్వామిని నీవలన ధన మపేక్షింపదు,' అని చేటి చెప్పఁగా సరియే యని లోహజంఘుఁడు అంగీకరించెను. ఆమాటను చేటి వలన నెఱింగి రూపిణిక ఉత్సుకురాలై యింటికి పోయి అతని రాకనే ఎదురు చూచుచుండెను. క్షణములో లోహజంఘుఁడు దానియింటికి వచ్చెను. వానిని మకరదంష్ట్రి వీఁ డెక్కడివాఁడు అని చూచుచుండెను. వానిని చూడఁగానే రూపిణిక లేచి గౌరవముతో మెడ కౌఁగిలించుకొని పడకటింటికి కొనిపోయెను. అచ్చట రూపిణిక వానిసౌభాగ్యసంపదలకు లోఁబడినదై వాని

పొందుకన్న వేఱే ఫలము జన్మమునకు లేదని తలంచి యుండెను. అదిమొదలు పరపురుషులను చూడనైన నొల్లని యారూపిణి కతో ఐహికసుఖము లనుభవించుచు లోహజంఘుఁడు దాని యింటనే నివసించి యుండెను. సకలవేశ్యలకును విద్యనేర్పిన దైనమకరదంష్ట్రి దానిని జూచి ఖిన్నురాలై తనకూఁతురు రూపిణికతో రహస్యముగా నిట్లులనియె: 'అమ్మా, ఏమే డబ్బు లేనివీనిని సేవించుచున్నావు? జనులు శవమును స్పృశింపరు. వేశ్యలు నిర్ధనుని స్పృశింపరు. వేశ్య యెక్కడ? అనురాగ మెక్కడ? ఈమాట నీవు ఎట్లు మఱచితివి? ఓసియమ్మా, రాగ వంతురాలైనవేశ్య సంధ్యవలె చిరకాలము ప్రకాశింపదు. భోగముది నటివలె లేనిప్రేమను ధనముకొఱకు చూపవల యును. కనుక ఈదరిద్రుని వదలుము; చెడిపోకుము.' అనెను.

ఈమాటకు రూపిణిక రోషముతో 'అమ్మా, అట్లనకు; ఇతఁడు నాకు ప్రాణములకంటెను ప్రియుఁడు. నాకు అమిత ముగా ధన మున్నది. ఇంక నెక్కువధనము నాకేల ? అమ్మా ఇఁకను మరల ఈమాట నాతో చెప్పకుము.' అనెను. ఆమాట విని మకరదంష్ట్రి క్రోధము వహించి లోహజంఘుని తఱుమఁ గొట్ట నుపాయము వెదకుచు ఉండెను. పిమ్మట నొకనాఁడు ఒకరాజపుత్త్రుఁడు ధనము క్షయించినవాఁడు ఆయుధపాణుల పరివారముగలవాఁడు ఆమార్గమున వచ్చెను. వానిని చూచి మకరదంష్ట్ర శీఘ్రముగా వానికడకు పోయి ఏకాంతముగా

ఇట్లనియె: 'అయ్యా! ఒకానొక కాముకుఁడు దరిద్రుఁడు నా యింటిని ఆక్రమించుకొన్నాఁడు. నీవు వచ్చి వానిని నాయిల్లు వెడల నడిచి నాకొమారితను పరిగ్రహింపుము.' అందుల కంగీకరించి రాజపుత్త్రుఁడు దానియింట ప్రవేశించెను. ఆసమయములో రూపిణిక దేవాలయమునకు పోయియుండెను. లోహజంఘుఁడు వెలుపల ఎక్కడికో పోయియుండి క్షణములో నిశ్శంకముగా అక్కడికి వచ్చెను. రాఁగానే రాజపుత్త్రునిభటులు వానిమీఁదికి పరుగెత్తిపోయి మంచితాఁపులు తన్ని ఒడలెల్ల విఱుగఁ గొట్టి అశుచిపూర్ణమయిన యొకగోతిలోఁ ద్రోసిరి. అయినను లోహజంఘుఁడు అందుండి లేచి పాటిపోయెను. రూపిణిక ఇంటికి వచ్చి ఆవృత్తాంతము నెఱిఁగి శోకాకులయై యేడ్చుచుండెను. దాని దుఃఖము చూచి రాజపుత్త్రుఁడు దానిని వదలిపెట్టి వెడలిపోయెను.

### లోహజంఘుఁడు ఏనుఁగుడొల్లలో లంకం జేరుట.

లోహజంఘుఁడు ఈప్రకారము కుట్టనిచే శాస్తి పొంది ఆదుఃఖముచేత తీర్థయాత్రలు చేయుటకును, వియోగదుఃఖముచేత ప్రాణత్యాగము చేయుటకును, ఉద్యమించి అడవింబడి పోవుచు మనస్సులో కుట్టనిమీఁదికోపముచేతను వెలుపల మిడిమిడియెండచేతను కాలినవాఁడై ఏదైన నొకపెద్దచెట్టునీడ అగపడునా అని వెదకుచుండెను. ఎక్కడను పెద్దచెట్టు లేక పోయెను గాని ఒకచోట ఏనుఁగుకళేబర మొకటి యుండెను.

దానిని లోపలిమాంసమంతయు నక్కలు తినివైచి డొల్లగా చేసినవి. లోహజంఘుఁడు దానిలోపలికి ఆసనముద్వారా ప్రవేశించి ఆద్వారముగుండ వీచుచున్న చల్లగాలిచేత బడలిక తీఱ పరుండి నిద్రపోయెను. ఆకస్మికముగా అక్కడ మబ్బు గ్రమ్మి అంతటను జడివాన కుంభవృష్టిగా కుమ్మరిల్ల సాగెను. దానివలన ఆతోలుడొల్ల యొక్క యాసనము మూసికొనిపోయెను. క్షణములో ఆమార్గమున సెలయేఱు ఒకటి వఱద వచ్చి ఆడొల్లను కొట్టుకొనిపోయి గంగలో పడవైచెను. గంగ సముద్రము చేర్చెను. ఆడొల్లను గరుడవంశపక్షి యొకటి మాంసభ్రమచేత సముద్రము నవతలిగట్టునకు తన్నుకొని పోయి ముక్కుతో పగిల్చి అందులోనున్న మనుష్యుని చూచి బెదరి పాఱిపోయెను. పక్షియొక్క అడావడికి మేలుకొన్న వాఁడై లోహజంఘుఁడు అది ముక్కుతో చేసినరంధ్రముగుండ వెలుపలికి వచ్చి తాను సముద్రపుగట్టున నుండుట గని యాశ్చర్యపడి అది యంతయు నిద్రలేని స్వప్నమని భావించెను.

అచ్చట రాక్షసు లిద్దఱు ఘోరదర్శనులగపడిరి. వారిని చూడఁగా ఇతనికి భయ మాయెను. వారును ఇతనిని చూచి భయపడసాగిరి. 'పూర్వము మనుష్యమాత్రుఁడైన శ్రీరాముని వలన తమకు పరాజయము కలుగుటయు ఇప్పు డితఁడును ఆయనవలెనే సముద్రమును దాఁటి వచ్చి యుండుటయును తలఁచి భయాక్రాంతులై వా రిద్దఱును అప్పుడు చేయవలసిన

దే మని యాలోచించి ఆవృత్తాంతమును తమప్రభువు విభీషణు నికి తెలుపవలసినది అని నిశ్చయించుకొనిరి. ఒకఁడు అక్కడనే నిలిచి యుండఁగా రెండవవాఁడు పోయి విభీషణమహారాజునకు తాను చూచినవృత్తాంతమును యథాస్థితముగా నివేదించెను.

### లోహజంఘుని విభీషుఁడు సత్కరించుట.

విభీషణుఁడును రాములవారిప్రభావము ఎఱిఁగినవాఁడు గావున, మనుష్యునిరాకకు భయపడి ఆరాక్షసునితో 'ఓరి మంచివాఁడా! నీవు పోయి నామాటగా ఆమనుష్యుని మా యంటికి వచ్చుటకు అనుగ్రహించునట్లు ప్రార్థింపుము.' అనెను. వాఁడును వల్లె యని వెంటనే వచ్చి భయముతో తమప్రభువు యొక్క ప్రార్థనను లోహజంఘునికి నివేదించెను. అందునకు శాంతచిత్తుఁడై అంగీకరించి ఆబ్రాహ్మణుఁడు ఆరాక్షసుఁడును వానిచెలికాఁడును వెంట రా లంకాపట్టణమును ప్రవేశించి అక్కడి బంగారపుమేడలు చూచి యాశ్చర్యపడుచు రాజభవనమునకు పోయి విభీషణుని చూచి ఆశీర్వాదము చేసెను. విభీషణుఁడు ఇతనికి అతిథిసత్కారములు చేసి 'ఓబ్రాహ్మణో త్తమా! ఈభూమికి నీ వెట్లు వచ్చినాఁడవు?' అని యడిగెను. ఆ గడుసువాఁ డిట్లు చెప్పం దొడంగెను.

నేను బ్రాహ్మణుఁడను, నాపేరు లోహజంఘుఁడు. నివాసము మథురాపురము. నేను దారిద్ర్యపీడితుఁడనై దేవాలయమునకు పోయి నారాయణునియెదుట నిరాహారుఁడనై

తపస్సు చేసితిని. నాకు శ్రీహరి స్వప్నములో దర్శన మిచ్చి 'విభీషణునియొద్దకు పో, అతఁడు నాభక్తుఁడు, నీ కతఁడు ధన మిచ్చును.' అని యనుగ్రహించెను. 'నే నెక్కడ? విభీషణుఁ డెక్కడ?' అని యడుగఁగా, ఆప్రభువు 'పో. నీవు ఇప్పుడే ఆయనను జూతువు.' అని యాజ్ఞాపించెను. ఇట్లు దేవుఁడు చెప్పఁగా ఇక్కడ సముద్రపుగట్టున మేలుకొన్నాఁడను. ఇంత కన్న నాకేమియు తెలియదు.

లోహజంఘుఁడు ఇట్లు చెప్పుటయు లంకాపట్టణము నరులకు దుర్గమ మగుటయు కని అది నిజముగా దేవతామహి మయే యని తలంచి విభీషణుఁడు ఆబ్రాహ్మణుని 'ధన మిచ్చెదను, ఉండు' మని చెప్పి నరభోజను లయినరాక్షసులతో అతనిని పంపుట అపాయహేతు వని ఆలోచించి అతఁడు మరల మథురకు పోవుటకు వాహనముగా మచ్చికచేసికొనుటకై ఆసమీపమం దున్న స్వర్ణమూల మను పర్వతమునుండి గరుడవంశజాత మైన యొకపక్షిపిల్లను తెప్పించి యిచ్చెను. ఇట్లు విభీషణునిచేత సత్కరింపఁబడినవాఁడై లోహజంఘుఁడు విశ్రమార్థమై కొంత కాలము లంకయందు నిలిచెను ఒకనాఁడు కుతూహలముచేత అతఁడు విభీషణుని ఆభూమి యంతయు కొయ్యగా నుండుటకు కారణ మడిగెను. విభీషణుఁ డిట్లనియె:

లంకానిర్మాణ వృత్తాంతము.

ఓబ్రాహ్మణోత్తమా! నీకు కుతూహలమేని చెప్పెదను వినుము. పూర్వము వినత ఒకానొకప్రతిజ్ఞప్రకారము నాగ

మాతకు కద్రువకు దాసియై యుండఁగా గరుత్మంతుఁడు తల్లి దాస్యమును మాన్ప వేఁడి ఆమెయొక్క స్వాచ్ఛంద్యమునకు వెలగా నాగుల నిమిత్తమై స్వర్గమునుండి అమృతమును తెచ్చు వాఁడై తనకు ఆపనికి తగినబలము కలుగుటకై తండ్రి యయిన కశ్యపప్రజాపతియొద్దకు పోయి ఆహార మడిగెను. అంత కశ్య పులవారు 'పుత్రా, సముద్రమున రెండు గొప్పగజకచ్ఛపములు శాపజాతములు పోరుచున్నవి, వానిని భక్షింపుము.' అనిరి. గరుడుఁడు ఆరెండుభక్ష్యములను తన్నుకొనిపోయి ఒక గొప్ప కల్పవృక్షముయొక్క కొమ్మమీఁద కూర్చుండెను. ఆబరువునకు ఆకొమ్మ విఱిగిపోఁగా క్రింద తపస్సు చేయుచున్న వాలఖిల్యుల పై దయారసముచేతను లోకములు నలిఁగిపోవు నని భయపడు చున్న తండ్రిగారి యాజ్ఞ చేతను దానిని క్రింద పడనీయక ముక్కు తోనే కఱచుకొని పోయి ఇక్కడ విజనమందు పడవైచెను. ఆకొమ్మమీఁద ఈలంకాపట్టణము ఏర్పడినది. అందుచేతనే ఇది అంతయు కొయ్యగా నున్నది.

లోహజంఘుఁడు పక్షి నెక్కి మథురం జేరుట.

విభీషణునివలన నిట్లు విని లోహజంఘుఁడు సంతో షించెను. పిమ్మట లోహజంఘుఁడు మథురాపురమునకు పోఁ గోరఁగా అతనికి విభీషణుఁడు మిక్కిలి వెలగలరత్నముల నిచ్చి, భక్తిచేత మథురయందలి శ్రీహరికి సమర్పింపు మని అతనిచేతికి బంగారవుగదాశంఖచక్రములు నిచ్చెను. విభీషణుఁ డిచ్చిన

దంతయు పుచ్చుకొని లోహజంఘుఁడు లక్షయోజనములు పోవునది యైనయాపక్షి నెక్కి ఎగిరి ఆకాశమార్గమున లంకా పట్టణమును సముద్రమును దాఁటి అక్లేశముగా క్షణములో మథురాపురము చేరెను. అందు ఊరివెలుపల నొకపాడువిహార మందు ఆకాశమునుండి దిగి రత్నరాశిని ఒకచోట దాఁచి పక్షిని కట్టివైచి బజాఱునకు పోయి ఒకరత్నము నమ్మి వస్త్రము లు మైపూఁతలు పువ్వులు అలంకారములు భోజనమును కొని తెచ్చెను. ఆవిహారములోనే భుజించి పక్షికిని మేఁత పెట్టి ఆవస్త్రాంగరాగపుష్పాలంకారములు ధరించెను. చీకటి పడఁ గానే ఆశంఖచక్రగదలను ధరించి పక్షిని ఎక్కి రూపిణిక యిం టికి పోయి చోటు చక్కఁగా ఎఱిఁగియున్నాఁడు గావున రహ స్యముగా రూపిణిక యున్నచోట ఆకాశమందే నిలిచి గంభీర ముగా శబ్దము చేసెను. అంత రూపిణిక వెలుపలికి వచ్చి రత్నములచేత దేదీప్యమానుఁడై విష్ణుచిహ్నములు గలిగి ఆకాశములోనున్న యాతనిని చూచెను. 'నేను హరిని, ఇక్క డికి నీకోసము వచ్చినాఁడను' అని యాతఁడు చెప్పఁగానే అది ప్రణమిల్లి, దేవా దయచేయుము, అనెను. లోహజంఘుఁడు దిగి పక్షి నొకచోట కట్టివైచి ఆకాంతతోఁ గూడ శయనగృహము చేరి దానిపొందున నుండి, క్షణములో అచ్చటినుండి వెలువడి పక్షి నెక్కి ఆకాశమార్గమున పోయెను. 'నేను దేవతను విష్ణుభార్యను, మనుష్యులతో మాటలాడను.' అని రూపిణిక

ఆమఱునాఁడు ప్రాతఃకాలమున మౌనము పూని యుండెను. 'ఇట్లున్నావేమే అమ్మా చెప్పవే' అని మకరదంష్ట్రి నిర్బంధ పెట్టఁగా రూపిణిక తనకును తల్లికిని నడుమ తెర వైచి తన మౌనమునకు కారణముగా ఆరాత్రి వృత్తాంతమును చెప్పెను. ఆమాటయందు సందేహము గలదై మకరదంష్ట్రి మఱుచటి రాత్రి ఒకచోట దాఁగి యున్నదై విహగారూఢుఁడై వచ్చిన లోహజంఘుని చూచెను:

## లోహజంఘుఁడు వేశ్యామాతను శాస్తిచేయుట.

తెల్లవాఱఁగానే మకరదంష్ట్రి వచ్చి తెరచాటున నున్న రూపిణికతో వినయముతో ఇట్లు విన్నపముచేసికొనెను 'అమ్మా, నీవు దేవునియనుగ్రహముచేత దేవత వైతివి. నేను నీకు తల్లిని గదా, నాకు సుతాఫలమును ఇమ్ము, ముసలిదాన నైన నేను బొందితోనే స్వర్గమునకు పోవునట్లుగా దేవునికి మనవిచేయుము, నాయందనుగ్రహింపుము.' అందున కంగీక రించి రూపిణిక ఆ మఱుచటిరాత్రి యథాప్రకారము వచ్చిన యా మాయవిష్ణువుతో మనవి చేసెను. దేవవేషమున నున్న లోహ జంఘుఁడు ప్రియతో నిట్లనియె. 'నీతల్లి పాపాత్మురాలు, స్వర్గ మునకు బహిరంగముగా కొనిపో నర్హురాలు కాదు. ఏకాదశి నాఁటి ప్రాతఃకాలమున స్వర్గద్వారము తెఱవఁబడును. అప్పుడు శాంభవులు ప్రముఖు లనేకులు ముందు ప్రవేశింతురు. వారిమధ్యలో వారివేషముతో నీతల్లినికూడ ప్రవేశపెట్టెదను.

అందులకై దానితలను పంచశిఖలు పెట్టించి గొరిగించి, మెడలో ఎముకలపేరు, ఒకపార్శ్వము కాటుకపూఁత, రెండవ పార్శ్వము సిందూరపుఁబూఁతయుఁగాఁ జేసి, దిసమొలగా చేయుము. ఈప్రకారము గణాకారము దాల్చిన దీనిని నేను సులువుగా స్వర్గమునకు కొనిపోయెదను.' ఇట్లు చెప్పి క్షణములో లోహజంఘుఁడు వెడలిపోయెను. తెల్లవారఁగానే రూపిణిక తల్లికి ఆవేష మంతయు వైచెను. మకరదంష్ట్రయు స్వర్గమునకు ఎప్పుడెప్పుడు పోదునా యని కనుపెట్టుకొని యుండెను.

మఱునాఁడు చీకటిపడఁగానే లోహజంఘుఁడు యథాప్రకారము విహగారూఢుఁడై వచ్చెను. రూపిణికయు గణవేషమున నున్నతల్లిని అతనికి ఒప్పగించెను. అంత నతఁడు విహగారూఢుఁడై ఆకుట్టనిని దిసమొలదానిని వికారవేషము దానిని వెంటఁ దీసికొని వేగముగా ఆకాశమున ఎగిరిపోయి ఆకాశమందే కొంచెము నిలిచి దేవాలయమునెదుట నెత్తిమీఁద చక్రముగలిగిన యున్నతమయిన రాతిస్తంభమును జూచి దానిమీఁద ఆచక్రముకంటె వేఱాలంబము లేనిచోట ఆకుట్టనిని తన్ను శాస్తిచేసినందుల ప్రతిక్రియయొక్క జెండానుంబోలె నిలిపి 'ఇక్కడనే రవంత సేపు ఉండుము, నేను భూలోకమునకు పోయి సాన్నిధ్యానుగ్రహము చేసి వచ్చెదను.' అని చెప్పి దానికంటి కగపడకుండ పోయి అక్కడనే దేవునియెదుట రాత్రి జాగర

ర్థమయి వచ్చియున్న జనసంఘమును జూచి ఆకాశము నుండియే 'ఓజనులారా! ఇక్కడ మీమీఁద పడఁబోవుచున్నది సర్వసంహారిణి మారి, పొండి, హరిని శరణు చొరుండి' అని పలికెను. ఈ యాకాశపు మాటను విని మథురాపురజను లందఱు భయపడి దేవుని ఆశ్రయించి స్వస్త్యయనము కావించుచు ఉండిరి. లోహజంఘుఁడును దేవవేషము తీసివైచి దిగి ఎవరికిని దెలియకుండ ఆమనుష్యులమధ్యనే చేరి ఏమి జరుగునో అని చూచుచుండెను. 'దేవుఁడు ఇంకను రాఁడాయెనే! నేను స్వర్గమునకు పోనైతినే' అని కంబముమీఁద నుండి కుట్టని తలపోయుచుండెను. అట నుండుటకు అశక్తురాలై భయపడి 'అయ్యో! అయ్యో! పడుచున్నాను! పడుచున్నాను!' అని జనులకు వినఁబడ నంగలార్చుచుండెను. అమాట విని 'పడినది గదరా మారి!' అని తలఁచి కలఁతపడినవారై 'దేవీ, పడకు పడకు.' అని దేవుని యెదుటనున్న జనులు మొఱపెట్టసాగిరి. మారి పతనభయముచేత ఆబాలవృద్ధము మథురావాసు లందఱును మహాకష్టముతోను దిగులుతోను ఎట్టకేలకు ఆరాత్రి గడపిరి. తెల్లవాఱఁగానే స్తంభముపై ఆదశలోనున్న కుట్టనిని రాజుతో కూడ పౌరు లందఱు ఆనవాలుపట్టి భయముతీఱి నవ్వసాగిరి. ఇంతలో ఆవృత్తాంతము విని రూపిణిక వచ్చి స్తంభాగ్రమందున్న తనతల్లిని చూచి వెరఁగుపడి అక్కడి జనులచేత దానిని దింపించెను. దిగఁగానే కుతూహలముచేత జను లందఱును ముసురు

కొని కుట్టనిని అట్లేల సంభవించె నని యడుగఁగా అదియు సర్వ వృత్తాంతమును జరిగినది జరిగినట్లు చెప్పెను. అంతట అది యెల్ల సిద్ధాదుల యద్భుతచరిత్రముగాఁ దలఁచి రాజుతో కూడ అక్కడ నున్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ఇట్లు పలికిరి. 'లెక్కలేని కాములకును వంచించియున్న యీవృద్ధవేశ్యను ఇప్పు డిట్లు వంచించినవాఁ డెవఁడో అతఁడు ప్రత్యక్ష మగును గాక. అతనికి పట్టాభిషేకము చేసెదము.' అంతట లోహజంఘుఁడు బయటఁ బడినవాఁడై వా రడుగఁగా సర్వవృత్తాంతమును ఆమూలాగ్రముగా తెలియఁజేసెను. ఆశంఖచక్రాద్యుపాయనమును విభీషణుఁడు పంపినదానిని జనులు ఆశ్చర్య పడుచుండఁగా దేవునికి సమర్పించెను. అంతట మథురాపురజను లందఱు సంతోషించి అతనికి రాజాజ్ఞ చేత పట్టము గట్టి రూపిణికను స్వాధీన పఱిచిరి. లోహజంఘుఁ డిట్లు కుట్టనిచేసిన నికారమునకు ప్రతిక్రియ చేసి తన ప్రియతో కూడుకొన్నవాఁడై రత్నసమూహముతో నిండినబొక్కసము కలవాఁడై సుఖముగా నుండెను. బద్ధుఁడైయున్న వత్సరాజుచెంత మాఱురూపున నున్న వసంతకుని వలన ఈకథను విని వాసవదత్త పరమానందభరితురాలాయెను.

---

## ౫ - వ త ర ం గ ము.



### వాసవదత్తా హరణము.

క్రమక్రమముగా వాసవదత్త తండ్రిపక్షమునుండి పరాఙ్ముఖురాలై వత్సరాజునందు మిక్కిలి యనురక్తురా లాయెను. అంతట యౌగంధరాయణుఁడు అదృశ్య కరణిచేత వత్సరాజు కడకు ఇతరుల కగపడకుండ వచ్చి అతనితో ఏకాంతములో వసంతకుని సమక్షమందు ఇట్లని విన్నపించెను. ' రాజా! నిన్ను చండమహాసేనుఁడు మాయచేత ఖయిదుచేసినాఁడు. నిన్నితఁడు కొమారిత నిచ్చి సమ్మానించి విడిపింపఁ దలఁచియున్నాఁడు. కనుక ఇతనికొమారితను మనము స్వయముగా హరించి కొనిపోవుదము. ఇందువలన నితనిగర్వమునకు తగినదండన యగును. మనకు పౌరుషము లే దనులాఘవము ఉండదు. ఇతఁడు కొమారితకు భద్రవతి యనెడి యేనుఁగును ఇచ్చియున్నాఁడు. దానివేగమును పట్టుటకు సామర్థ్యము నడగిరికి తప్ప మఱి యేయేనుఁగునకును లేదు. దానిని చూచిన యెడల నడగిరి దానితో యుద్ధము చేయనే చేయదు. దాని మావటీనికి ఆషాఢకుఁ డనువానిని నేను విస్తారము ధన మిచ్చి స్వాధీనపఱచుకొని యున్నాను. కనుక వాసవదత్తా సహితుఁడవై సాయుధుఁడవై ఆయేనుఁగు నెక్కి రాత్రి ఇక్కడినుండి

రహస్యముగా వెడలి పోవలసినది. ఏనుఁగుల యింగితము నెఱిఁగిన యిక్కడి మావటీనిని ఈ సంచు తెలిసికొనకుండు నట్లు తప్పఁ ద్రాగించెదము. నీచెలికాఁ డయినపుళిందకుని యొద్దకు మార్గరక్షార్థము నేను ముందుగా పోయి యుండెదను.' ఇట్లు చెప్పి యౌగంధరాయణుఁడు వెడలిపోయెను. .

వత్సరాజు చేయవలసిన యావిషయము నంతయు హృదయములో నుంచుకొనెను. ఇంతలో వాసవదత్త అతని యొద్దకు వచ్చెను. వత్సరాజు ఆమెతో నానావిస్రంభకథలు చెప్పుచుండి యౌగంధరాయణుఁ డుపదేశించిన యా ప్రయోగము ను ఆమెకు తెలియఁబఱిచెను. ఆమెయు దాని కంగీకరించి ప్రయాణమునకు నిశ్చయించుకొన్నదై యాషాఢకుని పిలిపించి ప్రయాణసన్నాహము చేసికొమ్మని యాజ్ఞాపించెను. దేవతా పూజావ్యాజముచేత మైకపుద్రవ్యములు కలిపిన సారాయిని పెద్దమావటివానితో కూడ మావటీండ్ర నందఱను త్రాగించెను. రాత్రి మేఘము విలాసముగా ఉఱుముచుండఁగా ఆషాఢకుఁడు ఏనుఁగును సన్నాహముచేసి తెచ్చెను. సన్నాహము చేయుచుండఁగా పిడియేనుఁగు శబ్దము చేసెను. హస్తిభాష నెఱిఁగినవాఁ డైనమహామాత్రుఁడు ఆశబ్దమును విని 'ఇదిగో ఇప్పుడు అఱువదిమూఁడు ఆమడలు పోవుచున్నానని పిడి చెప్పినది' అని అమిత మయినకైపుచేత మాట మిగుల తడఁబడుచు చెప్పినాఁడు. మత్తుఁడు గాన వానిబుద్ధికి చక్కఁగా ఆలోచించు

శక్తిలేకపోయెను. కైపెక్కి యొడలెఱుంగకయున్న కడమ మావటీండ్రకు వానిమాట చెవిని పడనేలేదు. పిమ్మట వత్సరాజు తనవీణను పుచ్చుకొని యౌగంధరాయణుఁ డిచ్చిన యోగములచేత సంకెలలూడ్చుకొని వాసవదత్త స్వయముగానే తెచ్చియిచ్చిన యాయుధములు కైకొని వసంతకుఁడును తానును పిడి నెక్కెను. వాసదత్తయు తనగుట్టును దాఁచుచెలియయిన కాంచనమాలతోఁ గూడ ఆపిడినే యెక్కెను. మావఁటీఁడు అయిదవవాఁడుగా వత్సరాజు ఉజ్జయినినుండి ఆమత్తహస్తినియే అప్పుడు ప్రాకారమును పగులఁగొట్టి చేసినదారిగుండ వెలువడి ఆచోటిపహరావాండ్రయినవీరబాహుఁడు తాళభటుఁడు అను రాజపుత్త్రులను స్వయముగా పరిమార్చి ప్రియాసహితుఁడై సంతోషపూర్ణచిత్తుఁడై అంకుశమును ఆషాఢకుఁడు పూనియుండఁగా వేగముగా పయనము సాగించెను.

ఈలోపల ఉజ్జయినిలో హతులై పడియున్న యాప్రాకారపాలకులను చూచి కలఁతపడి రాత్రియే నగరపాలకులు ఆవృత్తాంతమును రాజునకు నివేదించిరి. అంతట వెదకి చండమహాసేనుఁడు క్రమముగా వత్సరాజు వాసవదత్తతోఁ గూడ పరారి యాయెనని తెలిసికొనెను. అతనికుమారుఁడు పాలకుఁడు పట్టణమెల్ల గందరగోళపడుచుండఁగా నడిగిరి నెక్కి వత్సరాజును వెంటఁదఱుమఁ జొచ్చెను. వెనుక తఱుముకొనివచ్చుచున్న యతనితో వత్సరాజు మార్గములో బాణములతో

యుద్ధము చేసెను. ఆపిడిని చూచి నడగిరి కొట్టదాయెను. ఈ స్థితిలో తండ్రియాజ్ఞప్రకారము గోపాలకుఁడు వచ్చి వాక్యజ్ఞుఁడైన తమ్ముని పాలకుని యుద్ధమునుండి నివారించెను. అంతట వత్సరాజు నిరాటంకముగా పయనము సాగించెను. ఈలోపల తెల్లవారెను. పిమ్మట వింధ్యారణ్యమందు ప్రవేశించి పోవుచుండఁగా మధ్యాహ్నముకాఁగా ఏనుఁగు అఱువదిమూఁడు యోజనములు నడచి దప్పిగొన్న దాయెను. అంతట రాజును భార్యయు దిగఁగానే ఏనుఁగు నీళ్లు త్రాగి ఆదోషముచేత తత్క్షణమే కాలధర్మమునొందెను. అంతట వత్సరాజును వాసవదత్తయు చింతాక్రాంతులై యుండఁగా ఆకాశమునుండి ఈశబ్దము ఆవిర్భవించెను. 'ఓరాజా! నేను విద్యాధరాంగనను, నాపేరు మాయావతి, ఇంతకాలము శాపదోషముచేత ఏనుఁగనై యుంటిని, ఇప్పుడు నీకు ఉపకారము చేసితిని, నీకు కలిగెడు కుమారునికి మరల ఉపకారము చేసెదను. ఈనీభార్య వాసవదత్త మనుష్యస్త్రీగాదు. ఈమె దేవాంగన, కారణవశమున భూమియం దవతరించినది.'

అందునకు సంతోషించి వత్సరాజు వింధ్యసానువులోని తనమిత్రము పుళిందకునికి తనరాక నెఱింగించుటకు వసంతకుని పంపి ప్రియతోఁగూడ పాదచారియై మెల్లఁగా అక్కడికే పోవువాఁడై దొంగలచే చుట్టుకొనఁబడెను. ధనుర్మాత్ర సహాయుఁడై వారలను నూటయేవురను వాసవదత్త చూచుచుండఁగానే

యమాలయమునకు పంపెను. ఆక్షణములో వసంతకుఁడు తో డ్కొని రాఁగా రాజమిత్త్రము పుళిందకుఁడు యౌగంధరాయణునితో కూడ వచ్చి రాజునకు ప్రణతుఁడై దొంగలను నివారించి వల్లభతో కూడ అతనిని తనపల్లికి తోడ్కొని పోయెను. అక్కడ వత్సరాజు అడవిదర్భ గ్రుచ్చుకొన్న యడుగులుగలదైన వాసవదత్తతో కూడ ఆరాత్రి విశ్రమించెను. తెల్లవాఱఁగానే అతని యొద్దకు సేనాపతి రుమణ్వంతుఁడు ముందుగా యౌగంధరాయణునివలన దూతముఖముగా హెచ్చరిక పొందినవాఁడై వచ్చెను. ఎల్లదిక్కులకును వ్యాపించుచు అతనిశిబిరమంతయు వచ్చెను. ఇప్పుడుగదా విశాలమయిన వింధ్యారణ్యమునకు ఇఱుకటముయొక్క స్వారస్యము తెలిసినది! శిబిరములో ప్రవేశించి ఆయరణ్యభూమియందే వత్సేశ్వరుఁడు ఉజ్జయినీ వార్తను తెలిసికొనువాఁడై నిలిచియుండెను. అక్కడ నుండఁగా అతనికడకు యౌగంధరాయణుని చెలికాఁడు వర్తకుఁ డొకఁడు వచ్చి 'దేవా! చండమహాసేనుఁడు అల్లుఁడ వయిననీయందు ప్రీతుఁడై ప్రతీహారుని నీయొద్దకు పంపియున్నాఁడు. అతఁడు ఇక్కడికి వచ్చుచు వెనుక నిలిచియున్నాఁడు. నేను అతనికి తెలియకుండ ఈవార్త నెఱింగించుటకు ముందుగా త్వరగా వచ్చినాఁడను." అని చెప్పెను. ఈమాటవిని వత్సరాజు మిగుల సంతోషించి వెంటనే వాసవదత్తతో చెప్పెను. ఆమెయు మిగుల సంతోషించెను. బంధువులను త్యజించినదియు వివాహమునకు త్వర

పడుచున్నదియు నై సలజ్జయు సోత్కంఠయు నైనవాసవదత్త అచ్చట చెంత నున్న వసంతకుని ఆత్మవినోదార్థము కథయొకటి చెప్పుమని యడిగెను. అంత నతఁడు ఆసుందరికి పతిభక్తిని పెంచునట్టి యీకథను వక్కాణించెను.

దే వ స్మి త క థ.

ఈలోకములో తామ్రలిప్తి యనునగర మొకటి కలదు. అందు ధనదత్తుఁ డని మహాధనుఁడు వర్తకుఁ డొకఁ డుండెను. అతఁడు అపుత్త్రుఁడై అనేకులను బ్రాహ్మణులను సంఘముచేర్చి ప్రణమిల్లి 'అయ్యా! నాకు త్వరలో పుత్త్రుఁడు కలుగునట్లు అనుగ్రహింపుఁడు' అని యడిగెను. అంత బ్రాహ్మణులు 'ఇదేమియు అసాధ్యము గాదు. ఈలోకములో బ్రాహ్మణులు సమస్తమును వైదికకర్మచేత సాధింపుదురు. ఇందులకు నిదర్శనము:— "పూర్వము ఒకరాజు అపుత్త్రకుఁ డుండెను. అతనికి రాణివాసములు నూటయేవురు. పుత్త్రకామేష్టిచేత అతనికి జంతు వని కుమారుఁ డొక్కఁడు కలిగినాఁడు. అతని భార్యల కందఱకును ఆశిశు వొకఁడే నూతనచంద్రోదయముగా కన్నులపండువై యుండెను. ఒకనాఁ డాబాలుఁడు ప్రాఁకుచుండఁగా వానిని తొడలో చీమ కుట్టినది. అంతట బాలుఁడు భయపడి ఏడువ సాగెను. అంతమాత్రమున అంతఃపుర మంతయు అందఱును గొల్లుమని యేడువసాగిరి. రాజుకూడ మూఢునివలె ఏడ్చెను. క్షణములో చీమను తీసి పాఱవైవఁగా బాలుఁడు ఓదార్

ఏడ్చు మానఁగా రాజు దుఃఖైక కారణ మయిన యేకపుత్త్రితకు రోసి 'నాకు! అనేకులు పుత్త్రులు కలుగుటకు ఉపాయ మేమ యిన కలదా?' అని పరితాపముతో బ్రాహ్మణుల నడిగెను. బ్రాహ్మణులు 'రాజా! కలదు ఉపాయము, ఈ నీసుతుని చంపి అగ్నిలో వీనిమాంసము నంతయు హోమముచేసి ఆహోమ గంధమును నీ రాణివాసము లందఱును ఆఘ్రాణించిన అంద ఱును సుతులను పొందుదురు.' అని పలికిరి. రాజు సర్వమును ఆప్రకారమే చేయించి నూటయేవురు సుతులను పొందెను. అట్లే నీకును మేము హోమముచేత సుతుని సాధించె దము." ఇట్లు చెప్పి బ్రాహ్మణులు దక్షిణ గ్రహించి హోమము చేసిరి. వత్సకునికి కొమరుఁడు జన్మించెను. వానికి తండ్రి గుహ సేనుఁ డని పేరు పెట్టుకొనెను. ఆచిన్నవాఁడు యౌవన వంతుఁడు కాఁగా తండ్రి వానికి పిల్లను వెదుక నారంభించి కుమారునిఁగూడ వెంటఁబెట్టుకొని వర్తకమున కని మిష పెట్టి ద్వీపాంతరము పోయి అందు ధర్మగుప్తుఁ డను వైశ్యోత్తముని దేవస్మిత యనునతనికన్యను గుహసేనుని కిమ్మని యడిగెను. ధర్మగుప్తుఁడు కొమారితమీఁది గారాబముచేత తామ్రలిప్తి దూర మని ఆసంబంధమును అంగీకరింపఁ డాయెను. దేవస్మిత గుహసేనుని చూచి అతని గుణములకు వలచి ఆతని నిమిత్తమై తల్లిదండ్రులనుకూడ వదలుటకు నిశ్చయించుకొన్నదై సఖీ ముఖముగా సంకేత మేర్పఱిచి ఆచెలువునితోను వానితండ్రి

తోను కూడి రాత్రి ఆద్వీపమునుండి పరారి యాయెను. తామ్రలిప్తి చేరి వివాహ మయినతరువాత ఆదంపతుల మనస్సులు రెండును ప్రేమ యను పాశముచేత ఒకటిగా కట్టఁబడిన వాయెను.

వా డ ని క మ ల ము లు.

పిమ్మట కాలక్రమమున తండ్రి పరలోకగతుఁడు కాఁగా గుహసేనుని వర్తకమునకై కటాహద్వీపమునకు పోవునట్లు బంధువు లందఱును ప్రేరణచేసిరి. అందులకు దేవస్మిత దేశాంతరమం దతఁడు అన్యస్త్రీసక్తుఁ డగు నని శంకించి అంగీకరింప లేదు. ఒకవైపు బంధుప్రేరణ ఒకవైపు దేవస్మితయొక్కయసమ్మతి; గుహసేనుఁడు ఇతికర్తవ్యతామూఢుఁడై దేవాలయమునకు పోయి నాకు ఈవిషయములో దేవుఁడే ఉపాయము నేర్పునుగాక, యని నిరాహారముగా వ్రతము చేసెను. దేవస్మితయు అతనితో కూడ వ్రతము చేసినది. అంతట వారికి శివుఁడు స్వప్నములో దర్శన మిచ్చి రెండు ఎఱ్ఱదామర లిచ్చి 'మీ రిద్దఱును ఇందులో ఒక్కొకటి చేత నుంచుకొనుఁడు. దూరమం దున్నప్పుడు మీలో ఒకరికి వ్రతభంగము గలిగిన రెండవవారిచేతికమలము వాడిపోవును. మఱి యొకవిధమున వాడదు.' అని యనుగ్రహించెను. ఇది విని మేల్కొని చూచుకొనఁగా ఆదంపతులకు ఒండొరుపులహృదయములవలె ఒకరొకరిచేతను ఒకయెఱ్ఱదామర యుండెను. అంతట గుహసేనుఁడు

కమలమును చేతఁగొని పయనమై పోయెను. దేవస్మిత సదా పద్మమునే చూచుచు ఇంటనే యుండెను. త్వరలోనే గుహ సేనుఁడు కటాహద్వీపము చేరి రత్నవర్తక మారంభించెను. అక్కడ అతనిచేతిలో ఎప్పటికిని వాడని యామెట్టదామరను చూచి కోమటిచిన్నవాండ్రు నలువురు ఆశ్చర్యపడి యుక్తిగా అతనిని ఇంటికి పిలుచుకొనిపోయి విస్తారము సారాయి త్రాగించి పద్మవృత్తాంత మడిగిరి. అతఁడును మైకములో నిజమును చెప్పెను. అంత నతనిరత్నవ్యాపారము ఇంక చాలకాలమునకే గాని ముగి యదని తెలిసికొని ఆవణిక్పుత్రులు నలువురును బైలుదేఱికొత్తు కముచేత అతనిభార్యయొక్క వ్రతమును చెఱుపఁ దలఁచి దొంగతనముగా పోయి శీఘ్రముగా తామ్రలిప్తి చేరిరి. అక్కడ ఉపాయము వెదకుచు బౌద్ధాలయములో నొకపరివ్రాజికను యోగకరండిక యనుదానిని చూచి ప్రీతిపూర్వకముగా 'భగవతీ, మాకోరికను నెఱవేర్చుదు వేని నీకు అమితముగా ధన మిచ్చెదము' అని చెప్పుకొనిరి. 'నిశ్చయముగా ఎవతెనో ఒక స్త్రీని మీరు కోరియున్నారు. చెప్పుఁడు సాధించెదను. ధనాశ మాత్రము నాకు లేదు. నాకు సిద్ధికరి యని శిష్య యొకతె మంచి బుద్ధిమంతురాలు కలదు. దాని దయచేత నాకు అసంఖ్యముగా ధనము లభించియున్నది.' అని పరివ్రాజిక పలికెను. 'ఎట్లు నీకు శిష్యాప్రసాదముచేత మహాధనము కలిగినదో చెప్పుము' అని వారడుగఁగా పరివ్రాజిక ఆరంభించెను:

## సిద్ధికరి ప్రజ్ఞ.

మీకు వినఁగోరిక యేని చెప్పెదను, పుత్త్రులారా, వినుండు. ఇక్కడికి పూర్వము ఉత్తరదేశమునుండి వర్తకుఁ డొకఁడు వచ్చి యుండెను. అతఁ డిక్కడ నున్నప్పుడు నాశిష్యురాలు మాఱువేషము దాలిచి అతనియింట పనికత్తెగా ప్రవేశించి యుండి మంచినమ్మకము వడసి బంగార మంతయు హరించి ఎవరికిని అగపడకుండ తెల్లవాఱుజామున పరారి యైనది. ఊరినుండి వెలువడి అది భయముచేత వడిగా పోవుట గని మృదంగధారి యైన డోంబుఁ డొకఁడు దానిసొమ్మును హరించుటకు దానిని వెంబడించెను. ఈ లోపల ఒకమఱ్ఱిక్రిందికి చేరినపై వానిరాక గని మోసగత్తె యైన సిద్ధికరి దీనభావమును నటించుచు వానితో 'అయ్యా! నే నిప్పుడు మగనితో జగడ మాడి లేచి వచ్చితిని. ఇందు నాకు ఉఱిఁబోసికొనుటకు త్రా డొకటి కట్టిపెట్టుము.' అని వేఁడెను. 'ఉఱిఁబోసి కొనియే ఇది చచ్చును గాక. నే నేల స్త్రీహత్య చేయవలయును?' అని తలఁచి డోంబుఁడు చెట్టులో ఉఱిత్రాడు ప్రేలఁ గట్టెను. అంతట సిద్ధికరి డోంబునితో ఏమియుఁ దెలియనియదియుం బోలె 'అయ్యా! ఉఱిఁబోసికొనుట యెటులో రవంత చూపుము.' అని వేఁడెను. అంత నతఁడు ఆమద్దెలను క్రింద పెట్టి దానిమీఁద నిలిచి 'ఇదిగో ఇట్లు ఉఱిఁబోసికొనవలయును' అని తనమెడకు ఉఱి తగిలించుకొని చూపెను. సిద్ధికరి మద్దెలను కాలితో అవతలికి తన్ని

వైచినది. డోంబుఁడు ఉరిలో వ్రేలాడి కాలధర్మము నొందెను. ఆసమయములో వర్తకుఁడు వెదకుకొని వచ్చి సిద్ధికరిని తన సర్వధనమును దొంగిలించినదానిని దూరమునుండి చూచెను. అదియు వచ్చుచున్నయతనిని చూచి చెట్టెక్కి ఒకకొమ్మమీఁద అగపడకుండ ఆకుజొంపములచాటున దాఁగియుండెను. వర్తకుఁడు భృత్యులతో కూడ వచ్చి చూడఁగా ఉరిలో చచ్చియున్నడోంబుఁ డగపడెనే గాని సిద్ధికరి యెక్కడను అగపడదాయెను. ‘ అది చెట్టెక్కియుండదా ఒకవేళ ? ’ అని భృత్యులలో నొక్కఁడు తక్షణమే చెట్టెక్కెను. వానిని చూచుచునే ‘ ఓయి యందగాఁడా, నాకు ఎప్పుడును నీమీఁదనే మక్కువ, ఇక్కడికి నీవే ఎక్కి వచ్చినాఁడవు, ఈధన మంతయు నీదే, నన్ను పొందుము.’ అని పల్కి ముఖమును ముద్దుగొనునదియై సిద్ధికరి ఆమూఢునినాలుకను పండ్లతో కొఱికివైచినది. వాఁడు ఆవేదనకు తల్లడిల్లి నోట రక్తము గ్రక్కుకొనుచు చెట్టునుండి ఏమో అస్పష్టముగా లల్లల్ల అని పలుకుచు క్రిందఁబడెను. దానిని చూచి ఆవర్తకుఁడు భయపడి వానిని దయ్యము కొట్టెన దని తలఁచి కడమ భృత్యులతో కూడ తనయింటికి పలాయితుఁ డాయెను. పిమ్మట నాతాపసి సిద్ధికరియు భయముతో చెట్టుకొననుండి దిగి ఆధనము నెల్లఁ గొని యింటికి వచ్చెను. నాశిష్య యిట్టిది, మహాప్రజ్ఞ గలది. ఈప్రకారము దానిప్రసాదముచేత నాకు ధనము కలిగినది.

ప్రవ్రాజికామాయోపాయములు.

ఇట్లు పలికి పరివ్రాజిక ఆసమయమున అక్కడికి వచ్చిన యాశిష్యను వణిక్కుమారులకు చూపి 'పుత్త్రులారా, చెప్పుఁడు, ఎవతెను కోరుచున్నారు ? దానిని నేను క్షణములో సాధించెదను.' అనెను. వారు 'ఇదిగో కలదే దేవస్మిత గుహసేనునిభార్య, దానిపొందు మాకు సమకూర్పవలయును.' అని చెప్పిరి. అందులకు పరివ్రాజిక ఒప్పుకొని ప్రతిజ్ఞచేసి ఆ వణిక్పుత్త్రులకు తనయింటనే బస యిచ్చినదై క్రమక్రమముగా దేవస్మితయొక్క పరిచారకజనమును భక్ష్యాదులు పెట్టి వశము చేసికొని ఒకనాఁడు శిష్యతో కూడ గుహసేనుని యింటికి పోయెను. అంతట దేవస్మితయొక్క యింటిగడపదగ్గఱకు వచ్చియున్న యాపరివ్రాజికను అక్కడ గొలుసుతో కట్టిపెట్టియున్న యాఁడుఁగుక్క క్రొత్తవారిని నిరోధించునట్టిది ఆటంకపఱిచెను. దేవస్మిత 'ఈమె ఏల వచ్చినదో ' అని ఆలోచించుచు తానే చేటిని పంపి పరివ్రాజికను లోపలికి రప్పించెను. పాపాత్ము రాలు పరివ్రాజిక ఆశీర్వదించి లేనియాదరము నభినయించుచు ఆపతివ్రతను దేవస్మితను 'ని న్నెప్పుడును నేను చూడఁ గోరుచుందును. ఈవేళ నిన్ను చూచినట్లు కల గంటిని. అంతట ఉత్సుకురాలనై నిన్ను చూడవచ్చితిని. ప్రియుఁ నెడఁబాసిన నిన్ను చూడఁగా నాకు మిక్కిలి దుఃఖ మగుచున్నది. ప్రియోపభోగము లేని రూపయౌవనములు వ్యర్థములు గదా.' అని ఇత్యాది

వచనములచేత చాలసేపు చనవుగా మాటలాడి, పోయి వచ్చెదనని, యింటికి పోయెను. మఱునాఁడు మిరియపుఁబొడుము నింపినమాంసపుముక్కను చేతఁగొని మరల దేవస్మిత యింటికి పోయి ఆమాంసఖండమును కుక్కకు వైచెను. అదియును తటాలున దానిని తినెను. అంత నా మిరియపుదోషముచేత దానికన్నులనుండి ధారధారగా బాష్పములు కాఱసాగెను, ముక్కు అవిరామముగా స్రవింపసాగెను. వెంటనే ఆధూర్త పరివ్రాజిక లోపలికి పోయి దేవస్మిత యడుగఁగా ఎట్టకేలకు 'అమ్మాయీ, ఇదిగో పోయి చూడు బయట ఏడ్చుచున్న కుక్కను. ఇది నన్ను తనజన్మాంతరసఖిని తెలిసికొని ఏడువ సాగినది. అంత నాకును కన్నీళ్లు వచ్చినవి.' అని చెప్పెను. ఆమాట విని దేవస్మిత వెలుపలికి పోయి ఏడ్చుచున్నట్లున్న కుక్కను చూచి 'ఏమి యీ యాశ్చర్యము !' అని క్షణము ఆలోచించెను.

అంతలో పరివ్రాజిక యిట్లు చెప్పెను —'అమ్మాయీ, పూర్వజన్మములో నేనును ఇదియు ఒక్క బ్రాహ్మణుని భార్యలము. మాపతి రాజాజ్ఞచేత నీటికి మాటికి ఇక్కడికి కక్కడికి దేశాంతరము పోవుచుండెను. అతఁడు దేశాంతరము పోయినప్పుడు నేను యథేచ్ఛముగా భూతేంద్రియ సంఘాతమునకు పీడ కలిగింపక భోగములకు లోపము రానీక పరపురుషసంగమము చేయుచు జాగ్రత్తగా నుంటిని. సకలధర్మములలోను భూతేంద్రియములకు

ద్రోహము చేయకుండుట ఉత్తమము కదా. అందుచేత నేను పూర్వజన్మజ్ఞానము కలదాననై జన్మించితిని. ఇది అజ్ఞానముచేత శీలమును మాత్రము కాపాడుకొనుచుండెను. అందుచేత నిది పూర్వజన్మజ్ఞానము గలిగి కుక్కగా పుట్టినది.' అందునకు దేవస్మిత మంచి ప్రజ్ఞగలదై 'ఓహో! ఇదేమి ధర్మము! వాస్తవముగా ఈమోసగత్తె ఇట్లు పన్నినది!' అని తలంచి పరివ్రాజికను 'అమ్మా! ఇంతకాలము నాకు ధర్మస్వరూపము చక్కఁగా తెలియలేదు. ఇఁక నీవు ఎవనితోనైన నొకకాంతునితో నాకు సంగమము కలిగింపుము.' అని యడిగెను. ప్రవ్రాజిక సంతోషించి 'ఈయూరికి ద్వీపాంతరమునుండి కొందఱు వణిక్కుమారులు వచ్చియున్నారు, వారిని తెచ్చెదను.' అని చెప్పి యింటికి పోయెను.

వణిక్పుత్త్రులకు శాస్తి.

దేవస్మితయు తన చేటికలతో విస్రంభంబుగా నిట్లనియె: 'నిశ్చయముగా నాకాంతునిచేతి యావాడనితామరను చూచి కౌతుకముచేత అతనిని త్రాగించి దాని వృత్తాంతము నడిగి తెలిసికొని నన్ను పాడుచేయుటకై వీ రెవరో పాపాత్ములు వణిక్పుత్త్రులు ఆద్వీపమునుండి యిక్కడికి వచ్చినారు. వారు పంపినట్టిది యీజోగురాలు. ఉమ్మెత్త కలిపిన సారాయి తెండు. త్వరగా పోయి కుక్కను ఇనుపకాలాకటి చేయింపుఁడు.' ఇట్లు దేవస్మిత చెప్పఁగా చేటికలు సర్వమును ఆమె చెప్పినట్లే

సిద్ధము చేసినారు. దేవస్మితయాజ్ఞప్రకారము ఒకచేటి ఆమె వాక్యాను యథాస్థితముగా అనుకరించి యుండెను. అంత జోగురాలు ఆనలువురు వణిక్కుమారులలోను మిక్కిలి యుబ్బులాటపడుచున్నయొకనిని సాయంకాలమున తన శిష్యురాలివేసము వైచి తోడ్కొనివచ్చి దేవస్మితయింట విడిచిపెట్టి తాను రహస్యముగా వెడలిపోయెను. అంతట దేవస్మితా వేషము దాలిచినచేటి ఆవణిక్కుమారుని ఆయుమ్మెత్తకలిపిన సారాయిని ఆదరముతో త్రాగించెను. అంత అవినయముచేత నుంబోలె సారాయిచేత అతనికి తెలివి తప్పఁగా చేటిక లెల్ల వానిని వస్త్రాలంకారము లూడ్చి దిగంబరుని చేసి కుక్క చేత ఇనుపకాలితో లలాటమందు ముద్ర కొట్టించి తీసికొనిపోయి అశుచిపూర్ణ మయిన గోతిలో రాత్రియే పడవైచిరి. తెల్లవాఱుజామున నతఁడు తెలివి వచ్చి చూచుకొనఁగా తన పాపమువలన లభించిన యవీచినరకమందు మునిఁగియున్నట్లు తలంచుకొనఁ దగియుండెను. అతఁడు లేచి స్నానము చేసి మొగమునందలి గాయమును తడవుకొని చూచి దిగంబరుఁడు గానే జోగురాలియింటికి పోయి తా నొకఁడు మాత్రమే హాస్యాస్పదము కాకుండుటకై తనచెలికాండ్రతో 'నేను ఒంటరిగా ఇంటికి వచ్చుచుండఁగా నన్ను దొంగలు దోఁచుకొన్నారు.' అని చెప్పి, జాగరముచేతను అతిపానముచేతను తలనొప్పి గలిగిన దనియు పలికి, తలకును ముద్రిత మయిన

మొగమునకును లపేటా చుట్టుకొనియే యుండెను. ఆప్రకారమే మరల సాయంకాలమున రెండవవణిక్కుమారుఁడు దేవస్మిత యింటికి వచ్చి శాస్తి పొంది దిగంబరుఁడై బసకు వచ్చి చెలి కాండ్రతో 'నేను నా నగలను అక్కడనే పెట్టి వచ్చితిని, అట్లయినను నన్ను దారిలో దొంగలు కొట్టినారు.' అనెను. తెల్లవాఱఁగానే అతఁడును తలనొప్పి యనుమిషచేత మొగము నకు లపేటా చుట్టుకొని కుక్కకాలిముద్రను దాఁచెను. ఈ ప్రకారము వణిక్కుమారు లందఱును ఖలీకారమును ముఖ చిహ్నమును ధననాశమును పొంది అవమానపడినవారై పరి వ్రాజికకు కూడ ఇట్లే ఖలీకారము కలుగును గాక యని తమ శాస్తిని ఆమెకు తెలుపకయే అక్కడినుండి వెడలిపోయిరి.

ఆమఱునాఁడు జోగురాలు శిష్యురాలితో కూడ దేవ స్మితయింటికి కృతార్థురాల నయితిని గదా యనుసంతోష ముతో వచ్చెను. పతివ్రత యయినదేవస్మిత ఆదరపూర్వక ముగా కృతజ్ఞతచేతనుంబోలె జోగురాలిని శిష్యురాలిని ఉమ్మె త్త కలిపిన సారాయి త్రాగించి క్రైపెక్కినపిమ్మట ఆశుచిపంక ములో త్రోయించెను.

పిమ్మట దేవస్మిత తనభర్తకు ఆవణిక్కుమారులు తమ ద్వీపము చేరి ఏమి యపాయము కావింతురో యని భయపడినదై ఆజరిగిన యావద్వృత్తాంతమును తనయత్తగారికి నివేదించెను. అందునకు అత్తగారు 'అమ్మా, నీవు చేసిన దంతయు యుక్తమే.

అయినను ఒకవేళ ఇందువలన నాకుమారునికి కీడేమయినఁ గలుగు నేమో?' అనెను. అంత దేవస్మిత 'అత్తా, పూర్వము శక్తిమతి ప్రజ్ఞచేత తన పతిని ఏప్రకారము రక్షించెనో, నేనును నాపతిని ఆప్రకారమే రక్షించెదను' అనెను. శక్తిమతి యెట్లు పతిని రక్షించెనో చెప్పుమని అత్తగారడుగఁగా దేవస్మిత యిట్లని చెప్పసాగెను.

### శక్తిమతికథ.

మాదేశములో మాయూరియందు పూర్వులచే ప్రతిష్ఠింపఁబడినవాఁడు మణిభద్రుఁడను పేరి మహాయక్షుండు ప్రభావవంతుఁడు కలఁడు. అక్కడి జనులు అతనికి మ్రొక్కులు మ్రొక్కుకొని మునుపులు కట్టుచుందురు. ఆ పట్టణమందు రాత్రి పరస్త్రీతోఁగూడ దొరకినపురుషుని దానితోఁగూడ ఆయక్షుని గర్భగృహమందు ఉంచి తెల్లవాఱఁగానే దానితోఁ కూడనే రాజసన్నిధికి కొనిపోయి దోషప్రఖ్యాపన పూర్వకముగా దండింపించుట ఆచారమై యున్నది. ఒకనాఁడు రాత్రి పరస్త్రీసంగతుఁడైన యొకవర్తకుని కొత్వాలు పట్టి యక్షాలయములో ఉంచి వెలుపల పెద్దగడియ వైచెను. ఆవృత్తాంతము వెంటనే ఆవర్తకునిభార్య శక్తిమతికి తెలియఁగా ఆపతివ్రత ధీరురాలై ఖేదపడక చెలులతోఁగూడి పూజాద్రవ్యములు చైకొని ఆయక్షాలయమునకుఁ బోయెను. పూజారి దక్షిణమీఁదిలోభముచేత కొత్వాలునకు తెలిపి తలుపుతీసి ఆమెకు యక్షాలయ

ములోనికి ప్రవేశము కలుగఁజేసెను. ఆమెయు పరస్త్రీతోఁ గూడ అంపుచున్నవాఁడై తన్నును తనపరిజనమును చూచి వెలవెలఁబోవుచున్న పతిని గాంచి ఆ స్త్రీకి తనవేషమిచ్చి అక్కడినుండి పంపి తాను పత్నితో కూడ అక్కడనే యుండెను. తెల్లవాఱఁగానే రాజుగారి యుద్యోగస్థులు వచ్చి చూడఁగా ఆవర్తకుఁడు అందు తనభార్యతోనే ఉండెను. ఆవృత్తాంత మెఱింగి రాజు వర్తకుని మృత్యుముఖమునుండియుం బోలె యమాలయమునుండి విడిపించి కొత్వాలునకు దండన విధించెను. ఈప్రకారము పూర్వము శక్తిమతి పతిని ప్రజ్ఞచేత రక్షించినది. నేనును పోయి ఆప్రకారమే నాభర్తను యుక్తిచేత రక్షించెదను.

### దేవస్మిత కటాహద్వీపమున కేఁగుట.

ఈరీతిని దేవస్మిత అత్తగారిని సమాధానపఱిచి చేటికలతోఁ గూడ వణిగ్వేషము దాలిచి ఓడయెక్కి వాణిజ్యమునకని మిషపెట్టి కటాహద్వీపమునకు పోయి చేరెను. అక్కడ వర్తకులనడుమ తనవల్లభుని గుహసేనుని బయట మూర్తీభవించి యున్న సమాశ్వాసమునుం బోలె చూచెను. అతఁడును ఆమెను దూరమునుండియే కనుదోయితో త్రాగువాఁడుంబోలె అత్యాదరముతో చూచి, ఆమె పురుషవేషముం దున్నందున ‘ఎవ రితఁడు! నాప్రియవలెనే ఉన్నాఁడు?’ అని తలపోయుచుండెను. దేవస్మిత రాజుసన్నిధికి పోయి ‘ఓ ప్రభూ, నామనవియొకటి కలదు. సకలజనులను ఇక్కడికి పిలిపింపుము.’ అని

విన్నవించుకొనెను. రాజు కుతూహలముచేత అందఱు పౌరులను పిలిపించినవాఁడై 'నీవిన్నప మేమి?' అని వణిగ్వేషమున నున్న దేవస్మిత నడిగెను. అంత దేవస్మిత 'ఓ ప్రభూ, ఈ జనులలో నాబానిసలు నలువురు పాఱిపోయి వచ్చియున్నారు, వారిని ఏలినవారు నాకు ఇప్పింపవలయును.' అని యడిగెను. అందునకు రాజు 'ఇక్కడ పౌరులందఱును వచ్చియున్నారు; వీరిలో నీబానిస లెవరో ఆనవాలుపట్టి తీసికొనిపొమ్ము.' అని సెల విచ్చెను. అంత నామె పూర్వము తన యింట శాస్తి పొందిన యానలువురు వణిక్కుమారులను మొగములకు లపేటా చుట్టుకొని యున్నవారిని పట్టుకొనెను. అందుల కక్కడి కోమట్లు కోపించి 'వీరు సాహుకార్ల కుమారులు. వీ రేమి నీకు బానిస లేమి!' అని యడిగిరి. ఆమె 'నామాట మీకు నమ్మకము కాదేని నేను కుక్కచేత వీరి మొగములయందు చేయించిన పాదచిహ్నమును చూడుఁడు.' అనెను. వెంటనే వారి ముఖముల లపేటాలను విప్పి అందఱును అందలి కుక్కకాలి ముద్రలను చూచి ఆశ్చర్యపడిరి. వర్తకు లందఱును ఆప్రకారము లజ్జ పొంది యుండఁగా రాజు ఆశ్చర్యపడి దేవస్మితను స్వయముగా అ దేమో వివరింపు మని యడిగెను. ఆమెయు జరిగిన వృత్తాంతమును సర్వమును చెప్పెను. జనులందఱును నవ్విరి. న్యాయముచేత వీరు నీకు దాసులే, అని రాజు ప్రశంసించెను. అంత తక్కినవర్తకులు ఆమెకు విస్తారము ధనమును

రాజునకు దండమును సమర్పించుకొని ఆనలువురను దాస్యము నుండి తప్పించిరి. దేవస్మిత ఆధనమును పుచ్చుకొనితన భర్తతో గూడి సకలసజ్జనులచేతను పూజలు వడసి, తమయూరికి తామ్రలిప్తికివచ్చి చేరి మరల విరహము లేక సుఖముగా నుండెను.

ఓదేవీ యిట్లు గొప్పకులమందు పుట్టిన స్త్రీలు పవిత్రమయిన సాహసచర్యలచేత తదేకాగ్ర నిష్ఠతో భర్తను కొలుచుచుందురు. పతివ్రతలకు భర్తయే గదా ఉత్తమదేవత.

వసంతకునివలన ఈయుత్కృష్టకథను విని, వాసవదత్త తండ్రియింటిని వదలి స్వల్పకాలమే అయినను, ఆలజ్జ ఇంక వదలక యున్నను, ఇంతకు మున్నే భర్తకు ప్రేమచేత కట్టివేయఁబడియున్న తనమనస్సును అంతకన్న ఏకాగ్రముగా భర్త మీఁద నిలిపిన దాయెను.

---

## ౬-వ తరంగము.

ఇంతలో వింధ్యాంతరమం దున్న యావత్సరాజునొద్దకు చండమహాసేనునిదూత వచ్చి నమస్కరించి యిట్లు విన్నవించెను: 'చండమహాసేన మహారాజు నీకు ఇట్లుచెప్పి పంపినాఁడు: 'నీవు వాసవదత్తను స్వయముగా కొనిపోవుట యుక్తమే. అందునిమిత్తమే నిన్ను నే నిక్కడికి తెచ్చినాఁడను. నీవు బంది

నై యున్న దశలో ఆమె నిచ్చిన యెడల మాయింమ నీకు ప్రీతి గలుగ దని స్వయముగా ఈనైత్తిని. ఇప్పుడు ఓరాజా, నాకొమారితకు అవిధిగా కాక యథావిధిగా వివాహ మగునట్లు కొంచెము ఓపిక చేయుము. త్వరలోనే నాకుమారుఁడు గోపాలుఁడు అక్కడికి వచ్చి చెల్లెలివివాహమును యథావిధిగా జరిపింపఁగలఁడు'. ఈప్రకారము ప్రతీహారుఁడు వత్సరాజునకు సందేశమును చెప్పి ఆవృత్తాంతమును వాసవదత్తకుఁ గూడ నివేదించెను. అంత ఆనందపూర్ణమానస యైన వాసవదత్తతోఁగూడ వత్సరాజు కౌశాంబికి పోవ చిత్తగించి, 'మీ రిద్దఱును ఇక్కడనే గోపాలకుని రాకను ఎదురు చూచుచుండుఁడు, అతనిని గూడి వెనుక కౌశాంబికి రండు.' అని మామగారి యా ప్రతీహారుని తనమిత్త్రుని పుళిందకుని నియమించి, సెలయేళ్లతోడి వింధ్యప్రాగ్భారములు అనురాగముచేత వెంబడించుచున్నవో యన దానప్రవాహశోభితము లయిన మహానాగేంద్రములు వెంట వచ్చుచుండ, గుఱ్ఱపుగుంపుల గొరిజతాఁకులకు కంగు కంగని మ్రోఁగుచున్న భూమి వందిభావ మొంది పొగడుచున్నదో యన భాసిల్లుచుండ, ఆకాశమును దాఁటుచున్న సేనారజోరాసులు ఱెక్కలతోడి నగేంద్రములు రేఁగి నవో యను శంకను ఇంద్రునికి పుట్టించుచుండ, మఱునాఁడు ఉదయమున తననగరమునకు బయలు వెడలెను. రెండుమూఁడు దినములలోనే స్వదేశము చేరి ఒకరాత్రి యంతయు రుమణ్వంతునినగ

రిలో విశ్రమించి మఱునాఁడు పౌరు లెల్లయెడలను తనరాక నెదురు సూచుచు ఉత్కంఠితులై యుండ మహోత్సవముతో కౌశాంబీనగరమును ప్రియతోఁ గూడ ప్రవేశించెను. పౌరాంగన లారంభించిన మంగళస్నానమండనములచేత ఆపురి చిరకాలమునకు భర్తరాఁగా భార్యయుం బోలె రాజిల్లుచుండ, పౌరులెల్లను వసూనసమేతుఁ డైనతన్ను మెఱపుఁదీఁగతోడి యంబుదంబును నెమళ్లుం బోలె శోకములు తీఱి వీక్షించుచుండ, మేడలతుదల నిలిచి ఆకాశ మెల్ల తామ యై ఆయుత్సవమును వీక్షించుచున్న పౌరసుందరీముఖములు ఆకాశగంగలోని తామరసములు గట్టుపై విరిసినట్లు యన తేజరిల్లుచుండ, వత్సరాజు తననగరిని మూర్తీభవించిన రాజ్యలక్ష్మితోనుంబోలె వాసవదత్తతో ప్రవేశించెను. ఎక్కడఁ జూచినను కొలువుకై వచ్చిన రాజులును, ఎక్కడఁ జూచినను వందిమాగధుల మంగళగానములును నై యారాచనగరు నిద్రించి మేల్కొన్నదో యనునట్లొప్పుచుండెను.

ఇంతలో వాసవదత్తయన్న గోపాలకుఁడు ప్రతీహారపుళిందకులతోఁగూడ వచ్చిచేరెను. అతనికి రాజు ప్రత్యుత్థానము చేసెను. అతనిని వాసవదత్త సాక్షాదానందంబునో యనఁ గన్నుదోయి వికసిల్లఁ జూచి పట్టరానిహర్షమును పొందెను. అన్నను చూచుచున్నయామెకు లజ్జ కాకుండునుగాక యని ఆసమయములో ఆమె నేత్రములను బాష్పజల మావరించెను.

తండ్రినిదేశములను అతఁడు తెలిపి ధైర్యముగొల్పఁగా ఆమె 'ధన్య నైతిని గదా' యని సంతోషించి స్వజనసమాగమ సుఖమును అనుభవించుచుండెను.

ఉదయనకథ: వాసవదత్తా వివాహము.

ఆమఱునాఁడే గోపాలకుఁడు వాసవదత్తావత్సరాజులకు వివాహమును జరిపించెను. రతివల్లియొక్క నవోద్భిన్నోజ్జ్వలకిసలయంబునో యన వాసవదత్త చేతిని వత్సరాజు చేపట్టెను. ఆసమయంబున ప్రియహస్తస్పర్శ సాంద్రానంద నిమీలితయు సకంపస్వేదదిగ్ధాంగియు గాఢరోమాంచచర్చితయు నై వాసవదత్త పుష్పబాణునిచేత నిరంతరముగా సమ్మోహన వాయవ్య వారుణాస్త్రములచే నేయఁబడినదియుం బోలె విరాజిల్లుచుండెను. హోమధూమముచేతనైన యామెకనుదోయి కెంపు మదారుణ్యముకై మదిర వేసినసూత్రపాతమా యనున ట్లుండెను. గోపాలకుఁ డర్పించిన రత్నములచేతను రాజులు సమర్పించిన కానుకలచేతను బొక్కసము నిండఁగా వత్సరాజు సత్యముగానే రాజరా జాయెను. వివాహము ముగియఁగానే ఆవధూవరులు మొదట లోకుల నేత్రములను పిమ్మట తమ వాసగృహమును ప్రవేశించిరి.

పిమ్మట నిజోత్సవమందు వత్సరాజు గోపాలకపుళిందకులను స్వయముగానే పట్టవస్త్రాలంకరణాదులచేత సమ్మానించి తక్కిన రాజులను పౌరులను యథార్హముగా సమ్మానించుటకు

యౌగంధరాయణరుమణ్వంతులను నియమించెను. అంతట యౌగంధరాయణుఁడు రుమణ్వంతునితో నిట్లనియె:—రాజు మనకు కష్టమయినపనిని పెట్టినాఁడు, లోకులను మెప్పించుట కష్టము. రంజన చేయమేని బాలుఁడు కూడ నిశ్చయముగా నేరమి కలుగఁజేయును. అందులకు నిదర్శనముగా ఈబాలవినష్టకునికథను వినుము.

## బాలవినష్టకునికథ.

పూర్వము రుద్రశర్మ యనిబ్రాహ్మణుఁ డొక డుండెను. ఆయనకు ఇద్దఱు భార్య లుండిరి. అం దొకతె కొడుకును గని మృతిఁబొందెను. రుద్రశర్మ ఆశిశువును సవతితల్లిచేతికి ఒప్పగించెను. వాఁడు కొంచెము ఎదిగినదిమొదలు వానికి ఆమె నేయి వేయక యన్నము పెట్టుచుండెను. అందుచేత వానికి బీద కడుపు బలిసి దేహము బూడిదవర్ణ మాయెను. 'తల్లి లేని యీశిశువును ఏమి యి ట్లుపేక్షించితివి?' అని రుద్రశర్మ భార్య నడిగెను. 'నేను నేయి పోసియే యన్నము పెట్టుచున్నను వీఁడు ఈలాగున నున్నాఁడు, వీనికి నే నేమి చేయుదును?' అని యామె పలికెను. ఆబ్రాహ్మణుఁడు ఆచిన్నవానిస్వభావమే అది యని తలఁచి యూర కుండెను. స్త్రీలమోసపుముగ్ధవచనములను ఎవఁడు నమ్మఁడు? బాలుఁడై యే వినష్టుఁ డాయె నని వానికి తండ్రియింట బాలవినష్టకుఁ డని నామము కలిగినది. వయస్సు అయిదేండ్లే అయినను బుద్ధిమంతుఁ డైన బాలవినష

కుఁడు ‘ ఈమె నన్ను సర్వదా ఇబ్బంది పెట్టుచున్నది. ఇందున కేమయిన ప్రతీకారము చేసెదనుగాక.’ అని ఆలోచించి, దివాణమునుండి తండ్రి యింటికి రాఁగానే ‘ నాయనా నాయనా, నాకు ఇద్దఱు నాయనలు సుమా.’ అని ఏకాంతముగా అస్పష్టమయిన ముద్దుఁబలుకులతో పలికెను. ఈప్రకారము ప్రతిదినము తండ్రి యింటికి రాఁగానే ఆయన కెదురువోయి పలుకుచుండెను. అంత రుద్రశర్మ ఆమెను పురుషాంతరాసక్తనుగా తలఁచి స్పృశించుట కూడ మానెను. ఆమె ‘ ఏమి ఇది! నాయందు దోష మేమియు లేకయే ఏల నాపతి నాపై యలిగి యున్నాఁడు! ఈ బాలవినష్టుఁ డేమయిన ప్రయోగము చేసి యుండునా?’ అని యాలోచించి, వానికి ఆదరముతో తలయంటి నీళ్లు పోసి నేయి పోసి అన్నము పెట్టి తొడమీఁద కూర్చుండఁ బెట్టుకొని ‘ నాయనా, మీ నాయనతో నామీఁద ఏమయిన చాడీలు చెప్పితివా?’ అని యడిగెను. ఆమాటకు బాలవినష్టుఁడు సవతితల్లితో ‘ ఇప్పటికైన చక్కఁబడవేని ఇంతకన్న నెక్కువ కూడ నీకు చేసెదను చూచుకో. నీపుత్త్రుని మాత్రము చక్కఁగా పోషించుకొనుచున్నావే, నన్నుమాత్ర మేల సదా ఇబ్బంది పెట్టెదవు?’ అనెను. ఆమాట విని ఆమె లొంగిపోయి ఒట్టుపెట్టుకొని ‘ మఱి యిట్లు చేయను. నాపతి కోపము తీర్పుము.’ అని యడిగెను. అంత బాలవినష్టుఁడు ‘ మానాయన రాఁగానే నీచెలికత్తెను

ఆయనకు అద్దము చూపుమను. ఆపైసంగతి నాకు తెలియును.' అని చెప్పెను. ఆ ప్రకారమే ఆమె యొకచేటి కాజ్ఞాపింపఁగా అది వెంటనే రుద్రశర్మ రాఁగా అతనికి అద్దము నెదుట పెట్టెను. అందు అతని ప్రతిబింబమునే చూపుచు ఆ బాలుఁడు 'నాయనా, వీఁడుగో నారెండవనాయన.' అనెను. ఆమాట విని 'ఆహా! నిష్కారణముగా సందేహము పూనితిని గదా!' యనుకొని భార్యమీఁద రుద్రశర్మ ప్రసన్నుఁ డాయెను.

ఈ ప్రకారము బాలుఁ డయినను అలిగినేని దోషము కలిగించును. కనుక ఈ జనుల నందఱను మనము మెప్పింపవలయును. ఇట్లు చెప్పి యౌగంధరాయణుఁడు రుమణ్వంతునితోఁ చేరి సకలరాజులను ఆ వత్సరాజమహోత్సవమందు ప్రతిరాజు కడను యెల్లవారికంటెను తన్నే తా మిద్దఱును గౌరవించి రని తలఁచు నట్లు సమ్మానములు చేసెను. ఆ యిద్దఱకును వసంతకునికిని రాజు తనచేతులతోనే వస్త్రాలంకారములు సమర్పించి అంగరాగములు పూసి గ్రామము లిచ్చి సమ్మానము చేసెను.

ఉద్వాహమహోత్సవ మయిన పిమ్మట వత్సరాజు వాసవదత్తతోఁ కూడుకొన్నవాఁడై మనోరథఫలములను తప్ప మఱి దేనినిగాని తలంచినవాఁడు కాఁ డాయెను. ఆదంపతులకు రాత్రియెల్లను విరహక్లేశ మనుభవించి తెల్లవాఱఁగానే కూడిన చక్రవాకములకుం బోలె మనోహరమయి యనిర్వచనీయ మయిన రసము సంతతమును వర్ధిల్లుచుండెను. వారికి పరి

చయము అధికమైన కొలఁదియు ప్రేమ ఆప్రకారమే ఎప్పటి కప్పుడు క్రొత్తదైనట్లు ఒప్పుచుండెను. గోపాలకుఁడును తండ్రి యాజ్ఞప్రకారము వివాహము జరిపి, వత్సరాజునొద్ద సెలవు పొంది, మరల త్వరగా రావలయు నని వత్సరాజుచేత ప్రార్థితుఁడై, వెడలి పోయెను.

ఒకనాఁడు వత్సేశ్వరుఁడు చపలుఁడై పూర్వపరిచిత యయిన విరచిత యను నంతఃపురపరిచారికను రహస్యముగా కూడినవాఁడై ఆ జ్ఞప్తివలని పొరఁబాటున దానిపేర దేవిని పిలిచి, అందుల కామె యలుగఁగా ఆమెయడుగులకు మ్రొక్కి ఆమె యొక్క బాష్పవృష్టిచేత నానందసామ్రాజ్యపట్టాభిషేకమును పొందెను.

బంధుమతీవివాహము.

ఒకప్పుడు గోపాలకుఁడు తాను బాహుపరాక్రమముచే పట్టితెచ్చిన బంధుమతి యను నొక రాజకన్యను వాసవదత్తకు కానుక పంపెను. ఆమెను వాసవదత్త మంజులిక యని మాఱుపేరు పెట్టి దాఁచియుంచెను. రాజు ఒకనాఁడు బంధుమతిని చూచి వసంతకునిసాయముచేత ఏకాంతముగా ఉద్యానవనములో నొకపొదరింట లావణ్యసముద్రములోనుండి యుద్భవించిన యపరశ్రీనిం బోలె గాంధర్వవిధిచేత వివాహ మాడెను. దానిని వాసవదత్త చాటునుండి చూచి కోపగించి వసంతకుని

బంధించి కొనిపోయెను. అంతట రాజు వాసవదత్తయొక్క పుట్టినింటినుండి వచ్చియున్న యొకపరివ్రాజికను సాంకృత్యాయని యనునామెను శరణుఁ జొచ్చెను; ఆమెమాటలచే అలుక తీఱి వాసవదత్త బంధుమతిని భర్తకు కొసంగి, వసంతకునిఁగూడ ఖయిదునుండి వదలి పెట్టెను. పతివ్రతల మనస్సు మృదువు గదా. వసంతకుఁడు రాణి యెదుటికి వచ్చి నవ్వుచు 'ఓదేవీ, బంధుమతి తప్పిదము చేసినది, నే నేమి చేసితిని? మీరు త్రాఁచుఁబాముమీఁద కోపగించి ఇరుదలపామును కొట్టుచు న్నారు.' అనెను. ఆ యుపమానము వివరించి చెప్పు మని దేవి కుతూహలపడి యడుగ వసంతకుఁ డిట్లు చెప్పసాగెను.

రు రు డు ం డు భ క థ.

పూర్వము రురు వను నొకమునికుమారుఁడు యదృచ్ఛగా తిరుగుచు ప్రమద్వర యను నొకకన్యను అద్భుత లావణ్యను మేనకకును ఒకానొక విద్యాధరునికిని జన్మించి స్థూలకేశుఁ డను మునిచేత స్వాశ్రమములో పెంపఁబడినదానిని చూచి కామమోహితుఁడై వెంటనే స్థూలకేశునియొద్దకు పోయి ఆమెను తనకు వివాహార్థమి మ్మని యడిగెను. స్థూలకేశుఁడును వాగ్దానము చేసెను. వివాహ మాసన్నమయి యుండఁగా ఆమెను నాగుఁబాము కఱచెను. అంతల కతఁడు బెగ్గడిల్లి యుండఁగా ఆకాశమునుండి 'ఓ బ్రాహ్మణా, ఈమెకు ఆయు

ష్కాలము సమాప్తి పొందినది. నీ యాయుస్సులో అర్ధ మిచ్చి ఈమెను బ్రదికించుకొనుము.' అని వాణి వినఁబడెను. వెంటనే అతఁడు తనయాయుస్సులో సగము ఆమె కిచ్చెను; ఆమెయు బ్రదికెను; ఆతఁడును వివాహమాడెను. అది మొదలుగా రురువు ఎక్కడ ఏపామును చూచినను 'ఇదే నా ప్రియను కఱచియుండును' అని కోపముతో కొట్టుచుండెను. అట్లు చంపవచ్చిన యతనితో నొకయిరుదలపాము మనుష్యవాక్కున 'ఓ బ్రాహ్మణుఁడా, నాగుఁబాములమీఁద కోపగించిననీవు ఇరుదలపాములను చంపుచున్నా వేమి? నీ భార్యను కఱచినది నాగుఁబాము. నాగుఁబాము వేఱు, ఇరుదలపాము వేఱు. నాగుఁబాము లన్నిటికి విష మున్నది, ఇఱుదలపాములకు విషము లేదు.' అని పలికెను. ఆమాట విని రురువు ఆపామును 'చెలికాఁడా, నీ వెవరవు?' అని యడిగెను. ఇరుదలపాము ఇట్లనియె. 'ఓబ్రాహ్మణుఁడా, నేను శాపముచేత ఈరూప మెత్తిన యొకమునిని. నీతోడిసంవాదమే నాశాపమున కంతము.' ఇట్లని అతఁడు అంతర్హితుఁ డాయెను. అది మొదలు రురువు పాములను కొట్టుట మానెను.

ఓదేవీ 'త్రాఁచుఁబాములమీఁద కోపగించి మీరు ఇరుదలపాములను కొట్టుచున్నా ర'ని ఉపమానార్థము చెప్పినాఁ

డను. వసంతకుఁ డిట్లు చెప్పి పరిహాసముగా నవ్వి ఊరకుం డెను. వాసవదత్తయు భర్తృపార్శ్వమున నున్నదై వాని మాటకు సంతోషించెను. కాముకుఁ డైనయాయుదయన మహారాజు ఈప్రకారము దేవికి చరణానతుఁడై కోపాపనోదనములు సేయుచు వసంతకునిచమత్కారములచే సంతోషపెట్టుచు సుఖముగా నుండెను. ఆభోగికి సదా రసన మదిరారసైకపరాయణయు వీనులు కలవీణారవశ్రవణప్రవణములును చూపు దయితాముఖనిశ్చలమునుగా నుండెను.

---

కథాముఖం బను ద్వితీయలంబకము ముగిసినది.

---



శ్రీ

# లావాణకలంబకము.



౧-వ తరంగము.

క. శ్రీమంతుండు విరించియు
నేమంబున విశ్వసృష్టి నెఱవేర్చుటకై
యేమహితుఁ గొలిచెనో, యల
ద్వైమాతురునకు నొనర్తుఁ దత్పరత నతుల్.

క. శంకరుఁడును సెవ్వానికిఁ
గొంకుచు నర్ధాంగమందుఁ గొండదొరసుతన్
గింకరుఁడై తాలుచు, మీ
నాంకుఁడతండొకఁడ యేలు నఖిలజగంబుల్.

దిగ్విజయాలోచన.

ఈప్రకారము వత్సరాజు వాసవదత్తా లాభముచేత కృతార్థుఁడై తత్సాంగత్యైకపరాయణుఁడై లోకములో మఱి యేవిషయమును తలఁపకుండెను. మహామంత్రి యౌగంధరాయణుఁడును సేనాపతి రుమణ్వంతుఁడును సర్వదా రాజ్యభారమును వహించియుండిరి. ఒకనాఁడు యౌగంధరాయణుఁడు చింతాక్రాంతుఁడై రాత్రి రుమణ్వంతుని తనయింటికి కొనిపోయి యిట్లు పలికెను:—మనరాజు పాండవవంశ సంభూ

తుఁడు, భూమి యంతయు హస్తినాపురమును ఇతనికి కులక్రమాగతములు. అది యంతయు నితఁడు జిగీషారహితుఁడై పోఁగొట్టుకొన్నాఁడు; అందువలన నితనికి ఈమండలములో సీమాల రాజ్య మేర్పడినది. ఇతఁడు స్త్రీమద్య మృగయా పరాయణుఁడై నిశ్చింతుండై రాజ్యభార మంతయు మనమీఁద వదలియున్నాఁడు. కనుక మనము ఇతనికి, కులక్రమాగతమయిన సకల పృథివీరాజ్యము మరల ఏలాగున వచ్చునో ఆ యుపాయము ఆలోచింపవలయును. ఇట్లు చేసిన మనభక్తియు మంత్రిత్వమును సఫలమై మనము కృతార్థుల మగుదుము. సర్వమును బుద్ధిప్రభావముచేత సాధ్య మగును. అందునకు నిదర్శనముగా ఈకథను వినుము.

### మహాసేనుఁ డను రాజు కథ.

పూర్వము మహాసేనుం డని ఒకానొక రాజు ఉండెను. ఒకప్పుడు మహాబలాఢ్యుఁ డయిన మఱియొక రాజు ఆయన మీఁదికి దండెత్తి వచ్చెను. అంత మంత్రు లందఱును కలసి తమయుద్యోగములు పోవు నని భయపడినవారై తమరాజు మహాసేనునిచేత ఆశత్రువునకు దండ మిప్పించిరి. దండ మిచ్చినను ఇచ్చినాఁడు గాని మానవంతుఁడైన యా మహాసేనుఁడు 'హా! నేను శత్రువునకు ప్రణతుఁడ నైతిని గదా!' అని పరితపించుచుండెను. ఆదుఃఖముచేత అతనికి కడుపులో గుల్మము కలిగి అందువలన మరణము ఆసన్న మాయెను. ఆరోగము

ఔషధములను సాధ్యపడ దని తెలిసికొని బుద్ధిమంతుఁడైన వైద్యుఁ డొకఁడు రాజుతో 'నీదేవి కాలధర్మము నొందినది!' అని అబద్ధమునే చెప్పినాఁడు. అది వినఁగానే రాజు భూమి మీఁద పడఁగా ఆప్రబలశోకావేశముచేత గుల్మము పగిలి పోయెను. అట్లు ఆరాజు రోగమునుండి బ్రదికి చిరకాలము దేవితో భోగము లనుభవించుచు శత్రువులను జయించి సుఖ ముగానుండెను.

ఆవైద్యుఁ డేప్రకారము బుద్ధిప్రభావముచేత రాజునకు హితము చేసెనో ఆప్రకారమే మనమును రాజహితము చేయు దము, ఇతనికి భూమి నంతయు సాధింపుదము. అందులకు ఇత నికి మగధేశ్వరుఁడు ప్రద్యోతుఁడు సదా శత్రువు. అతఁడు పార్ష్ణిగ్రాహుఁడై ఎప్పుడును మనకు వెనుకవైపున ప్రకృతి కోపమును కలుగఁజేయును. అందుచేత అతని కన్యారత్న మయినపద్మావతిని వత్సరాజునకి మ్మని మన మడుగుదుము. వాసవదత్తను మన బుద్ధిమహిమచేత దాఁచి యుంచి ఆమె యింటికి నిప్పుపెట్టి ఆమె కాలిపోయిన దని అంతట కింవదంతి పుట్టింతము. మఱి యెట్లును మగధేశ్వరుఁడు తన కొమారితను మనరాజున కొసంగఁడు. ఈవిషయమైయే పూర్వము నేనతని నడు గఁగా, వత్సరాజునకు వాసవదత్తయందు స్నేహము మితి లేని దనియు, తనకు ప్రాణాధికప్రియ యయినకొమారితను తాను వత్సరాజునకు ఈఁజాల ననియు చెప్పియున్నాఁడు. మఱియు

దేవి యుండఁగా వత్సరాజు మఱియొకదానిని పెండ్లియాడఁడు దేవి కాలిపోయిన దనుమాట పుట్టినయెడల సర్వమును సులువుగా సిద్ధించును. పద్మావతి మనకు దొరకినయెడల మగధరాజు సంబంధియై సహాయుఁ డగునే గాని పశ్చాత్తాపమును పుట్టింపఁడు. అంతట మనము జైత్రయాత్ర బయలువెడలి తూర్పు మొదలుకొని క్రమముగా అన్నిదిక్కులను జయించుకొని వత్తము. మనము ప్రయత్నము చేసితిమా ఈరాజునకు భూమి యంతయు నిశ్చయముగా స్వాధీనపడును. ఈలాగని పూర్వము ఆకాశవాణి పలికినది.

మంత్రిముఖ్యుని యీవచనమును విని రుమణ్వంతుఁడు దానిని సాహసముగా శంకించి యిట్లనియె:—పద్మావతికొఱకు మనము చేయనున్న యీకపటమువలన మనకే ఒకవేళ దోషమేమయినఁ గలుగు నేమో? అందువిషయమై యీ కథను వినుము.

వైశ్యకన్యా మౌనవ్రతుల కథ.

గంగాతీరమందు మాకందిక యని నగరము కలదు. దానియందు పూర్వము మౌనవ్రతుఁ డనుసన్న్యాసి యొకఁ డుండెను. అతఁడు భిక్షాటనముచేత జీవించుచు అనేక పరివ్రాజకులు తన్నుఁ గొలువ ఒకదేవాలయములో మఠమందు నివసించియుండెను. ఒకనాఁడు ఒకవర్తకునియింట భిక్షార్థము ప్రవేశించినవాఁడై తనకు భిక్ష పెట్టవచ్చిన శోభనాంగిని

అద్భుతలావణ్యాను చూచి కామవశంవదుఁడై 'అయ్యయో! ఎంతకష్టము!' అని ఆవర్తకునికి వినఁబడునట్లుగా పలికి భిక్ష గ్రహించి తనమఠమునకు పోయెను. ఆవర్తకుఁడు ఆశ్చర్య పడి ఏకాంతమునఁ బోయి ఆసన్న్యాసిని 'ఏమి? ఈదినము నీవు ఆకస్మికముగా మౌనము మాని పలికినాఁడవు?' అని యడిగెను. అందులకు సన్న్యాసి వర్తకునితో నిట్లనియె:— 'నీకూఁతురు దుర్లక్షణములు గలది. దీనికి వివాహ మెప్పు డగునో అప్పుడు తప్పకుండ నీకు భార్యాపుత్త్రులతోఁ గూడ నాశము కలుగును. నీవు నాభక్తుఁడవు గావున ఈదోషమును చూడఁగా నాకు దుఃఖము కలిగి నీకొఱకు మౌనము కూడ మాని యిట్లు పలికినాఁడను. కనుక ఈరాత్రి ఈకన్యను మందసలో పెట్టి దానిమీఁద దీపమునుంచి గంగలో వదలుము.' అందుల కంగీకరించి పిఱికిగుండె యయిన యావర్తకుఁడు సన్న్యాసి చెప్పినట్లే రాత్రి సర్వమును చేసెను. పిఱికివానికి వివుర్శ యుండునా? చీఁకటి పడఁగానే ప్రవ్రాజకుఁడు తనయనుచరులను పిలిచి 'గంగకు పొండు; అందు పైని దీపముగలది ఒకమందస కొట్టుకొనివచ్చుచుండును; దానిని ఇక్కడికి తెండు. దానినుండి ధ్వని వినఁబడినను దాని మూఁతను తీయ వలదు.' అని యాజ్ఞాపించెను. సరియే యని వారు గంగకు వచ్చులోపల, రాజపుత్త్రు డొకఁడు గంగయొద్దనుఁ బోవుచు దీపము మూలముగా మందసను కని తనభటులచేత గట్టునకు తెప్పించి

కుతూహలముచేత తెఱచి అందు చిత్తోన్మాదిని యైన యానై శ్యకన్యను చూచి తత్క్షణమే గాంధర్వవిధిచేత వివాహ మాడి, ఆ మంజూషలో భయంకర మయిన కొండముచ్చు నొకదానిని పెట్టి యథాప్రకారముగా పైదీపముతో కూడ గంగలో వదలి పెట్టెను. అట్లు కన్యారత్నమును పొంది ఆరాజకుమారుఁడు పోయినవెంటనే, ప్రవ్రాజకుని శిష్యులు మందస నెదురు సూచుచు వచ్చి, దానిని చూచి పట్టుకొని కొనిపోయి గురువు గారియెదుటఁ బెట్టిరి. 'నేను ఏకాకిగా దీనితో మిద్దెమీఁద మంత్రము సాధించెను. మీరు ఈరాత్రి యెల్ల క్రింద ఊరక నిద్ర పోవలసినది.' అని చెప్పి సన్న్యాసి మందసను మఠము మీఁది కెక్కించించి తానును పై కెక్కి వైశ్యకన్యాభిలాష చేత మందసమూఁతను తీసెను. అంతట లోపలినుండి మూర్తీభవించిన తనదుర్నీతియో యన నా ఘోరవానరము అతని మీఁదఁ బడి బుద్ధిపూర్వకముగా అతనిపాపమునకు శాస్తి చేయునదియుంబోలె ముక్కు కొఱికి గోళ్లతో చెవులు పీఁకి పాఱిపోయెను. ఈ స్వరూపముతో గురువులవారు క్రిందికి దిగి వచ్చిరి. శిష్యులు ఆయనను దర్శించి నవ్వు పట్టలేక ఎట్ట కేలకు కొంచెము ఆఁపుకొనిరి. తెల్లవాఱఁగానే మౌనవ్రత సన్న్యాసిగారికథ యెల్లను విశద మై జను లెల్లను నవ్విసాగిరి. వర్తకుఁడును తనకొమారితకు మంచిమగఁడు కలిగినందులకు సంతోషించెను.

కపటప్రయోగము సిద్ధింపదేని మనమును ఆప్రవ్రాజకునివలెనే హాస్యాస్పద మగుదుము సుమా? రాజునకు వాసవదత్తతోడివిరహము మిగుల ననర్థకారణము. రుమణ్వంతుఁ డిట్లనఁగా, యౌగంధరాయణుఁడు చెప్పుచున్నాఁడు: మనకోర్కె నెఱవేఱుటకు వేఱు ఉపాయము లేదు. ఉద్యమము మానితిమేని ఈరాజు వ్యసనాసక్తుఁ డగుటచేత ఇప్పు డున్న రాజ్యము కూడ పోఁగలదు. మనకు మంత్రిత్వఖ్యాతి కలిగినను అపఖ్యాతియే యగును. అంతట స్వామియొక్క యనాదరమునకు పాత్రముల మగుదుము. స్వాధీనసిద్ధి యైన రాజునకు అతనిప్రజ్ఞయే సాధనము. వానియాజ్ఞప్రకారము చేయుమంత్రికి కార్యము బాగుపడినను చెడినను గుణదోషములు లేవు. సచివాయత్తసిద్ధి యైన రాజునకు సచివులప్రజ్ఞయే కార్యసాధనము. వారు ఉత్సాహశూన్యు లేని సిరికి జలాంజలియే. మఱి దేవితండ్రి చండమహాసేనునివలన భయపడెద వేమో? అతఁడును అతనికుమారులును దేవియు నామాటను అతిక్రమింపరు.

ధీరోత్తముఁ డైన యౌగంధరాయణుఁ డిట్లు పలుకఁగా ఈప్రయోగములో ప్రమాద మేమయినఁ గలుగునో యని శంకించినవాఁడై రుమణ్వంతుఁడు మరల నిట్లు చెప్పందొడంగెను.

అభీష్టస్త్రీవియోగముచేత వివేకిసైతము డిల్లవోవును. అట్లుండఁగా మనవత్సరాజుమాట చెప్పవలయునా? ఇందులకు దృష్టాంతముగా నీకథను వినుము.

### ఉన్మాదినీ దేవసేనుల కథ.

పూర్వము బుద్ధిమంతులలో అగ్రగణ్యుఁడు దేవసేనుఁడని రా జొకఁ డుండెను. ఆయనకు శ్రావస్తి రాజధాని. ఆపురమందు మహాధనికుఁడైన యొకవర్తకునికి అనన్యసామాన్యలావణ్యా యొకకూఁతు రుండెను. దానిరూపమును చూచినవానికెల్ల ఉన్మాదము కలుగుచుండుటంబట్టి దానికి ఉన్మాదిని యని పేరు ప్రసిద్ధమాయెను. 'లోకాతీతలావణ్యా యైనయీతనయను రాజునకు నివేదింపక ఎవరికిని ఈఁగూడదు. ఇచ్చిన అతనికి కోపము వచ్చును.' అని యాలోచించి ఆమెతండ్రి దేవసేనమహారాజునొద్దకు పోయి 'దేవా! నాయింట కన్యారత్న మున్నది, ఉపయోగియేని ఏలినవారు స్వీకరింపుమురుగాక.' అని విన్నవించుకొనెను. ఆమాట విని రాజు తనకు నమ్మక మయినబ్రాహ్మణులను ఆమె సులక్షణయో కాదో చూచి రమ్మని పంపెను. బ్రాహ్మణులు పోయి ఆవణిక్కుమారిని ఉన్మాదినిని చూచి తత్క్షణమే మదనక్షోభమునకు పాలై క్రమక్రమముగా తెలివి రాఁగా ఇట్లాలోచించిరి. 'రాజు ఈమెను వివాహమాడునేని ఈమెయే లోకమై రాచకార్యములను వదలిపెట్టును; అంతట సర్వమును నాశమగును. ఏల యీబాల?' ఇట్లు కలియఁ బలికికొని పోయి ఆబ్రాహ్మణులు రాజుతో ఆకన్య దుర్లక్షణ యని అబద్ధము చెప్పిరి. రాజు తన్ను గ్రహింపనందునకు లోలోపల అవమానపడియున్న యాయున్మాదినిని తండ్రి పిమ్మట సేనాపతి కిచ్చెను.

పతియింట మేడమీఁద నున్నదై యున్మాదిని యొకనాఁడు రాజు ఆవీథిని పోవుచుండఁగా ఎఱిఁగి ఆయనకు హొయలు తోను ఒయ్యారముతోను అగపడెను. ఆమెను కాముఁడు తనపై ప్రయోగించినజగత్సమ్మోహనౌషధింబోలె చూచి రాజు వేంట నే వెఱ్ఱియెత్తినవానివలె ఆయెను. రాజు ఇంటికి పోయి ఆమెను తాను పూర్వము వలదన్నదానినిగా తెలిసికొని బెగ్గడిల్లిదారుణ మయినజ్వరమునకు పాలాయెను. 'దేవా, దానిని నేను దేవాల యములో వదలెదను. అంతట ఏలినవారు దానిని దాసిగా గ్రహింపవచ్చును; పరస్త్రీయనుదోషము ఉండదు. అట్లు చేయ నను గ్రహింపుము ప్రభూ.' అని ఆమెభర్త సేనాపతి మనవి చేసి కొనఁగా, రాజు ఎట్టకేలకు ఇట్లు పలికెను. నేను పరస్త్రీని గ్రహింపను. నీవైనను ఆమెను వదలుదువేని ధర్మమును కోల్పో దువు, నాకు దండ్యుఁడవును అగుదువు.' ఆమాట విని కడమ మంత్రులును ఊరకుండిరి. క్రమముగా ఆరాజు ఆకామజ్వరముచే తనే కాలధర్మము నొందెను. ధీరుఁడైన యారాజే ఉన్మాదిని లేక నష్టుఁడాయె నఁట, వాసవదత్త లేక వత్సరాజు ఏమగునో!

రుమణ్వంతుని యీమాట విని మరల యౌగంధరాయ ణుఁ డిట్లనియె:— 'కార్యదృష్టిచేత రాజులు క్లేశమును సహింతురు. రావణనాశముకొఱకు దేవతలు యుక్తిచేత కలిగించిన సీతావిరహమును రాములవారు భరింపలేదా?' ఈమాటకు రుమ ణ్వంతుఁడు మరల నిట్లనియె:— రామాదులు దేవతలుకనుక

వారిమనస్సు సర్వమును సహింపఁగలదు. మనుష్యబుద్ధి అట్లు సహింపనేరదు. అందుల కీనిదర్శనమును వినుము:—

యఇల్లకుని కథ.

కలదు గదా ఇక్కడ మథుర యను బహురత్నాఢ్య యగు మహాపట్టణము. అందు యఇల్లకుఁ డని వైశ్యకుమారుఁ డొకఁ డుండెను. అతనికి తదేకాబద్ధమానస యైనప్రియభార్య యొకతె యుండెను. ఆమెతో కూడ సుఖంబుండి అతఁ డొకప్పుడు కార్యవశమున ద్వీపాంతరము పోవ సమకట్టెను. భార్య కూడ పయన మాయెను. స్త్రీలమనస్సు భావానురక్తమును విరహాసహమును గదా. అంత నావణిక్కుమారుఁడు కృతస్వస్త్యయనుఁడై తనతో కూడ వచ్చుటకు అలంకరించుకొని సిద్ధముగా నున్నభార్యను తోడ్కొనకయే వెడలెను. పోవుచున్నభర్తను తలుపునొద్దనుండి ఆమె బాష్పాకులలోచన యై వెనుక చూచుచునే యుండి అతఁడు దృష్టిపథము దాఁటి పోఁగానే ఆవిరహమును తాళలేక ఆచోటినుండి అవతలి కడుగు పెట్టనేరకుండెను. అక్కడనే ఆమెప్రాణములు నిలువునఁ బోయినవి. ఆవార్త విని వణిక్కుమారుఁడు మరలి వచ్చి తనవిరహముచే గతజీవిత యైనభార్యను సుందరాపాండురచ్ఛాయయు విలోలాలకలాంఛనయు నై ఆకాశమునుండి నేలఁబడియున్న చంద్రలక్ష్మినిం బోలె చూచి ఎత్తి తొడపై నుంచుకొని యేడ్చుచుండ, ఆశోకాగ్నికి కాలినయతనిదేహమునందు

నిలువలేనివియుంబోలె అతని ప్రాణములును లేచి పోయినవి. ఇట్లు అన్యోన్యవిరహముచేత ఆదంపతులు నశించిరి. కనుక ఈ రాజునకును దేవికిని పరస్పరవియోగమును తప్పింపవలయును.

ఇట్లు రుమణ్వంతుఁడు శంకాకులుఁడై చెప్పి విరమింపఁగానే ధైర్యసాగరుఁడు మహామతి యౌగంధరాయణుఁడు మరల నిట్లు వక్కాణించెను:—ఇది యంతయు నేను ముందే ఆలోచించి నిశ్చయించి యున్నాను. రాజులకార్యములు సాధారణముగా నిట్టివిగానే యుండును. అందున కీకథను వినుము.

## పుణ్యసేనునికథ.

పూర్వము ఉజ్జయినిలో పుణ్యసేనుఁడని రాజుండెను. ఆతనిమీఁదికి ఒకప్పుడు బలవంతుఁడయినపరరాజు దండెత్తి వచ్చెను. అంత నతనిమంత్రులు శత్రువు దుర్జయుఁడని తెలిసికొని తమరాజు మృతిఁబొందె నని మిథ్యాప్రవాదమును పుట్టించి అతనిని ఒకచోట దాఁచి మఱియొకశవమును రాజార్హవిధానముచేత దహనము చేయించి, ఆపరరాజుతో 'ఓప్రభూ, రాజు లేనిమాకు ఇప్పుడు నీవే రాజవు కావలయును.' అని దూతముఖముగా మొఱవెట్టుకొనిరి. అందుల కతఁడు సంతోషించి యంగీకరింపఁగా వారు క్రమక్రమముగా సైన్యములతోఁ గూడుకొని భేదోపాయముచేత నతనిస్కంధావారమును చీలఁదీసిరి. రాణువ చీలి రాఁగానే తమరాజును పుణ్యసేనుని బయటికి తెచ్చి ఆమంత్రులు సంప్రాప్తబలులై శ

త్రువును తెగటార్చిరి. రాచకార్యములు సాధారణముగా ఇట్టివిగానే ఉండును. మనమును దేవీదాహప్రవాదచేత ఈకార్యమును ధైర్యముతో సాధింపుదము.

ఇట్లు కృతనిశ్చయుఁడై యున్నయౌగంధరాయణుని పలుకులను విని రుమణ్వంతుఁడు 'ఇదే నిశ్చయమేని దేవి యన్న గోపాలునికూడ పిలిపించి అతనితో కూడ ఆలోచించి చక్కఁగా సర్వమును చేయుదము' అనెను. అలాగే కానిమ్మని యౌగంధ రాయణుఁడు పలికెను. అతని బుద్ధిప్రభావమందు నమ్మకము గలవాఁడై రుమణ్వంతుఁడును ఆప్రయోగము చేయుటకే నిశ్చయించుకొనియుండెను. మఱునాఁడు మహామంత్రులిద్దఱును గోపాలకునియొద్దకు, అతనిని చూచుటకు తాము ఉత్కంఠితులై యున్నారని యతనితోఁ డొకని రమ్మని, దూతను పంపిరి. గోపాలకుఁడును పూర్వము కార్యావసరముచేత స్వనగరమునకు పోయినవాఁడు గావున ఇప్పుడు దూత పిలువఁగానే మూర్తీభవించినయుత్సవమో యన వచ్చి చేరెను. వచ్చిన దినమే అతనిని రుమణ్వంతునితో కూడ యౌగంధరాయణుఁడు తనయింటికి కొనిపోయి తాను పైని తెలిపిన తనచికీర్షితమును రుమణ్వంతుని యుత్సాహమును సర్వమును తెలిపెను. అతఁడును రాజహితమునే కోరినవాఁడై ఆప్రయోగము తనచెల్లెలికి దుఃఖమును కలిగించునదయినను అందుల కంగీకరించెను. సజ్జనులవచనము ప్రకారము నడవవలసినది గదా. 'ఇది యెల్ల

చక్కఁగానే పన్నఁబడినది. దేవి దగ్ధ యాయె నని తలంచునట్టి వత్సేశుని ప్రాణములను కాపాడుటకు ఉపాయమాలోచింప వలయును. ఉపాయసామగ్రి యెంతయున్నను మంత్రాలోచనకు ముఖ్యాంగము రాఁబోవుకీడునకు ముందే ప్రతిక్రియ చేయుట గదా.' అని మరల ఆసమయమందు రుమణ్వంతుఁడు చెప్పఁగా అప్పటికే సకలకార్యములను ఆలోచించి కృతనిశ్చయుఁ డై యున్న యౌగంధరాయణుఁడు 'ఇందులకై చింత వలదు. దేవి ఈగోపాలకునికి ప్రాణములకంటె ప్రియ మైన చెల్లెలు గదా. ఇతనికి దుఃఖము స్వల్పముగా నుండుటను గని వత్సేశ్వరుఁడును దేవి బహుశః బ్రదికియే యుండు నని తలఁచి ధైర్యము దాల్చును. మఱియు వత్సరాజు ఉత్తమసత్త్వుఁడు, శీఘ్రముగానే ఇతనికి పద్మావతి భార్య యగును. అయినవెంటనే దేవిని మరల నితఁడు కలిసికొనును.' అని యుత్తరము చెప్పెను. అట్లే చేయుటకు ముగ్గురును నిశ్చయించుకొని అందులకై ఇట్లు ఆలోచన చేసిరి. 'దేవిని నృపుని యుక్తిచేత లావాణకమునకు తోడ్కొని పోదము. అదే మగధదేశంపుటెల్లను తాఁకు చుండుమనదేశము. అది వేటకు అనుకూల మయినప్రదేశము గాన అందు రాజు దేవియొద్ద లేనిసమయము సులువుగా దొరకును. అట్లు అతఁడు లేనప్పుడు అంతఃపురమునకు నిప్పు పెట్టి మనయాలోచన జరిగింపవచ్చును. దేవిని కొనిపోయి యుక్తిచేత పద్మావతియింట నుంచెదను. గుప్తముగా నచట నున్న యీమెశీలమునకు పద్మావతియే సాక్షిణి యగును.'

ఈప్రకారము రాత్రి మంత్రము చేసి మఱునాఁడు యౌగంధరాయణాదులు రాజసన్నిధికి పోయిరి. అచ్చట రుమణ్వంతుఁడు వత్సరాజుతో ఇట్లు విన్నపముచేసెను:- 'దేవా, లావాణకమునకు పోయిన మనకు మంగళ మగును. అది మిగుల రమ్య మయినదేశము. అందు వేఁటభూములు రమణీయ మయినవి కలవు. కిక్కసగడ్డి సులువుగా దొరకును. ఆదేశమును ఎప్పుడును పొరుగువాఁడు మగధరాజు బాధించుచున్నాఁడు. కనుక రక్షకొఱకును వినోదముకొఱకును మనము అక్కడికి పోవలయును.' అది విని వాసవదత్తతో కూడ క్రొత్తక్రొత్త క్రీడలు కల్పించుకొనుటయే లోకముగా నున్న వత్సరాజు ఆమెను తోడ్కొని అక్కడికి పోవుటకు ఉద్యుక్తుఁ డాయెను.

ప్రయాణము సిద్ధమై మఱునాఁడు లగ్నము నిశ్చితము కాఁగా ఆకస్మికముగా నారదముని దేహకాంతిచేత దిఙ్ముఖములు వెలుంగ ఆకాశమధ్యమునుండి వత్సరాజునొద్దకు చంద్రుఁడు తన కులముమీఁది యభిమానముచేత వచ్చెనా యనునట్లు వచ్చి అతనివలన నతిథిసత్కారములు పొంది వినీతుఁడైన యా రాజునకు పారిజాతకుసుమమాల నొకటి ప్రీతితో నిచ్చి, వాసవదత్తను 'కామదేవాంశ సంభూతుఁడును విద్యాధరాధిపుఁడును నగుపుత్త్రునిఁ బడయుదువు లే' అని ఆదరముతో అభినందించి, పిమ్మట వత్సరాజును గూర్చి యౌగంధరాయణుఁడు కూడ వినుచుండఁగా నిట్లనియె:—

రాజా, నీవాసవదత్తను చూడఁగా, ఆహా! నాకు ఇది జ్ఞప్తి అగుచున్నది. ఏమనఁగా, పూర్వము నీముత్తాతలు ధర్మరాజాదులు ఉండిరిగదా. వారికైదుగురకు ద్రౌపది యొకతెయే భార్యయై యుండెను గదా. ఆమెయు ఈవాసవదత్తవలెనే సాటిలేనిరూపము కలిగి యుండెను. అంత నందువలన దోషము నూహించి వారలతో నిట్లు చెప్పితిని. "మీరు స్త్రీవైరమును రానీక జాగ్రత్తగా నుండవలయును. అది సుమా ఈలోకములో ఆపదలకు మూలము. అందునకు నిదర్శనముగా ఈకథను వినుఁడు.——

తిలోత్తమకథ.

పూర్వము సుందోపసుందు లని యిద్దఱు అసురులు అన్నదమ్ము లుండిరి. వారు తమ పరాక్రమముచేత మూఁడులోకములను ఆక్రమించి ఎవ్వరికిని జయింప నలవిగాక యుండిరి. వారిని నాశ మొందింపఁ గోరి బ్రహ్మ విశ్వకర్మ కాజ్ఞాపించి తిలోత్తమ యనుదివ్యాంగనను సృష్టి చేయించెను. ఆమె తనకు ప్రదక్షిణము చేయుసమయమందు నాల్గు దిక్కులందును ఆమెరూపమును చూచుటకు బ్రహ్మదేవుఁడు చతుర్ముఖుఁ డాయెను. ఆమె బ్రహ్మయొక్క యాజ్ఞచేత సుందోపసుందులను వలపించుటకై వా రున్నకైలాసోద్యానమున కేఁగెను. ఆయసురు లిద్దఱును కామమోహితులై తమచెంతకు వచ్చిన యాసుందరాంగిని రెండు చేతులును చాచి గ్రహించిరి. ఒకరికి లేకుండ నొకరు

ఆమెను హరించువారై తటగాలున ఘోరతరముగా పోరాడి వినాశము పొందిరి.

ఇట్లు స్త్రీవిషయము ఎవరికి ఆపదలకు మూలము కాదు? మీకును పలువురకు ఒక్కతెయే ద్రౌపది భార్య యైనది. కనుక ఆనిమిత్తమై స్పర్ధ రాకుండ మీరు ఉండవలసినది. నామాటప్రకారము ఈమెవిషయమై మీకు ఈయేర్పాటు జరుగునుగాక. ఈమె పెద్దవానియొద్ద నున్నప్పుడు చిన్నవాఁడు ఈమెను తల్లినిగా చూడవలసినది. చిన్నవానియొద్ద నున్నప్పుడు పెద్దవాఁడు కోడలినిగా చూడవలసినది." ఓరాజా, నామాటను నీప్రపితామహులు బుద్ధిమంతులై యంగీకరించిరి. వారు నాకు మిత్త్రులు గాన వారిమీఁది ప్రీతిచేత నే నిప్పుడు నీయొద్దకు వచ్చినాఁడను. నీ కొకమాట చెప్పెద వినుము. నామాటను నీముత్తాతలు ఏప్రకారము నెఱవేర్చిరో నీవును అట్లే సర్వదా నీమంత్రులవాక్యమును నెఱవేర్పుము. అట్లు చేయుటవలన స్వల్పకాలములోనే గొప్పకల్యాణమును పొందుదువు. నీకు కొలఁది కాలముమాత్రము దుఃఖము కలుగును. అప్పుడు అతిమోహమును వహింపఁగూడదు; ఏల యన, ఆదుఃఖము సుఖపర్యవసాయియే అగును.

ఈప్రకారముగా రాఁబోవు కల్యాణమును సూచించి నారదమహర్షి అంతర్హితుఁ డాయెను. అంత నతనిమాటప్రకారము యౌగంధరాయణాది మంత్రిపుంగవు లందఱును తమ

కోరిక నెఱవేఱు నని నిశ్చయించుకొన్నవారై మఱియు నధిక ముగా ప్రయత్న మారంభించిరి.

---

౨-వ తరంగము.

పిమ్మట ముందు చెప్పిన యుక్తిచేత వత్సరాజును వల్లభతో కూడ యౌగంధరాయణాదులు లావాణకమునకు కొనిపోయిరి. ఎల్లదెసలం బర్వుచున్న తన సైన్యఘోషముచేత మంత్రులకు వారి యభీష్టసిద్ధిని చెప్పుచున్నదియుం బోలెనున్న యాదేశమునకు వత్సరాజు పోయి చేరెను. పరివారముతో కూడ వత్సరాజు అచ్చటికి వచ్చి యున్నాఁడన్న సంగతి యెఱిఁగి మగధేశ్వరుఁడు ఆప్రయత్నము తనమీఁద దండెత్తివచ్చుట కేమో యని భయపడినవాఁడై యౌగంధరాయణునియొద్దకు దూతను పంపెను. కార్యజ్ఞుఁడైనయామంత్రియు ఆదూత్యమును అంగీకరించెను. వత్సరాజు ఆదేశములో నివసించి వేఁట కొఱకు ప్రతిదినమును మఱియు మఱియు దుర్గమారణ్యములకు పోవుచుండెను.

వాసవదత్తామందిర దాహము.

ఒకనాఁడు అతఁడు వేఁటకు పోయి యుండఁగా చేయవలసిన యేర్పాట్లు చేసి యౌగంధరాయణుఁడు గోపాలక రుమణ్వ ద్వసంతకులతోఁ గూడ వాసవదత్తాదేవియొద్దకు ఏకాంతమునఁ బోయెను. అక్కడ ముందుగా అన్న హెచ్చరింపఁగా

తాను చెప్పినమాటను వినుటకు సిద్ధురాలై యున్న యా వాసవదత్తను రాచకార్యములకు తోడ్పడవలయునని ఏమేమో మంచిమాటలు చెప్పి ప్రార్థించెను. తనకు భర్తృవిరహమును ఇడునది యైనను ఆప్రయోగమునకు ఆమె అంగీకరించెను. కులస్త్రీలు పతికై స్వక్లేశమును భరింపరు! అంతట యౌగంధ రాయణుడు ఆమెకు రూపమును మార్చుయోగము నుపదే శించి బ్రాహ్మణీవేషము ధరియింపించి, వసంతకుని ఏకాక్షి బ్రహ్మచారి చిన్నవానినిగా చేసి, తాను ముసలిబ్రాహ్మణరూప మును గ్రహించెను. పిమ్మట ఆమహామతి యౌగంధరాయ ణుడు ఆరూపమున నున్నవాసవదత్తను వసంతకునిని వెంటఁ బెట్టుకొని మగధదేశమునకుఁ బోయెను. ఇల్లువెడలిన వాసవ దత్తయొక్క దేహముమాత్రము మగధమునకు నడచెనే గాని మనస్సుమాత్రము వత్సరాజునొద్దకే పోయియుండెను. ఈలోపల నచ్చట రుమణ్వంతుడు ఆమెమందిరమునకు నిప్పు పెట్టి 'అయ్యో! అయ్యో! దేవియు వసంతకుడును ఇందులో కాలిపోయిరి!' అని ఘోషపెట్టెను. అచ్చట ఏకకాలములోనే పుట్టిన యా దహనరోదనములు రెంటిలోను క్రమముగా దహన మాఱినదే గాని రోదనము మాత్రము ఆఱదాయెను.

వాసవదత్తను పద్మావతికడం జేర్చుట.

క్రమముగా యౌగంధరాయణుడు వాసవదత్తతోను వసంతకునితోను మగధరాజుపట్టణము చేరెను. అచ్చట ఆస

మయమందు ఉద్యానములో మగధరాజకూఁతు రుండఁగాఁ జూచి రక్షు లడ్డగించినను లక్ష్యపెట్టక ఆయిద్దఱులో ఆమె యొద్దకు పోయెను. బ్రాహ్మణీరూపమున నున్న వాసవదత్తను కన్నులార చూడఁగా పద్మావతికి ఆమెయందు అనిర్వచనీయ మైనప్రీతి యుద్భవించెను. అంత నామె రక్షులను నివారించి వృద్ధ బ్రాహ్మణాకృతి నున్నయౌగంధరాయణుని తనయొద్దకు రప్పించుకొని ఆయనను 'ఓబ్రాహ్మణోత్తమా, నీ కీమె ఏమి కావలయును? నీ విచ్చటి కేల వచ్చితివి?' అని యడిగెను. అందునకు యౌగంధరాయణుఁడు 'ఓరాజపుత్త్రి, ఈపిల్ల నాకూఁతురు; దీనిపేరు ఆవంతిక. దీనిపెనిమిటి దుర్వ్యసనాసక్తుఁడై దీనిని విడనాడి ఎటకో పోయినాఁడు. ఓకీర్తిమంతురాలా, దీనిని నీచేతిలో పెట్టి పోయి త్వరలోనే దీనిపెనిమిటిని వెదకి తెచ్చెదను. దీనికి ఒంటరిగా నుండుదిగులు లేకుండుటకై దీని సోదరుని ఈ కాణుని కూడ ఇక్కడనే యుంచెదను. ఇందులకు నీ వనుగ్రహింపవలయును.' అని వేఁడి అందులకు ఆమెయు నంగీకరింపఁగా ఆమెయొద్ద సెలవు పుచ్చుకొని తత్క్షణమే లావాణకమునకు పోయెను.

పిమ్మట ఆవంతిక యనుపేర నున్న యూ వాసవదత్తను ఒంటికంటి బ్రహ్మచారి యైన వసంతకునిని వెంటఁగొని మిక్కిలి యౌదార్యముతో సత్కరించి స్నేహశాలిని పద్మావతి అనేక వినోదములు కల దైన తనమందిరమునకు పోయెను. అచ్చట

వాసవదత్త గోడలమీఁదిచరిత్రములలో రామచరితమందలి సీతాప్రతిమను చూచి తనవిరహక్లేశమును ఓర్చుకొనియుండెను. ఆకారముచేతను సౌకుమార్యముచేతను నీలోత్పలమువలె పరిమళించుచున్న దేహసౌరభముచేతను శయనాసనసౌష్ఠవముల చేతను ఆమెను ఉత్తమురాలినిగా నిశ్చయించుకొని పద్మావతి తనతో సమానముగా మర్యాదోపచారములు సేయుచుండెను. 'ఈమె ఎవరో తెలియలేదు. ఇక్కడ ప్రచ్ఛన్నవృత్తిలో నున్నది. పూర్వము విరాటునిగృహమందు ద్రౌపది అజ్ఞాతముగా నుండలేదా?' అని పద్మావతి తలంచెను. పిమ్మట వాసవదత్త ఒకప్పుడు ప్రసంగవశముగా పద్మావతికి తాను పూర్వము వత్సరాజువలన నేర్చుకొన్నవానిని వాడని మాలా తిలకములను రచించెను. ఆయలంకారములతోడి యా పద్మావతిని తల్లి చూచి ఏకాంతమందు 'ఈమాలాతిలకములను ఎవరు రచించినా ర'ని యడిగెను. 'నామందిరములో ఆవంతిక యని యొకతె కలదు. ఆమె నాకు వీనిని రచించినది.' అని తల్లికి పద్మావతి ఉత్తరము చెప్పినది. అందునకు తల్లి యిట్లనియె:—

"అమ్మాయీ, ఇట్టిశిల్పజ్ఞానము కలిగినయీమె ఎవరో దేవత గాని మానుషి గాదు సుమా. దేవతలును మునులును వంచనార్థము సజ్జనులయిండ్లలో వచ్చి యుందురు. అందుల కీ నిదర్శనమును వినుము.

కుంతిభోజుఁ డని రాజొకఁ డుండెను. అతనియింట

వంచనైకమతి దుర్వాసుఁ డను మహాముని వచ్చి యుండెను. ఆయనకు పరిచర్య చేయుటకై రాజు తనకొమారితను కుంతిని నియోగించెను. ఆమెయు శ్రద్ధతో ఆయనకు ఉపచారములు చేయుచుండెను. ఒకనాఁడు ఆముని కుంతిని పరీక్షార్థము 'నేను స్నానము చేసి వచ్చునప్పటికి పరమాన్నము చేసి సిద్ధముగా నుంపుము' అని చెప్పి త్వరగా పోయి స్నానము చేసి వచ్చి భోజనమునకు కూర్చుండెను. ఆమెయు ఆమహామునికి పరమాన్న పూర్ణమయిన పాత్రము నెదుట పెట్టెను. మిక్కిలి కాలుచున్న యా యన్నముచేత జ్వలించుచున్నట్టుండి పట్టుకొనుటకు అశక్య మయి యున్న యా పాత్రమును చూచి ముని కుంతి వీఁపుమీఁద వీక్షణము వేసెను. ఆమెయు మునియొక్క యభిప్రాయము నెఱిఁగి ఆపాత్రమును తనవీఁపుపై పెట్టుకొనెను. అంత ముని స్వేచ్ఛగా భుజించెను. కుంతియొక్క వీఁపు మాత్రము కాలి బొబ్బలాయెను. వీఁపు కాలుచున్నను కుంతి చలింపనందునకు ముని సంతోషించి ఆమెకు వర మిచ్చి పోయెను. ఆముని ఆమెయింట ఏప్రకార ముండెనో ఈయావంతికయు అట్లే నీయింట నున్నది. ఈమెను నీవు చక్కఁగా ఆరాధింపుము."

ఇట్లు తల్లి చెప్పఁగా పద్మావతి మాఱురూపున నున్న యా వాసవదత్తను మిక్కిలి గౌరవించుచుండెను. ఐనను వాసవదత్త తననాథు నెడఁబాసి విరహవిచ్ఛాయయై నిశీథమందలి

పద్మినిని అనుకరించుచుండెను. బాలోచితములైన వసంతకుని వికారములు నాటినాటికి అవిరహిణికి కొంచెము చిఱునగవునకు ప్రసక్తిని కలిగించుచు వచ్చినవి.

ఈలోపల వత్సరాజు అతిదూరములయిన వేటభూములలో తిరిగి సాయంకాలము లావాణకమునకు వచ్చెను. అగ్నిచేత భస్మీకృతమయిన యంతఃపురమును చూచి మంత్రులవలన దేవియు వసంతకుఁడును కాలిపోయి రని విని తత్క్షణమే మూర్ఛితుఁడై భూమిమీఁద పడెను. ఆ దుఃఖానుభవమును తప్పించుటకుం బోలె అతనిని మూర్ఛ యావరించెను కొంచెము సేపటికి తెలివి గలుగఁగానే అతనిహృదయము దేవీదాహేక్షణానలముచేత ఆవేశింపఁబడినదియుంబోలె శోకముచేత మండసాగినది. అంత నారాజు దుఃఖార్తుఁడై విలపించుచు ప్రాణత్యాగమునకు నిశ్చయించుకొని క్షణములో జ్ఞప్తి తెచ్చుకొని యిట్లు చింతించెను:—'వాసవదత్తాగర్భమందు విద్యాధరాధిపుఁ డగుపుత్త్రుఁడు ఉదయించు నని నారదమునివలన వినియున్నాను. ఆమాట అబద్ధము కానేరదు. క్రొంతకాలము నాకు దుఃఖము కలుగు ననియు ఆమునియే చెప్పియున్నాఁడు. ఈగోపాలకుని దుఃఖము స్వల్పముగానే యున్నది ఈయౌగంధరాయణాదులు కూడ అతిదుఃఖితులుగా అగపడరు. ఇందువలన దేవి ఏవిధముగానో బ్రదికియే యుండఁబోలును. ఇది మంత్రులచే ప్రయోగింపఁబడిన నీతిప్రయోగవిశేషము కానోపును. కనుక

నాకు ఒకవేళ ఆమెతో మరల సమాగమము కలుగవచ్చును. కావున ఇందులపర్యవసానమును చూచెదను గాక.' ఇట్లు ఆలోచించియు మంత్రులచేత బోధింపఁబడియు ఆరాజు హృదయమందు ధైర్యమవలంబించి యుండెను. ఆసమయములో గోపాలకుఁడును తనతండ్రి దిగులు పడకుండునట్లు వాసవదత్తా వృత్తాంతమును రహస్యముగా దూతముఖముగా ఆయనకు తెలియఁబఱిచెను.

## పద్మావతీవివాహము.

ఏరీతి నిట్లుండఁగా ఈ లావాణకవృత్తాంతము నంతయు మగధరాజు తనచారులవలన తెలిసికొని కాలజ్ఞుఁడై పూర్వము యౌగంధరాయణుఁడు తన్నడిగియున్నప్రకారము తనకూఁతును పద్మావతిని వత్సరాజునకిచ్చుటకు ఇష్టపడి ఆయభిప్రాయమును దూతముఖముగా వత్సరాజునకును యౌగంధరాయణునకును తెలియఁజేసెను. వత్సరాజు యౌగంధరాయణుని మాటమీఁద ఆ సందేశము నంగీకరించి 'ఇందునిమిత్తమే దేవిని దాఁచియుంచినారు కావలయును' అని తలంచియుండెను. వెంటనే లగ్నమును నిశ్చయించి యౌగంధరాయణుఁడు మగధరాజునకు ప్రతిదూతముఖముగా 'నీకోరికను మేము అంగీకరించినారము. కనుక నేఁటికి ఏడవదినమందు పద్మావతిని వివాహమాడుటకు వత్సరాజు అక్కడికి రాఁగలఁడు. ఈవివాహమువలన వత్సరాజు వాసవదత్తను శీఘ్రముగా మఱచిపోవునుగాక.' అని సందేశ

ము పంపెను. ప్రతిదూత పోయి ఆసందేశమును మగధరాజునకు నివేదించెను. మగధరాజు దాని కంగీకరించెను. అంతట మగధరాజు కొమారితమీఁది తనయనురాగమునకును తన యిచ్ఛకును ఐశ్వర్యమునకును తగినట్లు వివాహోత్సవసంభారములు సిద్ధముచేయించెను. పద్మావతియు ఇష్టవరలాభముచేత సంతోషించెను. వాసవదత్త ఆవార్త విని వగవసాగెను. ఆ వార్త చెవిని చొచ్చి ఆమెకు వెలవెలపాటుచే మాఱురూపము కలిగించి ఆ యజ్ఞాతవాసమునకు సాయము చేసిన దాయెను. 'ఇందువలన శత్రువు మిత్త్రి మయినాఁడు, నీయందు భర్త మఱియొకవిధముగా నుండఁడు.' అను వసంతకుని మాటమాత్రము చెలివలె ఆమెకు ధైర్యము గలుగఁజేసెను.

పిమ్మట నామానిని వివాహ మాసన్నము కాఁగా పద్మావతికి మరల దివ్యము లయిన యా వాడని మాలాతిలకములను రచియించెను. ఏడవదినమున వత్సరాజు సైన్యములు వెంట రాఁగా మంత్రులతోఁగూడ వివాహార్థమై వచ్చెను. అందువలన మరల దేవిని కూడుకొనెదరు చూడఁజాని ఆవిరహములో వత్సరాజు వివాహోద్యమమును మనస్సులో నయిష్టము సహించియుండెను. ప్రజానేత్రోత్సవుఁ డయిన యా వత్సరాజునకు ఆనందభరితుండై మగధేశ్వరుఁడు చంద్రునికి సముద్రుండునుంబోలె ఎదురువోయెను. అంతట వత్సరాజు మగధేశ్వరుని పురమును ప్రవేశింపఁగా, ఎల్లెడల పౌరసమూహంపు

మనస్సులో మహోత్సవము ప్రవేశించెను. విరహ క్షామ దేహుఁడును మనస్సమ్మోహదాయకుండును అగు నా వత్స రాజును అక్కడి స్త్రీలు చూచి రతిహీనుఁ డయిన మన్మథుఁడా యని తలంచిరి. పిమ్మట వత్సరాజు మగధరాజుమందిరమునకు పోయి అందు ముత్తయిదువులతో నిండి యున్న పెండ్లియిల్లు ప్రవేశించి అచ్చట పూర్ణచంద్రుని గెలిచిన ముఖముదానిని పెండ్లికూఁతురు సేయఁబడియున్నదానిని పద్మావతిని చూచెను. ఆమె ధరియించియున్న తన దివ్యమాలాతిలకములను చూచి 'ఇవి ఈబాల కెక్కడివి?' అని యాలోచించుచు పిమ్మట పెండ్లి యరంగెక్కి పాణిగ్రహము చేసెను. ఆపద్మావతీకరగ్రహణమే పృథివీ కరగ్రహణమునకు ఆరంభముగా నుండెను. ఇతఁడు ప్రియ వాసవదత్తుఁడు ఈమెను చూడనోపఁ డనియుంబోలె ఆసమయ మందు వేదిధూమము అతనినేత్రములను బాష్పములతో మూ సెను. అగ్నిదేవప్రదక్షిణమునం దెఱ్ఱనైన పద్మావతీముఖము భర్త యభిప్రాయము నెఱిఁగి కోపాకుల మాయెనా యన విరా జిల్లుచుండెను. వివాహము కాఁగానే వత్సరాజు పద్మావతిని చేతి నుండి వదలెనేగాని వాసవదత్తనుమాత్రము క్షణము సేపైన మనస్సునుండి వదలఁడాయెను. అప్పుడు మగధరాజు అల్లునికి ఇచ్చిన రత్నసమూహములను చూడఁగా భూమిలో మఱి రత్నములు లేవు అనవలసియుండెను. ఆసమయమందే యౌగం ధరాయణుఁడు తనరాజువిషయమై మగధరాజుచేత అగ్నిసాక్షి

కముగా అనోంహప్రమాణమును చేయించెను. అందఱకును వస్త్రాలంకారములు కట్నంబులిచ్చుటయు చారణులు పాటలు యు వారాంగాన లాటలయును గా మహోత్సవము ప్రవర్తిల్లుచుండెను. భర్తయొక్క యుదయును కోరినదై ఎక్కడనో నిద్రించుచున్నదియుంబోలె అగపడనిదై వాసవదత్త ఆ కాలములో పగలిటిచంద్రుని వెన్నెలను పోలియుండెను.

'వత్సరాజు గనుక అంతఃపురమునకు పోయెనా ఇక్కడనే వాసవదత్తను చూచును' అని శంకించి మంత్రభేదభయముచేత మహామతి యౌగంధరాయణుఁడు మగధేశ్వరునికి అప్పుడే వత్సరాజు స్వనగరమునకు తరలునని తెలియఁబఱిచెను, అందుల కతఁడంగీకరించెను. ఆవిషయమునే యౌగంధరాయణుఁడు వత్సరాజునకు తెలిపెను. అతఁడు నంగీకరించెను. అంతట వత్సరాజు అసాధారణములయిన విందుభోజనములు పానములును ఐనతరువాత పద్మావతిని తోడుకొని మంత్రులతోఁగూడ బయలువెడలెను. వాసవదత్తయు పద్మావతి యిచ్చిన సుఖవాహనము నెక్కి ఆమెచే నాజ్ఞాపింపఁబడిన మహత్తరులతో సైన్యము వెనుక గుప్తముగా మాఱురూపున నున్న వసంతకునితోఁగూడ వచ్చెను. వత్సరాజు క్రమముగా లావాణకము చేరి పద్మావతియు తానును మందిరములోను, తానుమాత్రము దేవిమనస్సులోను ప్రవేశించెను. వాసవదత్తయు వచ్చి అర్ధరాత్రమందు మహత్తరులను వదలి గోపాలకునిమందిరమునకు పోయి

అచట తన్ను చూచి అత్యాదరమున బాష్పవ్యాకులితాక్షుఁడైన గోపాలకుని ఏడ్చుచు కౌఁగిలించుకొనెను. ఆ క్షణమందే సంకేతప్రకారము అక్కడికి యౌగంధరాయణుఁడు రుమణ్వాంతునితోవచ్చి దేవిచేత కృతాదరుఁడై ఆమెయొక్క విరహదుఃఖము దీఱినదని ఓదార్చుచుండెను. ఇంతలోపల మహత్తరులు పద్మావతియొద్దకు పోయి 'దేవీ, మాతోకూడ ఆవంతికమ్మ ఇంత దూరము వచ్చినది. ఇక్కడికి రాఁగానే మామాట వినక మమ్ము వదలి ఏమో గాని రాజపుత్త్రుఁడు గోపాలకునియింటికి పోయినది.' అని విన్నవించిరి. ఇట్లని వత్సరాజునెదుట తన మహత్తరులు చెప్పఁగా పద్మావతి సంశయితయై వారిని "మీరు ఆవంతికమ్మతో నామాటగా 'నీవు నాయొద్ద ఇల్లడ యుంపఁబడితివి. నే నెక్కడ నున్నానో నీవును అక్కడనే యుండవలసినది, మఱియొకచోట నీ కేమి పని? నాయొద్దకు రమ్ము.' అని చెప్పుఁడు." అని యాజ్ఞాపించెను.

ఉదయనుఁడు మరల వాసవదత్తం గలయుట.

ఆ మాటవిని వారు పోఁగానే వత్సరాజు ఏకాంతములో పద్మావతిని నీ కీమాలాతిలకములు ఎవరు రచించినా రని యడిగెను. నాయింట ఒకబ్రాహ్మణుఁడు ఆవంతిక యని యొకతెను ఉంచి పోయినాఁడు. ఆమెయొక్క యద్భుతశిల్ప మిది.' అని పద్మావతి చెప్పెను. వెంటనే వత్సరాజు ఆమెయే వాసవదత్త యని నిశ్చయించుకొని గోపాలకునియింటికి పోయి అచ్చట

ద్వారమందు పద్మావతియొక్క మహాత్తరులను చూచి లోపలికి ప్రవేశించెను. అక్కడ దేవి గోపాలక యౌగంధరాయణ రుమణ్వద్వసంతకులు ఉండిరి. అంత వత్సరాజు దూర మెడఁ బాసి మరల వచ్చిన దైనయీ దేవిని గ్రహణవిముక్త యయిన చంద్రమూర్తినింబోలె చూచి శోకాకులుఁడై భూమిమీఁద పడిపోయెను. అంతట విరహపాంసురావయవ యైన వాసవ దత్తాదేవి హృదయము తల్లడిల్లి నేలఁబడి తనకఠినచరితమును నిందిందుకొనుచు విలపించుచుండెను. శోకదీనులయి యీ దంపతులు ఏడ్చినవిధము చూడఁగా మహాధీరుఁడైన యౌగంధరా యణునిముఖముకూడ బాష్పములచే స్నానము చేసినదాయెను. ఆకాలమందు ఆకోలాహలమును విని పద్మావతి కూడ ఆకుల యై అక్కడికి వచ్చి సంగతిని తెలిసికొని రాజవాసవదత్తలతో తుల్యావస్థను తానుచు పొందిన దాయెను. మంచియిల్లాండ్రను స్నేహపుముద్దలు గదా. 'భర్తకు దుఃఖము కలుగఁజేసిన నాజీ విత మేల!' అని వాసవదత్త విలపించుచు పలుమారు పలికెను. అంతట ధీరుఁడైన యౌగంధరాయణుఁడు 'దేవా మగధరాజ సుతాలాభముచేత నీకు సామ్రాజ్యము కలుగునుగాక యని ఇది యంతయు నేను చేసినాఁడను. దేవియందు దోష మేమి యు లేదు. ఈసపత్ని పద్మావతియే ఈవిరహములో దేవియొక్క శీలమునకు సాక్షిణియై యున్నది.' అని పలికెను. అంత పద్మా వతి నిర్మత్సరబుద్ధితో 'ఈమె శీలమును స్థాపించుటకు నేను

అగ్నిప్రవేశ మయినను చేసెదను.' అని ప్రతిజ్ఞ చేసెను. 'నాదే తప్పిదము. నానిమిత్తమే కదా దేవి కూడ మహాక్లేశ మనుభవించినది.' అని వత్సరాజు పలికెను. 'రాజునకు సందేహము తీఱుటకై నాచేత అగ్నిప్రవేశము చేయింపవలసినది' అని వాసవదత్త దృఢనిశ్చయముతో చెప్పెను. అంతట కృతార్థులలో అగ్రగణ్యుఁ డయిన మహానుభావుఁడు యౌగంధరాయణుఁడు తూర్పు మొగముగా కూర్చుండి ఆచమనము చేసి శుద్ధుఁడై యీమాట వచించెను: 'నేను రాజునకు హితము చేయుచున యేని, దేవి శుద్ధురాలయేనియు, ఆమాట చెప్పుఁడు, ఓలోకపాలురారా. చెప్పరేని నేను దేహముకు త్యజించెదను' ఇట్లని అతఁడు ఊరమింపఁగానే ఈదివ్యవాక్కు వినఁబడెను 'రాజా, ఏ నీకు ఈ యౌగంధరాయణుఁడు మంత్రియో, పూర్వజన్మమందు దేవతయైన వాసవదత్త భార్యయో, ఆనీ వాక్కుఁడవే ధన్యుఁడవు. ఈమెయందు దోష మేమియు లేదు. తొలకరిమేఘంపు మంద్రగర్జితంపుఁ జెలుపుగలదై దిక్కుంజములందెల్ల మాఱుమ్రోఁగుచున్న యీ వాక్కును విని అందఱును తాపములు తీఱి ఎత్తిన మెడలను వంపకుండ చాలసేపు నెమళ్లవృత్తి ననుకరించియుండిరి. వత్సరాజు గోపాలకునితోఁగూడి యౌగంధరాయణునిచేతలను స్తుతించి ఇఁక భూమండల మెల్ల తనచేతిలోని దని నిశ్చయించుకొని యుండెను. వత్సరాజు అనుదినసహవాససానురాగలయిన యీనాయికల నిరుపరను మూర్తీభవించిన రతినిర్వృ

తులనుంబోలె చెంతఁ బెట్టుకొన్నవాఁడై మితిలేని యానందమును అనుభవించుచుండెను.

---

## 3 - వ తరంగము.

ఆమఱునాఁడు వత్సరాజు వాసవదత్తా పద్మావతులతో కూడ ఏకాంతమందు పానలీల లనుభవించి గోపాలక రుమణ్వ ద్వసంతక సహితునిఁగా యౌగంధరాయణుని రావించి అందఱితోను విస్రంభగోష్ఠియం దుండెను. అందు తనవిరహ ప్రస్తావములో వా రందఱు వినుచుండఁ రాజు ఈకథను వచించెను.

### ఉర్వశీ పురూరవుల కథ.

పురూరవుఁ డని పరమవైష్ణవుఁ డయిన రా జొకఁ డుండెను. అతనిగమనము భూమియందుంబోలె స్వర్గమందుఁ గూడ అప్రతిహతముగా నుండెను. ఒకనాఁడు అతనిని నందనవనములో తిరుగుచుండఁగా మన్మథుని యపరమోహనాస్త్ర మయినయుర్వశి చూచి చూచినమాత్రముననే అతనిసౌందర్యమునకు మూర్ఛితురా లాయెను. ఆమె బ్రతుకునో లేదో అని తత్సఖు లయిన రంభాదుల హృదయము కంపిల్లసాగెను. అతఁడును లావణ్యరసతరంగిణిం బోని యాదేవాంగనం గాంచి తదాలింగనమున కైన దప్పిచేత మూర్ఛితుఁ డాయెను. అంతట పాలసముద్రమునందుము న్నున్నసర్వజ్ఞుఁడు శ్రీహరి తన్ను దర్శింప వచ్చిన నారదమహామునిని ఇట్లాజ్ఞాపించెను:— 'ఓ దేవర్షీ,

నందనోద్యానములో పురూరవుఁడు ఊర్వశిని చూచి మోహితుఁడై యున్నాఁడు; నీవు పోయి ఇంద్రునితో నామాటగా చెప్పి ఊర్వశిని పురూరవుని కిప్పింపుము.' ఈప్రకారము శ్రీహరి యాజ్ఞాపింపఁగా నారదుఁడు వల్లె యని వచ్చి మూర్ఛాక్రాంతుఁ డయిన యాపురూరవుని మేల్కొలిపి 'లేవయ్యా, లే, నీకోసము నన్ను విష్ణుమూర్తి ఇక్కడికి పంపినాఁడు. ఆయన తన వాస్తవభక్తుల యాపదను చూడనేరఁడు గదా.' ఈ ప్రకారము చెప్పి ఓదార్చి అతని వెంటఁగొని నారదముని ఇంద్రుని యొద్దకుఁ బోయి ప్రణతునికి ఇంద్రునికి శ్రీహరియొక్క యాజ్ఞను తెలిపి పురూరవసునికి ఊర్వశిని ఇప్పించెను. ఆయుర్వశీదానము స్వర్గమునకు నిర్జీవకరణమును ఊర్వశికి మృతసంజీవనమును ఆయెను.

అంతట పురూరవుఁడు ఆమెను భూలోకమునకు కొని వచ్చి మర్త్యుల నేత్రములకు దేవాంగనా దర్శ నాశ్చర్యమును కలుగఁజేసెను. అది మొదలు వారిద్దఱును ఒకరిదృష్టి పాశముచేత నొకరు కట్టివైవఁబడినారో యన క్షణ మయినను ఒండొరుల నెడఁబాయ కుండిరి. ఇట్లుండఁగా నొకప్పుడు ఇంద్రుఁడు దానవులతో యుద్ధము సంభవింపఁగా సాహాయ్యమునకై పురూరవుని పిలువనంపెను. పురూరవుఁడు అందుకై స్వర్గమునకు పోయెను. అచ్చట మాయాధరుఁ డనునసురాధిపుఁడు యుద్ధములో తెగటాఱఁగా దేవేంద్రుఁడు మహో

త్సవము జరిపెను. ఆ యుత్సవములో నృత్యము చేయుచు రంభ అక్కడనే ఆచార్యుఁడు తుంబురుఁడు కూడ ఉండఁగా అభినయములో పొరఁబాటు చేసెను. దానిని చూచి పురూరవుఁడు నవ్వెను. అంత రంభ 'ఇది దివ్యనృత్యము, నేను దివ్యను కాఁబట్టి దీని నెఱుఁగుదును; నీవు మనుష్యుఁడవు, ఇది నీ కెట్లు తెలిసినది? ' అని అతనిని అసూయాపూర్వకముగా నడిగెను. 'నీగురువు తుంబురునికి కూడ తెలియని రహస్యములను నేను ఉర్వశితోడి సహవాసముచే తెలిసికొన్నాఁడను ' అని పురూరవుఁడు ఉత్తరము చెప్పెను. ఆ మాటకు కోపగించి తుంబురుఁడు పురూరవుని ' నీకు కృష్ణారాధనపర్యంతమును ఉర్వశితో వియోగము కలుగును గాక ' అని శపించెను. ఆ శాపమును విని పోయి పురూరవుఁడు అకాలాశనిపాతముఁబోని యావృత్తాంతమును ఉర్వశికి తెలిపెను. అంతలో ఎక్కడి నుండియో గంధర్వులు వచ్చి అతనికంటికగపడకయే ఉర్వశిని ఎక్కడికో కొనిపోయిరి. దానిని శాపఫలముగా తలఁచి పురూరవుఁడు బదరికాశ్రమమునకు పోయి శ్రీహరిని పూజింపసాగెను. ఉర్వశియు వియోగార్తయై గంధర్వలోకమందు మృతయుంబోలె సుప్తయుంబోలె లిఖితయుంబోలె విచేతనయై యుండెను. విరహదీర్ఘములయిన రాత్రులయందు చక్రవాకివలె పరితపించుచున్న యా యుర్వశికి శాపావసాన ప్రత్యాశచే ప్రాణములు నిలిచియుండెను.

ఈలోపల పురూరవుఁడు తపస్సుచేత నారాయణుని మెప్పించెను. అంతట గంధర్వులు మరల ఆమెను తెచ్చి అతని కొప్పగించిరి. శాపావసానమందు మరల సంగత యయినయా యూర్వశితో పురూరవుఁడు భూలోకవాసి యయ్యును స్వర్లోక భోగములను అనుభవించుచుండెను.

ఇట్లు చెప్పి వత్సరాజు ఊరకుండఁగా వాసవదత్త ఆ యూర్వశ్యనురాగమును విని తనవియోగసహనమునకు లజ్జపడి యుండెను. రాజుచే ఆప్రకారము యుక్తిగా ఉపాలంభింపఁబడి విలక్షయై యున్న దేవిని చూచి, రాజును సంతోషపెట్టుటకు యౌగంధరాయణుఁ డిట్లు చెప్పసాగెను: ఓరాజా ఈకథను ఇంతవఱకు విని యుండవేని చెప్పెదను వినుము.

### ఆహితసేనునికథ.

సిరి కాటపట్టయినట్టిది తిమిర యని నగరము కలదు. ఆపురమును ఆహితసేనుఁ డని ప్రఖ్యాతుఁడైన రాజు ఏలుచుండెను. ఆయనకు తేజస్వతి యని భూలోకాప్సరస యయిన భార్య యుండెను: సర్వదా తత్కంఠగ్రహైకలోలుభుఁడును తత్స్పర్శైకాగ్రుఁడు నైనయారాజు దేహమునకు అంగరక్ష తొడుగుట మానియే వేసెను. ఒకప్పుడు ఆయనకు జీర్ణజ్వరము కలిగెను. వైద్యులు అతనికి భార్యాసాంగత్యమును అపథ్య మని నివారించిరి. దేవీసంపర్కము లేనందున రాజునకు హృదయములో ఔషధమున కసాధ్య మయిన

బిళ్ల యొకటి కలిగెను. వైద్యులు మంత్రులతో రహస్యముగా ఆబిళ్ల భయముచేతఁ గాని శోకముచేతఁ గాని పగిలిపోవు నని చెప్పినారు. 'మహాసర్పము వీఁపుమీఁద పడినను ఎవఁడు భయపడలేదో, శత్రుసైన్య మంతఃపురము చొచ్చినప్పుడును ఎవఁడు కలఁతపడలేదో అట్టిసత్త్వవంతునికి ఈరాజునకు భయ మెట్లు కలుగును! మాకు ఉపాయము తోఁపలేదు. ఏమి చేయుదుము?' అని మంత్రు లనిరి. ఇట్లాలోచించి మంత్రులు దేవితో మాటలాడి ఆమెను దాఁచి ఆమె మృతిఁబొందిన దని రాజుతో చెప్పిరి. ఆశోకాతిభారముచే తరువఁబడి అతని హృదయంపుబిళ్ల పగిలెను. రోగము తీఱినపిమ్మట మంత్రులు రాజున కపరసుఖసంపదనుంబోలె మహాదేవి నర్పించిరి. ప్రాణ ప్రదాయిని యయినయామెను బుద్ధిమంతుఁ డయిన రాజు మిక్కిలి గౌరవించెను గాని ఆమె దాఁగియున్నందునకు కోపగిం పఁడాయెను. పతికి హితము చేయుటయే దేవీత్వమునకు కారణ ముగాని, ప్రియము చేయు మాత్రమున దేవీశబ్దము రానేరదు. రాజ్యకార్య భారైకచింతనమే మంత్రిత్వముగాని చిత్తానువర్త నము సేవకలక్షణము. కాఁబట్టి నీశత్రు వయిన మగధరాజుతో సంధి యగుటకును సర్వభూమండలవిజయము నీకు లభించు టకును ఈ యుపాయమును మేము కావించినారము. స్వామిఁది భక్తిచే వియోగభారమును సహించిన దేవి నీకు పూర్ణముగా ఉపకారిణియే గాని అపకారిణి ఏమాత్రమును గాదు.—

ముఖ్యమంత్రియొక్క యీవచనమును విని వత్సరాజు తన్నే అపరాధినిగా భావించుకొని వారి విషయమై సంతోషించి యిట్లనియె: 'ఎఱుంగుదును, మీ మాటప్రకారము దేవి మూర్తిమతి యైన నీతియుంబోలె నాకు భూమండలము నంతయు ఇచ్చినది. అయినను అతిస్నేహముచేత ఈ యనుచితములు పల్కితిని. అనురాగాంధులకు విచారసహత్వ మెక్కడిది? ఇత్యాదిసల్లాపములచేత వత్సరాజు ఆదినమును దేవియొక్క లజ్జోపరాగమును రెంటిని ఒకమాటే అపనయించెను. మఱు నాఁడు ఈరహస్య మంతయు ఈలోపల నెఱిఁగిన మగధరాజు నొద్దనుండి దూత వచ్చి వత్సరాజుతో మగధేశుని మాటగా నిట్లు చెప్పెను 'నీమంత్రులు మమ్ము మోసము చేసినారు. ఇఁక నీ వెట్లు ప్రవర్తించిన మాకు జీవలోకము దుఃఖమయము కాకుండునో ఆప్రకారము ప్రవర్తిల్లుదువు గాక.' ఈ మాట విని సమ్మానించి వత్సరాజు ఆదూతను ప్రత్యుత్తరమునిమిత్తమై పద్మావతియొద్దకు పంపెను. ఆమెయు వాసవదత్తకు మిగుల నమ్రురాలై ఆమె సన్నిధియందే అతనికి దర్శన మిచ్చెను. వినయము గదా పతివ్రతయొక్క మొదటివ్రతము. 'అమ్మా, నిన్ను మోసము చేసి కొనిపోయినారు, నీభర్త అన్యాను రక్తుఁడు, ఈ శోకముచే నేను కన్యను గన్న ఫలము ననుభవించి నాఁడను.' అని దూత తండ్రిసందేశమును చెప్పఁగా అతనికి పద్మావతి యి ట్లనియె: — నామాటగా మాయమ్మతోను

నాయనతోను చెప్పుము: ‘ ఏల చింత? భర్త నాయందు అత్యంతము దయ గలిగి యున్నాఁడు. వాసవదత్తా దేవియు నాయందు స్నేహముగలదై అక్కవలె నున్నది. మానాయన గారు తన సత్యమువలెనే నా ప్రాణమును కూడ వదల నొల్లరయేని నాపతివిషయమై విపరీతచింత ఏమియు చేయక యుందురుగాక.’ ఇట్లు యథోచితముగా పద్మావతి ప్రతి సందేశమును పలుకఁగా వాసవదత్త ఆదూతను సత్కరించి పంపెను. దూత మరలి పోఁగానే పద్మావతి పుట్టినింటిని తలఁచుకొని కొంచెము చింతాధీనమానస యై యుండెను. అంతట ఆమెను వినోదపెట్టునది యై వాసవదత్త ఆసమయమందు అక్కడ నున్న వసంతకునిచేత ఈకథను చెప్పించెను.

సోమప్రభాగుహచంద్రులకథ.

భూమికలంకారముగా పాటలిపుత్త్రమనుపట్టణ మొకటి ఒప్పుచున్నది. అందు పూర్వము ధర్మగుప్తుఁ డనుకోమటి యొకఁడు మహాధనికుఁ డుండెను. ఆయనభార్యపేరు చంద్రప్రభ. ఆమె లేక లేక గర్భిణి యై సర్వాంగసుందరి యైనయొక కన్యను కనెను. ఆకన్నియ పుట్టినప్పుడే తనదేహకాంతిచేత మందిరము నంతయు దేదీప్యమానముగా వెలుంగఁజేయుచు లేచి కూర్చుండి స్పష్టముగా మాటలాడసాగినది. అంతట పురుటింటిలోని స్త్రీలు ఆశ్చర్యభయనిమగ్నలై ఆవృత్తాంతమును ధర్మగుప్తునితో పోయి చెప్పఁగా అతఁడును భయపడి

స్వయముగా ఆయింటిలోనికి వచ్చి ఏకాంతములో ఆకన్యను నమస్కరించి 'ఓదేవీ, నీ వెవరవు, నాయింట నవతరించితివి?' అని యడిగెను. 'నాయనా, నీవు న న్నెవరికిని ఈఁగూడదు. నీయింట నే నున్నంతకాలము నీకు శుభము కడమవిషయము లడిగి ప్రయోజన మేమి?' అని యామె యుత్తరము చెప్పెను. ఆమె యిట్లు చెప్పఁగా ధర్మగుప్తుఁడు భయపడినవాఁడై ఆమెను చచ్చిపోయిన దని ప్రఖ్యాపనచేసి రహస్యముగా తనయింటనే కాపాడుచుండెను. ఆకన్య దివ్య మయిన రూపలావణ్యము లతో సోమప్రభ యనుపేర ఎదుగుచుండెను. ఒకనాఁడు ఆమె మేడమీఁదినుండి కుతూహలముచేత వసంతోత్సవమును చూచుచుండఁగా గుహచంద్రుఁ డను వైశ్యపుత్త్రుఁడు చూచి మన్మథునిబల్లెమో యన తన హృదయమునకు తగిలిన యా సోమప్రభచేత మూర్ఛితుఁడై ఎట్టకేలకు తెప్పిఱిల్లి ఇల్లుచేరెను. ఇంట తల్లిదండ్రులు నిర్బంధించి అస్వస్థతాకారణము నడుగఁగా చెలికాండ్రచేత ఆకారణమును చెప్పించెను. అంత నతనితండ్రి గుహసేనుఁడు మంచిమాటగా ఆపిల్లని మ్మని యడుగుటకు ధర్మ గుప్తునియింటికి పోయెను. ధర్మగుప్తుఁడు పిల్ల నడుగ వచ్చిన గుహసేనుని 'ఓయి మూఢుఁడా, నా కెక్కడి దోయి పిల్ల?' అని నిరాకరించెను. పిల్ల నింట నుంచుకొనియే లే దని బొంకి నాఁడని నిశ్చయించుకొని యింటికి పోయి గుహసేనుఁడు స్మరజ్వరాక్రాంతుఁ డయిన పుత్త్రుని చూచి ఇట్లాలోచించెను:

'ఈవిషయములో రాజును ప్రేరేణ చేసెదను. అతనిని నేను పూర్వము సేవించియున్నాను గదా. ఈ ముమూర్షావస్థలో నున్న నాకుమారునికి ఆకన్యను అతఁ డిప్పింపఁగలఁడు.' గుహసేనుఁ డట్లాలోచించుకొని పోయి రాజునకు ఒకయుత్తమరత్నమును నజరు పెట్టి తనయభీష్టమును మనవి చేసికొనెను. రాజు సంతసించి గుహసేనునికి కొత్వాలును సహాయునిఁ జేసెను. అంత కొత్వాలు గుహసేనునినిమిత్తము తనదండుతో ధర్మగుప్తుని యిల్లు ముట్టడించెను. సర్వనాశము సంభవించిన దని భయపడినవాఁడై కంఠగతప్రాణుఁడై యున్న ధర్మగుప్తునితో సోమప్రభ 'నాయనా, నన్ను ఇచ్చివేయుము. నానిమిత్తమై నీ కేల యుపద్రవము? నన్నుమాత్రము భర్త ఎప్పుడును శయ్యకు చేర్పఁ గూడదు. ఈ యొడంబడిక మాత్రము నీవు నీ వియ్యంకునితో చేయుము.' అనెను. ఆప్రకారము ధర్మగుప్తుఁడు గుహసేనునితో కన్యనీ నంగీకారమును ఆనిబంధనను తెలియఁజేసెను. గుహసేనుఁడు ఆయొడంబడికకు లోలోపల నవ్వుకొనుచు పిల్లవానికి పెండ్లి యగును గాక యని అంగీకరించెను. పిమ్మట పెండ్లి కాఁగా గుహచంద్రుఁడు సోమప్రభను తన యింటికి కొనిపోయెను. సాయంకాలమున గుహసేనుఁడు పుత్త్రునితో 'నాయనా, దీనిని శయ్యకు చేర్చుకొమ్ము. నీభార్య గదా. స్వభార్యతో శయనించుటకు ఒకయాక్షేపమా?' అని బోధించెను. ఆమాట విని సోమప్రభ మామను చూచి యమా

జ్ఞనుంబోని తర్జనితో బెదిరించెను. ఆ వేలిని చూడఁగానే అతని ప్రాణములు లేచి పోయినవి. కడమవారికి భయము క్రమ్ము కొనినది. తండ్రి లోకాంతరగతుఁడు కాఁగా గుహచంద్రుఁడు తనయింట భార్యారూపమున మహామారి ప్రవేశించిన దని నిశ్చయించుకొనెను. అది మొదలు ఆమెతో భోగములు సలుపక యే ఆమెను గృహమందే ఉంచుకొని గుహచంద్రుఁడు ఆసిధార వ్రతముగా వర్తించుచుండెను. ఆదుఃఖముచేత దందహ్యమాన మానసుఁడై భోగములయందు విరక్తుఁడై నిత్యము వ్రతములు చేయుచు బ్రాహ్మణులకు భోజనములు పెట్టుచు ఉండెను. దివ్య రూపిణి యయిన యాభార్యయు మౌనవ్రతురాలై ప్రతిదినమును బ్రాహ్మణులకు భోజన మయిన పిమ్మట దక్షిణ యిచ్చుచుండెను.

ఒకనాఁడు ఒకవృద్ధబ్రాహ్మణుఁడు భోజనమునకు వచ్చి జగదాశ్చర్యరూపలావణ్య యయినయాతరుణిం జూచి కుతూహలియై యేకాంతమందు గుహచంద్రుని 'నీకీబాల ఏమి కావలయును?' అని యడిగెను. ఆ బ్రాహ్మణుని నిర్బంధముచేత గుహచంద్రుఁడు ఆమెవృత్తాంత మంతయు ఖిన్నమానసుఁడై చెప్పివేసెను. అంతట నా బ్రాహ్మణుఁడు కనికరించి గుహచంద్రునికి ఈప్సితసిద్ధికొఱకు అగ్న్యారాధనమంత్రము నుపదేశించెను. ఆమంత్రము నేకాంతమందు గుహచంద్రుఁడు జపించుచుండఁగా అగ్నిలోనుండి ఒకదివ్యపురుషుఁడు ఉద్భవించెను. చరణానతుఁ

డైనగుహచంద్రునితో బ్రాహ్మణరూపి యయిన యాయగ్ని దేవుఁడు 'ఈదినము నేను నీయింట భోజనము చేసెదను, రాత్రి యక్కడనే యుండెదను, తత్త్వమును నీకు చూపి నీకోరికను సాధించెదను.' అని పలికి అతనితో అతనియింటికి పోయెను. అచ్చట కడను బ్రాహ్మణులవలెనే భోజనము చేసి రాత్రి గుహ చంద్రునిదగ్గఱ ఒక జామునేపు మాత్రము జాగరూకుఁడైయే శయనించియుండెను. అంతలో అందఱు నిద్రించుచుండఁగా ఇంటినుండి గుహచంద్రునిభార్య సోమప్రభ బయలువెడలెను. ఆసమయములో బ్రాహ్మణుఁడు గుహచంద్రుని నిద్రలేపి 'రావో యి నీభార్యవృత్తాంతమును చూతువుగాని' అని పిలిచి యోగ మాయచే గుహచంద్రుని తుమ్మెదను చేసి తానును అట్లే అయి, వెలువడి, అతనికి ఇల్లు వెడలి వచ్చిన యాభార్యను చూపెను. ఆసుందరి ఊరివెలుపలికి బహుదూరము పోయెను. గుహచం ద్రుఁడును బ్రాహ్మణునితో కూడ ఆమెవెంటనే పోయి పోయి ఒకచోట విస్తారము నీడయు అందమయిన బోదెయుఁ గల యొక గొప్పమఱ్ఱిచెట్టును చూచెను ఆ చెట్టుక్రింద వీణా వేణునాదములతోను మధురగానముతోను కూడుకొన్న దివ్య సంగీతకధ్వని వినఁబడెను. ఆచెట్టుబోదెమీఁద మహాసనమునఁ గూర్చుండియున్న దివ్యకన్య యొకతె తన భార్యవంటి రూపమే కలది గుహచంద్రునికి అగపడెను. అంత గుహచంద్రుఁడు వెన్నె లను గెలిచినకాంతిదాని తెల్లనివింజామరలచే వీవఁబడుచున్న

దాని చంద్రునిలావణ్యసర్వస్వకోశాధిదేవతంబోనిదాని ఆచెట్టు ఎక్కి ఆమెతో నర్ధాసనమందుఁ గూర్చున్నదాని తనభార్యను చూచెను. ఆసమయమందు సమానకాంతి గలిగి ఒకచోటఁ గూడిన యా దివ్యకన్యలను ఇద్దఱను చూడ గుహచంద్రునికి ఆరాత్రి ముగ్గురుచంద్రులు వెలుఁగు చున్నట్లు అగపడెను. అంత నతఁడు క్షణముసేపు ఇట్లు చింతించెను. 'స్వప్నమా యిది? లేక, భ్రాంతియా? లేక, సీ! ఈరెండునా? ఇది సన్మార్గవృక్షంపు మంజరి యయిన విద్వత్సంగతియొక్క పుష్పోద్గతి, నాకు తగిన ఫలమును ఫలించుచున్నది.' ఇట్లతఁడు తనలో తాను చింతించు చుండఁగా ఆదివ్యకన్యకలు తమకు ఉచిత మయినభోజ్యములను భుజించి దివ్యాసవమును పానము చేసిరి. 'అక్కా, ఈదినము మహాతేజుఁడొక బ్రాహ్మణుఁడు మాయింటికి వచ్చినాఁడు. అందు వలన నాకేమో భయముగా నున్నది. నే నింటికి పోయెదను.' అని పలికి రెండవదానియొద్ద సెలవు పుచ్చుకొని గుహచంద్ర భార్య చెట్టునుండి దిగెను. అంతట భృంగరూపు లయిన ద్విజ గుహచంద్రులు ముందుగానే వచ్చి యిల్లుచేరి ఎప్పటివలెనే పరుండిరి. సోమప్రభయు వచ్చి ఎవరికిని తెలియకుండ తన మందిరము ప్రవేశించెను.

అంతట బ్రాహ్మణుఁడు గుహచంద్రునితో నిట్లనియె:—
'చూచితివి గదా; నీభార్య మనుష్యస్త్రీ గాదు, దివ్యాంగన. నేఁడు దీని సహోదరిని కూడ చూచినాఁడవు గదా. దివ్యాంగన

మనుష్యునితో సంగము నెట్లంగీకరించును? కనుక నీకోరిక సిద్ధించునట్లు ద్వారమువిూఁద వ్రాయవలసినమంత్ర మొకటి చెప్పెద, దానికి ఉపబృంహకముగా బాహ్యాయుక్తి గూడ ఉపదేశించెద. అగ్ని స్వయముగానే జ్వలించును; గాలితోడ్పడిన చెప్పవలయునా? అట్లే మంత్రము ఒకటే కార్యసిద్ధిని గలుగఁ జేయఁగలదు, యుక్తితోఁ గూడిన చెప్పవలయునా?' ఇట్లు గుహచంద్రునికి చెప్పి ఆబ్రాహ్మణోత్తముఁడు తెల్లవాఱఁగానే మంత్రమును భార్యయొక్క గృహద్వారమువిూఁద వ్రాసి సాయంకాలమందు ప్రరోచనార్థము ఈయుక్తిని ప్రయోగించెను. ఉత్తమాలంకారములు ధరించినవాఁడై గుహచంద్రుఁడు సోమప్రభ కగపడునట్లు ఒకవేశ్యతో సరససల్లాపము లారంభించెను. దాని చూచి ఈర్ష్యఁబూని సోమప్రభ మంత్రమహిమచే మానము మాని 'ఎవతె యది?' అని యడిగెను. 'ఇది వేశ్య, నాయందు బద్ధానురాగ. నేను ఇప్పుడు దీనియింటికి పోయెదను.' అని యతఁడామెతో నబద్ధము చెప్పెను. అంత సోమప్రభ అతని వైపు ఓరచూపులు చూచుచు బొమలు ముడివడ ఎడమచేత ఆతనిని నివారించి యిట్లు పలికెను.—'సరి సరి తెలిసినది. నీవేషము ఇందుసకు. అక్కడికి పోవలదు. దానితో నీకేమి పని? నేను గదా నీభార్యను. నాయొద్దకు రమ్ము.' ఇట్లు మంత్రమహిమ చేత ఆవేశింపఁబడినదియుంబోలె రోమాంచోత్కంపసంక్షోభాకులయై సోమప్రభ పలుకఁగా గుహచంద్రుఁడు ఆమెగదిలో ప్రవే

శించి అందరానిపండ్లగు దివ్యసంభోగములను ఆమెతో తాను మనుష్యమాత్రుఁడైనను అనుభవించెను. ఇట్లు ఆమె మంత్ర ప్రభావమునకు కట్టుపడి తనదివ్యస్థితిని వదలుకొని అతనికి వశ్యురాలై యుండఁగా గుహచంద్రుండు యథాసుఖముగా కాలము గడపుచుండెను. ఈప్రకారము యాగములు దానములు మొదలయిన సత్కర్మలు చేయువారియింట శాపచ్యుతలయిన దివ్యాంగనలు ఇల్లాండ్రయి యుందురు. సజ్జనులు దేవద్విజపూజయే కామధేనువని చెప్పుదురు. దానివలన ఏఫల మొదఁగూడదు! దానిముందట సామాన్యోపాయము లేల? అట్లే దుష్కృతము దివ్యపదవిలో నుండువారిని కూడ ప్రవాతము పుష్పములనుంబోలె అధోగతిపాలు చేయును.

## అహల్యా వృత్తాంతము.

పద్మావతికి వసంతకుండు వెండియుం జెప్పుచున్నాఁడు: ఇందునకు నిదర్శనముగా అహల్యావృత్తాంతమును చెప్పెదను వినుము.—పూర్వము గౌతముఁడని త్రికాలజ్ఞుఁడయిన ముని యొకఁడుండెను. ఆయనకు రూపముచే అప్సరసలను గెలిచినది అహల్య యని భార్య యుండెను. ఒకనాఁడు ఆమెయొక్క రూపముచేత మోహితుఁడై యింద్రుఁడు ఆమెను ఏకాంతమందు తనమనోరథము సఫలము చేయుమని ప్రార్థించెను. ప్రభువులచిత్తము ఐశ్వర్యమదముచేత అవిషయమందు ప్రవర్తించును గదా. ఆమూఢురాలును కాముకియై అతనికోర్కె

కంగీకరించెను. ఆరహస్యమును తపఃప్రభావముచేత నెఱింగి గౌతమమహర్షి అక్కడికి వచ్చెను. ఇంద్రుఁడు భయముచేత తత్క్షణమే పిల్లిరూపము దాల్చెను. అంతట గౌతముఁడు, ఇప్పు డిక్కడ నుండినవాఁ డెవఁడు, అని అహల్య నడిగెను అహల్య 'ఏసో ఖు మజ్జారో' అని అపభ్రష్టభాషితములు పలికెను. ఆమాట రెండువిధములను సత్యముగానే యుండెను. వాస్తవముగా నీజారుఁడే' అని ఋషి నవ్వి ఆమెను దోషముకై శపించి సత్యముకై శాపావసానము ననుగ్రహించెను.—'ఓపాపాత్మురాలా, వనాంతసంచారి యైనరాముని దర్శనము కలుగువఱకు చిరకాలము శిలవై యుందువు.' అని పలికెను ఇంద్రుని 'నీవు వరాంగలుబ్ధుఁడవు గనుక నీకు వేయివరాంగములు కలుగును. విశ్వకర్మ నిర్మించెడు దివ్యస్త్రీని తిలోత్తమను చూడఁగానే ఆవేయి వరాంగములును వేయి కన్నులగును' అని గౌతములవారు శపించిరి ఇట్లు శపించి ఆముని తనయిష్టము వచ్చినట్లు తపస్సునకు పోయెను. అహల్యయు దారుణమగు శిలాభావమును పొందెను ఇంద్రుఁడు వరాంగావృతసర్వాంగుఁ డాయెను. దుశ్శీలము చేత ఎవనికి ఖలీకారము సంభవింపదు. దుష్కృతము ఎల్ల వారికిని తప్పకుండ ఫలించును. ఎవఁడు ఏగింజ నాటునో వాఁడు ఆఫలమును పొందును. కావున మహానుభావులు పరవిరుద్ధములయందు ఉత్సాహము వహింపరు. ఇదియే ఉత్తమసత్త్వులకు విధిసిద్ధమగు నసద్వ్రతము. మీ రిద్దఱును పూర్వ

జన్మమందు అక్కచెల్లెండ్రము. శాపముచేత ఇట్లు జన్మించినారు. కనుకనే మీహృదయములు ఒకరొకరియందు బద్ధస్నేహము లై అఱమఱలు లేక కూడియున్నవి.

వసంతకునివలన ఇట్లు విని వాసవదత్తయు పద్మావతియు పరస్పరము లేశ మయిన ఈర్ష్య లేక యుండిరి. వాసవదత్తా దేవి భర్తను తమ కిద్దఱకును సాధారణునిఁగాఁ జేసి పద్మా వతివిషయమై ఆత్మనిర్విశేషముగా హితము సలుపుచుండెను. పద్మావతి పంపిన దూతలవలన వాసవదత్తయొక్క మహాను భావత్వమును ఎఱింగి మగధరాజు మిక్కిలి సంతోషించెను.

## దిగ్విజయాలోచన.

మఱునాఁడు మంత్రి యౌగంధరాయణుండు వత్సరాజు నొద్దకు వచ్చి దేవియు ఇంక నితరులును సన్నిధియం దుండఁగా నిట్లనియె. 'దేవా' ఇప్పుడు ఇఁక జైత్రయాత్రోద్యోగార్థము కౌశాంబికి ఏల బయలుదేఱుప్రే; మనచేత మోసపోయిన వాఁడైనను ఇఁకను మగధరాజు మనజోలికి రాఁడు. కన్యా సంబంధ మనెడు త్రాటితో అతఁడు చక్కఁగా కట్టి వేయఁ బడియున్నాఁడు. పోరాడి ప్రాణాధిక యయిన కొమారితను అతఁడు వదలునా? అతఁడు తనసత్యమును కాపాడుకోవలసిన వాఁడు. అతనిని నీవు మోసము చేయ లేదు. ఇది సర్వము నేను స్వయముగా చేసినది. ఇందువలన అతనికి చెఱు పేమియు లేదు. చారులవలన అతఁడు మనమీఁద అలుగఁడని తెలిసికొని

యున్నాను. అందునిమిత్తమే ఇన్నిదినములు ఇక్కడ నుంటిమి.' సంకల్పమును నెఱవేర్చుకొన్న యౌగంధరాయణుఁ డిట్లు చెప్పుచుండఁగా మగధరాజునొద్దనుండి దూత వచ్చి ప్రతీహారిచే రాజానుజ్ఞచే రాజసన్నిధికి తేఁబడి ప్రణతుఁడై కూర్చుండి రాజుతో నిట్లని విన్నవించెను.— "దేవా, పద్మావతీదేవియొక్క సందేశములచేత సంతోషించి మగధేశ్వరుఁడు నీకు నిట్లు తెలుపుచున్నాఁడు. 'పెక్కుమాటలేల? సర్వమును తెలిసినది. నీ విషయమయి ప్రీతుఁడ నైతిని. ఈ యుద్యోగ మెందునిమిత్తము చేయఁబడినదో ఆప్రయోజనముకొఱకే ప్రయత్న మారంభింపుము. మేము వశ్యులమై యున్నాము.'" దూతయొక్క యీ మంచిమాటను వత్సరాజు యౌగంధరాయణుని నీతివృక్షముయొక్క పుష్పముగా అభినందించెను. అంతట వాసవదత్తచేత పద్మావతిని రావించి ఆమెయు తానును ఆదూతను బహుమతులిచ్చి సత్కరించి పంపించెను. పిమ్మట చండమహాసేనుని దూత కూడ వచ్చి యథాక్రమముగ ప్రవేశించి రాజునకు ప్రణమిల్లి యిట్లనియె.— "దేవా, కార్యతత్త్వ మెఱిఁగిన చండమహాసేన మహారాజు నీవృత్తాంత మెఱింగి హర్షించి యీసందేశమును పంపినాఁడు.—'పెక్కుమాటలేల?నీమంత్రి యౌగంధరాయణుఁడు అనుటయే నీప్రాశస్త్యసన్నసము. నీయందలి భక్తిచేత వాసవదత్త ధన్యురాలు. ఆమె చేసిన కార్యముచేత మాకు చిరకాలము సజ్జనులమధ్య తల యెత్తుకొని యుండ యోగ్యత గలిగినది.

పద్మావతి నాకు వాసవదత్తకంటె వేఱు గాదు. ఆ యిద్దఱి హృదయములును ఒకటే గదా. కాఁబట్టి శీఘ్రముగా విజయోద్యమము నారంభింపుము.’” మామగారి యీసందేశమును వినఁగా వత్సరాజుహృదయమందు తత్క్షణమే విశేష మయిన సంతోషమును వాసదత్తమీఁద ప్రణయాతిశయమును మంత్రి పుంగవునిపై అనురాగోత్కర్షమును ఎంతయు వర్ధిల్లెను. అంత వత్సరాజు దేవేరు లిద్దఱిచేతను సముచితసత్కారపూర్వకముగా కృతాతిథ్యుఁడైనయాదూతను బహుమానించి పంపి దిగ్విజయోద్యోగము చేయువాఁడై మంత్రుల యాలోచన ప్రకారము కౌశాంబికి తరలిపోయెను.

---

## ౪-వ తరంగము.

### ఉదయనుఁడు కౌశాంబిం బ్రవేశించుట.

మఱునాఁడు వత్సరాజు లావాణకమునుండి మంత్రులతోను భార్యలతోను కౌశాంబికి తరలి, అకాలమందు పొంగిన సముద్రములా యన మహాఘోషతో భూమి నెల్ల నాక్రమించుచున్న సైన్యములు వెంట వచ్చుచుండ,ఏనుఁగు నెక్కి పయనము నడచుచుండెను. సూర్యుఁడు పొడుపు గుబ్బలి కొమ్మున నెలకొని దానితో కూడనే ఆకాశములో సంచరించుచునేని ఆస్థితిలోని వత్సరాజునకు ఉపమ యగును. అప్పుడు వత్సరాజునకు పట్టఁబడిన

శ్వేతచ్ఛత్త్రము అతఁడు తేజస్సుచేత సూర్యుని గెలిచె నన్న ప్రీతిచేత వచ్చి ఆతని సేవించుచున్న చంద్రుఁడో యన రాజిల్లుచుండెను. అందఱకును పైవాఁడై తేజస్వి యైన యాప్రభుని చుట్టును సామంతులు తమతమ కక్షులలో ధ్రువుని గ్రహగణములుంబోలె పరివేష్టించి సాగుచుండిరి. ఆయన వెనుక పిడియేనుఁగుపై వచ్చుచున్న దేవేరు లిద్దఱును అతనిమీఁద నను రాగముచేత రూపము దాల్చి వెంటవచ్చుచున్న శ్రీభూదేవులో యన వెలుంగుచుండిరి. అతనిగుఱ్ఱపుఁబటాలముల గోరిజకొనల గుర్తు లనెడి నఖక్షతములు గలదై భూదేవి అతనిచే నుపభుక్తగా నగపడెను. వత్సేశ్వరుఁడు వందులు పొగడుచుండ ఇట్లు పయనము నడచుచు కొలఁదిదినములలో మహోత్సవమండిత యైన కౌశాంబికి చేరెను. ఎఱ్ఱజెండాల కుసుంబాచీర గట్టి కిటికీకన్నులు సంపూర్ణముగా వికసిల్ల ద్వారదన్నితోత్తుంగపూర్ణకుంభకుచద్వయయై జనకోలాహలమిషచే సల్లాపించుచు సౌధవ్యాజమున నవ్వుచు ఆపురలక్ష్మి ప్రవాసమునుండి పతి రాఁగా మిక్కిలి ప్రకాశించుచుండెను. ఇద్దఱు దేవేరులతోను ఆరాజు పురమును ప్రవేశించుచుండఁగా వారిదర్శనముచే పౌరాంగనా నేత్రములకు అనిర్వచనీయ మయిన మహోత్సవ మాయెను.

ఆసమయమందు ఆకాశ మంతట మనోహరసౌధ విరాజమాన సుందరీముఖశతములు దేవీముఖసేవార్థము తజ్జతుఁడైన చంద్రునిసైన్యములు వచ్చినవో యన వెలుంగుచుండెను.

కొందఱు చంద్రాననలు మేడలయందు కిటికీలలో నిలిచి ప్రభు వును దేవేరులను తెప్ప వాల్పక చూచుచు చూపరకు కుతూ హలముచే విమానస్థ లయి చూడ వచ్చిన యచ్చరలో యనుభ్ర మను కలుగఁజేసిరి. కొందఱు లతాతన్వులు గవాక్షజాలాగ్ర లగ్నపక్ష్మలనేత్రలై మదనునికి బాణపంజరములను సృజియించి యిచ్చినవారుంబోలె విరాజిల్లిరి. ఒకానొక బింబాధరయొక్క నేత్రోత్పలము రాజదర్శనముచేత వికసిల్లినవై కానరానిదైన చెలికి ఆవిభవమును చెప్పుటకుంబోలె దానికడకు వ్యాపించెను. వడివడి నేతెంచిన యొకయువతియొక్క స్తనములు మాటిమాటి కుప్పొంగుచున్నట్టివి రాజదర్శనేచ్ఛచేత అవికను పిగిలించుకొని వెలువడ నుద్యమించుచున్నవియుం బోలె నొప్పుచుండెను. మఱియొకతన్వియొక్క హారంపుముక్తాఫలములు త్రొక్కుపాటు చేత పెఱిఁగి రాలుచున్నట్టివి హృదయము విడుచుచున్న యానందబాష్పబిందువులో యన నెసఁగుచుండెను. 'అగ్నిదే వుఁడు లావాణకములో ఈమెవిషయమై కోపము చేసియే యున్న యెడల అతఁడు వెలుఁగిచ్చువాఁడయినను ఈలోకమునకు కటికిచీఁకటిని కల్పించినవాఁడగును.' అని వాసవదత్తను కనియు దాహప్రవాదమును స్మరించియు కొందఱు చెలువలు తహ తహతో కలయఁబలికికొనిరి. ఒకచెలువ చెలితో 'బళిబళి! వాసవదత్తాదేవికి సపత్నీతుల్యగానే దొరకుటంబట్టి లజ్జకు అవకాశ మేమియు లేక పోయినది.' అని పలికెను. 'వాస్తవ

ముగా ఈయిద్దఱి సౌందర్యమును శివకేశవులు చూచినవారు కారు, కాదేని గౌరవముతో నేల గౌరీలక్ష్ములను చేపట్టి యుందురు?' అని పలుకుచు కొందఱిందువదనలు ఆదేవేరులపై ఆనందోత్ఫుల్ల నేత్రోత్పలమాలికలను వైచుచుండిరి.

ఈప్రకారము వత్సరాజు లోకులకు కన్నుల పండువు సేయుచు దేవీసమేతుఁడై కృతమంగళుఁడై తననగరు ప్రవేశించెను. ప్రభాతమందు కమలాకరమునకు నేశోభ గల్గునో అట్టి యనిర్వచనీయ శోభ రాజమందిరమునకు ఆసమయమందు ఆవటిల్లెను. క్షణకాలములో ఇంకఁ గలుగ నున్న సకల భూపాలోపాయనాగమమును సూచించుచున్న వైన సామంతుల మంగళోపహారములచేత రాజసదన మెల్ల నిండిన దాయెను. రాజబృందమును సమ్మానించి ఉత్సవముచేసి వత్సరాజు సర్వజన చిత్తముం బోలె అంతఃపురము ప్రవేశించెను. అచ్చట దేవేరులకు మధ్యగతుఁడై రతిప్రీతులకు మధ్యగతుఁడైన కాముండునుం బోలె రాజు దినశేషమును పానాదిలీలలయందు గడపెను.

నిధిలాభము.

మఱునాఁడు వత్సరాజు మంత్రులతోఁ గూడి ఆస్థానమందుండఁగా బ్రాహ్మణుఁ డొకఁడు ద్వారభూమినుండి 'కావుము, ప్రభూ, కావుము. అడవిలో పాపాత్ములు గోపాలకులు నిష్కారణముగా నా కుమారునిపాదమును నఱికి వేసినారు.' అని మొఱవెట్టెను. వెంటనే రాజు ఇద్దఱు ముగ్గురు గోపాలకులను

పట్టించి తెప్పించి వృత్తాంత మడిగెను. వా రిట్లు విన్నవించిరి. "దేవా! మేము పసులం గాచుచు విజనమందు క్రీడించుచుందుము. మాలో దేవసేనుఁ డని గొల్ల ఒకఁ డున్నాఁడు. అతఁడు ఒక చోట రాతిమీఁద కూర్చుండి మాకు తాను రా జని చెప్పి మమ్ము నేలుచుండును. ఎవఁడును అతనియాజ్ఞను మీఱఁడు. ఈ ప్రకారము ఆగోపాలకుఁడు అరణ్యములో రాజ్యము చేయుచున్నాఁడు. ఈదినము ఈవిప్రుని కుమారుఁడు ఆదారిని పోవుచు, ఆగొల్లదొరకు ప్రణమిల్లలేదు. 'దొరకు ప్రణామము చేయక పోకోయి' అని మేము రాజాజ్ఞచేత ఎంత చెప్పినను ఆచిన్నవాఁడు నమస్కరింపక నవ్వుచు వెడలిపోయెను. అంత గోపాలరాజు ఆవటువునకు పాదచ్ఛేదదండన చేయవలసిన దని మమ్మాజ్ఞాపించినాఁడు. మేము, ఓ మహాప్రభూ, పరుగెత్తి అతనిపాదమును ఛేదించినారము. మాబోఁటివాఁడు రాజాజ్ఞను ఎవఁడు మీఱఁగలఁడు?" గోపాలు రిట్లు పలుకఁగా ధీమంతుఁడు యౌగంధరాయణుఁడు ఆవిషయమును చక్కఁగా ఆలోచించుకొని ఏకాంతమందు ప్రభువుతో 'నిశ్చయము, ఆచోట నిధానాదికమున్నది. దానిప్రభావముచేతనే గోపాలునికి ఇంత ప్రభుత్వము కలిగినది. అక్కడికి పోవలయును.' అని చెప్పెను. మంత్రి యిట్లు చెప్పఁగా రాజు ఆగోపాలురనే దారి నడుప నియమించి సైన్యపరిచ్ఛద సమేతుఁడై యాయటవీస్థానమునకుఁ బోయెను ఆభూమి నంతయు పరీక్షించి పనివాండ్రు త్రవ్వసాగిరి. అంతట క్రిందనుండి

శైలమయాకారుఁడు యక్షుఁ డొకఁడు బయలువెడలి 'రాజా, ఈనిధానము నీతాత పాఁతిపెట్టినది, దీనికి నేను చిరకాలము కాపుంటిని. దీనిని నీవు పుచ్చుకొమ్ము.' అని వత్సరాజుతో చెప్పి అతనిచేత సత్కృతుఁడై అదృశ్యుఁ డాయెను. అంతట ఆగోతిలో నుండి గొప్పనిధి ఆవిర్భవించెను. అందు మహార్హ మయిన రత్నసింహాసనము దొరకెను. అభ్యుదయకాలములో కల్యాణ పరంపర కలుగును గదా. అంతట వత్సరాజు ఉత్సవము చేసి ఆనిధాన మంతయు కైకొని ఆగోపాలకులను అభినందించి తన నగరమునకు పోయెను.

అచ్చట అరుణమణి కిరణ ప్రసారములచేత ఇట్లు వత్స రాజు ప్రతాపము దెసల నాక్రమించెడి నని సూచించునదియుం బోలెను, వెండితీఁగలకు గ్రువ్వఁబడియున్న ముక్తాఫల సమూహముచేత అతనిమంత్రులబుద్ధి ప్రభావమున కాశ్చర్యపడి నవ్వుచున్నదియుంబోలెను, దీపించుచున్న యాబంగారపు సింహాసనమును ఆనందదుందుభులు మ్రోఁగుచుండ రాజు తేఁగా పౌరులు హర్షించిరి. మంత్రులును రాజునకు జయము నిశ్చయ మని యూహించి యుత్సవము చేసిరి. ఆరంభమునుండి కలుగు కల్యాణము కార్యసిద్ధిని సూచించును గదా. అంతట నాకాశ మెల్ల జెండాలమెఱుములు మెఱయుచుండ రాజమేఘుఁడు అను జీవులపై సువర్ణవర్షము గురిసెను.

ఆదినము ఉత్సవములో జరుగఁగా మఱునాఁడు యా

గంధరాయణుఁడు వత్సరాజుతో అతని అభిప్రాయము నెఱుఁగు వాఁడై 'దేవా, నీకులక్రమాగత మయిన యీ మహాసింహాస నము నీకు దొరకినది గదా. దీని నెక్కి యలంకరింపుము.' అనెను. 'నాముత్తాతలు లోకము నంతయు జయించి దీనిని ఎక్కినారు. నేనుమాత్రము జయింపక ఎక్కిన నాకు ఏమి కీర్తి? పృథు చక్రవర్తియే యలంకారముగాఁ గలిగిన దైన యీసాగరాంత భూమండలమును జయించి నాపెద్దల దైన యీ రత్నసింహాస నమును ఎక్కెదను.' అని యుత్తరము చెప్పి రాజు దాని నప్పుడు ఎక్కఁడాయెను. గొప్పవారికి అభిమానము వాస్తవము గదా. అందునకు సంతోషించి యౌగంధరాయణుఁడు రాజుతో 'మంచిది, రాజా, మొదట తూర్పుపై జయోద్యోగ మారంభిం పుము.' అనెను. ఆమాట విని రాజు ప్రస్తావవశముగా మంత్రిని ఉత్తరము మొదలయిన దిక్కు లుండఁగా రాజులు మొదట తూర్పుపై దాడి వెడలుదు రేల?' అని యడిగెను. అందునకు యౌగంధరాయణుఁ డిట్లు చెప్పసాగెను.—'రాజా, కుబేరుని దిక్కు గొప్పదే అయినను మ్లేచ్ఛసంసర్గముచే దూషిత మయి యున్నది. సూర్యాద్యస్తమయ హేతు వగుటచేత పడ మర కూడ ప్రశస్తము కాదు. రాక్షసాక్రాంతము యమనివాస మ్మును అగుటచేత దక్షిణము కూడ యోగ్యము కాదు. తూర్పున సూర్యుఁడు ఉదయించును, తూర్పును దేవేంద్రుఁడు ఏలు చున్నాఁడు, గంగయు తూర్పునకే పాఱుచున్నది. ఇందుచేత

తూర్పు శ్రేష్ఠ మైనది. హిమవద్వింధ్య మధ్యదేశములలో కూడ వేనిలో గంగ ప్రవహించుచున్నదో అవి శ్రేష్ఠములు. కాఁబట్టి కల్యాణ కాంక్షులై రాజులు మొదట తూర్పునకే పోవుదురు, దేవనది పాఱునట్టి భూములయందే నివాసము గ్రహింపుదురు. నీపెద్దలు కూడ తూర్పు మొదలుగానే దిక్కులను జయించిరి. గంగాసమీపమందు హస్తినాపురములో వసించిరి. శతానీకుఁడు కౌశాంబి రమ్యమనియు సామ్రాజ్యము పౌరుషాధీనము గాని దేశాధీనము గా దనియు ఇచ్చట నివసించినాఁడు' ఇట్లు పలికి యతఁడు విరమింపఁగానే రాజు పురుషకారమందలి గౌరవాతిశయముచేత నిట్లనియె:—'సత్యము! సామ్రాజ్యమునకు దేశము కారణము గాదు, సత్త్వవంతులకు స్వపౌరుషమే సంపత్కారణము. సత్త్వవంతుఁడు ఒంటిగాఁ డయినను ఆశ్రయహీనుఁ డయినను సిరిని పొందును. మీ రేమి విన లేదా సత్త్వవంతుని కథను?' అంత నాకథను చెప్పు మని మంత్రులు వేఁడఁగా వత్సరాజు దేవేరులసన్నిధిలో ఈసత్కథను వాక్రుచ్చెను:—

విదూషకుని కథ

భూలోకప్రసిద్ధము ఉజ్జయినీనగరము కలదుగదా. అందు పూర్వము ఆదిత్యసేనుఁ డని రాజుండెను. ప్రతాపనిలయుఁడును ఏకచక్రవర్తియు నైన యారాజుయొక్క రథము ఆదిత్య రథమువలె ఎప్పుడును అస్ఖలితముగా నుండెను. మంచుకాంతి గలదైన యతని యున్నతచ్ఛత్త్రము గగనతలము నెల్ల వెలిఁగిం

చుచుండఁగా అపగతోష్ఠు లయిన రాజుల ఛత్త్రములు మునిఁగి పోయిన వాయెను. ఆరాజు జలములకు సముద్రమువోలె సకలభూమండల రత్నములకును భాజనమై యుండెను. ఆయన ఒకనాఁడు ఎంకులకో యాత్రావశమున సేనలతోకూడ గంగ యొడ్డున విడిసియుండఁగా నతనిని గుణవర్మ యను నచ్చటి వైశ్య శిఖామణి యొకఁడు తన కన్యారత్నమును కానుక తెచ్చి సం దర్శింప వచ్చి ప్రతీహారముఖమున 'నాయింట త్రిభువనరత్న మీకన్య పుట్టినది. ఇది మఱియొకనికి ఈఁదగినది గాదు. ఇట్టి దానికి ఏలినవారు ప్రభువులరు.' అని తెలియఁబఱిచి దర్శనము చేసికొని కన్యారత్నమును చూపించెను. మన్మథుని మంగళ గృహంపు రత్నదీపశిఖయో యన స్వదీప్తిచేత దిఙ్ముఖంబుల వెలింగించుచున్న యాకన్నెను తేజస్వతి యనుదానిని చూచు చునే అనురాగమయుఁడై యారాజు ఆలావణ్యముయొక్క తేజస్సుచేత పొదువఁబడినవాఁడై కామాగ్నిచేత సంతప్తుఁడై చెమర్చి కరఁగి పోయెనుగదా. ఆమెను రాజు పరిగ్రహించి పట్టపుదేవిని చేసి గుణవర్మను తనతో సమైశ్వర్యునిఁగాఁ జేసెను. ఆమెను వివాహమై ధన్యుఁడ నైతి నని తలంచుకొని ఆమెతో ఉజ్జయినికి పోయెను. అచ్చట సర్వదా ఆమెముఖమందే దృష్టిని నిలిపినవాఁడై ఎంత గొప్ప రాచకార్యముల నైనను విచారింపక యుండెను. తేజస్వతియొక్క మధురాలాపములచేత మేకు గొట్టఁబడినదానింబోలె అతని చెవిని కృశించుచున్న ప్రజల యా

క్రందము ఆకర్షింపఁజాల దాయెను. అంతఃపురము సొచ్చిన యారాజు చిరకాలము వెలునడ కుండెను, శత్రువర్గంపు హృదయమునుండి భయజ్వరము వెడలిపోయెను. ఇట్లుండ అతనికి తేజస్వతీదేవియందు ఎల్లవారికిని అల్లారుముద్దగు కన్య పుట్టెను, బుద్ధియందు జిగీషుతయు జనించెను. పరమాద్భుత రూప యాకన్య జగత్త్రియమును తృణీకరించి అతనికి హర్షము కలుగఁజేసెను, జిగీషుతయు ప్రతాపమును కలిగించెను.

ఒకప్పుఁడు రాజు తిరుగుఁబాటు చేసిన యొక సామంతునిపై ఉజ్జయినినుండి దండెత్తి పోవుచు తేజస్వతీదేవిని పిడియేనుఁగుమీఁద ఆరోహింపఁజేసి తనసైన్యముల వెనుక తదధిదేవతనుంబోలె గొనిపోయెను. తాను శ్రీవృక్షమేఖలావంతమును గర్వముచేతఁ గలిగిన చెమట సెలయేళ్లు పాఱుచున్నదియు నున్నతమును ఐన వరాశ్వమును నడగొండం బోనిదానిని సెలవులవటకును లేచిన ముంగాళ్లచేత వేగసహాధ్యాయి యైన గరుడుని యాకాశగమనమును అభ్యసించుచున్నదో యన భాసిల్లుచున్న దానిని నా వేగమునకు దీనివిరివి చాలునా యని భూమిని మెడ యెత్తి ధీరదృష్టితో పరికించుచున్న దానిని ఎక్కి, కొంత దూరము పోయి సమభూమియందు తేజస్వతికి చూపుచు గుఱ్ఱమును హెచ్చరిక చేసెను. గుఱ్ఱము అతని మడమలతాఁకుచేత వింటినుండి యేసినయాపకోలవోలె లోకలోచనముల కగపడక మహావేగముతో ఎక్కడికో ఎగవేసికొని పోయెను. అంతట

సైన్యము తెల్లడిల్లపడఁగా గుఱ్ఱపురౌతులు వేయిమార్గములు
అతనిని కనిపట్ట దవ్వుడు తీసిరిగాని ఒకఁడయినను అతనిని
కలసికొనలేకపోయెను. అంతట మంత్రులు అనిష్టభయముచే
దేవిని తీసికొని మరలి ఉజ్జయినిచేరి ఊరికోటద్వారము మూసి
వేసి ప్రాకారరక్షణ చేసి రాజువృత్తాంతమును వెదకించుచు
ప్రజలను ఓదార్చుచు ఉండిరి. ఈలోపున క్షణములో గుఱ్ఱము
రాజును సరోద్రసింహసంచారయు దుర్గయు నగు వింధ్యా
టవికి కొనిపోయి దైవవశమున నక్కడ నిలిచెను. అంతట
రాజు మహారణ్యమధ్యమందు దిక్కు తెలియక బెగ్గడిల్లి వేఱు
గతి గానక దిగి గుఱ్ఱమునకు ప్రణమిల్లి అశ్వజాతుల నెఱిఁగిన
వాఁడు గావున ఆయుత్తమాశ్వమును ఇట్లు వేఁడుకొనెను.—
'నీవు దేవుఁడవు, నీవంటివాఁడు ప్రభుద్రోహము చేయఁడు.
నాకు ఇప్పుడు నీవే శరణము. నన్ను మంచిదారిలో కొని
పొమ్ము.' ఆమాటకు పూర్వజన్మజ్ఞానము గలదైన యాగుఱ్ఱము
పశ్చాత్తాపపడి సరియే యని తనమనస్సులో అంగీకరించెను.
అశ్వోత్తమము దైవతము గదా. అంత రాజు మరల ఎక్కఁ
గానే గుఱ్ఱము నడవఁ దొడఁగి చల్లని నిర్మలజలముల తటాక
ములు గలదియు శ్రమహరము నైన మంచిమార్గమున సాయం
కాలమునకు నూఱామడలదూరము ఉజ్జయిని చెంగటికి కొని
పోయెను. దానివేగమునకు ఓడిన తన యేడు గుఱ్ఱములను
చూచి లజ్జితుఁడాయెనో యన సూర్యుఁడు అస్తాద్రిగుహలో

దాఁగెను. చీఁకటి యంతటను క్రమ్మఁగా ఉజ్జయినియొక్క ద్వారములు మూయఁబడి యుండుటను చూచి బుద్ధిమంత మయిన హయనతంసము రాజును ఊరివెలుపల తత్కాల భయంకర మయిన శ్మశానమునకు కొనిపోయి అచ్చట వెలు పల ఒక మూలమూల గుప్తముగా నున్న యొక బ్రాహ్మణ మఠమునొద్దకు చేర్చెను.

అలసియున్న గుఱ్ఱమును దిగి ఆదిత్యసేనుఁడు రాత్రి గడ పుటకు యోగ్యమయిన యామఠములో ప్రవేశింపఁ బోయెను. అతఁడు శ్మశానపాలుఁడో దొంగయో యనుచు అక్కడి బ్రాహ్మణులు అతనిని లోపలికి రానీక పరుసములు పలుకుచు జగడ మాడుచు బయటికి వచ్చిరి. ఛాందసబ్రాహ్మణులు భయపారుష్యకోపములకు పుట్టిన యిండ్లుగదా. వా రట్లులుచు చుండఁగా విదూషకుఁ డనునొక బ్రాహ్మణుఁడు సత్త్వవంతు లలో ధురంధరుఁడు మఠమునుండి వెలుపలికి వచ్చెను. అతఁడు వయసువాఁడు, బాహుశాలి, తపస్సుచేత అగ్ని నారాధించి ఆ దేవునివలన తలఁచుకొన్నమాత్రాన వచ్చి చేత నుండునట్టి యొక ఖడ్గమును పొందినవాఁడు. ఆధీరుఁడు అట్టిరాత్రివేళ వచ్చిన యాభవ్యాకారుని మహారాజును చూచి కడమవిప్రులను అద లించి వినయముతో మఠములోనికి కొనిపోయి విశ్రమింపఁజేసి యతని మార్గభూళిని దాసీజనముచేత తుడిపించి ఆయనకు క్షణ ములో రాజోచిత మయిన యాహారమును సిద్ధము చేయించి

పెట్టించెను. గుఱ్ఱమునకు జీను తీసి వేయించుట గడ్డి వేయుట మొదలయిన యుపచారములచేత అలవు తీర్చెను. 'నీకు నేను కా వుండెదను. ప్రభూ, సుఖముగా నిద్రింపుము.' అని శ్రాంతుఁడయిన రాజునకు శయనము పఱచి, అతఁడును నిద్రింపఁగానే ఆయాగ్నేయఖడ్గమును తలఁచుకొని చేతఁ బూని రాత్రి యెల్ల గడపదగ్గఱ పహారా యిచ్చుచుండెను. తెల్లవాఱఁగానే విదూషకుఁడు రాజు చెప్పకయే గుఱ్ఱమును జీను వేయించి సిద్ధపఱిపించెను. రాజు అతనిని వీడ్కొని గుఱ్ఱమెక్కి దూరము నుండియు జనులకు కనుపంచవు సేయుచు ఉజ్జయిని ప్రవేశించెను. వెంటనే ఆయన కెదురుగా అందఱు ప్రకృతులును తదాగమన హేతుక మయిన హర్ష కోలాహలముతో వచ్చిరి. రాజు మంత్రులతో కూడ రాజభవనము ప్రవేశించెను. తేజస్వతియొక్క హృదయమునుండి మహాజ్వరము నిర్గమించెను. ఆక్షణమునందే గాలికి చలించుచున్న రాజాగమనోత్సవంపు జెండాలచేత ఎగురఁగొట్టఁబడినవో యన నగరియొక్క దుఃఖములు రూపఱినవి. దినాంతపర్యంతమును పౌరలోకము సూర్యునితో కూడ సిందూరారుణ మగువఱకును దేవి మహోత్సవము చేసెను.

మఱునాఁడు ఆదిత్యసేనుఁడు మఠమునుండి విదూషకుని ఆ బ్రాహ్మణు లందఱితో కూడ పిలిపించి రాత్రివృత్తాంతమును ప్రస్తుతించి ఉపకారి యైన విదూషకునికి కృతజ్ఞుఁడై వేయి గ్రామము లిచ్చి ఛత్త్రవాహనము లిచ్చి జను లందఱు

కౌతూహలముతో చూచు చుండఁగా తనకు పౌరోహితునిఁగా చేసికొనెను. ఇట్లు విదూషకుఁడు అప్పుడు సామంతతుల్యుఁ డాయెను; గొప్పవారికి చేసినయుపకారము ఎవరికి వ్యర్థమగును? మహానుభావుఁ డయిన యావిదూషకుఁడు రాజిచ్చిన యా గ్రామములను ఆమరబ్రాహ్మణు లందఱకును తనకును సాధారణ మయిన సొత్తుగా చేసికొనెను. తాను రాజునే సేవించుచు అతనియాశ్రితుఁడై - తక్కిన బ్రాహ్మణులతో కూడ ఆ గ్రామసమూహమును అనుభవించుచు ఉండెను. కాలక్రమమున ఆ యితరవిప్రు లొకరొకరును తనుకే ప్రాధ్యానము కోరినవారై ధనమదోద్ధతులై అతని నలక్ష్యపెట్టసాగిరి. విభిన్నులును ఏడుగురును ఏకస్థానగతులును అయిన యావిప్రులచేత సంఘర్షమువలన ఆ గ్రామములు దుష్టగ్రహములచేతనుం బోలె బాధింపఁబడిన వాయెను. ఇట్లు వారు అన్యాయ్యవర్తనులు అగుడు విదూషకుఁడు వారివిషయమై ఔదాసీన్యము వహించెను. అల్పసత్త్వులవిషయమై ధీరులకు ఉపేక్షయేగదా శోభించును.

ఒకనాఁడు కలహించుచున్న యావిప్రులయొద్దకు నిష్ఠురస్వభావుఁడు చక్రధరుఁ డనుబ్రాహ్మణుఁడు వచ్చి వారితో ఇతరులకు నీతులు చెప్పుటకు గ్రుడ్డివాఁడును స్వేచ్ఛదృష్టికలవాఁడే, కుబ్జుఁడును స్పష్టముగాఁ బలుకువాఁడే. బిచ్చగాండ్రకు మీకు ఓమూర్ఖులారా, ఈసిరి వచ్చినది. కనుక మీలో మీరు

ఓర్వలేమిచే గ్రామములను పాడు చేయుచున్నారు. ఈతప్పు విదూషకునిది, అతఁడు ఉపేక్ష చేసినాఁడు. కనుక మీరు నిస్సంశయముగా త్వరలోనే మరల బిచ్చ మెత్తఁగలరు. నాయకులు అనేకులై అన్నికార్యములు పాడగుటకంటె దైవాధీనముగా వర్తిల్లుచు అనాయకముగా నుండుట యైనను మేలు. సమర్థునిచే రక్షింపఁబడు సిరి మీకు కావలసినదే యేని నా మాట విని ధీరు నొక్కనినే నాయకునిఁగా నేర్పఱుచుకొనుఁడు.' అనెను. ఆమాట విని వారిలో ప్రతివాఁడును నాయకత్వము తనకే వలయు నని పట్టు పట్టఁగా ఆయూథులకు చక్రధరుఁడు మరల నిట్లనియె:— 'మీరు జగడ మాడుచున్నారు. నేను మీ కొక పందె మేర్పఱిచెదను. ఇక్కడ శ్మశానములో ముగ్గురు దొంగలు కొఱుతంబడి యున్నారు. ఈరాత్రి వారి ముక్కులను కోసికొని వచ్చునట్టి సత్త్వవంతుని మీలో నాయకుని చేసికొనవలసినది: వీరునికి కదా ప్రభుత్వము తగినది.' ఇట్లు చక్రధరుఁడు చెప్పఁగా సమీపమం దున్న విదూషకుఁడు 'అట్లే చేయుదము గాక, ఇందులో దోష మేమి?' అనెను. అంత నావిప్రులు 'ఈపని మావలనఁ గాదు, ఎవఁడు చేయఁగలఁడో వాఁడు చేయునుగాక; మేము ఈశపథమునకు కట్టుఁబడెదము.' విదూషకుఁడు 'నేను చేసెద నయ్యా, రాత్రి వారి ముక్కులను కోసి శ్మశానమునుండి తెచ్చెదను.' అని చెప్పెను. ఆయూథులు ఆపని యసాధ్యమని తలఁచి 'నీ వట్లు

చేసినయెడల నీవే మాకు దొరవు' అని ప్రతిజ్ఞ చేసిరి. ఇట్లు ప్రతిజ్ఞ ఏర్పడి రాత్రి కాఁగా విదూషకుఁడు ఆబ్రాహ్మణులతో చెప్పిపోయి, ఆయూగ్నేయఖడ్గమును తలఁచుకొని చేత ధరించి, ఏకాకిగా, తన పనివలెనే భీషణ మయిన యా శ్మశానమును చొచ్చెను. డాకినిలు ఘోషిల్లుచుండ గ్రద్దలును కాకులును రొద సేయుచుండ, కొఱవిదయ్యములనోటికొఱవుల మంటలును చితాగ్నులును వ్యాపించుచుండ, కొఱుత నున్న యాపురుషులను ముక్కుకోఁత భయముచేతనో యన ఊర్ధ్వముఖులై యున్న వారిని ముగ్గురను చూచి సమీపమునకు పోయెను. చేరువకు రాఁగానే వారు బేతాళావిష్టులై యతనిని పిడికిటఁ గ్రుద్దసాగిరి. అతఁడును చలింపక వారిని కత్తితో కొట్టెను. ధీరులహృదయములో భయము ప్రవేశింపనేరదు గదా. ఆదెబ్బలకు బేతాళవికారము తీఱఁగా అతఁడు వారి నాసికలను ఛేదించి వస్త్రాంతమున ముడిచికొనెను.

ఇట్లు విదూషకుఁడు వచ్చుచు, శ్మశానములో ఒకశవము మీఁద జపముసేయుచున్న ప్రవ్రాజకు నొకనిని చూచి, అతఁడేమి చేయునో చూతమని కౌతూహలముచేత సమీపించి, అతనికి తెలియకుండ వెనుక దాఁగి యుండెను. క్షణములో ప్రవ్రాజకునిక్రింద శవము ఫూత్కారము చేసెను; దాని ముఖమునుండి జ్వాలయు నాభినుండి ఆవాలును వచ్చెను. అంత నాపరివ్రాజకుఁడు ఆయావాలను పుచ్చుకొని లేచి శవమును

అరచేతితో కొట్టెను. అంత ఉత్తాలబేతాళాధిష్ఠితమై శవము లేచి నిలిచెను. ప్రవ్రాజకుఁడు దానిబుజముమీఁద నెక్కెను. శవము నడచిపోవుచుండెను. విదూషకుఁడును అగపడకుండనే నిశ్శబ్దముగా వెంబడించి కొంచెము దూరము పోఁగానే పాడుగుడి యొకటి కాళికాప్రతిమగలది కనఁబడెను. అక్కడ ప్రవ్రాజకుఁడు బేతాళుని దిగి గర్భగృహము సొచ్చెను. బేతాళుఁడు భూమిమీఁద పడిపోయెను. విదూషకుఁడు యుక్తిగా చూచుచు అగపడకుండ అక్కడనే యుండెను. ప్రవ్రాజకుఁడు దేవిని పూజించి యిట్లు వేఁడుకొనెను:— 'ఓదేవీ! నీవు తుష్టినొందితివేని నాకు కోరినవరము నిమ్ము, అన్యథా నీకు నన్నే బలి యిచ్చి తృప్తి నొందించెదను.' తీవ్రమంత్రసాధనగర్వితుఁడై యిట్లు పలికిన యాపరివ్రాజకునిగూర్చి గర్భగృహమందిట్లని వాణి యావిర్భవిల్లెను: 'ఆదిత్యసేనమహారాజుయొక్క కుమారికను తెచ్చి ఉపహారమిమ్ము? అంతట నీమనోరథము సిద్ధించును.' ఆమాట విని అతఁడు వెలుపటి శవమును చేతితో కొట్టి లేపెను. అంత నాబేతాళుఁడు హూంకారము చేసి లేచి నిలిచెను. నోట మంటలు వెడలుచున్న యాబేతాళుని బుజమెక్కి ప్రవ్రాజకుఁడు రాజపుత్రిని తెచ్చుటకై ఆకాశమునం బోయెను. అది యెల్లను చూచి విదూషకుఁడు 'ఏమి! నేను బ్రదికి యుండఁగా వీఁడు రాజసుతను చంపఁగలఁడా! ఈశఠుఁడు వచ్చువఱకు ఇక్కడనే యుండెదను.' అని నిశ్చయించుకొని

అక్కడనే దాఁగి యుండెను. ప్రవ్రాజకుఁడు ఆకాశమార్గ మునఁ బోయి కిటికీగుండ రాజకన్యాంతఃపురము సొచ్చి నిద్రించుచున్న రాజకుమారికను కాంతిద్యోతితదిఙ్మండలను తమోమయుఁడై చంద్రకళను రాహువుంబోలె ఎత్తుకొని వచ్చెను. 'హా తాత! హా మాత!' అని ఏడ్చుచున్న యానృపాత్మజను తెచ్చి యతఁడు ఆకాశమునుండి దేవభవనములో దిగి వెంటనే భేతాళుని వదలి కన్యారత్నమును తోడ్కొని గర్భగృహములోనికి పోయెను. అచ్చట పరివ్రాజకుఁడు రాజపుత్త్రిని ఖండింప నుంకింపఁగానే విదూషకుఁడు కత్తిదూసికొని అచటికి ప్రవేశించెను. 'ఛీ! ఛీ! పాపీ, ఈయాకృతియందు కత్తిని తగిలించు నీవు జాజిపువ్వును రాతితో నలుగఁగొట్టఁ గోరుచున్నావు సుమా.' అని విదూషకుఁడు ప్రవ్రాజకుని తనపై మిడికియుచున్నవానిని జుట్టు పట్టుకొని వంగఁదీసి తల ఖండించి వైచెను. తన్ను కొంచెము ఆనవాలు పట్టి భయముచేత ముడుఁచుకొని పోవుచున్న రాజకుమారిని ఓదార్చి, ఆమెను అక్కడనుండి అంతఃపురమున కెట్లు కొనిపోవనగును, అని యా ధీరుఁడు ఆలోచించుచుండఁగా 'ఓయి విదూషకుఁడా! ఈమాట విను. నీవు ఇప్పుడు చంపినాఁడవే ఈపరివ్రాజకునికి గొప్ప బేతాళుఁడును ఆవాలును సిద్ధించినవి. ఆందువలన ఇతనికి రాజ్యమందును రాజకన్యలయందును ఆశ కలిగినది. అందుచేత ఈ మూఢుఁ డిట్లు వంచింపఁబడినాఁడు. ఓయి వీరుఁడా! నీవు

ఇతని యీవాలను పుచ్చుకొమ్ము, వాని ప్రభావముచేత నీకు ఈ యొకరాత్రి ఆకాశగమనశక్తి కలుగును.' అని పలికి ఆకాశవాణి అతనిని సంతోషపెట్టెను. అట్టివారిని దేవతలు కూడ అనుగ్రహింతురు గదా. అంత విదూషకుండు పరివ్రాజకుని వస్త్రపు ముడి విప్పి ఆవాలను చేతం గొని రాజకన్య నెత్తుకొని దేవీభవనమునుండి వెలువడెను. అప్పుడు ఆకాశమందు మఱియొకవాణి వినంబడెను. 'ఓమహావీరుండా! ఇక్కడికే ఈదేవీగృహమునకు నెలదినములు కాంగానే నీవు తప్పకుండ రమ్ము, మఱచిపోకుము.' ఆమాట విని అతండు 'అట్లే చేసెదను' అని పలికి, రాజకన్య నెత్తుకొని ఆకసమున కెగసి రాజకన్యాంతఃపురమునకు పోయి, ఆమె నక్కడ ఉంచి ఓదార్చి, 'బాలా! తెల్లవాఱునేని నాకు ఆకాశగమనశక్తి గలుగదు. గనుక నాకు ఇప్పుడే సెల విమ్ము. తెల్లవాఱిన పిమ్మటనే పోదునేని నన్నందఱును చూతురు.' అని సెల వడిగెను. అంత నాబాలిక భయముతో 'ఓమహాపురుషుండా! నీవు పోయిన నా ప్రాణములును ఇప్పుడే పోవును. నీవు పోకుము. నాకు మరల ప్రాణదానము చేయుము. పూనుకొన్నయర్థమును నెఱవేర్చుటగదా సత్పురుషుల సహజవ్రతము.' అని వేండుకొనెను. అంతట సత్త్వవంతుండు విదూషకుండు 'నాకు ఏమయినను కానిమ్ము, నేను పోను. పోయినయెడల ఈమె భయముచేత ప్రాణములు వదలును. అంత నారాజభక్తి వలన

ఏమి ప్రయోజనము?' అని యాలోచించి ఆరాత్రి అక్కడనే యుండెను. వ్యాయామ జాగరములచే బడలినవాఁడు గాన క్రమముగా నిదుర పోయెను. రాజపుత్త్రిమాత్రము భయము చేత నిద్రపట్టకయే ఆరాత్రి గడపి, పాప మితఁడు బడలి యున్నాఁడు; క్షణము విశ్రమించును గాక, యని ప్రేమార్ద్ర మానసయై తెల్లవాఱినను అతనిని లేపకుండెను. అంతఃపుర పరిచారికలు అతనిని చూచి వెఱఁగుపడి పోయి రాజుతో నివేదించిరి. విదూషకుని సత్త్వము నెఱిఁగిన యామహారాజు అదేమో అని సంభ్రాంతుఁడై వెంటనే అతనిని కొమారితమందిరము నుండి పిలిపించెను. విదూషకుఁడును, ఆమెమనస్సు తనతోఁ గూడ రాఁగా, రాజునొద్దకు పోయి, ఆయన యడుగఁగా, ఆమూలాగ్రముగా జరిగిన వృత్తాంతమును చెప్పి, వస్త్రాంతమందు మూట గట్టియున్న దొంగలనాసికలను, భూమిని భేదించుకొని వచ్చిన నైన యా పరివ్రాజకుని యావాలను చూపెను. అంతట రాజు అది యంతయు సత్యమే యని తలఁచి ఆమరద్విజులను ఈవృత్తాంతమున కెల్లమూలకారణ మయినచక్రధరునితోఁ గూడ పిలిపించి, అడిగి తెలిసికొని, తాను శ్మశానమునకు పోయి, ముక్కులు లేనియాశవములను చూచి, పిమ్మట కాళి గుడికి పోయి, అందు తెగి పడియున్న యా ప్రవ్రాజకాధముసిం జూచి, నమ్మకము గలుగఁగా సంతోషించి, కృతార్థుఁడును తనకూఁతునకు ప్రాణ మిచ్చినవాఁడును అయిన విదూషకునికి ఆ

తనకో మాఱతనే యిచ్చెను. సంతోషించిన యుదారులు ఉపకారులకు ఏమి యియ్యరు? నిజముగా కమలమును ప్రీతిచేత రాజసుత చేతియందు లక్ష్మి నివసించి యుండెను; కాదేని దానిని గ్రహించినమాత్రముననే విదూషకుఁడు లక్ష్మిని ఎట్లు పొందెను? శ్లాఘ్యకీర్తి యావిదూషకుఁడు అది మొదలు ఆకాంతతో కూడ రాజోపచారములతో ఆదిత్యసేనమహారాజుగృహమందే నివసించి యుండెను.

ఇట్లు కొన్నిదినములు గడవఁగా ఒకనాఁడు దైవప్రేరణచేత రాత్రి రాజపుత్త్రి విదూషకునితో 'ప్రాణనాథ! ఆ రాత్రి దేవీగృహమున మాసాంతమందు మరల నిన్ను రమ్మన్న యాకాశవాణిని మఱచితివా? నేటితో మాసము సరి. నీవు మఱచి యున్నావు.' అని హెచ్చరించెను. ప్రియ ఇట్లు చెప్పఁగానే విదూషకుఁడు సర్వము జ్ఞప్తికి తెచ్చుకొని సంతోషించి 'బాగు! సుందరీ, నేను మఱచితిని, నీవు సమయమునకు జ్ఞాపకపఱిచితివి.' అని ప్రియను ఆలింగనపారితోషికి మొసంగెను. పిమ్మట ఆమెను నిద్రపోనిచ్చి అంతఃపురమునుండి బయలువెడలి ఆగ్నేయఖడ్గమును చేతఁ బూని స్వస్థచిత్తుఁడై ఆదేవీభవనమునకు పోయెను. బయటనే యుండి 'వచ్చినాఁడను, ఓహో! విదూషకుఁడను.' అని యఱచినవాఁడై 'లోపలికి రా' అని ఎవరో లోపలినుండి పిలువఁగా విని ప్రవేశించెను. అతనికి అక్కడ లోపల దివ్యమయిన మందిరమును దానినడుమ దివ్య

పరిచ్ఛదయు దివ్యరూపయు నగుదివ్యకన్యయు అగపడెను. తన ప్రభచేత చీకటి విరియించుచు ఆ కన్య హరకోపాగ్నికి కాలి పోయినమదనుని బ్రదికించుచున్నదై రాత్రిలో వెలుఁగు వనౌషధి యో యన తేజరిల్లుచుండెను. ఏమి యిది యని యాశ్చర్య పడుచున్న యావిదూషకుని ఆమె సంతోషించి సస్నేహబహు మానముగా కుశల మడిగి గౌరవించెను. కూర్చున్న యతనికి ప్రేమ చూపి చన విచ్చి తనస్వరూపము తెలియఁగ నుత్సుకుఁ డయిన యతనితో ని ట్లనియె:—'నేను విద్యాధరిని, కన్యను; నాపేరు భద్ర, గొప్పవంశము దానను. కామగమనముచే ఇక్క డికి వచ్చి నే నప్పుడు నిన్ను చూచితిని. నీగుణములచేత ఆకృష్టనై నిన్ను మరల రమ్మని ఆసమయమందు అదృశ్యవాణిని సృజియించితిని. ఇప్పుడు నావిద్యాప్రయోగములచేత ప్రేరింపఁ బడి మోహితురాలై యారాజకన్య నీకు జ్ఞప్తి కలిగించినది. నీకొఱకు నే నిక్కడ కనుపెట్టుకొని యున్నాను.' ఓయి చక్క నయ్యా, ఈశరీరమును నీ కర్పించితిని. నన్ను వివాహమాడుము.' ఆ విద్యాధరి భద్ర యట్లు చెప్పఁగా విదూషకుఁడు అంగీ కరించి గాంధర్వవిధానముచేత ఆమెను అప్పుడే వివాహమై స్వపౌరుషఫలర్ద్ధితోను బోలె ఆప్రియతో కూడుకొని దివ్య భోగము లనుభవించుచు అక్కడనే నిలిచిపోయెను.

ఈలోపల రాజకన్య తెల్లవాఱఁగానే నిద్రలేచి భర్తను గానక విషాదపడి కన్నీళ్లు వఱదవాఱ పదములు తొట్రువడ

తల్లియొద్దకు పోయి, తనపతి రాత్రి యెక్కడికో వెడలి పోయె
నని, తన యపరాధమునకే భయపడుచు పశ్చాత్తాపపడుచు,
చెప్పుకొనెను. కొమారితమీఁది ప్రేమచేత తల్లియు కలఁత
పడి విషాదిల్లఁగా, ఆవార్త విని రాజు కూడ అక్కడికి
వచ్చి వ్యాకులపడెను. 'ఎఱుఁగుదును, ఆయన శ్మశానము
వెలుపలి యమ్మవారిగుడికి పోయినాఁడు' అని కొమారిత
చెప్పఁగా రాజు అక్కడికి స్వయముగా పోయెను. అచట వెద
కియు విద్యాధరీ విద్యాప్రభావముచేత అదృశ్యుఁడై యున్న
విదూషకుని రాజు కనిపట్టనేరఁడాయెను. అంతట రాజు
మరలి పోఁగా నిరాశయై ప్రాణత్యాగోద్యత యైన రాజ
పుత్త్రిని చూచి ఎవఁడో యోగి 'అమ్మాయీ! మఱి యేమియు
కీడు లేదు; నీపతి దివ్యభోగములందు క్షేమముగా నున్నాఁడు;
త్వరలోనే నీ యొద్దకు వచ్చును.' అని చెప్పి యోదార్చెను.
ఆ మాట విని రాజపుత్త్రి పతిసమాగమనకాంక్షచేత ప్రాణము
నెట్టకేలకు బిగఁబట్టుకొని యుండెను.

విదూషకుఁడక్కడ నుండఁగా అతని ప్రియ యైనభద్ర
యొద్దకు యోగేశ్వరి యను నొకచెలి వచ్చి అమెతో రహస్యము
గా నిట్లు పలికెను.— 'చెలీ, మనుష్యసంసర్గము చేసితి వని
దోష మెంచి నీమీఁద విద్యాధరులు కోపగించినారు నీకు
కీడు చేయ నాలోచించి యున్నారు. కనుక ఇక్కడినుండి లేచి
పొమ్ము, తూర్పుసముద్రము నవతలిగట్టున కార్కోటక మను

పట్టణము గలదు. దానిని దాటఁగా శీతోద యను పుణ్యనది యొకటి కలదు. దాని కవతల ఉదయ మని సిద్ధక్షేత్రమయిన మహాపర్వత మున్నది. అక్కడికి విద్యాధరులు రాలేరు. నీవు ఇప్పు డక్కడికి పొమ్ము. మనుష్యుఁ డయిన యీ ప్రియునికై చింతింపకుము. ఈవృత్తాంత మంతయు ఇతనికి చెప్పియే పొమ్ము. సత్త్వవంతుఁ డితఁడు పిమ్మట అక్కడికి రానే వచ్చును ' ఇట్లు ఆమె చెప్పఁగా భద్ర భయపడి విదూషకానురక్త యయ్యును అట్లే అంగీకరించెను. అతనికి ఆవృత్తాంతమును యుక్తిగా చెప్పి తనయుంగరము నిచ్చి తెల్లవాఱుజామున ఆమె అదృశ్యయై పోయెను. అంత విదూషకుఁడు క్షణములో మొదట తా నున్న దేవాలయములో నుండెను. భద్రయు లేదు, ఆమందిరమును లేదు. ఆవిద్యాప్రపంచమును స్మరించుచు ఉంగరమును చూచుకొనుచు విదూషకుఁడు విషాదాశ్చర్యముల పాలాయెను. ఆమె మాటను ఏమో స్వప్నప్రాయముగా స్మరించుచు ' సరి, ఆమె ఉదయపర్వతమునకు పోయినది. మఱి నేనును అక్కడికే పోవలయును. నన్నిక్కడ నందఱు చూతురు. అంతట రాజు నన్ను పిలుచుకొని పోయి మఱి పోనీయఁడు. కనుక నాకార్యము సిద్ధించునట్లు యుక్తి చేసెదను.' అని యాలోచించుకొని ఆమతిమంతుఁడు మాఱురూపము ధరించికొని చింపిగుడ్డలు కట్టుకొని ఒడలెల్ల దుమారము పూసికొని అమ్మవారిగుడినుండి 'ఓభద్రా! ఓభద్రా!' అని అంగ

లార్చుచు వెలునడెను. తత్క్షణమే జనులు ఇతనిని చూచి 'వాఁడుగో! విదూషకుఁడు వచ్చినాఁడు!' అని కోలాహలము చేసినారు. ఆవృత్తాంతమును విని రాజు స్వయముగా అట్లు ఉన్మత్తచేష్టుఁడై యున్నయాతనిని చూచి పట్టుకొని తనమందిరమునకు కొనిపోయెను. విదూషకుఁడు అక్కడ స్నేహాకులత చేత ఎవరు ఏమి చెప్పినను 'భద్రా!' అని ప్రత్యుత్తరమొసఁగుచుండెను. వైద్యులు విధించిన యభ్యంగములు చేసిన వెంటనే అతఁడు ఒడలెల్ల బూడిద పూసికొనుచుండెను. స్నేహముతో రాజపుత్త్రి స్వయముగా తెచ్చిపెట్టిన యాహారము కాలితో పాఱఁదన్నుచుండెను. ఈప్రకార మతఁడక్కడ కొన్నిదినములు స్పృహ లేక తనవస్త్రములను చింపుకొనుచు ఉన్మాదవేషమున నుండెను. 'వృథాగా బాధింప నేల? ఇతనికి మందు లేదు. బాధ పడలేక ప్రాణము వదలినను వదలును. అంతట బ్రహ్మహత్య సంభవించును. విచ్చలవిడిగా విడిచి పెట్టితిమా కాలక్రమమున స్వస్థపడును.' అని యాలోచించి ఆదిత్యసేనుఁడు అతనిని వదలి పెట్టెను.

విదూషకుఁడు విద్యాధరికడ కేఁగుట.

అది మొదలతఁడు విచ్చలవిడిగా తిరుగుచు మఱునాఁడు ఉంగరము కైకొని భద్రనుగూర్చి బయలువెడలెను. దినదినమును తూర్పుముఖముగానే పోవుచు అతఁడు క్రమముగా మార్గవశమున పౌండ్రకమను పట్టణము చేరి రాత్రి బసకై

యొకముసలిబ్రాహ్మణియింటికి పోయెను. ఆమె యతనికి బస యిచ్చి ఆతిథ్యము చేసి వెంటనే అతనియొద్దకు దుఃఖాక్రాంతురాలై వచ్చి 'నాయనా ఈనాయిల్లు సర్వమును నీకే ఇచ్చితిని, పుచ్చుకొమ్ము. ఇంక నేను బ్రదుకను' అనెను. 'ఏల అమ్మా ఇట్లు పలికెదవు? అని యతం డాశ్చర్యపడి యడుగంగా ఆమె యిట్లనియె:—

"నాయనా వినుము. ఈనగరపురాజు పేరు దేవసేనుండు. అతనికి భూలోకభూషణ మనుకూంతు రొకతె పుట్టినది. అతం డామెయం దత్యంతప్రేమచేత ఆమె తనకు అనపత్యతాదుఃఖము చిరకాల మనుభూత మయినపిమ్మట జనించిన దని ఆమెకు దుఃఖలబ్ధిక యని పేరు పెట్టినాండు. ఆమెను యౌవనము రాంగానే తనయింటనే కచ్ఛపనాథుండను నొకరాజునకు ఇచ్చెను. ఆకచ్ఛపేశ్వరుండు రాత్రి తలుపు వైచి పడుకగదిలో ఆమెయొద్దకు పోయి వెంటనే చచ్చిపోయెను. అంత రాజు చింతాకులుండై ఆమెను మఱి యొకరాజునకిచ్చెను. అతండును ఆప్రకారమే కాలధర్మము నొందెను. ఆభయముచేత మఱి యేరాజులును ఆమెను కోరరైరి. అంతట రాజు సేనాపతిని పిలిచి యిట్లాజ్ఞాపించెను. 'ఈదేశమునుండి నీవు వరుసగా ప్రతియింటినుండియు ఒకొక్కపురుషుని బ్రాహ్మణునింగాని, క్షత్త్రియునింగాని తెచ్చి నాకూంతునింట వదలవలయును. ఎంతమంది ఎంతకాలము చత్తురో చూతము. ఎవండు బ్రదుకునో

వాఁడు దానికి భర్తగా కాఁగలఁడు. అద్భుతకర్మ మైన విధిగతిని నిర్ణయింప నెవ్వరితరము!' ఇట్లని రాజు ఆజ్ఞాపింపఁగా సేనాపతి ప్రతిదినమును వంతుప్రకారము ఇండ్లనుండి పురుషులను కొనిపోవుచున్నాఁడు. ఈప్రకారము అక్కడ వందలకొలఁది పురుషులు మృతిఁ బొందినారు. పుణ్యహీనకు నాకు ఒకఁడే కొడుకున్నాఁడు. అక్కడికి పోయి చచ్చుటకు ఈదినము వాని వంతు. వాఁడు లేఁడేని నేను ప్రాతఃకాలమందు అగ్నిప్రవేశము చేసెదను. కనుక నేను జీవముతో నుండఁగానే గుణవంతునికి నీకు మరల నాకీర్తిదుఃఖము కలుగకుండునిమిత్తమై నాగృహమును సర్వమును ఇచ్చుచున్నాను."

ఇట్లు ఆమె చెప్పఁగా విదూషకుఁడు ఆమెతో నిట్లనియె:— 'అమ్మా, అట్లగునేని నీవు బెంగపెట్టుకొనకుము. నే నక్కడికి పోయెదను. నీ యేకపుత్త్రుఁడు జీవించును గాక. ఇందువలన నాకు మరణము కలుగు నని నామీఁద జాలి పడకుము. అక్కడికి పోయిన నాకు సిద్ధయోగముచేత భయము లేనే లేదు సుమా.' విదూషకుఁ డిట్లు చెప్పఁగా ఆబ్రాహ్మణి 'నీవు ఎవరవో దేవుఁడవు, నాపుణ్యముచేత ఇక్కడికి వచ్చినాఁడవు. మాకు ప్రాణము లిచ్చి, నాయనా, నీవును కుశలముగా నుండుము.' అని పలికెను.

ఈప్రకారము అతఁడు ముసలమ్మచేత ననుజ్ఞ వడసి సాయంకాలమందు సేనాపతియొక్క కింకరునితోఁ గూడ రాజ

సుతయింటికి పోయెను. అక్కడ యౌవనమదోద్ధతురాలయిన యారాజకన్యను విరియఁ బూచిన పూఁదీఁగనుం బోని దానిని చూచెను. అంత రాత్రియందు ఆరాజపుత్త్రి పవళింపఁగానే విదూషకుఁడు ధ్యానముచే వచ్చిన యాయాగ్నేయ ఖడ్గమును చేతఁ బూని ఆపడుకగదిలోనే 'ఇక్కడ పురుషులను ఎవరు చంపుదురో చూతముగాక' యని చింతించుచు మేలుకొని యుండెను. జను లందఱును నిద్రింపఁగానే తలుపు తెఱచుకొని ద్వారభూమినుండి వచ్చుచున్న యొక రాక్షసుని ఘోరరూపుని చూచెను. ఆరాక్షసుఁడు ద్వారములోనే నిలిచి గదిలోనికి వందలకొలఁది పురుషులకు అకాలయమదండ మయిన బాహువును చాచెను. విదూషకుఁడు కోపముతో వానిమీఁదికి పరుగెత్తి ఆబాహువును ఒక్కవ్రేటుతో తెగ నఱికెను. బాహువు తెగి పడఁగానే నిశాచరుఁడు విదూషకుని సత్త్వాతిశయమునకు భయపడి పాఱిపోయి మరల అక్కడికి రాఁడాయెను. రాజసుత మేలుకొని అచట పడియున్న రాక్షసబాహువును చూచి భయ సంతోషాశ్చర్యములపాలాయెను. తెల్లవాఱఁగానే దేవసేనమహారాజును తన కూఁతు నంతఃపురంపుద్వారములో తెగి పడియున్న యాబాహువును, ఇటుమీఁద నిక్కడికి అన్యపురుషు లెవ్వరును ప్రవేశింపఁగూడదు అని విదూషకుఁడు వైచిన యడ్డుగడియయో యన నున్న దానిని, చూచి, దివ్యప్రభావునకు విదూషకునికి ప్రీతుఁడై మహా

విభవములతో కౌమారిత నిచ్చి పెండ్లి చేసెను.

అంత విదూషకుఁడు మూర్తీభవించిన సంపదవంటి యాప్రియతో నక్కడనే కొలఁది దినములు సుఖముండి, ఒక నాఁడు రాత్రి నిద్రించియున్న యారాజపుత్త్రిని వదలి అక్కడి నుండి త్వరపడి భద్రను గూర్చి బయలుదేఱెను. రాజపుత్త్రి నిదురమేల్కొని యతనిని గానక దుఃఖపడి తండ్రిచేత నోదార్పఁబడి పునస్సమాగమకాంక్షచేత ప్రాణములు బిగఁబట్టుకొని యుండెను. విదూషకుఁడును దినదినమును నడచి క్రమముగా తూర్పు సముద్రముచెంత తామ్రలిప్తినగరమునకుఁ బోయి అక్కడ సముద్రము దాఁట నుద్యోగించి యున్న స్కందదాసుఁ డను నొక యోడవర్తకునితో సాంగత్యము చేసి అతనితో కూడ అతని యపారధనముతో నిండియున్న యోడ నెక్కి జలమార్గమున బయలువెడలెను. మార్గములో నొకచోట ఓడ దేనికో తగులుకొన్నట్టు కదలక నిలిచిపోయెను. సముద్రమును రత్నములతో పూజించి, అప్పటికిని ఓడ కదలక పోఁగా, స్కందదాసుఁడు దిగులుపడి 'ఇక్కడ నిలుకుకొని యున్న యీ యోడను ఎవఁడు ఆటంకము తీర్చి నడపించునో వానికి నా ధనములో సగమును నా కౌమారితను ఇచ్చెదను.' అని ప్రతిజ్ఞ చేసెను. ఆమాట విని విదూషకుఁడు 'నేను ఇక్కడ దిగి సముద్రజలమున నంతయు వెదకి క్షణములో ఈయోడను ఇలుకటము తీఱి నడచునట్లు చేసెదను. మీరు నన్ను త్రాళ్లతో పట్టు

కొని యుండును. ఓడ కదలినతక్షణమే నీళ్లలోనుండి నన్ను సముద్రములోనికి మీరు త్రోసుకొనవలసినది.' అని పలికెను. వర్తకుఁ డతనిమాట కంగీకరించెను. అంతట కళాసులు విదూషకుని త్రాళ్లతో చంకలమొదట కట్టివైచిరి. అట్లు బద్ధుఁడై విదూషకుఁడు సముద్రములో దిగెను. సమయము వచ్చినప్పుడు సత్త్వవంతుఁడు వెనుదివియఁడు. ధ్యాత్రోపస్థిత మగు యాగ్నేయ ఖడ్గమును చేతఁ బూని, ఓడక్రింద నీటిలో ఆ వీరుఁడు ప్రవేశించి, అచ్చట మహాకాయుఁ డొకపురుషుఁడు నిద్రించుచుండుటయు, ఓడ అతనిపిక్కలో తగులుకొని యుండుటయు, చూచి ఆ పిక్కను తక్షణమే ఆకత్తితో తెగఁగొట్టెను. అంతట ఓడ నడవ సాగెను. దానిని చూచి పాపాత్ముఁ డా వర్తకుఁడు వాగ్దానము చేసిన ధనాదిక మీవలసివచ్చు ననెడు భయముచేత అతని త్రాళ్లను కోసివైచి, ముక్తవృత్తుఁ డై మహాలోభపారమును, ముక్తప్రవహణుఁ డై మహాసముద్రపారమును, పొందెను.

అంత విదూషకుఁడు నీళ్లమీఁద తేలి, వర్తకుఁడు తనత్రాళ్లను కోసివైచి ఓడ నడుపుకొని పోయెనని యెఱిఁగి, ధైర్యముతో క్షణ మిట్లు చింతించెను. 'ఆహా! వర్తకుఁడు ఎంత మోసము చేసినాఁడు! సరి! చెప్పవలసిన దేమున్నది! కృతఘ్నులగు ధనలోభాంధులకు ఉపకారము అగపడునా? ఇది నాకు కేవలము దిగులుపడ కుండుటకు కాలము. ధైర్యము వదలుటచేత కొంచెమైనను ఆపద తీఱదు.' ఇట్లు చింతించి

విదూషకుఁడు తాను ఖండించిన యామహాకాయునిపిక్కనే ఆ సమయమునకు తగిన తెప్పనుగా ఎక్కి ఈఁదుకొని సముద్రమును దాఁటెను. సత్త్వవంతులకు దైవమే తోడు గదా. రామకార్యార్థము హనుమంతుఁడు పోయినట్లు సముద్రముయొక్క యవ్వలిగట్టునకు పోయి చేరిన యాబలవంతునితో ఆకాశవాణి 'బళి! బళి! విదూషకా, నీకంటె మఱి యెవఁడు సత్త్వవంతుఁడు! నీ యీధైర్యమునకు మెచ్చుకొంటిని. ఈ మాట వినుము. ఇప్పుడు నీవు దిగంబరదేశమునకు వచ్చినాఁడవు, ఇఁక ఏడుదినములలో కార్కోటక మను పట్టణము చేరుదువు, అక్కడ సంతుష్టుఁడవై అక్కడినుండి బయలుదేఱి శీఘ్రముగా అభీష్టసిద్ధిని పొందుదువు. నేను పూర్వము నీచే ఉపాసింపఁబడిన యగ్నిదేవుఁడను. నావరముచేత నీ కిప్పుడు ఆఁకలియు దప్పియు ఉండవు. కావున ధైర్యోత్సాహములతో అభీష్టసిద్ధికై నమ్మకముతో పొమ్ము.' అని పలికి విరమించెను.

విదూషకుఁడు ఆవాణిని విని సంతోషించి అగ్నికి ప్రణమిల్లి బయలువెడలి ఏడవ దినమందు కార్కోటక నగరము చేరి అచ్చట నానాదేశాగతులును అభ్యాగతప్రియులు నైన సత్పురుషులు కొందఱు నివసించి యున్న యొక మఠమునకు పోయెను. ఆమఠమును అక్కడిరాజు ఆర్యవర్మ యనువాఁడు నిర్మించి దానికై సంపూర్ణముగా బంగారముతో నొక మనోహర దేవాలయమును గూడ కట్టించి యిచ్చెను.

అక్కడ విదూషకునికి బ్రాహ్మణు లందఱును అతిథిసత్కార ములు చేయఁగా ఒక బ్రాహ్మణుఁడు తనయింటికిఁ గొనిపోయి స్నాన భోజన వస్త్రాదికములచేత ఉపచారములు గావించెను. సాయంకాలమున ఆమఠమందే ఉన్నవాఁడై విదూషకుఁడు ఊరిలో ఈచాటింపు వినెను: 'బ్రాహ్మణుఁడుగాని క్షత్రియుఁడు గాని ఎవఁడు రేపు ఉదయమున రాజుకూఁతును పెండ్లియాడఁ గోరునో అతఁడు ఈరాత్రి ఆమెయింట నివసించునుగాక.' ఆచాటింపు విని సాహసప్రియుఁడు విదూషకుఁడు దాని కేమో నిమిత్తముండు నని యూహించి తాను రాజసుతాగృహమునకు పో నుద్దేశించెను. ఆమఠబ్రాహ్మణులు అతనితో ని ట్లనిరి:— 'ఓబ్రాహ్మణోత్తమా! సాహసము చేయకుము. అది రాజ కన్యాగృహము గాదు, మఱి యే మనిన, తెఱచుకొని యున్న మృత్యుముఖము. అందు రాత్రి చొచ్చినవాఁడు మఱి బ్రదు కఁడు. ఇ ట్లచట సాహసికు లనేకులు నశించి పోయినారు.'

ఇట్లు వారు నివారించినను ఆమాటలను లక్ష్యపెట్టక విదూషకుఁడు రాజభటులతోఁ గూడి రాజగృహమునకు పోయెను. అచట నితనిని ఆర్యవర్మ స్వయముగా చూచి గారవించెను. ఇతఁడును రాత్రి సూర్యుఁడు అగ్నినిం బోలె రాజ సుతాగృహమును ప్రవేశించి తనయందమున కైన వలపుతోను దానుదక్కఁ డనువగపువలని కన్నీళ్లతోను తన్నుఁ జూచుచున్న రాజసుతను చూచి, చింతితోపనత మైనయాగ్నేయఖడ్గమును

చేతఁ దాలిచి మేలుకొనియే అచట నుండెను. అంత నాకస్మిక ముగా ద్వారములో మహాఘోరాకారుఁడు ఒకరాక్షసుఁ డగ పడెను. వానికి కుడిచేయి లేదు. వాఁడు ఎడమచేతిని గదిలోపలికి చాఁచెను. దానిని చూచి విదూషకుఁడు 'ఆహా! వీఁడే ఆరా క్షసుఁడు. వీనిబాహువునే నేను పౌండ్రవర్ధనపట్టణములో తెగఁ గొట్టినాఁడను. వీని యీ బాహువును తెగఁగొట్టను. కొట్టిన యెడల వీఁడు మునుపటివలెనే పాఱిపోవును. కనుక వీనిని చంపెదను. అది యుచితము.' అని యాలోచించుకొని వాని మీఁదికి పరుగెత్తి వానిని జుట్టు పట్టుకొని వంచి చంప నుద్యోగించెను. అంత నాక్షణమందే భయపడినవాఁడై యతనితో రాక్షసుఁడు 'ఓమహాసత్త్వా! నన్ను చంపకుము, నామీఁద కరుణింపుము.' అని మొఱపెట్టెను. 'నీ పేరేమి? నీ వేల యిట్లు చేసెదవు?' అని యడుగఁగా రాక్షసుఁ డిట్లు చెప్పెను. 'నాపేరు యమదంష్ట్రుఁడు. నాకు ఇద్దఱు కొమా రితలు కలిగినారు. వారిలో ఈమె యొకతె. రెండవది పౌండ్ర వర్ధనమం దున్నది. ఈ రాజసుతల నిద్దఱను అవీరపురుష సంగమమునుండి రక్షింపవలయును. నాకు ఇట్లు శంకరాజ్ఞా ప్రసాద మయినది. మొదట నా బాహువు నొకఁడు పౌండ్ర వర్ధనములో నఱికినాఁడు. నీవు ఇక్కడ నిప్పుడు నన్ను జయించినాఁడవు. నా యీ శంకరాజ్ఞ సమాప్త మయినది.' ఆమాట విని నవ్వి విదూషకుఁడు 'ఓయి, నేనే నీబాహువును

పౌండ్రవర్ధనములో నఱికినవాఁడను.' అనెను. అంత రాక్ష సుఁడు 'అట్లయిన నీవు దేవతవు, మనుష్యుఁడవు గావు. నా కాళంకరాజ్ఞానుగ్రహము నీకొఱకే అయిన దని తలఁచెదను. కనుక నా కిప్పుడు నీవు స్నేహితుఁడవు. నీవు న న్నెప్పుడు తలంచికొందువో అప్పుడు నేను వచ్చి నీకష్టములను తీర్చె దను.' అని విదూషకునితో చెలిమిచేసికొని అతని యంగీ కారమును పొంది వెడలిపోయెను. రాజపుత్త్రి తన పరాక్రమ మును పొగడఁగా విదూషకుఁడు ఆనందభరితుఁడై సంతసించి ఆమెతో నారాత్రి అక్కడనే గడపెను. మఱునాఁడు తెల్ల వాఱఁగానే రాజు ఆవృత్తాంతము నెఱిఁగి సంతోషించి విభవ పూర్వకముగా విదూషకునికి శౌర్యపతాకనుంబోని కుమారిక నిచ్చి వివాహము చేసెను.

విదూషకుఁడు గుణబద్ధయైన తన లక్ష్మియుంబోలె క్షణ మయినను తన్నుఁ బాయని యారాజసుతతో అక్కడ కొన్ని రాత్రులు గడపి ఒకరాత్రి భద్రను స్మరించుకొని బయలుదేఱి రాజసుతతో చెప్పక వెడలిపోయెను. దివ్యరసము నాస్వాదిం చినవాఁడు వేఱురసమందు రక్తుఁడగునా? విదూషకుఁడు నగ రమునుండి వెలువడి ఆరాక్షసుని తలఁచుకొనెను. తత్క్షణమే రాక్షసుఁడు వచ్చి ప్రణతుఁడై నిలువఁగా వానికి ట్లాజ్ఞా పించెను. 'చెలికాఁడా! నేను విద్యాధరి భద్రకొఱకు ఉద యాద్రియం దొక సిద్ధక్షేత్రమునకు పోవలయును. న న్నక్క

డికి కొనిపొమ్ము.' అందుల కతఁడు సరియే యనఁగా విదూషకుఁడు వాని బుజము మీఁద నెక్కి ఆరాత్రియే ఇతరులకు పోవలవిగాని యఱువదియోజనముల దూరము పోయెను. తెల్లవాఱఁగానే విదూషకుఁడు మనుష్యులకు దాఁటరాని దైన శీతోద యను నదిని దాఁటి సులువుగా ఉదయాద్రియొద్దకుఁ బోయెను. అంతట రాక్షసుఁడు 'ఇదిగో నీ యెదుట శ్రీమంత మయిన యీయుదయపర్వతము. సిద్ధనివాస మయినదీనిమీఁదికి నాకు ప్రవేశము లేదు.' అని తెలిపి సెలవు పొంది అదృశ్యుఁడై పోయెను. అంతట విదూషకునికి అక్కడ వికసిల్లిన పద్మముఖశోభ గలదై చలించుచున్న తుమ్మెదల రొదచేత తన్ను కుశలప్రశ్న చేయునదియుంబోలె నొప్పుచున్న యొక యందంపు డిగ్గియయు, దాని గట్టున 'ఇదే నీకు ప్రియాగమహేతువు' అని చెప్పుచున్నదియుంబోలె స్త్రీలయడుగులదిగా తోఁచుచున్న జాడయుఁ, గాన నయ్యెను. ఈపర్వతమును నరులకు చొరశక్యము గాదు, కనుక ఇక్కడనే క్షణమునే వుండి ఈపదపంక్తి యెవరిదో చూచెదను గాక.' యని యతఁడు ఆలోచించు చుండఁగా అక్కడికి నీళ్లకొఱకు బంగారపుఁ గుండలు గొని పలువురు దివ్యకాంతలు వచ్చిరి. వారు నీళ్లు ముంచుకొని కాఁగా విదూషకుఁడు వారిని 'ఈ నీ ళ్లెవరికొఱకు కొనిపోవుచున్నా ర'ని యనురాగముతో మృదువుగా నడిగెను. 'ఓయి మంచివాఁడా, ఈ పర్వతములో భద్ర యని

యొక విద్యాధరి యున్నది, ఆమెకు స్నానార్థమై యీనీళ్లను గొనిపోవుచున్నాము.' అని వారు పలికిరి. ఆహా! బ్రహ్మదేవుండు ధీరుల గొప్ప ప్రయత్నములకు సంతోషించినవాఁడుం బోలె కావలసినసామగ్రి నంత తానే సమకూర్చును. అది యెట్లనఁగా, ఆ స్త్రీలలో నొకతె ఆకస్మికముగా విదూషకుని 'ఓమహా భాగుఁడా! ఈగిండిని నాబుజముమీఁదికి ఎత్తుము' అని యడిగెను. బుద్ధిమంతుఁడైనవిదూషకుఁడు అంతట ఆమె బుజముమీఁదికి గిండి నెత్తి పూర్వము తనకు భద్ర యిచ్చిన రత్నముల యుంగరమును అందులో వైచి తాను ఎప్పటియట్లు బావిగట్టున కూర్చుండెను.

పిమ్మట ఆ స్త్రీలు భద్రకు స్నానము చేయించునప్పుడు ఆమెయొడిలో ఒకదానిగిండినుండి ఆయుంగరము పడెను. దానిని చూచి గుర్తుపట్టి భద్ర ఆచెలులను 'ఇక్కడ అపూర్వపురుషుని ఎవని నైనఁ జూచితిరా?' అని యడిగెను. 'డిగ్గియగట్టున ఒక మనుష్యుని వయసువానిని చూచితిమి, అతఁడు దీనికి గిండిని బుజమున కెత్తినాఁడు.' అని వా రుత్తరము చెప్పిరి. భద్ర 'ఓచెలులార, శీఘ్రముగా అతనిని స్నానము చేయించి అలంకరించి ఇక్కడికి తెండు, అతఁడు నాభర్త, వచ్చినాఁడు.' అని యాజ్ఞాపించెను. భద్ర యిట్లు చెప్పఁగా ఆచెలులు పోయి జరిగినమాట విదూషకునికి చెప్పి స్నానము చేయించి అలంకరించి యతనిని భద్రయొద్దకు తోడ్కొని వచ్చిరి. అట్లు చిరకాల

మునకు విదూషకుఁడు వచ్చి తనదారినే చూచుచున్న భద్రను తన సత్త్వవృక్షముయొక్క పండిన ఫలశ్రీనింబోలె చూచెను. ఆమెయు అతనిని చూచి లేచి ఆనందబాష్పముల నర్ఘ్యమొసఁగి కంఠమందును భుజములయందును పూదండను వైచినదాయెను. ఒండొరువులను మిగుల బిగువుగాఁ గౌఁగిలించుకొని యున్న యా భద్రావిదూషకుల దేహములనుండి చిరసంభృత స్నేహము చెమురుమిషచేత వెలువడి నట్లుండెను.

పిమ్మట వారు కూర్చుండి ఎంతసేపటికిని తనివి తీఱక యొండొరువులఁజూచుచు మునుపటికంటె నూఱంతల మనోరథములు గలిగి యుండిరి. 'ఈ భూమి కెట్లు రాఁగలిగితివి?' అని భద్ర యడుగఁగా విదూషకుఁ డిట్లనియె: 'ఓ సుందరీ! నీమీఁది వలపు నవలంబించి ప్రాణాపాయముల నెన్నిటినో దాఁటి యిక్కడికి వచ్చినాఁడను. మఱి యేమి చెప్పుదును?' ఆమాట విని ప్రాణమునకు కూడ తెగించిన యా స్నేహము నెఱింగి అతనిమీఁద నత్యంత ప్రేమ కలిగి భద్ర యి ట్లనియె:—'ఆర్యపుత్త్రుఁడా! నాకు చెలికత్తెలతో పని లేదు, సిద్ధులతో పని లేదు. నీవే నాప్రాణమవు; నేను నీగుణములచే విలువఁబడిన దాసిని.' 'ఓప్రేయసీ, అట్లయిన ఈదివ్యభోగములను విడనాడి నాతో కూడ వచ్చి యుజ్జయినియందు నివసింపుము.' అని విదూషకుఁ డడిగెను. భద్రయు వెంటనే ఆమాట కంగీకరించి ఆసంకల్పముచేత విద్యలను తృణప్రాయముగా వదలి పెట్టెను.

అంతట విదూషకుఁడు భద్రాసఖి యోగేశ్వరి సకలోప చారములు చేయఁగా భద్రతోఁ గూడ ఆరాత్రి అక్కడనే విశ్ర మించి తెల్లవాఱఁగానే ఆమెతోఁ గూడ కృతకృత్యుఁడై ఉదయాద్రినుండి దిగి యమదంష్ట్రుని స్మరించెను. ఆతనికి తాను పోవలసినమార్గక్రమమును చెప్పి ఆతనిబుజ మెక్కి భద్రను కూడ తన ముందు ఎక్కించుకొనెను. ఆమెయు అత్యుగ్రుఁడయిన యా రాక్షసునిమీఁద ఎక్కెను: అనురాగపరాధీన లైన యంగనలు ప్రియునికై ఏమిచేయరు! విదూషకుఁ డట్లు ప్రియతోఁ గూడ రాక్షసుని ఎక్కి బయలుదేఱి మరల కార్కోటకనగరమునకు వచ్చి అచ్చట జను లందఱు రాక్షసదర్శనముచేత భీతభీతులై చూచుచుండఁగా ఆర్యవర్మరాజునొద్దకు పోయి తనభార్యను పంపు మని యడిగెను. ఆర్యవర్మయు అల్లునితో తద్బాహుపరాక్రమార్జిత యయిన యా భార్యను పంపెను. అంత విదూషకుఁడు ఆమెతోనుంగూడ మరల రాక్షసు నెక్కిపోయి సముద్రతీరమందు పూర్వము త్రాళ్లను కోసివైచిన యాపాపహృదయువణిజునియొద్దకు పోయి పూర్వమే ఓడయాటంకము తీర్చుటచే తా నార్జించిన యతని కొమారితను ధనములను హరించెను. విదూషకుఁడు ధనాపహరణమే ఆ పాపాత్మునికి ప్రాణహరణ మని తలంచెను. లోభులకు ప్రాయికముగా ప్రాణములు ధనసంచయములే గదా. పిమ్మట విదూషకుఁడు వణిక్పుత్త్రినిం గూడ రక్షోరథము నెక్కించుకొని మువ్వురు

భార్యలతోను ఆకాశమార్గమున నేగుచు తనపౌరుషముం బోలె సత్త్వసంరంభము గలదైన సముద్రమును వారికి చూపుచు దాటి, మరల పౌండ్రవర్ధనపురమునకు వచ్చి, ఇందఱు స్త్రీలతో రాక్షసవాహనుఁడై వచ్చుచున్న తన్నుఁ జూచి జను లెల్ల ఆశ్చర్యపడుచుండఁగా, రాజసదనమునకుఁ బోయి తన భార్యకు దేవసేనసుతకు నేత్రోత్సవము చేసెను. ఆమె తండ్రి కొంతకాల మచట నుండు మని ఎంత బలవంతపెట్టినను నిలువక విదూషకుఁడు స్వదేశోత్సుకుఁడై ఆ భార్యనుం గూడ చేకొని బయలువెడలి రాక్షసయోగమహిమచేత స్వల్పకాలములోనే ఉజ్జయినిని బహిర్గత మైన తన స్వదేశదర్శననిర్వృతిం బోలె కన్నులు తనియఁ జూచెను. మహాకాయుఁడైన యారాక్షసునిమీఁద బుజమున నున్నయాయంగనల దేహకాంతిచేత దేదీప్యమానుఁడై యున్న యా విదూషకుఁడు ఉజ్జయినీ జనులకు ఉదయాద్రిశిఖరమునందు జ్వలించుచున్న మహౌషధుల నడిమిచంద్రుఁడుంబోలె కనులం దనియించెను. జను లందఱు ఆశ్చర్యభయములలో మునిఁగి యుండ, ఇతని మామ ఆదిత్యసేనమహారాజు వృత్తాంతము నెఱిఁగి ఎదురుగా వచ్చెను. మామను చూచి తత్క్షణమే విదూషకుఁడు రాక్షసవాహనమును దిగి ప్రణమిల్లెను. మామయు సంతోషించెను. అనంతరము విదూషకుఁడు రాక్షసుని బుజమునుండి యా భార్యలనందఱను దింపి, వానిని యథేచ్ఛముగా పొమ్మని సెల

విచ్చెను. రాక్షసుఁడు పోఁగానే విదూషకుఁడు భార్యాసమే తుఁడై ఆమామగారితో కూడ రాజసదనమునకుఁ బోయి అచ్చట చిరోత్కంఠావశీకృత యైన తన ప్రథమభార్యను ఆరాజుకొమారితను ఆనందభరితం గావించెను. 'ఈ భార్య లను నీ వెట్లు సంపాదించితివి? ఆ రాక్షసుఁ డెవఁడు?' అని రా జడుగఁగా విదూషకుఁడు సర్వమును ఆయనకుఁ జెప్పెను. ఆప్రభావమునకు సంతోషించి కార్యజ్ఞుఁడై రాజు అల్లునికి తన యర్ధరాజ్యము నిచ్చెను. ఆవిప్రుఁడు తత్క్షణమే పరిచారకులు వెల్లగొడుగు పట్టి ఇరువింజామరలు వీవఁగా రాజాయెను. వెంటనే మంగళవాద్యఘోషచేత ఉజ్జయినీపురి కృతహర్ష నాదమో యన రాజిల్లు చుండెను. ఈప్రకారము విదూష కుఁడు రాజ్యవిభవమును పొంది క్రమ క్రమముగా సకలపృథి విని జయించి సకలరాజపూజితపాదపద్ముఁడై పరస్పరమత్సరము లేని యాభార్యలతో భద్రాసఖుఁడై చిరకాలము ఆనంద మనుభవించెను.

ఈప్రకారము దైవ మనుకూలముగా నున్నప్పుడు ధీరుల నిజసత్త్వమే లక్ష్మీరభసాకర్షణమహాసిద్ధమంత్ర మగును.

ఇట్లు వత్సరాజువలన ఈ యద్భుతకథను విని పార్శ్వ మందు కూర్చుండి యున్నమంత్రు లందఱును దేవేరు లిద్దఱును అత్యంతానందమును పొందిరి.

---

## ౫ - వ తరంగము.



అటు పిమ్మట యౌగంధరాయణుఁడు వత్సరాజుతో 'రాజా, నీకు దైవానుకూల్యము కలదు, పౌరుషమును గలదు; మేమును కొంచెము నీతిమార్గమును నేర్చి యున్నాము. కనుక ఆలోచించినప్రకారము త్వరగా దిగ్విజయము చేయుము.' అనెను. మంత్రివరేణ్యుఁ డిట్లు పలుకఁగా వత్సరాజు 'అదంతయు సరియే! కాని, మేలునకు ఎప్పుడును విఘ్నము లనేకములు. కనుక తన్నివారణార్థమయి సాంబమూర్తిని గూర్చి తపస్సు చేసెదను. శివప్రసాదము లేక మనోరథము లెట్లు సిద్ధించును?' అనెను. ఆమాట విని మంత్రులును రాముని సేతుబంధప్రయత్నమునకు కపీశ్వరులుం బోలె అతనితపఃప్రయత్నమునకు అంగీకరించిరి. అంతట దేవేరులతోను మంత్రులతోను తపస్సులో నుండి మూఁడుదినము లుపవసించిన వత్సరాజునకు శివుఁడు స్వప్నములో ప్రత్యక్షమై యిట్లానతిచ్చెను: 'మెచ్చితిని, లెమ్ము, నిర్విఘ్నముగా జయము పొందుదువు, నీకు త్వరలో సకలవిద్యాధరాధీశ్వరుఁ డగుపుత్త్రుఁడు గలుగును.' అంతట రాజు మేలుకొని సూర్యతేజస్సుచేత పాడ్యమిచంద్రుఁడుం బోలె శివప్రసాదముచేత సేద దేఱినవాఁ డాయెను. తెల్లవాఱఁగానే మంత్రులకును వ్రతోపవాసక్లాంతలైన కుసుమకోమలలకు దేవేరులకును ఆస్వప్నమును చెప్పి కర్ణోత్సవము చేసెను.

పీనులవిం దయిన యీస్వప్నవర్ణనముచేతనే తృప్తులైన యా రాణులకు ఆవినికి విభవానుభవమును ఫలించెడి మధురౌషధ మాయెను. ఇట్లు వత్సరాజు తపస్సుచేత పూర్వులయొక్క మహిమను పొందినవాఁడాయెను. అతని భార్యలును పతివ్రతల యొక్క పావనకీర్తిని పొందిరి. మఱునాఁడు ఉత్సవ పరాధీను లై పౌరులు ఆనందించుచుండ రాజు పారణ చేసికొనఁగా యౌగంధరాయణుఁడు రాజుతో ఇట్లు పలికెను.

నీవు ధన్యుఁడవు. ఎందుచేత ననఁగా నీకు సాంబమూర్తి ప్రసన్నుఁ డయినాఁడు. ఇఁకను శత్రులను జయించి భుజార్జిత యయినలక్ష్మిని అనుభవింపుము. లక్ష్మి స్వధర్మముచేఁ గలిగినేని రాజులవంశములో స్థిరముగా నుండును. స్వధర్మార్జితము లయిన సంపదలకు నాశము లేదు గదా. అట్లే నీపూర్వులు సంపాదించిననిధానము చిరకాలము భూమిలో పూడిపోయి నష్టమయ్యును నీకు దొరకినది. అందులకు నిదర్శనముగా ఈకథను వినుము.

దే వ దా సు ని క థ.

పూర్వము పాటలీపురములో మహైశ్వర్యసంపన్నుఁడు గొప్పకులమువాఁడు దేవదాసుఁ డను వైశ్యకుమారుఁ డొకఁ డుండెను. అతనిభార్య పౌండ్రవర్ధనపురమందు ధనికుఁ డైన యొక వర్తకునికొమారిత. తండ్రి స్వర్గస్థుఁడు కాఁగా దేవదాసుఁడు వ్యసనాసక్తుఁ డయి తన ధన మెల్ల జూదముచేత

కోలుపోయెను. అంత నతనిభార్య మహాదారిద్ర్యముచేత దుఃఖి తురాలు కాఁగా ఆమెను తండ్రి వచ్చి పౌండ్రవర్ధనపురమునకు కొనిపోయెను. కాలక్రమమున దేవదాసుఁడును విపత్తులచే నలఁగినవాఁడై వర్తకము చేసికొన నుంచి మొదటికై మామ గారిని యాచించుటకు పోయెను. సంధ్యాకాలమునకు పౌండ్రవర్ధనము చేరి తాను ధూళిధూసరితుఁడును చింపిగుడ్డల వాఁడు నై యుండుటం జూచుకొని యిట్లు చింతించెను. 'మామ గారియింట ఈదశతో నెట్లు ప్రవేశింతును! మానవంతునికి బంధువులయెదుట దైన్యముకంటె మరణము మేలు.' ఇట్లు ఆలోచించి అతఁడు వెలుపల బజారులో ఎక్కడనో ఒకదుకా ణములో నొకమూల రాత్రియందు కమలమువలె ముణుఁచు కొని యుండెను. పిమ్మట రవంతసేపటికి ఆదుకాణపుగృహము నకు ఎవఁడో ఒక వఱ్ఱెక్కుమూరుఁడు వచ్చి తలుపు తీసికొని లోపల ప్రవేశించుటయు వెంటనే అక్కడికే ఒకస్త్రీ నిశ్శబ్దము గా నడిచి వచ్చి తటాలున ఆయింటిలోపలికే ప్రవేశించుటయుఁ గాంచెను. లోపల దీపము మండుచుండుటచే దేవదాసుఁడు తొంగి చూచి ఆమెను తనభార్యనుగా ఆనవాలు పట్టెను. అంతలో ఆమె తలుపు వైచికొనఁగా, దేవదాసుఁడు, తనభార్య యిట్లు పరగామిని యైనదుఃఖము పిడుగుదెబ్బగా తగులఁగా, ఇట్లు తలపోసెను:— 'ధనహీనుని దేహము కూడ వదలును, స్త్రీలు వదలుట ఆశ్చర్యమా! మెఱుపుఁదీఁగలకుంబోలె స్త్రీలకు

చపలత స్వాభావికము కదా. వ్యసనసముద్రములో పడిన పురుషుల కిదే ఆపద. పుట్టినింట చేరిన స్వతంత్రురాలికి ఇదే గతి.'

ఇట్లు చింతించుచు అతఁడు వెలుపలనే యుండఁగా భార్యయొక్క యీ రతాంతవిస్రంభాలాపములు వినవచ్చెను. దేవదాసుఁడు తలుపునొద్దకు పోయి చెవి యొగ్గి వినుచుండఁగా ఆపాపాత్మురాలు ఉపపతితో నిట్లు ఏకాంత మాడుచుండెను:— 'వినుమీ, నీమీఁది యనురాగముచేత నొక పరమరహస్యమును చెప్పెదను.' నాపతికి వీరవర్మ యని ముత్తాత యొకఁడుండెను. అతఁడు ఇంటిముంగిటిలో నాలుగు మూలలయందును వరహాలతో నిండిన కాఁగులను నాలుగింటిని భూమిలో పూడిచిపెట్టి ఆరహస్యమును తనభార్యకు మాత్రమే చెప్పినాఁడు. అతనిభార్యయు తన యవసానకాలములో కోడలికి చెప్పినది. ఆమెయు తన కోడ లయిన నాయత్తకు చెప్పినది. ఆమెయు నాకే చెప్పినది. ఇట్లీరహస్యము నాపతియింట అత్తలక్రమముగా వచ్చి యున్నది. నేను ఆరహస్యమును నాపతికి చెప్ప నయితిని. అతఁడు జూదగాఁడు. వానిని చూచినయెడల నాకు చాల రోఁత. నీవు గదా నాకు పరమప్రియుఁడవు. నీవు అక్కడికి పోయి నాభర్తవలన ఆయింటిని ధన మిచ్చి విలిచి ఆకాఁగులును ఇక్కడికి తెచ్చుకొని వచ్చి నన్ను సుఖముగా పోషింపుము.' ఆ కుత్సితురా లిట్లు చెప్పఁగా దాని యుపపతియైన వణిజుఁడు అయత్నముగా నిధి లభించె నని తలఁచి ఆమెపై

కొనుచున్న వారికాంతల కుచౌన్నత్యమును కూడ సహింపఁ డాయెను. ఏడు పాయలుగా చీలిన గోదావరీ జలమును త్రాగి నందుననే కాంబోలు అతని యేనుఁగులు ఆ జలమును మద వ్యాజముచేత ఏడుచోట్లనుండి కార్చినవి.

పిమ్మట వత్సరాజు రేవానదిని దాఁటి ఉజ్జయినికి పోఁగా చండమహాసేనుఁడు అతని కెదురు వచ్చి తోడుకొని పోయెను. అచట వత్సరాజు కొప్పులనుండి జాఱుచున్న విరులసరులచే ద్విగుణశోభ కలవైన మాళవ స్త్రీల కడగంటిచూపుఁదూపులకు గుఱి యాయెను. మామగారు చేసినసత్కారములచేత అతఁడు తన కభీష్టము లైన స్వదేశభోగములను కూడ మఱచి అచటనే సుఖ ముండెను. వాసవదత్తయు తన సౌఖ్యమును గూడ ఒల్లదో యన తండ్రిచెంత నెడఁబాయక బాలభావమును స్మరించు కొనుచు నుండెను. చండమహాసేనుఁడు వాసవదత్తా సమాగమముచేత నెంత సంతసించెనో పద్మావతీసమాగమముచేత అంత సంతసించెను. కొన్నాళ్లు విశ్రమించి వత్సరాజు ప్రీతుఁడయి మామగార్లను సైన్యములును వెంట రా పడమటిదిక్కుపై దాడి వెడలెను. అతని కత్తి వాస్తవముగా ప్రతాపాగ్ని యొక్క పొగ, కాదేని ఏల యట్లు లాట స్త్రీలనేత్రములను బాష్పపూర్ణ ములను చేయును. ఇతఁడు తన్ను సముద్రమును త్రచ్చుటకై పెకలించును అనుభయమునంబోలె మందరము. అతని యేనుం గుల తాఁకున కంపిల్లు చుండెను. నిజముగా వత్సరాజు సూర్యా

దులకంటె విలక్షణుఁడైన యొక తేజస్వి; ఎట్లనఁగా ఇతఁడు పడమటిని జయించి పడమట ఉత్కృష్ట మయిన యుదయమును పొందెను.

పిమ్మట వత్సరాజు కుబేరతిలకయు అలకాసంగశంసినియు కైలాసహాసనుభగయు నగు నుత్తరదిశను అభిసరించెను. రాముడుం బోలె వత్సరాజు సింధురాజును వశీకరించి హరిసైన్యములు వెంటరా రాక్షసులనుంబోలె మ్లేచ్ఛులను పరిమార్చెను. తురుష్కుల గుఱ్ఱపు సమూహములు కలఁగిన సముద్రంపుఁదరంగములువోలె అతని గజేంద్రసంఘము లనెడు చెలియలికట్ట యడవులలో చీలి పోయినవి. శ్రీమంతుఁడా పురుషోత్తముఁడు గృహీతారికరుఁడై రాహువుంబోని పారసీకరాజుతలను ఖడించివైచెను. హూణాహానికరుఁడైన యాతని కీర్తి దిక్కుల నెల్ల మ్రోఁగించి అపరగంగయో యన హిమాచలమందు వ్యాపించెను. భయత్రసితశత్రుండైన యతని సేనల సింహనాదములకు ప్రతినాదము కేవలము గిరిగహ్వరములయందే ఉద్భవించుచుండెను. అప్పుడు కామరూపేశ్వరుఁడు కూడ ఛత్రిశూన్య మయిన శిరస్సుతో నతనికి నమస్కరించి విచ్ఛాయత్వమును పొందుట ఆశ్చర్యము గాదు. కామరూపేశ్వరుఁడు వత్సరాజున కిచ్చిన యేనుఁగులం జూడఁగా జంగమశైలములను ఏనుఁగులనుగా మార్చి యిచ్చినట్లుండెను. అట్టి యా నాగములను కొని యతఁడు మరలి పోయెను.

ఈప్రకారము వత్సరాజు ససైన్యుఁడయి విజయము చేసి మగధరాజయిన పద్మావతీజనకుని నగరము చేరెను. ఇద్దఱు దేవేరులతోను ఇతఁడు రాఁగా మగధరాజు రాత్రితోను వెన్నెలతోను గూడినచంద్రునిరాకకు మన్మథుఁడుం బోలె ఉత్సవము పొందినవాఁ డాయెను. మొదట అజ్ఞాతయై తనయింట నుండినదియు ఇప్పుడు వ్యక్తముగా తనయింటికి వచ్చినదియు నైన వాసవదత్తాదేవిని ఆయన అధికగౌరవమునకు ఆస్పదముగా భావించెను. జేత యయిన వత్సరాజు తన్ను పౌరు లందఱతోను మగధరాజు గౌరవింపఁగా అనురాగాగతము లైన సమస్తజనచిత్తములచేతను అనుగతుఁడై నేల యీనిన యట్లు లెక్కలేని సేనలు వెంటఁ గొలుచుచు రాఁగా తన లావాణకమునకు పోయెను

---

## ౬. వ తరంగము.

పిమ్మట లావాణకములో వత్సరాజు సేనావిశ్రాంతి కొఱకు ఏకాంతమున యౌగంధరాయణునితో ని ట్లనియె.— 'మంత్రివర్యా, నీబుద్ధిప్రభావముచేత భూమియందలి సకలరాజులును ఉపాయపూర్వకముగా జితు లయినారు. వా రెవరును మరల తిరుగఁబాటు చేయరు; వారాణసీపతి యొకఁడుమాత్రము చెడ్డతలంపు గలవాఁడు. అతఁడుమాత్రము వికృతిని పొందు నని తలంచెదను. కుత్సితులను నమ్మవచ్చునా?' ఇట్లు వత్సేశ్వ

రుఁడు పలుకఁగా యౌగంధరాయణుఁడు ఉత్తరము చెప్పుచు న్నాఁడు:—రాజా! బ్రహ్మదత్తుఁడు ఇఁక వికృతుఁడు గానేరఁడు. అతనిని పరాక్రమముచేత పట్టినారము. నీవు అతనిని మిగుల గారవించితివి. తెలివిగలవాఁ డెవఁడు మేలు చేయువానికి కీడు చేయును ? అందులకు నిదర్శనముగా నొక కథను చెప్పెదను వినుము.

సోమదత్తుని కథ.

పూర్వము పద్మదేశములో అగ్నిదత్తుఁ డని ప్రసిద్ధుఁడు ఒక బ్రాహ్మణుఁడు రా జిచ్చిన యగ్రహారము ననుభవించుచు ఉండెను. అతని కిద్దఱు కుమారులు. అందు పెద్దవానిపేరు సోమదత్తుఁడు. రెండవవానిపేరు వైశ్వానరుఁడు. పెద్దవాఁడు మూర్ఖుఁడు అందగాఁడు దుర్వినీతుఁడు. రెండవవాఁడు విద్వాంసుఁడు వినయవంతుఁడు అధ్యయనప్రియుఁడు. వారు తమకు వివాహములై తండ్రి పరలోకమునకు పోయినపిమ్మట తమయగ్రహారాదికమును చెఱిసగము పంచుకొన్నారు. వారిలో చిన్నవాఁడు రాజసమ్మానము పొంది సుఖముగా నుండెను. పెద్దవాఁడు చపలుఁడై క్షత్రియకర్మ చేయుచుండెను. ఒకనాఁడు అతఁడు శూద్రుల గోష్ఠిలో కేరుచుండఁగా అతని తండ్రికి స్నేహితుఁడగు నొక బ్రాహ్మణుఁ డొకఁడు చూచి 'ఓరీ, నీవు అగ్నిదత్తుని కుమారుఁడ వయ్యును మూర్ఖుఁడవై శూద్రునివలె తిరుగుచున్నావు. రాజపూజ్యుఁ డగు నీ తమ్ముని జూచియైనను

నీవు లజ్జ తెచ్చుకోవేమి?' అనెను. ఆమాట విని కోపగించి సోమదత్తుఁడు ఆ బ్రాహ్మణుని మీఁదికి పరుగెత్తిపోయి గౌరవము లేక కాలితో తన్నెను. అంత నా బ్రాహ్మణుఁడా తాపునకు కోపగించి తత్క్షణమే కొందఱు బ్రాహ్మణులను సాక్ష్యము పెట్టి రాజుతో పిర్యాదు చేసికొనెను. రాజు సోమదత్తుని ఖయిదులో వైవ్రఁడని భటులను పంపెను. వారిని సోమదత్తునిమిత్త్రులు ఆయుధపాణులై పరిమార్చిరి. అంతట రాజు మిగుల నాగ్రహించి మరల విశేష మయిన బలమును పంపి అతనిని పట్టించి తెప్పించి కొఱుత వైవ నాజ్ఞాపించెను. ఆతనిని తలవరులు శూలముపైకి ఎక్కించుచుండఁగా ఎవరో త్రోసినట్లు అతఁడు క్రిందఁ బడెను. క్షేమపడ నున్నవానిని అదృష్టమే రక్షించును గదా. మరల తలవరులు శూలము నెక్కింప నుద్యోగించి అంధు లయినారు. తత్క్షణమే రాజు వైశ్వానరుని విన్నపములచేత అతని వృత్తాంతము నెఱిఁగి ఆ మరణాజ్ఞను ఆఁపు చేసెను. చావు తప్పి సోమదత్తుఁడు రాజావమానముచేత భార్యతోఁ గూడ దేశాంతర మేఁగ యత్నించెను. అందుసకు బంధువు లందఱు ఏకవాక్యముగా వల దని ఆటంకపఱుపఁగా రాజాగ్రహారార్థమును వదలిపెట్టి అక్కడనే నివసించి యుండెను.

పిమ్మట వృత్త్యంతరము లేక సేద్య మారంభించి అందునకు తగినభూమిని వెదకుటకు నుంచిదినమున అడవికి పోయెను. అచ్చట నొక భూభాగము ఫలవంతముగా నగపడెను. దాని

నడుమ గొప్ప రావిచెట్టుండెను. కల్యాణఘనచ్ఛాయాచ్ఛన్న సూర్యాంశుశీతలమై పతాకాకాలమువలె నున్న యాచెట్టును చూచి కృషవృద్ధి యైన సోమదత్తుఁడు సంతోషించెను. 'ఈ చెట్టు మీఁద నెవఁడు కలఁడో అతనికి నేను భక్తుఁడను.' అని పలికి అతఁడు దానికి ప్రదక్షిణము చేసి నమస్కరించెను. పిమ్మట మంగళ మాచరించి రెండెడ్లను తెచ్చి అరక కట్టి చెట్టునకు బలి యిచ్చి అచట సేద్య మారంభించెను. ఆచెట్టుక్రిందనే రేయుం బగలు వసించెను. అక్కడికే వానిభార్య భోజనము తెచ్చుచు ఉండెను. యథాకాలము సస్యము పండఁగా దైవవశమున పర రాష్ట్రమువారు వచ్చి ఆపొలమును దోఁచుకొని పోయినారు. శత్రువులదండు పోయినతరువాత, సస్యము దోపుడు పోయినందు లకు, ఏడ్చుచున్న భార్యను సత్త్వవంతుఁడైన సోమదత్తుఁడు ఓదార్చి మిగిలిన రవంతధాన్యమును ఇంటికి కొనిపోయెను. యథాప్రకారము బలి యిచ్చి ఆచెట్టుక్రిందనే కూర్చుండి యుండెను. ఆపదయందు ఎక్కువ దార్ఢ్యము కలిగి యుండుట ధీరుల స్వభావము గదా. చింతచే నిద్ర పట్టక అతఁడు రాత్రి ఒంటరిగా ఉండఁగా ఆరావిచెట్టునుండి యీవాక్కు వినఁ బడినది. "ఓసోమదత్తుఁడా! నీవిషయమై సంతోషించితిని; నీవు శ్రీకంఠ దేశములోని యాదిత్యప్రభమహారాజుయొక్క రాష్ట్ర మునకు పొమ్ము. అక్కడ రాజ ద్వారమందు నిలిచి సదా సంధ్యా గ్నిహోత్రమంత్రములను పఠించి యిట్లు పలుకుము:—'నేను

బ్రాహ్మణుఁడను, నాపేరు ఫలభూతి. నామాట వినుఁడు: మంచి చేయువాఁడు మంచినిపొందును, చెడుగు చేయువాఁడు చెడుగు నొందును.' ఇట్లు పలుకుచు విస్తారము భాగ్యమును పొందుదువు. సంధ్యాగ్నిహోత్ర మంత్రమును నేనే చెప్పెదను, నేర్చుకొమ్ము; నేను యక్షుఁడను." అని చెప్పి తన మహిమచేత తత్క్షణమే ఆతని కా మంత్రమును నేర్పి అశ్వత్థమందలి యావాఁడే అంతర్ధానము పొందెను.

తెల్లవాఱఁగానే సోమదత్తుఁడు భార్యను తోడ్కొని బయలువెడలి యక్షుఁడు పెట్టిన ఫలభూతి నామధేయమును వహించి తన దుర్దశలనుంబోలె చుట్టుకొనిన యడవులను దాఁటి శ్రీకంఠదేశమునకు పోయెను. అచట రాచనగరిద్వారమునందు సంధ్యాగ్నిమంత్రములను చదివి చక్కఁగా తనపేరు ఫలభూతి యని వినిపించుచు 'మంచి చేయువాఁడు మంచిని పొందును, చెడుగు చేయువాఁడు చెడుగు నొందును.' అని లోకులకు వింత యగునట్లు పలుకుచుండెను. మాటిమాటికి ఇట్లితఁడు పలుకుట విని ఆదిత్యప్రభుఁడు కుతూహలముచేత ఫలభూతిని ఆస్థానికి రప్పించుకొనెను. అచ్చట ప్రవేశించి అతని యెదుటను ఆ మాటనే సోమదత్తుఁడు పలికెను. అందునకు రాజు పార్శ్వవర్తులతోఁ గూడ నవ్వెను. సామంతసమేతుఁడై రాజు అతనికి వస్త్రాభరణములును గ్రామములును ఇచ్చెను. గొప్పవారి సంతోషము వ్యర్థము కాదు గదా.

ఇట్లు ఫలభూతి పేద యయ్యు గుహ్యకానుగ్రహముచే తత్క్షణమే రాజువలన నైశ్వర్యవంతుఁ డాయెను. సర్వదా ఆమాటనే పలుకుచు రాజునకు ప్రియుఁ డాయెను. ప్రభువుల మనస్సు వినోదపరాయణము గదా. క్రమక్రమముగా ఇతనిని రాజగృహమందును రాష్ట్రికులలోను అంతఃపురములలోను రాజప్రియుఁ డని ఎల్లవారును ప్రీతితోను గౌరవముతోను చూచుచుండిరి.

ఒకనాఁడు ఆదిత్యప్రభభూపాలుఁడు ఆకస్మికముగా వేఁటనుండి వచ్చి అంతఃపురమునకు పోయి ద్వారపాలకుల తొట్రుపాటుచేత శంక వహించి లోపల ప్రవేశించినవాఁడై దేవతార్చన చేయుచున్న తనపట్టపుదేవిని కువలయావళిని చూచెను. ఆమె దిగంబరయు ఊర్ధ్వకేశియు నై కన్నులు మూసికొని పెద్ద సిందూరతిలకము ధరించి జపముచే పెదవు లదరుచుండ చిత్రవర్ణంపు ముగ్గుల మహామండలము నడుమ కూర్చున్నదై రక్తమును సారాయిని మహామాంసమును బలిపెట్టి యుండెను. ఆమెయు రాజు ప్రవేశింపఁగానే తటాలున వస్త్రమును చుట్టుకొన్నదై 'ఇదే మ' ని రాజడుగఁగా ముందు అభయము వేఁడి తత్క్షణమే యిట్లు వక్కాణించెను. 'ఓ ప్రభూ, నేను నీయభ్యుదయముకొఱకే ఈ పూజ చేయుచున్నాను. దీని విషయమైన యోగవృత్తాంతమును సిద్ధిని వినుము. పూర్వము నేను కన్యనై పుట్టినింట నుండఁగా నొకప్పుడు వసంతోత్సవములో నాచెలులు

ఉద్యానవనమందు నాతో ని ట్లనిరి: 'ఈయుద్యానములో చెట్ల గుబురునడుమ దేవదేవుఁడు విఘ్నేశ్వరుఁ డున్నాఁడు. ఆయన మిక్కిలి సత్యము గలదేవుఁడు, కోరినవరము లిచ్చువాఁడు; ఆయనప్రభావము ప్రసిద్ధము; అతనిని పూజింపుము. నిర్విఘ్నముగా నీకు మంచిమగఁడు కలుగును.' ఆమాట విని నేను ముగ్ధత్వముచేత 'ఏమీ? వినాయకపూజచే కన్యకలకు భర్త కలుగునా?' అని యడిగితిని. అంతట వారు 'ఏమి ఇ ట్లడిగెదవు? ఆయనను పూజింపనియెడల ఎవరికిని ఎందులోను సిద్ధి గలుగదు. ఆయన ప్రభావమును వర్ణించెదము వినుము.' అని నా వయస్యలీకథను వర్ణించిరి.

పూర్వము తారకాసురునివలని బాధలు పడలేక దేవేంద్రుఁడు తనకు సేనాధిపతి కాఁగలవాఁడుగా సాంబమూర్తి కొక కుమారుఁడు కలుగును గాక యని కోరుచు, ఆయత్నములో తుంటవిల్తుఁడు దగ్ధుఁ డగుచు, ఊర్ధ్వరేతస్కుఁడును అత్యుగ్రుఁడును మహాదీర్ఘతపఃస్థితుఁడును అగు నా త్ర్యంబకుని గౌరి తపంబుసలిపి ప్రార్థించి పొంది, తన కొకసుతుని, మదనునికి ప్రాణమును, వేఁడెను; సిద్ధికొఱకు విఘ్నేశ్వరపూజను ఆమె స్మరింపదాయెను. తనకోరిక సిద్ధి తెలియఁబఱుచుకొన్న యుమాకన్యకతో శివుఁ డి ట్లనియె: "ప్రాణేశ్వరీ, పూర్వము ప్రజాపతిమనస్సునుండి మన్మథుఁడు జన్మించి మదముచేత వెంటనే 'ఎవరిని దర్పింపఁ జేయుదును?' అని యతని నడిగెను. అందుచేతనే చతుర్ముఖుఁడు

అతనికి కందర్పుఁడని పేరు పెట్టి, 'పుత్త్రా, నీకు గర్వము అంత యెక్కువగా నున్నయెడల త్రినేత్రుని మాత్రము అతిక్రమింపకుము; అతిక్రమింతువేని చత్తువు.' అని చెప్పెను. ఇట్లు బ్రహ్మ చెప్పియున్నను ఆ శిశువు నన్ను కలంచుటకై వచ్చి నాచేత కాలిపోయినాఁడు. వానికి దేహముతోడి పుట్టుక మఱి కలుగదు. నీకు పుత్త్రుని నేనే నాశక్తిచేతనే పుట్టించెదను. నాకు సంతానము లోకులకుంబోలె మదనోత్సాహహేతుకము గాదు గదా." ఈప్రకారము వృషలాంఛనుఁడు పార్వతితో చెప్పుచుండఁగా, అచ్చటికి బ్రహ్మదేవుఁడు దేవేంద్రసమేతుఁడయి వచ్చి స్తోత్రములచే అతనిని మెప్పించెను. శివుఁడును తారకాసురుని పరిమార్చు నౌరసపుత్త్రుని దేవియందుం బడయ నంగీకరించెను. అజుని ప్రార్థనచేత సృష్టికి భంగము లేకుండుటకై కామునికి ప్రాణుల మనస్సులయందు మూర్తి లేకయే జన్మము కలుగునట్లును అంగీకరించెను. తన చిత్తములోకూడ మనోభవునికి ప్రవేశ మనుగ్రహించెను. బ్రహ్మయు సంతోషించి వెడలి పోయెను. పార్వతియు మోదము నొందెను.

దినములు గడువ ఒకనాఁడు ఏకాంతమందు శంకరుఁడు కామకేళి నంగీకరించెను. నూర్లకొలఁది సంవత్సరము లయినను క్రీడ ముగియదు. ఆయుపమర్దముచేత ముల్లోకములును కంపిల్ల సాగెను. అంతట లోకవినాశభయముచేత బ్రహ్మానిదేశంబున దేవతలు ఆక్రీడకు విఘ్నము చేయుటకై అగ్ని దేవుని స్మరించిరి.

అగ్నియు వారు తలఁచినవెంటనే మదనాంతకుఁడు దుర్ధర్షుఁడని యెఱిఁగి పలాయితుఁడై నీళ్లలో దాఁగెను. అతని తేజస్సుచే దహ్యమానము లై కప్పలు అతనిని వెదకుచున్న దేవతలకు అతఁడు నీట దాఁగియున్నాఁడని చెప్పినవి. అంత నగ్ని కప్పల మాట అస్పష్ట మగునట్లు శపించి అంతర్ధానముపొంది మందరము నకు పోయెను. అచ్చటికి వెదకుచు వచ్చిన దేవతలకు చెట్టు తొఱ్ఱలలో నత్తగుల్ల రూపముననున్న యతనిని గజ శుకములు చెప్పినవి. అంత నగ్ని గజ శుకములకు జిహ్వావిపర్యాసము కలుగు నట్లు శాపముపెట్టి దేవతలకు దర్శన మిచ్చినవాఁడై, వారు తన్ను స్తుతులు చేయఁగా వారి కార్యమును పూనుకొనెను. అంతట నగ్ని యచటనుండి పోయి తన వేఁడిచేత క్రీడనుండి శివుని నివా రించి శాపభయముచేత ఆయనకు ప్రణమిల్లి దేవకార్యమును నివేదించెను. శివుఁడును ఆగ్రహవేగుఁడై అగ్నియందు తన తేజ స్సును నిక్షేపించెను. దానిని ధరించుటకు శక్తి అగ్నికిని లేదు, అంబికకును లేదు. అంతట 'నీవలన నాకు తనయుఁడు గలుగఁ డాయెను' అని ఖేదకోపాకుల యయినదేవితో హరుఁ డిట్లని యె. 'నీవు విఘ్నేశపూజ చేయనందున నీకు ఈవిఘ్నము కలిగినది. అతనిని పూజింపుము. మనకు అగ్నియందు కుమా రుఁడు కలుగును'. అనెను. ఆమాట ప్రకారము గౌరి విఘ్నేశ్వర పూజ చేసెను. అగ్నిదేవుఁడును సగర్భుఁడాయెను. ఆ శాంభవ తేజస్సును భరించి అగ్నిదేవుఁడు పగటివేళఁగూడ అంతఃప్రవిష్ట

చండాంశుండునుం బోలె ప్రకాశించెను. పిమ్మట నతఁడు దానిని భరింపలేక గంగయందు వమనము చేసెను. గంగయు దానిని హరాజ్ఞచేత మేరువునందు వహ్నికుండములో నుంచెను. అచ్చట ఆగర్భము శాంభవగణముచేత రక్షితమై వేయివత్సరములకు ఆఱుమొగముల కుమారుఁ డాయెను. ఆకుమారుఁడు గౌరీ నియుక్త లయిన యాఱుగురు కృత్తికల పాలిండ్లను ఆఱుమొగములతోను త్రాగి కొలఁదిదినములలోనే ఎదిగెను.

ఈలోపల దేవేంద్రుఁడు తారకాసురునికి ఓడిపోయి యుద్ధము మాని దుర్గమము లయిన మేరుశృంగములలో కాలము గడపుచుండెను. అంత దేవతలును ఋషులును షణ్ముఖుని శరణుఁ జొచ్చిరి. షణ్ముఖుఁడును దేవతలను రక్షించువాఁడై వారిచే పరివేష్టింపఁబడెను. అంత ఇంద్రుఁడు తనరాజ్యము షణ్ముఖునిచేత హరింపఁబడిన దని తలఁచి మాత్సర్యముచేత అతనిమీఁదికి పోయి యుద్ధము చేసెను. ఇంద్రుని వజ్రాయుధపుదెబ్బకు షణ్ముఖునిదేహమునుండి శాఖ విశాఖు లని యమితతేజులు ఇద్దఱు పుత్త్రు లుద్భవిల్లిరి. సపుత్త్రుఁడై యింద్రుని పరాక్రమమును ఆక్రమించి యున్నయాషణ్ముఖునియొద్దకు శివుఁడు స్వయముగా వచ్చి యుద్ధమునుండి నివారించి 'తనయా, నీవు తారకుని చంపను ఇంద్రునిరాజ్యమును రక్షింపను జన్మించితివి. కనుక ఆకార్యమును చేయుము.' అని శాసించెను. అంత ప్రీతుఁడై దేవేంద్రుఁడు మహేశ్వరునికి నమస్కరించి, తత్క్షణమే షణ్ము

ఖునికి సైనాపత్యాభిషేకము చేయుటకు ఉపక్రమించి స్వయముగా కలశ మెత్తఁగా చేయి నిగుడుకొనిపోఁగా మనస్సులో చింతింప సాగెను. అంతట శంకరుఁడు 'ఓయి, నీవు సేనాపతిని కోరునప్పుడు గజముఖుని పూజింప వైతివి. అందువలన నీ కీ విఘ్నము కలిగినది. కనుక అతనిని పూజింపుము.' అనెను. ఆమాటవిని శచీపతి ఆప్రకారమే చేసెను. అంతట బిఱ్ఱబిగిసి కొన్న యీచేయి సరిగా వచ్చెను. అంత నింద్రుఁడు సేనానికి అభిషేకోత్సవమును చక్కఁగా నెఱవేర్చెను. పిమ్మట స్వల్ప కాలములోనే సేనానియు తారకాసురుని సంహరించెను. దేవతలు సిద్ధకార్యులై సంతసించిరి. గౌరియు పుత్రవంతురాలై సంతోషించెను. ఓదేవీ, ఈరీతిగా దేవతలకుఁగూడ విఘ్నేశ్వర పూజలేక సిద్ధులు కలుగవు. కనుక నీవును మంచి మగనికై ఆయనను కొలువుము.

ఆర్యపుత్త్రా, ఈప్రకారము చెలులు చెప్పఁగా నేను ఉద్యానములో ఏకాంతమందు వినాయకుని పూజించితిని. పూజ ముగియఁగానే నాచెలు లాకస్మికముగా తమ సిద్ధిప్రభావముచేత ఆకాశమున కెగిరి విహరించుచుండిరి. వారిని చూచి నేను ఆశ్చర్యపడి కౌతుకముచేత వారిని క్రిందికి పిలిచి అట్టి సిద్ధులు వారి కెట్లు కలిగినవో అడిగితిని. అందులకు వా రిట్లనిరి. 'ఇవి నరమాంస భక్షణముచేఁ గలిగిన డాకినీ మంత్రసిద్ధులు. ఇవి మాకు నేర్పినగురువు కాళరాత్రి యను బ్రాహ్మణి.' ఇట్లు

సఖులు చెప్పఁగా నేనును ఆకాశగమనసిద్ధిలోలుపనై నాకుఁ గూడ ఆయుపదేశము చేయింపుఁ డని వారిని వేఁడితిని. అంత నాప్రార్థనమీఁద వారు వెంటనే పోయి అక్కడికే వికటాకృతిని కాళరాత్రిని తోడ్కొని వచ్చిరి. కలసికొన్నబొమలు, గాజుకన్నులు, చప్పిముక్కు, లావుచెంపలు, పెద్దపెదవులు, నోటినిండ పండ్లు, కొంగమెడ, వ్రేలుచన్నులు, పెద్దబొజ్జ, చీలిన మెగుడు పాదములును, కలదై ఆమె బ్రహ్మదేవుఁడు తన విరూపనిర్మాణచాతుర్యని మూర్తి నొందించి తెచ్చి చూపెనా యనున ట్లుండెను. ఆమెపాదములకు నేను నమస్కరించితిని. *స్నానము చేసి విఘ్నేశ్వరపూజ చేసి సిద్ధముగా నున్న నన్ను దిగంబరనుగా మండలములో కూర్చుండఁబెట్టి నాచేత భయంకరమైన భైరవార్చనను చేయించి భోజనార్థము దేవతార్చనయందు బలిపెట్టిన నరమాంసము నిచ్చెను. అంత నేను మంత్రముల గ్రహించి మహామాంసమును భుజించి దిగంబరముగానే చెలులతోఁగూడ ఆకాశమున కెగిరితిని. కొంతసేపు ఆకాశములో విహరించి పిమ్మట గుర్వాజ్ఞచేత దిగి నాకన్యాంతఃపురమునకు పోయితిని. ఇట్లు నేను బాల్యమందే డాకినీచక్రవర్తిని నైతిని. అక్కడ మే మందఱము చేరి ఎందఱనో మనుజులను భక్షించితిమి. ఈకథలో ఓమహారాజా, మఱియొక యుపకథను వినుము:—

## కాళరాత్రికథ.

కాళరాత్రిభర్త పేరు విష్ణుస్వామి. ఆయన వేదవిద్యావిశారదుఁడు, ఆదేశమందు ఉపాధ్యాయుఁడై నానాదిగంతరాగతు లయిన శిష్యులకు అధ్యయనము చెప్పుచుండును. ఆశిష్యులలో సుందరకుఁ డని పఁడుచువాఁ డొకఁ డుండెను. అతనిశీలము సౌందర్యమునకు అలంకారముగ నుండెను. ఒజ్జసాని యైనకాళరాత్రి ఎక్కడికో భర్త పోయి యుండఁగా నతని నొకప్పుడు కామించి ఏకాంతమందు వరించెను. నిశ్చయముగా మన్మథుఁడు హాస్యాస్పదు లయిన విరూపులతో అధికముగా క్రీడించును; అట్లే ఆమె తన వికారరూపమును పాటిసేయక సుందరకుని కామించెను. ఎంత బతిమాలుకొన్నను అతఁడు దురాచారమునకు అంగీకరింపఁడాయెను. స్త్రీలు ఎట్లయినను విపరీతము చేయుదురుగాక; సత్పురుషుల మనస్సు నిశ్చలము గదా. అంత నతఁడు అవతలికి పోఁగానే కాళరాత్రి క్రోధముచే నఖక్షతములతోను దంతక్షతములతోను తన యొడలు తానే చీరుకొని తల విరియఁ బోసికొని చీరను సడల్చి నైచి, విష్ణుస్వామి ఇంటికి వచ్చువేళకు ఏడ్చుచుండెను. అతఁడు రాఁగానే 'చూడు, నాథా, సుందరకుఁడు నన్ను బలాత్కరింపఁ గోరి ఏపాటు చేసినాఁడో.' అనెను. ఆపలుకు విని యుపాధ్యాయుఁడు క్రోధముచె మండిపడెను. స్త్రీలయందలి నమ్మకము విద్వాంసులకుఁ గూడ తెలివిని హరించును. సాయంకాలమందు సుందర

కుఁడు ఇంటికి రాఁగానే ఉపాధ్యాయుఁడు శిష్యులతోఁ గూడ పరుగునంబోయి వానిమీఁదఁ బడి పిడికిళ్లం బొడిచి పాదములం దన్ని దుడ్డుఁగఱ్ఱలతో మోఁదెను. దెబ్బలచే సొమ్మసిల్లి పడి పోయినంతట వానిని కనికరములేక శిష్యులచేత బైట నొక పెద్దవీథిలో పాఱవేయించెను.

పిమ్మట సుందరకుఁడు కొంతసేపటికి రాత్రి గాలి వీవనలచేత కొంచెము తెలివి రాఁగా అట్లు భంగపడియున్న తన్నుఁ జూచుకొని యిట్లు చింతించెను:— "ఆహా! రజో లంఘితాత్ము లయిన పురుషులకు స్త్రీప్రేరణ యనునది సర స్సులకు సుడిగాలివ్రాలె అంతఃక్షోభమును కలిగించును గదా. కాదేని యుపాధ్యాయుఁడు పెద్ద యయ్యును విద్వాంసుఁ డయ్యును అతిక్రోధముచేత నావిషయమై యిటులు విపరీత మాచరించునా? కాక, సృష్ట్యాదినుండి విద్వాంసు లగు బ్రాహ్మణులకుఁ గూడ కామక్రోధము లనెడు రెండు మోక్షద్వా రంపుగడియలు కలవు. అట్లే గదా! మునీశ్వరులు దారుకావన ములో పూర్వము స్వభార్యాభ్రంశ శంకచేత శివునిపైఁ గూడ అలుగ లేదా? అతఁడు దేవుఁడనియు, క్షపణకాకృతిని వహించి నాఁడనియు, మునులకుం గూడ నెట్టి యశాంతతయో చూడు మని యుమకు చూపఁగోరినాఁడనియు, ఏ మయినఁ దెలిసికొ నిరా? ఆయనను ముందు శపించి పిమ్మట త్రిజగత్క్షోభకారి యగు మహాదేవుఁ డని తెలిసికొని ఆయననే గదా శరణుఁజొచ్చిరి. ?

ఈప్రకారము కామక్రోధాద్యరిషడ్వర్గముచేత వంచితు లయి మునులు కూడ మోహముపాలగుచున్నారు. శ్రోత్రియుల మాట చెప్పవలయునా? "ఇట్లని సుందరకుఁడచ్చట తలపోయుచు దొంగభయముచేత ఆచెంగటి యొక పాడుపసులసాల మేడయందు అణఁగి యుండెను. అందొకచోట క్షణకాలము దాఁగి యుండునంతలో అక్కడికే కాళరాత్రి వచ్చినది. కాళరాత్రి వీరులు దాల్చు సురకత్తిని దూసి చేతఁ గొని, భయంకరముగా ఘూత్కరించుచు, నోటను కన్నులను మంటలకొలుపులు గ్రక్కుచు, డాకినీచక్రముతోఁ గూడుకొని వచ్చెను. సుందరకుఁడు ఆమెను ఆచోట ఆరూపునంజూచి భయపడి రక్షోహరణ మంత్రములను స్మరించుకొనుచుండెను. భయముచేత ఒడలంత ముణుఁచుకొన్నవాఁడై ఒకమూల దాఁగి యున్న యతనిని ఆమెయు ఆమంత్రములచేత మోహితురాలై చూడదాయెను. పిమ్మట ఆమె పైకెగురుమంత్రమును ఉచ్చరించి సఖులతోఁ గూడ ఆ గోవాటహర్మ్యముతోఁగూడ ఆకాశమార్గమున త్వరగా ఉజ్జయినికిఁ బోయెను. ఆమంత్రమును సుందరకుఁడు విని గ్రహించెను. ఆమె ఆమేడను ఒకకూరగాయలతోఁటలో దింపిపోయి వల్లకాటిలో డాకినీచక్రమధ్యస్థయై క్రీడించుచుండెను. సుందరకుఁడు ఆఁకట డస్సి ఆతోఁటలో దిగి అక్కడ ముల్లంగి దుంపలను త్రవ్వుకొని భక్షించి యథాప్రకారము ఆగోవాట హర్మ్యము నెక్కి యుండెను. అంతట కాళరాత్రి రాత్రిమధ్య

ముందు ఆసంకేతమునుండి వచ్చి గోవాటము నెక్కి మునుపటి వలెనే శిష్యులతోఁగూడ రాత్రియే తనయింటికి పోయెను. కాళరాత్రి ఆగోవాటవాహనమును ఎప్పటిచోట నిలిపి యను చరులను పంపి, తాను పడుకగది ప్రవేశించెను.

సుందరకుఁడు ఆవిఘ్నమునకు ఆశ్చర్యపడి రాత్రి గడపి తెల్లవాఱఁగానే గోవాటమునుండి చెలికాండ్రయొద్దకుఁ బోయి తనవృత్తాంతమును చెప్పుకొని పరదేశము పో నుద్యమింపఁ వారు ఓదార్చి నిలిపిరి. అంత నాతఁడు ఒజ్జ యిల్లు వదలి సత్రములో భుజించుచు చెలికాండ్రతోఁ గూడి స్వేచ్ఛగా తిరుగు చుండెను. ఒకనాఁడు కాళరాత్రి ఇంటిసామాను విలుచుటకు వెలువడినదై బజాఱులో సుందరకుని చూచి స్మరాతురయై సమీపించి మరల 'సుందరకా, నాప్రాణము నీయధీనమురా, నన్నుఁ గూడరా.' అని వేఁడుకొనెను. సజ్జనుండు సుందరకుఁడు 'అమ్మా, యిట్లు పలుకకు; ఇది ధర్మముగాదు. నీవు నాకు గురుభార్యవు' తల్లివి, అనెను. అంతట కాళరాత్రి 'నీవు ధర్మ మెఱుంగుదువేని నాకు ప్రాణదానము చేయుము. ప్రాణదానముకన్న నధిక ధర్మము గలదా?' అనెను. సుందరకుఁడు 'అమ్మా, అట్లు తలంపకుము. గురుభార్యాగమనము ఎప్పటికైనను ధర్మ మగునా?' అని నిరాకరించెను. ఇట్లతఁడు నిరాకరింపఁగా కాళరాత్రి అతనిని రోషముతో బెదరించి తన యుత్తరీయ మును తానే చింపుకొని ఇంటికి పోయి భర్తతో 'ప్రాణేశ్వరా,

చూచుము, సుందరకుఁడు మరల పరుగెత్తుకొని నామీఁదికి వచ్చి నాయుత్తరీయమును చింపినాఁడు.' అని యుత్తరీయమును చూపెను. ఉపాధ్యాయుఁడును క్రోధావిష్టుఁడై సుందరకుని వధార్హునిఁగా పలికి సత్త్రాధికారితో చెప్పి అన్నము నిలుపుదల చేయించెను. అంతట సుందరకుఁడు వగచి ఆదేశమును విడువఁ దలఁచి గోవాటహర్మ్యములో నేర్చిన మంత్రము నెఱిఁగి దిగు మంత్రమును మఱచినందున మరల దానిని నేర్చుటకై అక్కడికే రాత్రి పోయెను. అక్కడ అతఁ డుండఁగా కాళరాత్రి వచ్చి మునుపటియట్లే మేడతో కూడ ఎగిరి ఆకాశమార్గమున ఉజ్జయినికి పోయెను. అక్కడ గోవాటమును కూరగాయతోఁటలో దిగుమంత్ర ముచ్చరించి దిగి మరల శ్మశానమునకు రాత్రిచర్యకై చనియెను. ఆమంత్రమును సుందరకుఁడు మరల వినియు గ్రహింపనేరఁడాయెను. గురూపదేశము లేక సంపూర్ణసిద్ధి యేల కలుగును? అంత నతఁడు అక్కడ కొన్ని ముల్లంగిదుంపలు తిని మఱికొన్నిటిని కొని పోవుటకై యుంచుకొని గోవాటములో ఎప్పటియట్లు ఉండెను. ఆమె వచ్చి గోవాట మెక్కి మరల ఆకాశమునం బోయి వాహనము నెప్పటిచోట నిలిపి యింటి కేఁగెను.

సుందరకుండును తెల్లవాఱఁగానే గోవాటమును వది భోజనక్రియను సంపాదించుకొనువాఁడై ఆ ముల్లంగిని అ‌ కొనుటకు బజారునకు పోయెను. ఇతఁడు అమ్మఁ దెచి

ముల్లంగిని మాళవీయు లైన రాజసేవకులు తమదేశము దని తెలిసికొని వెల యియ్యకయే అపహరించిరి. అతఁడు జగడ మాడఁగా ఆశతులు అతనిని పట్టుకొని త్రాలతోఁ గొట్టినాఁడని నేరము మోపి రాజునొద్దకు కొనిపోయి "ఓ మహాప్రభూ, ఇతఁడు 'ముల్లంగిని మాళవమునుండి ఏలాగున తెచ్చి కాన్యకుబ్జములో అమ్ముచున్నావోయి?' అని మే మడుగఁగా ప్రత్యుత్తరము చెప్పఁడు సరియే గదా అందునకు మమ్ము త్రాలంతో రువ్వుచున్నాఁడు." అని చెప్పిరి. రాజు అతనినే యీ యద్భుతమును గుఱించి ప్రశ్న చేసెను. అతని వెంబడి వచ్చి యున్న యతని చెలికాండ్రిట్లుత్తరము చెప్పిరి.—'దేవా, మేము ఇతనిని ఈ మేడమీఁదికి ఎక్కింతుమేని ఈవింత నంతయు ఇతఁడు చెప్పును గాని మఱియొక విధమునఁ జెప్పఁడు.' ఆప్రకారమే రాజు మేడ ఎక్కించి చూచుచుండఁగానే అతఁడు మంత్రోచ్చారణచేత మేడతోఁగూడ ఆకాశమున కెగసి మిత్రులతోఁ గూడ ప్రయాగకు పోయి, బడలి, అచ్చట స్నానాసక్తుని రాజునొకనిం జూచి మేడను నిలిపినవాఁడై తన్ను అందఱు ఆశ్చర్యపడి చూచుచుండఁగా ఆకాశమునుండి గంగలోనికి ఉరికి ఆరాజునొద్దకు పోయెను. 'నీ వెవరవు? ఏల ఆకాశమునుండి దిగితివి? చెప్పుము' అని యారాజు వినయముతో అడుగఁగా సుంద[illegible]ఁడు 'నేను శివుని యనుచరుఁడను, నాపేరు మురజకుఁడు; స్నానుపభోగార్థినై శివాజ్ఞచేత నీయొద్దకు వచ్చితిని.' అనెను.

ఆమాటను సత్యముగా తలఁచి రాజు సస్యాఢ్యమును రత్నపూరిత మును సస్త్రీకమును సోపకరణమును అగు పురము నతని కిచ్చెను. అంత నాపురము సొచ్చి అనుచరులతోఁగూడ ఆకాశ మున కెగయుచు చిరకాలము స్వేచ్ఛగా దైన్యము లేక విహరించుచుండెను. బంగారపుమంచముపై పవళించువాఁడై చంద్రాననలు చామర లిడ వరాంగనలు సేవించుచుండ అతఁడు ఇంద్రభోగము లనుభవించుచుండెను.

ఇట్లుండఁగా నొకనాఁడు ఆకాశచారి యైన సిద్ధుఁ డొకఁడు అతనిచే సన్నుతులు వడసి అతనికి దిగుమంత్రమును నేర్పెను. సుందరకుఁ డిట్లు దిగుమంత్రము నేర్చుకొని తనదేశ మయిన కన్యాకుబ్జముఁలో ఆకాశమార్గమునుండి దిగెను. పట్టణనమేతుఁడును పూర్ణలక్ష్మీకుఁడు నై ఆకాశమునుండి దిగిన యతనికి రాజు స్వయముగా ఎదురేఁగి ఆనవాలుపట్టి వృత్తాంత మడుగఁగా కాలజ్ఞుఁ డయిన సుందరకుఁడు కాళరాత్రి వృత్తాం తము నంతయు చెప్పెను. అంతట రాజు కాళరాత్రిని పిలిపించి యడిగెను. ఆమెయు నిర్భయురాలై తన యవినయము నంతయు అంగీకరించెను. రాజు కోపగించి ఆమె ముక్కుచెవులు కోయఁ బోఁగా ఆమె పట్టువడియుండియు ఎల్లవారును చూచుచుండఁ గానే మాయమై పోయెను. రాజు ఆమె తనరాష్ట్రములో నివ సింపఁగూడదని యాజ్ఞ చేసెను. రాజుచే పూజలు వడసి సుంద రకుఁడు మరల ఆకాశమునకు పోయెను.

ఇట్లు భర్త యగు నాదిత్యప్రభభూపాలునితో చెప్పి రాణి కువలయావళి మరల చెప్పం దొడంగెను. 'దేవా, డాకినీ మంత్రసిద్ధులు ఇట్టివిగా నుండుచు. ఇది నాతండ్రిదేశములో సర్వత్ర ప్రసిద్ధము. నేను కాళరాత్రికి శిష్యురాల నని మొదటం జెప్పితిని గదా. పాతివ్రత్యముచేత నాసిద్ధి ఆమెసిద్ధికన్నను గొప్పది. నీ శ్రేయస్సుకొఱకు అర్చన సేయుచున్న నన్ను ఇప్పుడు నీవే చూచితివి గదా. బలికై పురుషు నొకని మంత్రముచే ఆకర్షింప నుద్యుక్తురాలనై యున్నాను. ఈ నామార్గమందు నీవుకూడ ఇప్పుడు ప్రవేశింపుము. ఈ సిద్ధిచేత రాజులందఱు నీకు ఓడి పోవుదురు; వారినెత్తిమీఁద నీపాదము పెట్టుము.' ఆ మాట విని రాజు 'డాకినీనయమున మహామాంసభోజన మెక్కడ? రాజత్వ మెక్కడ?' అని పలికి దానిని అంగీకరింపక నిషేధించెను. అంతట రాణి ప్రాణత్యాగమున కుద్యమింపఁగా రాజు డాకినీనయమున కంగీకరించెను. విషయాకృష్టులు సన్మార్గమందు ఎట్లు నిలుతురు? అంత నామె అతనిని పూర్వపూజిత మయిన మండలములో సమయపూర్వకముగా కూర్చుండఁబెట్టి యిట్లనియె:— 'నీయొద్ద నున్నాఁడే ఫలభూతి యను విప్రుఁడు, అతనిని నేను ఉపహారార్థము ఆకర్షింపఁ దలఁచి యున్నాను. ఆకర్షణము కష్టము, కనుక వంటవాని నొకనిని ఈ నయములోనికి చేర్చుకొనవలయును; వాఁడు అతనిని స్వయముగా చంపి వండును గాక. ఇందుల కేవగింపఁ

గూడదు. ఏల యనఁగా, అతఁడు ఉత్తముఁడు; గాన ఆమాంస
మును భక్షించుట చేత అర్ధన పూర్ణము కాఁగానే పూర్ణ
సిద్ధి కలుగును.' ఇట్లు ప్రియురాలు చెప్పఁగా రాజు పాపభీతుఁ
డయ్యును దాని కంగీకరించెను; ఛీ! స్త్రీల ననుసరించుట పాపము!
పిమ్మట సాహసికుఁ డనువంటవానిని పిలిచి నమ్మించి దీక్షితునిఁ
జేసి ఆదంపతు లిట్లనిరి.—"ఎవఁడు 'రాజును రాణియు భోజన
ముచేయనున్నారు, భోజనము త్వరగా సిద్ధము చేయుము.'
అని నీతో చెప్పునో వానిని చంపి వానిమాంసమును రుచిగా
వండి మాకు ప్రాతర్భోజనము పెట్టుము." ఇట్లానతి విని సరియే
యని సూపకారుఁడు ఇంటికి పోయెను. తెల్లవారినంత ఫల
భూతి రాఁగానే రాజు ఫలభూతిని "నీవు పోయి వంటయింట వంట
వానితో 'రాజు దేవీద్వితీయుఁడై భోజనము చేయును. నీవు త్వరిత
ముగా స్వాద్వాహారమును సిద్ధము చేయుము;' అని చెప్పుము."
అని యాజ్ఞాపించెను. అట్లే యని ఫలభూతి లేచి వెలుపలికి నడ
వఁగానే రాజుకొడుకు చంద్రప్రభుఁడు ఎదురుపడి 'అయ్యా, ఈ
బంగారమునకు నాకు ఇప్పుడే కుండలములు మానాయనకు
నీవు చేయించినవానివంటివే చేయింపుము.' అని బంగారమిచ్చి
వేఁడుకొనెను. అంత ఫలభూతి అంగీకరించి వెంటనే అతని
పంపున కుండలములుచేయింపఁ బోయెను. రాజపుత్త్రుఁడును
ఫలభూతి చెప్పిన రాజాజ్ఞను ఒంటరిగా పోయి సూపకారుని
తెలిపెను. వెంటనే సంకేతము ప్రకారము రాజపుత్త్రుని సాహ

సికుఁడు కత్తితో నఱికి అతని మాంసమును వండి కృతార్థను లయిన యతని తల్లిదండ్రులకు పెట్టెను. కుమారుని దని యెఱుఁగక వారు దానిని భుజించిరి. రాజు ఆరాత్రి యెల్ల పశ్చాత్తాపపడుచు గడపెను.

తెల్లవాఱఁగా ఫలభూతి కుండలములు చేతఁ బట్టుకొని వచ్చెను. రాజతనిని చూచి విభ్రాంతుఁడై కుండలముల యుద్దేశము నగిడి అతనివలన వృత్తాంతమును విని భూమిమీఁద పడి 'హా! పుత్త్రా! హా! పుత్త్రా!' అని యేడ్చుచు భార్యను తన్నును తిట్టుకొనుచుండెను. మంత్రులడుగఁగా సకలము వాస్తవము చెప్పెను. "ప్రత్యహమును ఫలభూతి చెప్పుచుండెను గదా:— 'మేలు చేయువాఁడు మేలుపొందును, కీడు చేయువాఁడు కీడు పొందును;' అని గోడమీఁద కొట్టినబంతివలె ఒకరికి తలఁచిన దోషము తనకే ప్రాయికముగా తగులును. పాపాచారుల మై మేము బ్రహ్మహత్య కొడి గట్టినందులకు మాపుత్త్రునే చంపించి వానిమాంసమునే భక్షించితిమి." ఇట్లు పలికి అధోముఖులై యున్న తన మంత్రులను హెచ్చరించి ఆ ఫలభూతినే తనరాజ్యమునకు అభిషేకము చేసి దానము లిచ్చి అపుత్త్రుఁడై రాజు పాపశుద్ధికై భార్యతోఁ గూడ పశ్చాత్తాపాగ్నిచే దగ్ధుఁ డయ్యును చిచ్చుఁ జొచ్చెను. ఆ రాజ్యమునుపొంది ఫలభూతి భూమి నేలుచుండెను. ఈప్రకారము మేలుగాని కీడు గాని ఎవఁడు చేసినది వానికి ఫలించును.

వత్సరాజు నెదుట ఈకథను చెప్పి యౌగంధరాయణుఁడు మరల నిట్లనియె:— 'కనుక ఓరాజేంద్రా, గెలిచియు మేలు చేయుచున్న నీకు బ్రహ్మదత్తుఁడు కీడుదలఁచెనేని నీచేతనే అతఁడు మడియును.' మంత్రివరేణ్యుం డిట్లు చెప్పఁగా, వత్సరాజు అతని మాటకు సంతోషించి లేచి దినకృత్యములను నిర్వర్తించెను. సంపన్న సర్వదిగ్విజయుఁడై కృతార్థుఁడయిన వత్సరాజు మఱునాఁడు లావాణకమునుండి తనరాజధాని కౌశాంబికి బయలువెడలెను. పరివారసమేతుఁడై క్రమముగా జెండాలనెడు భుజలతల నెత్తి కౌతుకముచే నర్తించుచున్నట్లున్న నిజనగరిం జేరి పౌరసుందరీ నేత్రోత్పలవనమందు ప్రతిపదంబునను ప్రవాతారంభవిభ్రమమును నెఱపుచు పురప్రవేశము చేసి చారణోద్గీయమానుఁడును వందిమాగధస్తూయమానుఁడును భూపాలప్రణమ్యమానుఁడును అగుచు తనమందిరము ప్రవేశించెను. పిమ్మట నమ్రము లయిన సకలరాజులయందును తనశాసనమును నిలిపి పూర్వము నిధానాధిగతమును కులోచితమును అయిన యాసింహాసనమును జయపూర్వకముగా అధిరోహించెను. ఆసమయమందు మంగళ వాద్య తార ధీర నాద ప్రతినాదములు అతని మంత్రిముఖ్యులచేత తోషితు లయిన లోకపాలురు చేసిన సాధువాదములో యన ఎల్లదిక్కులను మ్రోఁగుచుండెను. వత్సరాజు నీతలోభుఁడై భూమండలజయలబ్ధమయిన నానావిధధనమును బ్రాహ్మణులకు ఇచ్చి రాజమండలమును తనమంత్రులను ఉత్సవములచే తుష్టు

లను జేసినపుడు పర్జన్యుఁడు నరేంద్రుని క్షేత్రములయందు అను గుణముగా వర్షించుచుండఁగా ధ్వనద్ఘనమృదంగనినాదిత యైన యాపురియందు ఇఁక బహుధాన్యఫలము కలుగునని సంభావించి జను లందఱు అధికవ్యయముతో విశేషోత్సవములు చేసిరి.

ఈప్రకారము పుడమిని జయించి కృతార్థుఁడై వత్సరాజు యౌగంధరాయణరుమణ్వంతులయందు రాజ్యభారమును మోపి వాసవదత్తా పద్మావతులతో యథేచ్ఛముగా సుఖముండెను. కీర్తిశ్రీలకుం బోలె ఆవాసవదత్తా పద్మావతులకు మధ్యగతుఁడై వరచారణగీయమానుఁడై వత్సరాజు తన యశస్సుంబోలె తెల్లని చంద్రోదయమును సేవించుచు తన శత్రువుల ప్రతాపమునుం బోలె మద్యమును మాటిమాటికి త్రాగుచు నుండెను.



# నరవాహనదత్తజనన లంబకప్రారంభము.

## ౧. వ తరంగము.

క. శ్రుతితాళప్రబలవ్యా
హృతి సీమంతిత మహాకులాచలుఁ డగుచున్
తతసిద్ధిమార్గ మిచ్చెడు
గతి నొప్పెడువిఘ్నరాజు గను రాజిల్లన్

అనంతరము ఆయుదయనమహారాజు తాను జయించిన భూమి నంతయు కౌశాంబియే నిజరాజధానిగా ఏకచ్ఛత్త్రముగా భోగించుచుండెను. యౌగంధరాయణ రుమణ్వాంతులమీఁద రాజ్యభారము నంతయు వదలి కృతార్థుఁడై వసంతకసహాయుఁడై విహారైకపరాయణుఁడై యుండెను. తాను స్వయముగా వీణ వాయించుచు వాసవదత్తా పద్మావతీదేవులతోఁ గూడి సదా సంగీతకము సేయుచుండెను. దేవేరుల కాకలీగీతమునకును అతని వీణానాదమునకును భేదమే లేక యుండఁగా వాదనయందలి యంగుళిచలనము మాత్రము భేదమును సూచించుచుండెను. తన కీర్తిచేతనుం బోలె వెన్నెలచేత తెల్లనైన మేడతుదయందు అతఁడు ధారావిగళిత మగున మద్యమును

శత్రువులమదమునుం బోలె పానము సేయుచుండెను. వారాంగనలతని కేకాంతమందు బంగారుగిండ్లతో మదనరాజ్యాభిషేకజలమునుం బోలె రాగోజ్జ్వల మయినమధువును అందిచ్చిరి. ఆరక్తసురసస్వచ్ఛమును అంతఃస్ఫురిత తన్ముఖంబును అగు నాసవమును ఉదయనుఁడు వాసవదత్తా పద్మావతుల నడుమ తన చిత్తమునుంబోలె నిడెను. ఈర్ష్యారోషములు లేక పోయినను బొమముడియు రాగమును గల రాణిగార్ల నెమ్మోములను ఎంత చూచినను అతని కంటికి తనివి తీఱ దాయెను. మధువుతోడి పెక్కు స్ఫటికచషకములు గల యతని పానభూమి బాలాతపారక్తపుండరీక యగు పద్మినియుం బోలె ప్రకాశించుచుండెను.

అప్పుడప్పుడు రాజు వేఁటకాండ్రంగూడి ఆకుఁబచ్చచొక్కా తొడిగి సబాణాసనుఁడై తన్నే పోలిన మృగకాననమున వేఁటాడుచుండెను. దట్టంపుఁ గరములంతో చీఁకటిమొత్తములను మరీచిమాలికూల్చునట్లు పంకకలుషము లైన వరాహనివహములను శరములంతో కూల్చుచుండెను. అతఁడు వడిగా వచ్చుచుండఁగా బెదరి దాఁటి పోవుచున్న కృష్ణసారములు పూర్వము అభిభూతలయిన స్త్రీల కటాక్షములో యన నొప్పుచుండెను. అతని కోలలం గూలిన వనమహిషముల నెత్తుటం జొత్తిల్లు పుడమి వాని కొమ్ముల యప్పళింపు తప్పిన వనుకృతజ్ఞతచేత నతనిం గొలువ వచ్చిన యనవితమ్మిరో యన నెసఁగుచుండెను. అతఁడు సింగ

ముల తెలిచిన నోళ్ల నీటియలం గ్రుచ్చ వానిప్రాణము లెడలినను గర్జనలు హృదయదేశంబున నడరుటం గని సంతసిల్లెను. అతని యాయుధములచేతనే వేటస్వారస్య మెల్ల నెఱవేఱుట చేత ఆవనములో అతని మార్గములలో కుక్కలు గోతులు వలలును మృగయాచారమాత్రమై యుండెను.

నా ర దా గ మ న ము.

ఈప్రకారము కేవలసుఖపరాయణుండై యున్న వత్స రాజునకు ఒకనాడు దివి కలంకార మయిన నారదముని తేజస్వి జాతిస్నేహముచే వచ్చిన వేవెలుంగో యన నిజదేహప్రభా రచిత మండలుండై వచ్చి దర్శన మిచ్చెను. రాజు వినయముతో సత్క రించెను. ముని ప్రీతుండై క్షణ మాలోచించి యిట్లనియె:— వత్సరాజా! సంగ్రహముగా నొకవిషయమును చెప్పెదను వినుము. నీకు పూర్వపితామహుండు పాండు వని యొకరాజు ఉండెను. నీకుం బోలె అతనికిని ఇద్దఱుభార్యలు ఉత్తమురాండ్రు ఉండిరి. ఒకతె కుంతి, రెండవది మాద్రి. అతండు సాగర మేఖల యయిన యీపృథివి నెల్ల జయించి సుఖియై, యొకనాడు వేటతమకముచేత నడవికిం బోయి, అచట కిందముండను నొకమునిని భార్యతోం గూడ మృగరూపమున క్రీడించుచున్న వానిని కోలం గూల్చెను. ఆరూపమును మాని కంఠగత ప్రాణుండై ముని తన్నుం జూచి వింటిని వదలి విషాదపడుచున్న పాండురాజును 'నీవు నీయిచ్చ వచ్చినట్లు తిరుగుచు నన్నుం

గొట్టితివి గాన, నీకును నాకుం బోలె భార్యాసంభోగకాలమందే మృత్యు వగును.' అని శపించెను. ఇట్లు శాపము వొంది భీతుఁడై పాండురాజు భార్యలతోఁ గూడ శాంత మగు తపోవనము నుండెను. అట్లుండియు నొకనాఁడు శాపప్రేరితుఁడై ఆకస్మికముగా మాద్రిని కామించి మరణము నొందెను. ఇట్లు వేఁట యనునది రాజుల కొకదోషము. ఎందఱో దీనిచేత మృగములుం బోలె క్షయించినారు. ఘోరనాదయు ఆమిషైకాసక్తయు రూక్షధూమ్రోర్ధ్వమూర్ధజయు కుంతదంతయునై రక్కసింబోలు మృగయ శుభము నెట్లు కలిగించును? కనుక వ్యర్థాయాస మగు వేఁటను మానుము. ఇందువలన మృగమునకు వేఁటకానికి వానివాహనమునకు త్రయమునకును ప్రాణాపాయము సమానము. నీవు కల్యాణపాత్రమవు, నీ పూర్వులనుబట్టి నాకు ప్రియుఁడవు. నీకు కామాంశమునఁ బుత్త్రుఁడు జనించును. ఆ విషయమును వినుము. పూర్వము మన్మథునికి దేహము నిమ్మని రతి అర్చించి స్తుతించి సంతోషపెట్టఁగా శివుఁడు ఏకాంతమందు సంక్షేపముగా 'రతీ, ఈ పార్వతి నిజాంశమున భూమి నవతరించి పుత్త్రార్థిని యై న న్నారాధించి కాముని పుత్త్రునిఁగాఁ బడయును.' అని వర మిచ్చెను. ఆ ప్రకారమే గౌరి చండమహాసేనునికి వాసవదత్త యను పేర కూఁతురై పుట్టి నీకు పట్టపుదేవి యయినది. ఈమె శంభు నారాధించి కాముని పుత్త్రునిఁగాఁ గనఁ బోవుచున్నది. అతఁడు సర్వ

విద్యాధరులకును చక్రవర్తి కాఁగలఁడు.— ఇట్లు నారదముని చెప్పఁగా సంతోషించి వత్సరాజు తన పుడమి నంతయు ఆయనకు అర్పితము చేసెను. నారదముని దానిని మరల రాజునకే ఇచ్చి అంతర్హితుఁ డాయెను.

## పింగళిక.

అంత వత్సరాజు సుతేచ్ఛ గల దైన వాసవదత్తతోనే ఆతలంపుతోనే ఆదినమును గడపెను. మఱునాఁడు ఆస్థానగతుఁ డైన వత్సరాజుతో ప్రతీహారుఁడు నిత్యాచారము ప్రకారము ప్రవర పలికి 'మహారాజా, ఏలినవారిదర్శనమును గోరి ఒక బ్రాహ్మణి యిద్దఱుశిశువులతోఁ గూడ ద్వారమందు కనుపెట్టి యున్నది.' అని విన్నపించెను. ప్రభువు ఆమె ప్రవేశమున కనుజ్ఞ యిచ్చెను. క్షామపాండుధూసర యాబ్రాహ్మణి, మానముచేతనుం బోలె శిథిల మయిన వస్త్రముచేతఁ గూడ చాలవఱకు వదలఁబడినదై, ఇద్దఱుబాలకులను దుఃఖదైన్యావతారములనుం బోలె ఎత్తుకొని వచ్చి కృశోచితప్రణామయై రాజున కిట్లు విన్నవించుకొనెను:—'రాజా, నేను బ్రాహ్మణిని, కులీనురాలను, ఇట్టి దారిద్ర్యమునకు పాలయితిని. నాకు కర్మవశమున ఈ యిద్దఱుపుత్త్రులు కలిగినారు. నాకు అన్నము లేమిని వీరికి పాలు లేవు అందుచేత శరణాగతవత్సలుఁడ వైన నీయొద్దకు వచ్చితిని. అటుపయి నీచిత్తము.' రాజు కనికరించి అమెను వాసవదత్తకు అప్పగింపు మని ప్రతీహారుని కాజ్ఞ

చేసెను. అంత నామెను ప్రతీహారుఁడు ఆమెయొక్క పుణ్య కర్మఁయుం బోలె ముందు నడచి వాసవదత్తాదేవియొద్దకుఁ గొనిపోయెను. రాజు పంపినాఁడని ప్రతీహారునివలన నెఱిఁగి అమెను వాసవదత్త విశేషమైన శ్రద్ధతో ఆదరించెను. కవల పిల్లలు గల యీామెను చూచి వాసవదత్త 'అహహా! ఏమి బ్రహ్మయొక్క కౌటిల్యము! ఓహెూ! వస్తువుపై మత్సరము! అవస్తువుపై యనురాగము! నా కిప్పటికిని ఒకఁడయినను పుట్ట లేదు. ఈమెకు ఇద్దఱు కలిగినారు.' అని తలపోసి తాను స్నానము చేయఁబోవునదై బ్రాహ్మణికిని స్నానాదికము జరుప చేటికల నియమించెను. స్నానముచేయించి మంచివస్త్రము లిచ్చి మంచియోగిర మొసంగఁగా ఆరగించి బ్రాహ్మణి జలసిక్తయగు తప్తభువియుం బోలె నూఱడిల్లెను. సమాశ్వసిల్లిన యీామెను యుక్తిగా కథాప్రసంగములచే పరీక్షించుటకై వాసవదత్త కొంచెముసేపు తాళి, 'అమ్మా, ఏదేని యొకకథ చెప్పుము.' అని యడిగెను. ఆమెయు నంగీకరించి కథ చెప్ప నారంభించెను.

దేవదత్తునికథ.

పూర్వము జయదత్తుఁడని సామంతరాజొకఁడుండెను. అతనికి దేవదత్తుఁడని కొడుకుండెను. కొడుకునకు యౌవనము రాఁగా అతని వివాహమువిషయమై మతిమంతుఁడు తండ్రి యిట్లు చింతించెను. 'రాజశ్రీ వేశ్యవలె బలాత్కారముచేత భోగింపవలసినది, అతిచపల. వణిజుల లక్ష్మియో కులస్త్రీవలె

స్థిర మయినది, అన్యులను పొందునది గాదు. కనుక నాసుతునికి వణిక్కులముదానిని పెండ్లి చేసెదను. అట్లు చేసిన బహుదాయాద మగు నీరాజ్యమందు అపాయము కలుగదు.' ఇట్లు నిశ్చయించుకొని ఆరాజు కొమరునికి పాటలీపుత్త్రములోని యొక వైశ్యుని వసుదత్తుఁ డనువానిని పిల్ల నడిగెను. మంచిసంబంధ మను వాంఛచేత దూర దేశ మని విచారింపక వసుదత్తుఁడు పిల్ల నిచ్చెను. అతఁ డరణ మిచ్చినరత్నరాసులచేత అల్లునికి తన తండ్రివైభవముమీఁది యభిమానము సడలెను. జయదత్త భూపాలుఁడు సుతునికి వణిక్కన్య దొరకఁగా నిశ్చింతుఁడై సుఖం బుండెను.

ఒకనాఁడు వసుదత్తుఁడు కొమారితను చూడఁ గోరి సంబంధియింటికి వచ్చి ఆమెను కొని పోయెను. ఆకస్మికముగా జయదత్తభూపాలుఁడు స్వర్గస్థుఁ డాయెను. అంత దాయాదులు చేఁగి అతనిరాజ్యమును హరించిరి. వారిభయముచేత అతని భార్య కుమారుని దేవదత్తుని రాత్రి ఎవరికిం దెలియ నీయక అన్యదేశమునకు కొనిపోయి అచ్చట అతనితో దుఃఖంబున ఇట్లనియె.—' మనప్రభువు పూర్వదిగీశ్వరుఁడు చక్రవర్తి దేవునివంటివాఁ డున్నాఁడు. అతనియొద్దకుఁ బొమ్ము. అతఁడు నీకు రాజ్యమును త్వరలో సాధించును.' తల్లి యిట్లు చెప్పఁగా దేవదత్తుఁడు 'అమ్మా, ఇట్లు నేను పరికరహీనుఁడనై పోయిన, అక్కడ నెవరు నన్ను గౌరవింతురు?' అనెను. తల్లి చెప్పినది.—

'నీమామయింటికి పోయి అతనియొద్ద ధనము పుచ్చుకొని పరికరము నేర్పరుచుకొని చక్రవర్తియొద్దకుఁ బొమ్ము.' ఇట్లు తల్లి ప్రేరేపఁగా లజ్జితుఁ డయ్యును రాజకుమారుఁడు ఆ సాయంకాలమందే బయలు వెడలి క్రమముగా మామగారి యింటికి పోయెను. పితృహీనుఁడును నష్టరాజ్యుఁడు నై కన్నీళ్లు వచ్చు నను లజ్జచేత రాత్రి అకాలమందు మామయింటిలోనికిం బోవ సంకోచపడి సమీపమున నొకసత్త్రమువెలుపల కూర్చుండెను. ఆరాత్రివేళ మామయింటినుండి ఆకస్మికముగా త్రాడు పట్టుకొని దిగుచున్న యొకస్త్రీని చూచి, రత్నాభరణ ప్రభలచే, ఆకాశమునుండి పడుచున్నకొఱవివలెనుండి దోఁచుచున్న యాయువతిని తనభార్యనుగా తెలిసికొని, పెల్లు దుఃఖించెను. ఆమె ధూళిధూసరాంగుని కృశుని ఆతనిని చూచియు ఆనవాలు పట్టలేక 'ఎవరు నీవ'ని యడిగెను. 'నేను బాటసారి' అని యతఁ డుత్తర మిచ్చెను. అంత నామె సత్త్రములోనికి పోయెను. దేవదత్తుఁడును సంగతి యేమో చాటునుండి తెలిసికొనుటకు వెంబడిగానే పోయెను. అక్కడ నామె యొకపురుషుని కూడెను. వాఁడును ఇంతయాలస్య మేల చేసితి వని తాఁపులు తన్నెను. అంత నామె కామము రెట్టింపఁగా వానికోపమును తీర్చి వానితోఁగూడ యదృచ్ఛగా నుండెను. దానిని చూచి ప్రజ్ఞావంతుఁడు రాజపుత్త్రుఁ డిట్లు ఆలోచించెను. 'కోపమున కిది నాకు కాలము కాదు. సాధింపవలసినది వేఱే యున్నది.

శత్రుయోగ్య మయిన నా యీకృపాణము ఈకృపణులమీఁద ఈస్త్రీమీఁదను ఈనరపశువుమీఁదను ఎట్లు ప్రవర్తించును? ఈ చెడుభార్యవలన నేమి? ఇది యెల్ల నాధైర్యమును చూడ వేఁడి నాకు దుఃఖమును వర్షించుచున్న విధియొక్క చేత. ఇది అసమానకులసంబంధముయొక్క యపరాధము. కాకి కాకితోఁ గాని కోకిలతో క్రీడించునా?' ఇట్లాలోచించి యతఁడు కాముకురాలిని ఆభార్యను ఉపేక్షించెను. గొప్ప జిగీష గల గొప్పవారిమనసులో స్త్రీ యను గడ్డిపోఁచ యేపాటి? ఆసమయమందు క్రీడావేగముచేత వణిక్సుతచెవినుండి మంచిముత్తెములభూషణ మొకటి జారి పడెను. క్రీడాంతమందు ఆమె దానిని చూడకయే త్వరత్వరగా ఉపపతి నామంత్రించి వచ్చిన దారినే ఇంటికి పోయెను.

ఆ ప్రచ్ఛన్నకాముకుఁడును త్వరత్వరగా ఎక్కడికో పోఁగా, రాజపుత్త్రుఁడు ఆరత్నాభరణమును చూచి కయికొనెను. స్ఫురద్రత్నశిఖాజాలము ఆయాభరణము అతనికి నష్టశ్రీని వెదకుటయందు మోహాంధకారమును పోఁగొట్టుటకు బ్రహ్మ యిచ్చిన హస్తదీపముగా నుండెను. వెలపొడుగుదైన యానగను చూచి రాజపుత్త్రుఁడు వెంటనే బయలువెడలి సిద్ధకార్యుఁడై అటనుండి కాన్యకుబ్జమునకుం బోయి, అచట దానిని తాకట్టు ఉంచి లక్షసువర్ణములను గొని, గుఱ్ఱములను ఏనుఁగులను కొని, చక్రవర్తియొద్దకు పోయి, అతఁడిచ్చిన రాణు

వనుం గొని వచ్చి, రణములో శత్రువులను జయించి తనతండ్రి రాజ్యమును మరలం గొని కృతార్థుండై తల్లికి సంతోషమును కలిగించెను. పిమ్మట ఆ యాభరణమును తాకట్టు విడిపించి ఆ రహస్యమును నిశ్శంకముగా బయలు పెట్టుటకై దానిని మామమొద్దకు పంపించెను. మామయు తనకొమారిత కర్ణ భూషణము ఆరీతిగా తనయొద్దకు వచ్చుటను చూచి భ్రమ గొని కొమారితకు చూపెను. ఆమె తన శీలము వోలె పూర్వ పరిభ్రష్టమయిన యా యలంకారమును చూచి, భర్త పంపుటయు నెఱింగి, కలఁతపడి జ్ఞప్తి తెచ్చుకొనెను: 'ఇది ఆ రాత్రి సత్త్రిగృహములో నాచెవినుండి పడిపోయినది. అచట నప్పుడు ఒక బాటసారిని చూచి యుంటిని, నిశ్చయముగా అతఁడు నాపతి, నాశీలమును పరీక్షించుటకు వచ్చినవాఁడు. నే నతని నానవాలు పట్టనయితిని. అతఁడు దీనిని కొని పోయినాఁడు.' ఇటులు చింతించుచున్న యావణిక్సుతయొక్క పిఱికి గుండియు దుశ్శీలత బయ లగుటచేత బెగ్గడిల్లి పగిలిపోయెను. దాని తండ్రి దానిచేటివలన ఆరహస్య మంతయు నెఱింగి దుఃఖమును మానుకొనెను. అంతట రాజపుత్త్రుఁడు లబ్ధరాజ్యుఁడై గుణార్జితను చక్రవర్తిసుతను అపరశ్రీని పెండ్లియాడి సుఖ ముండెను. ఈప్రకారము స్త్రీలహృదయము సాహసములో వజ్రకఠినము; అదియే భయకారణము గలిగినప్పుడు పుష్ప కోమలము.

కొందఱు మంచివంశములో పుట్టినయంగనలు ముత్తె ములుంబోలె సువృత్తాచ్ఛహృదయలై భూమిలో అలంకారమై యుందురు. ఈప్రకారము రాచసిరి లేడివోలె నొకప్పుడు దాంటి పోవును. దానిని ధైర్యపాశముచేత బుధులు కట్టనేర్తురు. సంపదను కోరినవారు ఆపదయందుఁ గూడ సత్త్వమును వదలఁ గూడదు. ఇందునకు నావృత్తాంతమే నిదర్శనము. దేవీ, నేను ఈనావియోగములో చారిత్రమును రక్షించుకొంటిని. అందులఫలమే భవద్దర్శనకల్యాణము, నాకుఁ గలిగినది.

ఇట్లని యా బ్రాహ్మణివలన విని వాసవదత్తాదేవి ఆదర ముతో ఇట్లు చింతించెను. 'ఈ బ్రాహ్మణి గొప్పకులముది, స్వశీల ప్రస్తావమును వాక్ప్రౌఢియు ఈమెయౌదార్యమును తెలుపు చున్నవి. అందుచేతనే రాజసభాప్రవేశమునకు ప్రావీణ్యము గలిగినది.' ఇట్లు తలంచి వాసవదత్త మరల ఆ బ్రాహ్మణిని 'నీభర్త ఎవరు? నీవృత్తాంత మేమి? చెప్పుము.' అని యడి గెను. బ్రాహ్మణి యిటులు వక్కాణించెను:—

దేవీ, మాళవదేశములో అగ్నిదత్తుఁ డని బ్రాహ్మణుఁ డుండెను. ఆయన శ్రీసరస్వతుల యిల్లు, త్యాగి. ఆయనకు తగిన కుమారులు ఇద్దఱు కలిగిరి. పెద్దవాఁడు శంకరదత్తుఁడు, చిన్న వాఁడు శాంతికరుఁడు. ఓ కీర్తిమంతురాలా, వారిలో శాంతి కరుఁడు ఆకస్మికముగా బాల్యమందే విద్యార్థియై ఎక్కడికో దేశాంతరము పోయినాఁడు. అతనియన్న నన్ను పెండ్లి యా

డెను. నాతండ్రి యజ్ఞములు చేసినవాఁడు, సంపన్నుఁడు; ఆయన పేరు యజ్ఞదత్తుఁడు. కాలక్రమమున నామామ అగ్నిదత్తుఁడు లోకాంతరగతుఁడై, నాయత్త సహగమనము చేయఁగా, నా పెనిమిటి గర్భిణినిగా నున్న నన్ను విడనాడి తీర్థయాత్రో ద్దేశమున పోయి సరస్వతీతీరమందు శోకాంధుఁడై దేహమును త్యజించెను. అతని సహాయాయులు వచ్చి యీవృత్తాంతమును చెప్పఁగా నేను అనుగమనప్రయత్నము చేసితిని, కాని గర్భిణి నగుటచేత బంధువులు నన్ను ఆటంకపఱిచిరి. నా దుఃఖము ఆఱకయే యుండఁగా బందిపోటుదొంగలు వచ్చి మాయింటిని మాత్రమే గాక యగ్రహారము నెల్ల దోఁచుకొనిరి. అంతట నేను ఇద్దఱు ముగ్గురు బ్రాహ్మణస్త్రీలను వెంటఁగొని శీలనాశ భయముచే కొంచెము వస్త్రములు తీసికొని వలసపోయితిని. దేశభంగము కలిగినందున వారితోఁ గూడ చాలదూరము పోయి కరినకర్మలచే జీవించుచు మాసమాత్ర ముంటిని. అంతట నచ్చట లోకులవలన వత్సరాజు అనాథరక్షకుఁ డని విని ఆ ముగ్గురు బ్రాహ్మణస్త్రీలతోను శీలమే దారిబత్తెముగా ఇక్కడికి వచ్చితిని. వచ్చిన వెంటనే ఆముగ్గురును నాకు సహా యలై యుండఁగా ఈకవలపిల్లలను కంటిని. శోకము, విదేశము, దారిద్ర్యము, అహో! నాకు బ్రహ్మదేవుఁడు ఆపదలద్వారమును తెఱచినాఁడు. అంత ఈబాలకులను పెంచుటకు నాకు గతి లేమి నాలోచించుకొని స్త్రీభూషణ మయిన లజ్జను వదలి

ఆస్థానముఁ జొచ్చి వత్సేశుని యాచించితిని. ఆపదలోనున్న పసిగందలతోడి తల్లికష్టమును ఎవరు చూడనోపుదురు ! అతని యాజ్ఞచేత నీపాదమూలము చేరితిని. నాకష్టములు ద్వారము నుండి తిరుగఁగొట్టఁబడినవియుంబోలె తీఱినవి. ఇది నావృత్తాంతము. నాపేరు పింగళిక. బాల్యము మొదలు అగ్నిహోత్ర ధూమములచేత నాకన్నులు పచ్చఁబాఱినందున నాకీపేరు గలిగినది. నా మఱఁది శాంతికరుఁడు దేశాంతరము పోయిన వాఁడు ఏదేశములో నున్నాఁడో ఇప్పటికి తెలియ లేదు.

ఇట్లు పింగళిక నిజవృత్తాంతమును చెప్పఁగా ఆమెను కులీననుగా నెఱింగి వాసవదత్త ఆలోచించి ప్రీతితో 'అమ్మా, ఇక్కడ శాంతికరుఁ డని మాపౌరోహితుఁ డున్నాఁడు. అతఁడు నీమఱఁది కాఁబోలును ' అని యుత్సుకురా లైన యాబ్రాహ్మణితో చెప్పి ఆరాత్రి గడపి తెల్లవాఱఁగానే శాంతికరుని పిలిపించి అతని వంశక్రమము నడిగెను. అతఁడు చెప్పఁగా నిశ్చయము గలిగి, అతనికి ' ఇదిగో నీవదినె' యని పింగళికను చూపెను. అతఁడును ఆమెను ఆనవాలు పట్టి బంధునాశము నెఱింగి ఇంటికి తీసికొనిపోయెను. అచట తల్లిదండ్రుల మరణమునకు వగచి, అన్నకును దుఃఖించి, ఆమెను ఓదార్చెను. వాసవదత్తాదేవియు పింగళికయొక్క యా యిరువురు కుమారులను తనకుఁ బుట్టఁబోవు చక్రవర్తికి పురోహితులనుగా నేర్పఱిచి, అందు పెద్దవానికి శాంతిసోముఁ డనియు, రెండవవానికి వైశ్వానరుఁ

డనియు పేరులు పెట్టి, వారికి బహుసంపదల నొసంగెను. అంధు లనుం బోలె జనులను స్వకర్మలే ముందు పోవుచు ఫలభూమికి నడపును, పౌరుషము నిమిత్తమాత్రము; అట్లు ఆ శిశువులు ఇరువురును వారితల్లియు ఆశాంతికరుండును అందఱును అచట ఐశ్వర్యవంతులై కలసికొనిరి.

ఇట్లు కాలము గడచుచుండఁగా నొకనాఁడు అయిదు గురుపిల్లలతో కుమ్మరది వాసవదత్తామందిరమునకు మూఁకుడులు తెచ్చినది. వాసవదత్త దానిం గని ప్రక్కనున్న పింగళికతో 'సఖీ, చూడు, దీనికి అయిదుగురుకుమారులు. నాకు ఒక్కఁ డైనను లేఁడు. ఇట్టిది కూడ పుణ్యములకు పాత్రము, నాబోఁటిది కాదు.' అనెను. అంతట పింగళికయు 'దేవీ, ఈసంతతి పాపసం పూర్ణము, ఇట్టిది దరిద్రులకే దుఃఖము కొసమే విస్తారముగా కలుగును. మీబోంట్లకు కలుగువాఁడు ఉత్తముఁడుగా నుండును. కనుక చింతింపకు. త్వరగానే నీవు తగిన కుమారునిం బడయు దువు.' అని పలికెను.

శివునివరము.

ఇట్లు పింగళిక చెప్పినను వాసవదత్త పుత్రజన్మమునకై ఉత్సుకురాలై ఆచింతతో నిండి యుండెను. ఆ సమయములో వత్సరాజు వచ్చి అభిప్రాయ మెఱిఁగి దేవేరితో 'నీకు గిరిశా రాధనచేత కుమారుఁడు గలుగు నని నారదులవారు చెప్పి

యున్నారు. కనుక దేవీ, వరదుని శివుని అవశ్యము ఆరాధిం పుదము.' అనెను. ఆమెయు వ్రతమునకు నిశ్చయము చేసి కొనెను. ఆమె వ్రత మారంభింపఁగానే రాజు కూడ మంత్రులతోను సర్వరాష్ట్రముతోను శంకరారాధన వ్రతమును సలిపెను. ఆదంపతులు మూఁడుదినము లుపవసింపఁగానే దేవుఁడు అనుగ్రహించి స్వప్నమందు ప్రత్యక్షమై స్వయముగా 'లెండి, మీకు కామాంశమున కుమారుఁడు కలిగి నాప్రసాదముచేత విద్యాధరులకు నాథుఁ డగును.' అని వర మిచ్చెను. ఇట్లు వర మిచ్చి చంద్రశేఖరుఁడు అంతర్ధానము నొందఁగా మేలుకొని యా దంపతులు విశేష మయిన సంతోషమును పొందిరి. తెల్లవాఱఁగానే లేచి ప్రకృతుల కందఱకును ఆ వృత్తాంతామృతమును శ్రోత్రపేయముగా వర్ణించి బంధుభృత్య సమేతముగా ఉత్సవపూర్వకముగా వ్రతపారణ చేసిరి. కొన్ని దినములకు పిమ్మట ఆమెకు స్వప్నములో జటాధరుఁ డైన యొక మహాపురుషుఁడు ఫం డొకటి ఇచ్చి పోయెను. ఆమె ఆ స్వప్నమును రాజునకు తెలుపఁగా ఆతఁడు సంతోషించెను. మంత్రు లభినందించిరి. రాజు ఫలవ్యాజమున సుతునే చంద్రశేఖరుఁ డిచ్చె నని తలఁచి తనకోరిక త్వరలోనే సఫల మగు నని ఎదురు చూచుచుండెను.

---

## ౨-వ తరంగము.



### వాసవదత్తా గర్భదోహదము.

తరువాత వత్సరాజహృదయోత్సవముగా వాసవదత్తా దేవికి కామాంశావతారముచే నుజ్జ్వలమయిన గర్భము కలిగెను. చంచలనేత్రమయి పాలినదైన యామె ముఖము గర్భమందలి కామునిమీఁది ప్రేమచే వచ్చినచంద్రుఁడో యన నొప్పుచుండెను. ఆమె కూర్చున్న మణిమంచమున నిరుపార్శ్వ ములయందును ఆమెయొక్క ప్రతిబింబములు ఆమెకడుపులోని కామునిమీఁది యనురాగముచే వచ్చినతద్భార్యలు రతిప్రీతులో యన నొప్పుచుండెను. గర్భస్థభవిష్యద్విద్యాధరచక్రవర్తి సేవాక్షణము ఇష్టదలై మూర్తిఁ దాలిచి వచ్చిన విద్యలుం బోలె ఆమెను సఖులు ఎప్పుడును సేవించుచుండిరి. నీలపల్లవశ్యామ ముఖములైన యామె పయోధరములు గర్భమందలి పుత్త్రుని కభిషేకమునకై వహించిన కలశములుంబోలె నొప్పుచుండెను. భవిష్యత్కాలమున ఆమెకుమారుఁడు తమ్ము నాక్రమించునని వడంకుచు రత్నరాసులను కానుక వెట్టి సేవించుచున్న సముద్రములో యన నొప్పుచున్న స్వచ్ఛస్ఫటికసచ్ఛాయమణికుట్టిమములచే వెలుఁగుచున్న మందిరమందు ఆమె ప్రకాశించుచుండెను. విమానమందలి యామెప్రతిబింబము ఆకాశమున

ప్రణమిల్లుటకై వచ్చిన విద్యాధరస్త్రీయో యన విరాజిల్లు చుండెను. ఆమె ప్రస్తావప్రాప్తములను మంత్రసాధనసంబద్ధము లయిన యుపాసకుల కథలను వినఁ గోరుచుండెను. తా నాకాశ చారిణి యైనట్లును, అట్టి తన్ను విద్యాధరవరారోహలు సరస ముగా పాడుచు సేవించినట్లును, స్వప్నములు కనుచుండెను. మేలుకొన్నపిమ్మటఁ గూడ ఆమెకు ఆకాశమున క్రీడింపను అటనుండి నేలను చూడను గోరిక బల మాయెను. ఆకోరికను యౌగంధరాయణుఁడు యంత్ర మంత్రేంద్రజాలాది ప్రయోగ ములచేత సాధించుచుండెను. పౌరాంగనలు ఱెప్ప లెత్తి ఆశ్చర్యపడుచు చూచుచుండఁగా ఆమె ఆ యా యుపాయ ములచేత ఆకాశమందు విహరించుచుండెను. ఒకనాఁడు విద్యా ధరుల యుదారచరిత్రమును వినఁ గుతూహలంపడి ఆమె యడుగఁగా యౌగంధరాయణుఁడు అందఱు విన నీ కథను వర్ణించెను.

## జీ మూ త వా హ న క థ.

పర్వతములకుమాత్రమే గాక పరమశివునికి కూడ గురువు అంబికకు తండ్రి హిమవంతుఁ డని పర్వతరాజు కలఁడు. విద్యా ధరనివాస మయిన యీ మహాచలమందు విద్యాధరాధిపుఁడు జీమూతకేతువు నివసించెను. అతనియింట కులక్రమాగత మై మనోరథదాయక మని సార్థకనామ మయిన కల్పవృక్ష మొకటి యుండెను. ఒకనాఁడు జీమూతకేతువు ఉద్యానవనములో నున్న

యా కల్పవృక్షమును దేవతాస్వరూపమును ఇట్లని యాచించెను:—'దేవా, నీవలన మాకు సకలాభీష్టములును సర్వదా సిద్ధించుచున్నవి. ఇప్పుడు అపుత్త్రునికి నాకు పుత్త్రుని దయసేయుము.' అంతట కల్పవృక్షము 'ఓరాజా, నీకు జాతిస్మరుఁడును దానవీరుఁడును సర్వభూతహితుఁడును అగు పుత్త్రుఁడు కలుగును.' అని వర మిచ్చెను. ఆ మాట విని సంతోషించి రాజు కల్పవృక్షమునకు మ్రొక్కి పోయి ఆవృత్తాంతముచే తనపట్టపు దేవి వీనులకు విందు చేసెను. పిమ్మట త్వరలోనే ఆరాజునకు కుమారుఁడు పుట్టెను. రాజు అతనికి జీమూతవాహనుఁ డని పేరుపెట్టెను. మహాసత్త్వుఁడు జీమూతవాహనుఁడు సహజమయిన భూతదయతోఁ గూడ పెరుఁగుచుండెను. క్రమముగా నతఁడు యువరాజై, ఒకనాఁడు తండ్రిని శుశ్రూషచే సంతోషపెట్టి ఏకాంతమందు ఇట్లని విన్నవించుకొనెను. 'నాయనా, ఎఱుఁగుదువు, ఈజన్మములో సకలపదార్థములును నశ్వరములే, మహాత్ముల నిర్మలయశస్సుమాత్రము ఆకల్పము ఉండును. ఆయశస్సే పరోపకారముచేఁ గలిగినదేని మఱి చెప్పవలయునా? ఉదారులకు అంతకన్న ఏధనము ప్రాణాధికము? పరానుపకారిణే యైన సంపద లోకములో జనములకు ఖేదమును కలిగించి చంచలమై ఎక్కడనో ఒకచోట లయము నొందును. మనపెరటిలో నున్నదే కామదము కల్పవృక్షము, దానిని పరార్థమై వినియోగింతుమేని అప్పటికి గదా దాని

ఫలమును మన మనుభవించినవార మగుదుము. కనుక నేను దాని సమృద్ధులచేత ఈజనసమూహము నెల్ల అదరిద్రముం జేసెదను.' ఇట్లు తండ్రితో విన్నవించి అనుజ్ఞవడసి జీమూతవాహనుఁడు కల్పవృక్షమునొద్దకు పోయి యిట్లు పలికెను. 'దేవా, నీవు మాకు మాటిమాటికిని కోరినకోరికలం దీర్చుచున్నావు. ఇప్పుడు నాకోరిక నొకదానిని నెఱవేర్పుము. చెలీ, ఈ సకలపృథివిని అదరిద్రనుగాఁ జేయుము. నీకు క్షేమము కలుగునుగాక. నిన్ను ధనార్థు లయిన జనులకు ఇచ్చితిని.' ఇట్లు ఆ ధీరుఁడు పలుకఁగా కల్పవృక్షము భూతలమందు విస్తారముగా బంగారము వర్షించెను. జను లందఱును సంతోషించిరి. 'దయామూర్తివు బోధిసత్త్వాంశుఁడు జీమూతవాహనుఁడు తప్ప మఱి యెవఁడు కల్పవృక్షమును కూడ యాచకుల కిచ్చుటకు సమర్థుఁడు!' అని దిక్కులయందును విదిక్కులయందును అనురాగపూర్వకముగా జీమూతవాహనుని యశస్సు మిక్కిలి పర్వుచుండెను.

అంతట కుమారుని ఖ్యాతిచే రూక్షమయియున్న యా జీమూతకేతువుయొక్క రాజ్యముకై దాయాదులు విరోధింపసాగిరి. దత్తమైనందున కల్పవృక్షము లేమిచే అతనిని జయించుట సుకర మని తలంచి అందఱు నొకటిగాఁ గూడి యుద్ధమునకు సమకట్టిరి. అంతట జీమూతవాహనుఁడు తండ్రితో నిట్లనియె —

'నాయనా, ఈశరీరమే నీటిమీఁది బుడగవంటిది; అట్లే పెనుగాలిలో దీపకళికవలె చపల యగుసిరివలన ప్రయోజన మేమి? అట్టిదానిని పరపీడవలనఁగూడ ఎవఁడు కోరును? కాఁబట్టి నేను దాయాదులతో పోరుట యుక్తము గాదు. రాజ్యము వదలి ఎక్కడి కైనను పోవుట నాకు యుక్తము. ఈ దీనులు బ్రదికిపోదురు గాక. స్వకులనాశము తప్పును గాక.' జీమూత వాహనుఁ డిట్లు చెప్పఁగా జీమూతకేతువు ఇట్లు నిశ్చయించు కొని పలికెను:—'పుత్త్రా, నేను కూడ పోవలసినదే, యౌవన వంతుఁడవు నీవే కృపచే రాజ్యమును తృణముగా వదలఁగా వృద్ధునకు నాకా తృష్ణ?' అంతట జీమూతవాహనుఁడు తలి దండ్రులను దోడ్కొని మలయాచలమునకుఁ బోయి అచట గంధపుమ్రాఁకులచే ఆవరింపఁబడిన సెలయేళ్లుగల సిద్ధాశ్రమ మందు వారికి శుశ్రూష చేయుచు నివసించి యుండెను.

అచట విశ్వావసువను సిద్ధరాజు కుమారుఁడు మిత్త్రా వసువు ఇతనికి మిత్త్రి మాయెను. ఒకనాఁడు అతనిచెల్లెలిని కన్యకను తనజన్మాంతరప్రియతమను జ్ఞాని యైన జీమూతవాహ నుఁడు ఏకాంతమందు చూచెను. అప్పుడు వారి యన్యోన్య సందర్శనము వారి మనోమృగములను పట్టు మదనుని వలగా నుండెను. ఒకనాఁడు ఆకస్మికముగా మిత్త్రావసువు వచ్చి త్రైలోక్యపూజితుఁడైన జీమూతవాహనునితో 'ఓ సఖుఁడా, నాకు మలయవతి యని చెల్లె లున్నది. ఆమెను నీకిచ్చెదను,

సూర్యాశ్వములు శ్యామవర్ణము లనియు, వినత తెల్లని వనియుఁ వివాదపడి పరస్పరదాస్యము పందెము కట్టిరి. అందులో జయూ స్థినిమై కద్రువ తనకుమారులచేత సూర్యాశ్వములను ఆకస్మిక ముగా విషపూత్కారమలినములను చేయించి చూపి వినతను దాసిని చేసికొనెను. స్త్రీలయొర్వ్యామి అద్భుతము గదా! అంత వినతకుమారుఁడు గరుడుఁడు తనతల్లిని దాస్యమునుండి వదలు మని కద్రువను మంచిమాటలుగా నడిగినాఁడు. అంతట కద్రూసుతులు ఆలోచించుకొని అతనిని 'ఓవైనతేయా, పాల సముద్రమును దేవాసురులు త్రచ్చుచున్నారు. నీవు బలవంతు లలో ఉత్తముఁడవు. మాకు అమృతమును తెచ్చి యిచ్చి నీతల్లిని కొనిపొమ్ము.' అని చెప్పిరి. నాగుల యీమాటను విని గరుడుఁడు పాలసముద్రమునకు పోయి అమృతముకొఱకు మహాపరాక్రమము చూపెను. అంతట ప్రీతుఁడై హరి స్వయ ముగా గరుడునితో 'ఓ గరుడా, నీపరాక్రమము మెచ్చితిని, వర మడుగుము.' అనెను. 'తల్లిదాస్యముచే కోపితుఁడ నైన నాకు నాగులు ఆహార మగుదురు గాక.' యని వర మడిగెను. హరియును ఆ వర మిచ్చెను. పరాక్రమార్జితామృతుని గరుఁ డుని ఇంద్రుఁడు 'ఆ మూఢులు అమృతమును త్రాగ కుండు నట్లును నేనే దానిని మరల కైకొనునట్లును చేయు' మని హెచ్చరించెను. సరియే యని గరుడుఁడు నాగులకడకు వచ్చి వరప్రసాదభీతు లయిన యానాగులతో దూరమునుండియే

'ఇదిగో అమృతము, దీని నిక్కడ నుంచి పోయెదను; మా యమ్మను వదలిపెట్టి దీనిని పుచ్చుకొండి.' అని పవిత్రమయిన కుశాస్తరమందు అమృతకలశమును ఉంచెను. నాగులు వినతను వదలిరి. ఆమెను తోడ్కొని గరుడుఁడు పోయెను. వెంటనే నాగులు ఆయమృతమును గ్రహింపఁబోఁగా ఇంద్రుఁడు తన శక్తిచేత వారిని విమోహితులను చేసి దానిని హరించుకొని పోయెను. అంతట దుఃఖితులై నాగులు ఆదర్భలో నేమయిన నమృతము చిందియుండదా యని దానిని నాకసాగిరి. అందువలన వారినాలుకలు చీలిపోయినవి. అతిచాపల్యము కలవారు అపహాస్యులు గాకుందురా? అలబ్ధామృతులను నాగులను పగచే గరుడుఁడు భుజింప నారంభించెను. అతనిరాకచే రాజిలములు జడిసి నిర్జీవములై పడినవి, నాగాంగనలకు గర్భచ్యవనములయినవి, పాతాళమంతయు పాడైనది. ఒక్కమాఱే నాగలోకమెల్లను నాశమగు నని భయపడి, వాసుకి ఇతనికి 'గరుడా, నీకు దిన మొకనాగుని పంపెదను. ఒక్కమాఱే నాగుల నందఱను నాశము చేయకు, నీవు పాతాళమునకు రావలదు. వత్తువేని నీ యాహారము శీఘ్రములోనే నశించును. అట్లు నీ కార్యమే చెడిపోవును.' అని మనవి చేసికొనెను. అందుల కంగీకరించి గరుడుఁడు దినదినమును వాసుకి పంపెడి యొక్కొక్కనాగుని భుజించుచున్నాఁడు. ఈవరుసను లెక్కలేనినాగులు నశించిరి. నా పేరు శంఖచూడుఁడు, ఈదినము నావంతు. కనుక నేను

నాగరాజాజ్ఞచే గరుడుని కాహారమగుటకై వధ్యశిల నెక్కి నాఁడను. ఇందులకే మాయమ్మ యేడ్చుచున్నది.

ఇట్లు శంఖచూడుఁడు చెప్పఁగా విని జీమూతవాహనుఁడు మిగుల వగచి యి ట్లనియె:— 'అయ్యో! ఎంతసత్త్వహీనమయిన ప్రభుత్వము వాసుకిది! తన ప్రజలను తనచేతులతోనే శత్రువున కాహారముగా అర్పించుచున్నాఁడు! తన్నే ఏల మొట్టమొదటనే గరుత్మంతునికి ఇచ్చుకోలేదు? ఎంత క్లీబుఁడై స్వకులనాశమునకు సాక్షిగా నుండఁ గోరినాఁడు! ఆహా! ఈగరుడుఁడైనను కశ్యపునికి కొమరుఁడై ఇట్టి పాపము నెట్లాచరించెను; గొప్ప వారికి దేహమాత్రమునకై ఎట్టి యజ్ఞానము! నే నైనను నిన్ను నాశరీరమును అర్పించి గరుత్మంతునినుండి రక్షించెదను. మిత్రుఁడా, దుఃఖింపకుము.' ఆమాట విని శంఖచూడుఁడును ధైర్యముతో ని ట్లనియె:— 'వలదు వలదు మహాత్మా, మరల నిట్లు పలుకకుము. గాజుపెంకుకొఱకు ముత్తెమును పోఁగొట్టవచ్చునా? నేనును కులమునకు అపకీర్తిని తేఁజాలను.' ఇ ట్లని శంఖచూడుఁడు ఆతనిని నిషేధించి గరుడునిరాకకు క్షణ మవకాశ ముండుటం గని అంత్యకాలమందు ఆ సముద్రతీరంపు గోకర్ణేశ్వరునికి మ్రొక్క నేఁగెను.

అతఁడు పోఁగానే కరుణానిధి జీమూతవాహనుఁడు ఆత్మార్పణముచే వానిని రక్షింప నవకాశము లభించిన దని సంతోషించి, యుక్తిచేత మిత్రావసువును ఆమాట లన్నియు

మఱపించి ఏదో పనిమీఁద ఇంటికి పంపెను. ఆక్షణములో గరుడుఁడు వచ్చుచుండెను. అతని ఱెక్కలగాలిచే తత్సత్త్వదర్శనాశ్చర్యముచేతనుం బోలె భూమి ఘూర్ణిల్లసాగెను. దానిం బట్టి నాగశత్రువు వచ్చుచున్నాఁడని యూహించి కరుణాత్ముఁడు జీమూతవాహనుఁడు వధ్యశిల నెక్కెను. క్షణములో గరుడుఁడు తననీడచేత ఆకాశమెల్ల కప్పుచు వ్రాలి ముక్కుతో ఆ మహాసత్త్వుని ఎత్తుకొని పోయెను. గరుత్మంతుఁడు సుఖముగా భక్షించుటకై మలయశిఖరమునకుఁ గొని పోవుచుండఁగా జీమూతవాహనుని దేహమునుండి రక్తధార ౘొలికెను. అతనిచూడామణియు గరుడుఁడు పెకలించుటం జేసి రాలి నేలఁబడెను. అట్లు కొనిపోయి గరుడుఁడు భక్షించుచుండఁగా పువ్వులవాన గురిసెను. దానిని చూచి ఇదేమని గరుడుఁడు ఆశ్చర్యపడెను.

ఈలోపల శంఖచూడుఁడు గోకర్ణేశ్వరుని సేవించి వచ్చి రక్తసిక్తమయిన వధ్యశిలాతలమును గాంచి 'అయ్యయ్యో! ఛీ! ఛీ! ఆమహాత్ముఁడు నాకొఱకు తన్ను గరుత్మంతుని కర్పించుకొన్నాఁడు. ఈక్షణములో ఆతనిని తార్క్ష్యుఁడు ఎక్కడికి కొనిపోయియుండును? అతనిని త్వరగా వెదకెను.' అని నెత్తురుజాడ ననుసరించి పోయెను.

ఈలోపల ఆనందపరిపూర్ణుఁడై యున్న జీమూతవాహనుం జూచి ఆరగించుట మాని గరుడుఁడు ఆశ్చర్యముతో 'ఇతఁ

డెవఁడో మహాత్ముఁడు, నేను తన్ను భక్షించుచున్నను ఆయాస పడక ధైర్యముతో సంతోషించుచున్నాఁడు!' అని తలపోయు చుండెను. దానిని చూచి జీమూతవాహనుఁడు తాను అట్టి దుర్దశలో నున్నను తనయభీష్టము నెఱవేఱుటకై 'పక్షీంద్రా, నాదేహమందు ఇంకను రక్తమాంసము లున్నవి. నీకును ఆఁకలి తీఱలేదు. ఏల ఆకస్మికముగా భోజనము మానినాఁడవు ?' అని యడిగెను. ఆమాటకు ఆశ్చర్యపడి పక్షీంద్రుఁడు 'ఓమహాత్మా, నీవు నాగుఁడవు కావు, నిశ్చయము; నీ వెవరవో చెప్పుము.' అని యడిగెను. 'నాగుఁడనే భక్షింపుము. ఆరంభించినపనిని ముగింపుము. ధీరులు ఆరంభించినదానిని వదలుదురా?' అని జీమూతవాహనుఁడు పలికెను. ఆక్షణములో శంఖచూడుఁడు వచ్చి దూరమునుండి 'వలదు! గరుత్మంతుఁడా, వలదు! ఇతఁడు నాగుఁడు గాఁడు! నేను నాగుఁడను. ఇతనిని వదలు ఏమి నీకు నిర్నిమిత్తముగా ఇట్టి మతిభ్రమ కలిగినది!' అని యఱచెను. ఆమాట విని గరుడుఁడు మిగుల విభ్రాంతుఁ డాయెను. తనమనో రథము నెఱవేఱ నందులకు జీమూతవాహనుఁడు ఖేదపడ సాగెను. గరుడుఁడు తా నజ్ఞానముచే విద్యాధరాధిపుని భక్షించి నట్లు తెలిసికొని ఇట్లు పరితపింప సాగెను.— 'అయ్యయ్యో ! ఆశ్చర్య మేమి? విశృంఖలవర్తనులకు పాపము సులభము గదా. ఈ మహాత్ముఁ డొక్కఁడే శ్లాఘ్యుఁడు; ఇతఁడు పరార్థమై ప్రాణ మర్పించి మమతా మోహాక్రాంత మయిన విశ్వమున కంతటికి

పూజ్యుఁ డయినాఁడు.'

ఇట్లు చింతించి గరుడుఁడు పాపశుద్ధికై అగ్నిలో నుఱుకఁ బూనఁగా జీమూతవాహనుఁడు "పక్షీంద్రుఁడా, ఏల చింతించెదవు? పాపమునకు వెఱతువేని ఇఁకను పాములను భక్షింపకుము. భుజించిన పాముల విషయమై పశ్చాత్తాపము పొందుము. ఇది దీనికి ప్రతీకారము. వృథాగా నీ వన్య మాలోచించితివి.' అని మందలించెను. భూతానుగ్రహపరాయణుఁడు జీమూతవాహనుఁ డిట్లు పలుకఁగా తార్క్ష్యుఁడు అతని వాక్యమును గురూపదేశముగా గ్రహించి, అతనిని, అస్థిశేషములై యున్న స్వభక్షిత భుజంగములను, బ్రదికించుటకై అమృతము తెచ్చుటకు స్వర్గమునకుఁ బోయెను. అంతట గౌరి మలయవతిభక్తికి మెచ్చి వచ్చి జీమూతవాహనుని అమృతము గురిసి బ్రదికించెను. దాన నతనిదేహము వజ్రదేహ మఱి అధికకాంతితో విరాజిల్లెను. దేవతలు ఆనందముతో దుందుభులు వాయించిరి.

ఇట్లు జీమూతవాహనుఁడు స్వస్థోత్థితుఁడు కాఁగా గరుడుఁడును ఆకాశమునుండి వేలాతట మంతటను అమృతవర్షము గురిసెను. అంత నచటి సర్పాస్థులన్నియు బ్రదికి లేవఁగా, వేలావనము వైనతేయభయము లేని జీమూతవాహన దర్శనార్థము వచ్చిన పాతాళమో యన ఒప్పుచుండెను. జీమూతవాహనుఁడు అక్షతదేహుఁడును యశస్వియునై యున్నాఁ డని విని బంధువులు అభినందించిరి. భార్యయు తద్బంధువులును ఆమెతల్లి

దండ్రులును సంతోషించిరి. దుఃఖము సుఖముగా పరిణమించిన నెవరు సంతోషింపరు? అతనివలన పీడుకోలు వడసి శంఖ చూడుఁడు పాతాళమునకుఁ బోయెను. జీమూతవాహనుని కీర్తియు స్వచ్ఛందముగా మూఁడు లోకములలోనుం బర్వెను. అంతట దేవతలు జీమూతవాహనునికి బ్రీతినమ్రు లైరి. అతని దాయాదులు మతంగాదులును గౌరీకటాక్షముచేత వచ్చి భయవినయములతో సేవించిరి. ఇట్లు కృతార్థుఁడైన జీమూత వాహనుఁడు ఆదాయాదుల ప్రార్థనచేత మలయాచలమును వదలి తన నిలయ మయిన హిమాలయమునకు పోయి అచట తల్లిదండ్రులతోడను మలయవతీ మిత్రావసువులతోడను చిర కాలము విద్యాధరచక్రవర్తిపద మనుభవించుచు సుఖ ముండెను. ఈప్రకారము సకలలోకహృదయ చమత్కారకారి చరిత్రు లగు మహానుభావుల మార్గమును కల్యాణపరంపరలు స్వయముగానే వెంబడించును.

ఇట్లు యౌగంధరాయణునివలన కథ విని, మిగుల సంతోషించి, ఆపోలికచేతను బ్రీతదేవతానుగ్రహవిశ్వాసము చేతను ఉదార గర్భదోహద వాసవదత్త విద్యాధర చక్రవర్తి కాఁగల తనకుమారుని కథను ఊహించుకొని వర్ణించుచు కాంతునితో ఆదినమును గడపెను.

## 3-వ తరంగము.

## వాసవదత్తా స్వప్నము.

---

పిమ్మట ఏకాంతమందు మంత్రిసహితుఁడై యున్న వత్స రాజుతో వాసవదత్త ఇట్లనియె:—"ఆర్యపుత్త్రా, ఈగర్భమాయి నది మొదలు నాకు తద్రక్షణచింత బలమై యున్నది. కడచిన రాత్రి ఆచింతతోనే నిద్రించిన నాకు స్వప్నములో ఒకదివ్యపురుషుఁడు, ఒడలెల్ల తెల్లనిభస్మమును, బొదలను చంద్రకళయు ఎఱ్ఱనిజడలును, చేత శూలమును కలవాఁడు అగపడి దయతో నిట్లనియె:—'పుత్త్రీ, ఈగర్భము విషయమై నీవు చింతింపకుము. నేను దీనిని రక్షించెదను, నేనే గదా దీనిని నీ కిచ్చితిని. మఱి నీకు నమ్మకముకై ఒక నిదర్శనము తెలిపెదను. రేపు ఒకతె తనపతిని నేరము మోపి లాగుకొని వచ్చి మీయెదుట పిర్యాదు విన్నపము చేసికొనును. ఆమె దుశ్శీల, తనబంధువుల యాసరా చేత పతిని చంపింపఁదలఁచి అతనిమీఁద సమస్తమును అబద్ధమే చెప్పును. ఆసాధువును ఆదుర్మార్గురాలినుండి విడిపింపుమని నీవు ముందుగా నీభర్తతో చెప్పుము.' ఇట్లు పలికి మహాపురుషుఁడు అంతర్ధానము పొందఁగానే నేను మేలుకొంటిని; అంతట తెల్లవాఱినది." ఆమె యిట్లు చెప్పఁగానే అందఱు ఆశ్చర్యపడి దానిని ఈశ్వరానుగ్రహముగా వివరించుచు ఆనిదర్శనమును ఎదురు సూచు చుండిరి.

ఆక్షణమే ఆర్తానుకంపి యైన వత్సరాజునొద్దకు ద్వార పాలప్రముఖుఁడు వచ్చి 'దేవా, ఒక స్త్రీ బాంధవసంవృత యై అయిదుగురు పుత్త్రులను వెంటఁ బెట్టుకొని వివశుని తన భర్తను లాగుకొని వచ్చియున్నది.' అని తెలుపుడు చేసెను. ఆమాట విని రాజు దేవికల తార్కాణ అయినందులకు ఆశ్చర్య పడి వారిని లోపలికి రప్పించెను. స్వప్నము అట్లు తార్కాణ పడఁగా ఆ నమ్మకముచేత తనకు మంచి పుత్త్రుఁడు గలుగు నని నమ్మి వాసవదత్తయు వారు వచ్చినందులకు సంతోషించెను. అంత నా స్త్రీ అందఱును ద్వారమువైపు కౌతుకముతో చూచు చుండఁగా భర్తతోఁ గూడ వచ్చెను. ఆమె వచ్చి దేవీసమేతుఁడై యున్న వత్సరాజుతో దైన్యము నటించుచు 'ఈయన నాభర్త యయ్యు, నిరపరాధకు నాకు అన్నవస్త్రము లియ్యఁడు.' అని విన్నపము చేసికొనెను. ఇట్లాస్త్రీ చెప్పఁగా దానిభర్త 'దేవరా, దీనిమాట లబద్ధము. ఇది తబంధువులతో చేరి నన్ను చంపఁ దలఁచి యున్నది. దీనికి నేను మొదటనే సంవత్సరమునకు సరిపడినది ఇచ్చియున్నాను. దీనిబంధువులే ఇతరులు తటస్థులు సాక్షులు.' అని విన్నపించెను. అంతట రాజు 'దేవికలలో శూలపాణియే సాక్ష్యము చెప్పియున్నాఁడు, ఈ విషయములో వేఱే సాక్ష్య మేల? ఈ స్త్రీని దీనిబంధువులను శిరశ్ఛేదము చేయవలసినది.' అని యాజ్ఞాపించెను. అంతట యౌగంధరాయణుఁడు 'దేవా, అయినను, సాక్షివిమర్శమీఁద

తీర్పు చేయుట యుచితము. లోకులు ఈస్వప్నవృత్తాంతమును ఎఱుఁగనందున నమ్మరు.' అనెను. అంతట రాజు సాక్షులను పిలిపించి యడుగఁగా వారును ఆ స్త్రీమాట లబద్ధమని సాక్ష్యము చెప్పిరి. అంతట రాజు నిశ్చయముగా భర్తకు ద్రోహ మెంచిన యా స్త్రీని దానిపుత్త్రులను దానిబంధువులను దేశము వెడలఁగొట్టించి ఆసాధువును కనికరించి వేఱె వివాహము చేసికొనుటకు చాలినంత ధన మిచ్చి పంపెను. 'దుర్దశ యనుగోతిలో పడి ఆకులుఁడైన పురుషుని బ్రదికీయున్నవాసనే దుష్టభార్య కాకివలె పీఁకుకొని తినును. స్నేహముకలది మంచికులముది గొప్పమనస్సుగలది తాపమును హరించునదియు అగుభార్య దారిలోని చెట్టునీడవలె ఎవనికో ఒకనికి పుణ్యముచేత దొరకును.' ఇట్లని ఆప్రస్తావమున పలుకుచున్న వత్సరాజుతో ప్రక్క నున్న కథాకుశలుఁడు వసంతకుఁడు అనియె:— దేవా, స్నేహము గాని విరోధముగాని మనుష్యులకు పూర్వజన్మకర్మానుసారముగా కలుగును. అందులకు నిదర్శనముగా ఒకకథను చెప్పెదను వినుము.

సింహపరాక్రమునికథ.

వారాణసిలో విక్రమచండుఁ డని రా జొకఁ డుండెను. అతనికి ప్రియభృత్యుఁడు సింహపరాక్రముఁ డనువాఁ డొకఁ డుండెను. వాఁడు రణములోనే గాక జూదములో కూడ ఓటమి ఎఱుఁగనివాఁ డై యుండెను. అతనికి వికృతరూపయు దుష్ట

చిత్తయు నై కలహకారిణి యని సార్థకనామధేయ భార్య యుండెను. అతఁడు విస్తారము ధనమును రాజువలనను జూదము వలనను సంపాదించి దానికి ఇచ్చుచుండెను. అది అతనివలన ముగ్గురుకుమారులను కనియు ఒకక్షణ మయిన జగడమాడక ఉండదు. 'నీవు బైట త్రాగుచున్నావు, భుజించుచున్నావు, మా కేమియు ఇయ్యవు.' అని కుమారులతోఁ జేరి అఱచుచు అతనిని నిత్యము ఆయాసపెట్టుచుండును. అతఁడు రేయుం బవలు అన్నపానములు వస్త్రములు నిచ్చి మంచి చేసికొను చున్నను దురంత యయిన భోగతృష్ణయుంబోలె అది వానిపై మిగుల ప్రజ్వరిల్లసాగెను. అంతట సింహపరాక్రముఁడు ఆకినుక చేత ఖిన్నుఁడై యిల్లు వదలి వింధ్యవాసినిని ఉపాసించుటకు వింధ్యారణ్యమునకు పోయెను. అచ్చట నిరాహార వ్రతమున నున్న యతనితో స్వప్నములో దేవి "లేరా, పుత్రా, ఆ కాశీ పురమునకే పొమ్ము. అక్కడ మిక్కిలి పొడు గయినమఱ్ఱిచెట్టు క్రింద త్రవ్వితివా నీకు నిధి దొరకును. దానినడుమ కత్తివలె నిర్మల మయినది రాలి పడిన ఆకాశఖండమో యన విరాజిల్లు నది గరుడమణిపాత్రి యొకటి దొరకును. దానిలో చూచెద వేని, ఏజంతువుయొక్క పూర్వజన్మమును తెలిసికొనఁ దలంతువో అ దంతయు అందులో ప్రతిమగా వ్రాయఁబడి యున్నట్లు నీకు స్పష్టముగా తెలియును. దానివలననే నీభార్యయొక్కయు నీయొక్కయు పూర్వజన్మములను తెలిసికొని ఆధనమును తీసి

కొని సుఖముగా నుండుము.' అని వర మిచ్చెను. అతఁడును తెల్లవాఱఁగానే పారణ చేసి కాశికి పయన మాయెను. పోయి ఆ మఱ్ఱిచెట్టుక్రింద ఆనిధానమును త్రవ్వుకొని అందు గొప్ప మణిపాత్రమును చూచెను. జిజ్ఞాసునై ఆపాత్రములో చూచి, పూర్వజన్మమందు తన భార్య యెలుఁగుబంటి యనియు తాను సింహ మనియు తమద్వేషము పూర్వజన్మజాతివైరవాసన వలన కలిగిన దనియును ఎఱిఁగి, శోకమోహములను మాని, ఆ పాత్రమహిమచేత, అనేకకన్యలను పూర్వజన్మమందు విరుద్ధజాతీయ లని ఎఱిఁగి వదలి, పూర్వజన్మమందు సింహి యయిన యొక కన్యను తనకు తగినదానిని సింహశ్రీ యను పేరిదానిని పెండ్లి యాడి, ఆకలహకారిణికి అన్నము మాత్రము వేయుచు, నిధిప్రాప్తిచేత సుఖితుఁడై చిన్నభార్యతో సుఖముగా జీవించుచుండెను. ఈప్రకారము ఓరాజా, భార్యాభర్తలకు పూర్వసంస్కారవశముచేత వైరస్నేహములు కలుగుచుండును. ఈ చిత్రకథను విని వాసవదత్తావత్సరాజులు సంతోషించిరి.

మంత్రికుమారుల జననము.

గర్భిణి యైనవాసవదత్తాదేవియొక్కముఖమును తనివి తీఱక చూచుచు ఇట్లు సుఖముగా వత్సరాజు కాలము గడపుచుండఁగా మంత్రుల కందఱకును శుభలక్షణులు కొమరులు గలిగిరి. తొలుత యౌగంధరాయణునికి మరుభూతియు, పిమ్మట రుమణ్వంతునికి హరిశిఖుఁడును, అటుపిమ్మట వసంతకునికి

తపంతకుఁడును, ఆపిమ్మట ఇత్యకుఁ డను నపరనామము గల ప్రతీహారాధికారికి నిత్యోదితుఁ డనువానికి గోముఖుఁడును జన్మించిరి. ఆమహోత్సవమం దశరీరవాణి 'వత్సరాజునకు పుట్టఁగలచక్రవర్తికి శత్రువంశాపమర్దకునికి వీరు మంత్రులు కాఁగలరు' అని ఆకాశమునుండి పలికెను.

నరవాహనదత్త జననము.

తరువాత కొన్ని దినములు గడవఁగా వాసవదత్తాదేవియు ప్రొద్దులయి పుత్త్రివంతురాండు చిత్రముగా అలంకరించినదియు, గవాక్షములలో రక్షార్థ ముంచిన జిల్లేడును జమ్మియుఁ గలదియు, నగుపురుటిల్లు సొచ్చెను. అందు రత్నదీపప్రభలప్రతిబింబములు గలవై చుట్టు నున్నయాయుధములు గర్భరక్షాసమర్థ మయిన తేజస్సును మంటఁ బెట్టుచున్నవో యన నొప్పుచుండెను. పురుటిల్లు మాంత్రికులమంత్రతంత్రములచేత రక్షితమై పాపమునకజయ్యమై మాతృకాగణముయొక్క దుర్గమో యన నొప్పుచుండెను. అందు వాసవదత్త యథాకాలముగా, చంద్రుని దివియుంబోలె, కాంతదర్శనుని అమృతద్యుతిని కుమారుని కనెను. అతని పుట్టుకచే ఆమందిరముమాత్రమే గాక నిశ్శోకతామసమయిన తల్లి మనస్సు కూడ వెలుఁగొందుచుండెను. అంతఃపురవాసు లెల్ల హర్షకోలాహలములో నుండఁగా వత్సరాజు అంతరంగ పురుషునివలన పుత్త్రజన్మమును వినెను. అతనికి వత్సరాజు ఆప్రియనివేదనమునకు బహుమానముగా తనరాజ్యము

నియ్యమి అనౌచిత్యభయముచేతనే గాని లోభముచేతఁ గాదు. రాజు ఔత్సుక్యముతో అంతిపురికి వచ్చి చిరకాలమునకు ఫలితమనోరథుఁడై కుమారుని చూచెను. కెమ్మోవి రేకును ఊర్ణారేఖాకింజల్కములును గలిగి సామ్రాజ్యశ్రీచేతికెందమ్మియో యన నొప్పు నెమ్మొగంబును, పరరాజశ్రీలచే భీతిచే ముందే వదలఁబడిన తమలాంఛనములుంబోని ఛత్త్రచామరరేఖలతోడి కోమలపదయుగళమును గల యాసుతుని చూచి మహీపతి ఆనందబాష్పవ్యాజముచేత సుతస్నేహమును స్రవించుచుండ, యౌగంధరాయణాదులును సంతోషపరవశులై యుండఁ ఆసమయమున ఆకాశవాణి యిట్లు, పలికెను:— 'ఓయి వత్సరాజా, కామదేవుఁడు నీకు కుమారుఁడుగా అవతరించినాఁడు. ఇతనిపేరు ఇచట నరవాహనదత్తుఁడు. ఇతఁడు త్వరలో సర్వవిద్యాధరరాజులకును చక్రవర్తియై ఒకదివ్యకల్పము అతంద్రితగతిని ఏలుచుండును.' ఇట్లు పలికి వాణి విరమింపఁగానే ఆకాశమునుండి పుష్పవర్షములు గురిసెను, దుందుభులు మ్రోఁగెను.

దేవతల యొక్క యీ హర్షసూచనచేత వత్సరాజు అధికాదరముతో పుత్త్రోత్సవము సలిపెను. ఆ రాజమందిరమందు వాయింపఁబడిన తూర్యనాదములు విద్యాధరులకు రాజజన్మమును చెప్పుటకుంబోలె ఆకాశమున వ్యాపించుచుండెను. మేడలకొనల నెత్తిన యెఱ్ఱజెండాలు గాలికి కదలుచున్నవై

ఉత్సవములో నొకదానిపై నొకటి సిందూరంపుబుక్కా చల్లుకొనుచున్నట్లుండెను. ఎల్లయెడల నృత్యము సేయుచున్న వారాంగనలు కామదేవుఁడు సాంగుఁడైనసంతోషముచేత భూమికి వచ్చి నర్తించుచున్న సురాంగనలో యన నెసంగిరి. ఉత్సవాసక్తుఁడైరా జిచ్చిన నవవస్త్రాభరణములచే పుర మెల్ల నగరితో సమవిభవము గలదిగా నుండెను. ఆసమయమందు అనుజీవుల కందఱకును రాజు అర్థములను వర్షించుచుండ బొక్కసమున తప్ప మఱియెక్కడను రిక్తత గలుగ దాయెను. అప్పుడు సామంతాంతఃపురాంగన లెల్ల మంగల్యపూర్వలును స్వాచారదక్షిణలును సతీతాపరలును స్వప్రాభృతోత్తరలును సురక్షకాధిష్ఠితలును ప్రస్ఫుతాతోద్యనిర్హ్రాదలును ప్రత్యక్షణమైన సర్వదిక్కులుంబోలె నేతెంచిరి. అచట నాసమయమందు చేష్టయెల్ల నృత్తముగాను, వచన మెల్ల పూర్ణపాత్రముగాను, వ్యవహార మెల్ల త్యాగముగాను, జను లెల్ల బుక్కాగాను, భూమి యెల్ల చారణులుగాను, పురి యెల్ల ఆనందముగాను, ఉండెను. ఈప్రకారము మహోత్సవము అనేకదినములు జరిగి పౌరుల మనోరథములతోఁ గూడ పూర్ణమయినది.

రాజకుమారుఁడు తండ్రిచేత దివ్యవాణ్యాదేశానుసారముగా నరవాహనదత్తుఁడని కృతనామధేయుఁడై ప్రతిపచ్చంద్రుఁడుం బోలె వృద్ధి పొందుచుండెను. నిగనిగ వెలుంగు నఖకాంతులతో ఆశిశువు పెట్టుచున్న ఒకటిరెండు తప్పటడుగులు

కనియు, మొలకదంతముల కిరణములతోడి ముద్దుమాటలను ఒకటి రెంటిని వినియు, తండ్రి సంతోషము పొందెను.

మంత్రులు శిశువునకు రాజపుత్త్రునికి శిశువులను తమ తనయులను రాజహృదయానందకులను సమర్పించిరి. యౌగంధరాయణుఁడు మరుభూతిని, రుమణ్వంతుఁడు హరిశిఖుని, ఇత్యకుఁడు గోముఖుని, వసంతకుఁడు తపంతకుని, ఇచ్చిరి. పౌరోహితుఁడు శాంతికరుఁడు అన్నకుమారులను పింగళికయొక్క కవలను శాంతిసోముని వైశ్వానరుని అర్పించెను. ఆసమయమందు ఆకాశమందు దేవతలు నాందీనాదములు చేసి పుష్పవృష్టి గురిసిరి. రాజు మహిషీసమేతుఁడై సంతోషించి ఆసచివసుతులను సత్కరించెను. బాల్యమందే అభిమతులయిన యీ యాఱుగురతోను సదా కూడుకొన్నవాఁడై నరవాహనదత్తుఁడు మహాహ్లాదయహేతుభూతగుణయుక్తుఁడో యన నొప్పుచుండెను. ఒకరిచేతనుండి యొకరుగా రాజులెల్ల ప్రీతిప్రవణమనస్కులై ఎత్తుకొనుచుండ క్రీడాహాస్యములచేత హసితవదనుఁడైన యీ బాలుని సాదరముగా చూచుచు ఆనంద నిమగ్నుఁడై వత్సరాజు దినములు గడపుచుండెను.

నరవాహనదత్తజననలంబకము

సమాప్తము.



శ్రీ

# చతుర్దారికా లంబకము.

గీ. మదవిఘూర్ణమానవదనోత్థసిందూర
రాజిచేతఁ బుడమి జాజువాఱఁ
దనదు తేజుచేతఁ దతవిఘ్నముల నేర్చు
నోజఁ దోఁచు విఘ్నరాజు ప్రోచు.



## ౧ - వ తరంగము.



ఈప్రకారము వత్సరాజును దేవియు నేకపుత్త్రుని నరవాహనదత్తుని పెంచుచుండిరి. కుమారుని సంరక్షణకై భయపడుచున్న రాజుతో యౌగంధరాయణుఁ డొకనాఁడు ఏకాంతమం దిట్లనియె:—'రాజా, రాజపుత్త్రుని విషయమై నీవు చింతింపవలదు. సర్వవిద్యాధరాధీశచక్రవర్తి కాఁగల యితనిని నీయింట సాంబమూర్తి గదా సృష్టి చేసినాఁడు. విద్యాప్రభావముచే ఈవృత్తాంతము నెఱిఁగి పాపాత్ములు కొందఱు విద్యాధరులు అసహిష్ణువులై క్షుభితులై యున్నారు. దాని నెఱిఁగి చంద్రశేఖరుఁడు ఇతనిరక్షకొఱకు స్తంభకుఁ డను గణేశుని నియమించి యున్నాఁడు. అతఁడు కంటికగపడకయే నీకుమారుని

రక్షించుచున్నాఁడు. ఈవృత్తాంతమును నాకు నారదులవారు చెప్పినారు.' ఇట్లు మంత్రి చెప్పుచుండఁగానే ఆకాశమధ్యము నుండి కిరీటియు కుండలియు ఖడ్గియు నగు దివ్యపురుషుఁడు అవతరించి వత్సరాజునకు ప్రణతుఁ డాయెను. వత్సరా జతనికి ఆతిథ్యము చేసి 'నీ వెవఁడవు? ఇక్కడికి నీ వేమి పనిమీఁద వచ్చినాఁడవు?' అని కూతూహలముచే నడిగెను. 'నేను పూర్వము మనుష్యుఁడ నై యుండి శక్తివేగుఁ డను విద్యాధరాధిపుఁడ నైతిని. నాకు శత్రువు లనేకులు. నేను నాప్రభావము చేత తెలిసికొని మాకుచక్రవర్తి కాఁగల నీకుమారుని దర్శింప వచ్చినాఁడను.' అని వచించి యతఁడు ఆ భవిష్యచ్చక్రవర్తిని దర్శనము చేసి ప్రీతుఁ డాయెను. అతనిని వత్సరాజు 'మిత్త్రుఁడా, విద్యాధరత్వ మనఁగా నెట్టిది? అది యెట్లు లభించును? నీ కది యెట్లు కలిగినది? చెప్పుమా.' అని యాశ్చర్యపడి యడిగెను. అందున కతఁడు చెప్పుచున్నాఁడు: 'రాజా, ఈజన్మమందుఁ గాని పూర్వజన్మమందుఁ గాని శంకరు నారాధించి ధీరులు విద్యాధరత్వమును పొందుదురు. అందు అనేకవిధములు కలవు. దానికి విద్యాఖడ్గమాలాదికములు సాధనములు. అది నా కెట్లు గలిగెనో చెప్పెదను వినుము.' అని యారంభించి శక్తివేగుఁడు తనకథను వాసవదత్తాసమేతుఁడైన వత్సరాజునెదుట చెప్పం దొడంగెను.

## శ క్తి వే గు ని క థ.

పూర్వము భూలోకభూషణ మైనవర్ధమాన నగరమందు పరోపకారి యను పేర శత్రునాశకుఁ డైన రాజొకఁ డుండెను. ఉన్నతిమంతుఁ డైన యారాజునకు ధారాధరునికి మెఱుపు వోలె కనకప్రభ యని భార్య యుండెను. ఆమెయందు చపలత లేమి మెఱుపుకన్న విశేషము. వారికి కాలక్రమమున లక్ష్మియొక్క రూప గర్వము నణఁచుటకు బ్రహ్మ సృజించెనో యన నొకకూఁతురు జనించెను. ఆమెకు తండ్రి కనకరేఖ యని తన తల్లి పేరు పెట్టెను. ఆమెయు క్రమముగా ఎదుగుచుండెను. ఆమెకు యౌవనము రాఁగా ఒకనాఁడు తండ్రి ఏకాంతమందు తన దేవి కనకప్రభతో ఇట్లనియె:—'దేవీ, మన కనకరేఖ వివాహచింత నామనస్సులో వర్ధిల్లుచు నన్ను బాధించుచున్నది. స్థానప్రాప్తి లేనికులకన్య అట్టి గీతి వ్రాలె విన్నమాత్రాన వెగటు కలిగించును. కన్య అజ్ఞానముచే అపాత్రమున కీఁబడినచో అట్టివిద్యవలె యశో ధర్మములను పెంపక పశ్చాత్తాపమును కలిగించును. కనుక మనపిల్లను ఏరాజున కిత్తము? దీనికి తగినవాఁ డెవఁడు? అని నాకు చింత బలముగా నున్నది.' ఆ మాటకు నవ్వి కనకప్రభ యి ట్లనియె:— "ఆర్యపుత్రా, నీ విట్లు పలుకుచున్నావు, పిల్లయో వివాహము నిచ్ఛగింపదు. ఇప్పుడే కనకరేఖ ఒక బొమ్మను కుమారునిఁగా పెట్టుకొని మేలమాడుకొనుచుండఁగా దానిని నేను 'అమ్మా, నీపెండ్లి యెప్పుడే నేను జూతును?'

అని యడిగితిని. ఆమాటకు అది ఆక్షేపించి నాతో 'అమ్మా, నన్నెవరికిని ఇయ్యవలదు. నావివాహమును బ్రహ్మ లిఖింప లేదు. నేను కన్యను గానే శోభనముగా నుండెదను. అటు గాదేని నేను చత్తు నని యెఱుంగుము. ఇందునకు కారణము కలదు.' అని యుత్తర మిచ్చినది. ఆ మాట విని నేను చింతా క్రాంత నై నీయొద్దకు వచ్చితిని. పెండ్లి అక్కఱ లే దన్న దానికై వరుని విచారింప నేల?" రాణి యట్లు పలుకఁగా రాజు విభ్రాంతుఁడై కన్యాంతఃపురమునకుఁ బోయి కనకరేఖను 'అమ్మా, సురాసురకన్యలు తపస్సులుకూడ చేసి వరముగా పొందునట్టి భర్తృలాభమును నీ వేల వల దనెదవు?' అని యడిగెను. అందునకు నేల సూచుచు కనకరేఖ 'నాయనా, నాకు ఇప్పుడు పెండ్లి అక్కఱ లేదు. తమ కేల యీచింతయు పట్టుదలయు?' అనెను. 'పుత్త్రీ, కన్యాదానముకన్న పాప శాంతికి మేలుసాధనము కలదా? బంధుపరాధీన యైన కన్యకు స్వాతంత్ర్యము కలదా? పుట్టువు మొదలు కన్య పరునికొఱకే రక్షింపఁబడును. బాల్యమందు తప్ప దానికి పెండ్లి లేక తండ్రి యింట నునికి యెక్కడిది? కన్య ఋతుమతి యైన బాంధవులు అధోగతిపా లగుదురు. దానిని వృషలి యందురు. దాని పతిని వృషలీపతి యందురు.' అని తండ్రి చెప్పెను. అంతట కనక రేఖ 'నాయనా, బ్రాహ్మణుఁడు గాని క్షత్త్రియుఁడు గాని కనక పురిని ఏధన్యుఁడు చూచినాఁడో వానికి నన్ను ఈవలసినది.

అటు గాదేని నన్ను ఎంత పీడించినను ప్రయోజనము లేదు.' అనెను. అంత నారాజు 'ఆహా! ఇది వివాహప్రసంగము నంగీకరించినది. ఇది ఎవరో దేవత. ఏమో కారణవిశేషముచేత నాయింటఁ బుట్టినది. కాదేని బాలయయ్యును ఇంత విశేషము ఎట్లు ఎఱుఁగును?' అని తలపోసి అప్పుడు ఆమెతో వల్లె యని పోయెను.

మఱునాఁడు రాజు ఆస్థానగతుఁడై పార్శ్వవర్తులతో 'మీలో ఎవరైనను కనకపురిని చూచి యున్నారా? విప్రుఁడు గాని క్షత్త్రియుఁడు గాని దానిని చూచినవాఁ డెవఁడో వానికి నాకొమారితను కనకలేఖను యౌవరాజ్యమును ఇచ్చెదను.' అనెను. అంతట వారు మొగమొగంబులు చూచుకొని 'దేవా, మేము దానిని విని యైనను ఎఱుఁగము. చూచుట యనఁగా నెక్కడిది?' అనిరి. అంత రాజు ప్రతీహారుని పిలిచి 'ఓయి, నీవు పోయి పురమెల్ల తిరిగి చాటించి తెలిసికొనుము, ఎవఁ డయిన కనకపురిని చూచినవాఁడు కలఁడేమో?' అని యాజ్ఞాపించెను. ఆప్రకారమే వాఁడును పోయి అంద ఱాశ్చర్యపడి వినుచుండ రాజపురుషులచేత పురమెల్ల డప్పు వాయింపించి,—

'విప్రుఁడు గాని క్షత్త్రియుఁడు గాని కనకపురిని కనిన వాఁ డున్నయెడల చెప్పును గాక; అతనికి రాజు కొమారితను యౌవరాజ్యమును ఇచ్చును.'—

అని చాటింపించెను. అందునకు పౌరులు 'ఇదేమి కనక పుర మని ఘోషించుచున్నారు. ఆపురమును ముసల్లము మేము కూడ కని గాని విని గాని యెఱుఁగము!' అని పలికిరే గాని ఒకఁడైనను చూచితి నని చెప్పినవాఁడు లేఁడా యెను. వారిలో బలదేవునికొడుకు శక్తిదేవుఁ డను బ్రాహ్మణకుమారుఁడు ఆ చాటింపు వినెను. ఆపడుచువాఁడు వ్యసనాసక్తుఁడు, ధనమెల్లను అప్పుడే జూదములో పోఁగొట్టుకొన్నవాఁడు. అతఁడు రాజ సుతాప్రదానవార్త విని ఉత్సుకుఁడై యిట్లు చింతించెను:— 'జూదముచేత డబ్బెల్ల పోఁగొట్టుకొనిన నాకు ఇప్పుడు తండ్రి యింటను ప్రవేశము లేదు, బోగమువాండ్రయింటను లేదు; నాకు వేఱే గతి లేదు. నేను ఆనగరము చూచితి నని అబద్ధము చెప్పి చూచెదను. నేను చూడ లే దని ఎవఁడు తెలిసికొనఁ గలఁడు? దానిని ఎవఁడు ఎప్పుడు చూచినాఁడు? ఈటక్కు చేత నాకు రాజపుత్రితో సంగతి కలుగవచ్చును.' ఇట్లు చింతించి శక్తిదేవుఁడు ఆపటహఘోషకులతో 'నేను ఆనగరమునుచూచి తిని' అని అబద్ధమే చెప్పెను. వా రతనిని ప్రతీహారునియొద్దకు గొనిపోయిరి. అక్కడను వాఁడు అట్లే అబద్ధము చెప్పెను. ప్రతీ హారుఁడు వానిని సత్కరించి రాజునెదుటికి కొనిపోయెను. రాజుతోఁ గూడ వాఁడు ఆప్రకారమే అబద్ధము పలికెను. జూదగానికి అసాధ్యమే మున్నది?. రాజు నిశ్చయము తెలిసి కొనుటకై ఆబ్రాహ్మణుని కనకరేఖయొద్దకు పంపెను. ఆమె

యతనిని 'ఏమి? నీవు కనకపురిని చూచితివా?' అని యడిగెను. 'ఔను నేను విద్యార్థినై ఆనగరమున కా నగరమునకు తిరుగుచు ఆనగరమును కూడ చూచినాఁడను.' అని యతఁడు పలికెను. 'నీవు ఏ మార్గమునఁ బోయితివి? ఆనగర మెట్లుండును?' అని యామె యడుగఁగా అతఁడు మరల నిట్లనియె.— 'ఇక్కడినుండి హరపురమునకు, అక్కడినుండి వారాణసికి, వారాణసినుండి పౌండ్రవర్ధన నగరమునకు, అక్కడినుండి కనకపురికిని, పోయితిని. అది ఇంద్రపురముం బోలె అనిమిష లోచనాస్వాద్యశోభయై పుణ్యాత్ములకు భోగభూమియైయున్నది. అక్కడ నేను విద్య నేర్చి కాలక్రమమున ఇక్కడికి వచ్చితిని. నేను పోయినమార్గ మిది. ఆపుర మిట్టిది.' ఆమోసగాఁ డిట్లు పలుకఁగా ఆమె నవ్వి 'ఓహో సత్యము! దొడ్డబ్రాహ్మణుఁడా, ఆ పురమును నీవు చూచినాఁడవు, చెప్పు చెప్పు, మరల ఏమార్గమునఁ బోయితివో?' అని యడిగెను. శక్తిదేవుఁడు మరల గమనుఁదనముగా ఉత్తర మిచ్చెను. అంత నతనిని రాజపుత్రి చేటికలచేత వెడలఁగొట్టించి తండ్రియొద్దకు పోయెను. 'ఆబ్రాహ్మణునిమాట సత్యమా?' అని తండ్రి యడుగఁగా కొమారిత 'నాయనా, రాజ వయ్యును నీవు విచారింపక వ్యవహరించుచున్నావు. ధూర్తులు నిష్కపటులను వంచించుట యెఱుఁగవా? అతఁడు నన్ను మోసపుచ్చుటకు వచ్చినాఁడు. అతఁడు ఆనగరమును చూడలేదు. ధూర్తులు లోకములో

నానావిధముల మోసములు చేయుదురు. అందునకు నిదర్శ
నముగా శివమాధవవృత్తాంతమును చెప్పెదను వినుము.'
అని పలికి చెప్ప నారంభించెను.

శివమాధవ వృత్తాంతము.

రత్నపుర మని సార్థకనామము గలపట్టణరాజ మొకటి కలదు. అందు శివమాధవు లని యిద్దఱు జూదగాండ్రు ఉండిరి. వారు ఇతరధూర్తుల ననేకుల పరివారముగా చేసికొని చిర కాలము నానామాయాప్రయోగములచేత ఆపురమందలి ధని కులసర్వస్వమును హరించిరి. ఒకనాఁడు వా రిద్దఱును ఇట్లు మంత్రాలోచన చేసిరి:—"ఈపట్టణ మంతయు దోఁచినారము. ఇఁకను పోయి ఉజ్జయినిలో నివసింతము. అక్కడి రాజపురో హితుఁడు శంకరస్వామి మహాధనుఁ డని వినికి. ఆతనిధనమును హరించి మాళవస్త్రీవిలాసముల రసమును గుచి చూతము. రా జిచ్చిన సర్వదక్షిణలలోను సగము హరించువాఁడు, ఏడు ధనకుంభములను పాఁతిపెట్టి యున్నాఁడు, పిసినిగొట్టు, అని బ్రాహ్మణులు వానివృత్తాంతమును చెప్పుచున్నారు. ఆబ్రాహ్మ ణునికి ఒక కన్యారత్నము కూడ గల దఁట. ఈప్రసక్తిలో అది కూడ వానివలన మనకు లభించును." ఇట్లు నిశ్చయించుకొని తమపన్నాగము లేర్పఱుచుకొని శివమాధవులు బయలు దేఱిరి. క్రమముగా ఉజ్జయినికి పోయి మాధవుఁడు పరివారముతోఁ గూడ రాజపుత్త్రవేషమున ఊరికి వెలుపల నొకగ్రామములో

నుండెను బహుమాసములు ప్రాణిచక్షుణుండు శివుండు యథావిధి బ్రహ్మచారివేషము దాల్చి ఒక్కఁడే ముందుగా ఆపురిం జొచ్చి అందు నదీతీరమందు ఒకమఠములో బసచేసి అందఱు కగపడునట్లుగా మృద్దర్భభిక్షాభాండమృగాజినములను ఉంచుకొని యుండెను అవీచీనరకపుబురదపూఁతకు సూత్రము వైచికొన్నట్లు ప్రభాతకాలములయందు ఒడలికి దట్టముగా మన్ను పూసికొనుచుండెను. దుష్కర్మచేత తనకు ముందు కలుగఁబోవు నధోగతి నభ్యసించువాఁడు వోలె నదీజలములో స్నానము చేసి చాలసేపు తలక్రిందుగా నుండును. తన్ను కొలుత వైవఁదగు నని ప్రకటించువాఁడుంబోలె స్నాతుఁడై లేచి సూర్యాభిముఖుఁడై చాలసేపు ఉండును. పిమ్మట దేవుని యెదుటికి పోయి చేత దర్భలు కొని సాక్షాచ్ఛ్రుతుముఖుఁడో యన పద్మాసనాసీనుఁడై జపము సేయును. మధ్యలో సాధుహృదయములం బోని స్వచ్ఛపుష్పములతో శివార్చన సేయును. పూజ ముగించి మరల యథాప్రకారము జపాసక్తుఁ డగును. ధ్యానవ్యాజమున శతవృత్తులను తలపోయుచుండును. మధ్యాహ్నము మీఁద భిక్షార్థియై కృష్ణాజినమాత్ర వస్త్రుఁడై ఆపురమందు తద్వంచనార్థము వచ్చినమాయాదేవియొక్క కటాక్షమో యన సంచరించుచుండును. మౌనియై కృష్ణాజినదండధారియై బ్రాహ్మణగృహములనుండి భిక్షాపాత్రయందు తెచ్చి దానిని తన సత్యమును బోలె మూఁడుఖండములు చేసి ఒకపాలు కాకులకు

ఒకపాలు అభ్యాగతునికిని పెట్టి దంభబీజ మయిన మూఁడవ భాగముతో కడుపనెడు తోలుసంచిని నిండించుకొనును. మరల తన సకలపాపములను లెక్క పెట్టువాఁడో యన మిథ్యాజపము సేయుచు చాలసేపు అక్షమాలను త్రిప్పుచుండును. లోకుల యూహలను సూక్ష్మ మయినవానిని కూడ ఆలోచించుచు రాత్రి ఏకాకిగా మఠములో నుండును. ఈరీతిని ప్రతిదినమును కష్ట మయిన మాయతపస్సు చేయుచు వాఁడు అచ్చట నగర జనుల మనస్సులను ఆకర్షించెను. ఇతనికి సకలజనులును భక్తులై నమ్రులైరి. 'అహో! ఎట్టి తపస్వి! ఎట్టి శాంతుఁడు!' అని యతని కీర్తి సర్వత్ర వ్యాపించెను.

ఇంతలో ఇతని చెలికాఁడు మాధవుఁడును చారులవలన ఇతనివృత్తాంతము నెఱిఁగి ఆనగరమున ప్రవేశించెను. దూర ముగా నొకదేవాలయములో బసచేసి రాజపుత్రివేషమున సిప్రానదికి స్నానమునకు వచ్చెను. స్నానముచేసి అనుచరులతోఁ గూడ దేవాలయమునకుఁ బోయి అచ్చట జపమునఁ గూర్చుండి యున్న యాశివునిపాదములలో భక్తినమ్రుఁడై పడిపోయెను. లోకు లందఱు వినుచుండఁగా ఇట్టి తాపసుఁడు మఱి లేఁడు, ఈయనను తీర్థయాత్రలు చేయుచుండఁగా నేను పలుమాఱు చూచి యున్నాను.' అని చెప్పెను. శివుఁడు అతనిని చూచియు దంభముచే మెడ కదలింపక అట్లే యుండెను. మాధవుఁడు ఇంటికి పోయెను. ఆయిద్దఱును రాత్రి ఒకచోట కలసి భోజ

నము చేసి త్రాగి తమ తరువాతిపన్నాగములను పన్నుకొనిరి. నాలవజామున శివుఁడు తన మఠమునకు పోయెను.

మాధవుఁడు తెల్లవాఱఁగానే తనజూదగాని నొకని పిలిచి "ఈదోవతులజోడు కొనిపోయి రాజపురోహితుఁడు శంకరస్వామికి నజరుపెట్టి ఆయనతో 'ఆర్యా, మాధవుఁ డని యొక రాజకుమారుఁడు దాయాదులకు ఓడి తన తండ్రి దైన బహుధనమును కొని దక్షిణ దేశమునుండి ఇచటికి వచ్చి యున్నాఁడు. అతనితో కూడ మఱికొందఱు తత్సమానులు వచ్చి యున్నారు. అతఁడు మీరాజునొద్ద కొలువు గోరి యున్నాఁడు. ఓ కీర్తినిధీ, అతఁడు నన్ను నీదర్శనమునకు పంపినాఁడు?' అని నీవు వినయముతో మనవి చేయవలయును." అని నేర్పి పంపెను. ఆధూర్తుఁడును పోయి సమయము చూచి ఏకాంతమందు కానుక సమర్పించి మాధవుని రాయబారమును యథోచితముగా నివేదించెను. పురోహితుఁడును కానుకపై లోభముచేతను పిమ్మట విశేషముగా ధనము దొరకు ననెడి యాశచేతను ఆరాయబార మంగీకరించెను; లుబ్ధుల నాకర్షించుటకు లంచము ముఖ్యోపాయము గదా. అట్లు నివేదించి రాఁగా మాధవుఁడు ఆమఱునాఁడు లబ్ధావకాశుఁడై, కొందఱు ధూర్తులు బాటసారి వేషములతో కాష్ఠఖండచిహ్నులై రాజపుత్త్రులుగా తనచుట్టుం గొలిచి రాఁగా, స్వయముగానే పోయి ముందుగా నొక కింకరునిచే తనరాక నెఱింగించుకొని

శంకరస్వామిని దర్శించెను. అతఁడును లేచి యెదురుగా వచ్చి మాధవుని గౌరవించెను. మాధవుఁ డతనియొద్ద కొంచెముసేపు కథాలాపములు సేయుచుండి అతని యనుజ్ఞ వడసి తన బసకు పోయెను. మఱునాఁడును ఆప్రకారమే ముందు దోవతుల జోడు కానుక పంపి స్వయముగా పోయి అతనిని దర్శించి 'ఆర్యా, మాపరివారముయొక్క నిర్బంధముచేత మేము సేవఁ గోరి నిన్నాశ్రయించినారము, మాకు ధనము లేక పోలేదు.' అని చెప్పెను. దానిని విని లాభము నెదురు చూచి పురోహితుఁడు ఇతనియిచ్చను నెఱవేర్ప వాగ్దానము చేసి క్షణములో పోయి ఇతనికై రాజుతో విన్నపము చేసెను. అతనియందలి గౌరవముచేత రాజు అంగీకరించెను. మఱునాఁడు పురోహితుఁడు సానుచరుని మాధవుని రాజునొద్దకు కొని పోయి సగౌరవముగా దర్శనము చేయించెను. రాజు రాజపుత్త్రివేషి యైన మాధవుని ఆదరించి వృత్తి యనుగ్రహించెను. మాధవుఁడు రాజును సేవించుచు ఉండి, రాత్రిరాత్రియు మంత్రాలోచనకై శివునియొద్దకు వచ్చుచుండెను.

ఇతనికి ఉపచారములు చేసి లాభము పొందుదును గాక యని తలఁచి పురోహితుఁడు తనయింటనే నివసింపు మని మాధవుని వేఁడుకొనెను. అంతట మాధవుఁడు చెట్టునకు వినాశహేతు వయిన కారండవము దానితోఱ్ఱలోనే ప్రవేశించినట్లు సహచరులతోఁ గూడ పురోహితుని యింట ప్రవేశించెను.

మాయ మాణిక్యముల నగలతో నొకబిందెను నిండించి పురోహితునిబొక్కసములో దాఁపఁ బెట్టును. అప్పుడప్పుడు దానిని తెఱచి నానా వ్యాజములచేత అందలియాభరణములలో ఒకటి రెండు కొంచెము కొంచెము చూపి పురోహితుని మనస్సును, గొల్లవాఁడు గడ్డిచూపి పశువుమనస్సును హరించునట్లు హరించెను. పురోహితునికి తనయందు నమ్మకము దృఢము కాఁగానే ఆహారము తగ్గించుకొని కృశించినవాఁడై తనకు అగ్నిమాంద్య వ్యాధి కలిగెనని నటించుచు కొన్నాళ్లు పోనిచ్చి, పిమ్మట నొక నాఁడు తన శయ్యాయొద్ద నున్నపురోహితునితో ఆధూర్తరాజు హీనస్వరముతో నిట్లనియె.—'నా దేహదశ విషమముగా నున్నది. నీవు బ్రాహ్మణోత్తము నొకనిని పిలుచుకొని రమ్ము; నాకు ఇహపరసుఖము కలుగు నట్లు అతనికి నాసర్వస్వమును దానము చేసెదను. ప్రాణమే అస్థిర మై యుండఁగా ధనముల యందు మనస్సుకి ఆస్థ యుండునా?' దానోపజీవి యైన యాపురోహితుఁడు అందుల కంగీకరించెను. మాధవుఁడును సంతోషించి అతని పాదములలో వ్రాలెను. పిమ్మట పురోహితుఁడు ఏ బ్రాహ్మణుని తెచ్చినను అంతకన్న నుత్తముని తెమ్మని మాధవుఁడు పంపివైచుచుండెను. అది చూచి అతని పార్శ్వమున నున్నధూర్తుఁ డొకఁడు పురోహితునితో 'అయ్యా, సామాన్యులవలన ఇతనికి తృప్తి గానేరదు. సిప్రాతీరమందు తపస్సు చేయుచున్న శివుఁ డనుమహానుభావుఁడు ఇప్పు డున్నాఁడో.

లేఁడో, విచారింపుము.' అనెను. ఆమాట విని మాధవుఁడు సనిర్బంధముగా పురోహితునితో 'ఆహా! అతనిని తెమ్ము. అట్టి మహానుభావుఁడు మఱి యెవఁడు?' అని వేఁడెను. పురోహితుఁడు శివునియొద్దకు పోయెను. ఆసమయమున శివుఁడు ధ్యాననిశ్చలుఁడై యుండఁగ, పురోహితుఁడు అతనికి ప్రదక్షిణము చేసి ఎదుట కూర్చుండెను. ధూర్తుఁడు క్రమముగా కన్నుఁ దెఱచి చూచెను. అంత పురోహితుఁడు వినతుఁడై 'ఓ ప్రభూ, కోపపడవేని ఒకవిన్నపము చేసికొనియెదను.' అనెను. శివుఁడును సంజ్ఞచే అనుజ్ఞ యిచ్చెను. పురోహితుఁడు విన్నపించుట:— 'ఇక్కడ దక్షిణదేశమువాఁడు మాధవుఁ డని రాజపుత్త్రుఁ డొకఁడు మహాధనుఁ డున్నాఁడు. అతఁ డిప్పుడు అస్వస్థుఁడై సర్వస్వదానము చేయ నున్నాఁడు. నీ వంగీకరింతువేని నానారత్నమయాభరణోజ్జ్వల మయిన తన సర్వధనమును నీకు ఇచ్చును.' ఆమాట విని క్రమముగా శివుఁడు మౌనము మాని 'ఓ బ్రాహ్మణా, భిక్షాశనుఁ డను బ్రహ్మచారిని అగు నాకు ధనముతో పని యేమి?' అనెను పురోహితుఁ డిట్లనియె: 'ఓ బ్రాహ్మణోత్తమా, అట్లు పలుకకుము, ఆశ్రమక్రమమును ఎఱుఁగవా? వివాహమాడి గృహ మాశ్రయించి దేవపితృతిథి క్రియలు చేయుచు ఆశ్రమిశ్రేష్ఠుఁ డయిన గృహస్థుఁడు ధనముల వలన ధర్మార్థ కామములను సాధించును.' అంతట శివుఁడు 'నాకు భార్య యెక్కడ దొరకును? ఏకులము పట్టిన ఆకులము

దానిని నేను పెండ్లి యాడను.' అనెను. పురోహితుఁడు శివుని ధనమును తాను సుఖముగా అనుభవింపవచ్చు నని తలంచి అవసరమును పోనీయక శివునితో ని ట్లనియె:—'అ ట్లయిన, నాకు వినయస్వామిని యని కన్య అతిరూపవతి కలదు. దానిని నీ కిచ్చెదను. మాధవుఁడు నీ కిచ్చెడు ప్రతిగ్రహధనమును నేను దాఁచిపెట్టెదను. గృహస్థాశ్రమమును స్వీకరింపుము.' ఈ మాట విని సిద్ధకాముఁడై శివుఁడు 'బ్రాహ్మణా, నీకు ఈయభిప్రాయము అంత దృఢ మేని నీమాటను జరిపెదను. నేను తాపసుఁడను, స్వర్ణరత్నస్వరూపము నెఱుఁగనే యెఱుఁగను. నీమాటప్రకారమే నడచుకొనియెదను. నీచిత్తము వచ్చినట్లు చేయుము.' అనెను. శివుని యీమాటకు సంతోషించి అంగీకరించి యామాధుఁడు వానిని తనయింటికి కొనిపోయి, అశివుని ఆశివుని తనయింటఁ జేర్చుకొని, ఆవృత్తాంతమును మాధవునికి తెలిపి సంతోషపెట్టెను. మిక్కిలి కష్టపడి పెంచిన తన కొమారితను, మూఢత్వముచే, సంపదను కోలుపోవుట వోలె, శివునికి ఇచ్చి వెంటనే వివాహము చేసెను. వివాహమయిన మూఁడవనాఁడే ప్రతిగ్రహార్థము మాయమాంద్యముచే పడి యున్న మాధవునియొద్దకు శివుని కొనిపోయెను. 'అచింత్య తపసునికి నీకు నమస్కారము.' అని పలుకుచు మాధవుఁడు లేచి శివునిపాదములకు మ్రొక్కెను. అతనికి బొక్కసమునుండి తెప్పించి అనేక కృత్రిమ మాణిక్యాభరణ భరిత మయిన యా

భాండమును యథావిధిగా దానము చేసెను. శివుఁడును దానిని ప్రతిగ్రహించి ఆపురోహితుని చేతిలో 'నే నేమియు నెఱుఁగను, నీవే ఎఱుఁగుదువు.' అని సమర్పించెను. 'ఇందునకు నేను ముందే అంగీకరించితిని. దీనిని గుఱించి నీకు చింత యేల?' అని తత్క్షణమే పౌరోహితుఁడు దానిని పుచ్చుకొనెను. శివుఁడు మాధవుని ఆశీర్వదించి తనభార్యగదికి పోఁగా శంకరస్వామి ఆభాండమును కొనిపోయి తనబొక్కసములో పదిలపఱిచెను.

మాధవుఁడు మఱునాఁడు మాంద్యవ్యాజమును క్రమముగా విడిచి ఆ మహోదానప్రభావముచేత తనకు రోగము శమించిన దని చెప్పసాగెను. తనయొద్దకు వచ్చిన పౌరోహితుని 'నీవు నాకు ధర్మసహాయుఁడ వయినందున ఈమహాపదనుండి తప్పితిని.' అని స్తుతించెను. 'ఇతని మహిమచే నాకు దేహము స్వస్థ మయినది.' అని స్తుతించి శివునితో బహిరంగముగా స్నేహము చేయసాగెను. కొన్ని దినములు గడచిన పిమ్మట శివుఁడు పురోహితునితో నీ యింట ఈరీతిగా నే నెన్నాళ్లు భుజించుచుందును ? కనుక నీవే ఆ యాభరణములను వెలకు పుచ్చుకొన లేవా? వెల లేనివని శంక యేని నీకు కలిగినది యిచ్చిపుచ్చుకొమ్ము.' అనెను. అంతట పురోహితుఁడు ఆయాభరణములు మహామూల్యము లని వానికి తన సర్వస్వమును వెల యిచ్చెను. అందునకు నిదర్శనముగా శివునిచేత విక్రయపత్త్రము వ్రాయించి పుచ్చుకొనెను. ఆధనము తన ధనము

టెల్లో యన నెసఁగుచుండెను. అచట నతఁడు 'ఎవఁడు ఇక్కడ నీళ్లడిగినవాఁడు?' అని గట్టిగా కేక వేయఁగా, 'నేను అడిగినాఁడను.' అని ఒక పలుకు వినఁబడెను. అంతట ఆసవ్వడిని పట్టి చెంత నున్న సొదమంటయొద్దకు పోయి, అశోకదత్తుఁడు అచట కొఱుత నొకపురుషుని, క్రింద సదలంకారభూషితయు సర్వాంగసుందరియు అదృష్టపూర్వయు నై ఏడ్చుచున్న యొక స్త్రీని, చూచెను. రజనీపతి కృష్ణపక్షమందు క్షయించి అస్తమింపఁగా ఆశోకముచే చంద్రరశ్మి [illegible]యేయ రాత్రి సొద చొర వచ్చినదో యన నొప్పుచున్న యా కాంతను అశోకదత్తుఁడు 'అమ్మా, నీ వెవ్వతెవు? ఏల యిక్కడ నేడ్చుచున్నావు?' అని యడిగెను. 'మిత్త్రమా, నేను [illegible]తఁబడిన యీపురుషుని భార్యను; నిర్భాగ్యురాలను, ఇతనితో కూడ సొద చొచ్చుటకు నిశ్చయించుకొని యిక్కడ నున్నాను. ఇతనిప్రాణ మెప్పుడు పోవునా అని కనుపెట్టుకొని యున్నాను, మూఁడుదినములయినవి, ఇప్పటికిని పోదు. మాటిమాటికి మంచినీళ్లు [illegible]గు చున్నాఁడు; నేను పోయి తెచ్చితిని, కాని, కొఱ్ఱు [illegible] చేత ఇతనినోటికి నేను నీళ్లు అందింప లేక యున్నాను.' ఆమె పలికెను. వీరుఁ డశోకదత్తుఁడు 'ఇదిగో, రాజు కి ఇతనికి జలము పంపినాఁడు, తెచ్చితిని చూడుము; నీవు నా మీఁద కాలు పెట్టి నిలిచి ఈజలమును ఇతనినోట పోయు

ఆపత్కాలమందు పరపురుషునిఁ దాఁకినమాత్రాన స్త్రీలకు దోషము లేదు.' అనెను. అందున కామె సరియే యనఁగా అతఁడు కొఱితియొద్ద వంగెను. ఆమెయు అతని వీఁపుమీఁదను రెండుపాదములను మోపి ఎక్కెను. క్షణములో నేలమీఁదను అతని వీఁపుమీఁదను రక్తబిందువులు రాల సాగెను. ఆ వీరుఁడు మొగ మెత్తి చూడఁగా ఆ స్త్రీ కొఱుతమీఁద నున్న యా పురుషుని మాటిమాటికి సురెకత్తితో కోసి వానిమాంస మును భక్షించుచుండెను. అశోకదత్తుఁడు ఆమెను వికృతినిగాఁ దలఁచి నేల నైచి కొట్టువాఁడై గల్లని అందియ మ్రోఁగుచున్న పాదమును పట్టుకొనెను. ఆమెయు ఆపాదమును లాగికొని తన మాయచేత తత్క్షణమే ఆకాశమున కెగిరి చిచ్చుమొగం బాయెను. ఆమెయొక్క మణినూపురము మాత్రము అశోక దత్తునిచేతియందు నిలిచినది. అంత నావీరుఁడు మొదట మృదువును నుధ్యలో అధఃకరించినదియు చివరను వికార ఘోరయు నై ఖలసంగతి ననుకరించి తప్పించుకొని పోయిన యా స్త్రీని తలంచుచు చేతిలోని దివ్యనూపురమును కాంచుచు ...శ్చర్య తాప హర్షములు పొందుచు వల్లకాటినుండి ఇంటికి ...ను.

మఱునాఁడు ప్రాతఃకాలమందు స్నాతుఁడై జేని యా ...మునకు పోయెను. కొఱుత నున్నవానికి మంచినీళ్లిచ్చితివా ...రాజడుగఁగా ఇచ్చితి నని చెప్పి, అందెను సమర్పించెను.

'ఇ దెక్కడిది?' అని రాజడుగఁగా అద్భుతభీషణ మయిన తన రాత్రి వృత్తాంతమును చెప్పెను. అంత రాజు ఇతని సత్త్వము అసాధారణ మని నిశ్చయించి ఇంతకు ముందే సంతోషించినవాఁ డయ్యును ఈ విశేషమునకు మఱియు సంతోషించెను. రాజు ఆనూపురమును కొనిపోయి రాణికి ఇచ్చి, అది లభించిన విధము నంతయు తెలిపెను. ఆమెయు ఆవృత్తాంతమును విని ఆమణినూపురమును చూచి సంతోషించి ఏకాంతమందు అశోకదత్తుని మాటిమాటికి స్తుతించెను. రాజు ఆమెతో 'దేవీ, ఇతఁడు జాతిచేతనే గాక విద్యచేతను, సత్యముచేమాత్రమే గాక రూపముచేతను, గొప్పవారికంటె గొప్పవాఁడు. మన కొమారితను అనంగలేఖను ఇతనికి ఇచ్చిన బాగుగా నుండు నని నా యభిప్రాయము. వరునియందు చూచుకొనవలసినది ఈ గుణములను గాని క్షణభంగురను సిరిని గాదు. కనుక ఈ మహావీరునికి మనపిల్ల నిచ్చెదను.' అనెను. ఆమె ఆమాటకు 'ప్రాణేశ్వరా, అట్లు చేయుట మిక్కిలి యుక్తము. ఇతఁడే అమ్మాయికి తగిన వీరుఁడు. అది ఇతనిని ఒకనాఁడు మహోద్యానములో చూచినది; అది మొదలు శూన్యహృదయ యై ఏమియు వినదు కనదు. దాని చెలులవలన ఈ వృత్తాంతమును విని నేను చింతతో నిద్ర పోఁగా స్వప్నములో ఒకదివ్యాంగన అగపడి నా కిట్లు చెప్పినది: 'పిల్లా, మదనలేఖను మఱియెవ్వనికి ఇయ్యఁగూడదు. ఇది అశోకదత్తునికి జన్మాంతరార్జిత యయిన

భార్య.' ఆమాట విని మేలొక్కని వేకువనే పోయి అమ్మాయిని చూచి స్వప్నవృత్తాంతమందలి నమ్మకముచేత ఓదార్చితిని. ఇప్పుడు నీవే స్వయముగా చెప్పితివి. కనుక ఋతువు పొందిన తీఁగ చెట్టునుం బోలె అనంగలేఖ ఆతనిని కూడును గాక.' అనెను. భార్య ఇట్లు చెప్పఁగా రాజు సంతోషించి మహోత్సవముగా అశోకదత్తునికి కొమారిత నిచ్చి పెండ్లి చేసెను. ఆ రాజేంద్రపుత్రీ విప్రేంద్రపుత్త్రుల కూటమి లక్ష్మీ వినయముల కూటమియుంబోలె అన్యోన్యశోభావహముగా నుండెను.

పిమ్మట ఒకనాఁడు దేవి రాజుతో అశోకదత్తుఁడు తెచ్చిన యామణినూపురము నుద్దేశించి 'ఆర్యపుత్రా, ఈయందె ఒంటిదిగా నుండుటచేత ప్రకాశింప కున్నది. దీనికి సరి యయినది ఇంకొకటి చేయింపుము.' అనెను. రాజు కంసాలులను పిలిపించి ఆయందెకు జతగా అట్టిది మఱి యొకటి చేయ నాజ్ఞాపించెను. వారు దానిని పరికించి 'దేవా, ఇట్టిదానిని మేము చేయలేము, ఇది దివ్యశిల్పము, మానుషశిల్పము గాదు; ఇట్టివి యింత గొప్ప రత్నములు భూలోకములో నుండవు. కనుక ఇది యెక్కడ దొరకినదో అక్కడనే రెండవదానిని కూడ వెదకవలయును.' అని విన్నపించిరి. ఆయుత్తరముచే దేవియు రాజును చింతిల్లుటం జూచి అచటనే యున్న యశోకదత్తుఁడు తత్క్షణమే 'దీనిజత యందెను నేనే తెచ్చెదను.' అని ప్రతిజ్ఞ చేసెను. రాజు సాహసమునకు జంకి స్నేహముచే ఎంత వారించినను అశోకదత్తుఁడు

పట్టినపట్టు వదలక ఆయందెను కైకొని ఆవల్లకాటికే కృష్ణ చతుర్దశీరాత్రియందు అది మొట్టమొదట ఎక్కడ దొరకెనో అక్కడికే పోయెను. ఆ రుద్రభూమిలో చితాధూమ్యా మలీమసములు పాశోపవేష్టిత గళస్కం ధోల్లంబిత మానుషములు అంతర్గ తోల్కాదహన జాజ్వల్యమాన కోటరాననంబులు నై రక్షస్సులు చెట్టులుం బోలె నిండి యుండినవి. అందు ఎక్కడను మును పగపడిన యా స్త్రీని కానక, దానియందెకోలకు మహా మాంసవిక్రయమే ఉపాయముగా తలంచి ఒకచెట్టునందు త్రాట వ్రేలుచున్నట్టి యొకశవము నెత్తుకొని 'మహామాంసము నమ్ముచున్నాను కొనుఁడు' అని అఱచుచుచు తిరుగుచుండెను. క్షణములో దూరముననుండి 'ఓమహాసత్త్వుఁడా, దానిని తీసికొని నాతో కూడ రా' అని యొక స్త్రీ పిలిచెను. ఆపిలుపును విని యితఁడును అట్లే దానిచెంతకు పోఁ గోరి చూడఁగా దూరమున చెట్టుక్రింద దివ్యరూప యొక తె అగపడెను. ఆమె స్త్రీలచే పరివేష్టితయై ఆసనమందు కూర్చుండి రత్నాభరణ భాసురయు నై అచట మరుభూమిలో తామరతీఁగయుంబోలె అసంభావ్యస్థితిగా నుండెను. అతఁ డామెకడకుం బోయి 'మనుష్యమాంస మమ్మెదను కొనుము' అని పలికెను. దివ్యరూప యా యంగన 'ఓమహాసత్త్వుఁడా, దీనిని ఏమివెల కిచ్చెదవు?' అని యడిగెను. ఆవీరుఁడు భుజముమీఁదను వీఁపు మీఁదను శవమును కుసురుగా నిలుపుకొని తనచేత నున్న యాయందెను

చూపి 'ఈయందెకు జత యైన యందెను ఎవరు ఇత్తురో వారికి ఈనుహామాంసము నమ్మెదను. నీకుం గలయెడల ఇచ్చి పుచ్చుకొనుము.' అనెను. 'నాకు మఱి యొకయందె కలదు, నీ చేతిలోని యిది నాకాలిదే, కొఱుతఁబడినవానియొద్ద నీకగపడిన దానను నేనే, ఇప్పుడు రూపము మార్చుకొంటిని గాన నీవు నన్ను కనుంగొనవైతివి. మాంస మేల? నేను చెప్పినపని చేయుదువేని దీనికి జత యయిన నారెండవ యందెను నీకు ఇచ్చెదను.' అని యామె పలికెను. అశోకదత్తుఁ డందుల కంగీకరించి 'నీవు చెప్పిన దెల్ల క్షణములో చేసెదను.' అనెను. అంత నామె తనయభీష్టమును అతనికి ఆమూలముగా ఇట్లు తెలిపెను.

"భద్రమూర్తీ, హిమవచ్ఛిఖరంబున త్రిఘంట మని పురము గలదు. అందు లంబజిహ్వుఁ డని రాక్షసాధిపతి ప్రవీరుఁ డుండెను. నేను అతనిభార్యను, కామరూపిణిని, నాపేరు విద్యుచ్ఛిఖ. నాపతి నా కొక కొమారిత కలుగఁగానే దైవవశమున మాప్రభువు కపాలస్ఫోటుని యెదుట నొక యుద్ధములో మృతిఁ బొందెను. అంతట ప్రభువు సంతోషించి ఆపురమును నాకు ఇచ్చినాఁడు. అది మొదలు నేను కూఁతుతోఁ గూడ అందు సుఖముగా నున్నాను. నాకొమారితకు ఇప్పుడు ఎలజవ్వనము వచ్చినది. దానికి తగినవరుని సంపాదించుచింత నామనంబు నాక్రమించి యున్నది. కనుక ఆచతుర్దశీరాత్రి నీవు రాజుతోఁ గూడ ఈమార్గమునఁ బోవుచుండఁగా చూచి నీవు పడుచు

పట్టుదల వదలండాయెను. అంత నామె అతనికి సరస్సును దవ్వు నుండి చూపెను.

ఆ దివ్యసరోవరము మిన్నులు రాయు కొండచఱియ మీఁద నుండెను. పైకి నిగిడినదట్టంపుఁదూండ్లు గలవై ఊర్ధ్వ ముఖము లయి తాము క్రోలఁగాఁ జిక్కిన సూర్యప్రభచేతనుం బోలె దేదీప్యమానము లయిన హేమతామరసములు ఆ సర స్సును అగపడనీయక కప్పి యుండెను. అచ్చట ఆ వీరుఁడు పద్మ మును కోయఁబోఁగానే బెట్టిదు లయినకాపరిరక్కసులు వచ్చి ఆటంకపఱిచిరి. సాయుధుఁడై వారిని ఇతరులను కూడ అతఁడు వధించెను. హతశేషులు పాఱి పోయి తమదొర కపాలస్ఫో టునికి ఆవృత్తాంతమును నివేదించిరి. అతఁడు వెంటనే స్వయ ముగా వచ్చి తామరలను కొల్లగొనుచున్న యశోకదత్తుని చూచి 'ఏమి ! మాయన్న అశోకదత్తుఁడు ఇచటికి వచ్చినాఁడు!' అని ఆశ్చర్య పడుచు ఆనవాలు పట్టి శస్త్రమును పాఱవైచి ఆనందబాష్పప్లుతేక్షణుఁ డై పరుగునఁ బోయి అతనిపాదముల వ్రాలి 'నేను విజయదత్తుఁడను, నీతమ్ముఁడను; మన మిద్దఱము బ్రాహ్మణోత్తముఁ డైన గోవిందస్వామి కుమారులము. ఇంత కాలము నేను విధివశమున ఇట్లు రాక్షసుఁడ నై యుంటిని. సొవల్లోని కపాలమును పగులఁగొట్టి కపాలస్ఫోటుఁ డని పేరు పొందితిని. నిన్ను చూడఁగా నా బ్రాహ్మణ్యము నాకు జ్ఞప్తికి వచ్చినది. నా తెలివిని అజ్ఞానముచే కప్పి యున్న రాక్షసత్వము

పోయినది.' అని చెప్పెను. ఇట్లు చెప్పుచున్న విజయదత్తుని అశోకదత్తుఁడు కవుఁగిలించుకొని రాక్షసత్వదూషిత మయిన యతని దేహమును కడుగువాఁడుం బోలె అతనిపై చాలసేపు ఆనందబాష్పములు వర్షించుచుండెను. ఇంతలో ప్రజ్ఞప్తికౌశికుఁడను విద్యాధరగురువు ఆకాశమునుండి వచ్చి ఆ యన్నదమ్ములతో 'మీ రందఱును విద్యాధరులరు, శాపముచేత ఇట్లయినారు. ఇప్పటికి మీ కందఱకును శాపము తీఱినది; ఇవిగో బంధుసాధారణము లయిన మీవిద్యలను గ్రహింపుఁడు. స్వజనమును తోడ్కొని మీస్థానమునకు పొండు.' అని చెప్పి వారికి విద్య లిచ్చి ఆకాశమార్గమునఁ బోయెను. అంత నా యిరువురు తమ్ము తా మెఱిఁగినవారై విద్యాధరులై హేమాంభోజములను కైకొని ఆకాశమార్గమున ఆహిమవచ్ఛృంగమునకు పోయిరి. అచట అశోకదత్తుఁడు తన ప్రియ రక్షఃపతితనయ యొద్దకు పోయెను. అంత నామెయు శాపము తీఱి విద్యాధరి యాయెను. ఆమెను తోడ్కొని ఆయన్నదమ్ము లిద్దఱును క్షణములో గగనమార్గమున వారాణసికి పోయి అచట వియోగాగ్ని పరితప్తు లయిన తల్లిదండ్రులను దర్శనామృతవర్షముచే చల్లఁజేసి, దేహము మాఱక యున్నను జన్మాంతరగతులై తల్లిదండ్రులకుమాత్రమే గాక లోకుల కందఱకును ఉత్సవమును సమకూర్చిరి. విజయదత్తుఁడు చాలసేపు బిగియఁ గవుఁగిలించినతండ్రియొక్క భుజమధ్యమునుమాత్రమే గాక మనోరథ

మును కూడ నిండించెను. అంత నావృత్తాంత మెఱిఁగి ప్రతాప ముకుటుఁడు కూడ హర్షముతో అచ్చటికి వచ్చెను. అతనిచే సత్కృతుఁడై అశోకదత్తుఁడు తన స్వజనముతోఁ గూడ ఉత్సవ పూర్ణమైన యతనిరాజధానికి పోయి, తన్నెదురు సూచుచున్న ప్రేయసిని ఆనందసముద్రములో నోలలార్చెను. రాజు నకు అనేకకనకాంబుజముల నిచ్చెను. కోరికను మించిన యీ ప్రాప్తికి రాజు సంతోషించెను.

అప్పు డందఱు నచ్చటనే యుండఁగా గోవిందస్వామి ఆశ్చర్యకుతూహలములచే విజయదత్తునిఁ గూర్చి 'నాయనా, ఆ రాత్రి రుద్రభూమిలో రాక్షసుఁడ వయినది మొదలు నీ వృత్తాంతమును చెప్పుము.' అని యడిగెను. విజయదత్తుఁడు పలుకుచున్నాఁడు:—నాయనా, నాఁడు నేను చాపలముచేత సొదలో మండుచున్నకపాలమును పగులఁగొట్టి, అందుండి విధివశము చేత నానోటఁ బడిన వసచేత రాక్షసుఁడనై, మాయావిమోహితుఁడ నగుట నీవే యెఱుఁగుదువు గదా. అంత నన్ను రాక్షసులు కపాలస్ఫోటుఁడా, అని పేరొ్కని తమయొద్దకు పిలిచిరి. నేనును పోయి వారితో కలసికొంటిని. వారు నన్ను తమప్రభువుకొద్దకు కొనిపోయిరి. అతఁడు నన్ను చూచుచునే ప్రీతుఁడై సైనాపత్యాధికారమందు నియోగించెను. పిమ్మట అతఁడు మదముచే గంధర్వులపై దాడి పోయి యుద్ధములో శత్రువులచేఁ జిక్కి చచ్చెను. వెంటనే అతనిభృత్యులు నన్ను

రాజును చేసికొనిరి. నేను రాక్షసరాజ్యము నేలుచు వారి పురమునందే యుంటిని. అక్కడికి ఆకస్మికముగా హేమాంబుజ ములకొఱకు వచ్చినమాయన్నను చూడఁగానే నాకు ఆపూర్వదశ ప్రాంతించినది. పిమ్మట మాకు శాపములు తీఱె మావిద్యలు మరల మాకు ఎట్లు వచ్చినవో ఆ విషయమును పూర్తిగా అన్న మీకు చెప్పఁగలఁడు.

ఇట్లు విజయదత్తుఁడు అచ్చట చెప్పఁగా అశోకదత్తుఁడు ఆవృత్తాంతమును ఆమూలాగ్రముగా వర్ణించెను:—పూర్వము మేము విద్యాధరులమై యుండి ఆకాశమునుండి గాలవాశ్రమ ములో గంగలో స్నానము చేయుచున్నమునికన్యలను ఏకాంత మందు చూచి కామించితిమి. వారును మమ్ము కామించిరి. అది దివ్యదృష్టిచేత ఎఱిఁగి వారిబంధువులు క్రోధముచేత మమ్ము శపించిరి. 'పాపాచారుల రయిన మీ రిరువురును మనుష్యజన్మ మెత్తుఁడు. అచటఁ గూడ మీకు విచిత్రముగా ఎడఁబాపు గలుగును. మనుష్యగోచరము కాని దూరదేశమందు వచ్చిన యొకనిని చూడఁగానే రెండవవానికి జ్ఞానము కలుగును. అంతట విద్యాధరగురువువలన విద్యలు పొంది మరల విద్యా ధరులరై శాపవిముక్తులరై మీబంధువులతో కూడుకొందురు.' ఇట్లు మునులు శపింపఁగా మేము ఇక్కడ పుట్టినారము. మాకు కలిగినవియోగవృత్తాంతము సర్వము మీకు విశదమై యున్నది. ఇప్పుడు పద్మములకై అత్తగారి సిద్ధులమహిమచేత

రక్షఃపతిపురమునకు పోయి తమ్ముని కలసికొంటిని. అక్కడనే ప్రజ్ఞప్తికౌశికుఁ డను గురువువలన ఇరువురము విద్యలు పొంది వెంటనే విద్యాధరుల మై తత్క్షణమే ఇక్కడికి వచ్చితిమి.

ఇట్లు చెప్పి శాపాంధకారము వదలిపోయినందులకు సంతోషించి అశోకదత్తుఁడు తల్లిదండ్రులను భార్యల నిద్దఱను నానా చిత్ర చరితములు చెప్పి సంతోషపెట్టెను. ఆచరితములు వినఁగానే వారికి పూర్వజ్ఞానము కలిగి అందఱును విద్యాధరు లయిరి. అంత నతఁడు మామగారియొద్ద సెలవు పుచ్చుకొని తల్లిదండ్రులను భార్యాద్వయమును తోడ్కొని గగన మార్గమున త్వరగా తమచక్రవర్తి యున్నచోటికి పోయెను. పోయి అతని దర్శించి అతనివలన ఆజ్ఞను అశోకవేగుఁడు విజయవేగుఁడు నను నామములను పొంది విద్యాధరతరుణు లయిన యా యన్నదమ్ములు తమనివాస మయిన గోవిందకూట మనుపర్వతమునకు పోయిరి. ప్రతాపముకుటుఁడును ఆశ్చర్యపరాధీనుఁడై అశోకదత్తుఁ డిచ్చిన సువర్ణకమలములలో నొకటి ఆ దేవాలయమందలి రెండవకలశముమీఁద ఉంచి కడమకమలములతో ఈశ్వరుని పూజించి అశోకదత్తుని సంబంధముచే తనకుల మెల్ల ధన్య మయ్యె నని సంతసించి యుండెను.

ఈప్రకారము ఈ జీవలోకములో దివ్యప్రాణులు కార్యణవిశేషముచేత జన్మ మెత్తుదురు. వారు తమకు తగిన సత్త్వోత్సాహములు కలవారై అశక్యార్థములను కూడ సాధింతురు.

కాఁబట్టి ఓయి సత్త్వసముద్రుఁడా, నీవు కూడ ఎవరవో దే వాంశజాతుఁడ వనియు నీ కిష్టసిద్ధి యగు ననియు తలంచెదను. తఱుచుగా, ఒకనికి గొప్పవారు కూడ సాధింప లేని క్రియల యందు ఉత్సాహము ఉండుట ప్రకృతివిశేషమును సూచించును. నీవు కోరినయీరాజకన్య కనకరేఖ కూడ ఎవరో దివ్యాంగన, కాదేని ఆబాల కనకపురిని చూచినవానినే పతిగా నేల కోరును?

విష్ణుదత్తుఁడు చెప్పిన యీ సరసకథను విని శక్తిదేవుఁడు మనస్సులో కనకపురీదర్శనమునే కోరుచు ధైర్య మవలంబించి ఆరాత్రి గడపెను.

---

## 3 - వ తరంగము.

ఆ మఱునాఁడు తెల్లవాఱఁగానే ఆ దాశరాజు సత్య వ్రతుఁడు శక్తిదేవునొద్దకు వచ్చి 'ఓ బ్రాహ్మణోత్తమా, నీ యిష్టము నెఱవేఱుటకు నేను ఉపాయ మాలోచించినాఁడను. సముద్రమునడుమ రత్నకూట మని ద్వీపము కలదు. అందు సముద్రుఁడు శ్రీహరిని ప్రతిష్ఠించినాఁడు. అచ్చట ఆషాఢ శుక్ల ద్వాదశినాఁడు యాత్రోత్సవము. అందులకు సర్వద్వీపాం తరములనుండియు జనులు ప్రయత్నపూర్వకముగా వత్తురు. అచట నొకవేళ కనకపురీవృత్తాంతము తెలియ వచ్చును. ఆ దినము సమీపించినది, అచటికి పోదము రమ్ము.' అని పలికెను. శక్తిదేవుఁడు సత్యవ్రతుని యీ మాటకు సంతోషించి విష్ణు

దత్తునిచే సిద్ధము చేయఁబడిన బత్తెమును కైకొని ఓడ యెక్కి సముద్రముమీఁద సబురు పోయెను. దీవులవంటి జలజంతువులు గలిగి ఆశ్చర్యనిలయ మై యున్న యా సముద్రములో పోవుచు శక్తిదేవుఁడు కర్ణధారుఁడై యున్న సత్యవ్రతుని 'ఇక్కడికి దూరమున సముద్రములో ఱెక్కలతోడిమహాపర్వతము యదృచ్ఛగా లేచినట్లు అగపడుచున్నదే అ దేమి?' అని యడిగెను. సత్యవ్రతుఁడు చెప్పెను:—'ఇది వటవృక్షదేవుఁడు. దీని క్రింద బడబాముఖ మయిన గొప్పసుడి యున్నది. ఈచోటెని తప్పించుకొని పోవలయును. ఈసుడిలో పడినవారు మరల రారు.' ఇట్లు సత్యవ్రతుఁడు పలుకుచుండఁగానే నీటివడిచేత ఆయోడ ఆదిక్కునకే పోవుచుండెను. దాని నెఱిఁగి శక్తిదేవునితో మరల సత్యవ్రతుఁడు ఇట్లు పలికెను:—'బ్రాహ్మణా, మనకు నిక్కముగా వినాశకాలము వచ్చినది. ఓడ ఇటే పోవుచున్నది. పోనీయక మరలించుటకు నాకు శక్యము కాలేదు. కనుక మనలను మృత్యుముఖముం బోని యీ లోఁతుసుడిలో బలీయ మయిన పూర్వకర్మముం బోలె జలము విసరి పాఱవైచినది. ఇందుకై నాకు దుఃఖము లేదు. శరీరము ఎవరికి శాశ్వతము? ఎంత కష్టపడినను నీకోరిక నెఱవేఱ లేదని నాకు దుఃఖ మగుచున్నది. కనుక నేను కొంచెము ఈయోడను నిలిపెదను, నీవు తటాలున కొమ్మ పట్టుకొని ఈ మఱ్ఱిచె ట్టెక్కుము. భవ్యాకృతికి నీకు జీవితోపాయము ఒకవేళ కలుగవచ్చును. విధివిలాసములను

ఎవఁడు ఊహింపఁగలఁడు?' ధీరసత్త్వుఁడు సత్యవ్రతుఁడు ఇట్లు పలుకుచుండఁగానే ఓడ ఆమఱ్ఱిక్రిందికి వచ్చెను. తత్క్షణమే శక్తిదేవుఁడు భయపడక ఎగిరి లావుపాటి మఱ్ఱికొమ్మను పట్టుకొనెను. సత్యవ్రతుఁడు పరార్థకల్పిత మయిన దేహముతోను ఓడతోను బడబాముఖమందు పడిపోయెను.

శక్తిదేవుఁడు శాఖలచేత ఆశలు నిండించిన యామఱ్ఱిని ఆశ్రయించియు నిరాశుఁడై ఇట్లు చింతించెను: 'నాకు ఆకనకపురి అగపడలేదు సరియే గదా, ఆకస్మికముగా నశించుచున్న నేను దాశరాజును కూడ నాశము చేసితిని. మఱేమి? సంతతమును నెత్తిమీఁద కాలు పెట్టి యున్న దురదృష్టదేవతను ఎవఁడు తప్పింపఁగలఁడు?' ఇట్లు ఆ యవస్థకు తగినట్లు అతఁడు ఆచెట్టుపలవలమీఁద నుండి చింతించుచుండఁగా ఆపగలు గడచిపోయెను. సాయంకాలమందు ఆ చెట్టుమీఁదికి గొప్పగొప్ప పక్షులు అనేకములు దిక్కులు పిక్కటిల్ల కూయుచు నానాదేశములనుండి వచ్చి వ్రాలుచుండినవి. వానిఱెక్కల గాలికి లేచినయలలు పరిచయప్రీతిచేత ఆగద్దలకు ఎదురు పోవుచ త్రొప్పుచుండినవి. అంత నతఁడు ఆకులలో దాఁగినవాఁడై కొమ్మలమీఁద వ్రాలిన యాపక్షులు మనుష్యవాక్కుతో ఒండొకటితో పలుకుచున్న వచనములను వినెను. ఒకటొకటియు తాను ఆపగలు తిరిగినద్వీపాంతరమును దిగంతరమును కొండను వర్ణించెను. వానినడుమ ఒకముసలిపక్షి 'నేను నేఁడు కనకపురికి

పోయితిని, త్రేపు మరల సుఖముగా విహరించుటకు అక్కడికే పోయెదను. వృథా కష్ట మయిన దూరగమనము నా కేల?' అనెను. ఆవచనము అకాలామృతవర్షముగా వీనులు సోఁకఁగా శక్తిదేవుఁడు తాప మాఱి 'ఆహా! ఏమి నాపుణ్యము! ఆపురము ఉన్నది. అచ్చటికి పోవుటకు నాకు ఈపక్షిని వాహనము చేసికొనుటయే ఉపాయము.' అని ఆలోచించి అది నిద్ర పోఁగానే మెల్లఁగా దానియొద్దకు పోయి దాని వీఁపుఱెక్కలలో దాఁగి యుండెను.

తెల్లవాఱఁగానే కడమ పక్షులు నానాదేశములకు పోఁగా ఆపక్షి అనుకూలవిధివలె ఆశ్చర్య పక్షపాతమును చూపుచు ఎగిరి శక్తిదేవుని ఎఱుఁగకయే మోచుచు క్షణములో మేఁతకై ఆకనకపురికి పోయెను. అది అచటియుద్యానములో వ్రాలఁగానే శక్తిదేవుఁడు దానికి తెలియకుండ వీఁపునుండి దిగి ఇక్కడికక్కడికి తిరిగినవాఁడై ఆతోఁటలో పుష్పములు కోయుచున్న పడఁతులను ఇద్దఱను చూచి సమీపమునకు మెల్లగాఁ బోయి, తన్నుఁ జూచి యాశ్చర్యపడుచున్న యాచెలువలను 'ఓ కల్యాణులారా, ఈపట్టణము పే రేమి? మీ రెవరు?' అని అడిగెను. 'ఈ పురిపేరు కనకపురి, ఇది విద్యాధరనివాసము. ఓయి సఖుఁడా, ఇందు చంద్రప్రభ యని విద్యాధరి కలదు. మేము ఆమెయొక్క యుద్యానపాలికలము. ఆమె కొఱకు పుష్పములు గోయుచున్నారము.' అని వా రుత్తరము చెప్పిరి.

అంత నతఁడు వారిని తనకు వారిస్వామినిని దర్శనముచేయింపుఁడని వేఁడెను. అందులకు వారు సరియే యని యతనిని నగరములోని రాజమందిరమునకు కొనిపోయిరి. మాణిక్యస్తంభములతోను బంగారపుగోడలతోను దేదీప్యమానమై సంపదలసంకేతగృహము వలె నున్న యా దివ్యమందిరమును శక్తిదేవుఁడు చూచి అబ్బురపడెను. అచటి పరిజనులందఱును నరునిరాకకు ఆశ్చర్యపడి వెంటనే ఆవింతను చంద్రప్రభకు విన్నవించిరి. ఆమెయు తత్క్షణమే ప్రతీహారముఖముగా అతనిని లోపలికి తనయొద్దకు రప్పించుకొనెను. లోపలికి పోయి యతఁడు నేత్రోత్సవకారిణి యై బ్రహ్మయొక్క సృష్టిపర్యాప్తి అట్లు మూర్తీభవించి అవతరించినదో యన నొప్పుచున్న యా దివ్యాంగనం గాంచెను. ఆమెయు చూచినమాత్రముననే అతనికి వశ్యురాలై దూరమునుండియే రత్నాలమంచము దిగి అతనిని కుశలమడిగి కూర్చుండఁ బెట్టెను. కూర్చున్న పిమ్మట 'ఓయి కల్యాణుఁడా, మనుష్యులకు అగమ్య మయిన యీచోటికి నీ వెట్లు వచ్చినాఁడవు?' అని కుతూహలముచే నడిగెను. అతఁడును తన యూరు పేరు జాతి దేశము చెప్పి, కనకరేఖ యనురాజకన్యను పొందుటకై కనకపురిని చూచుటయే పందెముగా తా నచటికి వచ్చుటయును తెలియఁ జేసెను. అది యెఱిఁగి ఏమేమో తలపోసి చంద్రప్రభ శక్తిదేవునితో ఏకాంతముం దిట్లనియె:—

ఓ సుందరాకారా, నేను చెప్పెదను వినుము. ఈ భూమిలో శశిఖండుఁ డని విద్యాధరపతి కలఁడు. మేము అతనికి క్రమముగా నలువురము కొమారితలము పుట్టినారము. మాలో నేను పెద్దదానను, నాపేరు చంద్రప్రభ, రెండవది చంద్రరేఖ, మూఁడవది శశిరేఖ, నాలవది శశిప్రభ. మేము క్రమముగా తండ్రియింటనే ఎదుగు చుంటిమి. నేను కన్యావ్రతము పూని యుంటిని. ఒకనాఁడు నాచెల్లెండ్రు ముగ్గురును స్నానార్థము మందాకినీతటమునకు పోయి జలకేళి ఆరంభించి అచట జలమందు తపస్సు చేయుచున్న యుగ్రతపసుఁ డను మునిమీఁద నీళ్లు చల్లిరి. వారి యతినిర్బంధమునకు కోపగించి ఆ ముని 'ఓ దుష్టకన్యలారా, మీరు మనుష్యలోకములో పుట్టుఁడు.' అని శపించెను. దాని నెఱిఁగి మానాయన పోయి వేఁడుకొనఁగా ఆముని వారికి ప్రత్యేకము శాపాంతము చెప్పి పూర్వజన్మజ్ఞానమును కూడ అనుగ్రహించెను. అంత వారు దేహములను వదలి మనుష్యలోకమునకు పోఁగా, మాతండ్రి ఈనగరిని నాకిచ్చి దుఃఖముచేత తపోవనమునకు పోయెను. అంత ఇచట నివసించుచున్న నన్ను అంబికాదేవి స్వప్నములో 'పిల్లా, నీకు మనుష్యుఁడు భర్త కాఁగలఁడు' అని అనుగ్రహించెను. అందుచేత అనేకవిద్యాధరులను నాకై మాతండ్రి యుద్దేశింపఁగా నేను వారి నందఱను నిరాకరించి ఇప్పటికిని కన్యగానే యున్నాను. ఇప్పుడు ఆశ్చర్యకర మయిన నీరాగమనముచేతను

నీసౌందర్యముచేతను నీకు వశ్యనై నన్ను నీకు సమర్పించుకొంటిని. కనుక రాఁగలచతుర్దశినాఁడు నీకై నాయనకు విన్నపము చేయుటకు వృషభపర్వతమునకు పోయెదను. అక్కడికి నాఁడు విద్యాధరోత్తము లందఱును ప్రతిసంవత్సరము హరపూజార్థము నానా దిక్కులనుండి వత్తురు; మా నాయనయు వచ్చును. నేను శీఘ్రముగా ఆయన యనుజ్ఞను పొంది వచ్చెదను. అంతట నన్ను నీవు వివాహ మాడుదువు గాక.

అని చెప్పి చంద్రప్రభ విద్యాధరులకు తగిన నానావిధ భోగములతో శక్తిదేవునికి ఉపచారములు సలిపెను. ఆ యునికి యతనికి కార్చిచ్చులో కాలినవానికి అమృతపుమడుఁగులో స్నానము ఎట్లుండునో అట్లుండెను. చతుర్దశి రాఁగానే చంద్రప్రభ యతనితో 'నేఁడు మానాయనతో నీనిమిత్తము విన్నపము చేసికొనుటకై పోయెదను, నాపరిజను లందఱును నాతోనే వత్తురు. నీవు కష్ట మయ్యెనను ఏకాకివిగా రెండు దినములు ఉండవలయును. ఈ మందిరములో నీవు ఒంటరిగా నున్నప్పుడు ఇందలి నడిమియంతస్తునకు మాత్రము పోవలదు.' అని చెప్పి, తనమనస్సును అతనియొద్దనే ఉంచి, అతనిచిత్తము తన వెంట రాఁగా అచటినుండి బయలు వెడలెను. అతఁడక్కడ ఏకాకిగా నుండి అక్కడక్కడ వినోదార్థము మహాసంపదలను చూచుచు తిరుగుచుండి 'ఏల ఈ నడిమి యంతస్తునకు పోఁగూడ దని నాకు విద్యాధరకుమారిక ఆజ్ఞ వెట్టినది?

అని కుతూహలము ప్రేరేపించి ఆసడిమియుంతస్తునకు ఎక్కెను. మనుష్యులమనస్సు అటంకపఱిచినచో విపరీతము గదా! అక్కడి కెక్కి అందు మూసియున్న రత్నమండపములు మూఁడు చూచి, వానిలో ఒకదానితలుపు తీసియుండఁగా లోని కేఁగి, అచట హంసతూలికాతల్పమందు వస్త్రము కప్పుకొని శయనించి యున్నయొకవ్యక్తిని చూచి వస్త్ర మెత్తెను. ఎత్తఁగా అది పరోపకారి మహారాజుయొక్క కూఁతురుగా నుండెను. ఆమెను చూచి శక్తిదేవుఁడు ‘ ఏమి ఈ యద్భుతము! ఏమి! మెలఁకువ లేనినిద్ర నిద్రించుచున్నదా ఈకలికి ? లేక, ఇది యొకభ్రాంతియా ? ఎవతెకొఱకు నేను దేశాంతరము వచ్చినాఁడనో ఆకోమలి ఇచ్చటనే యున్నది. కనుక ఇట బ్రహ్మదేవుఁడు నిశ్చయముగా నాకొఱకు ఏలనో ఇంద్రజాలము చేయుచున్నాఁడు ! ’ అని చింతించి అచటినుండి వెడలి ఆక్రడను మండపములను వరుసగా ప్రవేశించి అట్లే మఱి యిరువురను కన్యకలను చూచెను. అచటినుండియు, ఆశ్చర్యపడి వెలువడి కూర్చుండి క్రింద అత్యుత్తమ మయిన బావిని దానిగట్టున రత్నాల జీను గల యొకగుఱ్ఱమును చూచి డిగి కౌతుకముచేత గుఱ్ఱము నొద్దకు పోయి దాని నెక్కఁ జూచెను. అది ఆతనిని ఆబావిలోనికి త్రోసెను. అందు మునిఁగి శక్తిదేవుఁడు తన జన్మభూమి యైన వర్ధమానపురములో ఉద్యానములోని దిగుడు బావిలో తేలి, చంద్రప్రభ లేనందున కలువలతో సమముగా

దీనుఁడై యుండెను. 'ఈవర్ధమానపుర మెక్కడ? ఆ విద్యాధర పుర మెక్కడ? ఓహో ఇ దేమి యాశ్చర్యము! ఏమి మాయ! అయ్యో, ఎవరో మందభాగ్యుని వంచించినారు. కాక, ఎవని వ్రాంత యెట్టిదో ఎవరికి తెలియును?' అని తలపోయుచు అతఁడు బావిలోనుండి లేచి ఆశ్చర్యపడుచు తనతండ్రియింటికి పోయెను. అచట పటహభ్రమణ వృత్తాంతమును దాఁచి కపటము లాడి తండ్రిచేత అభినందితుఁడై తనరాకకు ఉత్సవము చేయుచున్న స్వజనముతోఁ గూడ నుండి, మఱునాఁడు ఇల్లు వెడలి మరల చాటింపు వినెను.

'బ్రాహ్మణుఁడు గాని క్షత్త్రియుఁడు గాని ఎవఁడు కనక పురిని వాస్తవముగా చూచినాఁడో, చెప్పును గాక; అత నికి కొమారితను యౌవరాజ్యమును రాజు ఇచ్చును.'

దానిని విని శక్తిదేవుఁడు మరల చాటింపువాండ్రతో 'నేను కనకపురిని చూచినాఁడను.' అని పలికెను. వెంటనే వారు రాజునొద్దకు ఇతనిని కొనిపోఁగా రాజు ఇతని మాట అబద్ధ మని తలంచెను. అంతట శక్తిదేవుడు 'నామాట అబద్ధ మేనియు నేను కనకపురిని చూడలే దేనియు మీకు తోఁచిన దండన నాకు చేయవచ్చును. ఇప్పుడు రాజపుత్త్రి నన్ను ఇష్ట మయినట్లు పరీక్షింపవచ్చును.' అనెను. రాజు అక్కడికే కొమారితను పిలిపించెను. ఆమె మరల వచ్చిన యాశక్తిదేవుని చూచి, 'నాయనా, ఇతఁడు మరల అబద్ధములు చెప్పుచున్నాఁడు.'

అనెను. శక్తిదేవుఁడు 'నామాట సత్యమో అసత్యమో, ఓ రాజకన్యా, కనుఁగొనుము. నాకు కుతూహలముగా నున్నది. నేను నిన్ను కనకపురిలో ప్రాణము లేక మంచముమీఁద పరుండి యుండఁగా చూచినాఁడను, ఇక్కడ చూచుచున్నాను.' అనెను. ఇట్లు శక్తిదేవుఁడు ఆనవాలుతో చెప్పఁగా కనకరేఖ తండ్రితో నిట్లనియె:—"నాయనా, నిజముగా ఈమహాత్ముఁడు ఆనగరిని చూచినాఁడు. త్వరలోనే ఇతఁడు నాకు అక్కడనే భర్త కాఁగలఁడు. అచ్చట నాతోఁబుట్టువులను ముగ్గురను ఇతఁడు వివాహమాడును. ఇతఁడు ఆనగరమందు విద్యాధరరాజు కూడ అగును. నేను నాదేహము చేరవలయును, ఆపురికి పోవలయును. నేను మునిశాపమువలన మీయింటఁ బుట్టితిని. 'ఎప్పుడు మనుష్యుఁడు కనకపురిలో నీదేహమును చూచి ఆ రహస్యమును వెల్లడి చేయునో అప్పుడు నీకు శాపము తీఱును, ఆ మనుష్యుఁడే నీకు భర్త కాఁగలఁడు.' అని ఆముని నాకు శాపాంతమును అనతిచ్చెను. నేను మనుష్యకన్య నయినను పూర్వజన్మమును స్మరించుచున్నాను, జ్ఞానవంతురాలనై యున్నాను, కనుక సిద్ధికొఱకు నావిద్యాధరపదమును పొందెదను." ఇట్లు పలికి యారాజకన్య దేహము వదలి యదృశ్యురాలాయెను.

అంతట రాజగృహమందు హఠాత్తుగా అమితమయిన రోదన మారంభమాయెను. శక్తిదేవుఁడు అశక్యక్లేశములను

అనుభవించియు రెంటను భ్రష్టుఁడై ఆ ప్రియలను ఇద్దఱను ధ్యానించుచు తన్ను తాను తిట్టుకొనుచు రాజగృహమునుండి వెలువడి వెంటనే ఇట్లాలోచించుకొనెను:- 'నా కోరిక సిద్ధించును. ఏల చింతిల్లుట ? సిద్ధి సత్త్వాధీనము గదా. ఆదారినే మరల కనకపురికి పోయెదను, మరల అవశ్యముగా దైవమే నాకు ఉపాయము చేయును.' ఇట్లాలోచించి శక్తిదేవుఁడు ఆపురమునుండి తరలెను. కోరిక సిద్ధింపని మాత్రాన ధీరులు ప్రయత్నమును మానరు గదా. అతఁడు పయనమై చిరకాలమునకు మరల ఆ విటంకపురము చేరెను. అచ్చట ఏవర్తకునితో ఓడలో పోఁగా మొదట ఓడ పగిలెనో ఆవర్తకుఁడు ఎదురుపడెను. 'ఆహా! సముద్రములో పడిన యీసముద్రదత్తుఁడు కూడ లేచి వచ్చినాఁడా ! ఏమి విచిత్రము ! ఇందులకు నేనే నిదర్శనము.' ఇట్లాలోచించి ఆ బ్రాహ్మణుఁడు పలుకరింపఁగా నా వర్తకుఁడును అతనిని ఆనవాలు పట్టి కౌఁగిలించుకొని తన యింటికి కొనిపోయి ఆతిథ్యము సలిపి అడిగెను: 'ఓడ పగిలి పోయినపుడు నీవు సముద్రమునుండి ఎట్లు లేచి వచ్చినాఁడవు? శక్తిదేవుఁడు జరిగినవృత్తాంతమును-అనఁగా చేఁప మ్రింగుటయు ఉత్స్థలద్వీపము చేరుటయును-చెప్పి, నీవు ఎట్లు సముద్రమును దాఁటితివో చెప్పు మని యడిగెను. "నేను అప్పుడు సముద్రములో పడి ఒకపలక దొరకఁగా మూఁడుదినములు ఈఁదుచు ఉంటిని. అంత ఆదారిని ఒకయోడ రాఁగా అఱచితిని. అందలి

వారు నన్ను చూచి ఓడలోనికి ఎక్కించుకొనిరి. ఓడ యెక్కి నాతండ్రిని చూచితిని. ఆయన చిరకాలమునకు ముందు వర్తకమునకై ద్వీపాంతరము పోయి అప్పుడు మరలి వచ్చుచుండెను. ఆయన నన్ను చూచి ఆనవాలు పట్టి మెడ కవుగిలించుకొని ఏడ్చుచు నావృత్తాంతము నడిగెను. ఆయనతో నేను చెప్పితిని: 'నాయనా, నీవు ఎన్నాళ్లకును రాక పోఁగా నేను స్వధర్మ మని వ్యాపారములో ప్రవేశించితిని. ద్వీపాంతరము పోవుచు ఇచట యోడ పగులఁగా మునుఁగుచుంటిని. మీరే ఎత్తితిరి.' నేను ఇట్లు చెప్పఁగా నాయన న న్నిట్లు మందలించెను. 'ఏల ఇట్టియపాయములలో ప్రవేశించెదవు? పుత్త్రా, నీకు ధనము కలదు గదా, నేను సంపాదించుచున్నాను గదా. చూడుము నేను ఇప్పుడు ఈయోడ నిండ తెచ్చిన బంగారమును.' ఇట్లు పలికి ఆయన నన్ను ఓదార్చి ఆయోడలో ఈవిటంకపురమునకు తెచ్చెను."

ఆవర్తకునివలన ఇట్లు విని శక్తిదేవుఁడు ఆరాత్రి విశ్రమించి మఱునాఁడు అతనిని 'నేను ఉత్థలద్వీపమునకు పోవలయును. ఎట్లు అచటికి ఈమాఱు పోఁగలనో చెప్పుము.' అని యడిగెను. అచటికి నాబేరగాండ్రు పోవుచున్నారు, నీవును వారితో కూడ ఓడ యెక్కి పొమ్ము.' అని అతఁడు చెప్పెను. శక్తిదేవుఁడును ఆప్రకారము వారితో కూడ ఉత్థలద్వీపమునకు పోయెను. అచట తనబంధు వయిన విష్ణుదత్తుని

యొద్దకే బసకొఱకు బజారుదారిని పోవుచుండఁగా ఆకస్మిక ముగా అతనిని దాశపతి సత్యవ్రతుని కుమారులు చూచి ఆన వాలు పట్టి 'నీవు మానాయనతో కూడ కనకపురిని వెదకుచు పోయితివి గదా, ఇప్పుడు నీవు ఒంటరిగా వచ్చితి వేమి?' అని అడిగిరి. 'సుడి ఓడను బడబాముఖములోనికి ఈడ్చుకొని పోఁగా మీతండ్రి సముద్రములో పడి పోయినాఁడు.' అని శక్తిదేవుఁడు పలికెను. ఆమాట విని దాశపుత్త్రులు 'ఈదు రాత్ముని పట్టుకొనుఁడు, వీఁడు మానాయనను చంపినాఁడు. అట్లు కానియెడల ఇద్దఱిలో ఒకఁడు ఓడలో నుండఁగా రెండవ వాఁడు బడబాగ్నిలో ఎట్లు పడును? కనుక మానాయనను చంపిన యీఘాతుకుని మనము రేపు ప్రాతఃకాలమున చండికా దేవికి బలి వేయుదము.' అని భృత్యులకు ఆజ్ఞాపించి, అప్పుడే అతనిని కట్టించి భయంకర మయిన చండికాలయమునకు పట్టించుకొని పోయిరి. ఆయాలయము మాటిమాటికి అనేక జీవములను గ్రసించునదియు గొప్ప యవకాశము కలదియు గంటలవరుస యనెడి దంతమాలిక కలదియు నై మృత్యువు నోటివలె నుండెను. అచట బద్ధుఁడై రాత్రి యుండి తన బ్రదుకునకు సంశయించుచు శక్తిదేవుఁడు చండికాదేవిని ఇట్లు వేఁడుకొనెను.—'దేవీ, వెక్కసముగా త్రాగ ఒడలెల్లం బర్వెన గురుదానవుని కంఠరక్తముతోడిదో యన బాలభాస్కరబిం బారుణ మయిన నీమూర్తిచేత లోకము రక్షింపఁబడినది. కనుక

నిష్కారణముగా దుష్టులచేతఁ బడినవానిని, ఇష్టజనప్రాప్త్యాశ చేత బహుదూరము వచ్చి యున్నవానిని, సతత ప్రణతుని, నన్ను రక్షింపుము, ఓ వరదా.' ఇట్లు దేవిని అతఁడు వేఁడుకొని ఎట్లో నిద్రింపఁగా అతని స్వప్నములో ఆగర్భగృహమునుండి వెడలి వచ్చి యొక స్త్రీ దివ్యాకార అతనితో దయతో ని ట్లనియె: 'ఓయి శక్తిదేవుఁడా, భయపడకుము, నీకు కీడు కలుగదు. ఈదాశకుమారులకు బిందుమతి యని చెల్లెలు కలదు. ఆకన్య తెల్లవాఱఁగానే నిన్ను చూచి వరించును. నీవు అంగీకరింపుము. అదియే నిన్ను విడిపించును. అది పల్లెది గాదు. అది శాపముచేత ఇట్లు జన్మించిన దివ్యాంగన.' ఆమాట విని మేల్కొనిన యతని కన్నులకు అమృతవర్తిగా ఆ దాశకన్య తెల్లవాఱఁగానే ఆదేవాలయమునకు వచ్చెను. ఇతని యొద్దకు వచ్చి ఔత్సుక్యముతో తన్ను తెలుపుకొని 'నిన్ను ఇందునుండి విడిపించెదను. నాకోరికను తీర్పుము. నాయన్నలకు ఇష్టులయిన వరులను నేను నిరాకరించితిని. నీపై నాకు ప్రీతి గలిగినది. కనుక నీవు నన్నేలుకొనుము.' అని చెప్పఁగా శక్తిదేవుఁడు స్వప్నమును జ్ఞప్తికి తెచ్చుకొని సంతోషించి అందుల కంగీకరించెను. ఆమె యతనిని విడిపించెను. అతఁడామెను వివాహ మాడెను. అమెయన్నలును స్వప్నములో దేవ్యాజ్ఞను పొంది అప్రకారమే ఆకార్యమును నెఱవేర్చిరి. అతఁడు

రూపాంతరోపాగత యైన యూదివ్యాంగనతో పుణ్యైకలబ్ధ యైన సిద్ధితోనుం బోలె నచటనే యుండెను.

ఒకనాఁడు మేడమీఁదనుండి శక్తిదేవుఁడు వీథిలో గోమాంసభారమును మోచికొని పోవుచున్న యొక చండాలుని చూచి ప్రియతో నిట్లనియె: 'ఓ లతాంగీ, గోవులు మూఁడు లోకములకును వంద్యములు. చూడు, ఈపాపి వాని మాంసమును ఎట్లు భక్షించునో!' ఆమాట విని బిందుమతి అతనితో 'ఆర్యపుత్రా, ఆ పాతకము ఇంత అంత అని ఊహింప నలవి గాదు. నేను గోప్రభావముచే అల్పదోషమునకే ఈప్రకారము జాలారిజాతిలో పుట్టితిని. వీనికి తరణోపాయము కలుగునా!' అనెను. అంత శక్తిదేవుఁడు 'ప్రియా, చిత్రముగా నున్నది. చెప్పుము నీ వెవరవు? నీకు ఈ పల్లెజన్మ ఏల కలిగినది.' అని అతినిర్బంధము చేయఁగా 'నా మాట ప్రకారము చేసెద వేని చెప్పెదను.' అని ఆమె పలికెను. అట్లే చేసెద నని అతఁడు ఒట్టు పెట్టుకొనఁగా, అతనితో ఇట్లు తనకోరికను తెలిపెను: 'ప్రాణేశ్వరా, నీకు ఈద్వీపములో మఱి యొక భార్య కలుగును ఆమె త్వరలోనే గర్భము ధరించును. గర్భమునకు ఎనిమిదవనెలలో నీవు ఆమెకడుపును భేదించి ఆ గర్భమును లాగివేయవలయును, రోయఁ గూడదు.' అట్లు పలికి, యతఁడు ఆశ్చర్యపడి జాలిపడుచుండఁగా దాశకన్య మరల నిట్లనియె:—'ఒకానొక హేతువుచేత నీవు ఈ నామాటను

చేయవలయును. ఇఁక నే నెవతెనో నాకు దాశజన్మము ఏల కలిగినదో చెప్పెదను వినుము. నేను పూర్వజన్మమందు విద్యాధరిని, శాపముచేత మర్త్యలోకములో జన్మ మెత్తితిని. విద్యాధరి నై యుండియు నీనాతండ్రులను పండ్లతో కొఱికి తగిలించితిని. ఆదోషముచేత పల్లెదాన నైతిని. గోవుల యొక్క నరమును నోటఁ గఱచినందులకు ఇట్టి యధోగతి యయినది; వానిమాంసము నే భుజించిన ఏమి చెప్పవచ్చును?'

ఇట్లు ఆమె చెప్పుచుండఁగా, ఆమెయన్నలలో నొకఁడు సంభ్రమముతో అచటికి వచ్చి శక్తిదేవునితో 'లేలే, ఎక్కడి నుండియో గొప్పపంది వచ్చి అనేకజనులను చంపి ఇటు వైపుననే వచ్చుచున్నది!' అనెను. అంతట శక్తిదేవుఁడు మేడ నుండి దిగి ఈఁటెను చేతఁ గొని గుఱ్ఱ మెక్కి పందిమీఁదికి పోయి తన మీఁదికి వచ్చుచున్న యాపందిని తత్క్షణమే పొడిచెను. అదియు గాయపడి గుహలోఁ దూఱెను. శక్తిదేవుఁడును దానివెంటనే దూఱి క్షణములో గొప్పయుద్యానమును అందులో ఇంటిని చూచెను. అచట అద్భుతరూప యొక కన్యక ప్రీతిచే వచ్చిన వనదేవతయుం బోలె సంభ్రమముతో ఎదుర కానవచ్చెను. ఆమెను 'ఓకల్యాణీ, నీ వెవ్వతెవు? ఏల ఇట్లు తొట్రిల్లుచున్నావు?' అని యాతఁ డడిగెను. ఆసుముఖి యిట్లనియె: 'ఓసుందరుఁడా, చండవిక్రముఁ డని దక్షిణదిక్పతి కలఁడు. నేను ఆయనకూఁతురను, నాపేరు బిందురేఖ. పాపా

త్తుఁడు ఈ రాక్షసుఁడు జ్వలితలోచనుఁడు నన్ను వంచనచేత నాతండ్రియింటినుండి ఇక్కడికి తెచ్చినాఁడు. వీఁడు మాంసార్థియై పందిరూపము దాల్చి బయటికి పోయి ఇప్పుడే ఎవరో వీరునిచేత ఈఁటెపోటు పడి వెంటనే దప్పిగొని ఇచటికి వచ్చి మృతుఁడైనాఁడు. నేనును కన్యకాత్వమును కాపాడుకొని తప్పించుకొని వచ్చితిని.' ఆ మాటకు శక్తిదేవుఁడు 'ఓ రాజపుత్త్రి, అట్లయిన సంభ్రమ మేల? నేనే ఆపందిని ఈఁటెతో పొడిచినవాఁడను.' అనెను. 'అటయిన, నీ వెవరవ్వో చెప్పుము.' అని ఆ కన్య యడుగఁగా 'నేను బ్రాహ్మణుఁడను, నాపేరు శక్తిదేవుఁడు.' అనెను. 'అటయిన నీవే నాభర్తవు' అని ఆమె చెప్పఁగా సరియే యని యావీరుఁడు ఆబిలద్వారముగుండ ఆమెను తోడ్కొని బయలు వెడలెను. ఇంటి కేఁగి ఆవృత్తాంతమును భార్యతో చెప్పి ఆమె యొక్క యంగీకారముతో ఆ బిందురేఖను వివాహమాడెను.

ఇట్లు ఆ యిద్దఱు భార్యలతోను అతఁడు ఉండఁగా బిందురేఖ గర్భము దాల్చెను. గర్భమునకు ఎనిమిదవమాసము రాఁగా ప్రథమభార్య బిందుమతి స్వయముగా అతనికడకు వచ్చి 'ఓ వీరుఁడా, నాకు నీవు చేసిన వాగ్దానమును జ్ఞప్తికి తెచ్చుకొనుము. ఇప్పుడు నీరెండవభార్యకు గర్భ మయి ఎనిమిదవ మాసము కనుక, పోయి గర్భమును భేదించి పిండమును ఇక్కడికి కొని రమ్ము, నీ సత్యమును నీవు తప్ప లేవు గదా.' ఇట్లామె నిరోధింపఁగా శక్తిదేవుఁడు ఒకవైపున స్నేహమును మఱి యొక

వైపున ప్రతిజ్ఞయు లాగుచుండఁగా క్షణకాలము ఉత్తరములేక ఊరకుండి భయాక్రాంతుఁడై బిందురేఖయొద్దకు పోయెను. ఖిన్నుఁడై వచ్చుచున్నయతనిని చూచి ఆమె ఇట్లనియె:— ఆర్యపుత్రా, నీ వేల ఇట్లు విషాదపడియెదవు? నే నెఱుఁగుదును, నిన్ను నాగర్భమును చీల్పు మని బిందుమతి నియోగించినది. నీవు ఆప్రకారమే అవశ్యముగా చేయవలసినది. ఇందులో క్రూరత్వము లేదు. జాలి పడక ఆపని చేయుము. అందులకు నిదర్శనముగా ఈదేవదత్తుని కథను వినుము.

దేవదత్తుని కథ.

పూర్వము కంబుక మను పురములో హరిదత్తుఁ డను బ్రాహ్మణుఁ డొకఁ డుండెను. అతనికొడుకు దేవదత్తుఁడు బాల్యములో తండ్రి చదువు చెప్పించినను, వయస్సు రాఁగా సదా ద్యూతపరాయణుఁ డాయెను. అతఁడు ఒకనాఁడు జూదములో గుడ్డలు మొదలుగా సమస్తము ఓడి పోయి తండ్రియింటికి పోవ లజ్జించి ఒకపాడుగుడిలోఁ దూరెను. అచట ఒంటరిగా జాలపాదుఁ డను యొకమహావ్రతి యనేకమూలికాప్రయోగము లెఱిఁగినవాఁడు ఉండెను. దేవదత్తుఁడు మెల్లగా అతనిచెంతకు పోయి నమస్కరించెను. అతఁడును ఇతనిని కుశల మడిగి ఆదరించెను. వ్రతి యడుగఁగా దేవదత్తుఁడు తనకు ద్యూతముచే తన నష్టము నశించినందున కలిగినకష్టమును చెప్పెను. అంతట వ్రతి యిట్లనియె:—' వత్సా, వ్యసనవంతులకు చాలునంత

ధనము లోకములో లేదు. ఆపదను తొలఁగించుకొనుటకు నీకు ఇచ్చ కలదేని నా పలుకు చేయుము, నేను విద్యాధరుఁడ నగుటకు సన్నద్ధుఁడ నగుచున్నాను. ఓయి సులక్షణుఁడా, నీవు కూడ నాతో ఈ సిద్ధిని సాధింపుము. నీవు నాయాజ్ఞ చొప్పున నడుచుకొనవలసినది. నీయాపదలు తీఱునుగాక.' ఇట్లు వ్రతి చెప్పఁగా అంగీకరించి దేవదత్తుఁడు అతనిపార్శ్వమందే కను పెట్టుకొని యుండెను.

మఱునాఁడు శ్మశానమునకు పోయి మఱ్ఱిచెట్టుక్రింద రాత్రి పూజ చేసి పరమాన్నము నైవేద్యము పెట్టి దిక్కులలో బలి చల్లి ఆయర్చనను ముగించి ఆమహావ్రతి తనప్రక్క నున్న దేవదత్తునితో "నీవు 'విద్యుత్ప్రభా, ఈపూజను గ్రహింపుము' అని చెప్పుచు ఈప్రకారమే ప్రతిదినము పూజ చేయవలయును. అటుపైప్రక్రియను నే నెఱుఁగుదును. ఇట్లు చేసిన మన కిద్దఱి కును సిద్ధి నిక్కము." అని చెప్పి ఆతనితోఁగూడ తనయింటికి పోయెను. దేవదత్తుఁడును ఆప్రకారము ప్రతిదినము చెట్టుక్రింద అర్చన చేయుచుండెను. ఒకనాఁడు పూజాంతమందు చెట్టు రెండుగా చీలి అందులోనుండి అతఁడు చూచుచుండఁగా ఒక దివ్యాంగన ఆకస్మికముగా వెలువడి 'రావోయి భద్రమూర్తీ, మాస్వామిని నిన్ను పిలుచుచున్నది.' అని చెప్పుచు అతనిని కూడ ఆచెట్టులో ప్రవేశపెట్టినది. అచట నతఁడు మణిమయ మయిన యొకదివ్యభవనమును అందులో మంచముమీఁద

కూర్చుండి యున్న యొక దివ్యాంగనను చూచి ఆమెను రూపు దాల్చిన తనసిద్ధినిగా తలంచెను. అంతలోనే ఆమె అతనికి అతిథిసత్కారము చేసి, తనయంగములు ఆభరణరణితముల చేత కుశలప్రశ్న యడిగిన ట్లొప్పుచుండఁగా లేచి, అతనిని తన మంచముమీఁదనే కూర్చుండఁబెట్టుకొని యిట్లనియె: 'ఓ మహాభాగా, నేను రత్నవర్షుఁడను యక్షపతి కొమారితను, కన్యను, నాపేరు విద్యుత్ప్రభ. ఈమహావ్రతి జాలపాదుఁడు నన్ను ఆరాధించినాఁడు. అతనికి నేను అర్థసిద్ధి ఇచ్చెదను. నీవు నాప్రాణములకు కూడ ప్రభువవు. కనుక ప్రకటానురాగ నయిన నన్ను నీవు వివాహ మాడుము.' ఇట్లు ఆమె పలుకఁగా దేవదత్తుఁడు ఆప్రకారమే చేసెను. అచట కొంతకాల ముండి ఆమెకు గర్భము కాఁగానే అతఁడు మరల వచ్చెద నని ఆ మహావ్రతియొద్దకు పోయి సభయముగా అతనితో జరిగిన వృత్తాంతమును చెప్పెను. అతఁడు తనసిద్ధిని కోరినవాఁ డయి ఇతనితో ని ట్లనియె: 'ఓయి భద్రమూర్తీ, నీవు చేసినది సరియే, ఇప్పుడు మరల ఆయక్షకన్యయొద్దకు పోయి దానిగర్భమును ఛేదించి పిండమును ఇక్కడికి తెమ్ము.' ఇట్లు చెప్పి మొదటి ప్రతిజ్ఞను జ్ఞప్తిచేసి వ్రతి పంపఁగా దేవదత్తుఁడు మరల ప్రియ యొద్దకు పోయెను. అచ్చట ఇతఁడు ఖిన్నమానసుఁడై నిలువఁగా యక్షి విద్యుత్ప్రభయే అతనితో స్వయముగా ని ట్లనియె: 'ఆర్యపుత్త్రా, ఏల చింతిల్లెదు? నాకు తెలియును, జాలపాదుఁడు

నాగర్భమును ఛేదింపు మని నీకు ఆజ్ఞాపించినాఁడు. కనుక నాకడుపు చీల్చి ఈగర్భమును కొని పొమ్ము. నీవు చేయవేని ఆపని నేనే చేసెదను. ఇందువలన ఒకకార్య మున్నది.' ఇట్లు ఆమె చెప్పినను అతఁడు ఆపని చేయనేరకుండెను. అంత నామె స్వయముగానే కడుపు చీల్చికొని గర్భమును వెలికి తీసి దానిని ఎదుట వేసి దేవదత్తునితో 'ఇది తిన్నవానికి విద్యాధరత్వము కలుగును, దీనిని పుచ్చుకొమ్ము. నేను విద్యాధరి నై యుండి శాపముచే యక్షి నై పుట్టితిని. నాకు శాపావసానము ఇట్లే ఏర్పఱుపఁబడినది. నాకు పూర్వజన్మజ్ఞానము కలదు. నే నిఁక నాయింటికి పోయెద. మరల మనము అటనే కలసికొందుము' అని చెప్పి ఎక్కడికో పోయెను. దేవదత్తుఁడును ఆగర్భమును పుచ్చుకొని చింతాక్రాంతుఁ డై జాలపాదునియొద్దకు పోయి సిద్ధికారణ మయినయాగర్భమును అతనికి కానుక యొసంగెను. సజ్జనులు దుర్లభవస్తువునందు కూడ స్వకార్యమును చూడరు గదా. ఆగర్భమాంసమును వండి అతఁడు దేవదత్తుని భైరవార్చన చేయు మని అడవికి పంపెను. దేవదత్తుఁడు బలి చల్లి వచ్చునంతలో ఆవ్రతి ఆగర్భమాంసము నంతయు తానే తినెను. 'ఏమి? అంతయు నీవే తింటివి?' అని దేవదత్తుఁడు అడుగఁగా కుత్సితుఁ డయిన యాజాలపాదుఁడు విద్యాధరుఁ డై ఆకాశమున కెగిరి పోయెను.

నలుపులో ఆకాశమును బోలిన కత్తితో హారకేయూర

ములతో వెలుఁగుచు అతఁడు ఎగిరి పోఁగా దేవదత్తుఁడు చింతించెను: 'అయ్యో! ఏమి గ్రహచారము! ఈ దుర్బుద్ధి నన్ను మోసము చేసినాఁడు. అతిమృదుత్వమువలన ఎవనికి అవమానము కలుగదు! ఈయపకారమునకు ప్రతిక్రియ ఎట్లు చేయుదును? విద్యాధరుఁడై యున్న యితనిని ఎట్లు పట్టఁగలను? ఇందులకు బేతాళసాధనమునకన్న వేఱు ఉపాయము లేదు' ఇట్లు నిశ్చయించుకొన్నవాఁడై దేవదత్తుఁడు రాత్రి రుద్రభూమికి పోయి, అచట చెట్టుక్రింద బేతాళుని మానిసిశవములో ఆవాహన చేసి పూజించి, నరమాంసము నైవేద్యము పెట్టి, అతనికి అది చాలక పోఁగా తనమాంసమునే కోసి పెట్టసాగెను. అంత బేతాళుఁడు ఆమహాసత్త్వునితో 'నీసత్త్వమునకు సంతోషించితిని, సాహసము చేయకుము. నీ కేమి కావలయునో చెప్పుము, సాధించెదను.' అనెను. దేవదత్తుఁడు అడుగుచున్నాఁడు: 'నమ్మినవానిని వంచించిన జాలపాదుఁ డుండెడు విద్యాధరనివాసమునకు నన్ను కొనిపొమ్ము.' బేతాళుఁడు అంగీకరించి వానిని బుజముమీఁద కూర్చుండఁబెట్టుకొని విద్యాధరలోకమునకు కొనిపోయెను. అచట జాలపాదుఁడు విద్యాధరరాజై, గర్వించి మేడమీఁద రత్నాసనమందు కూర్చున్నవాఁడై, విద్యాధరాంగనను ఆ విద్యుత్ప్రభను తనకు భార్య కమ్మని వంచించుచుండెను. వానిని చూచి దేవదత్తుఁడు విద్యుత్ప్రభానేత్రచకోరములకు చంద్రామృతమును వర్షించుచు వానిమీఁదికి పోయెను. జాలపాదుఁ

డును ఆకస్మికముగా వానిని చూచి భయపడెను, వానికత్తియు జారిపోయెను. వాఁడును ఆసనమునుండి నేలఁ బడెను. దేవదత్తుఁడు వానిఖడ్గమే దొరకినను దానితో వానిని చంపలేదు. మహాత్ములు భీతు లయిన శత్రువులయందు కూడ కనికరము చూపుదురు. బేతాళుఁడు వానిని చంపఁ బోఁగా దేవదత్తుఁడు అతనిని వారించి 'ఈపాషండుని కృపణుని చంపి ఏమి ప్రయోజనము? వీనిని నీవు కొనిపోయి భూమిలో వీనియింటనే ఉంపుము. అచ్చటనే ఈపాపికాపాలికుఁడు పడియుండును గాక.' అనెను. ఇట్లు దేవదత్తుఁడు పలుకుచున్న సమయమందు గౌరి ఆకాశమునుండి దిగి వచ్చి ప్రత్యక్ష మయినది. ఆమె నమ్రుఁడయిన దేవదత్తునికి 'పుత్రా, సాటిలేనిదైన నీసత్త్వోత్కర్షకు నేను సంతోషించితిని, కనుక నీకు విద్యాధరరాజత్వమును ఇప్పుడే ఇచ్చితిని.' అని పలికి వెంటనే అంతర్ధానము పొందెను. బేతాళుఁడు సిద్ధిహీనుని జాలపాదుని భూలోకమునందు పడవైచెను. అధర్మమువలన ఎంతకాలము క్షేమము కలుగును? దేవదత్తుఁడు సంతోషించి విద్యుత్ప్రభతో కూడ విద్యాధరాధిరాజ్యమును పొంది అచట సుఖ ముండెను.

ఇట్లు శక్తిదేవునికి కథ చెప్పి బిందురేఖ మరల నిట్లనియె.—'ఇట్టికార్యములు చేయవలసియే యుండును. బిందుమతి చెప్పినట్లు శోకము మాని నాగర్భమును భేదింపుము.' ఇట్లు బిందురేఖ చెప్పుచుండఁగా శక్తిదేవుఁడు పాపమునకు

శంకించుచుండఁగా ఆకాశవాణి యిట్లు పలికెను. 'శక్తిదేవుఁడా, నిశ్శంకముగా గర్భమును ఛేదించి పుచ్చుకొమ్ము, దానిమెడ పట్టుకొనఁగానే అది నీకు కత్తి యగును.' ఈదివ్యవాణిని విని అతఁడు వెంటనే కడుపు చీల్చి పిండమును చేతితో మెడలో పట్టుకొనెను. పట్టుకొన్న వెంటనే అది బలముచే లాగఁబడిన సిద్ధికాంతా కేశపాశము వలె చేతిలో కత్తియై విరాజిల్లెను. వెంటనే అతఁడు విద్యాధరుఁడాయెను. బిందురేఖ తత్క్షణమే అదృశ్య యాయెను. అంత నతఁడు పోయి ఆవృత్తాంతమును తన రెండవభార్యకు బిందుమతికి తెలియఁబఱిచెను. ఆమె యిట్లనియె — 'నాథా, మేము విద్యాధరపతి కొమారితలము ముగ్గురము, శాపముచేత కనకపురినుండి తొలఁగితిమి. మాలో ఒకతె నీవు వర్ధమానపురములో చూచిన కనకరేఖ. ఆమె శాపాంత మయి కనకపురికి పోయి యున్నది. నేను రెండవ దానను, నాకు ఇప్పుడే శాపము తీఱినది. నేను ఇప్పుడే నా నగరికి పోవలయును. మావిద్యాధరశరీరములు అక్కడనే యున్నవి. మాయక్క చంద్రప్రభ అక్కడనే యున్నది. నీవును ఖడ్గసిద్ధి ప్రభావముచేత శీఘ్రముగా అచ్చటికి రమ్ము. అచ్చట మమ్ము నలువురను వివాహమాడి విద్యాధరరాజ్యమును తపోవనములోని మాతండ్రివలన పొంది ఆపురము నేలుదువు.'

బిందుమతి చెప్పినయీమాటప్రకారము శక్తిదేవుఁడు ఆకాశమార్గమున కనకపురికి పోయెను. అచట తాను పూర్వము

మూఁడుమండపములలో చూచినయామూఁడుదేహములలోను దానిదానియాత్మ ప్రవేశించినంత ఆమూఁడును సజీవములై తనప్రియతమలు ముగ్గురును అయి యుండఁగా చూచెను. తన్ను రచితాగమనమంగళ యై తెప్ప ప్రాల్పక తనివి తీఱక చూచుచున్నట్టిదానిని వారియక్కను చంద్రప్రభను కూడ చూచెను. పరిజను లందఱును తమతమపనులు చేయుచు తన రాకను గౌరవించుచుండఁగా వాసగృహమునకు చంద్రప్రభతో కూడ పోయెను. అచట నామె ఇట్లు పలుకుచున్నది. 'వర్ధమానపురములోనియా రాజకన్యయే నాచెల్లెలు చంద్రరేఖ. నీభార్య దాశకన్య బిందుమతి ఇది, దీనిపేరు శశిరేఖ. దానవాపహృత యయిన రాజకన్య నీభార్య బిందురేఖ ఇది, దీని పేరు శశిప్రభ; ఇదియు నాచెల్లెలు. ఇఁక ఓ ధన్యుఁడా మాతో మాతండ్రియొద్దకు రమ్ము, ఆయనవలన మమ్ముల నందఱను పతి గ్రహించి వివాహ మాడుదువు గాక.' ఇట్లు మదనప్రేరిత యయి చంద్రప్రభ పలుకఁగా శక్తిదేవుఁడు ఆనలువురతోఁ గూడ వనమునకు వారితండ్రియొద్దకు పోయెను. అచ్చట కొమారితలు నలువురును పాదములకు మ్రొక్కి వృత్తాంతము తెలుపఁగా ఆకాశవాణియు ప్రేరింపఁగా విద్యాధరపతి ఎంతయు సంతోషించి కన్యలను నలువురను ఒక్కమొగినే శక్తిదేవునికి ఇచ్చెను. మఱియు తన కనపురీరాజ్యమును తన విద్యలను కూడ అతనికి ఇచ్చి శక్తివేగుఁ డని పేరు పెట్టెను.

‘నిన్ను పగతురు లెవ్వరును గెలువ లేరు అతిప్రభావుఁ డయిన వత్సేశ్వరునివలన మీకు చక్రవర్తి నరవాహనదత్తుఁడు పుట్టును. అతఁడు నీకు ప్రభువు, ఆతనికి ప్రణతి సేయుము. ’ అని పలికి మహాప్రభావుఁ డయిన విద్యాధరాధిపతి శశిఖండుఁడు అల్లుని సత్కరించి తనరాజధానికి పంపెను. అంత శక్తివేగుఁడు రాజై భార్యలతో కూడ విద్యాధరలోకమై జయంతి యయిన కనక పురికి పోయెను. అచట అత్యౌన్నత్యమువలన ముద్దలు ముద్ద లుగా పడుచున్న సూర్యదీప్తులచేతనుం బోలె పసిండిపనులచేత ప్రకాశించుచున్న మందిరములయందు నివసించి ఆనలువురు వామాక్షులం గూడి రత్నాలమెట్ల దిగుడుబావులలోను ఉద్యానవనములలోను క్రీడించుచు సుఖముగా నుండెను.

ఇట్లు తనచరిత్రమును వత్సరాజునకు చెప్పి వాగ్మి యా శక్తివేగుఁడు మరల నిట్లనియె:— ‘వత్సరాజా, చంద్రవంశ భూషణమా, ఆశక్తివేగుఁడను నేనే, నీకుమారునిపాదములను దర్శింపఁగోరి వచ్చినాఁడను. ఇట్లు నేను మనుష్యుఁడనే అయ్యును శివప్రసాదముచేత విద్యాధరాధిపతి నైతిని; నేను ఇంటికి పోయి వచ్చెదను. ప్రభువును చూచితిని. మీకు మేలు కలుగునుగాక.’ ఇట్లు పలికి కేలు మోడ్చి సెలవు పుచ్చుకొని చంద్రతేజుఁ డయిన యాశక్తివేగుఁడు ఆకాశమున కెగిరి పోఁగా, వత్సరాజు

దేవేరులతోను బాలతనయునితోను మంత్రులతోను కూడు కొన్నవాఁడై అనిర్వచనీయ మయిన యానందావస్థను అనుభవించుచుండెను.

చతుర్దారికాలంబకము సమాప్తము.



శ్రీ

# మదనమంచుకా లంబకము.



క. సమనోన్నమనాకులమూ
ర్ధముచే విఘ్నౌఘములను దర్జించుగతిన్
గోమరారు విఘ్నరాజును
బ్రమదము భక్తియుఁ దలిర్ప భజియింతు మదిన్.

క. కామునికి వందనం బిదె
యేమహితునికోలతాఁకు లిట్రియించె నరన్
హైమవతీశ్లిష్టం బై
భీముని మేనును జెలంగుఁ బెనుఁబులకలతోన్.

ఇత్యాదిదివ్యచరితములు సలిపి విద్యాధరైశ్వర్యమును పొందిసుఖమున్న నరవాహనదత్తుఁడు ఒకప్పుడు మహర్షులు భార్యలతో కూడ తనతో గోష్ఠిలో నుండి ప్రస్తావవశమున అడుగఁగా తనచరిత్రమునే అన్యుఁడు చెప్పినట్లుగా ఇట్లు చెప్పసాగెను.

ఇట్లు వత్సరాజు గారాబముతో పెంచుచుండఁగా నరవాహనదత్తుఁడు క్రమముగా ఎనిమిదేండ్లప్రాయమువాఁడై మంత్రిపుత్త్రులతోఁ గూడ విద్యలు నేర్చుచు ఉద్యానవనములో

క్రీడించుచు ఉండెను. వాసవదత్తాదేవియు పద్మావతీదేవియు అతనియందే సదా ప్రాణము లుంచి చూచుకొనుచుండిరి. ఆకోహద్గుణసమ్రమమును సద్వంశజన్మమును అగుదేహముతోను అట్టి ధనుస్సుతోను అతఁడు ప్రకాశించుచుండెను. వత్సరాజు ఇతనికి వివాహాదిశుభములు చేయ నువ్విళ్లూరుచు కాలము గడపుచుండెను. ఈసమయములో కథాసందర్భములో ఏమయి నదో దానిని వినవచ్చును.

తైలపాత్రవణిక్కుమారుని కథ.

తక్షశిల యని వితస్తానదీపులినమందు పుర మొకటి కలదు. ఆనదీజలమందు ప్రతిబింబించినట్టిది దానిమేడలవరుస దాని శోభను చూడ వచ్చిన పాతాళనగరియో యన విరాజిల్లు చుండెను. దానియందు కళింగదత్తుఁ డనురాజు సౌగతమత స్థుఁడు ఉండెను. అతని రాణిపేరు తార: అతనిప్రజ లందఱును జినభక్తులు. ఆపురము తనకు సాటి లేనందులకు మొలచిన కొమ్ములచేతనుం బోలె దట్టము గానున్న చైత్యరత్నములచేత ఒప్పారుచుండెను. ఆయన ప్రజలకు తండ్రివలె పరిపాలనమును మాత్రమే గాక గురువువలె మతోపదేశమును కూడ చేయు చుండెను. ఆకాలమందు ఆనగరములో వర్తఁడొకఁడు వితస్తా దత్తుఁ డని ధనవంతుఁడు సౌగతుఁడు ఉండెను. అతనికి రత్న దత్తుఁ డని కుమారుఁడు ఉండెను. వాఁడు తండ్రిని పాపాత్ముఁ డని సదా రోయుచుండెను. 'నాయనా, నన్నేల నిందించెదవు?'

అని తండ్రి యడుగఁగా అసూయతో ని ట్లనియె. 'నాయనా, నీవు వేదధర్మమును మాని అధర్మము చేయుచున్నావు. బ్రాహ్మణులను మాని శ్రమణులను సదా పూజించెదవు. స్నానాది నియమములు లేక తమ కిచ్చ వచ్చినప్పుడు తినుచు, సిగ్గుతోఁ గూడ గోఁచితో కూడ సకలక్లేశములను వదలి, సుఖముగా విహారములయందు బ్రదుకుటకై సకల మయిన యధమజాతులును ఏమతము నవలంబింతురో ఆ సౌగతనయము నీకు ఏల వచ్చెను? ' ఆమాటకు వర్తకుం డి ట్లనియె: 'ధర్మమునకు రూపు ఒకటియే గాదు. పుత్త్రా, లోకోత్తర మయిన ధర్మము వేఱు, సర్వలోకవిదిత మయిన ధర్మము వేఱు. రాగాది వర్జనమును సత్యమును భూతదయయు బ్రాహ్మణ్య మగును గాని, కేవల జాతి స్వరూపము బ్రాహ్మణ్యము గా దని చెప్పుదురు. మఱియు సర్వప్రాణులకు అభయము నిచ్చున దయిన యీ మతమును నీవు పురుషదోషముచేత దూషించుచున్నావు. ఇది యుక్తము గాదు. ఉపకారము ధర్మ మనువిషయములో ఎవరికిని వివాదము లేదు. భూతములకు అభయము ఇచ్చుట కన్న నాకు వేఱు ఉపకారము కనఁబడ లేదు. కనుక అహింసాప్రధాన మయి మోక్షము నిచ్చున దయిన యీమతమందు నాకు ప్రీతియేని, ఇందు అధర్మ మే మున్నది? ' ఇట్లు తండ్రి చెప్పఁగా కుమారుఁడు దాని కంగీకరింపక అతనిని దూషించుచునే యుండెను.

అంతట తండ్రి దుఃఖితుఁడై ధర్మానుశాసిత యయిన కళింగదత్తమహారాజునొద్దకు పోయి సర్వమును చెప్పుకొనెను. రాజు వణిక్కుమారుని యుక్తిగా ఆస్థానమునకు పిలిపించి మాయకోపము అభినయించుచు సారథితో 'వింటివి, ఈవణిక్కుమారుఁడు పాపాత్ముఁడు దేశదూషకుఁడు, వీనిని నిర్విచారముగా చంపివేయుము.' అనెను. ఇట్లు ఆజ్ఞ చేసి రాజు, తండ్రి విన్నపము చేసికొనఁగా ధర్మచర్యార్థము ఆయాజ్ఞను అప్పటికి నిలిపిపెట్టి, 'రెండుమాసములు కాఁగానే మరల నా యొద్దకు తెమ్ము.' అని ఆకుమారుని వానితండ్రికే అప్పగించెను. భయాకులుని కుమారుని తండ్రి యింటికి కొనిపోయెను. వాఁడును 'రాజునకు, నేనేమి యపకారము చేసియుందును?' అని ఆలోచించుచు, రెండుమాసములచివర తనకు చావు కలుగునని చింతించుచు, రేయుంబవలు నిద్రాహారములు మాని వడలి పోవుచు, ఉండెను. రెండు మాసములు కాఁగానే ఎండి పాలిపోయిన యాకుమారుని తండ్రియే రాజునెదుటికి కొనిపోయెను. ఆపన్నుఁడై అట్లున్న యాతనిని చూచి రాజు 'నీవేల యిట్లు కృశించినాఁడవు ? నీకేమి నేను అన్నము నిలిపివేయించితినా ?' అని యడిగెను. వణిక్కుమారుఁడు చెప్పుచున్నాఁడు:—'నేను భీతిచేత నన్నే మఱచితిని, తిండిమాట యడుగవలయునా? ప్రభూ, మీరు ఆజ్ఞాపించిన చావును విన్నగడియ మొదలు మృత్యువు నే సర్వదా చింతించుచున్నాను.'

ఇట్లు పలికినవణిక్సుతునితో రాజు 'వత్సా, నీకు యుక్తిగా నేను ప్రాణభయమును బోధించితిని. సకలజంతువులకును మృత్యుభయము ఇట్టిదిగానే యుండును. వానిని రక్షించునుపకారము కంటె గొప్పధర్మ మేదో చెప్పుము. ఇది నీకు ధర్మముకొఱకును మోక్షేచ్ఛకొఱకును చూపితిని. మృత్యుభీతుఁడై బుద్ధిమంతుఁడు మోక్షమునకు యత్నించును; కనుక ఈ ధర్మము నవలంబించిన నీతండ్రి నింద్యుఁడు గాఁడు.' అని చెప్పెను.

రాజు చెప్పిన యీమాటలను విని వణిక్సుతుడు వినతుఁడై యి ట్లనియె —'ధర్మోపదేశముచేత ఏలినవారు నన్ను కృతార్థుని చేసితిరి. మోక్షేచ్ఛ నాకు కలిగినది, దానిని కూడ ఉపదేశింపుఁడు.' అంతట రాజు నగరోత్సవము రాఁగా వాని చేతిలో నూనె నిండినపాత్ర నొకటి యుంచి 'ఈపాత్రమును నీవు చేతులలో పెట్టుకొని పోయి ఈనగర మెల్ల తిరిగి రావలసినది. క్రింద ఒకబొట్టయినను పడఁగూడదు. పడెనేని వెంటనే ఈపురుషులు నీతల తెగఁగొట్టుదురు.' అని యాజ్ఞాపించి విచ్చుకత్తులు చేతఁ బూనిన భటులను వాని వెంటనే పంపెను. వణిక్కుమారుఁడు భయముచే నూనెబొట్టు క్రింద పడనీకయే నగర మెల్ల తిరిగి రాజునొద్దకు వచ్చెను. అతఁడు ఆప్రకారము క్రింద పడనీక నూనెపాత్రమును దేఁగా చూచి రాజు 'ఓయి, నీవు ఊర తిరుగుచు ఎవరి నైన చూచితివా?' అని యడిగెను. వణిక్కుమారుఁడు చేదోయి మోడిచి యి ట్లనియె: 'దేవా,

నేను ఏమియు చూడ లేదు, ఏమియు విన లేదు. నేను కత్తిదెబ్బకు వెఱచి నూనెబొట్టు క్రింద పడకుండ ఏకాగ్రముగా కాపాడుచు నగరమున తిరిగితిని.' రాజు చెప్పెను: 'నీవు దృశ్యమయిన తైలముమీఁదనే మనస్సు ఉంచి మఱి దేనిని చూడవయితివి. ఆయవధానముచేతనే ధ్యానము చేయును. ఏకాగ్రచిత్తుఁడును బహిర్వృత్తినివృత్తుఁడు నయి పురుషుఁడు తత్త్వమును చూచును. తత్త్వస్వరూపమును కన్నవానిని మరల కర్మజాల మంటదు. ఇది నీకు మోక్షోపదేశము, సంగ్రహముగా చేసినాఁడను.' ఇట్లు రాజు చెప్పి పంపఁగా అతఁడు ఆయన పాదముల వ్రాలి కృతార్థుఁడై తండ్రియింటికి పోయెను.

ఈప్రకారము కళింగదత్తుఁడు ప్రజలను ఏలుచుండెను. ఆయనకు తారాదత్త యని కులోచిత రాణి యుండెను. రీతిమతియు సువృత్తయు నైనయామెచే నానాదృష్టాంతరసికుఁడై ఆరాజు భారతిచేత సుకవియుంబోలె విరాజిల్లుచుండెను. ఆమె చంద్రునికి వెన్నెలవలెనె ప్రకాశగుణశ్లాఘనీయయై అమృతమయుఁడయిన యీరాజునకు అభేదముగా నుండెను. ఆ మహారాజునకు ఆదేవితో ఇంద్రునికి శచితోఁబోలె కాలము సుఖముగా నడుచుచుండెను.

## సురభిదత్తకథ.

ఈలోపల ఈకథాసందర్భములో కారణవిశేషముచేత ఇంద్రునియెదుట స్వర్గములో మహోత్సవము జరిగెను.

అందు నృత్తమాడుటకు అచ్చరలందఱు వచ్చి యుండఁగా సురభిదత్త యను నొక యప్సరస మాత్రము అగపడ లేదు. ఆమె ఏకాంతములో ఒకానొక విద్యాధరునిఁ గూడి నందన వనములో నుండుట ఇంద్రుఁడు యోగదృష్టిచేత నెఱిఁగి కోపగించి ఇట్లు తలంచెను: 'ఓహోహో! ఈదురాచారు లిద్దఱును మదనాంధులై యున్నారు. ఒకతె మమ్ము మఱచి స్వతంత్రవలె తన యిచ్చ వచ్చినట్లు విచ్చల విడిగా నున్నది. ఇతరుఁడు దేవభూమిలో ప్రవేశించి అవినయము చేయుచున్నాఁడు. అట్లు గాదు; ఈ ముద్దుక్కుఁడి విద్యాధరునియందు ఏమి తప్పు? వీనిని రూపముచేత అది వశీకరించి ఆకర్షించినది గదా; ఉత్తుంగ స్తన తటాంత యయిన యాలావణ్యాంబుతరంగిణిచేత హరింపఁబడిన వానికి నిగ్రహశక్తి యుండునా! అన్నియుత్తమవస్తువులనుండి ఒక్కొక్క తిలమాత్రము గ్రహించి బ్రహ్మదేవుఁడు సృజించిన తిలోత్తమను చూచి శివుఁడు కలఁగలేదా? మేనకను చూచి విశ్వామిత్రుఁడు తపస్సు మానుకొనలేదా? శర్మిష్ఠారూప లోభముచేత యయాతి ముదిమిని పొందలేదా? కావున ముల్లోకములను వ్యాకులించురూపలావణ్యములు గల యచ్చర చేత హరింపఁబడుట ఈవిద్యాధరకుమారుని తప్పు గాదు. ఈ యచ్చర పాపాత్మురాలు అపరాధిని; ఇది దేవతలను మాని వీనిని నందనములో ప్రవేశపెట్టినది.' ఇట్లాలోచించి యావిద్యాధర కుమారుని మాని ఇంద్రుఁడు అప్సరసను శపించెను:—'పాపాత్మ

రాలా, మానుషివిగా పుట్టి, అయోనిజను కొమారితను కని, చేయవలసిన దివ్యమును చేసి, నాయొద్దకు వత్తువుగాక.'

ఈలోపల తక్షశిలాపురిలో కళింగనాథునిరాణి ఋతునై యుండెను. ఇంద్రశాపమువలన స్వర్గమునుండి జాఱినయా యప్సరస ఆదేవికడుపులో ప్రవేశించినది. అందుచేత ఆదేవి మునుపటికంటె సుందరిగా ప్రకాశించెను. అప్పుడు తారాదత్తా దేవి ఆకాశమునుండి యొకజ్వాల జాఱి తనకడుపుచొచ్చినట్లు స్వప్నము కని తెల్లవాఱఁగానే ఆస్వప్నమును ఆశ్చర్యముతో భర్తకు చెప్పినది. అతఁడు ప్రీతుఁడై యిట్లనియె:—'దేవీ, దివ్యులు శాపముచేత మనుష్యయోనులయందు ఉద్భవింతురు. ఎవరో దేవజాతీయులు నీగర్భమం దున్నారని తలంచెదను. ప్రాణులు విచిత్రసదసత్కర్మనిబద్ధులై శుభాశుభఫల భోగమునకై ఈత్రిభువనమందు సంచరించుచుందురు.'

రాజిట్లు చెప్పఁగా ఆమె మరల ప్రసంగవశమున నిట్లనియె:—సత్యము, కర్మయే బలీయము, శుభాశుభభోగముల నిచ్చును. అందునకు నిదర్శనముగా ఈకథను వినుము. పూర్వము ధర్మదత్తుఁడని కోసలదేశపురాజొకఁ డుండెను. ఆయనకు నాగశ్రీ యను పతివ్రత భార్యగా నుండెను. ఆమె పతివ్రతాచారమును బోధించియు భూమిలో అరుంధతి యని ఖ్యాతి పొందెను. కాలక్రమమున ఆరాజునకు ఆదేవియందు నేను జన్మించితిని. అంతట నాకు అతిబాల్యమందే నాతల్లి

ఆకస్మికముగా జన్మాంతరమును స్మరించి మానాయనతో ని ట్లనియె: 'రాజా, ఆకస్మికముగా నా కిప్పుడు పూర్వజన్మము జ్ఞప్తికి వచ్చినది. దానిని చెప్పకుంటినా అప్రీతి, చెప్పితినా నాకు మృతి కలుగును. పూర్వజన్మస్మరణను చెప్పినయెడల తప్పక మృత్యువు కలుగు నని చెప్పుదురు. కాఁబట్టి, ఓదేవా, నేను మిక్కిలి విషణ్ణురాల నై యున్నాను.'—రా జిట్లనియె: 'ప్రియా, నాకును పూర్వజన్మము ఇప్పుడు ఆకస్మికముగా జ్ఞప్తికి వచ్చినది. కనుక నీవు నాకు చెప్పుము, నేను నీకు చెప్పెదను. ఎమైనను అగును గాక, విధిని ఎవఁడు తప్పింపఁ గలఁడు?' ఇట్లని ఆయన ప్రేరింపఁగా రాణి చెప్పుచున్నది.

## తా రా ద త్త క థ.

రాజా, నిబంధ మేని చెప్పెదను వినుము. ఈదేశము లోనే మాధవుఁడను నొకబ్రాహ్మణునియింట నేను పూర్వజన్మ మందు సువృత్త యను పేర దాసి నై యుంటిని. దేవదాసుఁ డనువాఁడు నాకు పతిగా నుండెను. అతఁడు యోగ్యుఁడు, ఒకానొకవర్తకునియొద్ద లెంకగా నుండెను. మే మిద్దఱము మాకు తగినట్లు ఇల్లేర్పఱుచుకొని జీవించుచుంటిమి. ముంతయు కుండయు, చీఁపురును మంచమును, నేనును నాపతియు, నని మాకు మూఁడు జత లుండెను. జగడము లేక దేవ పితౄతిథి శేషమును మితముగా భుజించుచు సంతోషముగాను సుఖము గాను ఉంటిమి. మాకు ఎక్కువగా నున్నవస్త్రమును నిజ

పేద కేవని కయినను ఇచ్చుచుంటిమి. ఇట్లుండఁగా గొప్ప కఱవు వచ్చెను. మాకు నిత్యము దొరకుచున్నట్టి కూలియన్నము దినదినము తగ్గుచుండెను. అంతట ఆఁకటిచే క్రమక్రమముగా క్షయించి పోవుచున్న మాకడకు ఒకనాఁడు ఆహారకాలమందు ఒక బ్రాహ్మణుఁడు అతిథి వచ్చెను. అంతట మే మిద్దఱమును ప్రాణాపాయకాలములో సయితము మాయిద్దఱ యన్నమును సర్వమును అతనికి పెట్టినారము. ఆయన భుజియించి పోఁగా ప్రాణములు నాభర్తను 'ఇతనికి అర్థియందు ఆదరము గాని మనయందు లేదు' అను కోపముచేతనుంబోలె వదలి పోయినవి. అంతట నేను సమాధానపడి భర్తకు తగినచితను ఏర్పఱిచి అతనితో కూడ చిత ఎక్కితిని. నామనస్సునుండి విపద్భారము దిగి పోయినది. అనంతరము నేను రాజగృహమందు పుట్టి నీకు దేవి నయితిని. సుకృతవృక్షము వెంటనే అచింత్యఫలమును కాచును గదా.

ఇట్లు రాణి చెప్పఁగా ధర్మదత్తుఁడు ఇట్లనియె:— 'రమ్ము ప్రేయసీ, నేనే నీపూర్వజన్మపతిని. అప్పుడు వర్తకుని లెంక యైన దేవదాసుఁ డను నేనే. ఇప్పుడు నాకును పూర్వజన్మము స్మరణకు వచ్చినది.' ఇట్లు పలికి తన గుర్తులు చెప్పి రాజు రాణితో కూడ కాలధర్మము నొందెను. ఇట్లు నా తల్లిదండ్రులు గతింపఁగా నన్ను పినతల్లి కొనిపోయి పెంచెను నేను కన్యనై యుండఁగా అచటికి మునీశ్వరుఁడు ఒకఁడు

అతిథిగా వచ్చెను. పినతల్లి ఆయనకు శుశ్రూషార్థము నన్ను నియోగించెను. కుంతి దుర్వాసునింబోలె ఆయనను నేను శ్రద్ధతో సేవించితిని. అతనివరమువలన ధార్మికుని నిన్ను పతినిగాఁ బడసితిని. ఈప్రకారము ధర్మముచేత కల్యాణము గలుగును. ధర్మముచేతనే మాతల్లిదండ్రులు రాజ్యమును జన్మాంతరజ్ఞానమును పొందిరి.

ఇట్లు తారాదత్తాదేవి చెప్పఁగా ధర్మైకపరాయణుఁడు కళింగదత్తుఁడు ఆమె కిట్లనియె:—సత్యముగా కొంచె మైనను ధర్మమును చక్కఁగా చేసినయెడల మహాఫలము కలుగును. అందునకు నిదర్శనముగా సప్తద్విజకథను వినుము.

## సప్తద్విజకథ.

కుండినపురములో పూర్వము ఒకానొక యుపాధ్యాయునికి బ్రాహ్మణునికి ఏడుగురు బ్రాహ్మణకుమారులు శిష్యులు ఉండిరి. ఒకప్పుడు దుర్భిక్షబాధచేత ఆ యుపాధ్యాయుఁడు శిష్యులను ఆవులు గలవాఁ డయిన తనమామగారి యొద్దకు ఒక యావును అడిగి తోలుకొని రమ్మని పంపెను. వారును కాటకముచేత కడుపులు అంటుకొని పోఁగా దేశాంతరము పోయి అతనిమామతో అతనిమాటగా ఆవును యాచించిరి. అతఁడును జీవనము నడపునది యైన యొకయావును వారికి సమర్పించెను, కాని, అన్నాతురులకు ఆశిష్యులకు లోభముచేత అన్నము పెట్టఁడాయెను. అంతట వారు ఆవును తోలు

కొని వచ్చుచు అర్ధమార్గమందులో సహింపరాని యాఁకటిచేత పీడితులయి భూమిమీఁద పడిపోయి ఇట్లు తలపోసిరి:— 'ఉపాధ్యాయులవారి యిల్లు దూరము, మనము ఆపదలో పడి నారము. మనకు ఏవిధమునను అన్నము దొరకనే దొరకదు. ఈ యావు కూడ నీళ్లు చెట్లు మనుష్యులు లేని యీయడవిలో చచ్చుట నిశ్చయము, అంతట గురుకార్యము ఏమి నెఱవేఱి నట్లు ? కావున దీని మాంసములో కొంచెముతో ప్రాణము నిలుపుకొని మిగిలినదానితో గురువులవారిని కూడ సత్కరింతము. ఆపత్కాలము గదా వచ్చియున్నది.' అట్లు కలియఁ బలుకుకొని సబ్రహ్మచారులు ఏడుగురును ఆగోవుచు యథా విధి పశువునుగా చేసి దేవతలను పూజించి పితరులను తర్పించి కొంతమాంసమును భుజించి మిగత ఉపాధ్యాయులవారి యొద్దకు కొని పోయి ఆయనకు మ్రొక్కి జరిగినవృత్తాంతము నంతయు జరిగినట్లు తెలిపిరి. సాపరాధు లయినను వారు నిజము పలికి నందులకు ఆయన సంతోషించెను. ఆయేడుగురును, పాపము! ఏడుదినములలో కఱవుచేత చచ్చి, సత్యముచేత జాతిస్మరులై జన్మించిరి. ఈప్రకారము శుద్ధసంకల్పజలముచే తడుపఁబడిన దై పుణ్యబీజము స్వల్ప మయినను కృషీవలులకుం బోలె పురుషులకు ఫలము నిచ్చును. దేవీ, అదియే దుష్టసంకల్ప జలముచేత చెడిన దై అనిష్టఫలము నిచ్చును. అందులకు ఈ నిదర్శనమును వినుము.

## విప్రచండాలకథ.

ఒకానొకప్పుడు గంగానదియందు ఒక బ్రాహ్మణుఁడును ఒక చండాలుఁడును అభోజనతపము చేయుచుండిరి. ఇరువురలో బ్రాహ్మణుఁడు ఆఁకలి గొన్నవాఁడై అచట చేఁపలను పట్టుకొని తినుచున్న పల్లెవాండ్రను చూచి మూఢుఁడిట్లు ఆలోచించెను: 'ఆహా! ఈదాస్యాఃపుత్రులు పల్లెవాండ్రు లోకములో ధన్యులు! వీరు ప్రతిదినము శఫరమాంసమును యథేచ్ఛముగా భుజింతురు.' చండాలుఁడు ఆపల్లెవాండ్రనే చూచి 'సీ, వీరు ప్రాణిఘాతకులు మాంసభక్షకులు వీరిది ఏమి జన్మము! కనుక ఇట్టి వీరి ముఖములను నే నేల చూడవలయును?' అని కన్నులు మూసికొని ఆత్మనిష్ఠుఁడై యుండెను. క్రమముగా వా రిద్దఱును ఆహారము లేక చచ్చిరి. వారిలో బ్రాహ్మణుని కుక్కలు తిన్నవి. మాల వానిదేహము గంగాజలములో శిథిల మాయెను. అటు పిమ్మట బ్రాహ్మణుఁడు చిత్తసంస్కారము చాలమిచే పల్లెజాతియందు జన్మించి తీర్థమహిమచేత జాతిస్మరుఁడాయెను. చండాలుఁడు చిత్తశుద్ధిప్రభావముచే అచ్చటనే గంగాతీరమందు జాతిస్మరుఁడైన బ్రాహ్మణుఁడుగా జనించెను. వా రిద్దఱును ఇట్లు పూర్వజన్మమును స్మరించుకొనుచు, పల్లెవాఁడు పశ్చాత్తాపము పొందెను, ఇతరుఁడు రాజయి సంతోషించెను. ఇట్లు ధర్మవృక్షమూలమయిన మనస్సు ఎవనికి శుద్ధమో ఎవనికి శుద్ధముకాదో వానివానికి తదనురూపముగా ఫలము నిచ్చును.

ఇట్లు పలికి దేవితో కళింగదత్తుఁడు మరల ప్రసంగవశమున ని ట్లనియె:—దేవీ, మఱియు సత్త్వశుద్ధ మయిన కర్మ మంచి ఫలమును ఇచ్చును. ఏల యనఁగా,—సంపదలు సత్త్వమును అనుసరించును. అందులకు నిదర్శనముగా ఈకథను వినుము

విప్రవీరుని కథ.

అవంతిదేశములో భువనవిఖ్యాత యుజ్జయినీనగరము కలదు. అందలి వెండిమేడలు అచటి మహాకాళేశ్వరుని సేవకు వచ్చిన కైలాసశిఖరములో యన రాజిల్లుచుండును. విరివి గలిగి అది సచ్చక్రవర్తి పానీయమును ప్రవిశద్వాహినీశతమును సపక్షక్ష్మాభృదాశ్రితము నై మహాసముద్రమువలె నుండును. విక్రమసింహుఁ డనురాజు అన్వర్థనాముఁడు ఆపురి నేలుచుండును. అతనియెదుట వైరిమృగములు ఎప్పుడును నిలువఁజాలవు. శత్రువులు లేనందున యుద్ధోత్సవము లేక అస్త్రములయందును బాహువీర్యమందును జుగుప్స కలిగి ఆ రాజు మనస్సులో తపించుచుండెను. అతనితో ఇంగిత మెఱిఁగినవాఁడు అమరగుప్తుఁ డను మంత్రి యి ట్లనియె:—"దేవా, బాహుగర్వము చేతను అస్త్రవిద్యామదముచేతను పగఱను కోరుకొను రాజులకు దోషము దుర్లభము గాదు. అట్లే పూర్వము బాణాసురుఁడు భుజసహస్ర దర్పముచేత హరుని ఆరాధించి యుద్ధయోగ్యుఁ డయిన శత్రువును యాచించినాఁడు. అట్లే వర మంది హరిని శత్రువునుగా పొందెను. ఆదేవుఁడు యుద్ధములో వీనిబాహువన

మును నతిక్రమించెను. కనుక నీవు యుద్ధము లేదని చింతింపవలదు. శత్రురూప మైనయనిష్టమును ఎప్పుడును కోరకుము. శస్త్రశిక్షయు బాహువీర్యమును అవశ్యము చూపఁ గోరుదువేని, అందులకు తగినచోటగు వేఁటలో వానిని వినియోగింపుము. రాజులకు వేఁటకూడ వ్యాయామముకై అంగీకరింపఁబడినది. శ్రమ నోర్వలేని రాజులు యుద్ధమార్గమునందు పనికి రారు గదా. అడవి మృగములు చెడ్డవి, భూమి శూన్యము కావలయు నని కోరుచుండును. కనుక అవి రాజునకు నీకు వధ్యములు. ఇందుచేతను వేఁట అంగీకార్య మయి యున్నది. వేఁట నయినను అధికముగా సేవింపఁ గూడదు. ఎక్కువ వేఁటచేత పూర్వము పాండురాజాదులు నశించిరి." ఇట్లు మంత్రిముఖ్యుఁడు మహామతి యమరగుప్తుఁడు చెప్పఁగా విక్రమసింహుఁడు అందుల కంగీకరించెను.

మఱునాఁడు భూమి నంతయు గుఱ్ఱములు కాల్బలము కుక్కలును గాను, దిక్కుల నన్నిటిని వలలు గాను, ఆకాశము నెల్ల అతిహృష్టు లయిన వేఁటకాండ్ర సింహనాదములు గాను, చేయుచు ఆరాజు వేఁటకై అడవికి వెడలెను. ఏనుఁగు నెక్కి పోవుచు ఊరివెలుపల ఒక పాడు దేవళములో ఏకాంతమందు కలసి కూర్చున్నవారై ఏమేమో నిర్భయముగా మాటలాడుకొనుచున్నట్టి యిద్దఱు పురుషులను దూరమునుండియే చూచి వేఁటమీఁద పోయెను. అడవిలో బెబ్బులులను పొడిచి

వానిగర్జనలతో కొండలను మ్రోఁగించుచు సంతోషించెను. ఏనుఁగులను చంపినట్టి సింహములను కూల్చి వానిగోళ్లనుండి రాలినయేనుఁగు ముత్తెములను తనవిక్రమబీజములనుం బోలె భూమియం దెల్ల వెదచల్లెను. తిర్యగ్జంతువు లగు జింకలు వంకరగా దూఁటుచు ఇతనిదారికి అడ్డముగానే పోయినవి, వానిని తటాలున వంకరగా తిరుగకయే కోలం గూల్చి ఇతఁడు సంతోషించెను. రాజిట్లు చాల సేపు వేఁటాడినవాఁడై సేవకు లెల్ల బడలినందున విల్లెక్కు దించి ఉజ్జయినికి మరలెను. అప్పటికిని ఆదేవాలయములో ఆప్రకారమే ఆయిద్దఱు పురుషులు మాటలాడుచుండిరి. రాజు 'వీ రెవరు ? ఇంతసేపు ఏమి మాటలాడుచున్నారు ? నిశ్చయముగా వీరు వేగులవాండ్రు, దీర్ఘరహస్యములు మాటలాడుచున్నారు.' అని ఆలోచించి ప్రతీహారుని పంపి, వారి నిద్దఱను తెప్పించి కట్టించి చెఱలో పెట్టించి, మఱునాఁడు వారిని ఆస్థానమునకు పిలిపించి, 'మీ రెవరు ? అంతసేపు మీరు మాటలాడుచున్న రహస్య మేమి?' అని యడిగెను. ఇట్లు రాజు స్వయముగా అడుగఁగా వా రిద్దఱు అభయ మడిగిరి. వారిలో పడుచువాఁ డొకఁడు ఇట్లు చెప్పఁ దొడంగెను.

దేవా, అవధరింపుము; ఉన్నది యున్నట్లు వర్ణించెదను. నీ యీనగరమందు కరభకుఁ డని యొక బ్రాహ్మణుఁ డుండెను. ఆయన ప్రవీరుఁ డయిన కొమారుఁడు తనకు కలుగవలయు

నని అగ్న్యారాధన చేసెను. తత్ఫలముగా ఆయనకు నేను జన్మించితిని. ఆయన కాలధర్మము నొందఁగా నాతల్లి సహగమనము చేసెను. అంత నేను శిశువ నయ్యును విద్యలు నేర్చియుండియు పెద్దలు లేనందున స్వమార్గమును వదలి నిర్భయముగా జూదమును శస్త్రవిద్యలను సేవించుచుంటిని; గురుశిక్ష లేదేని ఎవనికి బాల్యము ఉచ్ఛృంఖలము గాదు? క్రమక్రమముగా బాల్యము తీఱఁగా, నేను ఒకనాఁడు అడవికి బాణప్రయోగము చేయుటకు పోవుచుంటిని. ఆసమయములో పెండ్లికొమారిత ఒకతె నగరినుండి బండిమీఁద పెండ్లివారి గుంపుతో కూడ పోవుచుండెను. ఆకస్మికముగా ఒకయేనుఁగు మద మెక్కి గొలుసు త్రెంపుకొని ఎక్కడినుండియో ఆబోటి మీఁదికి వచ్చెను. దానికి భయపడి ఆతరుణితో వచ్చుచున్న వారందఱు ఆభర్తతో కూడ నపుంసకులు ఆవధువును వదలి పోయిరి. దానిని చూచి నేను త్వరపడి తలపోసితిని: 'అయ్యో! పెండ్లికూఁతును ఈపందలు వదలిపోయినారు. నేను ఈసుందరిని రక్షించెదను. ఆపన్నులను కాపాడనివాని ప్రాణము లేల? పౌరుష మేల?' ఇట్లు తలఁచి నేను అఱచుచు ఏనుఁగును ఎదుర్కొంటిని. ఏనుఁగు ఆబాలను వదలి నామీఁదికి వచ్చెను. బాల భయపడుచు నన్ను చూచుచుండెను. నేనును పాఱిపోవుచు ఏనుఁగును చాల దూరము ఎలయించితిని. క్రమముగా, దట్టంపుటాకులతోడి చెట్టుకొమ్మ యొకటి విఱిగి పడియుండఁగా

చూచి, దానిచాటున ఆచెట్టునకును దాఁగి ఏనుఁగునకు ఆ కొమ్మను అడ్డమువైచి నేను పాఱి పోయితిని. ఏనుఁగు ఆకొమ్మను నుగ్గుచేసెను.

నేను ఆచెలువయొద్దకు త్వరగా పోయి, ఆమృదుమంజులదేహమునకు గజభీతిచే ఏమియు కుశలము తప్ప లేదు గదా యని అడిగితిని. ఆరమణి నన్ను చూచి దుఃఖార్తయు సహర్షయు నై యి ట్లనియె: 'ఈ కాపురుషునిపా లయిన నాకు కుశల మెక్కడిది? ఓప్రభూ, ఇట్టి సంకటములో ఇతఁడు నన్ను వదలి ఎక్కడికో పోయినాఁడు. నీవు గాయపడకుండ మరల వచ్చితివే ఇదే నాకు కుశలము. వాఁడు నా కేటిభర్త? ప్రాణములకు తెగించి నన్ను మృత్యుముఖమునుండి హరించిన నీవే నాకు భర్తవు. వీఁడుగో అతఁడు భృత్యులతోఁ గూడ త్వరగా వచ్చుచున్నాఁడు. నీవు మెల్లగా ఇప్పుడు మావెనుక వచ్చుచుండుము. సందు దొరకఁగానే ఎక్కడి కయినను పాఱిపోదము.' నేను అందుల కంగీకరించితిని. 'అందగత్తె యయినను వలచి వచ్చి పైఁబడినను పరస్త్రీ మన కేల?' అను చింత ధీరులమార్గము గాని సంగవంత మయిన యౌవనముయొక్క మార్గము గాదు. క్షణములో భర్త వచ్చి ఆబాలను సంభావించెను. మరల పెండ్లివా రందఱు భృత్యులతో కూడ క్రమముగా నడవ సాగిరి. నేనును ప్రియ రహస్యముగా ఇచ్చినబత్తెముతో మాఱు దారిని వారివెంట చాల దూరము పోయితిని. ఏనుఁగునుండి

పరుగెత్తినగాసిచే ఒడలెల్ల నొచ్చె నని మిషపెట్టి పెండ్లి కూఁతురు మార్గములో పతిని తాఁక నయిన తాఁక కుండెను. రత్నోన్మఖియు గాఢరూఢాంతర్వ్యపదుస్సహాయు నగు తరుణి వికారిత యై భుజగివలె ఎవనికి అపకారము చేయకుండును. క్రమముగా మేము అందఱము వర్తకముచే జీవించెడి యీ భర్తయూరికి లోహనగరమునకు పోయినారము. ఆ పగలు అందఱము అచ్చట ఊరివెలుపల దేవాలయములో ఉంటిమి. అచట ఈ చెలికాఁడు బ్రాహ్మణుఁడు నన్ను కలసికొనెను. మాకు నవదర్శన మయినను అన్యోన్య స్నేహ విశ్వాసములు కలిగెను. చిత్రము! జంతువులకు ప్రేమ జన్మాంతరార్జితము గా ఘటించును. ఇతనితో నారహస్య మంతయు చెప్పితిని. దానిని ఎఱిఁగి ఇతఁడు నిశ్శంకముగా నాతో నిట్లు పలికెను. 'స్వస్థముగా నుండు. నీ వచ్చిన పనిని సాధింప నుపాయము కలదు. ఈమెకు ఆఁడుబిడ్డ యొకతె యున్నది. అది నన్ను తగులుకొని వచ్చుటకు సిద్ధముగా నున్నది. దాని తోడ్పాటు చేత నీ కోరికను కూడ నెఱవేర్చెదను.' నాతో నిట్లని, ఈ బ్రాహ్మణుఁడు ఆవణిగ్వధువుయొక్క ఆఁడుబిడ్డయొద్దకు పోయి నా రహస్యము నంతయు చెప్పెను. మఱునాఁడు సంకేత మేర్పఱిచి ఆయాఁడుబిడ్డ తనవదినెను ఆదేవాలయములోనికి కొనివచ్చినది; అచ్చట లోపల నున్న మాలో నా మిత్త్రునికి తనవదినెవేషము వేసినది. ఆ వేషముతో ఇతనిని ఊరిలోనికి

కొనిపోయి అన్నతో కూడ గృహప్రవేశము జరిపినది. ఆమె మాకు ఏర్పఱించిన పద్ధతిప్రకారము నేను వణిగ్వనితకు పురుషవేషము వేసి ఇచ్చటికి తోడ్కొని వచ్చితిని. అరాత్రి అందఱు ఇంట ఉత్సవములో మునిఁగి గాఢనిద్రలో నుండఁగా ఆ ననాందయు లేచి ఇతనితో కూడ వచ్చినది. ఆమెను తోడ్కొని యితఁడు ఎవరికి అగపడకుండ మజిలీలు చేయుచు వచ్చి యిచట నన్ను కలసికొన్నాఁడు. ఇట్లు మే మిద్దఱము ఎలజవ్వనులను ఇద్దఱుభార్యలను తామే వలచి వచ్చి మమ్ముఁ గూడినవారిని సంపాదించితిమి. ప్రకటముగా నివసించుటకు మేము భయపడుచున్నారము. స్వేచ్ఛగా సాహసము చేసిన యెవనికి మనస్సు స్వస్థముగా నుండును ? బసకొఱకును ధనముకొఱకును మేము చిరకాలము మాటలాడుకొనుచుండ, ఏలినవారు దూరమునుండి మమ్ము చూచి పిలిపించి కట్టించి చారుల మనుసంశయముచేత చెఱలో నుంపించినారు. దేవర వారియాజ్ఞచేత మావృత్తాంతమును విన్నపించుకొంటిని. అటు పయిన యేలినవారి చిత్తము.

వారికి విక్రమసింహుఁ డిట్లనియె: 'సంతోషించితిని, మీరు భయపడవలదు, ఈపట్టణమందే ఉండుఁడు, కావలసినంత ధనము మీకు ఇచ్చెదను.' ఇట్లు చెప్పి వారికి యథేష్టముగా జీవన మిచ్చెను. వారును భార్యాన్వితులై అతనియొద్దనే చిర కాలము సుఖముండిరి.

దేవీ, ఈప్రకారము ప్రజలసత్త్వనిష్పన్నము లయిన పురుష కార్యములయందు సంపదలు నివసించియున్నవి. ఇట్లు సాహస ధను లగు బుద్ధిమంతులకు సంతోషించి రాజులు అపారముగా ధనము నిత్తురు. ఈప్రకారము సురాసురసహిత సకలప్రాణి కోటియు శుభాశుభరూప మైన పూర్వకర్మచేతను అట్టె యిప్పటి కర్మచేతను విచిత్రభోగములను అనుభవించుచుండును. కనుక స్వప్నములో ఆకాశమునుండి నీకడుపులోపల ప్రవేశించినట్లు అగపడినజ్వాల ఎవరో దేవత; ఏదో కర్మవశముచే నీగర్భము వచ్చినది. ఇట్లు భర్త చెప్పఁగా విని తారాదత్తాదేవి గర్భిణి యై మిగుల ఆనందము పొందెను.

---

## ౨ - వ తరంగము.

### కళింగసేనాజననము.

అనంతరము ఆసన్న ప్రసవయు పాండురముఖియు నై తారాదత్త ఉదయింప నున్న చంద్రరేఖతోడి ప్రాచిని పోలి యుండెను. ఆమెకు త్వరలో అనన్యసదృశి యయిన కన్య బ్రహ్మ దేవుని సర్వసౌందర్యసృష్టియొక్క వర్ణకఘటనవంటిది జనించెను. 'ఇట్టి పుత్త్రుఁడు ఏల పుట్టఁడాయెను?' అనియుం బోలె స్నేహ శాలినులయిన రక్షాప్రదీపకళికలు ఆకస్మికాంతిచేత వెలవెలఁ బోయినవి. ఆ తనయను చూచి అట్టికుమారుఁడు గలుగఁ డాయెఁ గదా అని తండ్రి చింతిల్ల సాగెను. ఆమె యెవరో

దేవత యని తలంచియు పుత్త్రిఁడౌ పుట్టమికై వగచుచుండెను. శోకకందము కన్య యెక్కడ? మూర్తీభవించిన యానందము కొమరుఁ డెక్కడ? అంతట చిత్తవినోదార్థము ఇల్లు వెడలి నానాజినప్రతిమలుగల విహారమునకు పోయి, ఆరాజు అచట సన్న్యాసి యొకఁడు జనులనడుమ కూర్చుండి ఇట్లు ధర్మములు చెప్పుచుండఁగా, వినెను.

సంసారములో అర్థదానమే మహాతపస్సు అందురు. అర్థ మిచ్చువాఁడే ప్రాణ మిచ్చువాఁడు. ప్రాణము అర్థములో గదా నిలిచి యున్నది. బుద్ధదేవుఁడు కరుణాపూర్ణమతి యై ఇతరులకొఱకు తనయాత్మనే తృణమువలె ఇచ్చినాఁడు, తుచ్ఛ మయిన ధనముమాట చెప్పవలయునా? అట్టి ఘోరతపస్సు చేత దివ్యజ్ఞాని యైన యాబుద్ధుఁడు స్పృహ మానినవాఁడై బుద్ధ త్వమును పొందినాఁడు. కనుక శరీర మున్నంతవఱకు ఎల్ల యిష్టులకును కోరిక తీఱునట్లుగా బుద్ధిమంతుఁడు సదా ప్రాణి హితము చేయుచుండవలయును; అందువలన పూర్ణజ్ఞానము కలుగును. ఇందుల కుదాహరణము.—

## కృతపుత్త్రికలకథ.

పూర్వము కృతుఁ డనురాజునకు అత్యంతసుందరులు ఏడుగురు కొమారితలు కలిగిరి; వారు బాల్యమందే విరక్తి పొంది తండ్రియిల్లు వదలి శ్మశానమునకు పోయిరి. పరిజనులు అడుగఁగా వారు ఇట్లు చెప్పిరి. ఈప్రపంచము నిస్సారము,

అందులోను ఈపాడుశరీరము, అందులోను అభీష్టసంయోగసుఖాది స్వప్నవిభ్రమము. ఈసంసారములో పరోపకారము ఒకటి సారము. కనుక ఈదేహముచేత మేము ప్రాణిహితము చేసెదము. దీనిని ప్రాణముతో శ్మశానములో పాఱవైచెదము. మాంసము తిను జంతువులకు ఇది యుపయోగపడును గాక. అంద మయినను దీనివలన ప్రయోజన మేమి? పూర్వము ఒకానొక రాజపుత్త్రుఁడు యౌవనవంతుఁడును అందగాఁడును అయ్యును విరక్తుఁడై, సన్న్యాసము పుచ్చుకొనెను. అతఁడు ఒకనాఁడు భిక్షార్థము ఒకకోమటియింటికి పోఁగా, ఆకోమటి భార్య జవరాలు పద్మపత్త్రాయతేక్షణుఁ డయిన యా రాజకుమారుని చూచి అతనికనుఁదమ్ముల సౌందర్యమునకు లోనై ఇట్లడిగెను. 'ఇట్టి వాఁడవు నీవు కష్టమైన యీవ్రతమును ఏల యవలంబించితివి? ఎవతెను నీవు కన్నులారఁ జూతువో ఆ చెలువ ధన్యురాలు.' ఆమె ఇట్లనఁగా ఆభిక్షువు ఒకకంటిని పెల్లగించి చేతఁ బెట్టుకొని 'అమ్మాయీ, చూడు, అది యిట్టిది, అసహ్యముగా నున్నది, నెత్తురును మాంసమును గా నున్నది, నీకు ప్రియముగా నున్న యెడల పుచ్చుకొమ్ము. రెండవది కూడ ఇట్టిదే, ఈ రెండింటిలో ఏది రమ్యమో చెప్పుము.' అనెను. అంతట ఆకోమటిపడఁతి విషాదము పొంది, 'అయ్యయ్యో! పనికిమాలినదాన నై నేను ఎంతపాపము చేసితిని! నీవు కన్ను పెకలించుకొనుటకు నేను కారణము నైతిని.' అని వందురెను.

భిక్షువు పలుకుచున్నాఁడు:—అమ్మా, నీవు చింతల్లకు, నాకు నీవు ఉపకారమే చేసితివి. అందునకు ఈనిదర్శనము వినుము.

యతి కథ.

పూర్వము ఒకానొకయతి వైరాగ్యమును చక్కఁగా దృఢపఱుచుకొనుటకు గంగాతీరమందు ఒకయుపవనములో తపస్సు చేయుచుండెను. అచటికి దైవవశమున రాజొకఁడు అంతఃపురాంగనలతో కూడ విహారార్థము వచ్చి విహరించి పానముచే మత్తిల్లి నిద్రపోయెను. అంత నతనిరాణులు చపలతచేత అతనిచెంతనుండి లేచి ఆయుద్యానమందు తిరుగుచుండి ఒకచోట సమాధినిష్ఠుఁడై యున్న యీమునిని చూచి అదేమో అని కౌతుకముచేత అతనిచుట్టును నిలిచి అచటనే చాలసేపు ఉండిరి. ఇంతలో రాజు మేల్కొని వారిని కానక వెదకినవాఁడై అచట మునిని చుట్టుకొనియుండఁగా చూచి కోపగించి ఈసుచేత మునిని కత్తితో కొట్టెను. ఐశ్వర్యము, ఈర్ష్యయు, కనికరము లేమి, కైపు, అవివేకము, ఒకటొకటియే ఏమి చేయదు ! అయి దగ్నలు చేరిన ఏమి చెప్పవచ్చును ! రాజు పోయినపిమ్మట కత్తికోఁత పడియు కోపగింపక యున్న యీమునికి ఒకదేవత ప్రత్యక్షమై 'ఓమహాత్ముఁడా, ఏపాపి నీకిట్లు చేసినాఁడో, నీవు అంగీకరింతువేని వానిని నాశక్తిచేత చంపివైచెదను.' అనెను. ముని యిట్లనియె:—'దేవీ, అట్లు చెప్పకుము, అతఁడు నాకు ధర్మసహాయుఁడు, అపకారి కాఁడు.

అమ్మా, అతనిదయచేత నేను ఓర్పు పొందినాఁడను. అతఁడిట్లు చేయఁడేని నేను ఎవనివిషయమై క్షమింతును? నశ్వరమయిన యీదేహముకై కోప మనఁగా నేట్టిది? ప్రియాప్రియములు సమముగా చూచుకొనుట గదా బ్రహ్మపదము.' ఇట్లు మునీశ్వరుఁడు పలుకఁగా దేవత అతని శాంతికిసంతోషించి అతని గాయములు మాన్చి అంతర్హితురా లాయెను.

ఆముని రాజును ఎట్లు ఉపకారినిగా భావించెనో అట్లే, అమ్మా, నీవును నాకన్ను పెకలించుకొనుటకు హేతువవైనందుచే నేనును నిన్ను ఉపకారిణినిగా భావించుచున్నాను. ఆభిక్షువు ప్రణతురాలికి ఆకోమటి యిల్లాలికి ఇట్లు పలికి అందమయినను దేహమును రోసి తపస్సుకై పోయెను. కనుక ఎలప్రాయము దైనను నశ్వరమైన దేహముమీఁద అభిమాన మేల? దీనివలన ప్రాణ్యుపకార మొకటియే ఫలము. కనుక మేము ఈ రుద్రభూమిలో ప్రాణ్యుపయోగార్థము ఈ పాపుదేహమును పాఱవైచెదము. పరిజనములకు ఇట్లు చెప్పి ఆరాజకన్యలు ఏసుగురును అట్లే చేసి మహాసిద్ధి పొందిరి. ఈప్రకారము జ్ఞానులకు తమశరీరమందే మమత్వ ముండదు గదా, పుత్త్రదారాదులనెడుగడ్డియందా ఉండును?

కళింగదత్తుఁడు బౌద్ధమఠమందు ధర్మపాఠకునివలన ఇట్టి సూక్తులు వినుచు ఆదినము గడపి తనమందిరమునకు పోయెను. అచట నతఁడు కన్య జనించినందులకై మరల వగచుచుండఁగా

ఇంటిపెద్ద బ్రాహ్మణుఁడొకఁడిట్లు చెప్పసాగెను:—ఓయి రాజా, నీవు కన్యారత్నము పుట్టినందులకు వందురుచున్నావేమి? కొడుకులకంటె కూఁతులే ఉత్తమురాండ్రు. ఇహపరములకు మే లయినవాండ్రు. రాజ్యాలుబ్ధులును మర్కటకము లట్లు తండ్రిని భక్షించువారును అగు పుత్త్రులయందు రాజులకు ఏల యాస్థ? కుంతిభోజుఁడు మొదలగు రాజులు కుంత్యాదితనయల గుణములచేత దుర్వాసుఁడు మొద లయిన వారివలని మహాపరిభవములను దాఁటినారు. కన్యాదానముచేత పరమందుఁ గలుగు ఫలము పుత్త్రునివలన ఎక్కడిది? అందులకు నిదర్శనముగా సులోచనకథను చెప్పెదను వినుము:—

సులోచనకథ.

చిత్రకూటపర్వతమందు శివునిమీఁదియాసచేత బ్రహ్మ సృజించిన మఱియొక కాముఁడో యన సుషేణుఁ డని రాజొకఁ డుండెను. ఆయన ఆకొండయడివారమున దివ్యమయినతోఁటను దేవతలకు నందనవనముమీఁద విరక్తి కలిగించునట్టిదానిని వేయించెను. దానినడుమ లక్ష్మీలీలారవిందములకు క్రొత్తగనిగా ఒక దిగుడుబావిని నిర్మించెను. రతనాలతాపలు గల యా దిగ్గియగట్టున ఆరాజు తనకు తగినభార్య లేనందున కాంతాద్వితీయుఁడు గాకయే కూర్చుండి యుండెను. ఒకనాఁడు రంభ ఇంద్రభవనమునుండి సికారిగా ఆదారిని వచ్చి విరియఁబూచిన యాపుష్పవనములో సాక్షాద్వసంతుఁడోయన విహరించుచున్న

యా రాజును చూచి ఇట్లు ఉల్లేఖింపఁ దొడంగెను; 'ఇతఁడు ఈబావితామరసములో పడిన స్త్రీని వెదకుకొనివచ్చిన చంద్రుఁడా? కాఁడు; ఇతనిస్త్రీ స్థిర మయినది గదా. నిజముగా ఇతఁడు పుష్పాలకొఱకు ఉద్యానమునకు వచ్చిన పూవిలుకాఁడు; అట్లయిన ఇతని చెలి రతీదేవి ఏది?' ఇట్లు ఉల్లేఖించి ఆమె మింటినుండి దిగి మానుషీరూపముతో అతనిసరస కేఁగెను. అట్లు ఆకస్మికముగా వచ్చిన రంభను కని ఆ రాజు ఆశ్చర్యపడి 'అహాహా! ఇట్టి యందగత్తె ఈతరుణి ఎవరు? మనుష్యస్త్రీ ఏమో గాదు, పాదములకు ధూళి అంటదు, ఱెప్పపాటు లేదు. ఈసుదతి ఎవ తెయో దివ్యాంగన గావలయును. ఈ మానినిని నేను అడుగఁగూడదు, అడిగినచో లేచి పోయినను పోవును. కారణవిశేషముచే అగపడుదివిజులు రహస్యభంగము నొల్లరు.' అని ధ్యానించుచుండెను. అంత నామె అతనిని పలుకరించి అతని మెడను కవుంగిలించినది. రాజు ఆమెతో చిరకాలము క్రీడించుచుండెను. రంభయు స్వర్గమును తలంపకుండెను; ప్రేమ రమ్యము గాని జన్మభూమి రమ్యమా? రంభ చెలి యక్షిణి వర్షించిన బంగారపు రాసులచేత ఆదేని రాష్ట్రము మేరుశిఖరములచేత ఆకసమువోలె నిండిపోయెను.

కాలక్రమమున రంభ గర్భిణియై సుషేణునికి సాటిలేని రూపవతిని ఒక కన్యను కని వెంటనే అతనితో ని ట్లనియె:— 'రాజా, నాశాపము తీఱినది. నేను సురాంగనను రంభను,

నిను చూచి వలచితిని. మేము కానుపు కాఁగానే శాపము తీఱి శిశువును వదలి పోదుము. ఇది మా యేర్పాటు. కనుక ఈ కన్యను నీవు కాపాడుము. దీనివివాహముచేత మనకు మరల స్వర్గములో సమాగమము కలుగును.' ఇట్లు పలికి రంభ వివశయై అదృశ్య యాయెను. ఆదుఃఖముచేత రాజు ప్రాణము వదలఁ జూచెను. 'శకుంతలను కని వెంటనే మేనక వదలి పోఁగా నిరాశుఁడైన విశ్వామిత్త్రుఁడు ప్రాణము వదలెనా ఏమి?' ఇత్యాదివచనములు మంత్రులు పలుకఁగా రాజు తేఱి పునస్సంగమకారణ మయిన యాకన్యను చేతుల నెత్తుకొనెను. సర్వాంగసుందరి యయిన యాబాలకు తండ్రి అతిలోచన సౌందర్యముచేత సులోచన యని పేరు పెట్టెను. పిమ్మట కాలక్రమమున ఆకన్య యౌవనవతి యై ఉద్యానవనములో విహరించుచుండఁగా ఒకనాఁడు ఆమెను వత్సుఁ డనునొకముని యౌవనవంతుఁడు చూచి, తపోరాశిరూపుఁ డయ్యును కామ మోహితుఁడై చింతించెను;-'ఈసుదతిరూపము ఎంత యద్భుత ముగా నున్నది! దీనిని పొందనేని నాతపస్సునకు ఫల మేమి?' ఇట్లు తలఁచుచున్న యామహాతేజుని పొగలేనియగ్నిం బోలిన వానిని ఆమెయు చూచి మదనపరవశ యై, 'ఇతఁ డెవరు? అక్షసూత్రమును కమండలువును ధరించి పరమశాంతుఁడై కమనీయుఁడై యున్నాఁడు?' అని తలంచుచు సమీపించి వరణ మాలికనుబోని నయనోత్పలమాలికను అతనిపై వైచుచు;

నమస్కరించెను. అతఁడును సురాసురులకు దాఁటరాని దైన మదనాజ్ఞకు వశ్యుఁడై ఆమెకు శీఘ్రముగా వివాహ మగునట్లుగా ఆశీర్వాదము చేసెను. అంతట అసామాన్య మయిన యతని రూపముచే తనలజ్జ యెల్ల కొల్లపోఁగా ఆమె తల వాంచి ఆ మునిపుంగవుని కిట్లనియె: 'ఇదే నీకోరిక యేని, పరిహాసము కాదేని, నాతండ్రిని రాజును యాచింపుము. ఆయన నన్ను నీ కిచ్చును.' అంతట ముని ఆమెవంశమును పరిజనమువలన తెలిసి ఆమెతండ్రి సుషేణునియొద్దకు పోయి ఆమె నిమ్మని అడిగెను. అతఁడును తపస్సౌందర్యములచేత అలోకసామాన్యుఁడయిన యా మునికుమారునికి ఆతిథేయసత్కారములు చేసి పలికెను. 'స్వామీ, ఈకన్య నాకు రంభయందు జన్మించినది. దీనివివాహముచే స్వర్గములో నాకు రంభతో సమాగమము కలుగును. ఈప్రకారము రంభయే స్వర్గమునకు పోవుచు నాకు చెప్పినది. ఇ దెట్లగునో, ఓమహానుభావుఁడా, నాకు తెలియఁజెప్పుము.' ఆమాట విని మునికుమారుఁడు క్షణము ఆలోచించెను. 'పూర్వము మేనకకూఁతురు ప్రమద్వరను సర్పదష్టను రురువు తన యాయుస్సులో సగ మిచ్చి బ్రదికించి వివాహ మాడలేదా? త్రిశంకుని విశ్వామిత్త్రమహాముని స్వర్గమునకు పంపలేదా? కనుక నేనును నాతపస్సులో కొంత వ్యయము చేయుటచేత ఈపనిని సాధింపలేనా?' ఇట్లాలోచించి, 'ఈపని యొకభారము కాదు.' అని ఆముని ఉత్తరము

చెప్పి, 'ఓ దేవతలారా, ఈరాజు నాతపస్సులో ఒకభాగము చేత శరీరముతోనే రంభాసంభోగార్థము స్వర్గమునకు పోవును గాక.' అని ఆముని రాజసభలో అందఱు వినునట్లు పలుకఁగా 'అట్లే అగును గాక' అని దివ్యవాణి పలికెను. అంతట నా రాజు తనకన్యను సులోచనను మునికి ఇచ్చి స్వర్గమునకు పోయి అచ్చట దివ్యత్వము పొందినవాఁడై తన్ను ఇంద్రాజ్ఞచేత కూడ వచ్చిన రంభతో క్రీడించుచుండెను.

రాజా, ఈప్రకారము సుషేణుఁడు కన్యవలన కృతార్థుఁడాయెను. మీబోంట్లగృహములలో ఇట్టి కన్యలు పుట్టుదురు సుమా. కనుక ఈమె యెవరో దివ్యస్త్రీ, శాపభ్రష్టయై నీకు కూఁతురుగా పుట్టినది. కనుక ఈమెజన్మమునకై నీవు దుఃఖింపకుము.—ఇట్లని ఇంటివృద్ధబ్రాహ్మణునివలన కథ విని కలింగదత్తమహారాజు చింత మాని సంతుష్టుఁడై యుండెను. చంద్రకళవంటిదై నేత్రోత్సవకారిణియైన యాకన్యకు కళింగసేన యని పేరుపెట్టెను. ఆమెయు క్రమముగా తండ్రియింటనే చెలులనడుమ పెరుఁగుచుండెను. మేడలందును ఉద్యానము లందును క్రీడారసమయ మయిన బాల్యసముద్రముయొక్క లహరియో యన విహరించుచుండెను.

ఒకనాఁడు మేడమీఁద ఆడుకొనుచున్న యాకళింగసేనను మునిమానసమోహినిని మయాసురునికూఁతురు సోమప్రభ ఆకాశమార్గమునఁ బోవుచు చూచి, అచటనే నిలిచి

ఇట్లు తలంచెను. 'ఈమె యెవరు ? చంద్రునిమూర్తియా? దానికి పగలు కాంతి యెక్కడిది? రతి యేని కాముఁ డెక్కడ? కనుక ఈ కన్యక ఎవరో దివ్యాంగన, శాపముచేత ఈరాజు గృహములో పుట్టినది. జన్మాంతరములో నాకు నిశ్చయముగా ఈమెతో సఖ్య ముండినది. ఇందులకు ఈమెను చూడఁగానే నామనస్సులో కలిగెడి యమితస్నేహమే నిదర్శనము. కనుక ఈమెతో మరల స్వయముగా కూడి చెలిమి చేసికొనుట తగిన పని.' ఇట్లు తలంచి ఆబాలకు భయముగా కుండుటకై సోమ ప్రభ ఆకాశమునుండి ఆమె కగపడకుండనే దిగి నమ్మకమునకై మనుష్యకన్యకారూపము తాల్చి ఆకళింగసేనకడకు మెల్లగాఁ బోయెను. రాజసుతయు ఆమెను చూడఁగానే 'ఈమె యెవతె యో అత్యద్భుతరూప, నాయొద్దకు వచ్చినది. ఈమె నాకు తగిన చెలికత్తె.' అని తలంచి లేచి కౌఁగిలించుకొని కూర్చుండఁ బెట్టి, వంశమును పేరును అడిగెను. సోమప్రభ, 'సర్వము చెప్పెదను లే, ఉండుము.' అనెను. పిమ్మట కథాక్రమమున వా రిద్దఱును ఒకతెచెట్ట నొకతె పట్టుకొని స్నేహప్రతిజ్ఞ చేసికొనిరి. అంతట సోమప్రభ చెప్పుచున్నది:—చెలీ, నీవు రాజకన్యకవు, రాజపుత్త్రిలతోడి సఖ్యమును నిర్వహించుట మహాకష్టము, ఎంత చిన్నపొరఁబాటునకైనను వారు అమితముగా కోప గింతురు. ఇందునకు రాజపుత్త్రివణిక్పుత్రులకథను చెప్పెదను వినుము.

రాజపుత్త్రవణిక్పుత్త్రులకథ.

పుష్కరావతీనగరమందు గూఢసేనుఁ డని రాజుండెను. అతనికి ఒకఁడే కుమారుఁడు. ఆ చిన్నవాఁడు గర్వితుఁ డై మంచి పనిగాని చెడ్డపని గాని ఏమి చేసినను ఏకపుత్త్రుఁ డైన రాజు సహించు చుండెను. ఆరాజపుత్త్రుఁడు ఒకనాఁడు ఉద్యాన వనములో విహరించుచు, తనకు సమాన మయిన రూపవిభవ ములవానిని బ్రహ్మదత్తుఁ డను వైశ్యుని యేకపుత్త్రుని చూచి, వానితో స్వయముగానే చెలిమి చేసికొనెను అది మొదలు ఏకరూపు లయిన యీ యిద్దఱును ఒకరిని చూడక యొకరు క్షణ మయినను ఉండ నేరరు; పూర్వజన్మపరిచయము త్వరగా ప్రేమను కల్పించును గదా. రాజపుత్త్రుఁడు ముందుగా వణిక్పుత్త్రునికి అర్పింపక ఏభోగమును అనుభవింపఁడు. ఒకప్పుడు రాజపుత్త్రుఁడు ముందుగా వణిక్పుత్త్రునికి వివాహము నిశ్చ యించి, తన వివాహమునకై తాను అహిచ్ఛత్త్రనగరమునకు పయనమై, మిత్త్రునికూడ తన యేనుఁగుమీఁద నే ఎక్కించుకొని దాణువతో పోవుచు సాయంకాలమందు ఇక్షుమతీతరంగిణీ తీరమున విడిసెను.

అచట వెన్నెలలో త్రాగి శయనించి రాజపుత్త్రుఁడు దాది యడుగఁగా కథ చెప్ప నారంభించి, బడలిక చేతను కైపు చేతను నిదురవోయెను. ధాత్రియు నిద్రించెను. వణిక్సుతుఁడు మాత్రము స్నేహముచేత మేలుకొని యుండెను. అంతట

నాకాశమునుండి స్త్రీలపలుకులుగా నిట్లు వినఁబడెను. 'ఈపాపి కథను చెప్పకయే నిద్రపోయినాఁడు, కనుక నేను వీనిని శపించెదను. ఇతనికి తెల్లవాఱఁగానే ఒకహారము కనఁబడును, దానిని ఇతఁడు పుచ్చుకొనునేని తత్క్షణమే చచ్చిపోవును.'— ఇట్లని యొకతె ఊరకుండెను. రెండవది 'దీనిని తప్పించుకొనిన యెడల ఇతఁడు ఒకమామిడిచెట్టును కాంచును. దానిపండ్లను భుజించెనేని తత్క్షణమే మృతి పొందును.' అనెను. 'దీనిని కూడ దాఁటెనేని వివాహగృహము ప్రవేశించునప్పుడు ఇల్లు వీఁపుమీఁద కూలి ఇతఁడు మృతిఁ బొందును.' అని మూఁడవది పలికెను. "దీనిని దాఁటినయెడల రాత్రి పడకగదిలో ప్రవేశించిన వెంటనే ఇతఁడు నూఱు తుమ్ములు తుమ్మును, అందులకు నూఱుమాఱులును 'చిరం జీవ' అని ఎవఁడును చెప్పఁడేని ఇతఁడు మృత్యువుపా లగును. ఈమనమాటలను విన్నవాఁడు రక్షకై అతనికి చెప్పునేని వాఁడు తత్క్షణమే చచ్చును." అని మఱి యొకతె పలికెను. పిడుగువంటి యీ వచనమును విని ఆ వణిక్కుమారుఁడు రాజపుత్త్రునిమీఁది స్నేహముచేత ఇట్లు తలపోసెను: 'ఛీ, ఛీ, ఆరంభించిన కథను ముగింపమి ఎంత చెఱుపు! కౌతుకముచే వినవచ్చిన దేవతలు ఇట్లు శపింతురు గదా. రాజపుత్త్రుఁడు మృతి నొందెనేని నేను బ్రదికి ఏమి ఫలము? ప్రాణప్రియుఁ డయిన యీచెలికానిని ఎట్లయినను యుక్తిచేత రక్షింపవలయును. ఈవృత్తాంతమును ఇతనికి చెప్పఁ

గూడదు.' ఇట్లాలోచించుకొని వణిక్కుమారుఁడు ఆ రాత్రిని మిక్కిలి శ్రమతో గడపెను.

రాజపుత్త్రుఁడును తెల్లవాఱఁగానే వణిక్కుమారునితోఁ గూడ పయనమై పోవుచు ఎదుట ఒకహారమును కాంచి గ్రహింపఁ బోయెను. అంతట వణిక్కుమారుఁడు, 'మిత్త్రమా, ఈహారమును పుచ్చుకొనకుము, ఇది మాయ, కాదేని ఈ సైనికులకు ఏల యగపడదు?' అని వారించెను. రాజసుతుఁడు అట్లే దానిని గ్రహింపకయే పోవుచు, ఎదుట నొకమామిడి చెట్టును కాంచి దానిపండ్లను భక్షింపఁ గోరెను. మరల నేస్త కాఁడు ఆటంకపఱిచెను. అందునకు మనస్సులో ఆయాసపడుచు పెండ్లికుమారుఁడు క్రమముగా మామగారి యింటిదగ్గఱకు పోయెను. లోపల ప్రవేశింపఁ బోవుచుండఁగా అతనిని చెలి కాఁడు ద్వారమునుండి వెనుకకు మరల్చెను, వెంటనే ఆయిల్లు కూలి పోయెను. ఆయాపదను దాఁటి వణిక్కుమారుని పనుల యందు కొంచెము నమ్మకము గలిగి రాజపుత్త్రుఁడు రాత్రి పెండ్లికొమార్తెతోఁ గూడ మఱి యొకగదిలో ప్రవేశించెను. అందును ఆమిత్త్రుఁడు ప్రవేశించి అగపడక దాఁగి యుండెను. రాజకుమారుఁడు పానుపుపై కూర్చుండి నూఱుమాఱులు తుమ్మెను. నూఱుమాఱులును మిత్త్రుఁడు మెల్లగా 'చిరం జీవ' అని పలికి ధన్యుఁడై సంతోషముతో ప్రకాశముగా బయటికి వచ్చెను. అతఁడు పోవుచుండఁగా సభార్యుఁడు రాసుతుఁడు

చూచి ఈర్ష్యచే అతని చెలికారమును మఱచి, కోపంపుఁ బెంపున దౌవారికులను పిలిచి, 'ఈపాపాత్ముఁడు నాయంతఃపురమును చొచ్చినాఁడు, ఱేపు ప్రాతఃకాలమందు ఇతనిని దండించెద, అందాఁక బందిగా నుంపుఁడు.' అని యాజ్ఞాపించెను. అట్లే బంధనములో వణిక్పుత్త్రుఁడు ఆరాత్రి గడపి, తెల్లవాఱఁగానే తన్ను వధ్యభూమికి వారు కొని పోవుచుండఁగా, వారితో 'నన్ను మొదట రాజపుత్త్రునిమొద్దకు కొనిపొండు, అచట నేను కొంచెము కారణమును చెప్పెదను, పిమ్మట నన్ను చంపి వేయుఁడు.' అని యడిగెను. వారు పోయి ఆమాటను రాజపుత్త్రునికి విన్నవింపఁగా అతఁడు మంత్రులచేత బోధితుఁడై యంగీకరించెను అంతట వైశ్యపుత్త్రుఁడు వచ్చి ఆయావద్వృత్తాంతమును చెప్పెను. ఇల్లు పడిన తార్కాణచేత దానిని రాజకుమారుఁడు నమ్మి, చెలికానిని విడిపించి అతనితో కూడ సభార్యుఁడై తనయూరికి పోయెను. వెంటనే మిత్త్రుఁడును వివాహమై అందఱచేత పొగడ్తలు పొంది సుఖముగా నుండెను.

ఈప్రకారము రాజసుతులు విశృంఖలులై మత్తగజములవలె స్వనియంతలనే చంపుదురు. వారితోను బేతాళులతోను ఏమి మైత్రి? ఉభయులును నవ్వుచునే ప్రాణములను పుచ్చుకొందురు. కనుక ఓ రాజపుత్త్రి నీవు నా స్నేహమును ఎప్పుడును ఉల్లఘింపకుము.—ఈకథను సోమప్రభవలన విని కలింగసేన స్నేహముతో ఆమెకు మరల నిట్లనియె:—సఖీ,

మీరు పిశాచములు గాని రాజపుత్త్రికలుగారు. నీకు పిశాచ దుర్గ్రహకథను చెప్పెదను వినుము.

పిశాచదుర్గ్రహకథ.

పూర్వము యజ్ఞస్థల మను నగ్రహారములో పేద బాపఁడొకరుఁ డుండెను. ఒకనాఁ డతఁడు కట్టియలకై అడవికి పోయెను. అచట గొడ్డటిపెట్టునకు ఒకకొయ్య ఎగిరి అతని పిక్కను చీల్చి అందులో గ్రుచ్చుకొనియెను. రక్తము కాఱి అతఁడు మూర్ఛ పోఁగా, ఆతనిని ఎవఁడో చూచి ఆనవాలు పట్టి ఇంటికి మోచి తెచ్చెను. భార్య దుఃఖితురాలై గాయము కడిగి కట్టు కట్టెను. ఎంత వైద్యము చేసినను వ్రణము దివదినము మానక నాడీవ్రణముగా పరిణమించెను. అందులకు దుఃఖించి చావ నిశ్చయించుకొని యున్న యతనిని మిత్త్రుఁడొకఁడు వచ్చి చూచి ఏకాంతముగా ఇట్లు హితము చెప్పెను:— 'నాచెలికాఁడు యజ్ఞదత్తుఁడు చిరకాలము దరిద్రుఁడై యుండి పిశాచసాధనము చేసి ధనము వడసి సుఖముగా నున్నాఁడు. అతఁడు ఆమంత్రమును నాకు చెప్పినాఁడు. నీవును పిశాచమును సాధింపుము, పిశాచము నీవ్రణమును మాన్పును.' ఇట్లని మంత్రము నుపదేశించి ఈక్రియను కూడ చెప్పెను. ''నాలవ జామున లేచి తల విరియఁబోసికొని, దిసమొలగా, ఆచమింపక, యథాశక్తి రెండుచేతులలోను రెండు పిడికిళ్ల బియ్యము కొని, జపించుచు, నాలుగు వీథులు కలయుచోటికి పొమ్ము. అచట

ఆ రెండు పిడికిళ్లను ఉంచి మౌనముతో ఇంటికి రావలసినది, వెనుకకు తిరిగి చూడకుము. ఈప్రకారము నిత్యము పిశాచము ప్రత్యక్ష మగువఱకు చేయుము. అది 'స్త్రీవ్యాధిని నేను హరించెదను' అని స్పష్టముగా పలుకును. అందుల కంగీకరింపుము. అంత నాపిశాచము నీరోగమును కుదుర్చును." ఆబ్రాహ్మణుఁడును అట్లే చేసెను. అంతట పిశాచము వశ్యమై మహౌషధులను హిమవత్పర్వతమునుండి తెచ్చి అతని నారికుఱుపును మాన్పెను. దొరకినవానిని పట్టుకొనునదియైన యా పిశాచము సంతుష్టుఁడై యున్న బ్రాహ్మణుని 'నాకు ఇంకొక వ్రణమును చూపుము. దానిని కూడ కుదిర్చెదను. అట్లు చేయవేని నీకు అనర్థము చేసెదను, లేక, చంపియే వేసెదను.' అని బాధింపసాగెను. అంత నతఁడు భయపడి ప్రాణములమీఁది యాశను వదలుకొని అప్పటికి తప్పించుకొనువాఁడై 'ఏడుదినములలో నీకు రెండవవ్రణము ఇచ్చెదను.' అని చెప్పి పోయెను.

ఇట్లు పలికి అశ్లీలము చెప్ప లజ్జించి కళింగసేన క్షణమూరకుండి మరల సోమప్రభతో నిట్లు చెప్ప సాగెను.—

పిమ్మట రెండవవ్రణము దొరకక దిగులుపడి యున్న తండ్రిని చూచి కూఁతురు వితంతువు మంచి తెలివిగలది వృత్తాంత మడిగి తెలిసికొని 'నే నాపిశాచమును వంచించెద, నీవు పోయి దానితో, నాకొమారితకు నాశ్రీవణ మున్నది, పోఁగొట్టుము, అనుము.' అనెను. బ్రాహ్మణుఁడు సంతోషించి

అట్లే చెప్పి పిశాచమును కూఁతునొద్దకు తెచ్చెను. దానికి ఆమె ఏకాంతమందు తన వరాంగమును చూపి 'మిత్త్రమా, నాకు ఈవ్రణమును కుదుర్పుము.' అని వేఁడెను. తెలివి లేని యా దయ్యము ఆమెవరాంగమునకు సదా పిండీలేపము మొదలైనవి ఎంత వేసియు కుదుర్ప లేకపోయెను. అనేకదినములకు విసిగి ఆదయ్యము ఆమెపిక్కలను తన బుజములమీఁద నుంచుకొని, ఇది ఏల కుదురదో చూత మని వరాంగమును చూడఁగా దానిక్రింద పాయువ్రణ మగపడెను. దానిని చూచి అడలి దయ్యము ఇట్లు తలపోసెను. 'ఒకటి కుదురకముందే మఱి యొకటి పుట్టినది!' ఛిద్రములలో అనర్థములు బహుళము లగును' అనుసామెత తప్పదు గదా. ఎందుండి లోకోత్పత్తి యగునో దేనిచేలోక ప్రళయము అగునో వివృత మయిన యీసంసార మార్గమును మూయుటకు ఎవఁడు నేర్చును!' ఇట్లాలోచించుకొని యత్నము విపరీతఫల మగుట చూచి తన కిఁక బంధన మగు నని వెఱచి ఆమూఢపిశాచము అచటినుండి పాఱిపోయి అగపడక దాఁగికొనెను.

ఈప్రకారము ఆమె పిశాచమును వంచించి తండ్రిని రక్షించెను. పిశాచములు ఇట్టివి, బాలు రయినరాజపుత్త్రులును ఇట్టివారు, సాధింపఁబడినను అనర్థమునే చేయుదురు. వారినుండి బుద్ధివిశేషముచేత తప్పించుకొనవలసినది. కులజ లయిన రాచకొమారితలు ఇట్టివా రని ఎచ్చటను వినియుండము. కనుక,

చెలీ, నా స్నేహమునుగుఱించి నీవు వేఱుతీరుగా భావింపఁగూడదు.

కళింగసేనవలన నీకథ విని సోమప్రభ సంతోషించినవ్వి 'చెలీ, నాయిల్లు ఇక్కడికి అఱువది యోజనములు; అస్తమయము కావచ్చినది; చాలసేపు ఉంటిని; ఇంక పోయి వచ్చెదను.' అని చెప్పి, మరల తనరాకను కోరుచున్న యాకళింగసేనను వీడ్కొని, ఆకాశమున కెగిరి తనయింటికి పోయెను. ఆయద్భుతమును చూచి కళింగసేన ఇట్లు తలపోయుచుండెను. 'ఈనాచెలి ఎవతెయో? సిద్ధాంగనయో, అచ్చరయో, విద్యాధరియో? ఈమె ఆకాశమున సంచరించుచున్నది. కావున నిశ్చయముగా దివ్యాంగన. దివ్యాంగనలు మనుష్యస్త్రీలతో చెలిమి చేయుట కలదు. అరుంధతీదేవి పృథుచక్రవర్తి కొమారితతో చెలిమి చేయలేదా? ఆమెయొక్క ప్రీతిచేత పృథుప్రు సురభిని స్వర్గమునుండి భూలోకమునకు తేలేదా? అతఁడు భ్రష్టుఁడయ్యును దానిపాలను త్రాగుటచేత మరల స్వర్గమునకు పోలేదా? అదిమొదలుగా అవికలము లయినగోవులు భూతలమందు పుట్టుచుండలేదా? నేను ధన్యనైతిని, నాపుణ్యముచేత ఈదివ్యవనిత నాకు చెలి యయినది. ఱేపు రాఁగానే వంశమును పేరును యుక్తిగా అడిగెదను.' ఇట్లు కళింగసేన ఆలోచించుకొని ఆరాత్రి అచట గడపెను. సోమప్రభయు మరల కళింగసేనను చూడ నువ్విళ్లూరుచు ఆరాత్రి తనయింటనే గడపెను

# 3 - వ తరంగము.



మఱునాఁడు ప్రాతఃకాలమందు సోమప్రభ కళింగసేనను వినోదపఱుచుటకు ఒకబరిణను తెచ్చి ఇచ్చెను. ఆబరిణలో కొయ్యతో చేసినజంత్రపుబొమ్మలు పెక్కు లుండినవి. కళింగసేనయు ఆమెను చూచి ఆనందబాష్పములు కురియుచు లేచి మెడను కవుంగిలించుకొని తనప్రక్కను కూర్చుండఁ బెట్టుకొని యిట్లనియె: 'నెచ్చెలీ, నీ నెమ్మోముచంద్రుఁడు లేమిచేత, ఈరాత్రియామ నాకు అంధకారమయమై శతయామ మైనది. మన కేమో జన్మాంతరసంబంధము కలదు, దానికి పరిణామము ఈప్రేమ. ఆసంబంధమును, ఓ దేవతా, నీ వెఱుఁగుదువేని చెప్పుము.' సోమప్రభ యిట్లనియె: 'నాకు ఇట్టిజ్ఞానము లేదు, నాకు జన్మాంతరస్మరణ లేదు. మునులకు కూడ ఇట్టిజ్ఞానము అరుదు. కొందఱుమునులకు ఉన్ననుండును, వారు అందులకు తగినకర్మను చేసి యుందురు, పరతత్త్వమును కూడ ఎఱిఁగి యుందురు.' ప్రేమవిస్రంభపేశలముగా ఇట్లు పలికినసోమప్రభను కళింగసేన ఏకాంతమందు అడిగెను: 'సఖీ, చెప్పుము, నీవు దేవజాతీయుఁడయిన తండ్రియొక్క ఏవంశమును సువృత్తయగు ముత్తియమువలె అలంకరించితివి? ఓ సులక్షణా, లోకకర్ణామృత మయిన నీ పే రేమి? ఈబరిణ ఏమి? ఇందు ఏ మున్నది?'

ఇట్లు కళింగసేన స్నేహముతో అడుగఁగా సోమప్రభ సర్వ మును క్రమముగా చెప్పఁ దొడంగెను:—

మూఁడులోకములలోను ప్రఖ్యాతుఁడు మయుఁడని మహాసురుఁడు కలఁడు. ఆయన అసురభావమును వదలి శౌరిని శరణము పొందినాఁడు. ఆదేవుఁడు అభయ మీయఁగా ఆయన ఇంద్రునికి సభను నిర్మించి యిచ్చినాఁడు. దైత్యులు అతఁడు దేవపక్షుఁ డని అతని మీఁద కోపగించిరి. వారి భయముచేత ఆయన అసురేంద్రులకు అగమ్యమును మాయాపూర్ణమును మహాశ్చర్య భరితమును అయిన వరమందిరమును వింధ్యాద్రి యందు నిర్మించుకొనెను. ఆయనకు మే మిద్దఱము కొమారి తలము. పెద్దకొమారిత స్వయంప్రభ యనునది బ్రహ్మచారిణి, నాయనయింటనే ఉన్నది. నేను సోమప్రభను రెండవదానను. నన్ను మా నాయన కుబేరునికుమారునికి నలకూబరునికి ఇచ్చెను. మానాయన నాకు నానా మాయాయంత్రములు నేర్పినాఁడు. నీకై ప్రీతిచేత యంత్రములతో నిండిన యీ బరిణను తెచ్చితిని.' ఇట్లు పలికి తెఱచి మిక్కిలివినోదకరము లైన తన యీ జంత్రపు బొమ్మలను చూపెను. బిరడను కొట్టిన మాత్రాన ఒకటి ఆకాశముకుఁ బోయి ఆమెయాజ్ఞచే శీఘ్ర ముగా పూవులదండను కొనివచ్చినది. ఒకటి అట్లే మంచినీళ్లు తెచ్చినది, ఒకటి నృత్యము చేసినది, ఒకటి కథలు చెప్పసాగినది. ఇత్యాది మహాశ్చర్యములచేత కొంతకాలము వినోదపఱిచి

సోమప్రభ ఆయంత్రకరండమును పదిలముగా నుంచి కళింగసేన యొద్ద సెలవు పుచ్చుకొని భర్తృపరాధీన ఆకాశమార్గమున తనయింటికి పోయెను.

కళింగసేన ఈయాశ్చర్య దర్శనముచేత సంతోషించి ఆఁకలి మఱచి ఆదినము బొత్తిగా భోజనము చేయకుండెను. దానిని చూచి రోగ మేమో అనుకొని యామెతల్లి భయపడఁగా ఆనందుఁడను వైద్యుఁడు 'ఈమెకు రోగ మేమియు లేదు; ఈమెకు సంతోషముచేత ఆఁకలి పోయినది, రోగముచేతఁగాదు; వికసించిన నేత్రములు గల యీమెనగుమొగము సంతోషమును తెలుపుచున్నది.' అని చెప్పినాఁడు. అంత తల్లి కళింగసేనను సంతోషకారణ మడుగఁగా, ఆమె వృత్తాంతమంతయు చెప్పినది. ఆస్థితి శ్లాఘ్యసఖీసంగసంతోషముచేఁ గలిగిన దని యెఱిఁగి తల్లి సంతోషించి యథోచితము కొనూరిత చేత భోజనము చేయించెను. మఱునాఁడు సోమప్రభ వచ్చి ఆ వృత్తాంతము నెఱిఁగి రహస్యముగా కళింగసేనతో ని ట్లనియె:- 'నేను నీస్నేహము తెలిపి ప్రతిదినము నీయొద్దకు వచ్చుటకు నాభర్తవలన అనుజ్ఞ పొందితిని. నీవును నీతల్లిదండ్రులవలన సెలవు పొందుము, మన మిద్దఱము యథేచ్ఛముగా విహరించుచుందము.' వెంటనే కళింగసేన ఆమెను చేయిపట్టుకొని తన తల్లిదండ్రులయొద్దకు కొనిపోయి పేరును వంశమును చెప్పి వారికి చూపించెను. ఆమెను కాంచి వారును మిగుల సంతో

షించిరి. ఆయాకారమునకు ఆదంపతు లిద్దఱును సంతోషించి సుతాస్నేహముచేత ఆమెను సత్కరించి 'అమ్మాయీ, ఈకళింగ సేనను నీచేతిలో నుంచినారము, ఇఁక మీరాయిచ్చ వచ్చినట్లు విహరింపుఁడు.' అని చెప్పిరి.

వారిమాటకు అలరి ఆచెలు లిరువురు విహరించుటకు రాజు కట్టించిన విహారమునకు పోయిరి. యంత్రకరండికను చేతఁగొని అందులోనుండి సోమప్రభ ఒక యంత్రయక్షుని ఎత్తి బుద్ధార్చనకు వలయు సామగ్రి తెమ్మని పంపెను. వాఁడును దూరము పోయి ముత్తెములు రత్నములు పైఁడితామరలు కొనివచ్చెను. వానిచేతనే పూజ చేయించి సోమప్రభ అచటి సుగతుల నెల్ల ఆశ్చర్యపెట్టినది. ఆవార్త విని రాజును రాణియు వచ్చి యంత్రచేష్టితమునుగూర్చి సోమప్రభను ప్రశ్న చేసిరి. సోమప్రభ చెప్పుచున్నది.—'రాజా, ఇట్టి మాయాయంత్రాది శిల్పములను పెక్కింటిని మాయాయన పూర్వము సృజించెను. ఈ లోకమువలెనే, ఈ యంత్రము లన్నియు పంచభూత మయములుగా ఉన్నవి. వాని స్వరూపమును వేర్వేఱ వినుము. పృథ్వీప్రధాన యంత్రము ద్వారాదులను మూయును, అది మూసినదానిని మఱి యెవరును తెఱవలేరు; జలయంత్రజ మయిన యాకారము సజీవమువలె అగపడును; తేజోమయ యంత్రము జ్వాలలను గ్రక్కును; వాతయంత్రము రాక పోకలను కల్పించును; ఆకాశయంత్రము శబ్దమును వ్యక్త

పలుచును. వీనిని నేను నాయనయొద్ద నేర్చితిని. అమృతరక్షక మగుచక్రయంత్రముమాత్రము మానాయన కొక్కనికి తప్ప మఱి యెవ్వరికిని తెలియదు.' ఆమె యిట్లు పలుకుచుండఁగా ఆవిషయము 'ఔను ఔను' అనునదివోలె మధ్యాహ్న శంఖములు మ్రోఁగసాగెను.

అంతట సోమప్రభ తనతోఁగూడ దివ్యాహారమునే కళింగసేనయు ఆరగించును గాక యని రాజుతో విన్నవించి, అనుజ్ఞ పొంది, యంత్రవిమానమందు ఆమెను సానుచరినిగా ఎక్కించుకొని ఆకాశమార్గమున తన తండ్రియింటికి అక్క యొద్దకు తోడ్కొని పోయెను. అచట జటాజూటమాలినియు లంబాక్షమాలయు నై, తాఁదాల్చిన వెలిపుట్టంపుమిషచే కామ భోగార్థ మయి మహోగ్రతపస్సు చేసినపార్వతిని హసించు చున్న యాబ్రహ్మచారిణిని, స్వయంప్రభాదేవిని, కళింగసేన చూచి నమస్కరించెను. ఆమెను సోమప్రభవలన నెఱిఁగి స్వయంప్రభ ఫలాదికముచే అతిథిసత్కారములు చేసెను. 'సఖీ, ఈఫలములను భక్షించిన, పద్మమునకు మంచుదెబ్బవోలె ఈరూపమునకు శత్రు వయిన ముదిమి నిన్నంటదు. ఇందు కొఱకే నిన్ను స్నేహముచేత ఇక్కడికి కొనివచ్చితిని.' అని కళింగసేనతో సోమప్రభ పలికెను. కళింగసేన ఆఫలములను భుజించి తత్క్షణమే అమృతవర్షములోఁ దొప్పదోఁగినదియుం బోలె ఆయెను. పిమ్మట కౌతుకముచే విహరింపఁదొడంగి,

పొందామరబావులు సుధామధురఫలములు గలిగి పలువన్నెల బంగారపుఁబులుఁగులు నిండి యుండ, మణిమయస్తంభములు వెలుఁగ, గోడ లేనిచోట గోడ యున్నట్లును గోడ యున్నచోట లేనట్లును భ్రమయించుచు, నీటిని నేలగాను నేలను నీరుగాను చూపుచు, అపూర్వ లోకాంతరమువలె మయమాయానిర్మిత మయిన పురోద్యానమును, పూర్వము సీతను వెదకవచ్చిన ప్లవగవీరులు చొచ్చి స్వయంప్రభాప్రసాదముచేత వెలువడినదానిని, చూచి ఆశ్చర్యపడి కళింగసేన ముదిమిని జయించిన యాస్వయంప్రభను వీడ్కొనెను. అంతట సోమప్రభ కళింగసేనను మరల యంత్రమందు కూర్చుండఁబెట్టి ఆకాశమార్గమున కొని వచ్చి తక్షశిలానగరములో ఇల్లు చేర్చెను. అచట కళింగసేన తాను చూచిన దెల్ల తల్లిదండ్రులకు వర్ణించెను. వారును మిక్కిలి సంతోషము పొందిరి.

ఇట్లు ఆ యిరువురకు దినదినము సఖ్యము వర్ధిల్లుచుండఁగా, ఒకనాఁడు సోమప్రభ కళింగసేనతో నిట్లనియె:— నీకు వివాహ మగువఱకే నీతో నాచెలిమి. నీభర్తయింట నాకు ప్రవేశ మెక్కడిది? చెలిభర్తను చూడరాదు, ఎట్లును అతనిని అంగీకరింపరాదు. తోఁడేలు మేఁకలనుం బోలె అత్త కోడలిని భక్షించును. ఈవిషయములో కీర్తిసేనకథను విను.

### కీర్తిసేనకథ.

పాటలీపురమందు ధనపాలితుఁ డని సార్థకనాముఁడు వర్తకుఁ డుండెను. అతనికి కీర్తిసేన యని కూఁతురు ప్రాణముల కంటె ప్రియ అనన్యాదృశరూప యుండెను. ఆమెను అతఁడు మగధదేశములో నొక మహాధనికునికి దేవసేనుఁ డనువానికి ఇచ్చెను. ఆసజ్జనునికి తండ్రి లేఁడు, తల్లి కూళ ఇంటికి స్వామిని గానుండెను. కుమారునికి ప్రియతమ యయిన యా కోడలిని కీర్తిసేనను అత్త అతఁడు ఇంట లేనప్పుడు వేధించుచుండెను. ఆబాధను కీర్తిసేన పతితో చెప్ప నేరకుండెను. క్రూరురాలయిన యత్తచేతిలో నున్న కోడలిస్థితి కష్టము గదా. ఇట్లుండ, ఒకప్పుడు దేవసేనుఁడు బంధుప్రేరితుఁడై బేరముకై వలభీనగరమునకు పయన మాయెను. అప్పుడు కీర్తిసేన పతితో ని ట్లనియె:— 'ఆర్యపుత్రా, నీతో నే నింతపఱకు చెప్పలేదు, నీ విక్కడ నుండఁగానే నీతల్లి నన్ను సదా వేధించుచున్నది. నీవు లేనప్పుడు న న్నేమి చేయునో ఎఱుఁగఁజాలను.' అతఁడు ఆశ్చర్యపడి ఆమెపై స్నేహముచే భయపడి తల్లికి నమస్కరించి 'అమ్మా, నేను కీర్తిసేనను నీచేత నుంచి దేశాంతరము పోవుచున్నాను. ఇది గొప్పవంశముది, దీనియందు నిస్స్నేహముగా నుండవలదు.' అనెను. అంతట తల్లి కీర్తిసేనను పిలిచి కుమారునితో 'దీనికి నే నేమి చేసితినో దీనినే అడుగుము. గృహభేదము చేయుటకై ఇది నిన్ను ప్రేరించుచున్నది. నాకు మీ రిద్దఱును సమానులే.'

అనెను. తల్లి యిట్లు పలుకఁగా దేవసేనుఁడు శాంతచిత్తుఁడాయెను. తల్లి స్నేహముగా మోసము లాడిన ఎవఁడు నమ్మఁడు? కీర్తిసేన ఆశ్చర్యమునను నవ్వి ఊరకుండెను. మఱునాఁడు దేవసేనుఁడు వలభికి తరలెను.

ఆ వియోగమునకు కుందుచున్న కీర్తిసేనను అత్త దాసీజనమును పనిలోనుండి నిలిపెను; ఇంట నున్న తనచేటితో కుట్ర చేసి కోడలిని లోపలియింటికి పిలిచి దిగంబరను చేసి 'పాపాత్మురాలా, నాకుమారుని హరింపఁ దలఁచితివా?' అని సిగఁ బట్టి తానును చేటియు చేరి కొట్టి తన్ని కఱచి గిల్లి హింసించి, నేలమాలియలో తాతలనాఁటినుండి భద్రముచేసి యున్న ధనమును తీసి శూన్యము చేసి అందు కోడలిని పడవైచి మూఁత మూసి గడియ వైచెను. ప్రతిదినము సాయంకాలమున అందులోనికి ఆమెకు ఆహారముగా సగము మూఁకుడు అన్నము దింపుచుండెను. కొడుకుతో 'నీ వియోగముచే నీభార్య స్వయముగా చచ్చిన దని చెప్పెదను గాక.' యని ఆలోచించుకొనెను. ఇట్లు పాపాత్మురా లయిన యత్త నేలమాలియలో వేయఁగా సుఖోచిత యయిన కీర్తిసేన ఏడ్చుచు నిట్లు తలపోసెను: 'పతి ధనవంతుఁడు, పుట్టినకులము గొప్పది, సౌభాగ్యము కలదు, నడవడిలో దోషము లేదు, అయినను నాకు అత్తదయచేత ఇట్టి విపత్తు; ఇందుచేత నే బంధువులు అత్తచేతను ఆఁడుబిడ్డలచేతను పాట్లు పడవలసినదియు, అసౌభాగ్యాదిదోషములకు పా లగు

నదియు, అగు కన్యాజన్మమును నిందింతురు.' ఇట్లు శోకించు చున్న కీర్తిసేనకు ఆకస్మికముగా గుద్దలి యొకటి బ్రహ్మచేత ఫలింపఁబడినమనశ్శల్యము వోలె దొరకెను. ఇనుపతలగలయా గుద్దలితో ఆమె సొరంగము త్రవ్వసాగెను. త్రవ్వఁగా త్రవ్వఁగా దైవవశమున ఆ సొరంగము తన పడకగదిలోనికి పోయెను. అందు అక్షయ మయిన తనప్రాక్తనధర్మమో యన దీపము వెలుతురొసంగఁగా ఇల్లంతయుఁ జూచి తనవస్త్రములను బంగారమును తీసికొని వేఁకువను రహస్యముగా ఊరివెలుపలికి పోయి, 'ఈ యవస్థలో నేను తండ్రియింటికి పోవుట సరి గాదు, అక్కడ నేను ఏమి చెప్పఁగలను? లోకులు నన్నెట్లు నమ్ముదురు? కనుక నేను యుక్తిచేత పతియొద్దకే పోవలయును. ఇహపరములయందు పతివ్రతకు పతి యొకఁడే కదా గతి.'

అని యిట్లాలోచించి తటాకమందు స్నానము చేసి రాజ పుత్త్రి వేషము వేసికొని బజారునకు పోయి కొంచెము వెలకు బంగారమమ్మి ఒకవర్తకునియింట ఆదినము ఉండెను. మఱు నాఁడు వలభికి సముద్రదత్తుఁ డనువర్తకుఁడు పోవుచుండఁగా అతనితో స్నేహముచేసి తానునుకూడ బయలువెడలెను. అత నితో 'అయ్యా, నేను దాయాదులపోరు పడలేక నీతో వలభికి నాబంధువులకడకు వచ్చుచున్నాను.' అని చెప్పెను. అతఁడు ఆమెకు 'ఇతఁ డెవరో గొప్పవాఁడు రాజపుత్త్రుఁడు' అని చక్కఁ గా పరిచర్య చేయుచుండెను. ఆబిడారు ఎక్కువ సుంకమునకు

భయపడి అడవిమార్గముబడి పోవుచుండెను. కొన్నాళ్లకు అడవిద్వారమునకు పోయి సాతు విడియుఁగా, నక్క యొకటి యమదూతివలె భయంకరముగా ఊళ పెట్టెను. దానియర్థము నెఱింగిన వర్తకసంఘము దొంగలరాకకు వెఱవఁగా రక్షకులు అంతట చేత ఆయుధములు దాల్చి సిద్ధముగా నుండిరి. దొంగల యొక్క ముందటిదండో యన చీఁకటి వచ్చుచుండఁగా కీర్తిసేన మగవేషములో నున్న తన్ను చూచుకొని ఆలోచించెను: "ఆహాహా! పాపులకర్మ సంతతిచేతనుం బోలె పెంచ్చుచున్నది. అత్త చేసినయపాయము నన్ను ఇక్కడికిని తఱుముకొని వచ్చినది. మొదట నన్ను మృత్యువువలె అత్త భక్షించినది. పిమ్మట వేఱుగర్భమునఁ బోలె నేల గృహమున వసించితిని. దైవవశమున అందునుండి వెలువడియు నేను మరల ప్రాణసంశయమునకు పాత్రమ నయితిని. దొంగలు నన్ను హరించిరేని అత్త వాస్తవముగా 'నీభార్య ఎవనినో తగులుకొని పోయినది' అని నా పతితో చెప్పును. నావస్త్రమును ఎవరయిన లాగినైతురేని స్త్రీనని తెలిసికొందురు. ఆచారలోపముకన్న మరణము మేలు. కనుక నేను నన్ను కాపాడుకొనవలసి యున్నది. స్నేహితుని ఈ వర్తకుని అపేక్షింపఁగూడదు. స్త్రీలకు పతివ్రతాధర్మము మిత్రధర్మముకంటె ప్రధానము." ఇట్లు తలపోసి ఆమె వెదకి, తనపై భూదేవి జాలిగొని తనలో చోటిచ్చినదో యన, చెట్లనడుమ ఒకగోతిని కనిపట్టి, అందు ప్రవేశించి గడ్డి ఆకు మొదలగువానితో తన్ను కప్పుకొని యుండెను.

అంతలో అర్ధరాత్రమందు గొప్ప దొంగదండు సాతును ముట్టడించెను. బొబ్బరించుచున్న దొంగలనల్లమబ్బులును, శస్త్ర జ్వాలలమెఱపులును, నెత్తురుజడియుఁ, గలిగి యుద్ధదుర్దినము విజృంభించు చుండెను. దొంగలు సముద్రదత్తుని అతనియనుచరులను కొట్టి సకలధనమును కొని పోయిరి. ఆకోలాహలము విని యు కీర్తిసేన బ్రదికియే యుండుట నియతివిలాసము. సూర్యోదయము కాఁగానే ఆమె ఆ గోతిలోనుండి వెలువడెను. భర్తృపరాయణ లైన శీలవతులను దేవతలే ఆపదలనుండి రక్షింతురు. ఎట్లన ఆనిర్జనారణ్యములో ఆమెను చూచియు సింహము చంపలేదు సరియే గదా, ఎవరో తాపసుఁడు ఎక్కడి నుండియో వచ్చి వృత్తాంత మడిగి కమండలూదకము త్రాగ నిచ్చి దారి చూపి అంతర్హితుఁ డాయెను. ఆ జలపానముచేత అమృతపానముచేతనుం బోలె ఆఁకలియు దప్పియు తీఱఁగా, ఆమె బయలు వెడలి సూర్యాస్తమయపర్యంతము నడచి, యొక పెద్ద చెట్టెక్కి విశాల మయిన తోఁటలో ఇంటం బోలె ప్రవేశించి, ద్వారమునకు కొయ్య అడ్డము వేసికొనెను.

చీఁకటి పడఁగానే ఆమె ద్వారరంధ్రమునుండి చూచు చుండఁగా ఒకరాక్షసి బాలతనయులతోఁగూడ వచ్చినది. 'ఇత రాపదలు దాఁటితిని గాని నన్ను ఈరాక్షసి భక్షించును.' అని యామె భయపడుచుండఁగా ఆ రాక్షసి కుమారులతోఁ గూడ చెట్టెక్కెను. తినుటకు ఏ మయిన పెట్టు మని రాక్షసిని

పిల్లకాయలు అడుగసాగిరి. "అయ్యో! నాపిల్లలారా, ఇప్పుడు ఏమియు లేదు, మహాశ్మశానమునకు పోయినను భక్ష్య మేమియు దొరకదాయెను. డాకినీసంఘమును యాచించితిని గాని వారు నాకు భాగ మీయక పోయిరి. ఆదుఃఖముతో నేను విన్నపించు కొనఁగా భైరవుఁడు నాపేరును వంశమును అడిగి తెలిసికొని ఇట్లానతిచ్చెను. 'భయంకరీ, గొప్పవంశము దానవు, ఖరదూషణ వంశములో పుట్టితివి, ఈవసుదత్తపురమునకు పొమ్ము. అందు వసుదత్తుఁ డని రాజు మహాధార్మికుఁడు ఉన్నాఁడు. అతఁడు ఈయడవి నంతయు దానియంతమున ఉండి రక్షించుచున్నాఁడు. తాను సుంకము పుచ్చుకొనును, దొంగలను దండించును. అతఁడు ఒకనాఁడు వేఁటబడలికచే నిద్రించుచుండగా చెవిలో చెవిఁ జొచ్చుపాము దూఱినది. అది కాలక్రమమున తలలో పెక్కు పిల్లలను పెట్టినది. ఆరోగముచేత ఇప్పుడు రాజు శుష్కించి నరములుమాత్రముగా నున్నాఁడు. వైద్యులావ్యాధిని కనుంగొనలేక యున్నారు. ఎవఁడును దానిని కనిపట్టఁడేని అతఁడు కొలదిదినములలోనే మరణము పొందును. అంతట అతని మాంసమును మాయచేత నీవు భుజింపవచ్చును. ఆభోజనము నీకు ఆఱుమాసములకు చాలును.' ఈ ప్రకారము భైరవుఁడు కూడ నాకు సందిగ్ధము కాలవంతము నైనయేర్పాటు చెప్పినాఁడు. పిల్లలారా, నే నేమి చేయుదును?" ఇట్లు విని పిల్లలు 'అమ్మా, ఎవ రయినను ఆవ్యాధిని ఎఱిఁగి కుదిర్చిన అతఁడు

బ్రదుకునా? ఆరోగము ఎట్లు కుదురునో చెప్పుము.' అని అడుగఁగా, 'ఔను కుదిర్చిన బ్రదుకును. ఆరోగము ఇట్లు చేసిన మానును. వేఁడినేయి తల యంటి మిడిమిడియెండలో చాలసేపు కూర్చుండఁబెట్టి చెవిలో ఒక వెదురుగొట్టమును ఉంచి దాని రెండవచివరను చన్నీళ్లకుండమీఁద మూఁకుడునడుమ బొక్క లోనుంపవలయును. ఆయుక్కకును ఎండకును బడలి పాములు ఆ గొట్టముగుండ చలువకై ఆచన్నీళ్లకుండలో పడును. ఇదే ఆ రోగమునకు ఔషధము.' అని తల్లి చెప్పెను.

అది యంతయు విని కీర్తిసేన ఇట్లు తలపోసెను: 'ఈయాపద తప్పెనేని నేను ఆరాజును ఈయుక్తిచేత బ్రదికించెదను. ఈయడవికే అతఁడు రక్షకుఁడు, కొలదిసుంకము పుచ్చుకొనువాఁడు. ఆసౌకర్యముచేత వర్తకు లందఱును ఈదారినే వత్తురు. అట్లే సముద్రసేనుఁడు కూడ చెప్పియుండెను, కనుక నాభర్త కూడ ఈమార్గముననే వచ్చును. కనుక వసుదత్తపురమునకు పోయి ఆరాజును బ్రదికించి పతిరాక నెదురుసూచుచుండెద.' ఇట్లు ఆలోచించుకొని ఆమె ఎట్లో ఆ రాత్రి గడపెను. తెల్లవాఱఁగానే రాక్షసులు పోఁగానే ఆచెట్టు నుండి వెలువడి మగవేషముతోనే అడవినడుమ నడచుచు, అపరాహ్ణమందు ఒకగొల్లను చూచి, తన చెలువమునకును దూరపునడకకును చిత్తము కరఁగిన యాసాధువును, ఇది ఏచోటు చెప్పు మని యడిగెను. గొల్ల యనియె:—'ఈయడవి

వసుదత్త మహారాజుది. ఈయగపడునది వసుదత్తపురము. మహారాజు రోగముచే స్వర్గస్థుఁడు కానున్నాఁడు.' కీర్తిసేన 'నన్ను ఎవరయినను ఆయనయొద్దకు కొనిపోదురేని, నేను ఆరోగమును కుదుర్పఁగలను.'అనెను. 'నేను అచటికే పోవుచున్నాను, నాతో రమ్ము, నీకు కావలసినయత్నము చేసెదను.' అని గోపాలుఁడు పలుకఁగా, ఆమెయు అతనితో పోయెను. అచట గోపుఁడు సంగతి చెప్పి కల్యాణలక్షణ యైన కీర్తిసేనను మగవేషము దానిని ప్రతీహారునికి అప్పగించెను.

వెంటనే ప్రతీహారుఁడు రాజునకు విన్నవించి అనుజ్ఞ పొంది ఆసాధ్విని రాజునొద్దకు కొనిపోయెను. మహారాజు ఆ యద్భుతాకృతిని చూడఁగానే ఆమెవలన తనరోగము కుదురునని ఊటిడిల్లెను. హితాహితములను మనస్సే చెప్పును గదా. ఆమెతో 'ఓకల్యాణమూర్తీ, నారోగమును మాన్పుదువేని నీకు నారాజ్యములో సగ మిచ్చెదను. నాస్వప్నములో ఒకస్త్రీ నాపేఁపునుండి నల్లకంబళిని తీసివేసినది. కనుక నిశ్చయముగా నారోగమును నీవు మాన్పుదువు ' అనెను. 'దేవా, పగలు గడచి పోయినది. రేపు రోగమును కుదిర్చెదను. అధైర్యపడ నక్కఱ లేదు.' అని చెప్పి కీర్తిసేన రాజుతలను ఆవునేయి రాయించెను. దాన నతనికి నిద్రపట్టెను. అతివేదన తీఱెను. 'ఇతఁ డెవరో దేవుఁడు, మాపుణ్యముచే వైద్యరూపమున వచ్చినాఁడు.' అని యచటివా రెల్ల ఆమెను కొనియాడుచుండిరి. మహాదేవియు

ఆమెకు నానోపచారములు చేసి దాసులతోఁ గూడిన వేఱు బస యేర్పఱిచెను.

కీర్తిసేన మఱునాఁడు మధ్యాహ్నమందు రాణులు మంత్రులు అందఱు చూచుచుండఁగా రాజుతలలోనుండి కర్ణబిలముగుండ నూఱునేఁబది చెవిఁజొచ్చుపాములను రక్కసి చెప్పిన యుక్తిచేత బయటికి లాగి కుండలోనే ఉండనిచ్చి ఘృతక్షీరాదిసేకముచేత రాజును సేదదేర్చెను. క్రమముగా అత్ఁడు బడలిక తీఱి నిరోగుఁడు కాఁగా కీర్తిసేన కుండలోని యా ప్రాణులను చూపెను. వానిని చూచి అచట ఎవఁడు ఆశ్చర్యపడలేదు ? రాజు తనతలనుండి వెలువడిన పాముపురుగుల నన్నిటిని చూచి వెఱచి ధ్యానించి తాను పునర్జన్మమెత్తినట్లు నిశ్చయించుకొనెను. అంతట ఉత్సవముచేసి ఆరోగ్యస్నానమాచరించి కీర్తిసేనను రాజ్యార్ధము నొల్లనందున గ్రామగజాశ్వకాంచనములతో పూజించెను. పట్టపుదేవియు మంత్రులును 'ఇతఁడు మాకొఱకు ప్రాణమిచ్చినాఁడు, మాకు పూజ్యుఁడు.' అని ఆమెను మణి కనక వస్త్రాభరణములతో నింపించిరి. ఆమె పతి నెదురు సూచునదై రాజుతో 'నేను ఇచటనే కొంతఁది కాలము ఉండెదను.' అని ఆధనమును అతని యొద్దనే ఇల్లడ యుంచి, ఎల్లవారిచేతను సమ్మానితురాలై మగవేషముతోనే అచటనే ఉండెను.

అంతలోపల దేవసేనుని బిడారు వలభినుండి వచ్చినదని పట్టణములో వార్త కలిగెను. దానిని విన్నవెంటనే కీర్తిసేన బిడారునకు పోయి, దూరమునుండియే భర్తను మయూరిక మేఘమును బోలె చూచి, సమీపించి చిరౌత్సుక్యసంతాపము చేత కరంగిన మనస్సువలెం బోలె ఆనందబాష్పములను అర్ఘ్య మిచ్చి అతనిపాదముల వ్రాలెను. వేషముచే మఱుఁగువడి యున్న దైవను ఆమెను చూచి అతఁడు పగలు వేఁడివెలుఁగు వెలుఁగులచే మఱుఁగుపడచంద్రమూర్తిని బోలె ఆనవాలు పట్టె ఆమెయొక్క ముఖచంద్రుని చూచుచున్న యాచంద్ర కాంతస్వరూపుని హృదయము కరఁగి నీరు గాని ఆశ్చర్యము! ఈప్రకారము కీర్తిసేన తన్ను వెల్లడి చేసికొనఁగా, ఇదేమని ఆమెపతియు ఆశ్చర్యపడుచుండఁగా, వర్తకు లందఱు ఆశ్చర్య పడి చూడఁగా, ఆవృత్తాంతమును విని వసుదత్తమహారాజు కూడ అచటికి వచ్చెను. ఆయన యడుగఁగా కీర్తిసేన అత్తగారు పెట్టినపాట్లన్నియు పతియెదుట చెప్పెను. అదంతయు విని దేవసేనుఁడు కోపశోకమాశ్చర్యములపాలయి తల్లిపై విరక్తుఁ డాయెను. 'పతిభక్తి యన్నురథము నెక్కి, శీల మనుకవచముచే రక్షితలై, ధర్మమే సారథిగా, బుద్ధియే ఆయుధముగా, సాధ్వులు జయింపుదురు.' అని అచట నున్న సకలజనులును కీర్తిసేన యొక్క యద్భుతచరితమును విని పలికిరి. రాజు కూడ 'భర్త కొఱకు క్లేశములపాలయిన యీమె రాములవారికి క్లేశముల

నొసంగినసీతాదేవిని కూడ జయించినది. ఈమె నాకు ప్రాణ మిచ్చినది, నాకు ఈమె ధర్మభగిని.' అని పలికెను. అంతట కీర్తిసేన 'దేవా, నాకు నీవు ప్రీతిచేత నిచ్చి నేను నీయొద్దనే ఉంచియున్న గ్రామ హ స్త్యశ్వ సువర్ణ రత్నాదికము నంతయు నాభర్తకు అర్పింపుము.' అని యడిగెను. రాజు ఆప్రకారమే చేసి అతనికి పట్టము కట్టెను. అంతట దేవసేనుఁడు రాజిచ్చిన ధనములతోను తాను ఆర్జించినవానితోను బొక్కసము నిండఁగా, తల్లిని వదలి కీర్తిసేనను పొగడుచు ఆపురమందే సుఖముగా నుండెను. కీర్తిసేన అత్తపోరు తీఱి భర్తకు మూర్తీభవించిన సుకృతఫలసమృద్ధిగా నుండెను. ఈప్రకారము సాధ్వీమణులు విధివైపరీత్యములను సహించి మహాసత్త్వ ప్రభావముచేత శీలమును రక్షించుకొని పతికిని తమకును కల్యాణము చేయుదురు.— అమ్మాయీ, ఇట్లు కోడండ్రకు అత్తలవలనను ఆఁడుబిడ్డలవలనను పెక్కుబాధలు కలుగును. కనుక నీకు అత్తయు ఆఁడుబిడ్డయు లేనియింట పతి గలుగ వలయు నని కోరెదను.—సోమప్రభ యిట్లు చెప్పఁగా కళింగసేన ఎంతయు సంతసిల్లెను. ఆసమయమందు సూర్యుఁడు విచిత్రార్థ కథావసానము చూచియుం బోలె పోఁ దలఁచుచుండఁగా, సోత్కంఠురాలిని కళింగసేనను కవుంగిలించి సోమప్రభ ఇంటికి పోయెను.

---

# ౭-వ త రం గ ము.



అప్పుడు ఇంటికి పోవుచున్న సోమప్రభను చూచుచు మేడమీఁదనే నిలుచున్న కళింగసేనను సమీపమున గగనమున పోవుచు మదనవేగుఁ డను విద్యాధరాధిపుఁడు యౌవనవంతుఁడు చూచి జగత్త్రితయమోహిని యయిన యా రూపశ్రీచేత కామైంద్రజాలికుని పింఛికచేతనుం బోలె క్షోభిల్లసాగెను. 'ఇట్టియద్భుతరూపము మనుష్యస్త్రీయం దుండఁగా విద్యాధరస్త్రీ లేల? అప్సరస లేల? ఈమెను వివాహ మాడనేని నా జీవిత మేల? విద్యాధరుఁడ నయ్యు మానుషీసంగ మెట్లు చేయుదును?' అని యాలోచించి యతఁడు ప్రజ్ఞప్తివిద్యను స్మరింపఁగా అది సాకారమై ప్రత్యక్షమై అతని కిట్లనియె:—'ఓ సౌభాగ్యవంతుఁడా, వాస్తవముగా ఈమె మానుషి గాదు, అప్సరస; శాపమువలన మానుషిగా ఇట్లు ఈకళింగదత్తునికి కూఁతురుగా పుట్టినది' విద్య యిట్లు చెప్పఁగా మదనవేగుఁడు సంతోషించి తనయింటికి పోయి కామవేదన పడుచు ఇట్లు తలంచెను:— 'ఈమెను నేను బలాత్కారముచే హరింపఁజాలను, హరముచేత అంగనాసంభోగము చేసిన నాకు మృత్యు వగునట్లు శాపమున్నది, ఈమెకై శివుని ఆరాధించెదను. శ్రేయస్సు, తపోధీనము వేఱు ఉపాయము లేదు.' ఇట్లు నిశ్చయించుకొని మఱు

నాఁడు ఋషభపర్వతమునకు పోయి ఒంటికాల నిలిచి నిరాహారుఁడై తపస్సు చేసెను. ఆ తీవ్రతపస్సునకు త్వరగా సాంబమూర్తి ప్రత్యక్షమై ఇట్లు ఆన తిచ్చెను:—'భూలోకమందున్న యీ యద్భుతరూపకు కళింగసేనకు తగినపతి అగపడ లేదు. వత్సరాజొకఁడున్నాఁడు. అతఁడు ఈమెను కోరి యున్నాఁడు గాని, వాసవదత్తవలని భయముచేత ప్రకటముగా అడుగకున్నాఁడు. కళింగసేనయు సోమప్రభవలన అతనిని విని రూపలుబ్ధయై స్వయముగానే అతని వరించుటకు మనస్సులో నిశ్చయించికొని యున్నది. ఆవివాహము జరుగకముందే కాలహరణము నోర్వని వత్సరాజురూపమును ధరించి పోయి గాంధర్వవిధానముచేత ఆమెను స్వీకరింపుము. ఇట్లు చేసిన కళింగసేన నీకు సిద్ధించును.' ఇట్లు సాంబమూర్తి పలుకఁగా ఆ విద్యాధరుఁడు నమస్కరించి తననివాసమునకు కాలకూటపర్వతతటమునకు పోయెను.

ఈలోపున. యంత్రప్రభావముచేత తనయింటికి ప్రతిరాత్రియు వచ్చుచు ప్రతిప్రభాతమును పోవుచు ఉన్న సోమప్రభతో ఏకాంతమందు క్రీడించుచు కళింగసేన ఒకనాఁడు రహస్యముగా ఇట్లనియె.—'సఖీ, ఒకరహస్యము చెప్పెదను, ఎవరికిని చెప్పకు. నాకు వివాహము కానున్నది. నన్నడుగుటకు అనేకరాజులు దూతలను పంపినారు, వారిని రహస్యముగానే నాయన మరల పంపినాఁడు. శ్రావస్తీశ్వరుఁడు ప్రసేన

జిత్తుయొక్క దూతను మాత్రము గౌరవించి అతనిరాకను అమ్మకు చెప్పినాఁడు. అతఁడు గొప్పవంశమువాఁడని అమ్మయు సమ్మతించినది. కురుపాండవుల యవ్వలు అంబాంబాలికలు ఏకులములో పుట్టిరో ఆతఁడును ఆకులములోనే పుట్టినాఁడు. నన్ను ఆప్రసేనజిత్తునకు ఇచ్చుట నిశ్చయము.' ఇట్లు కళింగసేన పలుకఁగా సోమప్రభ బాష్పబిందువులు వేఱుహారము కాఁగా ఏడ్వసాగెను. అందుల కారణము కళింగసేన యడుగఁగా, సకలభూమండలమును చూచిన యా మయాసురకుమారి ఇట్లు చెప్పసాగెను. 'సఖీ, వరునియందు చూచుకొనవలసిన వయో రూప కుల శీల విత్తములలో మొదటిది వయస్సు, తరువాతివి వంశాదికములు ప్రసేనజిత్తు ముసలివాఁడు, నేను చూచియున్నాను. వాడినజాజిపువ్వుయొక్క జాతివలె ముసలివాని వంశోన్నతివలన నేమి ప్రయోజనము? హిమశుభ్రుఁడయిన యతనితో నీవు హేమంతునితో పద్మినివలె కూడి మోముదమ్మి వాడి శోచ్య వగుదువు. అందులకై నాకు దుఃఖమయినది. కల్యాణీ నీవు వత్సరాజునకు ఉదయనునికి భార్యవయిన నాకు సంతోష మగును. రూపలావణ్య కుల శౌర్య విభూతులలో అతనికి సమానుఁడైన రాజు భూలోకములో లేఁడు. నీకు తగినయావత్సరాజును గూడితివేని, ఓతలోదరీ, బ్రహ్మయొక్క లావణ్యనిర్మాణము సఫల మగును.' ఇట్లు సోమప్రభావచనములచేత యంత్రములచేతనుంబోలె ప్రేరిత మై

కళింగసేనామానసము వత్సరాజుమీఁదికి పోయెను. అంతట కళింగసేన సోమప్రభను 'సఖీ, అతనికి వత్సరాజని పే రెట్లు కలిగెను? ఆయన ఏవంశములో పుట్టినవాఁడు? ఉదయనుఁడను పేరు అతనికి ఎట్లు కలిగినది? చెప్పుము.' అని యడిగెను. సోమప్రభ యారంభించెను:—

సఖీ, వత్స మని భూమిభూషణము ప్రఖ్యాత మైన దేశము ఉన్నది. దానియందు రెండవయమరావతి యన కౌశాంబీనగర మున్నది. అందు రాజ్యము చేయుచుండుటచే ఆయనకు వత్సరాజని పేరు కలిగినది. పాండవుఁ డయినయర్జునునికొడుకు అభిమన్యుఁడు పద్మవ్యూహమును భేదించినవాఁడు ఉండెను గదా, అతనికుమారుఁడు పరీక్షిత్తు, అతనికి జనమేజయుఁడు సర్పయాగము చేసినవాఁడు కుమారుఁడు, అతనికి శతానీకుఁడు జనించెను, అతఁడు కౌశాంబియందు నివసించెను, దేవాసురరణమునందు దైత్యులను చంపి మృతినొందెను; ఇంద్రుఁడు పంపిన రథములో అతనికుమారుఁడు సహస్రానీకుఁడు స్వర్గమునకు రాకపోకలు సలుపుచుండెను. ఆయనకు మృగావతీదేవియందు ఈయుదయనుఁడు చంద్రవంశభూషణము లోకలోచనోత్సవము పుట్టినాఁడు. ఇతనికి ఉదయనుఁ డని పేరు గలుగుటకు కారణము.— ఇతనితల్లి గర్భదోహదముచేత నెత్తురుబావిలో స్నాన మాడవలయు నని కోరుడు, పాపభీరు వై యితనితండ్రి లత్తుకనీళ్లబావిలో స్నాన మాడింపఁగా, ఆమెను మాంసశంక

చేత గరుడవంశజాత మయినపక్షి యొకటి ఉదయపర్వతమునకు తన్నుఁ గొనిపోయి అచ్చట విధివశమున విడిచి పెట్టెను. అచట నామెను మహర్షి యొకఁడు మరల భర్తృసమాగమము కలుగు నని చెప్పి ఓదార్చెను. సహస్రానీకుని ఒకప్పుడు తిలోత్తమ తన్ను అతఁడు లక్ష్యపెట్టలే దనియీసుచేత శపించెను. ఆశాపము వలన ఆయనకు మృగావతితోడ ఆవియోగము కలిగినది. కొన్నాళ్లకు ఈమె అచటనే జమదగ్న్యాశ్రమములో ఉదయాద్రియందు దివి క్రొత్తచంద్రునిఁబోలె ఇతనిని కనినది. ఆసమయమందు ఆకాశవాణి 'ఇతనికి ఉదయనుఁ డని పేరు, ఇతఁడు సార్వభౌముఁడు. ఇతనికి సర్వవిద్యాధరాధిపుఁ డగు కుమారుఁడు కలుగును.' అని పలికినది. ఇట్లు ఉదయపర్వతములో జనించినందున ఈయనకు ఉదయననామము కలిగినది.

శాపమును మాతలివలన విని సహస్రానీకుఁడును తదంతము నెదురు సూచుచు కష్టముతో ఆమె లేక కాలము గడపుచుండెను. శాపాంతము రాఁగా ఉదయాద్రినుండి వచ్చిన శబరునివలన దైవయోగముచేత తనగుర్తును పొంది అప్పుడే వినఁబడిన యాకాశవాణి ననుసరించి ఆశబరునే దారి నడప నియమించి తత్క్షణమే యుదయ పర్వతమునకు పోయి, అచట, వాంఛితసంసిద్ధినిఁబోలె మృగావతిని, మనోరాజ్యముఁ బోలె ఈకుమారుని, చూచి, కౌశాంబికి తోడ్కొని వచ్చి, ఇతనికి యౌవరాజ్య పట్టాభిషేకము చేసెను. కాలక్రమమున

ఇతనికి రాజ్య మిచ్చి తండ్రి భార్యామంత్రి సమేతముగా మహా ప్రస్థాన యాత్ర పోయినాఁడు. ఉదయనుఁడు తండ్రి రాజ్యమును పొంది యౌగంధరాయణ సఖుఁడై మహీమండలము నెల్ల జయించి యేలుచున్నాఁడు'

ఇట్లు సోమప్రభ ఏకాంతములో వత్సరాజు వృత్తాంతమును చెప్పి మరల ఇట్లనియె:—'సఖీ, ఈప్రకారము వత్స దేశమునకు రాజయినందున, అతనికి వత్సరాజని పేరు. ఉదయపర్వతమందు జన్మించినందున ఉదయనుఁడని దేవతలు పేర్కొనిరి. రూపములో మన్మథుఁడు కూడ అతనికి సమానుఁడు కాఁడు. త్రైలోక్యసుందరి వయిన నీకు తగినపతి అతఁడొకఁడే. అతఁడు లావణ్యమోహితుఁడై నిన్ను కోరి యున్నాఁడు కాని, అతనికి చండమహాసేనుని కూఁతురు వాసవదత్త పట్టపుదేవి, ఆమె అతనియం దత్యంతానురక్తయై స్వబంధువులను విడిచి ఉపాశకుంతలాదుల లజ్జను హరించి అతనిని వరించినది. ఆమె యందు అతనికి నరవాహనదత్తుఁడని కుమారుఁడు జనించి యున్నాఁడు. ఆకుమారుఁడు సర్వవిద్యాధరాధిపుఁడగునని దేవతలు చెప్పియున్నారు. అందుచే ఆమెకు జడిసి వత్సరాజు నిన్ను ప్రకటముగా యాచింపకున్నాఁడు. ఆమెను నేను చూచి యున్నాను, రూపసంపదలో ఆమె నీతో స్పర్ధ వహింపదు.'

ఇట్లు సోమప్రభ పలుకఁగా కళింగసేన వత్సరాజునందు తగిలిన మనస్సుతో ని ట్లనియె:—సఖీ, తల్లిదండ్రుల వశములో నున్న

నేనేమి చేయఁగలను? ఈవిషయములో నీవే నాకు గతివి. ఈ కార్యము దైవాధీనము. అందులకు ఈకథను విను:—

తే జ స్వ తి క థ.

విక్రమసేనుఁ డని ఉజ్జయినిలో రా జుండెను. అతనికి లోకోత్తరరూప తేజస్వతి యని కూఁతు రుండెను. ఆమెకు ఏ నృపకుమారునిమీఁదను మనస్సు తగుల లేదు. ఒకనాఁడు ఆమె తనమేడనుండి ఒకయందగానిఁ జూచి వానిపొందు నపేక్షించి వానికి దూతిని పంపెను. అది పోయి సాహసమునకు వెఱచిన యాపురుషునికి ఇష్టము కాకపోయినను బలవంత పెట్టి సంకేత మేర్పఱిచెను. 'ఓ సజ్జనుఁడా, నిర్జన మయిన యీదేవగృహమందు రాజపుత్త్రితో సమాగమము నెదురు సూచుచుండుము' అని చెప్పి అతని పీడ్కొని తేజస్వతికి ఆ వృత్తాంతమును తెలిపెను. ఆమెయు అస్తమయము నెదురు సూచుచుండెను. ఆ పురుషుఁడు అంగీకరించియు భయపడి ఎక్కడికో పాఱిపోయెను, కప్ప కోకనదినీకింజల్కములను ఆస్వాదింప నేర్చునా? ఈలోపున ఒకానొక రాజపుత్త్రుఁడు గొప్పకులమువాఁడు తనతండ్రి మృతిఁ బొందఁగా దాయాద హృతరాజ్యుఁడై తండ్రికి మిత్త్రుఁ డయిన విక్రమసేనుని ఏకాకిగా చూడవచ్చి సాయంకాలము కాఁగా దైవవశమున ఆ రాత్రిని గడపుటకు ఆదేవాలయము ప్రవేశించెను. రాత్రి రాజపుత్త్రి వచ్చి అతని నచట చూచి అనురాగాంధయై స్వయం

వరపతినిగా చేసికొన్నది. ఆప్రాజ్ఞుఁడు ఆమెను రానున్న రాచసిరికి సూచికగా దేవుఁ డిచ్చె నని తలఁచి స్వీకరించెను. రాజసుతయు అందగాఁ డయిన యీరాజకుమారుని సోమదత్తనామధేయుని చూచి తాను మోసపోలే దని సంతోషించెను. పిమ్మట యథోచితముగా సంభాషించి ఒడంబడిక చేసికొని ఆమె యింటికి పోయెను. అతఁడు అక్కడనే రాత్రి గడపెను. తెల్లవాఱఁగనే రాజపుత్త్రుఁడు ఆస్థానికిఁ బోయి ప్రతీహారునివలన పేరు తెలుపుకొని, రాజుచే సమ్మానితుఁడై, తాను రాజ్యమును కోలుపోయిన వృత్తాంతమును చెప్పుకొనెను. రాజు ఇతని శత్రువులను దండింప నంగీకరించి, అంతకు ముందే ఇతనికి నియ్య నిశ్చయించుకొన్న తనకూఁతును కూడ ఇచ్చెద నవియు మంత్రులకుఁ గూడ అదే యభిప్రాయ మనియు చెప్పెను. అప్పుడే దేవియు సుతచేతనే ఆప్తసఖీముఖముగా బోధింపఁబడినదై సుతావృత్తాంతమును రాజునకు తెలిపెను. అనిష్టము తొలఁగి ఇష్టము సిద్ధించిన యీకాకతాళీయమునకు ఆశ్చర్యపడుచున్న రాజుతో మంత్రి యొకఁ డి ట్లనియె:—స్వకార్యములను చూచుకొనని ప్రభువుల పనులను మంచిబంటు ఎట్లో, అట్లే అదృష్టవంతుల కార్యములను విధియే స్వయముగా సమకూర్చును. అందులకు నిదర్శనముగా ఈకథను వినుము

### మాయాజ్యోస్యునికథ.

హరిశర్మ యని ఒకబ్రాహ్మణుఁడు దరిద్రుఁడును విద్యావిహీనుఁడును పూర్వపాపానుభవముకై పలువురు పిల్లలుగల

వాఁడునై యుండెను. అతఁడు సకుటుంబముగా భిక్షమెత్తుచు ఒకనగరికి పోయి అట స్థూలదత్తుఁడను నొక గృహస్థుని మహాధనుని ఆశ్రయించెను. పుత్త్రులను అతనిపసుల మేపుటకును, భార్యను అతని యింట పనిచేయుటకును, నియమించి, తానును అతనికి సేవ చేయుచు, అతని యింటిపొరుగున నుండెను. ఇట్లుండఁగా స్థూలదత్తుని కొమార్తెకు వివాహమహోత్సవమై పెండ్లివారు అనేకులు వచ్చి మహాకోలాహలముగా నుండెను. ఆసమయములో హరిశర్మ స్థూలదత్తునియింట సకుటుంబముగా కంఠదఘ్నముగా ఘృతమాంసాది భోజనము చేయుటకు ఉవ్విళ్లూరుచుండెను అందునకు అతఁడు వేళ ఎదురుసూచుచుండినను ఎవరును అతనిని జ్ఞప్తి నుంచుకొన లేదు. అంత నతఁడు రాత్రి భార్యతో నిట్లనియె:-'దారిద్ర్యము చేతను మూర్ఖత్వముచేతను నాకు ఇట్టియగౌరవము కలిగినది. కనుక ఇక్కడ యుక్తిచేత నేను కృత్రిమవిజ్ఞానమును ప్రయోగించి, ఈస్థూలదత్తునికి గౌరవాస్పదమను అయ్యెదను. సమయ మెఱిఁగి నీ వతనితో నేను జ్ఞాని నని చెప్పుము.' ఆమెతో నిట్లు పలికి, ఆలోచించి జను లందఱు నిద్రించి యున్నప్పుడు హరిశర్మ అల్లునివాహన మయిన గుఱ్ఱమును హరించి దూరమున దాఁచెను. తెల్లవాఱఁగానే పెండ్లికొడుకువారు అశ్వమును అక్కడక్కడ వెదకియు కనుఁగొన లేదు. అంతట అమంగళమునకు వెఱచి గుఱ్ఱపుదొంగను వెదకుచున్న స్థూలదత్తునితో

హరిశర్మ భార్య 'అయ్యా, నాభర్త జ్యోతిర్విద్యాదులయందు నిపుణుఁడు, ఆయన అశ్వమును తెప్పింపఁగలఁడు, అతని నేల యడుగరు ?' అనెను. వెంటనే స్థూలదత్తుఁడు హరిశర్మను పిలిపించి, 'నిన్ను మఱచితిని. గుఱ్ఱము పోఁగా ఇప్పుడు స్మరించితిని.' అని వదరుచున్న యతనితో 'మాపొరఁబాటును క్షమింపుము' అని ప్రార్థించి, 'మాగుఱ్ఱమును ఎవఁడు అపహరించెనో చెప్పు మ'ని యడిగెను. అంతట హరిశర్మ అబద్ధపు గీఱలు గీచి 'ఈయూరి దక్షిణపుసరిహద్దుకడ దొంగలు గుఱ్ఱమును కట్టివేసి యున్నారు. త్వరగా పోయి తెచ్చుకొండి, తామసము చేసిన దొరకదు.' అనెను. వెంటనే అనేకులు అచటికి పోయి గుఱ్ఱమును తెచ్చిరి. అందఱును హరిశర్మ యొక్క విజ్ఞానమును మిగుల పొగడిరి. అది మొదలు అతఁడు జ్ఞాని యని ఎల్లవారిచేత పూజితుఁడై స్థూలదత్తునిచేత సత్కృతుఁడై సుఖముగా జీవించుచుండెను.

పిమ్మట కొన్నాళ్లకు రాజగృహమందు విస్తారము హేమరత్నాదిధనమును ఎవరో దొంగిలించిరి. దొంగ దొరక లేదు. అంతట రాజు జ్ఞానిప్రఖ్యాతి గల హరిశర్మను పిలిపించి అడిగెను. అతఁడు కాలక్షేపము చేయువాఁడై రేపు చెప్పెద ననెను. రాజు తనయింటనే ఒకచోట అతనిని భద్రముగా ఖయిదులో నుంచెను. రాచనగరిలో జిహ్వా యను పేర చేటిక యొకతె యుండెను. అదియు దానియన్నయు ఇద్దఱును రాజ

గృహామునుండి ధనమును దొంగిలించిరి. అది హరిశర్మ జ్ఞానమునకు వెలచి రాత్రి అతని యున్న గదికి పోయి ఆ గదితలుపు దగ్గఱ చెవి యొగ్గి వినుచుండెను. ఆసమయమున హరిశర్మ లోపల ఒంటరిగా నుండి లేనివిజ్ఞానమును చెప్పుకొన్న తన నాలుకను 'ఓసి పాపుజిహ్వా, భోగాశచేత ఏమి చేసితివి ? ఓ దురాచారా, ఇప్పుడు నీవు ఈదండనను అనుభవింపుము.' అని నిందించుచుండెను. ఆమాట విని జిహ్వా ఆ జ్ఞాని తన్ను కనిపట్టి నిందించుచున్నాఁ డని తలంచి యుక్తిగా అతనిం దఱిసి అతని పాదములఁ బడి 'స్వామీ? మీరు కనిపట్టిన యా దొంగను జిహ్వాను నేనే. ఆధనమును ఈమందిరమునకు వెనుక తోఁటలో దాడిమచెట్టుక్రింద పాఁతి పెట్టితిని నన్ను కాపాడుఁడు. నాచేత చిక్కిన స్వల్పసువర్ణమును నీవు పుచ్చుకొండు' అని వేఁడు కొనెను. అంతట హరిశర్మ బెట్టు వదలక దానితో నిట్లనియె:—

'పో, నేను అతీతానాగతములను ఎఱుఁగుదును, శరణాగతను దీనురాలిని నిన్ను బయటఁ బెట్టను. నీచేత చిక్కిన ధనమును నాకు ఇచ్చివేయుము.' అనెను. అందుల కంగీకరించి చేటి వడలిపోయెను. హరిశర్మ ఆశ్చర్యముతో ఇట్లు తలపోసెను:—

'అనుకూలవిధి లీలగా అసాధ్యమును సాధించెను. అనర్థము సిద్ధ మయి యుండఁగా నాకు అర్థము సిద్ధించినది. నాలుకను నిందించుకొనుచున్న నాపాదములలో జిహ్వా దొంగది వచ్చి పడి నది. ప్రచ్ఛన్నపాతకులు భయముచేతనే బయటఁ బడుదురు.'

ఇట్లు తలపోయుచు అతఁడు సంతోషముతో రాత్రి గడపెను. తెల్లవాఱఁగానే లేనివిజ్ఞానము నభినయించుచు రాజును ఉద్యానములోనికి కొనిపోయి ఆధనమును త్రవ్వించి చూపి 'దొంగ కొంతధనమును చేతఁగొని దూరము పఱారి యాయెను.' అనెను. రాజు సంతోషించి అతనికి కొన్నిగ్రామములు ఇయ్యఁ దలఁచెను. 'దేవా, శాస్త్రపరిచయము లేకయే మానుషాగమ్య మయిన యిట్టిజ్ఞాన మెట్లు కలుగును? నిజముగా ఇది దొంగలసంకేతముచే జరిగిన మోసపుబ్రదుకు. కనుక ఈ జ్ఞానిని వేఱుయుక్తిచేత వారము దినములు పరీక్షింతము.' అని మంత్రి రాజుచెవిలో ఉపదేశించెను. అంతట రాజు ఒక కుండలో ఒకకప్పను పెట్టించి మూఁత వేయించి ఆకుండను సభలోనికి తెప్పించి హరిశర్మను 'అయ్యా, ఇందులో ఏమున్నదో చెప్పిన నీకు గొప్ప పూజ చేసెదను.' అనెను. ఆమాట విన హరిశర్మ మనస్సులో ఏడ్చుచు తనకు వినాశకాలము వచ్చిన దని నిశ్చయము చేసికొని తన్ను బాల్యమందు తండ్రి వేడుకగా పిలుచుచుండిన మండూకనామము విధివశమున స్మరణకు రాఁగా ఇట్లనియె: 'ఓ మండూకా, నీవు సాధువవే, అయినను ఈఘటము అవశుఁడ వయిన నీ వినాశమునకు ఏర్పడియున్నది.' దానిని విని 'ఓహో! ఈయన మహాజ్ఞాని కప్పనుకూడ కనుఁగొన్నాఁడు!' అనుచు జనులు అతనిమాటను ప్రకృతపరముగా అన్వయించుకొని సంతోషించిరి. రాజు కూడ

మోసపోయి అతఁడు మహాజ్ఞాని యని భావించి అతనికి గ్రామములు బంగారము గొడుగు వాహనములును ఇచ్చెను. క్షణములో హరిశర్మ సామంత సదృశుఁ డాయెను.

ఈప్రకారము శుభకర్మ చేసికొనియున్నవారికి దైవమే కార్యములను సాధించును. అట్లే దేవా, నీకొమారిత దైవ వశముగా అసమానుని మాని తనకు తగినవానిని సోమదత్తునే అభిసరించినది. మంత్రి ఇట్లు పలుకఁగా రాజు కొమారితను లక్ష్మినిం బోలె ఆరాజకుమారునికే ఇచ్చెను. అంత నతఁడు మామగారిదండును నడపుకొని పోయి శత్రువులను జయించి తనరాజ్యములోనే భార్యతోఁగూడ సుఖ ముండెను.

సఖీ! ఇట్లు సకలమును విధివశమున ఘటించును. ఇట్టి నిన్ను వత్సేశ్వరునితో కూర్చుటకు దైవము అనుకూలము కాదేని నావలన నగునా?—

సోమప్రభ యిట్లు రహస్యముగా కథ చెప్పఁగా విని కళింగసేన క్రమముగా బంధుభయము వీడి వత్సరాజసంగమునే కోరుచుండెను. అప్పుడు త్రైలోక్యదీప మైన సూర్యుఁడు అస్త మించుచుండఁగా సోమప్రభ మఱునాఁడు వేకువనే వచ్చెద నని చెలియొద్ద సెలవు పుచ్చుకొని ఇంటికి పోయెను.

---

## [illegible] వ తరంగము.



మఱునాఁడు ప్రాతఃకాలమున సోమప్రభ ఎప్పటివలె రాఁగా ఆమెతో కళింగసేన విస్రంభాలాపములు సలుపుచు ని ట్లనియె:—'నన్ను నాయన నిశ్చయముగా ప్రసేనజిత్తునకు ఇచ్చు నని అమ్మ నాతో చెప్పినది. ఆముదుకను నీవు చూచి యున్నావు. వత్సేశ్వరుఁడు నీవు చేసిన రూపవర్ణనచేత శ్రవణ మార్గమున ప్రవేశించి నామనస్సును హరించినాఁడు. కనుక నాకు ముందుగా ప్రసేనజిత్తును చూపి పిమ్మట వత్సేశ్వరుని యొద్దకు నన్ను కొనిపొమ్ము. నాయనతో నా కేమి ?' ఇట్లు ఉత్కంఠిత యై పలికిన కళింగసేనతో సోమప్రభ యి ట్లనియె:— 'నిశ్చయముగా పోవలయు నేని, యంత్రప్రభావముచే ఆకాశ మార్గమున పోవుదము రమ్ము. నీపరికరమును సర్వమును తెచ్చు కొనుము. ఏల యన వత్సేశ్వరుని చూచినపిమ్మట మరల ఇటకు రాఁజాలవు. నీవు మరల తల్లిదండ్రులను చూడవు, తలంప నయిన తలంపవు. ప్రియసఖీ, వల్లభుని పొంది నీవు దూరమం దుండు నన్ను కూడ మఱతువు. నేను ఇక్కడికి వచ్చినట్లు నీ భర్తయింటికి రాఁజాలను.' ఆమాటకు రాజకన్య ఏడ్చుచు 'అట్లయిన వత్సేశ్వరుని ఇక్కడికి తెమ్ము. నిన్ను వదలి నేను క్షణ మయినను ఉండ నేరను.' అనెను.

వెండియు ‘అనిరుద్ధుని చిత్రలేఖ యుక్తిగా తేలేదా? ఆ కథను నీ వెఱుఁగియున్నను నేను చెప్పెదను వినుము.’ అని యిట్లు చెప్పసాగెను.

### ఉ ష క థ.

బాణాసురునికూఁతురగు ఉష గౌరిని ఆరాధించి ఆమె వలన ‘నీవు స్వప్నములో ఎవనిని కూడుదువో వాఁడే నీపతి’ అని వరము పొందెను. ఆప్రకారమే ఆమె దేవకుమారసన్నిభుని ఒకపురుషుని కలలోనే గాంధర్వవిధిచేత పెండిలియై వాస్తవ సంభోగము పొంది తెల్లవాఱఁగానే మేలుకొని అతనిని గానక సంభోగచిహ్నములను మాత్రము చూచుకొని గౌరీవరమును స్మరించి భయాశ్చర్యములపాలయి యుండెను. స్వప్నలబ్ధుఁడైన యాభర్తను బాసి నిలువ నేరక తపించుచుండెను. కారణ మడిగిన సఖికి చిత్రలేఖకు సర్వమును చెప్పెను. యోగేశ్వరి యయిన యాచిత్రలేఖ అతని పేరు గాని మఱియే గుఱుతుగాని ఎఱుఁగక ఉషతో ‘చెలీ, ఇది దేవీవరముయొక్క మహిమ. గుర్తు లేనినీపతిని ఎట్లు వెదక నగును? అతనిని నీవు ఎఱుఁగుదువేని ససురాసురమానుష మయిన జగత్తు నెల్ల వ్రాసెదను. అందులో అతనిని చూపుము; అంతట నతనిని నేను తెచ్చెదను.’ అని చెప్పఁగా ఉష యంగీకరించెను. చిత్రలేఖ విశ్వము నంతయు పటములో వ్రాసెను. ఉష సంతోషించి వణఁకుచున్న వ్రేలితో ఆపటములో ద్వారావతియందలి యాదవులలో

అనిరుద్ధుని చూపెను. చిత్రలేఖ యిట్లనియె:—'సఖీ, ధన్య వయితివి, నీవల్లభుఁడు హరిమనుమఁడు, ఇక్కడికి అఱువదివేల యోజనములదూరమున నున్నాఁడు.' అది విని ఉష మదన తాపము రెట్టింపఁగా చెలితో 'ఇప్పుడే శ్రీఖండశీతల మయిన యతనియంకమును ఆశ్రయింపనేని కామాగ్నిచేత నాపని సరి యని యెఱుంగుము.' అనెను. అంతట చిత్రలేఖ ప్రియసఖిని ఓదార్చి వెంటనే గగనమార్గమున ద్వారవతికి పోయెను. మరల సముద్రమును త్రచ్చుటకు ఉంచినమంథాద్రిశిఖరములో యన అందలి సౌధములు విరాజిల్లుచుండెను. అందు రాత్రి నిద్రించుచున్న యనిరుద్ధునిఁ దఱిసి మేలుకొలిపి అతనికి స్వప్న దర్శనమువలని యుషానురాగమును చెప్పి, ఆమెప్రతిమ నిచ్చి ఆస్వప్నవృత్తాంతమును అంతకు ముందే ఎఱిఁగియున్న యా యనిరుద్ధుని తన సిద్ధప్రభావముచేత క్షణములో కొనివచ్చి తనమార్గమునే ఎదురుచూచుచున్న యుషయొక్క అంతః పురములో రహస్యముగా ప్రవేశపెట్టెను. సాక్షాత్తుగా వచ్చిన యనిరుద్ధుని చూచి యుష చంద్రుని చూచిన సముద్రవేల పోలె తనలో తా నిముడ నేరదాయెను. చెలి తెచ్చి యిచ్చిన యాప్రియునితో ఉష మూర్తీభవించిన ప్రాణముతో నుంబోలె సుఖముగా నుండెను. ఆవృత్తాంత మెఱింగి కోపగించిన యామె తండ్రిని బాణాసురుని అనిరుద్ధుఁడు స్వవీర్యముచేతను తాత సాయముచేతను జయించెను. పిమ్మట ఆయిరువురును ద్వార

వతికి పోయి పార్వతీపరమేశ్వరులవలె ఏకశరీరులై సుఖముండిరి. ఈప్రకారము చిత్రలేఖ ఉషకు ప్రియతముని తెచ్చియిచ్చినది. నీవు ప్రభావవంతురాలవు, ఉత్కృష్టురాలవు; కనుక ఆలస్యము చేయక ఇచ్చటికి వత్సరాజును కొని రమ్ము.

ఇట్లని కళింగసేన పలుకఁగా సోమప్రభ చెప్పుచున్నది: 'చిత్రలేఖ అసురాంగన పరపురుషుని ఎత్తుకొని వచ్చెను. పరపురుషుని స్పృశింపని నాబోఁటిది ఏమి చేయఁగలదు? కనుక నిన్ను వత్సేశ్వరుని యొద్దకు కొనిపోయెదను. నిన్ను కోరుచున్న ప్రసేనజిత్తును ముందుగా చూపెదను.' అందులకు అంగీకరించి కళింగసేన సోమప్రభ తెచ్చిన మాయాయంత్ర విమానమును కోశపరిచ్ఛదసమేతముగా ఎక్కి తల్లిదండ్రుల యెఱుక లేకయే బయలువెడలెను. మదనునిచే పరమధారను పొందింపఁబడిన స్త్రీజనము కౌతుచే పరమధారను పొందింపఁబడిన గుఱ్ఱమువోలె ఎదుట దిబ్బనుగాని గోతినిగాని చూడదు సుమా. ఆమె మొదట శ్రావస్తికి పోయి వేఁటకు వెడలుచున్న వానిని ముదిమిచే తల నరసిన ప్రసేనజిత్తును 'ఈముసలివాని యొద్దకు ఏలవచ్చెదవు? అటనుండియే పొమ్ము.' అని నిషేధించు నదియుంబోలె కదలుచున్న చామరంపు గుత్తుచేత తెలిసికొని చూచెను. సోమప్రభ ఉపహసించుచు 'కింపుగో ప్రసేనజిత్తు, ఇతనికే మీతండ్రి నిన్ను ఇయ్యఁ దలఁచినాఁడు, ఇతనిని చూడుము.' అనఁగా కళింగసేన 'ఈరాజును ముదిమి వరించినది,

ఇతనిని మఱియెవతె వరించును? కనుక సఖీ, నన్ను శీఘ్రముగా ఇటనుండి వత్సేశ్వరునియొద్దకు కొనిపొమ్ము.' అని తత్క్షణము ఆమెతోఁగూడ కళింగసేన ఆకాశమార్గమున కౌశాంబికి పోయెను. అచట ఉద్యానములో నున్న వత్సరాజును కళింగసేన అమృతకిరణుని చకోరివలె దూరమునుండి సోత్కంఠ యై దర్శించెను. అతనిం గనులారఁ జూచుచు హృదయమున చేయి యుంచుకొని ఆమె 'సఖీ, ఈమార్గమున ఇచ్చట నితఁడు నన్ను ప్రవేశించినాఁడు.' అని చెప్పునదియుంబోలె నుండెను. 'సఖీ, ఈ క్షణమే నాకు వత్సరాజుతో సమాగమము కలిగింపుము, ఇతనిని చూచి ఇచట క్షణమైనను నేను ఉండఁజాలను' అనెను. సోమప్రభ చెప్పుచున్నది: 'ఇప్పుడు నేనొక యశుభశకునమును చూచితిని. కనుక ఈ దినము ఈ యుద్యానవనములో ఊరక ఎవరికి అగపడక ఉండుము. దూరము రాకపోకలు చేయకుము. రేపు ఉదయమున నేను వచ్చి మీకు సంగమోపాయము చేసెదను. ఇప్పుడు చైత్రరథమునందలి నాభర్తయింటికి పోయెదను.' ఇట్లు పలికి ఆమెను విడిచి సోమప్రభ పోయెను. వత్సరాజు ఉద్యానమునుండి ఇంటికి పోయెను.

కళింగసేన అచ్చటనే యుండి శకునజ్ఞ యయిన సఖి కూడ దన్నను తనహార్కారాగుండ వత్సరాజునకు సందేశము పంపెను; స్త్రీలకు క్రొత్తగాఁ గలిగిన మదనుఁడు స్వతంత్రుఁడు గదా. వాఁడును పోయి ప్రతీహారనివేదితుఁడై తత్క్షణమే వత్స,

రాజును దర్శించి ఇట్లు విన్నవించెను:—'దేవా, తక్షశిలాపతి కళింగదత్తునికూఁతురు కళింగసేన నీ మహాసౌందర్యమును విని బంధువులను వదలి నిన్ను స్వయముగా వరింపవచ్చియున్నది. ఆమెను యంత్రవిమానమున అనుచరులతోఁగూడ గూఢము గా మయాసురునికూఁతురు నలకూబరుని భార్య సోమప్రభా దేవి తెచ్చినది. ఆస్వయంవర నన్ను నీకడకు విజ్ఞాపనార్థము పంపినది. ఆమెను గ్రహింపుము. మీయోగము కౌముదీచంద్ర యోగమువలె నగునుగాక.' ఇట్లు మహత్తరుఁడు చెప్పఁగా సరియే యని యంగీకరించి వత్సరాజు వానిని స్వర్ణాదులతో సత్కరించి మంత్రిముఖ్యుఁ డయిన యౌగంధరాయణుని పిలిచి 'కళింగదత్తనృపతికూఁతురు రూపమునకు పేరెత్తినట్టిది కళింగ సేన స్వయముగా నన్ను వరించుటకు వచ్చియున్నది. వదలఁ దగినది గాదు, శీఘ్రముగా ఎప్పుడు వివాహ మాడవచ్చునో చెప్పుము.' అని యడిగెను. యౌగంధరాయణుఁడు ఇతనికి క్షేమము కోరినవాఁడై క్షణ మిట్లాలోచించెను: 'కళింగసేన మూఁడులోకములలోను రూపమునకు సాటిలేనిదిగా ప్రసిద్ధి కెక్కినది. ఆమెను దేవతలు కూడ కోరుచుందురు. ఆమెను గూడి ఇతఁడు కడమ సర్వమును మఱచును. అంత వాసవదత్తా దేవి ప్రాణములు వదలును, రాజసుతుఁడు నరవాహన దత్తుఁడును నశించును, ఇతనిమీఁదియనురాగముచేత పద్మావతీ దేవికూడ బ్రదుకుట కష్టము. అంతట ఈదేవేరుల తండ్రులు

చండమహాసేనప్రద్యోతులు ప్రాణములు వదలుదురు, లేక, ద్వేషము నైనను సాధింతురు. ఇట్లు సర్వనాశము కలుగును. నిషేధించుట యుక్తము గాదు. ఇతనియీవ్యసనము వారించిన అధిక మగును. కనుక ఈకార్యము చెడుటకై కాలహరణము చేసెదను.' ఇట్లు తలంచి వత్సరాజుతో యౌగంధరాయణుడు పలికెను: 'ధన్యుఁడవు నీవు, నీయింటికి కళింగసేన స్వయముగా వచ్చినది. ఈమె తండ్రి కళింగదత్తుఁడు నీకు భృత్యుఁ డగు నాఁడు. ఈమె గొప్పవానికూఁతురు గదా. కనుక గణకులను పిలిచి మంచి ముహూర్తము పెట్టించి ఈమెను యథావిధిగా వివాహ మాడవలయును. ఇప్పుడు ఈమెకు యోగ్యమైన బస దాసీదాసజనములతో కూడినదిగా ఏర్పరింపవలయును, వస్త్రాభరణాదులను పంప వలయును.' మంత్రిముఖ్యుఁ డిట్లు చెప్పఁగా వత్సరాజు సంతోషించి సర్వము ఆయన చెప్పినట్లే చేయించెను. అంతట కళింగసేన విడిదిలో చేరి తన కోరిక త్వరలోనే నెఱవేఱు నని సంతోషించుచుండెను.

యౌగంధరాయణుఁడు రాజసదనమునుండి ఇంటికి పోయి యిట్లాలోచించెను: "తఱచుగా అశుభకార్యమునకు కాలహరణము ప్రతిక్రియ. ఆలాగే, పూర్వము వృత్రశత్రువైన యింద్రుఁడు బ్రహ్మహత్యచేత పాఱిపోఁగా తత్కాలమందు ఇంద్రుఁ డగు నహుషుఁడు సేయు బలాత్కారమునుండి శచీదేవి బృహస్పతిని శరణుచొచ్చెను. గురువు బ్రాహ్మణ శాపముచే

నహుషుఁడు నశించువఱకు 'శచీదేవి తేపు ఉదయమున వచ్చును' అని జరుపుచు చేయుచుండెను. ఇంతలో శక్రుఁడు మరల దేవరాజాయెను. ఇట్లే నేనును కళింగసేనవిషయమయి ప్రభువునకు కాలహరణము చేయవలసినది." ఇట్లాలోచించికొని అతఁడు గణకులకు దూరముగా లగ్నమును పెట్టుమని రహస్యముగా ఆజ్ఞాపించెను. ఈవివాహప్రయత్నమును వాసవదత్తాదేవి ఎఱిఁగి యౌగంధరాయణుని పిలిపించి ప్రణతుఁడైన యతనితో 'ఆర్యా, పూర్వము నాకు పద్మావతి తప్ప మఱి సవతి నీవు బ్రదికి యుండఁగా కలుగదని చెప్పియుంటివి గదా. చూడు, రాజు కళింగసేనను పెండ్లియాడ నున్నాఁడు. ఆమె అందగత్తె; ఆమెయందు ఆర్యపుత్త్రుఁడు అనురక్తుఁడై యున్నాఁడు. కనుక నీవు ప్రల్లదము లాడితివి. నేను మృతిఁ బొందితిని.' అనెను. యౌగంధరాయణుఁ డనియె:—'దేవీ, ధైర్యముగా నుండుము. నేను బ్రదికియుండఁగా ఇదెట్లు జరుగును? ఈవిషయములో నీవు రాజునకు విరోధము చేయవలదు. మఱి ధైర్యము పూని అనుకూల్యమే చూపవలయును. రోగి ప్రతికూలవచనములచేత వైద్యునికి వశపడఁడు, అనుకూలవచనములతోనే పని చేసిన యెడల వశపడును, అట్లే ఎదురులాగినచో మనుష్యుఁడు వ్యసనమును మానఁడు, అనుకూలముగా కొనిపోయిన మానును. కనుక నీయొద్దకు రాజు వచ్చినప్పుడు నీవు అలుగక నీ యభిప్రాయమును దాఁచి ఆయనకు ఉపచరింపవలయును. కళింగ

సేనాస్వీకారమునకు అంగీకరింపుము. అందువలన ఆమెతండ్రి సహాయుఁడగు ననియు అది రాజ్యాభివృద్ధికి హేతు వనియు చెప్పుము. ఇట్లు చేసితివేని రాజు నీ గొప్పతనమునకు నీయందు అత్యంతము అనురక్తుఁడై యుండును. తనకు కళింగసేన స్వాధీనురాలే గదా అని ధైర్యపడి త్వర మాని స్వస్థముగా నుండును. నివారించితివా త్వరపడును. పద్మావతీదేవికిఁ గూడ ఇట్లే నీవు నేర్పవలయును. ఈప్రకారము చేసిన రాజు మన జరుపుదల సహించును. అటుపైని నాకు తెలియును. నా యుక్తిబలము చూడుము; బుద్ధిమంతులను సంకటములలోను శూరులను యుద్ధములోను పరీక్షింపవలయును. దేవీ, చింతపడకుము.' యౌగంధరాయణుఁడు ఇట్లు దేవికి ఉపదేశించి, ఆమె అంగీకరింపఁగా, వెడలిపోయెను. వత్సరాజు ఆదినము పగలు గాని రాత్రి గాని దేవేరులయొద్దకు పోలేదు, స్వయముగా వలచి వచ్చిన కళింగసేనతోడికూటమికే ఉవ్విళ్లూరుచుండెను. దేవీ వత్సరాజ మంత్రిముఖ్య కళింగసేనలు దుర్లభర సోత్సుకతాతిగాఢచింతా మహోత్సవములను ఒకరొకరు ఒకరొకరి యనుభవించుచుండిరి.



## ౬ - వ తరంగము.

మఱునాఁడు ఉదయమున తన్నెదురుచూచుచున్న వత్సరాజునొద్దకు ధూర్తుఁడు యౌగంధరాయణుఁడు వచ్చి, 'దేవా

నీకును కళింగసేనకును శుభావహ మయినవివాహలగ్నమును ఇప్పుడే నిశ్చయించుటకు ఏమి యాటంకము?' అనియెను. రాజు వక్కాణించెను: 'నామనస్సులోను అట్లే యున్నది, ఆచెలి లేక క్షణ మయినను నేను ఉండఁజాలను.' ఇట్లని రాజు సరళ హృదయుఁడై వెంటనే గణకులను పిలుచుకొని రమ్మని ప్రతీహారుని పంపెను. మంత్రియొక్క కుట్రలో నున్నయాగణకులు రాజు వివాహలగ్న మడుగఁగా ఇఁక ఆఱుమాసములకు మంచి లగ్న మున్న దని చెప్పిరి. దానిని విని యౌగంధరాయణుఁడు మాయకోపము నభినయించి 'రాజా, సీ, వీరి కేమి తెలియును? పూర్వము జ్ఞాని యని నీవు సత్కరించిన గణకుని అడుగుము.' అనెను. అంతట వత్సరాజు మనస్సులో మిగుల ఆందోళన పడుచు ఆగణకుని పిలిపించి యడిగెను. అతఁడును ఇతరులవలెనే మంత్రికుట్రలోనే చేరి, ఆఱుమాసములలోపల లగ్నము లే దని చెప్పెను. అంతట యౌగంధరాయణుఁడు దిగులు పడినట్లు నటించుచు 'దేవా ఏమి చేయ వచ్చును?' అనెను. వత్సరాజు ఆలోచించి మంచిలగ్నము నపేక్షించువాఁడై 'మీరు పోయి కళింగసేనను అడిగి ఆకాంత ఏమి చెప్పునో తెలిసికొండు.' అనెను. యౌగంధరాయణుఁడు సరియే యని ఇద్దఱుగణకులను వెంటఁగొని కళింగసేనయొద్దకు పోయి సత్కృతుఁడై ఆమెరూపు చూచి 'ఈమెను గూడి వత్సరాజు ఈ తగులాటముచేత రాజ్యము నంతయు వదలును.' అని తలఁచి ఆమెతో 'నీకు

వివాహలగ్నమును నిశ్చయించుటకు ఈగణకులను తోడ్కొని వచ్చితిని. నీజన్మనక్షత్రమును చెప్పుము.' అని యడిగెను. ఆమె పరిజనులు జన్మనక్షత్రమును చెప్పిరి. అంతట గణకులు మంత్రి కుట్రచేత మిథ్యావిచారము చేసి, 'ముహూర్తము ఆఱు మాసములకు తరువాతనే గాని ఈలోపల లేదు.' అని చెప్పిరి. కళింగసేన లగ్నము బహుదూరముగా నున్న దని విని దిగులు పడుచుండఁగా ఆమెయొక్క మహత్తరుఁడు 'మంచిలగ్నముననే వివాహము చేయవలసినది. అట్లు చేసినఁగదా దంపతులకు యావత్కాలమును శుభము కలుగును. ఆలస్య మయిన నేమి? త్వరలో నయిన నేమి ?' అని చెప్పెను. అక్కడివా రందఱు ఆమాట చక్కఁగా నున్న దని పలికిరి. యౌగంధరాయణుఁడు 'ఓహో! చెడులగ్నమున చేసినయెడల సంబంధి కళింగదత్తుఁడు ఆయాసపడును.' అనెను. అంతట కళింగసేనయు వివశయై 'మీా కందఱకు ఏ ముచిత మని తోఁచునో అట్లు చేయుఁడు.' అని యూరకుండెను. ఆ మాటనే గ్రహించి మహామంత్రి ఆమెను వీడ్కొని రాజునొద్దకు గణకులతో పోయి ఆవృత్తాంతమును నివేదించి యుక్తిచేత అతనిని ఊఱడించి ఇంటికి పోయెను.

ఈప్రకారము యౌగంధరాయణుఁడు కాలహరణమును కలుగఁజేసి పైసన్నాహముకై తన చెలికానిని యోగేశ్వర బ్రహ్మరాక్షసుని తలఁచుకొనెను. అంతట ఆ రాక్షసుఁడు తొంటి యొడంబడిక ప్రకారము తలంచిన మాత్రముననే వచ్చి

మంత్రికి నమస్కరించి, 'నన్ను తలఁచిన పని యేమి?' అని యడిగెను. మంత్రి రాజునకు వ్యసనకారణ మయిన కళింగసేనా వృత్తాంతము నంతయు ఆ రాక్షసునికి తెలిపి యిట్లనియె: 'చెలికాఁడా, నేను కాలహరణము చేసినాఁడను. ఈలోపల నీవు నీ యుక్తిచేత కళింగసేన నడవడిని ప్రచ్ఛన్నుఁడవై కనిపట్టుము. అట్టి రూపవతి ముల్లోకములలోను మఱి లేనందున ఆమెను విద్యాధరాదులు కామించుట నిశ్చయము. కనుక ఆమె విద్యాధరునితోఁగాని సిద్ధునితోఁగాని ఎవనితో నయినను సంగము పొందునేని నీవు ప్రచ్ఛన్నముగా చూడుము. అందువలన మేలు కలుగును. అన్యరూపమున వచ్చిన దివ్యకాముకుని నీవు కనిపట్టవలయును. ఎట్లనఁగా నిద్రాకాలమందు దివ్యులు నిజరూపమున నుందురు. ఇట్లు నీకంటితో మేము ఆమెయందలి దోషమును చూచెదము. అంతట రాజు ఆమెపై విరక్తుఁడగును. ఈ కార్యమును నీవు మాకు సాధింపుము.' మంత్రి యిట్లు చెప్పఁగా బ్రహ్మరాక్షసుఁడు 'ఇంత యేల? నేనే యుక్తిచే ఈమెశీలమును చెఱుపుదునా? లేక, ఈమెను చంపివేయుదునా?' అనెను. అంతట అందులకు యౌగంధరాయణుఁ డనియె:— 'అట్లు చేయరాదు, అది మిక్కిలి యధర్మము. ఎవఁడు ధర్మమును బాధింపక తన మార్గమున నడచుకొనునో వానికి ధర్మమే అభీష్టసిద్ధి నొసంగును. కనుక చెలికాఁడా, ఆమెవలన స్వయముగానే ఏ మయిన దోషము కలిగినయెడల దానిని కనిపట్ట

వలయును. అందువలన నీచెలిమిచేత మాకు రాజ కార్యము సిద్ధించును.' ఇట్లు మంత్రిశ్రేష్ఠుఁడు యౌగంధరాయణుఁడు పలుకఁగా బ్రహ్మరాక్షసుఁడు కళింగసేనాగృహమున ఎవనికి అగపడకుండ ప్రవేశించెను.

ఈలోపల సోమప్రభ మరల కళింగసేనయొద్దకు వచ్చి ఆమెను రాత్రివృత్తాంతము అడిగి తెలిసికొని ఇట్లు పలికెను. ప్రచ్ఛన్నుఁడై రాక్షసుఁడు వినుచుండెను:—సఖీ, ఈదినము పూర్వాహ్ణమందే నేను నిన్ను చూచుటకు వచ్చితిని. నీయొద్ద యౌగంధరాయణుని చూచి దాఁగియుంటిని. మీసంభాషణను వింటిని. సర్వమును నేను గ్రహించితిని. నేను వలదని చెప్పినను ఏల నిన్న ఈపని ఆరంభించితివి? దుశ్శకునమును పోఁగొట్టక చేసిన పనివలన చెఱుపే గలుగును. అందులకు ఈ కథను వినుము.

### అపశకునకథ.

అంతర్వేదియందు వసుదత్తుఁడని యొక బ్రాహ్మణుఁ డుండెను. అతనికి విష్ణుదత్తుఁ డని కొడుకుండెను. విష్ణుదత్తుఁడు పదునారేండ్లు నిండఁగా విద్యార్థియై వలభీనగరమునకు పయనమాయెను. అతనితో ఏడుగురు బ్రాహ్మణకుమారులు కూడ కలసికొనిరి. ఆయేడుగురును మూర్ఖులు, అతఁడొకఁడే సత్కులోద్భవుఁడు బుద్ధిమంతుఁడు. విష్ణుదత్తుఁడు వారితో ఒకరి నొకరు వదలఁగూడ దని శపథము చేసి, తల్లిదండ్రులతో

చెప్పకయే రాత్రి బయలుదేఱెను. తరలి ఎదుట ఆకస్మికమయిన యవశకునమును చూచి ఆచెలికాండ్రను 'మిత్రులారా, అవశకున మగుచున్నది. ఇప్పుడు పోవుట ఉచితము కాదు, మంచిశకునము చూచుకొని పోవుదము.' అని మందలించెను. 'నీకు భయ మయిన నీవు రాకు, మేము నిలువము. వృథా భయము మానుము. దీని కంతయు మేము భయపడము. తెల్లవాఱిన మావృత్తాంత మెఱిఁగినయెడల బంధువులు మమ్ము పోనీయరు.' అని వారు పలికిరి. ఆమూర్ఖులు ఇట్లనఁగా విష్ణుదత్తుఁడు శపథమునకు కట్టుఁబడి పాపహారుని శ్రీహరిని స్మరించుచు వారితోఁ గూడ పోయినాఁడు. వేకువను మఱియొక యనిమిత్తమును చూచి అతఁడు మరల చెప్పఁగా వారు అతనిని బెదరించిరి: 'అడుగడుగునను కాకశంకిని దారిపిఱికిని నిన్ను వెంటఁబెట్టుకొని వచ్చినారమే అదే మాకు అనిమిత్తము; అంతకన్న ననిమిత్తము మఱియే మున్నది?' వారు ఇట్లు బెదరింపఁగా అతఁడు మాఱాడలేక కూడ పోవుచుండెను.

'స్వేచ్ఛాచారి యైనమూర్ఖునకు హితము చెప్పఁగూడదు. చెప్పిన బూడిదను బాగు చేయఁగడంగినవానికింబోలె తిరస్కారమే కలుగును. పలువురు మూర్ఖులలో పడిన బుద్ధిమంతుఁడు నీటియలలలో పడిన పద్మమువలె ఉపద్రవము పాలగును. కనుక వీరికి హితాహితమును నేను ఉపదేశింపరాదు. ఊరకయే నడచుచుండెదనుగాక. దైవము మేలు చేయఁ

గాక.' ఇట్లు తలపోయుచు ఆమూర్ఖులతో కూడ నడుచుచు విష్ణుదత్తుఁడు సాయంకాలమునకు ఒకశబరగ్రామము చేరెను. వారు అచట ఒక నడుచుబోయతయింటికి పోయి రాత్రికి పరుండ చోటడిగిరి. అది యొకగది ఇచ్చెను. ఇతరులతోఁగూడ విష్ణుదత్తుఁడును అందు ప్రవేశించెను. వారు ఏడుగురును క్షణములో నిద్రపోయిరి. పురుషాధిష్ఠితము కాని యాయింట అతఁడొక్కఁడు మాత్రము మేలుకొని యుండెను. అజ్ఞులు నిద్రపోదురు గాని వివేకులకు నిద్ర యెక్కడిది? అంతట అచటికి ఎవఁడో ఒకపురుషుఁడు నడుచువాఁడు రహస్యముగా వచ్చి లోపలియింట బోయతయొద్దకు పోయెను. అతనితో అది చిరకాలము మంతనము లాడుచు క్రీడించినది. పిమ్మట అలపుచే ఆయిద్దఱును నిద్ర పోయిరి. అది యంతయు విష్ణుదత్తుఁడు తలుపుసందునుండి దీపపువెలుతురువలన చూచి విసుగుతో నిట్లు తలంచెను: 'అయ్యో, ఈచెడిపయింటి కేల వచ్చితిమి? నిశ్చయముగా తెలియుచున్నది, ఈపురుషుఁడు దీనికి కౌమారపతి గాఁడు. అగుచేని వీరివ్యాపారము ఇట్లు సభయముగాను రహస్యముగాను ఉండదు. ఇది చపలచిత్త యని నేను మొదటనే తలంచితిని. ఇచట ప్రవేశించితిమి' ఇట్లు తలంచు చుండఁగా బయట జనులశబ్దము వినఁబడెను. అంత నొకపురుషుఁడు యౌవనవంతుఁడు ఖడ్గధారి శబరనాయకుఁడు అనుచరులతోఁగూడ వచ్చి లోపల ప్రవేశించెను. 'ఎవరు మీరు?' అని

యతఁ డడుగఁగా అతఁడే ఇంటిదొర యని తలఁచి విష్ణుదత్తుఁడు వెఱచుచు 'మేము బాటసారులము' అని యుత్తర మిచ్చెను. శబరుఁడు లోపలికి పోయి ఆరీతి నున్న భార్యను చూచి నిద్రించుచున్న యాజారుని శిరమును ఖడ్గముతో ఖండించెను. భార్యను దండింపను లేదు, మేలుకొలుపను లేదు. కత్తి క్రిందపెట్టి మఱి యొక మంచముమీఁద పరుండి నిద్ర పోయినాఁడు. దీపము వెలుఁగున అది యెల్ల చూచి విష్ణుదత్తుఁడు 'నిశ్చయముగా ఇతఁడు స్త్రీ అని భార్యను చంపలేదు, భార్యను చెఱిచిన వానిని చంపినాఁడు. అది సరియే గాని, ఇట్టిపనిచేసి ఇతఁడు నిశ్శంకముగా నిద్రించుచున్నాఁడు! ఆహా! చిత్తోద్రేకము గలవాఁడివీర్యము ఆశ్చర్యముగా నున్నది!' అని తలపోయుచుండెను.

ఇంతలో ఆచెడిప మేలుకొని తెగి పడియున్న తన జారుని నిద్రించుచున్నపతిని చూచి లేచి జారునిమొండెమును బుజముమీఁద పెట్టుకొని తలను ఒకచేతఁ గొని రహస్యముగా వెలుపలికి పోయి త్వరగా వానిని బూడిదరాశిలో పూడ్చి రహస్యముగా మరల లోపలికి వచ్చెను. విష్ణుదత్తుఁడును వెలువడి సర్వము దూరమునుండియే చూచి మరల ఇల్లు సొచ్చి చెలులనడుమ యథాప్రకారము పరుండి చూచుచుండెను. ఆ పాపాత్మురాలు లోపల చేరి ఆకత్తితోనే నిద్రించుచున్న పతితలను ఖండించి బయిటికి వచ్చి అఱచి సేవకులను లేపి 'అయ్యో!

అయ్యో! ఈబాటసారులు నాభర్తను చంపినారు.' అని యేడ్వసాగెను. అంతట సేవకులు పరువునఁ బోయినవారై వచ్చి పడియున్న తమ దొరను చూచి పిచ్చుకత్తులు చేతఁ బూని విష్ణుదత్తాదులమీఁదికి వచ్చిరి. వచ్చి దెబ్బలు కొట్టఁగా వారేడుగురును అడలుచు నిద్ర లేచుచుండఁగా విష్ణుదత్తుఁడు శీఘ్రముగా నిట్లనియె:— 'ఏల బ్రహ్మహత్య చేసెదరు? ఈ పని మేము చేసినది గాదు. ఈ చెడిప అన్యాసక్తురాలై ఈపని చేసినది. నేను తలుపుసందునుండి సర్వము ఆమూలముగా చూచినాఁడను, వెలుపలికి పోయియు చూచినాఁడను. క్షమింతురేని కలగుట్టు రుజువు చేసెదను.' ఇట్లు పలికి వారిని ఆఁపి వారికి ఆమూలముగా సర్వమును వివరించి బూడిదరాశిలో పూడ్వఁబడియున్న మొండెమును తలను చూపెను. అంతట ముఖము వెలవెలఁబోయి సర్వమును చెడిప అంగీకరింపఁగా దానిని తిరస్కరించి వా రిట్లనిరి. 'మారాకృష్ట యయి అశంకితముగా సాహసము చేయు స్త్రీ పరస్వీకృత యయి కత్తివలె ఎవరిని చంపదు!' ఇట్లని విష్ణుదత్తాదుల నందఱను వదలిపెట్టిరి. అంతట చెలికాండ్రేడుగురును విష్ణుదత్తుని కొనియాడిరి. 'రాత్రి నిద్రించుచున్న మాకు నీవు రక్షారత్నదీపమవు అయితివి. నీప్రసాదముచేత మేము అనిమిత్తజమయిన మృత్యువును దాఁటినారము.' ఈప్రకారము విష్ణుదత్తుని కొనియాడి దుర్నిమిత్తమును శాంతి నొందించి అతనికి

నమస్కరించి అందఱును తెల్లవాఱఁగానే అతనితోఁ గూడ బయలు వెడలిరి.

ఇట్లు కళింగసేనకు ఏకాంతములో కథ చెప్పి సోమప్రభ మరల పలుకుచున్నది:—సఖీ, ఈ ప్రకారము పనులమీఁదఁ బోవువారు అనిమిత్తమును విలంబాదులచే అణఁపలేని అనిష్టమునకు పాలు పడుదురు. తెలిసి చెప్పినవారి మాటను పాటింపక అవసర పడునట్టి మందబుద్ధులు చిట్టచివరకు పశ్చాత్తాపమును పొందుదురు. కనుక అనిమిత్తము గలిగి యుండఁగా నిన్న వత్సరాజు నొద్దకు నీవు స్వయంవరార్థము దూతను పంపుట సరిగాదు. అవిఘ్నముగా నీకు విధి వివాహమును జరుపుదు గాక. చెడులగ్నమందు ఇల్లు వెడలి వచ్చితివి కనుక వివాహము దూరమైనది. దేవతలు కూడ నిన్ను వలచి యున్నారు. కనుక నీ శీలమును కాపాడుకొనవలసి యున్నది. మహామంత్రి యౌగంధరాయణుఁడు నీతినిపుణుఁ డని ఎఱిఁగి యుందుము. రాజ్యవ్యసనమునకు వెఱచి ఈ వివాహమును అతఁడు కానీయకుండెడిని. వివాహ మయినను నీయందు దోష మేమేని కల్పించెడిని. అట్లు గాక, ధర్మబుద్ధిచే న్యాయముగా నీయందు దోషమును కల్పింపఁడు. అయినను సవతివిషయమై ఎప్పుడును జ్ఞప్తి కలిగి యుండవలయును. ఈవిషయమై ఒక కథ వినుము:—

సవతిపుత్రి.

ఇక్షుమతి యని నగరమును, దానిప్రక్కనే ఆపేరిటనే ఒకనదియు, రెండును విశ్వామిత్రనిర్మితములు కలవు. వాని చెంత నున్నవనములో మంకణుఁ డను ముని ఊర్ధ్వపాదుఁడై తపస్సు చేయుచుండెను. ఒకనాఁడు తపస్సులో ఉండి ఆయన ఆకాశమార్గమున వచ్చిన యప్సరసను మేనకను వాతచలితాంబరను చూచెను. లబ్ధావకాశుఁడై మదనుఁడు చిత్తమును కలంపఁగా ఆమహాముని యొక్క తేజస్సు క్రొత్తదైన కదళీగర్భములో పడెను. తత్క్షణమే అందునుండి సర్వాంగసుందరి యైన కన్య పుట్టెను. మహాత్ములవీర్యము అమోఘము, తత్క్షణమే ఫలించును. ఆమెకు ముని ఉత్పత్తినిబట్టి కదళీగర్భ యని పేరు పెట్టెను. రంభాదర్శనముచేత గౌతమునికిఁ గలిగిన కృపి ద్రోణాచార్యభార్య గౌతమాశ్రమమందుఁ బోలె కదళీగర్భ మంకణాశ్రమమందు వర్ధిల్లుచుండెను.

ఒకనాఁడు మధ్యదేశపురాజు దృఢవర్మ యనువాఁడు వేఁటకు వెడలి గుఱ్ఱమెగవేసికొని రాఁగా ఆయాశ్రమము చేరి, అచట మునికన్యావేషమున వల్కలము దాల్చి శోభిల్లుచున్న కదళీగర్భను గాంచి కామించి అంతఃపురస్త్రీలను కూడ కోసి 'ఈమె ఎవరో ఋషికొమారిత, దుష్యంతుఁడు కణ్వుని కూఁతును శకుంతలను బోలె ఈమెను నేను పెండ్లి కాఁగలనా?' అని తలపోయుచుండెను. అప్పుడు మంకణముని సమిత్కుశలు

తెచ్చుకొని ఇంటికి వచ్చుచుండెను. ఆయనకు రాజు నమస్కరించి తన్ను తెలియఁబఱుచుకొనెను. రాజునకు అర్ఘ్యమిమ్మని ముని కదళీగర్భను నియోగించెను. ఆమె నమ్రతతో అర్ఘ్య మీయఁగా గ్రహించి రాజు మునిని, మీకు ఈకన్య యెట్లు గలిగె, నని యడిగెను. ముని ఆమెయుత్పత్తిని చెప్పెను. ఆకన్య మేనకాభావనచేఁ గలిగినది, అప్సరస, అని యెఱిఁగి, రాజు మఱియు కామపరతంత్రుఁడై ఆమెను తన కిమ్మని ముని నడిగెను. మునియు ఆమె నతని కిచ్చెను. మహానుభావు లయిన పూర్వులచేష్టితమును విచారింపఁగూడదు గదా. ఆ వృత్తాంతమును మహిమచే నెఱింగి సురాంగనలు వచ్చి మేనకయందలి యనురాగముచే కదళీగర్భకు వివాహాలంకారము చేసిరి. చేత ఆవాలు పెట్టి ఆమెతో ని ట్లనిరి. 'దారిలో ఆనవాలుకొఱకు వీనిని చల్లుచుఁ బొమ్ము. ఒకవేళ భర్తచే నవజ్ఞ పొంది యిటకు మరల వత్తు వేని అప్పటికి ఎదిగి యుండెడు వీనిచేత దారిని తెలిసికొందువు గాక.' వా రిట్లు పలికినపిమ్మట రాజు ఆమెను తన గుఱ్ఱముమీఁద ఎక్కించుకొన్నవాఁడై ఈలోపల వచ్చి కలసికొనిన సైన్యముతోఁ గూడ తన రాజధానిని చేరెను. ఆమెయు దారిలో ఆవాలు రాల్చుచు వచ్చెను. అచట రాజు కదళీగర్భవృత్తాంతమును మంత్రులకు తెలిపి, ఇతరభార్యలను రోసి ఆమెతోనే సదా క్రీడించుచుండెను. అంతట పట్టపుదేవి ప్రధానమంత్రిని పిలిపించి తన యుపకారములు జ్ఞప్తికిఁదెచ్చి

మిగుల వగపుతో రహస్యముగా నిట్లనియె: ‘క్రొత్తభార్యమీఁది తగులముచే రాజు నన్ను వదలినాఁడు. నా యీసవతి ఎట్లు తొలఁగిపోవునో అట్లు చేయుము.’ మంత్రి యి ట్లనియె. ‘దేవీ, అట్లు చేయుట యుక్తము గాదు, ప్రభువును భార్యనుండి యెడఁబాపుట మాబోంట్లకు వినాశహేతువు. ఇట్టి కపటములు పన్ను నేర్పు పరివ్రాజికల కుండును, అది వారివృత్తి; అందునకు తగినవారు వారియొద్ద నుందురు. వారు మాయతాపసులు, అడ్డము లేకుండ ఇండ్లలో ప్రవేశించి మాయలు పన్ని ఏమేమి చేయరు!’ ఇట్లతఁడు పలుకఁగా దేవి లజ్జచే వినీతురాలువోలె ‘యోగ్యులు నిందించెడి యీవ్యాపారము నా కేల?’ అని పల్కి అతనిని పో నిచ్చి అతని పలుకులను ఎదలో నుంచుకొని చేటిని పంపి యొకానొక పరివ్రాజికను పిలిపించి, ఆమెతో తనకోరిక యంతయు ఆమూలముగా చెప్పి, కార్యసిద్ధి ఆయె నేని విస్తారము ధన మిచ్చెద నని వాగ్దానము చేసెను. పరివ్రాజిక ధనలోభముచే ‘దేవీ, ఇ దేపాటి కార్యము? నీకై నేను సాధించెదను. నానాప్రయోగములను నే నెఱుఁగుదును.’ అని దేవిని ఆశపెట్టి మఠమునకు పోయెను.

అచట ఆదుష్టతాపసి ఇట్లు దిగులుపడసాగెను: — ‘ఆహా! అత్యాశ ఎవరిని పాల్పఁ బెట్టదు? నేను దేవియొద్ద సాహసముచే ప్రతిజ్ఞ చేసితిని. అట్టినేర్పు నాకు ఏమాత్రిగా లేదు. ఇతరస్త్రీలవలె రాజగృహములందు టక్కులు చేయుట యుక్తము

గాదు. ఒకవేళ తెలిసిపోయెనా ప్రభువులు దండింతురు. ఈ విషయములో ఒకటియే ఉపాయము కలదు. నా చెలికాడు ముంగలి ఇట్టినేర్పులు కలవాడు. వాడు ఇందు యత్నింపవలయును.' ఇట్లు ఆలోచించి ఆమె వెంటనే ముంగలియొద్దకు పోయి ఆవృత్తాంతమును వానికి తెలిపెను. ఆముంగలి ముసలి మోసగాడు ఆలోచించెను: 'అదృష్టముచేత నాకు మంచి కాలము వచ్చినది. చిన్నరాణికి చెఱుపు చేయఁగూడదు. ఆమెను కాపాడవలయును, ఆమె తండ్రి దివ్యదృష్టిచేత సర్వము నెఱిఁగి వెల్లడి చేసినను చేయఁగలఁడు. రాజునుండి ఈమెను బాపి ఇప్పుడు దేవివలన బహుమతులు పొందెదను. దుష్ట రహస్యములో సహాయుఁడైన భృత్యునికి ప్రభువు భృత్యుఁడుగా నుండును. పిమ్మట కాలాంతరమున మరల రాజుతో ఈమెను చేర్చి నేను చెప్పుసమాధానముచేత రాజువలనను ఈ ఋషి కన్యకవలనను బహుమానములు పొందుదును గాక. ఇట్లు చేసిన అతిపాతకముండదు. దీర్ఘకాలము జీవికయు కలుగును.' ఈరీతి నాలోచించి ముంగలి మాయపరివ్రాజికతో అనియె:— అమ్మా, ఇదంతయు నేను చేసెదను. యోగబలముచేత ఈ దేవి క్రొత్తభార్యను చంపుట యుక్తము గాదు. ఎప్పటి కయినను రాజు తెలిసికొనిన మనల నందఱను నాశము చేయును. స్త్రీ హత్యాపాతకమును కలుగును. ఆమెతండ్రి మునియు శపించును. కాఁబట్టి నాబుద్ధిప్రభావముచేత ఆమెను రాజునుండి ఎడఁ

బాపెదను. అందువలన దేవి సుఖముగా నుండును, మనకును ధనలాభము కలుగును. ఈపని నా కేపాటి? బుద్ధిబలముచే నేను దేనిని సాధింపలేను? నాప్రజ్ఞను వర్ణించెదను. వినుము.—

ధూ ర్త నా పి తు ని క థ.

ఈ రాజుతండ్రి దుర్మార్గుఁడు. నేను అతనికి నా కులసేవ చేయుచు ఉంటిని. అతఁడు ఒకనాఁడు తిరుగుచు సురూపను ఎలజవ్వనిని నాభార్యను చూచి కామించెను. పరిజనుల నడిగి మంగలది అని తెలిసికొని, 'మంగలవాఁడు ఏమి చేయఁగలఁడు!' అని అతఁడు నాయిల్లు సొచ్చి నాభార్యతో యథేచ్ఛముగా భోగించి పోయెను. నాఁడు దైవ వశమున నేను ఇంటలేను. మఱునాఁడు నేను వచ్చునప్పటికి నాభార్య వేఱు విధముగా నుండెను. కారణమును నే నడుగఁగా అది అభిమానవంతురాలుగాన జరిగినవృత్తాంతమును చెప్పినది. కూడదన శక్తుఁడను కానందున నాభార్యను అది మొదలుగా రాజు ప్రతిదినము పొందుచుండెను. దురాచారుఁడై ఒడలెఱుఁగని ప్రభువునకు గమ్యాగమ్యభేదము గలదా? గాలికి రేఁగిన కార్చిచ్చునకు గడ్డి ఏమి? అడవి యేమి? కనుక అతనిని ఆటంకపఱుచుటకు నా కేమియు గతి లేక తిండి తగ్గించుకొని అగ్నిమాంద్యవ్యాధిని నటింప సాగితిని. ఆస్థితిలోనే నేను నాసేవ చేయుటకై కృశించి నిట్టూర్పులు విడుచుచు పాలిపోయి రాజు కడ కేఁగితిని. నన్ను చూచి మాంద్యవ్యాధిపీడితునిఁగా

తలఁచి రాజు సాభిప్రాయముగా 'ఓరీ, ఏమి ఇట్లయితివి? చెప్పుము.' అని యడిగెను. నిర్బంధపెట్టఁగా నేను ఏకాంతమందు అభయము వేఁడి రాజుతో 'ప్రభూ, నాభార్య డాకిని, అది నేను నిద్రించియున్నప్పుడు నాప్రేగులను ఆసనముగుండ లాగి జుట్టి మరల లోపలికి త్రోయును, అందుచేత నేను చిక్కిపోయితిని. పోషణమునకై నాకు నిత్యము పుష్టికరమయినట్టి యాహార మెక్కడిది?' అని యుత్తరము చెప్పితిని. అంతట రాజు సందేహము గొనినవాఁడై యిట్లు తలంచెను: 'డాకిని యగుట సత్యమా? నన్నది హరించినది. ఆహారపుష్టుఁడనయిన నాయాంత్రములను కూడ జుట్టునా యేమి? ఈసంగతిని నేను రాత్రి స్వయముగా పరీక్షించెదను.' ఈరీతి నాలోచించి రాజు నాకు అన్నము పెట్టించెను. నేను ఇంటికి పోయి భార్యయెదుట కన్నీళ్లు విడుచుచుంటిని. అది కారణ మడుగఁగా చెప్పితిని:— 'ప్రాణేశ్వరీ, ఎవరితోను చెప్పకుము. చెప్పెదను వినుము. ఈరాజుగుదములో వజ్రాగ్రములవంటి దంతములు మొలచినవి. అందుచేత పని చేయుచుండఁగా నాకత్తి శ్రేష్ఠ మయ్యును విఱిగి పోయినది. ఇఁక నిట్లు నాకత్తి మాటిమాటికి విఱిగి పోవును. నిత్యము నేను క్రొత్తకత్తి యెక్కడ సంపాదింపఁగలను? కాఁబట్టి నా కులజీవిక పడిపోయిన దని ఏడ్చుచున్నాను.' అది విని నాభార్య రాత్రి రాజు వచ్చి నిద్రించి యున్నప్పుడు అతని గుదదంతాద్భుతమును చూచుటకు నిశ్చయించుకొనెను.

సృష్టి మొదలుకొని అట్టిది యసత్య మని నాభార్య యెఱుఁగ దాయెను. తెలివిగల స్త్రీలు కూడ విటవర్ణనలచేత మోస పోదురు. పిమ్మట రాత్రి రాజు వచ్చి దానితో భోగించి నామాట జ్ఞప్తి యుంచుకొని మాయనిద్ర పోవుచుండెను. అతఁడు నిద్రించె నని తలంచి నాభార్య ఆ దంతములను పరీక్షించుటకై మెల్లమెల్లగా చేయి చాచి గుదమును తడువసాగెను. అంతట తటాలున రాజు దద్దిరిల్లి 'లేచి డాకిని! డాకిని!' యని యఱచి భయపడి తిరిగిచూడక పాఱిపోయి దానిని బొత్తిగా వదలి వేసెను. భార్యయు సంతోషపడి అది మొదలు మదేకపరాయ ణగా నున్నది. ఈప్రకారము పూర్వము బుద్ధిప్రభావముచేత నేను రాజునుండి భార్యను విడిపించుకొంటిని.

ఇట్లు నాపితుఁడు కుతాపసితో చెప్పి మరల నిట్లనియె: అమ్మా నీవు కోరినట్టి యీ పనిని ప్రజ్ఞచేత సాధింపవలయును. అందులకు ఈ ప్రయోగమును వినుము. రాజాంతఃపురవృద్ధు నొకని నశపఱుచుకొన వలయును. అతఁడు రహస్యముగా రాజుతో 'నీభార్య కదళీగర్భ డాకిని సుమా' అని చెప్పవలెను. అడవినుండి వచ్చిన యీమెకు ఆప్తులైన పరిజనులు ఇందు ఎవ్వరును లేరు. అందఱును ఈమెకు లాఁతులు, భేదోపాయము నకు లోఁబడుదురు. దానోపాయము చేసిన నేమి చేయరు? రాజు అట్లువిని సందేహపడి యుండఁగా, ఎవ రైనను రాత్రి కాలు చేయి మొద లైన మనుష్యావయవములు కద

గర్భ యుంట వేయవలయును. వానిని తెల్లవాఱఁగానే చూచి రాజు ముసలివానిమాట సత్యమే అని తలఁచి భయపడి కదళీగర్భను త్యజించును. ఈప్రకారము సవతి తొలఁగి దేవి సుఖము పొందును; నిన్నును ఆమె సత్కరించును, మాకును ఏమయిన లాభము కలుగును.

మంగలి యిట్లు చెప్పఁగా ఆకూటతాపసి దేవిమొద్దకు పోయి ఆయుక్తిని తెలిపెను. దేవియు దానిని ప్రయోగించెను. రాజు ప్రత్యక్షముగా చూచి కదళీగర్భను డాకిని యని త్యజించెను. అంతట తుష్టి పొందినదేవి రహస్యముగా ఇచ్చిన బహుమానమును ప్రవ్రాజికయు మంగలియు యథేష్టముగా అనుభవించిరి. దృఢవర్మ విడువఁగా కదళీగర్భ అపదూరునకు దుఃఖించి రాజగృహమునుండి వెలువడి, తాను మొదట ఏ మార్గమున వచ్చెనో ఆమార్గమును మునుపు చల్లఁగా మొలచి యున్న యావాలగుర్తుచేత తెలిసికొని, తండ్రియాశ్రమమునకు పోయెను. తండ్రియు ఆకస్మికముగా వచ్చిన యాకూఁతును చూచి, ఆమెయందు దుశ్చరితమును శంకించి, క్షణమూర కుండి, యోగదృష్టిచే వృత్తాంతము నంతయు ఎఱిఁగి, ఆమెను గ్రహించి, ఓదార్చి, అచ్చటినుండి రాజు నొద్దకు వచ్చి వినతుఁడైన యతనితో పట్టపుదేవి సవతిమీఁది పగచేత చేసిన యా కపటనాటకము నంతయు చెప్పెను. ఆసమయములో మంగలి రాజునొద్దకు వచ్చి, జరిగినది జరిగినట్లు చెప్పి, మఱి ఇట్లనియె:

'ఓప్రభూ, కదళీగర్భాదేవిని పట్టపుదేవి చేసిన యభిచార ప్రయోగమునుండి ఈప్రకారము నేను యుక్తిచే రక్షించితిని.' రాజు ఆమాట విని మునివచనము నిశ్చయ మని నమ్మి, కదళీగర్భను మరల గ్రహించి, మునిని సాగనంపి, నాపితునికి తన యందు భక్తుఁడని విస్తారము ధన మిచ్చెను. ఇట్లే ప్రభువుల ధనములను ధూర్తులు లనుభవింతురు. రాజు అది మొదలు పట్టపు దేవిని త్యజించి కదళీగర్భతోనే సుఖ ముండెను.

ఓ కళింగసేనా, అనవద్యాంగీ, ఈప్రకారము సవతులు లేనిదోషములను సవతులయందు కల్పింతురు. నీవు కన్యవు, వివాహలగ్నము దూరమున నున్నది. అచింత్యగతులు సురలు కూడ నిన్ను కోరుదురు. కనుక వత్సేశ్వరునికి అర్పిత మగుచు జగదేకరత్నమును నిన్ను నీవే కాపాడుకొనవలయును. నీకు నీ సౌందర్యమే సుమా వైరి. సఖీ, నేను పతియింట నున్న నీ కడకు ఇఁకను రాను. సఖీపతియింటికి మంచియిల్లాండ్రు రారు. ఓ సుగాత్రీ, నాభర్త కూడ నన్ను నివారించినాఁడు. ఆయనను మొఱఁగి వచ్చుట సాధ్యము గాదు. ఆయన దివ్యదృష్టిచేత నా రాకను తెలిసికొనును. ఇప్పుడు ఆయనయొద్ద సెలవు పొంది వచ్చితిని. ఇచట ఇఁక నేను నీకు చేయవలసినది లేదు, నేను ఇంటికి పోయెదను. భర్త అనుజ్ఞ యిచ్చునెడల మరల వచ్చి నిన్ను చూచెదను. ఈప్రకారము కన్నీళ్లతో

కళింగసేనతో చెప్పి బాష్పక్షాళితవదన యగుచున యా కళింగ సేనను ఓదార్చి సోమప్రభ ఆకాశ మార్గమున ఇంటికి పోయెను.

---

౭ - వ తరంగము.

అనంతరము కళింగసేన స్వదేశమును బాసినదై తన సఖిని స్మరించుచు వత్సేశ్వర పాణిగ్రహణ మహోత్సవము ఆలస్యపడఁగా కౌశాంబియందు అడవినుండి తప్పిన మృగివలె నుండెను. వత్సేశ్వరుఁడు కళింగసేనాపాణిగ్రహణమును ఆలస్య పెట్టుటకు నేర్పరులయిన గణకులమీఁద అసూయగలవాఁడై చిత్తవినోదనార్థము ఆదినము వాసవదత్తాదేవినగరికి పోయెను. అచట నామె ఆయనను నిర్వికార యై మంత్రివరుఁడు నేర్పిన ప్రకారము ఉపచరించెను. 'కళింగసేనా వృత్తాంతము ప్రఖ్యాత మయి యున్నను ఈమె అవికృత యై యున్న దేమి?' అను జిజ్ఞాసచేత రాజు ఆమె నడిగెను: 'దేవీ, నీవు ఎఱుఁగుదువా, నన్ను స్వయముగా వరించుటకు కళింగసేన యను రాజపుత్రి వచ్చి యున్నది?' ఈమాటకు ఆమె ముఖరాగము మాఱకయే 'ఎఱుఁగుదును, నాకు అతిహర్షమయినది. ఆమె సాక్షాల్లక్ష్మి, మనయింటికి వచ్చినది. ఆమె దొరకినందున ఆమెతండ్రి కళింగ దత్తుఁడు కూడ వశ్యుఁడగుటచేత భూమి యెల్ల నీస్వాధీనమే. నీకు ఐశ్వర్యము కలిగిన నాకు సుఖము, ఈవిషయము నీకు

తెలిసియే యున్నది. రాజాంతరులచేత కోరఁబడుచున్న రాజకన్యలు ఏ నిన్ను కోరుకున్నారో అట్టి నీకు భర్త వయిన నాకంటె ధన్యురాలెవతె?' అనెను. అంత వత్సరాజు సంతోషించి ఆమెతోఁగూడ పానము సేవించి ఆమెతో నిద్రించి మధ్యలో మేల్కొని ఇట్లు తలంచెను: 'ఎంత మహానుభావురాలు ఈదేవి! నన్నే అనువర్తించుచున్నది. పాపము! ఈమె ఎట్లు ఓర్చును? పద్మావతీ వివాహమందు ఈప్రియ దైవవశమున ప్రాణములు వదల లేదు. ఈమెకు అనిష్టము కలిగిన, నాకు సర్వనాశము అగును. నాపుత్త్రుఁడు మామగార్లు బావమఱఁదులు పద్మావతి రాజ్యము సర్వము ఈమె నవలంబించి యున్నది. ఇట్లుండఁగా కళింగసేనను నేనెట్లు పెండ్లి యాడుదును?' ఇట్లాలోచించి వత్సరాజు తెల్లవాఱఁగానే వెడలి మధ్యాహ్నమున పద్మావతీదేవినగరికి పోయెను. ఆమెయు వాసవదత్తచే శిక్షితయై ఆయనను ఆమె ఉపచరించినట్లే తాను ఉపచరించెను. ఆయన యడిగినమాటకు ఆమె చెప్పిన యుత్తరమునే తాను చెప్పెను. ఆమఱునాఁడు 'ఇద్దఱు దేవేరులకును ఒకటియె మనస్సు, ఒకటియే మాటయు,' అని రాజు యౌగంధరాయణునికి చెప్పెను. రాజు విచారమునకు లోఁబడినందులకు మహామంత్రి సంతోషించి కాలోచితము పలికెను 'నే నెఱుఁగుదును. ఇది యిట్టిది గాదు, ఇందు అభిప్రాయము దారుణమై యున్నది. దేవేరులు ప్రాణత్యాగనిశ్చయము చేసికొని అట్లు పలికినారు.

పతి యన్యాసక్తుఁ డయినను మృతుఁ డయినను ప్రాణములు త్యజింప నిశ్చయించుకొన్న పతివ్రతలు సర్వత్ర నిస్స్పృహలై దైన్యము మాని గాంభీర్యము నవలంబింతురు. పతివ్రతలు పత్యనురాగభంగమును ఓర్వరు. అందులకు నిదర్శనము విను.

## శ్రుత సేనుని కథ.

దక్షిణదేశములో గోకర్ణపురములో శ్రుతసేనుఁ డని రాజు కులభూషణము శ్రుతవంతుఁడు ఉండెను. పూర్ణ సంపదలు గల యారాజు తనకు తగిన భార్య లేమికి చింతిల్లు చుండెను. ఒకనాఁడు ఆ రాజు ఆవిషయమునుగుఱించియే ముచ్చటించు చుండఁగా అగ్నిశర్మ యను నొక బ్రాహ్మణుఁడు ఆయనతో నిట్లనియె:— రాజా, నేను రెండు ఆశ్చర్యములు చూచితిని; వానిని వర్ణించెదను వినుము. నేను తీర్థయాత్రా పరాయణుఁడనై పంచతీర్థికి పోయితిని. అందు అయిదుగురు అచ్చరలు ఋషిశాపమునలన మొసళ్లయి ఉండి అర్జునుచే కడతేఱిరి. ఆతీర్థములో స్నానముచేసి అయిదు దినములు ఉపవసించు వారికి నారాయణానుచరత్వము కలుగును. అచ్చటికి నేను పోవునప్పుడు సేద్యగాఁ డొకఁడు ఆచెంత పొలములో దున్నుకొనుచు పాడుకొనుచుండెను. వానిని ఒకసన్న్యాసి దారి యడిగెను. వాఁడు పాటస్వారస్యములో ఆపిలుపు వినలేదు. అందులకు సన్న్యాసి వానిని తిట్టెను. కార్షికుఁడు అంతట పాట మాని యిట్లనియె:—'ఆహా! నీవు సన్న్యాసి వయ్యును

ధర్మలేశ మయినను ఎఱుఁగవు. నేను మూర్ఖుఁడ నయ్యును ధర్మసారమును ఎఱుఁగుదును.' అంతట ప్రవ్రాజకుఁడు నీవు ఏమి యెఱుఁగుదువో చెప్పు మనెను. కార్పటికుఁడు పలికెను.— ఇక్కడ నీడలో కూర్చుండుము, చెప్పెదను.

ఈయూర బ్రహ్మదత్తుఁడు, సోమదత్తుఁడు, పుణ్యాత్ముఁడయిన విష్ణుదత్తుఁడును, ముగ్గురు బ్రాహ్మణులు అన్నదమ్ములు ఉండిరి. అందు పెద్దవారిద్దఱకును భార్యలు గలరు. చివరవానికి పెండ్లి కాలేదు. అతఁడు ఆయన్నలయాజ్ఞను బంటువలె చేయుచు కోపము లేక నాతోఁ గూడ నుండెను. నేను వారి పాలేరువాఁడను. అతఁడు మెత్తనివాఁడు, తెలియనివాఁడు, సాధువు, వినీతుఁడు, సన్మార్గుఁడు, కపటము లేనివాఁడు, ఓపిక కలవాఁడు అని యన్నలు తెలిసికొనిరి. ఒకప్పుడు వదినెలు అతనిని కామించి ఏకాంతమందు ప్రార్థించిరి. అతఁడు వారిని తల్లి వలెనగా నిరాకరించెను. అంతట వారిద్దఱును తమ భర్తలతో 'మీతమ్ముఁడు మమ్ము కామించి యున్నాఁడు' అని కొండెము చెప్పిరి. వా రిద్దఱును చెడుభార్యలమాటలు విని నిజము అబద్ధము ఎఱుఁగక అతనిమీఁద ద్వేషము దాల్చిరి. పిమ్మట అన్నలు ఒకప్పుడు అతనిని పొలమునడిమిపుట్టను బాగు చేయు మని యాజ్ఞాపించిరి. సరియే యని పోయి గుద్దలితో అతఁడు పుట్టను త్రవ్వసాగెను. 'వలదు, వలదు, ఇందు నల్లత్రాఁచున్నది.' అని నేను వారించినను తాను చెడుగు కోరిన

యన్నలయాజ్ఞను ఉల్లంఘింపక, అయినది కానిమ్మని పుట్టను త్రవ్వెను. అందులో నతనికి బంగారునాణెములతో నిండిన బిందె దొరకెను. కొంచము లేనే లేదు. సజ్జనులకు ధర్మము సదా సాన్నిధ్య మిచ్చును గదా. నేను వలదని నివారించుచుండినను అతఁడు ఆకలశమును కొనిపోయి సర్వమును అన్నలకు భక్తితో నప్పగించెను. వారు ఆధన మెల్ల హరింపఁగోరి అందు నుండియే కొంత తలవరుల కిచ్చి వారిచేత అతని కాలుసేతులు తఱిఁగించిరి. అప్పటికిని అతఁడు వారిమీఁద అలుగకుండెను. ఆసత్యముచేత అతనికి మరల కాలుసేతులు మొలచినవి. ఆ వింతను చూచి అది మొదలు కోపము బొత్తిగా మానితిని. నీవు తాపసుఁడ వయ్యును ఇప్పటికిని కోపము మానకున్నావు. అక్రోధముచేత ఇప్పుడే నాకు స్వర్గము కలిగినది, చూడు.— ఇట్లు చెప్పుచునే కాపర్కరుఁడు దేహము వదలి స్వర్గమునకు పోయెను. ఇది యొక యాశ్చర్యము. రెండవ యాశ్చర్యమును చెప్పెదను వినుము.

అటనుండి తరలి మరల తీర్థయాత్రావశమున సముద్ర తీరమునందు నేను వసంతసేనరాజు రాజ్యమునకు పోయితిని. రాజసత్త్రమునకు భోజనముకై నేను పోవుచుండఁగా అచటి బ్రాహ్మణులు నాతో ‘ఓబ్రాహ్మణుఁడా, అచటికి పోకుము. అచ్చట రాజుకూఁతురు విద్యుద్ద్యోత యున్నది. ఆమెను చూచిన మునికూడ కామశరనిర్భిన్నుఁడై ఉన్మత్తుఁడై మృతిఁ

బొందును.' అనిరి. నేను ఉత్తర మిచ్చితిని: 'ఇది యాశ్చ ర్యము గాదు, నేను సదా అపరకాముని శ్రుతసేనమహారాజును చూచుచున్నాను. ఆయన యాత్రాదులయందు బయలువెడలి నప్పుడు కులాంగనలు పాతివ్రత్యభంగభయముచేత ఆయనను చూడకుండ నివారిత లగుదురు.' ఇట్లు నేను చెప్పఁగా అచటి సత్త్రాధిపపురోహితులు నన్ను నీవానినిగా తెలిసి రాజునొద్దకు కొనిపోయిరి. అచట మూర్తీభవించిన కామజగన్మోహమంత్ర విద్యంబోని రాజతనయను విద్యుద్ద్యోతను చూచితిని. ఆమెను చూచినందునఁ గలఁగిన మనస్సును ఎట్టకేలకు తేర్చుకొని 'ఈమె మాప్రభువునకు భార్య అగునేని, అతఁడు రాజ్యమును మఱచును. అయినను ఈవృత్తాంతమును నేను స్వామికి చెప్ప వలసినది. చెప్పకుండిన ఉన్మాదినీ దేవసేనుల వృత్తాంతమువలె పరిణమించు నేమో?' అని తలంచితిని. ఆకథను వినుము.

### ఉన్మాదినీదేవసేనుల కథ.

పూర్వము దేవసేనభూపుని రాష్ట్రమందు ఉన్మాదిని యని లోకోన్మాదకారిణి యయిన కన్య యొకతె యుండినది. ఆమెను తండ్రి రాజునకు నివేదించినను, రాజు తన్ను వ్యసనము నుండి కాపాడఁదలఁచిన విప్రులవలన ఆమె దుర్లక్షణ యని విని ఆమెను గ్రహింపకుండెను. అంత నామె మంత్రిముఖ్యుని వివాహమై ఒకనాఁడు తన మేడకిటికీనుండి రాజునకు తన్ను చూపుకొనెను. ఆభుజంగిచేత రాజు దూరమునుండియే దృష్టి

విషముచే కొట్టఁబడినవాఁడై మాటిమాటికి మూర్ఛిల్లెను, ఆహారము మానెను, ఎందునను ప్రీతి పొందఁ డాయెను. దాని భర్త మొదలయిన మంత్రులు వేఁడుకొనినను ధార్మికుఁ డగుటచే ఆమెను గ్రహింపలేదు కాని, ఆమెమీఁది వలపుచేత ప్రాణము త్యజించెను. కనుక ఇట్టి ప్రమాదము జరిగినయెడల నేను ద్రోహమే చేసినవాఁడ నగుదును.—అని ఆలోచించి యీచిత్రమును నీకు తెలిపితిని.

ఆ బ్రాహ్మణునివలన మదనాజ్ఞను బోలె ఈవచనమును విని శ్రుతసేనమహారాజు విద్యుద్ద్యోతాహృతచిత్తుఁడై తత్క్షణమే ఆ బ్రాహ్మణునే పంపి ఆమెను రప్పించుకొని పెండ్లి చేసికొనెను. అదిమొదలు ఆమె సూర్యునికి ప్రభవోలె రాజుదేహమునకు వేఱు గాని దై యుండెను. పిమ్మట మాతృదత్త యని యొక వైశ్యకన్య రూపగర్వితురాలై ఆరాజును స్వయముగా వచ్చి వరించెను. అధర్మమునకు వెఱచి అతఁడు ఆమెను గ్రహించెను. అది విని విద్యుద్ద్యోత గుండె పగిలి చచ్చి పోయెను. రాజు వచ్చి అట్లు మృతిఁబొందిన యాకాంతను ఒడిలో పెట్టుకొని యేడ్చి వెంటనే ప్రాణములు వదలెను. వైశ్యతనయ మాతృదత్త యంతట అగ్నిప్రవేశము చేసెను. ఈప్రకారము ఆ రాష్ట్రము రాజుతో కూడ నాశ మయినది.

అందువలన గొప్పప్రేమను ఖండించినయెడల మనస్విని యయిన వాసవదత్తాదేవి సహింప నేరదు. కనుక నీవు కళింగ

సేనను వివాహమాడిన వాసవదత్తాదేవి ప్రాణములు వదలును, సందియము లేదు ; పద్మావతీదేవి కూడ ఆపనియే చేయును ; వా రిద్దఱకు ఒకటియే ప్రాణము కదా. పిమ్మట నీకుమారుఁడు నరవాహనదత్తుని స్థితి యేమి? నీవు ఈపరిణామమును సహింప నేరవు, నే నెఱుఁగుదును. ఇట్లు ఒకమాఱుగా ఇ దంతయు నశించును. దేవేరుల మాటగాంభీర్యమే వారు ప్రాణములు వదలుటకు దృఢనిశ్చయము చేసికొని యున్నా రని తెలుపు చున్నది. కనుక నీవు స్వార్థమును కాపాడుకొనవలయును. తిర్యగ్జంతువులు కూడ ఆత్మరక్ష చేసికొనును, నీబోఁటి బుద్ధి మంతులమాట చెప్పవలయునా ?

ఇట్లు మంత్రిముఖ్యుఁడు పలుకఁగా వత్సరాజు చక్కఁగా వివేకము పొంది 'ఇది యిట్లే, సందేహము లేదు. ఇ దంతయు నాశ మగును. కనుక కళింగసేన నాకేల ? లగ్నము కూడ దూరముగా నున్న దని గణకులు చెప్పుట అనుకూలముగానే ఉన్నది. స్వయంవర యై వచ్చినదానిని త్యజించు నధర్మము ఏపాటిది ?' ఇట్లు వత్సరాజు పలుకఁగా యౌగంధరాయణుఁడు సంతోషించి తనకార్యము నెఱవేఱిన దని తలంచెను. 'ఉపాయ జలముచే తడిపిన నీతిమహావల్లి దేశకాలోపబృంహిత యై ఏ ఫలమును ఫలింపదు ?' అనుకొని మంత్రి దేశకాలములు విచారించుచు రాజునకు మ్రొక్కి ఇంటికి పోయెను. రాజు వాసవదత్తాదేవియొద్దకు పోయెను. ఆమెయు తనచిత్తమును

తెలియనీయక ఆయనకు ఉపచారములు చేసెను. అంతట రాజు ఆమెతో నిట్లనియె: 'హరిణాక్షీ, నేను చెప్పనేల? నీకే తెలియును, కమలమునకు నీరుపోలె నాకు నీప్రేమయే గదా ప్రాణము. నేను ఇంకొకతె పేరయినను ఉచ్చరింపుదునా? కళింగసేన స్వయముగా నాయింటికి వచ్చినది. అర్జునుఁడు తపము చేయుచుండి రంభను కూడ నిరాకరించుటయు, అందున కతని నామె నపుంసకుఁడుగా శపించుటయు, ఆశాపము నతఁడు సంవత్సరకాలము విరటునియింట మహాశ్చర్యరూప మయిన స్త్రీవేషము దాల్చి యనుభవించుటయు, ప్రసిద్ధమే గదా. కళింగసేనను నేను నిషేధింపసందులకు కారణము ఇది. నీయిచ్ఛ లేక నేను ఏమియు చెప్పఁగోరను.' ఈప్రకారము ఊరార్పఁగా వాసవదత్త వత్సరాజునకు రాగవంత మయిన ముఖమద్యమును అర్పి తనహృదయమునుంబోలె అర్పించెను. దానివలన అతఁడు ఆమె యభిప్రాయము వాస్తవముగా క్రూరమై యుండె నని తెలిసికొని మంత్రిముఖ్యుని బుద్ధిప్రభావమునకు సంతోషించి ఆమెతోనే ఆరాత్రి గడపెను.

ఈలోపల పూర్వము కళింగసేనా వృత్తాంతమును దివారాత్రము తెలిసికొమ్మని యౌగంధరాయణుఁడు నియమించిన బ్రహ్మరాక్షసుఁడు ఆరాత్రియే స్వయముగా అతనియొద్దకు వచ్చి యిట్లనియె: "నేను కళింగసేన యింట లోపలను వెలుపలను ఉన్నాను. అచటికి దివ్యులుగాని మానుషులుగాని ఎవరును

రాలేదు. నేను ఈ సాయంకాలము మేడమీఁద ప్రచ్ఛన్నముగా నుండఁగా ఆకస్మికముగా ఆకాశములో నొక యవ్యక్త శబ్దము వినఁబడినది. అంతట దాని కారణమును ఎఱుఁగఁగోరి నా విద్యను ప్రయోగించితిని గాని దానిని తెలిసికొనుటకు దానికి శక్తి చాలదాయెను. అంత నేను 'ఇది కళింగసేనా లావణ్యాలోలుపుఁడై ఆకాశమున వచ్చిన యొకదివ్యపురుషుని శబ్దము, కనుకనే నావిద్య ఇచట పనికి రాలేదు. రవంతసేపు చూచెదను గాక. జాగరూకులై యుండునిపుణులకు పరచ్ఛిద్రమును కని పట్టుట కష్టము గాదు. ఈపని మంత్రిశ్రేష్ఠునికి ప్రియముగదా. ఇట్లు కళింగసేనసఖి సోమప్రభ కూడ చెప్పుచుండఁగా నేను వింటిని.' అని నిశ్చయించుకొని నీతో చెప్పవచ్చినాఁడను. ప్రసంగవశమున నడిగెదను. ఈవిషయమును నాకు చెప్పుము. 'తిర్యగ్జంతువులు కూడ తమ్ము తాము కాపాడుకొనును' అని రాజుతో చెప్పితివే, దానిని నేను నా యోగమాయచేత అదృశ్యుఁడనై యుండి వింటిని. ఇందుకు నిదర్శనము కలదేని, మహానుభావా, చెప్పుము." ఈప్రకారము యోగీశ్వరుఁడు అడుగఁగా యౌగంధరాయణుఁడు చెప్పసాగెను.

నకులోలూక మార్జార మూషక కథ.

మిత్రమా, వినుము. విదిశానగరివెలుపల పూర్వము గొప్ప మఱ్ఱిచెట్టుండెను. ఆమహావృక్షములో నకు లోలూక మార్జార మూషకములు నివసించి యుండినవి. ముంగిసయు

మూషకమును వేఱువేఱు బిలములలో ఉండినవి. పిల్లి చెట్టు నడిమిపెద్దతొఱ్ఱలోను, గ్రుడ్లగూబ చెట్టుకొనలో ఎవరికిని దొరకాని తీఁగగూటియందును, ఉండినవి. ఈ మూఁటికిని ఎలుక ఆహారము, పిల్లి కడమమూఁటిని చంపును, ముంగిసయు ఎలుకయు గ్రుడ్లగూబయు పిల్లిభయముచేతను స్వభావము చేతను రాత్రియే మేఁతకు సంచరించుచుండినవి. పిల్లి దివా రాత్రములు నిర్భయముగా ఆసమీపమందలి యవక్షేత్రమందు ఎలుకను పట్టుటకై సదా తిరుగుచుండినది. తక్కినవి కూడ తమ కాలములయందు అచటికి ఆహారార్థము వచ్చుచుండినవి. ఒకనాఁడు వేటకాఁడు మాలవాఁడొకఁడు అచటికి వచ్చి ఆ పొలమునకు పోవుచున్న పిల్లిజాడను చూచి దానిని చంపుటకు పొలము చుట్టును వలలు పన్ని పోయెను. అప్పుటరాత్రి పిల్లి ఎలుకను చంపుటకు వచ్చి ప్రవేశించి ఆవలలో తగులుకొనెను. ఆహారముకొఱకు అచటికి చాటుగా ఎలుకయు వచ్చి అట్లు కట్టుఁబడియున్నట్టి పిల్లిని చూచి సంతోషనృత్యము చేయుచు దూరమున పొలములో ప్రవేశించుచుండెను. ఆసమయమునకు గ్రుడ్లగూబయు ముంగిసయు వచ్చి పిల్లి కట్టుఁబడి యుండుట చూచి ఎలుకను పట్టఁ దలఁచినవి. ఎలుకయు దాని నెఱిఁగి యిట్లు తలపోసెను. 'నకులోలూకములకు భయంకర మయిన యీపిల్లిని ఆశ్రయింతునేని ఇది కట్టులోనుండియు ఒకదెబ్బతో నన్ను చంపఁగలదు. మార్జారమునకు దూర మయితినా, నన్ను

ఉలూక నకులములు చంపివేయును. శత్రుమధ్యగతుఁడ నయిన నేను ఎట్లు తప్పించుకొందును. కనుక పిల్లినే ఆశ్రయించెదను. ఇది యిప్పుడు ఆపదలో నున్నది గదా. కావున, ఆత్మ సంరక్షణార్థము నన్ను రక్షించును. నేను దీనిపాశములు కొఱికివేయఁగలను గదా.' ఇట్లాలోచించి మెల్లగా సమీపించి ఎలుక పిల్లితో ని ట్లనియె:—'నీవు కట్టుఁబడినందులకు నాదుఃఖము ఇంతంత యనరాదు. నేను నీ పాశములను ఛేదించెదను. యోగ్యులకు సహవాసముచేత వైరులందు కూడ విశ్వాసము కలుగును. అయినను నీచిత్త మెఱుఁగక ప్రవర్తించుటకు భయపడుచున్నాను.' ఆమాట విని పిల్లి 'మంచివాఁడా, విశ్వాసముంపుము. ఇఁక నీవు నాకు మిత్త్రమవు, ప్రాణదాతవు.' అనెను. వెంటనే యెలుక పిల్లిమొడిలో చేరెను. దానిని చూచి నకులోలూకములు నిరాశములై వెడలిపోయినవి. అంతట మార్జారము పాశపీడిత మయి మూషకముతో 'మిత్త్రమా, తెల్లవాఱ వచ్చినది, నాపాశములను త్రెంపుము.' అని వేఁడెను. ఎలుకయు వేఁటకానిరాకను ఎదురుచూచుచు మెల్లమెల్లగా కొఱుకుచు ఊరకయే పండ్లు పటపటలాడించుచు ఉండినదై తెల్లవాఱఁగానే వాఁడు రాఁగాఁ జూచి వెంటనే పాశములను తెగఁగొఱికెను. ఉరులు తెగఁగానే పిల్లి వేఁటకానికి వెఱచి పాఱిపోఁగా, ఎలుక చావు తప్పించుకొని పాఱిపోయి కలుగుఁ దూఱెను. మార్జాలము మరల పిలువఁగా ఎలుక విశ్వసింపక

బయటికి రాక 'పిల్లీ, కాలవశమున శత్రువు మిత్త్రిమగునుగాని సర్వదా గాదు.' అనెను. ఇట్లు అనేకశత్రువులనుండి ఎలుక తిర్యగ్జంతు వయ్యును తన్ను కాపాడుకొన్నది. ఇది 'దేవీరక్షణచే నీకార్యమును రక్షించుకొమ్మ'ని నేను రాజుతో చెప్పినయుపమ. సర్వత్ర బుద్ధి ముఖ్యమిత్త్రిము గాని పౌరుషము గాదు. ఇందులకు నిదర్శనము చెప్పెదను వినుము.

## బుద్ధి బలమే బలము.

శ్రావస్తియను నగరమునందు పూర్వము ప్రసేనజిత్తు అని రాజుండెను. అచటికి క్రొత్తగా ఒక బ్రాహ్మణుఁడు శూద్రాన్నభోజి వచ్చెను. ఒకవైశ్యుఁడు ఆతనిని గుణవంతుఁడని తలఁచి ఒకబ్రాహ్మణునియింట నుంచి పోషించుచుండెను. ఆవైశ్యుఁడును అతని చూచి ఇతరవైశ్యులును ఆబ్రాహ్మణుని శుష్కాన్నదక్షిణాదులతో నిండించిరి. ఆప్రకారము ఈలోభి వేయిబంగారపు దీనారములను కూడఁబెట్టి యడవిలో పాఁతి పెట్టెను. ప్రతిదినము తాను ఒంటరిగా పోయి ఆ చోటును చూచుచుండెను. ఒకనాఁడు పోయి చూడఁగా ఆగోతిని ఎవరో త్రవ్వియుండిరి, అందు బంగారము లేదు. దానిని చూడఁగానే అతనికి గుండె పగిలి హృదయము మాత్రమే గాక దిక్కులు కూడ శూన్యము లయినవి. అతఁడు ఏడ్చుచు, మొత్తుకొనుచు, తాను కాఁపుర మున్న విప్రునియింటికి వచ్చి, ఆయన అడుగఁగా తనవృత్తాంత మంతయు చెప్పి, తీర్థమునఁ బ్రాణత్యాగము

చేయ నిశ్చయించుకొనెను. సంగతి తెలిసి యితని పోషకుఁడు వైశ్యుఁడు ఇతరులతోఁగూడ వచ్చి 'ఏమయ్యా బ్రాహ్మణా, ధనముకొఱకు చచ్చెద ననెదవు? ధనము అకాలమేఘము వంటిది. ఆకస్మికముగా వచ్చును, ఆకస్మికముగా పోవును.' అని ధర్మోపదేశములు చేసెను. ఎన్నిటికిని ఇతఁడు మరణనిశ్చయము మానలేదు. లోభికి ప్రాణములకంటె ధనమే ప్రియము గదా. పిమ్మట ఆబ్రాహ్మణుఁడు తీర్థమునకు మరణార్థము పోవుచుండఁగా, రాజు ఆవృత్తాంత మెఱిఁగి వచ్చి, బ్రాహ్మణుని అతనిధనము పాఁతినచోటికి ఆనవాలు ఏమయిన కలదేమో అడిగెను. 'ఒకచిన్న మొక్క ఉండెను, దేవా, దానిక్రింద నేను ధనమును పాఁతితిని.' అని బ్రాహ్మణుఁ డనెను. అంతట రాజు 'ఆ ధనమునైన తెప్పించియిచ్చెదను, లేదా, నాబొక్కసమునుండి యైనను ఇచ్చెదను.' అని అతనితో చెప్పి, అతనిని చావునుండి మాన్పి వైశ్యునికి ఒప్పగించి, అంతఃపురమునకు పోయి తలనొప్పిమిషచేత ప్రతీహారునిచేత చాటింపు చాటించి వైద్యుల నందఱను పిలిపించి వారిని ఒకరొకరిని 'నీ రోగులు ఎందఱు? ఎవరికి ఏమి యౌషధము ఇచ్చినాఁడవు?' అని యడిగెను. వారును ఉన్నది యున్నట్లు చెప్పిరి. ఆవరుసలో ఒకవైద్యుఁడు 'దేవా, నేను మాతృదత్తుఁ డను వైశ్యునికి అడవిబీఱ యను నౌషధిని నిన్న ఇచ్చితిని.' అని చెప్పెను. రాజు ఆ వర్తకుని పిలిపించి 'ఎవనిచేత అడవిబీఱను నీవు తెప్పించుకొంటివి?' అని యడి

గను. 'నాసేవకునిచేత' అని యతఁడు చెప్పెను. వెంటనే ఆ సేవకుని పిలిపించి రాజు వానిని 'ఓరీ, అడవిబీటకోసము చెట్టు క్రింద త్రవ్వినప్పుడు దొరకిన దీనారరాశి బ్రాహ్మణద్రవ్యము, దానిని తెచ్చి అప్పగింపుము.' అనెను. వాఁడు ఒప్పుకొని ఆ దీనారములను వెంటనే తెచ్చి అచటఁ బెట్టెను. రాజు ఉపవాసియై యున్న యా బ్రాహ్మణునికి బహిశ్చర ప్రాణములనుం బోలె నష్టలబ్ధము లయిన యా దీనారములను ఇచ్చెను. ఈప్రకారము రాజు చెట్టుక్రిందినుండి హరింపఁబడిన ధనమును బుద్ధిప్రభావముచేత ఆచోట ఆ యోషధి మొలచు నని యెఱిఁగిన వాఁడై తెప్పించినాఁడు.

ఇట్లు సర్వదా బుద్ధియే ప్రధానము. పౌరుషమును బుద్ధి జయించును. ఇట్టి కార్యములయందు పరాక్రమమువలన ఏమి ప్రయోజనము? కనుక యోగీశ్వరా, నీవును ప్రజ్ఞచేత కళింగసేనయందు దోష మేమేని తెలియునట్లు చేయుము. ఈమెయందు సురాసురులు కూడ అనురక్తు లయి యున్నారు. అందుల కనుగుణముగానే రాత్రి నీవు ఎవనిదో శబ్దమును వింటివి. ఆమెయందు దోష మేమయిన అగపడిన మనకు చెఱుపు లేదు. ఆమెను రాజు వివాహ మాడఁడు. అధర్మము మనకు కలుగదు.—ఇట్లు మహామతి యైన యౌగంధరాయణునివలన విని యోగీశ్వరుఁడు సంతోషించి యి ట్లనియె:— 'నీతో నీతిలో సమానుఁడు బృహస్పతి తప్ప మఱి యెవఁడు? రాజ్య

వృక్షమునకు నీమంత్రము అమృతసేకము సుమా! నేను సదా కళింగసేనయొక్క వ్యాపారములను బుద్ధిచేతను శక్తిచేతను తెలిసికొనెద.' అని యోగీశ్వరుఁడు మంత్రిని వీడ్కొనెను.

ఆసమయమందు ఆమె మేడలయందు విహరించుచున్న వత్సరాజును తనమేడనుండి చూచి తపించుచు అతనిమీఁదనే మనస్సు నిలిపి, మదనతాపశాంతికై తామరతూండ్ల యంగదములను చందనచ్ఛరలను తాల్చి, కాలము గడపుచుండెను. ఈలోపల పూర్వము ఆమెను చూచి మదనశరములకు పాలయిన మదనవేగుఁడు ఆమెకై తపస్సు చేసి శంకరునివలన వరము పొందియు, ఆమె అన్యాసక్తయు అన్యదేశస్థయు అగుటచేత ఆమెను సులువుగా పొందలేకుండెను. అందువలన అతఁడు సమయము వేచి రాత్రులయందు ఆమెమందిరము మీఁద తిరుగుచుండి ఒకనాఁడు రాత్రియందు శంకరుని యాదేశమును స్మరించుకొని తనవిద్యచేత వత్సేశరూపము తాల్చి ఆరూపమున ఆమెయింట ప్రవేశించినాఁడు. దౌవారికులు మంత్రుల కాలక్షేపము నోర్వక వచ్చిన వత్సరాజునుగాఁ దలంచి యతనిని నమస్కరించి లోపలికి పోనిచ్చిరి. కళింగసేనయు 'ఇతఁడు వత్సరాజు కాఁడు' అనియుంబోలె తనభూషణములు మ్రోఁగుచున్నను, అతనికి లేచి సత్కారములు సలిపెను. అంత వత్సరాజరూపమున ఆమెను నమ్మించి మదనవేగుఁడు గాంధర్వవిధానముచేత వివాహ మాడెను. ఆసమయములో సౌగ

మహిమచేత అలక్షితుఁడై యోగీశ్వరుఁడు ప్రవేశించి వత్స రాజునే చూచినట్లు భ్రమపడి, వెంటనే యౌగంధరాయణునికి చెప్పి, అతనియాజ్ఞచేత పోయి వాసవదత్తయొద్ద వత్సరాజును చూచి, మంత్రివరుఁడు నేర్పినప్రకారము కళింగసేనయొద్ద నిద్రించుచున్న ప్రచ్ఛన్నకాముకుఁడైన మదనవేగునియొక్క నిజ రూపమును నిద్రాసమయములో చూచెను. ఆదివ్యపురుషుని పాదములయందు ధూళి లేదు, ఛత్త్రధ్వజాంకము లుండెను; అతఁడు నిద్రచేత అంతర్హిత మయిన విద్యయొక్క పీరరూప వివర్తమో యన నుండెను. వెంటనే బ్రహ్మరాక్షసుఁడు సంతో షముతో యౌగంధరాయణుని యొద్దకు పోయి 'మిత్త్రమా, మాబోంట్లకు ఏమియు తెలియదు, నీవు సర్వమును నీతికంటితో చూతువు. అసాధ్య మయిన యీప్రభుకార్యము నీమంత్రముచే సిద్ధించినది. సూర్యుఁడు లేక యేమి యాకాశము? నీళ్లు లేక సరస్సేమి? మంత్రము లేక రాజ్య మేమి? సత్యము లేక మాట యేమి?' అని పలికెను.

అంత సంతోషించి యోగీశ్వరుని వీడ్కొని యౌగంధ రాయణుఁడు ప్రాతఃకాలమందు వత్సరాజునొద్దకు చనుదెంచి ప్రస్తావవశమున 'కళింగసేన విషయమై చేయవలసిన దే మ'ని రాజడుగఁగా ఇట్లనియె:—'రాజా, ఈమె మొదట ప్రసేన జిత్తును చూచుటకు స్వచ్ఛందముగా వచ్చినది, ముసలివాఁ డని యతనియందు విరక్తయై రూపలోభముచేత నీయొద్దకు

వచ్చినది. అట్లే అన్యపురుషసంగము కూడ చేయఁగలదు.' ఆమాటకు రాజు 'ఈమె కులకన్య, ఇట్లేల చేయును? నా యంతఃపురములో ప్రవేశించుటకు శక్తి యెవనికిఁ గలదు?' అనెను. యౌగంధరాయణుఁడు 'దేవా, ఈరాత్రియే రమ్ము నీకే ప్రత్యక్షము చేసెదను దివ్యపురుషులు సిద్ధాదులు ఆమెను కామింతురు దివ్యులగతిని ఆటంకపఱచుట మనుష్యుల తరమా? నాతో కూడ వచ్చి స్వయముగానే చూడుము' అనెను. రాజు ఆరాత్రియే అతనితోఁ గూడ పోవుటకు నిశ్చయించుకొనెను. అంత మంత్రి పోయి వాసవదత్తతో 'దేవీ, పద్మావతి తప్ప మఱి నీకు సవతి ఉండ దని నీతో నేను చేసిన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొంటిని.' అని కళింగసేనా వృత్తాంతమంతయు చెప్పెను. ఆమెయు 'నీవు నేర్పినట్లు నేను నడచుకొన్నందుఃఫలము సుమా ఇది.' అని అతనికి నమస్కరించెను. పిమ్మట అర్ధరాత్రమప్పుడు సకలజనులు నిద్రించుచుండఁగా రాజు యౌగంధరాయణునితోఁ గూడ కళింగసేన మందిరమునకు పోయి, అలక్షితముగా ప్రవేశించి, అచట కళింగసేన ప్రక్కను నిద్రించుచున్న మదనవేగుని చూచి యతనిని చంపనుంకించుడు మదనవేగుని విద్య అతనిని మేలు కొలిపెను. అతఁడు మేలుకొని ఆకాశమున నెగిరి పోయెను. ఆక్షణమందే కళింగసేనయు మేలుకొని శూన్యశయనమును చూచి, 'ఏమి! వత్సేశుఁడు ఈదినము ముందు మేలుకొని నిద్రించుచున్న నన్ను

వదలిపోయినాఁడు.' అని పలికెను. ఆమాట విని యౌగంధ రాయణుఁడు రాజుతో 'దేవా, నీరూపమును దాల్చి ఈదివ్య పురుషుఁడు ఈమెను ధ్వంసముచేసినాఁడు! ఈవృత్తాంతమును యోగబలముచేత నెఱిఁగి నీకు సాక్షాత్తుగా చూపితిని. దివ్యుఁడు గావున ఇతనిని చంపుటకు శక్యముగాదు.' ఇట్లు పలికి అతఁడు రాజుతోఁగూడ ఆమెయొద్దకు పోయెను. కళింగసేనయు వారిని చూచి సత్కరించి 'రాజా, ఇంతలో ఎచటికి పోయి మంత్రిని తోడ్కొని వచ్చితివి?' అని యడిగెను. 'కళింగసేనా, ఎవఁడో వత్సరాజరూపమును దాల్చి మోసముచేసి నిన్ను పెండ్లియాడెను. మాయేలిక నిన్ను పెండ్లియాడ లేదు.' అని యౌగంధరాయణుఁడు పలికెను. ఆమాట విని ఆమె డెందాన బాణప్రహారము పొందినది వోలె కలంగి కన్నీళ్లు నించుకొని వత్సరాజుతో ఇట్లనియె: 'రాజా, దుష్యంతుఁడు శకుంతలను బోలె నన్ను గాంధర్వవిధిచేత పెండ్లియై మఱచినాఁడవు?' 'సత్యముగా నిన్ను నేను వివాహ మాడలేదు.' అని రాజు పలికెను. అంత రాజును యౌగంధరాయణుఁడు అచటినుండి రాజమందిరమునకు తోడ్కొనిపోయెను.

అంత కళింగసేన మందను బాసినలేడివోలె బంధులను బాసి విదేశగతయై సంభోగవిదలత్పత్త్రి ముఖాబ్జయు పరిక్షిప్త కబరీభ్రమరావళియు నై గజపీడిత పద్మినింబోని దై కన్యాత్వమును కోలుపోయి ఏయుపాయము లేక ఆకాశము

చూచి యిట్లనియెః— 'వత్సేశరూపమున ఎవఁడు నన్ను వివాహమాయెనో అతఁడు అగపడును గాక! అతఁడే నాకు కౌమారపతి.' అంత ఆకాశమునుండి హారకేయూరవిభ్రాజమానుఁడై దివ్యరూపుఁడైన యా విద్యాధరాధిపుఁడు అవతరించెను. 'నీ వెవరవు?' అని యామె యడుగఁగా 'ఓతన్వీ, నేను విద్యాధరాధిపుఁడను, నాపేరు మదనవేగుఁడు. నేను పూర్వము నిన్ను నీతండ్రియింటఁ జూచి నీకొఱకు తపస్సుచేసి, శివునివలన వత్సరాజానురక్తవనియు అతనిని నీవు పెండ్లియాడకముందే ఆరూపము తాల్చి నిన్ను నేను పెండ్లియాడవలసిన దనియు వరము పొంది, ఆప్రకారమే పెండ్లియైతిని.' శ్రవణమార్గమున చొచ్చిన యీవాక్సుధచేత కళింగసేనయొక్క హృదయాబ్జము కొంచెము సేదదేఱిన దాయెను. అట్లు మదనవేగుఁడు ఆమెను సంతోషపెట్టి హేమరాశి యిచ్చి సెలవు పుచ్చుకొని మరల వచ్చెద నని చెప్పి ఆకాశమార్గమున నిజధామమునకు పోయెను. ఆమెయు దివ్యాస్పద మయిన యాపతిమందిరము మనుష్యులకు చొరరానందునను తండ్రియింటిని కామముచే తాను వదలి వచ్చినందునను మదనవేగునియాను మతిచేత అచటనే వత్సరాజమందిరమందే నివసించియుండెను.

---

## ౮ - వ త రం గ ము.



అది మొదలు వత్సరాజు కళింగసేనయొక్క యనుపమ సౌందర్యమును స్మరించుచు ఒకరాత్రి కామతాపమును సైఁపలేక లేచి ఖడ్గహస్తుఁడై ఏకాకిగా ఆమె మందిరమునకుం బోయెను. ఆమెయు ఆయనకు ఆతిథ్యము సలిపెను. వత్సరాజు ఆమెను భార్యార్థము ప్రార్థించి, 'నేను పరస్త్రీని.' అని ఆమెచేత తిరస్కృతుఁడై 'నీవు మూఁడవపురుషుని పొందినదానవు, కనుక బంధకివి, నిన్నుఁ గూడిన నాకు పరదారగమన దోషము సంభవింపదు.' అనెను. కళింగసేన యిట్లనియె:—

రాజా, నీకొఱకు వచ్చిన నన్ను నీరూపము దాల్చిన విద్యాధరుఁడు మదనవేగుఁడు వివాహమయినాఁడు; ఆతఁడొకఁడే నాపతి. నేను బంధకి నెట్లు? బంధువులను లక్ష్యపెట్టక స్వేచ్ఛగా తిరుగు స్త్రీలకే ఇట్టి యాపదలు కలుగును; కన్యలమాట చెప్పవలయునా? నాసఖి దుశ్శకునము చూచి నన్ను నిషేధించినను నేను నీయొద్దకు దూతను పంపినందుల ఫల మిది. నన్ను బలిమిచే స్పృశించెద వేని ప్రాణములు వదలెదను. కులకన్యక భర్తృద్రోహము చేయునా? అందులకు నిదర్శనము వినుము.

### వణిక్సాధ్వీకథ.

పూర్వము ఇంద్రదత్తుఁ డని చేదిదేశపు రా జుండెను. ఆయన శరీరము భంగురమని శాశ్వతమయిన యశశ్శరీరము

కొఱకు పాపశోధనతీర్థమందు గొప్ప దేవాలయము కట్టించెను. ఆయన భక్తిరసముచేత ఆదేవాలయమును చూచుటకు పలువూఱు పోవుచుండెను. తీర్థస్నానముకొఱకు జనులెల్ల సదా అచటికి వచ్చుచుండిరి. ఒకనాఁడు అతఁడు తీర్థ స్నానార్థము వచ్చిన యొక వణిగ్భార్యను ప్రోషితభర్తృకను స్వచ్ఛకాంతిసుధాసిక్తయు చిత్రరూపవిభూషణయు నై విషమ నారాచుని జంగమ రాజధానియో నా వెలుంగుచున్న దానిని చూచెను. ఆమె పాదములు 'నీచే నేను విశ్వమును గెలిచెదను' అనుప్రీతితో పంచబాణుని యమ్ములపోనులజత కౌఁగిలించి కొన్నదో యన నొప్పుచుండెను. కంటి కగపడియు అగపడక మునుపే ఆమె రాజుహృదయమును హరించెను. అంత నతఁడు వివశుఁ డై రాత్రి ఆమెయింటికి వెదకుకొనిపోయి ఆమెను ప్రార్థించెను. 'నీవు రక్షకుఁడవు, పరదారాభిమర్శనము నీకు ధర్మము గాదు. హఠముచే నన్ను స్పృశింతువేని నేను తత్క్షణమే మృతిఁబొందెదను. వ్రతభంగము నోర్వను.' అని యామె తిరస్కరించెను. రాజు బలాత్కారముచేయ నుంకింప శీలభంగభయముచేత తత్క్షణమే ఆమె గుండె పగిలి చచ్చి పోయెను. అంత నతఁడు లజ్జితుఁ డై వచ్చిన దారినే పోయి ఆయనుతాపముచేత కొలఁది దినములలో మృతిఁబొందెను.

ఇట్లు కళింగసేన భయవినయములతో కథ చెప్పి వత్స రాజుతో ననియెను:—'కనుక నాప్రాణమును హరించునట్టి

యీ యధర్మము ను ఇచ్చ నుంపకు. ఆశ్రితురాలను నన్ను ఇచట నివసింపనిమ్ము. లేనియెడల నేను మఱియొకచోటికి పోయెదను.' కళింగసేనవలన ఈమాటలు పడి వత్సరాజు విరతుఁడై విచారించి ధర్మచింత గలిగి యిట్లనియె:—'రాజపుత్త్రీ, ఇచటనే భర్తతోఁగూడ స్వేచ్ఛగా నివసింపుము, భయపడకు. నిన్ను నేను ఏమియు అనను.' అని వత్సరాజు తనమందిరమునకు పోయెను. మదనవేగుఁడు ఆవృత్తాంతమును చూచుచునే ఆకాశమునుండి దిగి 'ప్రేయసీ, చక్కఁగా నడచుకొంటివి. అట్లు చేయవేని మేలు కలిగి యుండదు. నేను సహించియుండను.' అని యామెను బుజ్జగించి, ఆమెతో ఆరాత్రి గడపి అచటికే వచ్చుచు పోవుచు ఉండెను. కళింగసేనయు విద్యాధరేశ్వరుఁడైనపతిని బడసి మనుష్యమాత్రురాలయ్యును దివ్యభోగములనుభవించుచుండెను. వత్సరాజు ఆమెచింతను మాని మంత్రి మాటలు స్మరించుకొనుచు, దేవియు రాజ్యము కోశమును క్రొత్తగా లభించినట్లు సంతోషించి యుండెను. వాసవదత్తాదేవియు యౌగంధరాయణ మహామంత్రియు నీతికల్పత ఇట్లు ఫలింపఁగా సంతోషించి సుఖితులై యుండిరి.

## మదనమంచుకా జననము

పిమ్మట కొన్నాళ్లకు కళింగసేన గర్భము దాల్చెను. నల్లని చూచుకములుగల యామె యుత్తుంగ స్తనములు మషీముద్రాంకితము లైన కాముని నిధానకుంభములో యన వి

రాజిల్లుచుండెను. మదనవేగుఁడు 'కళింగసేనా, దివ్యుల మయిన మానియమము ఇది, మానుషగర్భము కలుగఁగానే మేము వదలిపోదుము. కణ్వాశ్రమమందు మేనక శకుంతలను వదల లేదా? నీవు పూర్వము అప్సరస వై యుండి నీదోషముచేత ఇంద్రశాపమువలన మనుష్యత్వము పొందితివి. అందుచేతనే పతివ్రత వయ్యును బంధకీశబ్దమును పొందితివి. నీకు పుట్టునట్టి శిశువును కాపాడుము, నేను నాధామమునకు పోయెదను. నన్ను ఎప్పుడు తలఁచుకొందువో అప్పుడు వచ్చెదను.' అని సాశ్రులోచనను కళింగసేనను ఓదార్చి సద్రత్నరాసులు ఇచ్చి ఆమె యందే చిత్తముంచి నియమమునకు కట్టుఁబడి తన చోటికి పోయెను.

కళింగసేనయు వత్సరాజుయొక్క భుజచ్ఛాయ నండ గాని, అపత్యాశను సఖినింబోలె అవలంబించి యుండెను.

ఈలోపల సాంగభర్తృప్రాప్తికై తన్నుఁగూర్చి తపస్సు చేసినరతీదేవికి అంబికాపతి యిట్లు వర మిచ్చెను.—'నీపతి నన్ను ఉల్లఘించినదోషమువలన నాచేత కాలిపోయి వత్స రాజగృహమందు నరవాహనదత్తుఁ డనుపేర యోనిజుఁ డయి జన్మించియున్నాఁడు. న న్నారాధించితివి గాన నీవు మనుష్య లోకమున అయోనిజవై పుట్టి సాంగుఁ డయినయతనిం గూడు దువు.' ఇట్లు 'శంకరుఁడు రతి కానతిచ్చి బ్రహ్మకు 'కళింగసేన కనెడుదివ్యసంభవుని హరించి వానిచోట బదులుగా ఈరతిని

దివ్యతనువును ఉడిపి మానుషకన్యను చేసి యుంపుము.' అని ఆజ్ఞాపించెను. ఈ యీశ్వరాజ్ఞను శిరమున వహించి బ్రహ్మ పోఁగానే కళింగసేన ప్రొద్దులు పొచ్చి ప్రసవించెను. వెంటనే బ్రహ్మ అలక్షితముగా తనమాయచే ఆశిశువును హరించి దాని చోట రతికన్యను ఉంచెను. ఆమెకాంతిచేత వాసగృహము వెలుంగసాగెను. రత్నదీపశిఖాశ్రేణులు ఆకాంతికి ఓడి ఆ లజ్జ చేతనుంబోలె వెలవెలఁబోయినవి. సాటిలేని యాకన్యను చూచి కళింగసేన పుత్త్రిజన్మోచితమునకంటె ఎక్కువ యుత్సవము చేసెను. కళింగసేనకు అట్టికూఁతురు పుట్టినవార్తను వత్స రాజు దేవీమంత్రియుతముగా విని ఈశ్వరచోదితుఁడై దేవితో యౌగంధరాయణుఁడు వినుచుండ ని ట్లనియె:— 'కళింగసేన దివ్యాంగన, శాపముచేత ఈలోకమున పడినది. ఈమెయందు పుట్టిన యీ యద్భుతరూప కూడ దివ్యయే, ఈకన్య రూపమున నాకుమారునికి తగినది, అతనికి పట్టపుదేవి కాఁదగియున్నది.' వాసవదత్త యనియె: 'మహారాజా, ఏమి నీవు ఆకస్మికముగా ఇట్లు పలికితివి? కులద్వయవిశుద్ధుఁడు నీకుమారుఁ డెక్కడ? బంధకీగర్భసంభవ కళింగసేనా తనయ యెక్కడ?' ఆమాట విని రాజు ఆలోచించుకొని 'నేను ఇట్లు స్వయముగా చెప్పలేను, ఎవరో నానోటఁ జొచ్చి యిట్లు పలికించినట్లు తోఁచుచున్నది. ఈకన్య నరవాహనదత్తునికొఱకే నిర్మింపఁబడినదని యాకాశ మునుండి నాకు అశరీరవాణి వినఁబడుచున్నట్లున్నది. కళింగ

సేన కులకన్య, ఏకపత్ని, ఈమెకు పూర్వకర్మవశముచేత బంధకీ శబ్దము కలిగినది.' అనెను అంతట యౌగంధరాయణుఁడు పలికెను:—'దేవా, మదనుఁడు కాలిపోఁగా రతి మరల అతనిఁ బడయుటకై శివునిఁగూర్చి తపస్సుచేయుటను వినియున్నాము గదా; మర్త్యలోకమున సశరీరుఁడయి యవతరించిన కామునికే మర్త్యభావగతయై భార్యయగునట్లు రతి శివునివలన వరము పొందినది. నీకుమారుఁడు కామావతారమని పూర్వమే దివ్యవాణి పలికినది గదా. కనుక రతియు హరాజ్ఞచేత మనుష్యకన్యగా అవతరింపఁబోలును. మంత్రసాని నాతో నిట్లు రహస్యముగా చెప్పినది: 'నేను కళింగసేనశిశువును ముందు గర్భశయ్యలో నుండఁగా చూచితిని, వెంటనే అది లేని దానిని మఱి యొకటిని చూచితిని, ఆ యాశ్చర్యమును నీతో చెప్పితిని.' ఇట్లు ఆ స్త్రీ చెప్పినది. నీకును ఈ ప్రతిభ కలిగినది. కనుక దేవతలు మాయచేత ఈరతిని అయోనిజాతను గర్భచౌర్యముచేత కళింగసేనాతనయనుగా నిర్మించినారు. ఈమె కామావతారుఁడయిన నీపుత్త్రుని భార్య. దీనినిగుఱించి ఈయక్షకథను వినుము.

కుబేరునికి విరూపాక్షుఁడని నియోగి యుండెను. అతఁడు లక్షనిధానములకు ప్రధానాధ్యక్షుఁడు. అతఁడు మథురాపురము బయట నున్న యొకానొక నిధానమునకు కదలని శిలాస్తంభమునుంబోలె ఒక యక్షుని కావలి యుంచెను. ఆనగరమందలి బ్రాహ్మణపాశుపతుఁ డొకఁడు ఒకనాఁడు నిధానమును

వెదక వచ్చెను. అతఁడు మనుష్యవసా దీపమును చేతిలో నుంచుకొని ఆస్థానమును పరీక్షించునప్పటికి అతనిచేతినుండి ఆదీపము నేలఁ బడెను. ఆలక్షణముచేత నతఁడు అచట నిధాన మున్నదని యెఱిఁగి తనచెలికాండ్రయిన యితర బ్రాహ్మణులును తానును దానిని త్రవ్వఁ దొడంగెను. ఆనిధానముయొక్క కావలివాఁడు యక్షుఁడు ఆవృత్తాంతమును విరూపాక్షునికి నివేదించెను. 'పోయి ఆ ముక్కడి ఖన్యవాదులను చంపుము.' అని కోపనుఁడు విరూపాక్షుఁడు యక్షుని కాజ్ఞాపించెను. అంత నా యక్షుఁడు పోయి వారి నందఱను చంపెను. ఆ వృత్తాంతము నెఱిఁగి కుబేరుఁడు కోపగించి విరూపాక్షుని 'పాపాత్ముఁడా, బ్రహ్మహత్య యేల చేయించితివి? దరిద్రులు లోభముచేత ఏమి చేయరు? వారిని నానా విఘ్నములచేత నివారింతురే గాని చంపుదురా? ఈపాపముచే మర్త్యయోని యందు జన్మింపుము.' అని శపించెను. ఆశాపముచే అతఁడు భూమిలో ఒక యగ్రహారికునికి కుమారుఁడై పుట్టినాఁడు. అంత నతనిభార్య యక్షిణి కుబేరునితో 'దేవా, నాభర్తను ఎక్కడ పాఱవైచితివో, నన్నును అక్కడనే పాఱవైవుము, కరుణింపుము, అతనిఁబాసి నేను బ్రదుకలేను.' అని మొఱ పెట్టుకొనెను. వైశ్రవణుఁ డిట్లనియె:— 'నీభర్త యొక బ్రాహ్మణునియింటఁ బుట్టియున్నాఁడు, నీవు అతని దాసియింట అయోనిజవుగానే పడుదువు. అట నీకు భర్తతోఁగూడ సంగమ

మగును. నీదయచేత అతఁడు శాపము తీఱి నాయొద్దకు వచ్చును.' ఇట్లు కుబేరుఁడు ఆదేశింపఁగా ఆపతివ్రత ఆదాసి యింటిద్వారమున మానుషకన్య యై పడెను. ఆకస్మికముగా అద్భుతాకార మైన యాకన్యను చూచి దాసి తనద్వార మైన యాబ్రాహ్మణునికి తెలిపినది. ఆయన 'అది ఎవతో దివ్యకన్యక, నిస్సందేహముగా అయోనిజ; ఇట్లు నాయంతరాత్మ చెప్పు చున్నది. దానిని నీవు నిశ్శంకముగా కొనిరమ్ము. ఆమె నా కొమరునకి తగినభార్య యని తలంచుచున్నాను.' అని దాసితో పలికి సంతోషించెను. క్రమముగా ఆకన్య అచట ఎదుగు చుండెను. విప్రకుమారుఁడును ఆకన్యయు అన్యోన్యరక్తు లై భార్యాభర్త లై జాతిస్మరులు కాకపోయినను విరహమును దాఁటిరి. కాలక్రమమున పతి దేహన్యాసము చేయఁగా ఆమె అనుగమనము చేసెను. ఆపుణ్యముచేత దోషము తీఱి అతఁడు మరల తన పదమును పొందెను.

ఈప్రకారము దోషము లేక దివ్యులు దైవనిర్మాణము వలన కారణవశమున అయోనిజులుగా పుట్టుదురు. ఈమె కళింగసేనాసుతగా దైవముచేత నిర్మింపఁబడినది, నీకుమారునికి భార్య కాఁదగినది. యౌగంధరాయణుఁ డిట్లు పలుకఁగా వత్స రాజును వాసవదత్తాదేవియు సరియే యని యంగీకరించిరి. పిమ్మట మంత్రిముఖ్యుఁడు ఇంటికి పోఁగా రాజు స్నానాది క్రీడలలో ఆదినము భార్యాన్వితుఁ డై గడపెను.

పిమ్మట కాలక్రమముగ కళింగసేనకూఁతురు మోహము చేత తనపూర్వజన్మవృత్తాంతమును మఱచి రూపసంపదతో ఎనుగుచుండెను. మదనవేగునికూఁతు రగుటచేత ఆమెకు మదన మంచుక యని తల్లియు లోకులును పేరిడిరి. నిశ్చయముగా ఆమె సకలేతర వరాంగనలయొక్కయు రూపమును బడసి యుండెను, కాదేని ఆమెయెదుట వారు విరూపలు ఎట్లయిరి? ఆమెరూపమును విని ఒకనాఁడు కౌతుకముచేత వాసవదత్తా దేవి ఆమెను తనయొద్దకు రప్పించుకొనెను. అచట ధాత్రీముఖా సక్తయయిన యీమదనమంచుకను రాజును యౌగంధరాయ ణాదులును వర్త్యాసక్తయైనదీపశిఖనుఁ బోలె చూచిరి. అదృష్ట పూర్వమును నేత్రామృతము నయిన యీమె నెమ్మేని సొబగు చూచినట్టి యెవరు రతియే ఆరూపమున భూమిలో నవతరించిన దని తలంపకుండిరి? అంతట వాసవదత్తాదేవి లోకనేత్రోత్సవుని తనకుమారుని నరవాహనదత్తుని కూడ అక్కడికి రప్పించెను. వెలుఁగుచున్న యీ మదనమంచుకను అతఁడు ఫుల్లముఖాంభో జాతుఁడై పద్మాకరము క్రొత్త సూర్యప్రభనుంబోలె వీక్షించెను. ఆమెయు లోచనానందుని అతనిని వికచాననయై చూచుచు అమృతకిరణుని చూచుచకోరివోలె తనివినొంద దాయెను. అది మొదలు వారిద్దఱును బాలు రయ్యును దృష్టిపాశబద్ధులో యన ఒకరిని బాసి యొకరు ఉండ నేర రయిరి. కాలక్రమమున వత్సరాజు వారిసంబంధము దేవనిర్మితమే అని నిశ్చయించు

కొని వివాహప్రయత్న మారంభించెను. కళింగసేన ఆవృత్తాంత మెఱింగి నరవాహనదత్తునియందు జామాతృభావముచే సంతో షించెను.

నరవాహనదత్తుండు యువరా జగుట.

అంతట రాజు మంత్రులతో ఆలోచించి కుమారునికి తన మందిరమువంటి దొకమందిరము కట్టించెను. కాల మెఱింగి సంభారము కూర్చి కుమారునికి యౌవరాజ్యపట్టాభిషేకము చేసెను. ముందుగా కుమారునిమూర్ధమందు తల్లిదండ్రుల యానందబాష్పములు రాలెను, పిమ్మట శ్రౌతమహామంత్ర పూత మయిన తీర్థోదకము పడెను. అతని వదనపంకజము అభి షేకజలముచే క్షాళితము కాఁగా దిక్కులముఖములు కూడ నిర్మలము లయినవి. మంగల్యమాల్యపుష్పములను అతని మీఁద తల్లులు వైవఁగా తత్క్షణమే దివికూడ దివ్యమాల్య వృష్టిని గురిసెను. దేవదుందుభినాదస్పర్ధచేతనుం బోలె ఆనంద తూర్యనిర్హ్రాద ప్రతిధ్వానములు ఆకాశమున విజృంభించినవి. అభిషిక్తుఁ డయిన యువరాజును అచట ఎవఁడు నమస్కరింప లేదు? అతనిప్రభావముమాత్రము నమస్కరింపలేదు: అది యప్పుడే గదా ఉన్నత మయినది. అప్పుడు వత్సరాజు యువ రాజునకు మంత్రులనుగా అతనిబాలమిత్రము లయిన తన మంత్రి కుమారులను నియమించెను. యౌగంధరాయణుని సుతుని మరుభూతిని మంత్రిని గాను, రమణ్వంతుని కుమా

రుని హరిశిఖుని సేనాపతినిగాను, వసంతకసుతుని తపంతకుని క్రీడాసఖునిఁగాను, ఇత్యకునికుమారుని గోముఖుని ప్రతీహారినిగాను, పూర్వోక్తులైన పింగళికాసుతులను పురోహితునియన్న కుమారులను వైశ్వానరశాంతిసోములను పురోహితులనుగాను, నియమించెను. ఈప్రకారము కుమారునికి సచివులను రాజు ఏర్పఱుపఁగానే ఆకాశమునుండి పుష్పవృష్టిపూర్వకముగా ఈవాక్కు వినవాయెను:—' ఈమంత్రులు ఇతనికి సర్వార్థసాధకులగుదురు. గోముఖుఁడితనికి ఏకశరీరముగా నుండును. ఆకాశవాణి యిట్లు పలుకఁగా వత్సరాజు సంతోషించి, వారినందఱను వస్త్రాభరణములొసఁగి సమ్మానించెను. అపుడు రాజు అనుజీవులకు అర్థమును వర్షించుచుండఁగా దరిద్రశబ్దమునకు మాత్రమే అర్థసంగతి లేకపోయెను. గాలికి కదలుచున్న జెండా వస్త్రములచేత పిలువఁబడినవారువలెె ఆసమయమునందు నర్తకీచారణులు వచ్చి పురమెల్ల నిండియుండిరి. అల్లుఁడు కాఁగల నరవాహనదత్తుని వైద్యాధరలక్ష్మియో యన కళింగసేన ఆయుత్సవమునకు వచ్చెను. అమెయు వాసవదత్తయు పద్మావతియు ముగ్గురును చేరి మూఁడుశక్తులుంబోలె హర్షముచే నృత్యము చేసిరి. అపుడు గాలికి ఆడుచున్న తీఁగలుగల వైయచటి యుద్యానవృక్షములు కూడ నృత్యము చేసినవి, చేతనములమాట చెప్పవలయునా? అభిషేకానంతరము నరవాహనదత్తుఁడు విజయగజము నారోహించి ఊరేఁగ వెడలెను. పుర

స్త్రీలు నీలాబ్జపద్మాంజలులఁబోలె తమ నీలసితారుణదృష్టులను అతనిపై చల్లిరి. నరవాహనదత్తుఁడు ఇట్లు ఊరేఁగి వంది మాగధులు పొగడుచుండ తనమందిరము ప్రవేశించెను. అచట కళింగసేన అతనికి దివ్యములైన పానభోజ్యములను తన యైశ్వర్యమున కెక్కువగా సిద్ధము చేసెను జామాతృస్నేహముచేత ఆమె యతనికిని అతని మంత్రులకును అతని భృత్యులకును దివ్యాభరణ వస్త్రములు సమర్పించెను. ఈరీతిగా మహోత్సవములచే అమృతాస్వాదముచేతనుంబోలె వత్సరాజాదులకు ఆదినము ఆనందమయముగా జరిగెను.

మదనమంచుకోద్వాహము.

రాత్రి రాఁగానే కళింగసేన కౌమారితవివాహమును నెఱవేర్పఁదలఁచినదై సోమప్రభను తలఁచుకొనెను. ఆమె తలఁచిన మాత్రమున, మహాజ్ఞాని నలకూబరుఁడు సోమప్రభతో 'ప్రియా, ఇప్పుడు నిన్ను కళింగసేన ఔత్సుక్యముతో తలఁచుకొనుచున్నది. నీవు పోయి ఆమెకొమారితకై దివ్యోద్యానమును నిర్మింపుము.' అని పలికి, ఆమెయొక్క భూతభావి వృత్తాంతము సర్వము తెలిపి, వెంటనే పంపెను. ఆమెయు వెంటనే వచ్చి, చిరోత్కంఠచేత కంఠాలింగనము చేసిన కళింగసేనను కుశల మడిగి యిట్లనియె:— సఖీ 'మహాభాగుఁడు విద్యాధరుఁడు నిన్ను పెండిలి యయినాఁడు. శివానుగ్రహముచేత రతీదేవి నీకొమారితగా అవతరించి యున్నది. ఈమె వత్సేశ్వరునివలన

జన్మము పొందిన కామావతారుఁడైన నరవాహదత్తుని భార్య. అతఁడు విద్యాధరరాజ్యమును ఒక దివ్యకల్పము ఏలును. అతని యితరభార్యలు ఈమెయాజ్ఞను శిరమునఁ దాల్చి సన్మానింతురు. నీవు ఇంద్రశాపమువలన భూలోకమునఁ బుట్టిన యప్సరసవు, మిగత కార్యములను నెఱవేర్చి శాపమోక్షమును పొందుదువు. జ్ఞాని నాభర్త ఇదంతయు నాకు చెప్పినాఁడు. చింతిల్లకుము. నీకు ఇఁకను సమస్తము శుభమే. నేను నీకొమారితకొఱకు ఒక దివ్యోద్యానమును నిర్మించెదను. అట్టిది పాతాళములోఁగాని స్వర్గములోఁగాని భూమిలోఁగాని మఱియొకటి యుండదు.' ఇట్లని ఆమె తనమాయచే దివ్యోద్యానమును సృజియించి సోత్కంఠయైన కళింగసేనయొద్ద సెలవు పుచ్చుకొని వెడలి పోయెను.

తెల్లవాఱఁగానే జనులు ఆయుద్యానమును చూచి నందనవనమే మయిన భూమికి వచ్చినదా యని తలంచిరి. ఆ సంగతి విని వత్సరాజు సభార్యాసచివముగా నరవాహదత్తుని తోను పరివారముతోను అచ్చటికి వచ్చెను. వారు సదాపుష్ప ఫలద్రుమమును నానామణిస్తంభకుడ్య భూభాగవాపికమును సువర్ణవర్ణ విహంగమంబును దివ్యసౌరభమారుతము నైన యాయుద్యానవనమును దేవాజ్ఞవలన భూమి నుద్భవించిన స్వర్గాంతరమువంటిదానిని చూచిరి. రాజు 'ఇదేమి?' అని కళింగసేనను అడిగెను. వారికి ఆతిథ్యము చేయ త్వరపడుచు

ఆమె యిట్లనియెః—'రాజా, విశ్వకర్మ యొక్క యవతారము మయుఁ డని మహాసురుఁడు కలఁడు. అతఁడు ధర్మరాజున కొక పురమును ఇంద్రుని కొకపురమును కట్టినాఁడు. అతనికి సోమప్రభ యని కూఁతురు కలదు. ఆమె నాసఖి; ఆమె రాత్రి యిచటికి నన్ను చూడవచ్చి నాకొమాఁతకొఱకు ఈయుద్యానమును తనమాయచేత నిర్మించినది.' ఇట్లు పలికి చెలి చెప్పిన భూతభవిష్యద్వృత్తాంతము నంతయు చెప్పెను. కళింగసేన వచనము సమాధానపడఁగా అందఱును సంశయము తీఱి సంతోషించిరి. ఆదినమును ఉద్యానములోనే కళింగసేనాతిథ్యములో వత్సరాజు భార్యాపుత్రాదిసమేతుఁడై గడపెను.

నరవాహనదత్తునికి విద్యాప్రాప్తి.

మఱునాఁడు రాజు దేవదర్శనార్థము పోయి గుడిలో సువస్త్రాభరణ లయిన స్త్రీలను పలువురను చూచి మీ రెవ రని యడిగెను. 'మేము విద్యలము, వీరు కళలు, నీ కుమారుని కొఱకు వచ్చినారము. పోయి అతనియందు ప్రవేశించెదము.' అని పలికి వారు అంతర్హిత లయిరి. దానిని చూచి వత్సరాజు ఆశ్చర్యపడి ఇంటికి పోయి వాసవదత్తాదేవికిని మంత్రితతికిని ఆవృత్తాంతమును చెప్పెను. ఆ దేవతానుగ్రహమును విని వా రందఱు సంతోషించిరి. అంతట రాజాదేశమున వాసవదత్త వీణను గ్రహించెను. ఆసమయమందే అచటికి నరవాహనదత్తుఁడు వచ్చెను. ఆమె వాయించుచుండఁగా పుత్త్రుఁడు

వినయముతో వీణ స్థానము తప్పిన దని పలికెను. అంతట రాజు అతనినే వాయింపు మనెను. అతఁడు వాయించి గంధర్వులకుఁ గూడ ఆశ్చర్య మొదవించెను. ఈప్రకారము తండ్రిచేత సర్వవిద్యలయందును కళలయందును పరీక్షితుఁడై ఆ పరీక్షాసమయమునందే ఆవిద్యలను కళలను అన్నిటిని అతఁడు పొందిన వాఁ డాయెను.

పుత్త్రుని సగుణునిగా నెఱింగి వత్సరాజు కళింగసేనాతనయను మదనమంచుకను నృత్యము నేర్పించెను. ఆమె చంద్రమూర్తివలె పూర్ణకళ యయినకొలఁదియు నరవాహనదత్త సముద్రము క్షోభిల్లసాగెను. ఆమె నృత్యము చేయుచు పాడుచు నుండఁగా నరవాహనదత్తుఁడు అంగాద్యభినయవృత మయిన కామాజ్ఞను చదువుచున్న దానింబోలె చూచి సంతోషించెను. ఆమెయు సుధామయుఁడైనయాకాంతుని చూడదేని ప్రాతఃకాలమందు మంచునఁ దొప్పదోఁగిన కుముదినివలె బాష్పపూరితలోచనయై యుండెను. ఆమెమోమును చూడక క్షణమయినను ఉండలేక నరవాహనదత్తుఁడు ఆమెయుద్యానమునకు పోయెను. అచ్చట కళింగసేన ప్రీతితో మదనమంచుకను అతని చెంతకుఁ దెచ్చి అతనిని రంజిల్లఁజేసెను. ప్రభుచిత్తజ్ఞుఁడయినగోముఖుఁడు ప్రభువు అచటనే చాల సేపు ఉండునట్లుగా కళింగసేనకు ఈకథ చెప్పసాగెను. అతని యింగితజ్ఞానమునకు రాజపుత్త్రుఁడు మిగుల సంతోషించెను. చిత్రజ్ఞతయే గదా

ప్రభువశీకరణము. నరవాహనదత్తుఁడు ఆ యుద్యానమందలి సంగీతశాలలో మదనమంచుకకు నృత్యాది విద్యలను నేర్పుచుండెను. చారణవరు లెల్ల లజ్జపడునట్లు ఆమెను ఆడించుచు సకల వాద్యములు వాయించుచుండెను. నానాదిక్కులనుండి వచ్చిన గజాశ్వరథశస్త్రాస్త్రచిత్రపుస్తాదికోవిదు లయిన పండితవరుల నందఱను జయించుచుండెను. విద్యలచే స్వయముగా వరింపఁబడి యట్లు విహరించుచున్న యా నరవాహనదత్తునికి బాల్యదినములు గడచిపోయినవి.

దుష్ట స్త్రీల చర్యలు.

ఒకనాఁడు రాజపుత్త్రుఁడు ప్రియాసమన్వితుఁడై మంత్రులతోఁగూడ నాగవన మను నుద్యానమునకుఁ బోయెను. అచట ఒక వణిగ్భార్య గోముఖుని కామించి నిరాకృతయై అతనిని చంపుటకు విషము కలిపిన పానకము తెచ్చెను. ఆదోషము నతఁడు దాని చెలివలన తెలిసికొని ఆ పానకమును పుచ్చుకొనక స్త్రీలను ఇట్లు నిందించెను:—అహో! బ్రహ్మదేవుఁడు ముందు సాహసమును సృజించి పిమ్మట స్త్రీలను సృజించెను! వీరికి స్వభావముచేత అసాధ్య మేమియు లేదు. నిశ్చయముగా స్త్రీ యనునది అమృతముతోను విషముతోను చేయఁబడినది; అనురక్త యయినయెడల అమృతము, విరక్త యయిన విషము. కాంతవదనయు ప్రచ్ఛన్నపాతకయు నగు కులస్త్రీ గూఢనక్రయయిన పద్మినివలె ఎవనికి ఎఱుకపడును? గుణచక్రప్రబోధి

నియు భర్తృశ్లాఘాసహాయు నగు మంచియిల్లాలు దివినుండి సూర్యునిప్రభవోలె అవతరించును. పరానురక్తయు భర్తృవిరక్తయు నగు పాపాత్మురాలు విరాగ మనువిషము గలదై పామువోలె భర్తను చంపును.

ఒకగ్రామములో శత్రుఘ్నుఁ డని యొకఁ డుండెను. అతనిభార్య వ్యభిచారిణి. అతఁ డొకనాఁడు సాయంకాలమున ఇంట భార్య జారునితోఁ గూడియుండఁగా చూచి వానినికత్తితో కొట్టి రాత్రి వచ్చునంతకు భార్యను నిరోధించి ద్వారములో నుండెను. ఆసమయమున బసకొఱకు ఒకబాటసారి వచ్చెను. అతఁడు అతనికి చోటిచ్చి అతనితోడ్పాటుతో యుక్తిగా ఆ పరదారకాముకశవమును రాత్రి అడవికి కొనిపోయి అంధకూపములో వేసెడిక్షణములో అతని భార్యయు వెనుకనుండి వచ్చి యతనిని ఆకూపములోనికే త్రోసెను. ఈప్రకారము దుష్టస్త్రీలు ఏ మేమి సాహసములు చేయరు? ఇట్లని బాలుఁ డయ్యును గోముఖుఁడు దుష్టస్త్రీచరితమును నిందించెను.

అంత నరవాహనదత్తుఁడు నాగవనములో నాగులను స్వయముగా పూజించి సపరివారముగా ఇంటికి పోయెను. అచట మఱునాఁడు అతఁడు గోముఖాదిమంత్రులను రాజనీతిసారాంశమును గుఱించి, తాను చక్కఁగా ఎఱిఁగియు వారి సామర్థ్యము నెఱుఁగఁగోరి, ప్రశ్నచేసెను. 'నీవు సర్వజ్ఞుఁడవు, అయినను, అడిగితివి గావున చెప్పెదము.' అని వారు ఒకరితో

నొకరు కలియఁబలికికొని యిట్లని రాజనీతిసారమును చెప్పఁ దొడంగిరి.

రా జ నీ తి సా ర ము.

రాజు ముందుగా ఇంద్రియాశ్వములను వశీకరించి వానిపై నెక్కి కామక్రోధాద్యాభ్యంతరశత్రువులను జయించి తన్నే మొదట జయింపవలయును. అట్లు చేసిన అన్యులను జయించును. తన్ను తాను జయింపలేనివాఁడు ఇతరుల నెట్లు జయించును? పిమ్మట జానపదత్వాదిగుణములు కలమంత్రులను, అథర్వజ్ఞుఁడు దక్షుఁడు తపస్వియు నగు పురోహితుని, ఏర్పఱుచుకొనవలయును. భయలోభధర్మములయందు యుక్తిచేత పరీక్షితు లయినయమాత్యులను తారతమ్యము లెఱిఁగి కార్యములందు నియోగింపవలయును. వారి సత్యవచనము ద్వేషప్రయుక్తమో స్నేహప్రయుక్తమో వారి రహస్యసంభాషణలచేత కనుంగొనవలయును; సత్యమునకు సంతోషింపవలయును; అసత్యమును యథార్థముగా దండింపవలయును. వారిచరిత్రను ప్రత్యేకముగా చారులవలన సదా తెలిసికొనుచుండవలయును. ఈప్రకారము కన్నులు మూసికొనక కార్యాకార్యములను చూచుచు రాజు కంటకులను పెల్లార్చి కోశదండాదుల నుపార్జించి బద్ధమూలుఁడు గావలయును. ఉత్సాహ ప్రభుతా మంత్ర శక్తులు గలిగి స్వపరాంతరమును విచారించుకొని పరదేశమును జయింప నుద్యోగింపవలయును. ఆప్తులు శ్రుత

వంతులు ప్రాజ్ఞులు నగువారితో భవిష్యత్తునుగుఱించి మంత్రా లోచన చేసి వారు నిశ్చయించినదానిని స్వబుద్ధిచేత సర్వమును పరిశోధింపవలయును. సామ దానా ద్యుపాయజ్ఞుఁడై యోగ క్షేమము వహించి సంధివిగ్రహాదు లగు నాఱు గుణములను ప్రయోగింపవలయును. ఈప్రకారము ప్రాల్మాలిక లేక స్వదేశ పరదేశములను గుఱించి చింతించుచుండు రాజు విజయమునే పొందును గాని ఎప్పుడును అపజయము పొందఁడు. తెలియని వాఁడు కామలోభాంధుఁడై తప్పుదారులను చూపుమోసపు సేవకులమూలముగా గోతులలోఁ బడి కొల్లఁబోవుచున్నాఁడు. ధూర్తులు చుట్టుకొనియున్న రాజుకడకు, కృషీవలులు వెలుగు కట్టిన వరికడకుంబోలె, ఇతరులకు ప్రవేశ ముండదు. వారు రహస్యములలో ప్రవేశించి రాజును వశ్యుని చేసికొందురు. అంతట సిరి ఖిన్నురాలై తారతమ్య మెఱుఁగని యతనినుండి అవలికి వడిగా పోవును. కనుక రాజు ఉచితముగా దండించు వాఁడై జితాత్ముఁడై తారతమ్యజ్ఞుఁడు కావలయును. ప్రజాను రంజనముచేత అతఁడు సిరికి పాత్రము.

## శూ ర సే న రా జు.

పూర్వము శూరసేనుఁ డనునొకరాజు భృత్యులు ఎట్లు చెప్పిన నట్లు చేయువాఁడు ఉండెను. అతనిని సచివు లందఱు ఒకకట్టుగా వంచించి ఉపజీవించుచుండిరి. అతని సేవకులకు మంత్రులు అతఁడిచ్చిన్న ను తృణ మాయినను ఇయ్యకుండిరి. తమ

సేవకులకు మాత్రము స్వయముగా ఇచ్చుచుండిరి. అతనికి విన్నపించి అయోగ్యులకు ఇప్పించుచుండిరి. ఆకట్టును చూచి రాజు ప్రజ్ఞచేతను యుక్తిచేతను వారిని భేదించెను. అంతట వారు ఖిన్నులై ఒకరిమీఁద నొకరు కొండెములు చెప్పి వదలిపోఁగా, ఇతరులచేత మోసపోక రాజు రాజ్యమును చక్కఁగా పాలించుచుండెను. హరిసింహుఁ డని రాజొకఁడు సామాన్యుఁడుండెను. అతఁడు తనయందు భక్తు లయిన విద్వాంసులను మంత్రులనుగాఁ జేసికొని, దుర్గము అర్థరాశియు కలవాఁడై ప్రజలను అనురక్తులను గావించికొని క్రమముగా రాజ్యము చేయుచుండెను. అతనిమీఁదికి చక్రవర్తులు వచ్చినను అతఁడు పరాభవము పొందఁడాయెను. ఇట్టి విచారమును చింతయు రాజ్యములో సారము. ఇంతకన్న నెక్కుడు ఏమి యున్నది?—ఇట్లు పలికి గోముఖాదులు విరమించిరి. నరవాహనదత్తుఁడు వారి యీ మాటను అంగీకరించి పురుషయత్నము చింత్య మయినను దైవము అచింత్య మని పలికెను.

మానసవేగుఁడు.

అనంతరము యువరాజు వారితోఁగూడ లేచి తాను తామసించినందుకై ఉత్కంఠితయై యున్న ప్రియతమను మదనమంచుకను చూచుటకు పోయి ఆమెమందిరమునందు మహాస్థానము నలంకరింపఁగానే కళింగసేన ఆశ్చర్యపూర్వకముగా గోముఖునితో నిట్లనియె:— నరవాహనదత్తుఁడు రానుండున

ఉత్సుకయై మదనమంచుక ఇతనిమార్గమును చూచుటకు మేడమీఁదికి పోయెను. నేనును పోయితిని. అంతట మింటి నుండి ఒకపురుషుఁడు దిగినాఁడు. కిరీటమును ఖడ్గమును గల యతఁడు నాతో నిట్లనియె:— 'నేను మానసవేగుఁడను, విద్యాధరేశ్వరుఁడను; నీవు సురభిదత్తయనునప్సరసవు, శాపము చేత భూలోకమున పుట్టితివి. నీ యీకొమారిత దివ్యాంగన. నీకొమారితను నాకిమ్ము. ఇది సమానసంబంధము గదా.' అంత నేను, నవ్వి యిట్లు పలికితిని: 'మీ కందఱకు చక్రవర్తికాఁ గలనరవాహనదత్తునికి ఈకన్నెను భార్యనుగా దేవతలు నిర్మించినారు.' ఇట్లు నేను పలుకఁగానే నాపుత్త్రినేత్రములకు వెఱ గొల్పు నకాలంపు మెఱపువోలె నతఁడు ఆకాశమున కెగిరి అదృశ్యుఁడాయెను. ఆమాట విని గోముఖుఁడు పలికెను:'ఈ మాయేలిక తమభవిష్యత్ప్రభువని అంతరిక్షవాణివలన విని అప్పుడే విద్యాధరులు ద్రోహము నెంచిరి. ఉచ్ఛృంఖలుండయిన యెవఁడు బలియగు ప్రభువును ఇచ్ఛగించును? అప్పుడే వారినుండి శంభువు ప్రమథులచేత ఇతనిని రక్షింపించెను. ఇట్లని నారదులవారు చెప్పినట్లు మానాయన చెప్పుచుండఁగా వింటిని. కనుక ఇప్పుడు విద్యాధరులు మాకు శత్రువులు.'

## వి వా హ య త్న ము.

కళింగసేన తనవృత్తాంతమునకు భయపడి 'అట్లయిన వారు మాయచేత నన్నుఁబోలె మదనమంచుకను వంచింపక

ముందే రాజపుత్త్రుఁడు ఏల యామెను పెండ్లియాడఁడు?' అని యడిగెను. గోముఖాదులు 'నీవే ఈ విషయములో వత్స రాజును ప్రేరింతువుగాక.' అనిరి. ఆదినము నరవాహనదత్తుఁడు తదేకాగ్రదృష్టిగా మదనమంచుకను చూచుచు ఆయుద్యానము లోనే విహరించుచుండెను. వికసితపద్మాననయు ఉన్మీలత్కువల యేక్షణయు బంధూకకమనీయోష్ఠియు మందారస్తబకస్తనియు శిరీషసుకుమారాంగియు నై మదనమంచుక త్రైలోక్యవిజ యార్థము మన్మథుఁడు చేసికొన్న పంచపుష్పమయిన యొక్కటి కోలయో యన నొప్పుచుండెను.

మఱునాఁడు కళింగసేన వత్సరాజుతో సుతావివా హార్థము విన్నవించెను. రాజు ఆమెను వీడ్కొని మంత్రులను పిలిపించి వాసవదత్తాదేవియెదుట ఇట్లనియె:— 'కళింగసేన కౌమారితవివాహమునకై త్వరపడుచున్నది. ఏమి చేయుదము. ఉత్తమురాలిని ఈమెను లోకులు బంధకి యనుచున్నారు. లోకమును సర్వదా అనుసరింపవలయును. పూర్వము రామ భద్రుఁడు శుద్ధ నయినను జానకిని లోకాపవాదముచేత త్యజింప లేదా ? భీష్ములవారు తమ్మునికై తాము హరించిన యంబను అంతకు పూర్వము ప్రతీపుఁ డనువానిని వలచుటచేత అన్య పూర్వికా యని త్యజింపలేదా ? ఈప్రకారము ఈకళింగసేన ముందునన్ను స్వయముగా వరించిన దయ్యును మదనవేగునికి భార్యయయిన దని ఈమెను లోకులు నిందింతురు. కనుక నర

వాహనదత్తుఁడు ఈమె కౌమారితను తనకు తగినట్టి దానిని స్వయముగా గాంధర్వవిధిచేత వివాహమాడును.' వత్సరాజు ఇట్లు వచింపఁగా యౌగంధరాయణుఁడు పలికెను:—'ఓ ప్రభూ ఈయనౌచిత్యమును కళింగసేన ఎట్లు సహించును? ఈమె దివ్యాంగన, ఏతుల కాదు; ఈమెకౌమారితయు దివ్యాంగన. ఇట్లని నామిత్త్రము బ్రహ్మరాక్షసుఁడు పలుమాఱు చెప్పినాఁడు.' ఈరీతిని వారు ఒండొరువులతో పలుకుచుండఁగా, ఆకాశము నుండి మహేశ్వరుఁడు ఇట్లు పలికెను:— ' అనలదగ్ధుఁ డయి యిచ్చట పుట్టినకాముఁడు నరవాహనదత్తుఁడు, ఇతనికై నన్ను తపస్సుచే మెప్పించిన రతిని మదనమంచుకగా నేను సృజించి నాఁడను. ఈమె సర్వాంతఃపుర ముఖ్యగా ఇతఁడు నాకృపచే శత్రువులను గెలిచి విద్యాధిరాధిరాజ్యమును ఒకదివ్యకల్పము ఏలును.' వత్సరాజు పరివారముతోఁగూడ—ఈ వాక్కును విని శంభునికి మ్రొక్కి కుమారునివివాహము విషయమై ఆనందముతో నిశ్చయము చేసికొనెను.

అంత రాజు సకలరహస్యమును ముందే ఎఱిఁగిన యా మంత్రిని గౌరవించి జోస్యులను రావించి శుభలగ్న మడిగెను. వారును సత్కృతులై వివాహలగ్నమును సమీపముగా నిర్ణ యించిరి. 'నీపుత్త్రుఁడు ఈభార్యతోడ స్వల్పకాలము వియో గము అనుభవించును. ఈవిషయమును మేము మాశాస్త్ర దృష్టిచే ఎఱుఁగుదుము.' అని వత్సరాజుతో గణకులు చెప్పిరి.

అంతట రాజు కుమారుని వివాహముకొఱకు తనవిభవమునకు తగినట్లు చేసిన ప్రయత్నముచేత అతనిపురము మాత్రమ గాక భూమండల మెల్లఁ గ్రక్కదలి పోయెను.

వి వా హ ము.

ముహూర్తము రాఁగా కోమార్తెకు తండ్రి యిచ్చిన దివ్యభూషణములను కళింగసేనయు సోమప్రభయు నైసేసిరి. దివ్యప్రతిసరము దాల్చి యా మదనమంచుక కార్తికానుగత యైన చంద్రమూర్తివలె ప్రకాశించెను. దివ్యాంగనలు శివాజ్ఞచే వచ్చి ఆమె రూపమునకు ఓడిన లజ్జచే దాఁగినవారువోలె అగపడకయే ఉండి వినఁబడునట్లు పాడి, మంగళ మాచరించిరి. 'ఓభగవతీ, గౌరీ, నీ విప్పుడు స్వయముగా వచ్చి రతీదేవి తపస్సును సఫలము చేసితివి.' అని దివ్యచారణవాక్యముల తోడి వాద్యధ్వానములు గౌరిని పొగడుచుండినవి. అంతట నరవాహనదత్తుఁడు కౌతుకము దాల్చినవాఁడై నానామహా వాద్యములు మ్రోఁగుచుండఁగా మదనమంచుక యున్న వివాహగృహమునకు పోయెను. అచ్చట వివాహమై ఆవధూవరులు అమలరత్నప్రదీప మైన వేదిని రాజులశిరోభూమినింబోలె ఆరోహించిరి. చంద్రమూర్తియు సూర్యుఁడును ఏకకాలమందు మేరువును వలగొందు రేని, వారు, అగ్నిప్రదక్షిణము చేయుచున్న యీవధూవరులకు లోకమున ఉపమానము అగుదురు. ఆసమయమందు వివాహమంగళ తూర్యనాదములను సుర

దుందుభిధ్వానములు ముంచినట్లు, వధూనిక్షిప్తము లయిన హేమమాలాజలను సురపుష్పవర్షములు ముంచినవి.

వివాహమహోత్సవమందు కళింగసేన అల్లునికి అరణము సమర్పించిన హేమరత్న రాసులను చూచి జనులు కుబేరునిం గూడ దరిద్రునింగా తలంచిరి; ఇతరదరిద్రరాజులమాట చెప్ప వలయునా ? వివాహానంతరము వధూవరులు అమలచిత్ర భక్తియు ప్రమదోపరుద్ధమును అగు లోకమానసమును అట్టిద యగు నభ్యంతరగృహమును ప్రవేశించిరి. వాహినీపరివృతు లయ్యును విశ్వవంద్య శౌర్యాశ్రితు లయ్యును ఉపాయనరత్న హస్తులయిన జితావనత నరేంద్రులచే వత్సరాజపురము సము ద్రులచేతనుంబోలె క్షణములో నిండెను. వత్సరాజు ఆవివాహ మహోత్సవములో అనుజీవులకు వెదచల్లిన బంగారముచేత అతనిరాష్ట్రములో గర్భస్థులు తప్ప మఱి అజాతరూపులు ఎవరును లే రయిరి. నానాదిగాగత వరచారణనర్తకీసమూహ ములవలన జీవలోకము స్తవ నృత్త గీత వాద్య ధ్వానమయ మై యుండెను. పౌరస్త్రీరచిత మండనాభరణ యయిన కౌశాంబీ నగరి వాతోద్ధూతపతాకా బాహులతమై ఆనందంబున నర్తించు చున్నదియుం బోలె నొప్పారుచుండెను.

ఈప్రకారము చిరకాలము ప్రతిదిన ప్రవర్ధమానముగా ఉత్సవము జరిగెను. బంధుమిత్రాశ్రితాదులు ఎల్లకోర్కులు తీఱి సంతోషించిరి.

యువరాజు నరవాహనదత్తుండు మదనమంచుకా సమేతుండై అభ్యుదయకాంక్షియై చిరకాంక్షితమయిన జీవలోకసుఖమును అనుభవించుచుండెను.

---

మదనమంచుకా లంబకము

సమాప్తము.



శ్రీ

# రత్నప్రభాలంబకము.

క. కేలీ కేశగ్రహణ వి
లోల శివాకరజదీప్తిలోకావృత యై
శూలధరుమౌళి యమృతక
రాలీయుతయట్టు లొప్పునది కాచు మిమున్.

## రత్నప్రభకథ.

ఈరీతిని వత్సరాజసుతుఁడు ప్రాణసమ యయిన మదన మంచుకను వివాహమై గోముఖాదిసచివులతోఁగూడ పూర్ణ మనోరథుఁడై సుఖ ముండెను. ఒకప్పుడు మత్తకోకిలలు కూయుచుండ, మలయమారుతుఁడు లతాతన్వులను ఆడించు చుండ, కొదమతుమ్మెదల సంగీతములు మ్రోఁగుచుండ, వసం తోత్సవమందు మంత్రులతోఁగూడ ఉద్యానవిహారమునకు పోయెను. అచట తిరిగి ఆకస్మికముగా వచ్చి యతని చెలికాఁడు తపంతకుఁడు హర్షోత్ఫుల్లలోచనుఁడై అతనితో నిట్లనియె:— 'యువరాజా, ఈచెంత ఎవతెయో కన్య ఆకాశమునుండి దిగి అశోకవృక్షముక్రింద నిలువఁగా చూచితిని. తనకాంతిచే దిక్కుల

వెలిఁగించుచున్న యీకన్యయే సఖీసమేత యై నాయొద్దకు వచ్చి నిన్ను బోడిరె మ్మనఁగా వచ్చితిని.' అంత నరవాహనదత్తుఁడు త్వరగా మంత్రిసమేతుఁ డై ఆమెను చూచుటకు ఆచెట్టునొద్దకు పోయి, అచట లోలలోచనమధువ్రతయు అరుణోష్ఠపల్లవయు పీనస్తనస్తబకవిరాజమానయు పరాగపుంజగౌరాంగియు ఛాయ చేతనే తాపహారిణియు నగు నాకాంతను ఉచితాకృతి దాల్చిన యుద్యానదేవతను బోలె చూచెను. అతనికి ఆదివ్యకన్య నమస్కరించెను. ఆమెరూపము అతనినేత్రములను అపహరించెను.

అందఱును కూర్చున్నపిమ్మట ఆమెను అతనిసచివులలో గోముఖుఁడు 'దేవీ, నీ వెవ తెవు? ఇచటి కేల వచ్చితివి?' అని యడిగెను. ఆమెయు దాఁటరానిమదనాజ్ఞచేత లజ్జ మాని నరవాహనదత్తునిముఖాంభోజమును అతివేలస్నేహస్రావి యగు కనుంగవతో పలుమాఱు ఓరచూపులు చూచుచు తన వచ్చిన వృత్తాంతము నిట్లు చెప్పసాగెను.

మూఁడు లోకములలోను ప్రఖ్యాత మయిన హిమవన్నగేంద్రము కలదు గదా. దాని యనేకశృంగములలో నొకటి గౌరీపతినివాస మగుకైలాసము కదా. ఆహిమవంతుఁడు భాస్వన్మణిప్రభామాలియు విలసత్తుహినద్యుతియు నై గగనాభోగము వలె కొంఁదికి మీఱి యున్నాఁడు. అతని సానువులు హరి ప్రసాదలభ్యములును జరామృత్యుభయచ్ఛేదకములును సిద్ధ

లకును ఓషధులకును ఆదికారణ మయి యున్నవి. అతఁడు విద్యాధర సమూహముల శరీరప్రభచే పసిమి మించు శిఖరముల చేత మేరుశృంగశోభను తిరస్కరించును. అందు కాంచనశృంగ మని బంగారపు నగర మొకటి కలదు. బహుయోజన విస్తీర్ణ మయిన యానగరములో పరమ మాహేశ్వరుఁడు హేమప్రభుఁడను విద్యాధరేశ్వరుఁడు ఉన్నాఁడు. ఆయనకు అనేక భార్యలలో ప్రియతమ అలంకారప్రియ యనునది చంద్రునికి రోహిణివలె నున్నది. ధార్మికుఁడయినయా రాజు ఆమెతో ప్రాతఃకాలమందు నిద్ర లేచి స్నానమాడి గౌరీసమేతుని మహేశ్వరుని పూజించి మనుష్యలోకమునకు నచ్చి ప్రతిదినము రత్నములతోడ లక్ష సువర్ణములను పేదబ్రాహ్మణులకు ఇచ్చును. అంతట మరలి పోయి రాజకృత్యములు నెఱవేర్చుకొని మునివలె వ్రతి యై భోజనాదికము చేయును. ఈ ప్రకారము కాలము గడచుచు నుండఁగా, అతనికి ఒకానొక కథ జ్ఞప్తికి రాఁగా, పుత్త్రుఁడు లేఁడన్నచింత కలిగెను. అందుచేత అతి దుర్మనస్కుఁ డయిన యతనిని అలంకారప్రభాదేవి దౌర్మనస్యకారణ మడిగెను. రాజు ఆమెతో ని ట్లనియె:—'దేవీ, నాకు సర్వసంపత్తి కలదు, పుత్త్రుఁడుమాత్రము లేఁడు; ఈదుఃఖము నన్ను బాధించు చున్నది. పూర్వము నేను విన్నసత్త్వవంతునికథ స్మరణకు రాఁగా నాకు ఈచింత కలిగినది.' 'ఆకథ యేమి దేవా?' అని దేవి యడుగఁగా రాజు చెప్పఁదొడఁగెను.

### సత్త్వశీలునికథ.

చిత్రకూటనగరమందు బ్రాహ్మణార్చన పరాయణుఁడు రాజు బ్రాహ్మణవరుఁ డని సార్థకనాముఁ డుండెను. అతనికి సత్త్వశీలుఁ డని జేత యయిన యుద్ధసేవకుఁడు ఒకభటుఁడు ఉండెను. అతఁడు నెలకు నూఱుసువర్ణములు జీతము పుచ్చుకొనుచుండెను. దానశీలుఁడును పుత్త్రహీనుఁడును అగుటచేత దానైకవినోదపరాయణుఁ డగు నాభటునికి ఆధనము చాలకుండెను. 'బ్రహ్మ నాకు వినోదకరుఁ డగు పుత్త్రుని ఈలేదు, దానవ్యసనమును మాత్రము ఇచ్చినాఁడు. సంసారములో త్యాగైకవ్యసనము కలిగి దరిద్రుఁడై పుట్టుటకంటె ఎండు చెట్టుగా పుట్టుట మేలు.' ఇట్లు నిత్యము ఆలోచించుచు ఒకప్పుడు ఉద్యానములో తిరుగుచుండఁగా అతనికి బంగారపు నిధి దొరకినది. అంత నతఁడు సేవకులను తోడ్కొనిపోయి గొప్పరత్నములతో వెలుంగుచున్న యాబంగారమును ఇంటికి కొనివచ్చి భోగము లనుభవించుచు బ్రాహ్మణులకు బంగారమిచ్చుచు భృత్యులకును మిత్త్రులకును ఉన్నది పెట్టుచు ఉండెను. దానిని కని దాయాదులు నిధిలాభమును ఊహించి రాజుతో పోయి చెప్పిరి. అంత రాజు ప్రతీహారునిచేత అతనిని పిలిపింపఁగా పోయి అతఁడు క్షణము రాజగృహాంగణములో ఒకచోట ఉండి చేత నున్న లీలావజ్రముష్టితో నేలను గీఱుచుండెను. అచట నతనికి రాగిబిందెలో మఱియొక గొప్ప

నిక్షేపము, ఇతని సత్త్వమునకు మెచ్చి, 'దీని నొసఁగి రాజును ప్రసన్నునిఁ జేసికొనుము' అని బ్రహ్మ యిచ్చినదియుంబోలె, దొరకెను. అతఁడు వెంటనే దానిని మట్టితోఁ గప్పి ప్రతీహారుని పిలుపున రాజసన్నిధికి పోయెను. రాజు అతనిని 'తెలిసినది మాకు, నీకు నిధి దొరకినది, దానిని తెచ్చి మాకు అర్పింపుము.' అని యడిగెను. 'ప్రభూ, మునుపటిదా ఇప్పటిదా? దేని నిత్తును?' అని సత్త్వశీలుఁ డడిగెను. క్రొత్తదానిని ఇమ్మని రాజు చెప్పఁగా అతఁడు పోయి రాజాంగణైకదేశమం దున్న యానిధిని అప్పగించెను. 'మొదటినిధిని నీవు యథేచ్ఛముగా ననుభవింపుము' అని రాజు క్రొత్తనిధికి సంతోషించి సెలవీయఁగా సత్త్వశీలుఁడు ఇంటికిఁ బోయి దానభోగములచేత నామము అన్వర్థము చేసికొనుచు, అపుత్త్రితాదుఃఖమును ఎట్లో మఱచియుండెను.— సత్త్వశీలుని యీకథ మునుపు విన్నది జ్ఞప్తికిరాఁగా నాకు పుత్త్రాభావదుఃఖము కలిగి నేను చింతించుచున్నాను.

## విక్రమతుంగునికథ.

అంతట దేవి యి ట్లనియె:—ఈప్రకారము సత్యముగా సత్త్వవంతులకు విధియే తోడ్పడును. సత్త్వవంతునికష్టములో రెండవనిధి దొరకలేదా ఏమి? నీవును నీసత్త్వప్రభావముచేత కోరికను పొందుదువు. ఇందులకు నిదర్శనముగా విక్రమతుంగుని కథను వినుము. భూదేవి కలంకారము పాటలీపురము

పూర్ణవర్ణవ్యవస్థానము లయిన యాయామంచిమణులతో నిండినది కలదు. అందు సత్త్వవంతుఁడు విక్రమతుంగుఁడను రాజు పూర్వము ఉండెను. అతఁడు యాచకులకు ఇచ్చుట యందును యుద్ధములో శత్రువులను తెగటార్చుటయందును ఎప్పుడును పరాఙ్ముఖుఁడు కాఁడు. ఆరాజు ఒకనాఁడు వేఁటకు అడవికి పోయి బిల్వహోమము చేయుచున్న బ్రాహ్మణు నొకని చూచి, అనుగఁగోరియును అతనియొద్దకు పోక వేఁటతమిచేత బలముతోఁగూడ దూరముగా పోయెను. అచట తానే చేతి తోఁ గొట్టఁగా నెగురుచు పడుచు ఉన్న మృగసింహములతో బంతులతోనుంబోలె చాలసేపు క్రీడించి, మరలి వచ్చుచు ఎప్పటివలె హోమము చేయుచున్న యాబ్రాహ్మణుని చూచి నమస్కరించి పేరును హోమప్రయోజనమును అడిగెను. బ్రాహ్మణుఁడు ఆశీర్వదించి ఇట్లనియె: 'నేను బ్రాహ్మణుఁడను, నాపేరు నాగశర్మ. హోమఫలము ఏ మనఁగా, ఈ బిల్వ హోమముచేత అగ్ని తనిసినయెడల బంగారపుబిల్వములు కుండమునుండి వెడలును. అంతట అగ్ని దేవుఁడు ప్రత్యక్షమై వర మిచ్చును. నేను చిర కాలమునుండి ఈ హోమమును చేయుచున్నాను. నాపుణ్యాల్పముచే ఇప్పటికిని అగ్ని దేవుఁడు తృప్తి నొందఁడు.' ధీరసత్త్వుఁడు రా జిట్లనియె:—'అటయిన నా కొకబిల్వ మిమ్ము. బ్రాహ్మణోత్తమా, ఇప్పుడే నేను అనలుని ప్రసన్నుని చేసెదను.' 'వ్రతస్థుఁడను పవిత్రుఁ

డను అయిన నాకుఁ గూడ ప్రసన్నుఁడు గాని యగ్నిదేవుని అప్రయత్నుఁడవు అశుచివి అగు నీవు ఎట్లు తనియించెదవు?' అని బ్రాహ్మణుఁ డడుగఁగా, రాజు 'అట్లు గాదు, ఒకబిల్వమును నా కిచ్చి, క్షణములో ఆశ్చర్యమును చూడుము.' అనెను. బ్రాహ్మణుఁడు రాజునకు కుతూహలముచేత ఒకమారేడుఁ బండు ఇచ్చెను. అంతట రాజు సత్త్వశుద్ధ మయిన మనస్సుతో 'ఓ యగ్నిదేవా, ఈఫలమును వేల్చినను నీవు తనియవేని నాతలను ఖండించి వేల్చెదను.' అని పలికి ఆబిల్వమును హోమముచేసెను. అంత నాకుండమునుండి యగ్నిదేవుఁడు సత్త్వవృక్షఫలమునుబోలె బంగారపు మారేడుపండును చేతఁ గొని వెడలి ప్రత్యక్షమై రాజుతో 'రాజా నీసత్త్వమునకు మెచ్చుకొంటిని, వర మడుగుము.' అనెను. మహాసత్త్వుఁడు రాజు నమస్కరించి 'ఓదేవా, నాకు వేఱే వర మేమి? ఈ బ్రాహ్మణునికి కోరినవర మిమ్ము.' అనెను. దేవుఁడు ప్రసన్నుఁడై యి ట్లనియె:—'రాజా, ఈ బ్రాహ్మణుఁడు మహాధనపతి కాఁ గలఁడు. నీవును నాప్రసాదముచేత అక్షయ మగు బొక్కసము గలవాఁడ వగుదువు.' ఇట్లు వర మిచ్చినవహ్నితో బ్రాహ్మణుఁడు విన్నపించుకొనుచున్నాఁడు.— 'ఓదేవా, స్వేచ్ఛావిహారికి ఈరాజునకు క్షణములో ప్రత్యక్ష మయితివి. నియమవ్రతములు సలుపుచున్న నాకు కాకుంటి వేమి?' అగ్నిదేవుఁడు పలుకుచున్నాఁడు:—'నేను దర్శన మీయనేని తీవ్రసత్త్వుఁడు ఈరాజు

నాయందు తన తలను వేల్చియుండును. తీవ్రసత్త్వునికి సిద్ధులు త్వరగా కలుగును. నీవంటిమందసత్త్వునికి చిరకాలమునకు కలుగును.' ఇట్లు పలికి అగ్నిదేవుఁడు అంతర్హితుఁడు కాఁగా, నాగశర్మ రాజును వీడ్కొని పోయి క్రమముగా మహాధనుఁడాయెను. విక్రమతుంగుఁడును తనసత్త్వమును చూచిన యను చరులపొగడ్తలు పొందుచు పాటలీపుత్రమునకు పోయెను.

అచట నుండఁగా నొకనాఁడు శత్రుంజయుఁ డనుప్రతీహారుఁడు అతనితో 'దేవా, దత్తశర్మ యను బ్రాహ్మణ బ్రహ్మచారి నీతో ఏకాంతమందు ఏమో విన్నపము చేకొన ద్వారమందు వేచి యున్నాఁడు.' అని విన్నవించెను. రాజు ప్రవేశపెట్టు మనెను. వటువు వచ్చి రాజునకు స్వస్తి పూర్వకముగా ప్రణతుఁడై కూర్చుండి విన్నవించెను: 'దేవా, నేను ఒకానొక భస్మముచేత రాగిని మేల్మిబంగారము చేయఁగలను; ఆయుక్తి నాకు గురువు ఉపదేశించినాఁడు. దానిని ప్రత్యక్షముగా ప్రయోగించి బంగారము చేసి చూచినాఁడను.' ఇట్లు వటువు పలుకఁగా రాజు రాగి తెప్పించి కరఁగింపించెను. అది కరఁగఁగానే అందులోపల వటువు చూర్ణము వేసెను. చూర్ణమును తామ్రములో పడక ముందే యక్షుఁడొకఁడు అదృశ్యుఁడుగా వచ్చి హరించెను. అగ్ని తనియించిన యారాజుమాత్రము వానిని చూచెను. చూర్ణము తగుల నందున తామ్రము బంగారము కాకుండెను. ఆ వటువు

మూఁడవమాఱులు మరల చూర్ణము చల్లెను. మూఁడు మాఱులును అతనిప్రయత్నము వ్యర్థ మాయెను. అంత ఖిన్నుఁ డయిన యావటువుచేతిచూర్ణమును కొని, తేజస్వివరేణ్యుఁ డయిన యారాజు స్వయముగా చల్లెను. ఈమాఱు చూర్ణమును యక్షుఁడు హరింపక నవ్వి పోయెను. దానిచేత ఆ తామ్రము బంగార మాయెను. ఆశ్చర్యపడి వటు వడుగఁగా రాజు యక్షవృత్తాంతమును తెలియఁజేసెను. అప్పుడే రాజు వటువువలన ఆచూర్ణయుక్తిని నేర్చుకొని అతనికి వివాహము చేయించి కృతార్థుని చేసెను. ఆయుక్తిచేత విస్తారము బంగారము చేసి బొక్కసము నిండించి బ్రాహ్మణులదారిద్ర్యమును పోఁగొట్టి అంతఃపురస్త్రీలతోఁ గూడ సకలభోగములను అనుభవించుచుండెను.

ఈప్రకారము భయపడినట్లు గాని సంతసించినట్లు గాని ఈశ్వరుఁడే తీవ్రసత్త్వుల యిష్టమును నెఱవేర్చును. దేవా, నీకంటె ధీరసత్త్వుఁడు దాతయు నెవఁడు? కనుక శంభుని నారాధింపుము, ఆదేవుఁడు నీకు పుత్త్రుని నిచ్చును, శోకింపకుము.

ఇట్లు ఉదారముగా అలంకారప్రభాదేవి పలుకఁగా విని హేమప్రభమహారాజు అంగీకరించి గౌరీశారాధనచేత నిక్కముగా కుమారుఁడు కలుగు నని ఉత్సాహముతో హృదయమున నమ్మి మఱునాఁడు దేవితోఁగూడ స్నానముచేసి శంకరారాధన చేసి తొమ్మిదికోట్ల సువర్ణములను బ్రాహ్మణులకు దానము చేసి

పుత్త్రార్థము శివుని మ్రోల 'దేవుఁడు తుష్టుఁడైనఁ గావలయును, నాదేహ మైన పోవలయును.' అని నిశ్చయించుకొని నిరాహారుఁడై తపస్సు చేసి గౌరీపతిని ఇట్లు స్తుతించెను.—

'సృష్టిస్థిత్యంతకారకుఁడ వయిన దేవా, నీకు నమస్కారము. అష్టమూర్తీ, గిరీశా, నీకు నమస్కారము. సతతోత్ఫుల్లహృదయకమలశాయీ, విశుద్ధమానస నివాసికలహంసా, శంభూ, నీకు నమస్కారము. దివ్యప్రకాశా, అత్యద్భుతా, క్షీణదోషదృశ్యా, సోమా, నీకు నమస్కారము. సామేన చెలువను దాల్చినవాఁడా, కేవలబ్రహ్మచారీ, ఇచ్ఛానిర్మిత విశ్వా, విశ్వాత్మా నీకు నమస్కారము.' మూఁడు దినము లుపవసించి ఇట్లు స్తుతించిన రాజునకు గౌరీపతి స్వప్నములో ఇట్లు ఆనతిచ్చెను:— 'లే రాజా, లే, నీకు వంశకరుఁ డగు కుమారుఁడు కలుగును, గౌరీప్రసాదముచేత ఉత్తమురాలు కన్యయు కలుగును. మీకు చక్రవర్తి కాఁగల తేజోనిధి నరవాహనదత్తునికి ఆకన్య దేవి యగును.' ఇట్లు పలికి శివుఁడు అంతర్హితుఁడాయెను. ఆస్వప్నమును రాజు దేవికి చెప్పెను. దేవియు అట్లే తనకు స్వప్నములో గౌరి వర మిచ్చె నని రాజునకు చెప్పెను.

అనంతరము కొన్నిదినములకు అలంకారప్రియాదేవి గర్భము దాల్చెను. మధుగంధియు లోలనేత్రాళియు పాండుప్రభము నైన యామెముఖపంకజము చూచి రాజు మిగుల సంతోషము పొందెను. ఉత్కృష్టము లయిన గర్భదోహద

ములచేత గొప్పవాఁడు జన్మించు నని ముందే సూచించిన దై యలంకారప్రియ యథాకాలముగా దివి సూర్యునిం బోలె తనయునిఁ గనియెను. పుట్టిన యా శిశువు దేహకాంతిచేత పురుటిల్లు సిందూరమువలె ఎఱ్ఱవాఱెను. శత్రుగోత్ర భయావహుఁడయిన యాతనయునికి తండ్రి దివ్యవాణ్యాదేశమున వజ్రప్రభుఁడని పేరుపెట్టెను. ఆకుమారుఁడు కులసముద్రము వర్ధిల్లునట్లుగా పార్వణచంద్రునివలె కళలతో నిండి ఎదుగుచుండెను.

హేమప్రభునిదేవి మరల గర్భవతి యాయెను. సగర్భయై ఆశ్రయజాత మయినవిశేషకాంతికలదై హేమాసనాసీన యై ఆమె అన్వర్థముగా అంతఃపురరత్నముగా నుండెను. విద్యచే కల్పింపఁబడినపద్మవిమానము నెక్కి గర్భదోహదము తీఱునట్లు అప్పుడప్పుడు ఆకాశమున విహరించుచుండెను. యథాకాలముగా ఆమె కన్యను గాంచెను. ఆకన్యకు గౌరీప్రసాదము వలనఁ బుట్టిన దనుటకన్న వర్ణన మేమి చేయఁగలము? ఆ సమయమందు ఆకాశమునుండి 'ఈమె నరవాహనదత్తునికి భార్య కాఁగలదు' అని వాక్కు వినఁబడి పూర్వము శిప్రుఁ డిచ్చిన యానతికి సరిపడియుండెను. రాజు మహోత్సవములు చేసి ఆమెకు రత్నప్రభ యని పేరుపెట్టెను. రత్నప్రభయు తనవిద్యల చేతనే చిత్తసంస్కారము పొంది తండ్రియింటనే ఉండెను. ఆమెప్రకాశము మాత్రము దిగంతములకు వ్యాపించెను.

అనంతరము రాజు కుమారునికి కవచము దాల్చు వయస్సు రాఁగా వివాహము చేసి యౌవరాజ్యపట్టాభిషేకము చేసి అతనికే రాజ్యభారము అప్పగించి సుఖముగా నుండెను. సుతావివాహచింత యొకటి ఆయన నాశ్రయించెను. పెండ్లి యీడు వచ్చిన యాకన్యను ఒకనాఁడు తండ్రి తనయొద్ద కూర్చుండఁగాఁ జూచి చెంతనున్న దేవితోననియె: 'దేవీ, చూడు, కులమున కలంకార మయినను మూఁడులోకములలోను గొప్ప వారికి కూడ కన్య యనునది గొప్పచింతకు కారణమై యున్నది. విద్యావినయరూపయౌవనసంపన్న యయ్యును రత్నప్రభ వర ప్రాప్తి లేక నాకు చింత కలిగించుచున్నది.' దేవి యిట్లనియె: 'మనకు చక్రవర్తి కానున్న నరవాహనదత్తునికి ఈమె భార్య యగు నని దేవతలు పలికిరి గదా, అతనికి ఏల ఈయరాదు?' రాజు చెప్పెను:— 'మంచిదే, అతనిని పొందుకన్య ధన్యురాలు. అతఁడు, కామునియవతారము, ఇంకను అతనికి దివ్యత రాలేదు; అతనివిద్యాప్రాప్తిని నే నెదురు సూచుచున్నాను.' తండ్రి పలికినయీపలుకులు మదనునిమోహనమంత్రపదములో యన వీనులఁ జొరఁగా రత్నప్రభ నరవాహనదత్తైకచిత్త యై భ్రమ గొన్న దానివలె గ్రహావిష్టవలె నిద్రించిన దానివలె వ్రాసిన బొమ్మవలె నయి, ఎట్లో తల్లిదండ్రులకు ప్రణమిల్లి తన యంతఃపురమునకు పోయి చింతాక్రాంత యై ఎట్టకేలకు నిద్రపోయెను. ఆమెకు స్వప్నములో గౌరి వచ్చి యిట్లనె

యాన తిచ్చెను:—'రేపు శుభదినము, ప్రాతఃకాలమందే నీవు కౌశాంబికి పోయి నీవరుని నరవాహనదత్తుని చూచి రమ్ము. అంత నతనిని నీతండ్రి యిచటికి తెచ్చి మీకు వివాహము చేయును.' ఆమెయు మేలుకొని కలను తల్లికి నివేదించి తల్లి యనుజ్ఞ నడసి తనవిద్యాప్రభావముచే అతఁడు ఉద్యానములో నుండుట యెఱిఁగి అతనిం జూడ బయలువెడలెను. ఆర్య పుత్రా, నేనే ఆరత్నప్రభను. నిను వలచి యుత్సుకనై క్షణములో వచ్చితిని. ఇటుపైని మీకు తెలియును.

రత్నప్రభా వివాహము.

అమృతముకంటె మధురమైన యీవచనము వినియు, నేత్రపీయూష మగు నయావిద్యాధరిసొబగును కనియు, నరవాహనదత్తుఁడు మనస్సులో బ్రహ్మను, 'ఇతఁడు నన్ను అంతయు శ్రోత్రనేత్రమయునిఁగా ఏల చేయలేదు?' అని నిందించెను. ఆమెతో నిట్లనియె: 'ఓలతాంగీ, నీవు నన్ను స్నేహముచేత వెదకుకొని వచ్చినందున నేను ధన్యుఁడను.' ఇట్లు వారు అన్యోన్యనూతన ప్రేమచే సల్లాపించుచుండఁగా ఆకస్మికముగా ఆకాశమున విద్యాధరసైన్యము అగపడెను. అంత 'ఆహా, నాయన కూడ వచ్చినాఁడా!' అని రత్నప్రభ పలుకుచుండఁగా, హేమప్రభుఁడు తనయునితో ఆకాశమునుండి దిగి వచ్చెను. నరవాహనదత్తుఁడు వారిని స్వాగతము అడిగెను. వారు అన్యోన్యసంభావనంబు లాచరించి యచట క్షణ ముండునంతలో ఆ

వృత్తాంతము నెఱింగి వత్సరాజు మంత్రులతోఁగూడ వచ్చి యతిథిసత్కారములు సలిపెను. అంతట వత్సరాజునకు హేమ ప్రభుఁడు రత్నప్రభ చెప్పిన వృత్తాంతమునే చెప్పి, 'ఈమె యిచటికి వచ్చుట నేను నా విద్యాప్రభావముచేత నెఱిఁగి వచ్చితిని. చక్రవర్తి విమానము ఇతని యెదుట త్వరలోనే నిలువఁగలదు. అనుజ్ఞ యిమ్ము. ఇతనిని తోడ్కొని పోయెదను. ఇతనిని శీఘ్రముగానే రత్నప్రభావధూసమేతునిఁగా చూచెదవు.' అని వత్సరాజును వేఁడుకొని అనుజ్ఞ పొంది తనపుత్త్రునితోఁ గూడఁ తనవిద్యచేత విమానమును కల్పించి అందు రత్నప్రభా సమేతునిఁగా నరవాహనదత్తుని గోముఖాదులతోఁగూడఁ గూర్చుండఁ బెట్టుకొని యౌగంధరాయణునిచేతను తండ్రిచేతను వీడుకోలు వడసిన యానరవాహనదత్తుని కాంచనశృంగకమను తన పురమునకు కొనిపోయెను. అచట నరవాహనదత్తుఁడు అల్లుఁడైన తన మీఁద ప్రేమచే చాఁచియున్న చేతులతో నన కిరణనికరములతో నొప్పుచున్న యామామగారి నగరిని సువర్ణ ప్రాసాదభాసురను చూచి సంతోషించెను. అచట నతనికి రత్నప్రభను హేమప్రభుఁడు హరికి లక్ష్మిని సముద్రుఁడువోలె ఇచ్చి వివాహము చేసెను. ఇఁక జరుగనున్న యతని పెక్కు వివాహముల యగ్నిలో యన రాజిల్లురత్నరాసులను అల్లునికి అరణ మొసంగెను. ఆమహోత్సవమందు ఆతఁడు సర్వత్ర ధనములను వర్షించుచుండఁగా ఇండ్లు కూడ జెండాలచేత లబ్ధ

వస్త్రములుగా నగపడెను. నరవాహనదత్తుఁడును వివాహ మంగళము సమాప్తిఁ జెందఁగా రత్నప్రభాదేవితో దివ్యభోగము లనుభవించుచు అచటనే యుండెను. ఆమెయొక్క విద్యా ప్రభావముచే ఆమెతో ఆకాశమున సంచరించుచు దివ్యోద్యాన వాపీ దేవాలయములను చూచుచు క్రీడించుచుండెను.

ఈరీతి నతఁడా విద్యాధరాధిపుని నగరమందు భార్యా సమేతుఁడై కొంతకాల ముండి యౌగంధరాయణుని హెచ్చరిక చేత నిజనగరమునకు పయన మాయెను. అత్తగారు ప్రయాణ మంగళము జరుపఁగా మామతోను బావమఱఁదితోను ఆ విమాన మెక్కి వధూసమేతుఁడై వచ్చి తన ప్రవేశమునకొఱకు పట్టరాని సంతోషముతో వత్సరాజు ఉత్సవమయముగా చేసి యున్న నిజనగరము చేరి తల్లికనుదోయిలో అమృతవర్షము గురిసెను. వధూసమన్వితుఁడై వచ్చి పాదములకు ప్రణమిల్లిన తనయుని చూచి వత్సరాజు పరమానందభరితుఁడై సంబంధిని హేమప్రభుని అతని కుమారుని వజ్రప్రభుని తనవిభవమునకు తగినట్లు సమ్మానించెను. అంతట విద్యాధరరాజు వత్సరా జాదులను ఆమంత్రించి కుమారునితోఁగూడ ఎగిరి ఆకాశ మార్గమున నిజనగరమునకు పోయెను. నరవాహనదత్తుఁడు రత్నప్రభతోను మదనమంచుకతోను సుఖముగా ఆదినమును తన చెలికాండ్రతోఁ గూడి గడపెను.

———

## ౨ - వ తరంగము.



ఈ ప్రకారము విద్యాధరిని రత్నప్రభను వివాహమయి ఆమె మందిరమందు ఆమెతో నున్ననరవాహనదత్తుని దర్శింప గోముఖాదిమంత్రులు మఱునాఁడు ప్రాతఃకాలమునందు వచ్చిరి. వారిని ద్వారపాలకురాలు క్షణము ఆఁపి నరవాహనదత్తునికి తెలియఁజేసి అతనియాజ్ఞచేత ప్రవేశపెట్టెను. అంతట రత్నప్రభ ద్వారపాలికతో నిట్లనియె:— ' వీరు వచ్చునప్పుడు ఇఁక ఆటంకము చెప్పవలదు. ఆర్యపుత్త్రుని చెలికాండ్రు వీరు మాకు స్వశరీరము. అంతఃపురములో ఇట్టికాపుదల నాకు ఇష్టము కాదు. ' దౌవారికితో ఇట్లని ఆమె పతితో నిట్లనియె:— ఆర్యపుత్త్రా, ప్రస్తావవశమున చెప్పెదను వినుము: స్త్రీలకు అంతఃపురరక్షణము నీతిమాత్ర మని నాభావము. దానిని ఈసువలనఁగాని అజ్ఞానమువలనఁగాని ఆచరించుచున్నారు. దానివలన ఏప్రయోజనమును లేదు. కులస్త్రీలకు శీలమే రక్షకము. చపలమతులను రక్షించుటకు బ్రహ్మయు సమర్థుఁడు గాఁడు. ఱాగినవానిని నదిని స్త్రీని నియమించుటకు ఎవని తరము ? అందులకు నిదర్శనముగా ఈకథను విన్నుము.

### రత్నాధిపతి చపలభార్యలకథ.

సముద్రమధ్యను రత్నకూట మని గొప్పద్వీపము కలదు. అందు మహోత్సాహుఁడు పరమవైష్ణవుఁడు రత్నాధిపతి

యని యన్వర్థనాముఁడు రాజుండెను. ఆరాజు భూమి నంతయు జయించుటకును ఎల్లరాజులయు కొమారితలను భార్యలనుగా పొందుటకును విష్ణువును గూర్చి తపస్సు చేసెను. భగవంతుఁడు ఆతపస్సునకు మెచ్చి ప్రత్యక్షమై అతనితో 'రాజా, లే లెమ్ము, సంతోషించితిని. నేను చెప్పెదను వినుము. కళింగదేశములో ఒకానొక గంధర్వుఁడు మునిశాపమున శ్వేతరశ్మి యను పేర తెల్లయేనుఁగై పుట్టియున్నాఁడు. పూర్వజన్మతపస్సిద్ధియోగము చేతను నాయందలిభక్తిచేతను ఆగజము జ్ఞానియు ఆకాశ గామియు జాతిస్మరము నై యున్నది. నాయాజ్ఞచేత అది ఆకాశ మార్గమున వచ్చి నీకు వాహనము అయ్యెడిని. ఇంద్రుఁడు ఐరావతముఁబోలె నీవు ఆ తెల్లగజము నెక్కి ఏయేరాజుమీఁదికి పోదువో ఆయారాజు ముందుగా నాచేత నే స్వప్నములో ఆజ్ఞాతుఁడై మహానుభావునికి నీకు కన్యాదానవ్యాజమున కప్ప మిచ్చును. ఈప్రకారము సర్వభూమిని జయింతువు, ఎనుబదివేల మంది రాజకన్యలు నీకు లభింతురు.' ఇట్లు పలికి విష్ణువు అంతర్హితుఁడు కాఁగా, రాజు పారణ చేసి మఱునాఁడు ఆకాశమున వచ్చినయాశుభగజమును చూచి విష్ణువునానతిచొప్పున దానిని ఎక్కి పృథివి నంతయు జయించి రాజకన్యలను ఎనుబదివేల మందిని స్వీకరించి తెచ్చి వారితో రత్నకూటములో యథేచ్ఛము విహరించుచు ఉండెను. శ్వేతరశ్మి యను నాదివ్యగజమునకు

శాంత్యర్థము అతఁడు ప్రతిదినము ఏనూఱుగురు బ్రాహ్మణులకు భోజనము పెట్టుచుండెను.

ఒకనాఁడు ఆరాజు ఆయేనుగు నెక్కి ద్వీపాంతరములు తిరిగి తనద్వీపమునకు వచ్చెను. అచ్చట దిగుచుండగా ఏనుఁగు తలను దైవవశమున గరుడవంశభవ మయిన పక్షి యొకటి ముక్కుతో పొడిచెను. రాజు తీక్ష్ణాంకుశముతోఁ గొట్టఁగా పక్షి ఎగిరిపోయెను. ముక్కుపోటునకు ఏనుఁగు మూర్ఛిల్లి కూలెను. రాజు దిగినపిమ్మట ఏనుఁగు మూర్ఛ తేరియు లేపినను లేవలేక అదిమొదలు మేఁతమాని ఐదుదినములు అటనే పడియుండెను. రాజు దుఃఖితుఁడై భోజనము మాని 'ఓ లోకపాలురారా, ఈ సంకటములో నాకు ఉపాయము చెప్పుఁడు, చెప్పరేని నాతలను ఇప్పుడు ఖండించి మీకు బలి ఒసంగెదను.' అని పలికి తల ఖండించుకొనుటకు ఖడ్గము నెత్తి యుంకింపఁగా ఆతనితో అశరీరివాణి ఆకాశమునుండి 'ఓ రాజా, సాహసము చేయకుము, పతివ్రత ఎవతె యైనను చేత స్పృశించునెడల ఈ యేనుఁగు లేచును, మఱియొకవిధమున లేవదు.' అని పలికెను.—ఆవాక్కును విని రాజు అంతపురములో సురక్షిత యై యున్న తనపట్టపుదేవిని అమృతలతానామికను రావించి స్పృశింపు మనెను. ఆమె తాఁకినను ఏనుఁగు లేవదాయెను. అంతట రాజు తన కమదభార్యలను రప్పించెను. వారందఱును వరుసగా వచ్చి తాఁకిరి. ఏనుఁగు లేవదు. వారిలో ఒకతె

యైనను పతివ్రత లేదాయెను. అందువలన లోకుల యెదుట లజ్జిత లయిన యా యెనుబదివేలమంది రాణులను చూచి రాజు ఆశ్చర్యపడి తననగరములోని స్త్రీల నందఱను రప్పించి యేనుఁగును తాఁకించెను. అప్పటికిని ఏనుఁగు లేవక యుండఁగా రాజు లజ్జితుఁడై యుండెను. ఆసమయమున హర్షగుప్తుఁడను వర్తకుఁడు తామ్రలిప్తినుండి అచటికి వచ్చి ఆవృత్తాంతమును వినెను. అతనివెంట శీలవతి యను పేరి పనికత్తె పతివ్రత వచ్చి యుండెను. ఆమె దానిని చూచి అతనితో నిట్లనియె.—'నేను ఈయేనుఁగును స్పృశించెదను. నాభర్తకంటె ఇతరుని మనస్సునైనను తలంప నేని ఈయేనుఁగు లేచును గాక.' ఇట్లు పలికి వచ్చి స్పృశించెను ఏనుఁగు స్వస్థమై లేచి కబళము గ్రహించెను. సృష్టిపాలనసంహారసమర్థ లయిన యీపతివ్రతలు ఈశ్వరుని వంటివారు కొలఁదిమందియే ఉందురు. అంతట జనులు శీలవతిని స్తుతించిరి. రాజు పతివ్రతను శీలవతిని లెక్కలేని యపూర్వ రత్నములతో నింపించి ఆమెదొరను హర్షగుప్తుని సత్కరించి తననగరియొద్ద అతనికి ఒకనగ రిచ్చెను. నిజభార్యలను తాఁకను గూడ మాని దూరముగా నుంచి అన్నవస్త్రములు మాత్రము ఇచ్చుచుండెను.

### రత్నాధిపునిభార్య రాజదత్తకథ.

పిమ్మట ఏకాంతమందు ఆపతివ్రతను శీలవతిని హర్షగుప్తునియెదుట 'శీలవతీ, నీతండ్రియింట పుట్టినకన్య ఎవతె

యయిన నున్న యెడల నా కిప్పింపుము, అట్టిది నిశ్చయముగా నీవంటిదిగానే ఉండును.' అని యడిగెను. ఆమె రాజునకు 'దేవా, తామ్రలిప్తిలో నాచెల్లెలు రాజదత్త అందగత్తె కలదు. ఇష్టమేని వివాహ మాడుము.' అనెను. అట్లే నిశ్చయించు కొని రాజు శీలవతిని హర్షగుప్తుని తోడ్కొని శ్వేతరశ్మి నెక్కి తామ్రలిప్తికి పోయి హర్షగుప్తునియింట విడిసెను. అచట జోస్యులను తనకును రాజదత్తకును వివాహమునకై లగ్నము పెట్టుఁడని యడిగెను. గణకులు ఇరుపురనక్షత్రములను అడిగి తెలిసికొని 'దేవా, ఇఁక మూఁడుమాసములకు మీకు వివాహ లగ్న మున్నది. ఇప్పుడున్న ముహూర్తములో చేసికొన్న యెడల రాజదత్త అసతి యగును సుమా.' అనిరి. గణకులు ఇట్లు పలికినను, అందగత్తె యయిన యాకన్యను పొందక చిరకాల ముండ నేరక 'ఏల విచారము? ఇప్పుడే నేను ఆకన్నెను వివాహ మయ్యెదను. ఈబాల శీలవతిచెల్లెలు, గర్వము లేనిది. అసతి యేల యగును? సముద్రమధ్యమందలి నిర్మానుష్యద్వీపఖండములో ఎవ్వరు లేనిచతుశ్శాలములో ఉంచెదను. చొరరాని యాచోట స్త్రీలనే పరివారము చేసెదను, పురుషులు లేని చోట అసతి యెట్లగును?' అవసరపడి ఇట్లు నిశ్చయించి రాజు రాజదత్తను శీలవతి ఇష్టముగా వివాహ మాడి హర్షగుప్తునితోను శీలవతి తోను తోడుకొని శ్వేతరశ్మి నెక్కి ఆకాశమార్గమున తన రత్నకూట ద్వీపమునకు జనులు తన్నెదురు సూచుచుండఁగా

పోయెను. అచట ఆమె నతఁడు ఉంచుకొన్న విధముచేత ఆమెకు శీలవతికింబోలె పతివ్రతాప్రఖ్యాతి కలిగెను. పిమ్మట ఆమెను ఆయేనుఁగుమీఁద నెక్కించుకొని పూర్వోద్దిష్ట మయిన యాయమానుషగమ్య ద్వీపమునకు కొనిపోయి స్త్రీమయపరివార మైన చతుశ్శాలములో ఉంచెను. ఆమెకు వలసిన సకలవస్తువులను ఆయేనుఁగుచేత ఆకాశమార్గమున అందఁజేసెను. తాను ఆమెయందలి యనురాగముచే రాత్రులు అక్కడనే సదా ఉండి రాజకార్యములకై పగలు రత్నకూటమునకు పోవుచుండెను.

ఒకనాఁడు అతఁడు రాజదత్తతోఁ గూడ వేకువను దుస్స్వప్నదోషశాంత్యర్థము పానమంగళము ఆచరించి దానిచేత కైపెక్కినయామెను తన్ను వదలకున్నను వదలి స్వకార్యార్థము రత్నకూటమునకు పోయెను. రాచఱికము సదా ప్రియతమము గదా. అచట, 'ఏల యామత్తురాలిని ఒంటరిగా విడిచి పెట్టితివి?' అని యాక్షేపించునదియుం బోలె; సశంకమయి యున్న మనస్సుతో రాచకార్యములను విచారించుచు ఉండెను ఇంతలో, దాసీజనములు వంటమొదలయిన వ్యాపారములలో నుండఁగా, రాజదత్త అతిదుర్గమ మయిన యాచోట ఏకాకినిగా నుండెను. ద్వారములో తనరాణివాసమును భంగపఱుప వచ్చినవిధియో యన ఆశ్చర్యకరుఁడైన పురుషునొకని చూచి, వానిచెంతకు వచ్చి 'నీ వెవరవు? ఈ యగమ్యప్రదేశమున కెట్లు వచ్చితివి?' అని యడిగెను. మహాక్లేశములు పడి

యున్న యాపురుషుఁడు ఆమె కిట్లనియె. 'ఓసుందరీ, నాపేరు పవనసేనుఁడు, నేను వణిక్కుమారుఁడను, నాయూరు మథుర. నాతండ్రి కాలము చేయఁగా నాధన మెల్ల దాయాదులు హరింపఁగా పరదేశములో ఒకరికి సేవ చేసి బ్రదుకుచుంటిని. పిమ్మట వర్తకముచేత మహాకష్టపడి కొంతధనము సంపాదించి దేశాంతరము పోవుచుండఁగా దారిలో దొంగలు కొట్టి నాధన మంతయు దోఁచుకొనిరి. పిమ్మట నేను భిక్షాటనము సేయుచు నావంటియితరులు కొందఱతోఁగూడ రత్నపుగనులు గలదైన కనక క్షేత్రమునకు పోయి, అచట రాజునకు భాగ మియ్య నంగీకరించి ఒక సంవత్సరకాలము గనిని త్రవ్వుచుంటిని. ఎంత త్రవ్వినను ఒకరత్న మయినను దొరకదాయెను. రత్నములు దొరకిన యితరులు సంతోషించుచుండ, నేను అగ్నిప్రవేశము చేయుటకు కాష్ఠములు పేర్చుకొంటిని. అంతట నచటికి జీవ దత్తుఁడనువర్తకుఁడు వచ్చి దయతో నన్ను మరణమునుండి తప్పించి జీవన మిచ్చి స్వర్ణద్వీపమునకు తన యోడలో ఎక్కిం కొని పోయెను. అయిదుదినములు నడిసముద్రములో సబురు చేసినపిమ్మట ఆకస్మికముగా మేఘములు గమ్మి ద్రోణవృష్టిగా వాయుబలముతో వర్షింపఁగా ఓడ మత్తగజముతలవలె దిద్దిరఁ దిరిగి క్షణములో పగిలి మునిఁగి పోయెను. నాకు ఒకబల్ల దొరకఁగా దాని నెక్కి నేను విధివశమున ఆమేఘాడంబరము

శాంతింపఁగా ఈచతుశ్శాలమును చూచి ఇచటికి వచ్చి నే త్రామృతమును తాపశమనిని నిన్ను చూచితిని.

అంత నతనిని రాజదత్త మదముచేతను మరునిచేతను మోహిత చిత్తయై మంచముమీఁద కూర్చుండఁబెట్టుకొని కౌఁగిలించెను. స్త్రీత్వము, రైపు, ఏకాంతము, పురుషుఁడు, స్వాతంత్ర్యము—అను నీ యైదగ్నులు కూడినచోట ఆచార తృణము నిలుచునా? మదనమోహిత యగు స్త్రీకి విచారము ఉండదు. అకామ్యుఁడును ఆపన్నుఁడును అగు నాపురుషుని ఈ రాజదత్త కామించుటయే నిదర్శనము. ఇంతలో రాజు శ్వేతరశ్మి నెక్కి వచ్చి ఆపురుషునితో క్రీడాసక్తయైన భార్యను చూచి, వానిని చంపఁదలఁచియు వాఁడు పాదములలో పడి మొఱ పెట్టుకొనఁగా చంపక మాని, భీతయు మత్తయు నైన భార్యను గూర్చి ఇట్లు తలపోసెను. 'మన్మథునికి ముఖ్యమిత్త్రి మగు మద్యమును సేవించిన స్త్రీ పతివ్రత యె ట్లగును? చపల స్త్రీని కాపాడుట అశక్యము. ఉత్పాతవాతాళిని చేతులతో పట్టి నిలుపుట శక్యమా? జోస్యులమాట పాటింపనందులఫల మిది. ఆప్తులమాటను తిరస్కరించిన ఎవనికి దుష్టఫలము కలుగదు? ఈమె శీలవతిచెల్లెలు గదా అని సంతసించిన నేను సుధకు తోఁబుట్టు వయిన కాలకూటవిషచ్ఛటను మఱచితిని. కాక, అద్భుత మయిన విధిప్రేరణను పురుషప్రయత్నముచే జయింప నెవ్వనితరము? ' ఇట్లాలోచించి ఎవ్వరిమీఁదను కోపగింపక

ప్రచ్ఛన్నకాముకుని ఆవణిక్కుమారుని వృత్తాంత మడిగి. తెలిసి యైచెను. వాఁడును ప్రాణములు దక్కించుకొనిపోయి మహాసముద్రములో దూరమునుండి వచ్చుచున్న యొక యోడను చూచి, మరల ఆపలకనే ఎక్కి ఓడవైపు ఈదుకొని పోయి ఓడలోనివారిని తన్నెక్కించుకొండని అఱచి పిలిచెను. ఆయోడలో నున్న వర్తకుఁడు క్రోధవర్మ యను వాఁడు వానిని ఓడలోని కెక్కించుకొని తనకు సమీపవర్తినిగాఁ జేసికొనెను. ఎవనినాశముకై ఏకర్మను బ్రహ్మ ఏర్పఱిచినాఁడో వాఁడు పోయినచోటికెల్ల అది కూడ పోవును. ఎట్లనఁగా, ఆమూఢుని క్రోధవర్మ తనభార్యతో ఏకాంతమున సంగమింపఁగా చూచి సముద్రములో వైచి ముడియించెను

పిమ్మట రాజు కోపము మాని ఆమెను సపరివారముగా శ్వేతరశ్మిపై నెక్కించుకొని రత్నకూటమునకు కొనిపోయి శీలవతికి అప్పగించి ఆమెకును తన మంత్రులకును ఆమె వృత్తాంతమును వర్ణించెను. 'అసారవిరసము లయిన యీ భోగములందు మనస్సు తగిలించి నేను ఎంత క్లేశ మనుభవించితిని! ఇఁకను నేను వనమునకు పోయి మరల నిట్టిదుఃఖములకు పాత్రమను కాకుండునట్లు శ్రీహరిని శరణు చొచ్చెదను.' అని పలికినవాఁడై, మంత్రులును శీలవతియు నివారించుచున్నను వారిమాట పాటింపక దుఃఖావేశముచేతను వైరాగ్యముచేతను ఆనిశ్చయము మానక తనబొక్కసములో సగము ఆపతివ్రతకు

శీలవతి కిచ్చి, కడమసగము బ్రాహ్మణుల కిచ్చి, పాపభంజనుం డను పేరి యుత్తమ బ్రాహ్మణునికి తన రాజ్య మిచ్చి, ఆకాశ మార్గమున తపోవనమునకు పోవువాఁడై, పురజనులు కన్నుల నీళ్లు పెట్టుకొని చూచుచుండఁగా శ్వేతరశ్మిని రప్పించెను. రప్పించిన మాత్రమున ఆయేనుఁగు ఆరూపము మాని హార కేయూరవి రాజితుం డైన దివ్యపురుషుం డాయెను. 'నీ వెవరవు? ఇ దేమి?' అని రా జడుగఁగా అతఁ డిట్లనియె:—

మే మిద్దఱము అన్నదమ్ములము గంధర్వులము, మలయ పర్వత నివాసులము నేను సోమప్రభుఁడను, నాయన్న దేవ ప్రభుఁడు. అతనికి అతిప్రియ భార్య యుండెను. ఆమెకు రాజ వతి యని పేరు పెట్టుకొని ఒడిలోనే ఉంచుకొని ఒకప్పుడు అన్న నాతో కూడ సిద్ధవాస మను క్షేత్రమునకు పోయెను. అచట కేశవాలయమునందు మేము హరిపూజించి అందఱము గీతసేవ ఆరంభించితిమి. ఆసమయమునం దచటికి సిద్ధుఁడొకఁడు వచ్చి శ్రవ ణామృతముగా పాడుచున్న రాజవతిని తెప్ప వాల్చక చూచు చుండెను. 'సిద్ధుఁడ వయ్యును ఆశతో పరస్త్రీని చూచెద వేమి ?' అని నాయన్న ఈర్ష్యచే కోపగించి యడుగఁగా సిద్ధుఁడు కోపగించి 'ఓరి మూర్ఖుఁడా, నేను పాటకు ఆశ్చర్య పడి చూచితిని గాని కామముచేతఁ గాదురా. ఈర్ష్యాళువవు నీవు మనుష్యుఁడ వయి పుట్టి నీ యీ భార్యయే అన్యసంగత కాఁగా స్వయముగానే చూచెదవు లే.' అని శపించెను.

ఆశాపమునకు అలిగి బాల్యముచేత నేను నాచేత నున్న తెల్లని మట్టియేనుఁగుతో అతనిని కొట్టితిని. 'నన్ను దేనితో కొట్టితివో నీవును భూలోకములో అట్టి తెల్లయేనుఁగవై పుట్టుదువు గాక.' అని అతఁడు నన్ను శపించెను. మాయన్న ప్రార్థింపఁగా సిద్ధుఁడు మాకు ఇట్లు శాపాంతము ననుగ్రహించెను.—'నీవు మనుష్యత్వము పొందినను హరిప్రసాదముచేత ద్వీపేశ్వరుఁడ వగుదువు; వీఁడు ఏనుఁగై నీకే దివ్యవాహన మగును. నీకు ఎనుబది వేలమంది రాణివాసములు కలుగుదురు. వారిదౌశ్శీల్యమును నీవు సకలజనుల సమక్షమున తెలిసికొందువు. మనుష్యస్త్రీ అయి ఈమె నీకు భార్య యగును. ఈమె యన్యసంగతగా నుండఁగా ప్రత్యక్షముగా చూచెదవు. అంతట వైరాగ్యముచేత రాజ్యము బ్రాహ్మణుని కిచ్చి శాంతుఁడ వయి అడవికి పోవ నుద్దేశింపఁగా ముందు ఈ నీతమ్మునికి శాపవిముక్తి యగును. అంతట నీకును నీభార్యకును శాపము తీఱును.' ఆ శాపమువలన మనము ఇట్లు పుట్టినారము. ఇప్పుడే మనకు శాపము తీఱినది.

ఇట్లు సోమప్రభుఁడు పలుకఁగా రత్నాధిపుఁడు పూర్వ జన్మను స్మరించుకొని 'ఆహా! నేను దేవప్రభుఁడను! ఈకలికి ఆరాజవతి నాభార్య!' అని పలికి భార్యయు తానును ఆదేహములను విడిచి క్షణములో అందఱు గంధర్వులై తమనివాస మయిన మలయాచలమునకు ఆకాశమార్గమునఁ బోయిరి.

శీలవతియు శీలమహిమచేత సంపదలు పొంది తామ్రలిప్తికి పోయి ధర్మములు చేసికొనుచుండెను.

ఇట్లు జగత్తులో ఎచటను ఎవఁడును స్త్రీని రక్షింపనేరఁడు. కులస్త్రీని ఆమెసత్త్వ మొకటియే రక్షించును. ఈ ప్రకారము ఈసు పురుషులకు దుఃఖమాత్రకారణము, స్త్రీలకు ద్వేషము కలిగించును. ఇది స్త్రీలను రక్షించుటకు బదులుగా వారికి పరపురుషులమీఁద అధికౌత్సుక్యమునే కలుగఁజేయును.

ఇట్లు నరవాహనదత్తుఁడు తనభార్య రత్నప్రభ చెప్పిన కథను విని మంత్రులతోఁ గూడ మిగుల సంతోషించెను.

---

## అనురాగపరకథ.



ఈప్రకారము రత్నప్రభ చెప్పఁగా కథాప్రసంగమున గోముఖుఁడు నరవాహనదత్తునితో నిట్లనియె:— సత్యముగా పతివ్రతలు తక్కువ. స్త్రీలు సాధారణముగా చపలలు, వారిని నమ్మరాదు. నిదర్శనము వినుము.

### అనురాగపరకథ.

లోకవిఖ్యాత ఉజ్జయినీపురము కలదు. అందు నిశ్చయదత్తుఁడని వణిక్కుమారుఁ డుండెను. అతఁడు జూదమాడి దినదినము ధనము గెలిచి శిప్రానదిలో స్నానమాడి మహాకాలుని పూజించి ద్విజాదులకును దీనానాథులకును ధనమును

ఆహారచందనతాంబూలాదులను విశేషముగా ఇచ్చుచుండెను. ప్రతిదినము స్నానార్చనాదిక మయిన పిమ్మట మహాకాలాలయ సమీపమున శ్మశానములో గంధము పూసి కొనుచు ఏకాకిగా శిలాస్తంభముమీఁద చందనవిలేపనమును ఉంచి దానికి తన వీఁపును రాచుచుండెను. అందువలన కాలక్రమమున స్తంభము ఒకవైపున నును పాఱెను. ఒకనాఁడు అచటికి ఒకముచ్చియు ఒక కాసెపనివాఁడును వచ్చిరి. ముచ్చి నునుపుగా నున్న యా స్తంభముమీఁద వర్ణములతో గౌరిని వ్రాసెను; కాసెపని వాఁడు ఉలితో విలాసార్థము ఆమెనే చెక్కెను. వారు పోయిన పిమ్మట మహాకాలార్చనకై వచ్చిన యొకవిద్యాధరకన్య స్తంభములో దేవిని చూచి, ఆప్రతిమ సులక్షణముగా నున్నందున అందు గౌరీసాన్నిధ్యము కల దని తలఁచి ఆప్రతిమను పూజించి విశ్రామార్థము ఆ స్తంభములో ప్రవేశించెను. అంతలో నిశ్చయదత్తుఁడు వచ్చి గౌరీప్రతిమను చూచి ఆశ్చర్యపడి ఒడలికి గంధము పూసికొని స్తంభము నవతలివయిపున చందన మునుంచి దానిమీఁద వీఁపు రాయఁ దొడఁగెను. దానిని చూచి స్తంభములోని యావిద్యాధరకన్యక వానిరూపమునకు లోఁబడి యిట్లు తలపోసెను. 'ఇట్టివానికి ఇతనికి వీఁపునకు గంధము పూయు వారు ఎవరును లేకపోయిరా? నేను ఇతనివీఁపునకు చందనము పూసెదను.' ఇట్లాలోచించి స్తంభాంతరమునుండి చేయి చాచి విద్యాధరి అనురాగముతో అతని వీఁపునకు గంధము పూసెను.

వణిక్కుమారుఁడు ఆస్పర్శ ననుభవించి కంకణనిస్వనమును విని ఆమెకరమును తనచేతఁ బట్టుకొనెను. 'మహాభాగా, నీ కేమి యప రాధము చేసితిని? నాచేయి వదలుము.' అని యామె అగ పడక యే స్తంభమునుండి పలికెను. 'నీవు ఎవరవో ప్రత్యక్షమై చెప్పుము. నీ చేయి వదలెదను.' అని నిశ్చయదత్తుఁడు చెప్పెను. 'ప్రత్యక్షమై సర్వమును చెప్పెదను.' అని యామె ప్రతిజ్ఞ చేయఁగా, అతఁడు చేయి వదలెను.

అంతట స్తంభమునుండి ఆసర్వాంగసుందరి వెలువడి అతని మొగమును ఆసతో చూచుచు అతనియొద్ద కూర్చుండి యి ట్లనియె:— 'హిమవత్పర్వతములో పుష్కరావతి యని నగరము కలదు. అందు వింధ్యపరుఁ డని విద్యాధరాధిపుఁడు కలఁడు; నేను ఆయనకూఁతురను, నాపేరు అనురాగపర, మహా కాలార్చనకు వచ్చి యిచట నిపుడు విశ్రమించితిని. అంతలో నిచటికి వచ్చి స్తంభమునకు వీఁపు రాచుకొనుచు మన్మథ మోహనాస్త్రమువలె నీ వగపడితివి. అంతట ముందుగా నా హృదయము అనురాగముచే రంజితము కాఁగా పిమ్మట నీ వీఁపును నాకరము అంగరాగముతో రంజించినది. పైని నీకే తెలియును. నే నిప్పుడు నాతండ్రి యింటికి పోయెదను.' అంతట నిశ్చయదత్తుఁడు 'చండీ, నామనస్సు నపహరించి మరల ఈయ కున్నావు. నాది నాకు ఈయక యెట్లు పోఁగలవు?' అనెను. ఆమెయు రాగవశీకృత యై 'నీవు మాపురికి వత్తువేని నీతోఁ

గూడుదును, అది నీకు దుర్గమము కాదు, నీకోరిక సిద్ధించును. ప్రయత్నపరులకు అసాధ్య మే మున్నది? ' అని పలికి ఆకాశ మార్గమున పోయెను.

నిశ్చయదత్తుఁడును ఆమెయందే మనస్సు నుంచి యింటికి పోయెను. చెట్టునుండియుంబోలె స్తంభమునుండి పొటమరించిన యూమె పాణిపల్లవమును స్మరించుచు 'అయ్యో! ఆచెలిపాణిని నేను పట్టుకొన్నను నాకు పాణిగ్రహణము లేకపోయెనే!' అని దుఃఖించుచు, 'ఆకొమ్మపురమునకు పుష్కరావతికి పోయెదను, ప్రాణము లైనను కోలుపోయెదను, దైవ మైన తోడ్పడును.' అని మదనార్తుఁడై నిశ్చయించుకొని మఱునాఁడు వేకువను తరలి ఉత్తరాభిముఖముగా పయనము నడచుచుండెను.

అంతట ఉత్తరాపథమునకు పోవువారు మఱిముగ్గురు వణిక్కుమారులు ఇతనితో కలసికొనిరి. వారితోఁగూడ నగర గ్రామ నదీ విపినములను దాఁటి క్రమముగా మ్లేచ్ఛభూయిష్ఠ మయినయుత్తరదిగ్భూమికి పోయెను. అచట తాజకులు ఇతనిని పట్టుకొని పోయి మఱియొకతాజకునికి విక్రయించిరి. అతఁడును ఇతనిని నౌకరులచేత మురవారుఁ డనుతురకకు నజరుపంపెను. ఇతనిని కడముగ్గురను అచటికి కొని పోయి ఆ నౌకరులు అప్పుడే మురవారుఁడు మృతిఁబొందినందున అతని కుమారునికి అప్పగించిరి. వాఁడు 'మాబాబునకు ఆయన మిత్రుఁడు పంపిన నజరు కనుక వీరిని చంపి ఆయన గోరీలోనే పాతిపెట్టవలయును.'

అని నిశ్చయించుకొని వీరిని సలుపురను కట్టించి ఖయిదులో నుంపించెరు. ఖయిదులో తెల్లవాఱఁగానే మరణ మని దిగులు పడుచున్న మిత్త్రులతో రాత్రి నిశ్చయదత్తుఁ డి ట్లనియె:— ‘మిత్త్రులారా, మనకు దుఃఖించుటవలన నేమి ఫలము? ధైర్యము పూని యుండుఁడు, ఆపదలు భయపడినవియుం బోలె దూరముగా తొలఁగిపోవును. ఆపద్విమోచనియయినదుర్గను ధ్యానింపుఁడు.’ అని వారిని ధైర్యముకొలిపి తాను ఆమె నిట్లు స్తుతిచేయఁ దొడంగెను:— ‘దేవీ, మృదితాసురరుధిరపంకారుణములై అలక్తకాంకితము లోయన నొప్పిన నీపాదములకు నమస్కారము. శివునికి విశ్వైశ్వర్యమును నీ విచ్చితివి, నీచేత ప్రాణవంతమై ఈ త్రిభువనము వ్యవహరించుచున్నది. ఓమహిషాసురసూదినీ, నీవు లోకములను రక్షించితివి. ఓభక్తవత్సలా, శరణాగతుని నన్ను రక్షింపుము.’ ఇట్లు సహచరులతోఁ గూడి దేవిని స్తుతించి నిశ్చయదత్తుఁడు బడలికచే శీఘ్రముగా నిద్ర వోయెను. ‘లెండి, పుత్త్రకులారా, పొండి, మీకట్లు పోయినవి.’ అని దేవి స్వప్నములో అతనికిని కడమవారికిని ఆన తిచ్చెను. వెంటనే మేలుకొని తమంతటనే ఊడిపోయినకట్లను చూచి, వారు ఒకరొకరికి స్వప్నము చెప్పుకొని సంతోషించి, అచటి నుండి వెలువడి చాలదూరము నడచి తెల్లవాఱఁగా నిశ్చయదత్తునితో ‘మిత్త్రమా, మ్లేచ్ఛబహుళమయిన యీదేశమునకు

మేము రాము, మేము దక్షిణాపథము పోయెదము. నీవు నీయిచ్ఛ వచ్చినట్లు చేయుము.' అనిరి.

అంతట నిశ్చయదత్తుఁడు వారిని వారియిచ్ఛప్రకారము పోనిచ్చి, తాను ఉత్తరదిక్కునకే పోవుచు, దారిలో నలుగురు మహావ్రతులను కలసికొని, వితస్తను దాఁటెను. భోజనము చేసి సూర్యాస్తమయసమయమున వారితోఁగూడ వనముచొచ్చెను. అచట కట్టెలమోపులవాండ్రు ఎదురుపడి 'ఎక్కడికి పోయెదరు? అస్తమయ మయినది, ముందఱ ఏదియు గ్రామము లేదు. అడవిలో ఒకపాడుశివాలయ మున్నది. రాత్రి ఆగుడికి లోపలఁగాని వెలుపలఁగాని ఎవఁడు ఉండునో వానిని శృంగోత్పాదిని యనుయక్షిణి ముందుగా కొమ్ములు మొలపించి తెలివి తప్పించి పశువును చేసి భక్షించును.' అనిరి. ఆమాట విని ఆమహావ్రతులు నలువురు తిరస్కారముతో నిశ్చయదత్తునితో నిట్లనిరి:— 'రా రమ్ము, చూతము ఆయక్షిణి మనల నేమి చేయఁగలదో. మేము రాత్రులలో ఎన్ని శ్మశానములలోనో యున్నారము.' వా రిట్లు పలుకఁగా వారితోఁ గూడ ఆగుడికి పోయి నిశ్చయదత్తుఁడు ఆరాత్రి గడపుటకు అందులో ప్రవేశించెను. అందు ఆమహావ్రతులును నిశ్చయదత్తుఁడును ముంగిట భస్మముతో గొప్ప మండలమును రచించి అందు ప్రవేశించి కట్టియలు తగులఁబెట్టి రక్షార్థము జపము చేయుచుండిరి.

## శృంగోత్పాదిని.

అంతలో రాత్రి శృంగోత్పాదిని యను నాయక్షిణి దూరమునుండి కంకాళకిన్నరిని వాయించుకొనుచు నృత్య మాడుచు వచ్చి ఆ నలుగురలో నొక మహావ్రతిని గుఱిచేసి చూచుచు మండలము వెలుపలినుండియే మంత్రము చదివెను. అంత ఆ మహావ్రతికుడు తెలివి తప్పి కొమ్ములు మొలచి లేచి ఆడుచు ఆనిప్పులో పడెను. సగము కాలిన యంతట అతనిని లాగి ఆయక్షిణి భక్షించెను. పిమ్మట శృంగోత్పాదిని రెండవ మహావ్రతిమీద మంత్రము చదివి నృత్యము చేసెను. అతడును కొమ్ములు మొలచి నృత్య మాడి నిప్పులో పడెను. వానిని ఇతరులు చూచుచుండగానే యక్షిణి చప్పరించివేసెను. ఇట్లు వరుసగా ముగ్గురు మహావ్రతులను యక్షిణి కొమ్ములు మొలపించి భక్షించెను. నాలవమహావ్రతిని భక్షించుచు రక్త మాంసములచే కైపెక్కి తనకిన్నరిని దైవవశమున నేల నుంచెను. నిశ్చయదత్తుడు తటాలున లేచి ఆకిన్నరిని పుచ్చుకొని నృత్యము చేయుచు నవ్వుచు తిరుగుచు తాను ఆనాలుగుమా ఱులు విని నేర్చిన యాశృంగోత్పాదనమంత్రమును ఆ యక్షిణిని గుఱిచి పఠించెను. ఆప్రయోగమహిమచేత వశము తప్పి చచ్చెద నని భయపడి ఆయక్షిణి కొమ్ములు మొలవ నుండగా వినీతురాలై అతనితో 'మహాసత్త్వుడా, నేను దీనురాలను స్త్రీని, నన్ను చంపకుము. నాకు నీవే ఇప్పుడు శరణమవు. మంత్రపాఠాదిక

మును మానుము. నన్ను రక్షింపుము. నీమనోరథమును నేను ఎఱుఁగుదును. నిన్ను అనురాగపరయొద్దకు కొనిపోయెదను.' అనెను. ఇట్లు యక్షిణి వినయముతో మొఱ పెట్టుకొనఁగా నిశ్చయదత్తుఁడు మంత్రము చదువుట మానెను.

అంత నతఁడు ఆమాట ప్రకారము యక్షిణీబుజముపై నెక్కి ఆకాశమార్గమున ఉత్తరదిక్కునకు పోవుచుండెను. తెల్ల వాఱఁగా ఒక గిరికాననము చేరి యక్షిణి అతనితో విన్న పించెను:—'సూర్యోదయ మగుచున్నది. ఇఁక పోవుటకు నాకు సామర్థ్యము లేదు. ఈపగలు ఇచట నుండుము. తీయనిపండ్లు భక్షింపుము. సెలయేటి తేటనీరు త్రాగుము. నేను ఇప్పుడు నా యింటికి పోయి రాత్రి వచ్చి నిన్ను హిమగిరికి వూళిమాల యగు పుష్కరావతీనగరమున అనురాగపరయొద్ద చేర్చెదను.' ఇట్లు పలికి అనుజ్ఞ పొంది బుజమునుండి నిశ్చయదత్తుని దింపి సత్యా వంతురా లయిన యక్షిణి తనచోటికి పోయెను. అచట నిశ్చయదత్తునికి అగాధమును అంతస్సవిషమును బయటికి స్వచ్ఛ శీతలమును అయిన యొకసరస్సు అగపడెను. దానిని సూర్యుఁడు కరము సాఁచి 'ఓయి రాగవంతుఁడా, స్త్రీచిత్తము దీనివంటిది సుమా.' అని నిదర్శనమువ్రాలె చూపుచుండెను. అతఁడు గంధముచేత అందులో విష మున్న దని తెలిసికొని, దప్పిచేత ఆదివ్యపర్వతమందు జలార్థియై ఇటునటు తిరుగుచు, ఎత్తయిన యొకచోట పద్మరాగమణులవలె ప్రకాశించుచున్న రెంటిని

చూచి ఆభూమిని త్రవ్వెను. పైమన్ను తీసివేయఁగానే అతనికి బ్రదికియున్న కోఁతితల యగపడెను. దానికన్నులు పద్మరాగములవలె నుండెను. అంత నతఁ డాశ్చర్యపడి, అదే మని ఆలోచించుచుండఁగా, ఆమర్కటము మనుష్యవాక్కులతో 'ఓయి సత్పురుషుఁడా, నేను మనుష్యుఁడను, బ్రాహ్మణుఁడను, కోఁతి నయితిని. నన్ను లేవ నెత్తుము. నావృత్తాంతము నంతయు చెప్పెదను.' అనెను. నిశ్చయదత్తుఁడు మన్ను త్రోఁడివేసి అతని లేపెను. కోఁతి అతనిపాదములఁ బడి 'అయ్యా నీవు నాకు ప్రాణము ఇచ్చితివి, అలసి యున్నావు, ఫలములు జలమును ఉపయోగింపుము. నీకృపచేత నేను కూడ ఇన్నాళ్లకు పారణ చేసెదను.' అని చేతి కందెను తియ్యనిపండ్లును నీడయును గల చెట్లు దట్టముగా నున్న సెలయేటిదరికి నిశ్చయదత్తుని కొని పోయెను. అచట నిశ్చయదత్తుఁడు స్నానము చేసి పండ్లు భక్షించి సేద దేరి, కోఁతిని 'నీ వెట్లు కోఁతి నయితివి?' అని యడిగెను. కోఁతి చెప్పసాగెను.

### కోఁతి యైన సోమస్వామి కథ.

కాశిలో చంద్రస్వామి యని సద్బ్రాహ్మణుఁ డుండెను. నేను ఆయనకును సువృత్త యనుతద్భార్యకును కుమారుఁడను. నాపేరు సోమస్వామి. నేను యౌవనమందు మదనమత్తగజము నెక్కి తిరుగుచుండఁగా, శ్రీగర్భుఁడను నచటి వర్తకుని కూఁతురు బంధుదత్త యనునది వరాహదత్తుఁ డను మధురానగరవర్తకుని

భార్య తండ్రియింట నున్నట్టిది జవరాలు నన్ను కిటికీలోనుండి చూచి, మదనక్షోభ పరవశ యై, నాసంగమము కోరి నాపేరు తెలిసికొని నాయొద్దకు చెలిని పంపినది. అది వచ్చి రహస్యముగా నాతో నాయిక యభిప్రాయమును చెప్పి నన్ను కొనిపోయి తనయింట ఉంచి, రహస్యముగా పోయి, ఔత్సుక్యముచేత భయము తీఱి యున్న బంధుదత్తను వెంటనే కొనివచ్చినది. ఆమె వచ్చుచునే నన్ను కంఠాలింగనము చేసినది. స్త్రీలకు దుర్భరుఁడయిన మదనుఁడు ఒకఁడే గదా వీరుఁడు. ఈప్రకారము బంధుదత్త ప్రతిదినము నన్ను సఖీగృహమందు కూడుచుండెను. తండ్రియింట చిరకాల మున్నట్టి యాబంధుదత్తను తోడుకొని పోవుటకు మథురనుండి ఆ గొప్పవర్తకుఁడు వరాహదత్తుఁడు వచ్చెను. అంతట బంధుదత్త చెలితో నిట్లనియె:— 'సఖీ, నిశ్చయముగా నేను పోవలసియున్నది. మానాయన అల్లునికి అనుజ్ఞ యిచ్చినాఁడు. సోమస్వామిని బాసి నేను క్షణమయినను బ్రదుకఁజాలను. ఏమి యుపాయము ?' సుఖాశయ యనెడి యాసఖి యోగిని పలుకుచున్నది. 'నాకు రెండుమంత్రప్రయోగములు తెలియును. ఒకదానిని పఠించి మెడలో సూత్రము కట్టినవెంటనే మనుష్యుఁడు క్రోఁతి యగును. రెండవమంత్రముతో సూత్రము విప్పిన వాఁడు మరల మనుష్యుఁ డగును. కపిగా నున్నప్పుడు వీనికి పూర్వప్రజ్ఞ పోదు. కనుక నీ కిష్ట మయినయెడల సోమస్వామిని ఇప్పుడే నేను కోఁతిపిల్లను చేసెదను. ఆటకోఁతి

మిషచేత వీనిని మధురకు కొని పొమ్ము. ఆమంత్రములను నీకు నేను నేర్పెదను. బహిరంగముగా ఈతనిని కోఁతిగా నుంచుకొని, రహస్యముగా పురుషుని చేసికొంటువుగాక.' బంధుదత్త అందుల కంగీకరించి నన్ను రహస్యముగా పిలిపించి నాకు ఆప్రయత్నమును తెలియఁజేసెను. నేనును అంగీకరించితిని. ఆమెచెలి సుఖాశయ నా మెడను మంత్రసూత్రము కట్టి నన్ను కోఁతిపిల్లను చేసినది. ఆరూపమున బంధుదత్త కొనిపోయి భర్తకు నన్ను తనచెలి తనకు వినోదార్థము ఇచ్చినదని చూపెను. నేను దగ్గఱ నున్న వినోదముగా నుండునని అతఁడు సంతోషించెను. నేను అన్నియు యథాపూర్వముగానే ఎఱిఁగి స్త్రీచరిత్రమున కాశ్చర్యపడుచు అట్లే యుంటిని. మదనునిచే వికృతి పొందనివాఁ డెవఁడు?

సఖివలన ఆమంత్రముల నేర్చి బంధుదత్త మాఱునాఁడు భర్తతోఁ గూడ మధురకు బయలువెడలెను. నన్ను దారిలో ఒక సేవకుని బుజముపై ఎక్కించెను. రెండుమూఁడుదినములకు మార్గవశమున మేము కోఁతులతో నిండిన యొక యరణ్యమును చొచ్చితిమి. నన్ను చూచి కోఁతులు కిచకిచ లాడుచు ఒండొకటిని పిలుచుచు అసంఖ్యముగా వచ్చి నన్ను మోచుచున్న భటుని కఱవఁ దొడఁగినవి వాఁడు నిలువలేక నన్ను క్రింద వేసి పాఱిపోయెను. అంత నాకోఁతులు నన్ను కొనిపోయినవి. నాపై ప్రేమచేత బంధుదత్తయు దానిపతియు సేవకులును

రాలతోను కఱ్ఱలతోను కోఁతులను ఎంత కొట్టియు జయింపలే
నైరి. కోఁతులు నా దేహమున వెంట్రుకవెంట్రుకను గోళ్లతోను
దంతములతోను నాతప్పిదమునకు కోపగించినవియుంబోలె
పీఁకివైచినవి. కంఠసూత్ర మహిమచేతను శివస్మరణచేతను
నాకు బలము కలిగి వానినుండి తప్పించుకొని వానికి అగపడ
కుండ చెట్లగుబురులోఁ దూఱి అడవినుండి యడవికి దాఁటుచు
ఈయడవికి వచ్చితిని. 'పరదారగమనపాతకము ఈజన్మము
లోనే ఫలించినది, బంధుదత్త దక్కక పోయినది, కోఁతి
నయితిని.' అని దుఃఖించుచు తిరుగుచున్న నాకు బ్రహ్మదేవుఁడు
తనివి నొందక మఱియొక దుఃఖమును కలుగఁ జేసెను. ఆక
స్మికముగా నొక పిడియేనుఁగు వచ్చి నన్ను తొండముతో
పట్టుకొని వర్షమునకు తడిసి ముద్దగానున్న యొక పాముల
పుట్టలో పాఁతివైచెను. ఆపిడి నాగతిచే నియుక్తయయిన యొక
దేవత కాఁబోలును, అది పాఁతిన యా బురదలోనుండి లేవలే
నైతిని. అందులోనే శివధ్యానము చేయుచు చావక యుంటిని.
నాకు జ్ఞానము కలిగినది. ఇప్పుడు ఈ యెంకుబురదనుండి నీవు
లేపువఱకు నాకు ఆఁకలియు దప్పియు లేక పోయినవి.
జ్ఞానము కలిగినను నాకు ఈకోఁతితనము మాన్చుకొనుటకు
శక్తి కలుగ లేదు. యోగిని యెవతె యయినను ఈకంఠసూత్ర
మును దాని మంత్రముతో కట్టిన నేను మరల మనుష్యుఁడ

నగుదును. ఇది నావృత్తాంతము. చెలికాఁడా, ఈ యగమ్య వనమునకు నీవేల వచ్చితివి చెప్పుము.

ఈప్రకారము మర్కటరూపమున నున్న యా బ్రాహ్మణుఁడు సోమస్వామి పలుకఁగా, నిశ్చయదత్తుఁడు తాను విద్యాధరికొఱకు ఉజ్జయినినుండి వచ్చుటయును, ధైర్యజిత యయిన యక్షిణి తన్ను రాత్రి తెచ్చుటయును, చెప్పెను. ఆవృత్తాంతము విని కపి ఆశ్చర్యపడి యిట్లనియె: 'నావలె నీవును స్త్రీమూలముగా దుఃఖ మనుభవించినాఁడవు. శ్రీలకును స్త్రీలకును ఎవని విషయమందుఁ గాని స్థిరత లేదు. స్త్రీలు సంధ్యవలె క్షణరాగిణులు, నదులవలె కుటిలాశయలు, భుజగులవలె అవిశ్వాస్యలు, మెఱపులవలె చంచలలు. విద్యాధరీరత్నము అనురాగపరవయితము ఎవనినో ఒక విధ్యాధరుని స్వజాతివానిని గూడి క్షణములో మనుష్యుఁడ వయిన నీపై విరక్త యగును. కనుక విరసవిపాక మై ముసిఁడిపండువంటి దైన యీ స్త్రీనిమిత్తక ప్రయాస మానుము. మిత్త్రమా ఆవిధ్యాధరిపురికి పుష్కరావతికి పోకుము. యక్షిణి బుజ మెక్కి ఉజ్జయినికే పొమ్ము. మిత్త్రమా, నామాట వినుము. పూర్వము నేను రాగవశమున మిత్త్రివాక్యమును వినక ఇప్పుడు దుఃఖించుచున్నాను. బంధుదత్తానురక్తుని నన్ను నామిత్త్రుఁడు భవశర్మ యనునాతఁడు నివారించుచు ఇట్లనియె:—చెలికాఁడా స్త్రీకి వశపడకు. స్త్రీ

బుద్ధిదురవగాహము సుమా. అందులకు నా వృత్తాంతమును చెప్పెదను వినుము. —

### దుక్కియెద్దయిన భవశర్మకథ.

ఇచటనే కాశిలో రూపవతియు యౌవనవతియు నయిన యొక బ్రాహ్మణి సోమద యనునది ప్రచ్ఛన్నజారిణి యుండెను. దానితో నాకు దైవవశమున సంగము కలిగినది. ఆక్రమమున దానియందు ప్రీతి యధికమై దానిని ఒకనాఁడు నేను ఈర్ష్యాకోపముచేత తన్నితిని. తన్నులను ఒల్లక ఆకులట అప్పటికి కోపమణఁచుకొని, మఱునాఁడు పరిహాసమునకుం బోలె నామెడను త్రాడు కట్టినది. నేను తత్క్షణమే దుక్కియెద్ద నైతిని. ఆఖిండత నన్ను ఇష్టమయినవెలకు ఒకానొకనికి పనుపఱిచిన లొట్టిపిట్టల వర్తకునికి అమ్మినది. నేను అతని బరువులు మోచుచు దుఃఖపడుచు ఉండగా నన్ను బంధమోచనిక యను నొక యోగిని చూచి సోమద చేసినట్టి యెద్దునుగా జ్ఞానముచేత తెలిసికొని నాస్వామి లేని సమయములో నాకంఠసూత్రమును విప్పినది. అంతట నేను మనుష్యుఁడ నైతిని. నాస్వామియు నేను ఎక్కడికో పాఱిపోయితి నని తలఁచి దిక్కు దిక్కునను నన్ను వెదక సాగెను. బంధమోచనితోఁ గూడఁ బోవుచున్న నన్ను దైవవశమున సోమద చూచి కోపముతో మండిపడుచు 'ఈపాపిని ఏల నీవు పశుత్వమునుండి విడిపించితివి? ఓపాపాత్మురాలా; ఈదుర్మార్గమునకు ఫలము నీవు అనుభవించెదవు. నిన్ను

వీనిని ఇద్దఱను ఱేపు కడతేర్చెదను, అని బెదరించి పోయెను. అంతట అందులకు ప్రతీకారము చేయునదై బంధమోచనిక నాతో ని ట్లనియె:— 'నన్ను చంపుటకు ఇది నల్లగోడిగయై వచ్చును. నేను ఎఱ్ఱగోడిగనై యుద్ధము చేసెదను. ఆ సమయములో నీవు చేత కత్తిఁ గొని జాగరూకుఁడవై యుండి సోమదను నఱికి వేయుము. ఇట్లు దీనిని పరిమార్చుదము. నీవు ఱేపు ప్రొద్దున మాయింటికి రమ్ము?' ఇట్లు చెప్పి ఆమె తనయిల్లు పోరఁగా, నేనును ఈజన్మములోనే అద్భుతమైన పెక్కుజన్మము లనుభవించి నాయింటికి పోయి తెల్లవాఱఁగానే చేత కత్తిగొని ఆమెయింటికి పోయితిని. ఆసమయమున సోమద నల్లగోడిగగా వచ్చెను. బంధమోచనికయు ఎఱ్ఱగోడిగ యాయెను. గొరిజలతోను దంతములతోను వారు పోరాడుచుండఁగా నేను ఆ క్షుద్రశాకినిని కత్తితో కొట్టితిని. అంతట బంధమోచనిక దానిని చంపివేసెను. అంత నేను భయము తీఱి పశుత్వము నుండి తప్పి మరల కుస్త్రీసంగమమును మనస్సునైనను తలపెట్టకున్నాను. చపలత్వము, సాహసము, శాకినీ మాయలు ఈమూఁడుదోషములు మూఁడులోకములకును భయంకరమయినవి స్త్రీలయం దుండును. కనుక బంధుదత్త యొకశాకిని, దానికి పతియందే స్నేహము లేదు, నీయం దెక్కడిది ?

ఈప్రకారము నామిత్త్రము భవశర్మ చెప్పినను అతని మాటను పాటింపక నేను ఈగతికి పాలయితిని. కనుక నీకు

చెప్పెదను: నీవు అనురాగపరకొఱకు క్లేశపడవలదు. అది స్వజాతివాఁడు దొరకిన నిన్ను వదలివేయును. చెలికాఁడా, తుమ్మెద క్రొత్తక్రొత్తపుష్పమును బోలె మత్తకాశిని క్రొత్తక్రొత్త పురుషుని కోరుచుండును. అందువలన నీకును నాకుం బోలె పశ్చాత్తాపము కలుగును.

ఇట్లు కపిరూపుఁడు సోమస్వామి పలికిన మాట రాగనిర్భరమైన నిశ్చయదత్తునిహృదయమందు చొరదాయెను. 'శుద్ధమైన విద్యాధరాధిపగృహమందు జన్మించినట్టిది, నన్ను వ్యభిచరింపదు.' అని నిశ్చయదత్తుఁడు పలికెను.

ఇట్లు వారు మాటలాడుచుండఁగా సూర్యుఁడు సంధ్యారక్తుఁడై నిశ్చయదత్తునికి ప్రియము కోరినవాఁడుంబోలె అస్తమించెను. అంతట రాత్రి కాఁగానే అగ్రదూతివ్రాలె శృంగోత్పాదిని నిశ్చయదత్తునియొద్దకు వచ్చెను. తన్ను మఱవవలదని కోరుచున్న కపిని వీడ్కొని నిశ్చయదత్తుఁడు యక్షిణిబుజ మెక్కి అనురాగపరను గూర్చి పోయి ఆరాత్రియందే ఆమెతండ్రినగరమయిన పుష్కరావతిం జేరెను. అనురాగపరయు అతనిరాకను విద్యాప్రభావముచేత ఎఱిఁగి నగరువెలువడి ఎదురువోయెను. 'ఇదిగో రాత్రి నేత్రోత్సవమయిన నీకాంత రెండవ చంద్రమూర్తిం బోలె వచ్చుచున్నది. ఇఁకను నేను పోయెదను.' అని పలికి అతనిని దింపి యక్షిణి పోయెను. అనురాగపరయు చిరౌత్సుక్యముచేత అతనిని సంభ్రమముతో ఆలింగనము చేసి సం

తోషపెట్టెను. అతఁడును ఆమెను కౌఁగిలించుకొని తనదేహ మం దిముడక ఆమెమేనియందు ప్రవేశించెనో యన నుండెను. ఆమె యతనికి గాంధర్వవిధిచే భార్య యై విద్యాప్రభావముచేత తత్క్షణమే తోలిపురమువెలుపల ఒకపురమును నిర్మించెను. ఆమెతో నతఁ డాపురమందు ఆమెవిద్యచేత ఆమెతల్లిదండ్రులకగపడక వసియించి యుండెను. ఆమె యడుగఁగా తాను దారిలో పడినపాట్లెల్ల వాక్రుచ్చెను. ఆమె అతనిని మఱియు అధికభోగములతో ఉపచరించెను.

నిశ్చయదత్తుఁడు ఆమెకు కోఁతియైన సోమస్వామియొక్క యద్భుతకథను నివేదించి 'అతఁడు నామిత్త్రము, నీ వేమయిన నుపాయము చేసి పశుత్వమునుండి మాన్పుదు వేని నీకు మిక్కిలి పుణ్యము కలుగును.' అనెను. 'ఇది యోగినులమంత్రమహిమచేతఁ గావలసినపని, మాపని గాదు. అయినను నీకు ప్రియమయిన యీపనిని బుధరూప యను నాచెలిని సిద్ధయోగినిని యాచించి సాధించెదను.' అని అనురాగపర పలికెను. నిశ్చయదత్తుఁడు సంతోషించి 'అటయిన నామిత్త్రుని చూతువు రా, అతనియొద్దకు పోదము.' అనెను. ఆమె యంగీకరింపఁగా మఱునాఁడు నిశ్చయదత్తుఁడు ఆమెయొడిలో కూర్చుండి ఆకాశమార్గమున ఆ చెలికాఁ డున్న వనమునకు పోయి, అచట నతనిని చూచి భార్యతోఁ గూడ నమస్కరించి కుశల మడిగెను. 'అనురాగపరాయుతుఁడ వై అగపడితివి గాన ఇప్పుడు నాకు కుశ

లము' అని సోమస్వామి పలికి అనురాగపరను ఆశీర్వదించెను. అంతట అందఱును రమ్య మయినశిలాతలమందు కూర్చుండిరి. నిశ్చయదత్తుఁడు ముందు కాంతతోఁ గూడ ఆలోచించుకొని యున్న నానాకథాలాపములను కపిప్రీతిగా చేసెను. పిమ్మట నిశ్చయదత్తుఁడు కపిని వీడ్కొని అనురాగపర యొడిలో కూర్చుండి ఆకాశమార్గమున ఆమెయింటికి పోయెను.

మఱునాఁడు అతఁడు కపిని చూడ రమ్మని కాంతను మరల పిలువఁగా 'నీవే ఈదినము అతనియొద్దకు పొమ్ము, ఉత్పతనవిద్యను అవతరణవిద్యను ఇచ్చెదను గ్రహింపుము.' అని యామె పలికెను. ఆమెవలన ఆవిద్యలను గ్రహించి నిశ్చయదత్తుఁడు ఆకాశమార్గమున కపియొద్దకు పోయి అచట చాలసేపు కపితో మాటలాడుచుండెను.

ఈలోపల అనురాగపర ఇంటినుండి ఉద్యానవనమునకు పోయి యచట కూర్చుండి యుండఁగా, విద్యాధరకుమారుఁ డొకఁడు ఆకాశమున విహరించుచు ఆమెను చూచి మదనావిష్టుఁడై, ఆమె విద్యాధరి యనియు మనుష్యుని పెండ్లియయి యున్న దనియు తనవిద్యాప్రభావముచేత నెఱిఁగి, ఆమెయొద్దకు వచ్చెను. ఆయందగానిని చూచి, ఆమె నీ వెవఁడ వని యడుగఁగా, 'నేను విద్యాధరుఁడను, విద్యాజ్ఞానవంతుఁడను, నాపేరు రాగభంజనుఁడు, నిన్ను చూచినమాత్రాన మదనునిచేత నీకు సమర్పితుఁడ నైతిని. దేవీ, మర్త్యుని భూలోకవాసిని

సేవింప నేల? నీతండ్రికి ఆవృత్తాంతము తెలియక ముందే నీకు సమానుని నన్ను భజింపుము.' అని యతఁడు పలికెను. ఇట్లతఁడు పలుకుచుండఁగా ఆమె క్రేఁగంట చూచుచు అతఁడు తనకు తగినవాఁడని తలఁచి యతనికి అచటనే భార్య యాయెను. ఇద్దఱకు ఐకమత్యమును ఏకాంతమును లభించిన మన్మథునికి మఱి యేమి కావలయును?

పిమ్మట ఆవిద్యాధరుఁడు పోఁగా, నిశ్చయదత్తుఁడు సోమస్వామిని వీడ్కొని వచ్చెను. అతనికి అనురాగపర ఎప్పటివలె ఆలింగనాదికములు చేయక తలనొప్పి యని మిష పెట్టెను. అతఁడు ఆమిష నెఱుఁగక స్నేహమోహితుఁడై ఆమెకు వాస్తవముగా జబ్బు చేసిన దనియే తలఁచి, ఆదినమును దుఃఖముతోఁ గడపి, మఱునాఁడు చింతతో కపియొద్దకు విద్యామహిమచేత ఆకాశమార్గమున పోయెను. అతఁడు పోఁగానే విద్యాధరుఁడు ఆరాత్రి ఆమెను గలయనందున నిద్ర మాని ఉవ్విళ్లూరుచున్న వాఁడు మరల వచ్చెను. నిశావిరహముచే ఉత్కంఠితురాలై ఆమె అతనిని కంఠాలింగనము చేసి సంభావించెను. సురతాంతమందు ఒడిలోనే నిద్ర పోయిన యాతనిని ఆమె విద్యాబలము చేత దాఁచి రాత్రి జాగరణమువలన తానును ఒడ లెఱుఁగక నిద్ర పోయెను.

ఇంతలో నిశ్చయదత్తుఁడు సోమస్వామియొద్దకు చేరెను. కపియు కుశల మడిగి 'ఏమి నేఁడు నీవు దుర్మనస్కుఁడవుగా

అగపడుచున్నావు? చెప్పుము.' అని యడిగెను. 'మిత్త్రమా, అనురాగపర అస్వస్థగా నున్నది. ఆమె నాకు ప్రాణముకంటెను ప్రియ గావున నేను మిగుల దుఃఖితుఁడనై యున్నాను.' అని నిశ్చయదత్తుఁడు పలికెను. అంతట జ్ఞాని యయిన యాకపి యతనితో 'మిత్త్రమా, పోయి యిపుడే అనురాగపరను నీ యొడిలో కూర్చుండఁబెట్టుకొని ఇటకు తెమ్ము, నీకు ఒక మహాశ్చర్యమును చూపెదను.' అనెను. ఆమాట విని నిశ్చయదత్తుఁడు నిద్రించుచున్న యనురాగపరను ఒడిలో నుంచుకొని ఆకాశమార్గమున తెచ్చెను. ఆమె యొడిలో విద్యాబలముచేత అదృశ్యుఁడై నిద్రించుచున్న యావిద్యాధరుని నిశ్చయదత్తుఁడు ఎఱుఁగనేరకుండెను. దివ్యదృష్టి గల యా కపి నిశ్చయదత్తునికి ఒకయోగము నుపదేశింప దానివలన అతఁడావిద్యాధరుని ఆమె కంఠమును కౌఁగిలించి నిద్రించుచున్నవానిని చూచి 'అయ్యో! ఇదేమి?' అని వాపోవుడు, ఆతనికి తత్త్వదర్శి యైన యామిత్త్రుఁడు వాస్తవమును తెలిపెను. నిశ్చయదత్తుఁడు క్రోధపరవశుఁడు కాఁగా విద్యాధరుఁడు మేల్కొని ఆకాశమున కెగిరి పోయెను; వెంటనే అనురాగపరయు మేల్కొని తనగుట్టు బయలైనందులకు అవమానపడి తల వాంచి నిలిచి యుండెను. నిశ్చయదత్తుఁడు బాష్పాకులలోచనుఁడై ఆమెను 'ఓపాపాత్మురాలా, నమ్మియున్న నన్ను ఏల యిట్లు వంచించితివి? అతిచంచలమయిన పాదరసము నయిన బంధింప వచ్చును గాని స్త్రీచిత్త

ము నను బంధింప శక్యము గాదు.' అని పలుకుచుండఁగా, అను రాగపర ఉత్తరము చెప్పక ఏడ్చుచు ఆకాశమార్గమున తన యింటికి పోయెను.

అంతట నిశ్చయదత్తునితో మిత్రము కపి యిట్లనియె. నేను వల దన్నను నీవు ఈప్రియను వెంట నంటి పోయితివి. ఆతీవ్రరాగాగ్నికి ఈతాపమే ఫలము. అస్థిరము లయినసంపదల యందును స్త్రీలయందును విశ్వాస మెట్లుంపవచ్చును? కనుక దుఃఖపడకుము, ఓర్చుకొనుము. విధిని తప్పించుకొనుటకు బ్రహ్మకైనను వశము గాదు.' ఈమాటలు విని నిశ్చయదత్తుఁడు విరక్తుఁడై శివుని శరణు చొచ్చెను. పిమ్మట ఆయరణ్యములోనే కపితోఁ గూడ నుండఁగా అచటికి మోక్షద యను నొక తపస్విని వచ్చెను. ఆమె తనకు ప్రణమిల్లిన నిశ్చయదత్తుని 'ఏమి యీ యాశ్చర్యము! నీకు కపి యెట్లు మిత్రమైనది?' అని అడిగెను. అతఁ డంతట తనవృత్తాంతమును తనమిత్రునివృత్తాంతమును తెలిపి, 'ఓభగవతీ, నీకు ప్రయోగముగాని మంత్రముగాని తెలిసి యున్నయెడల నామిత్రుని విడిపింపుము.' అని ప్రార్థించెను. ఆమె వల్లె అని ఒకమంత్రము నుచ్చరించుచు ఆకపియొక్క కంఠసూత్రమును విప్పివేసెను. సోమస్వామి మర్కటరూపమును మాని యథాపూర్వముగా మనుష్యుఁ డాయెను. ఆమె మెఱుఁగుఁదీఁగవలె మెఱసి యదృశ్యురాలు కాఁగా అనంతరము వారు ఇద్దఱును గొప్పతపస్సు చేసి సద్గతిని పొందిరి.

ఈరీతిగా స్త్రీలు స్వభావచపలలు, వారి దుశ్చరిత్రము వలన మహావైరాగ్యము కలుగును. ఆకాశమును చంద్రరేఖ వోలె కులమును అలంకరించు పతివ్రత అరుదు.

ఇట్లని గోముఖుఁడు చెప్పినకథను విని నరవాహనదత్తుఁడు రత్నప్రభతోఁగూడ మిక్కిలి సంతోషించెను.

---

## ౪-వ తరంగము.

### మ ద న మా ల య ను వే శ్య క థ.

గోముఖునికథకు నరవాహనదత్తుఁడు సంతోషింపఁగా ఆస్పర్ధచేత మరుభూతి యిట్లు పలికెను:—దేవా, సాధారణముగా స్త్రీలు చపలలే గాని, అందఱును అట్టివారు గారు, వేశ్యలలోఁ గూడ సత్త్వవతులు కలరు, ఇతరలమాట చెప్పనలయునా? ఈకథను వినుము.—పాటలీపురములో విక్రమాదిత్యుఁ డని రా జుండెను. అతనికి ప్రియమిత్త్రులు అశ్వపతియు గజపతియు నని గుఱ్ఱములును ఏనుఁగులును పెక్కు కలవారు ఉండిరి. అతనికి నరపతి యనుగొప్పరాజు ప్రతిష్ఠాననగరము నేలువాఁడు విస్తారము కాల్బలము కలవాఁడు శత్రువు. ఆశత్రువుమీఁది ద్వేషమువలన విక్రమాదిత్యుఁడు మిత్త్రబలముచే గర్వించి 'నేను నరపతిని జయించెదను, అతనిని నాద్వార సేవకునిఁగా నావందిమాగధులు పాడుదురు గాక.' యని ప్రతిజ్ఞ చేసి, ఆ

మిత్త్రులను పిలిపించి వారితోఁ గూడి ఏనుఁగుల దండుతోను గుఱ్ఱముల దండుతోను భూమి కంపిల్లునట్లుగా నరపతి యైన నరసింహరాజుమీఁదికి దాడి వెడలెను. నరపతి యుద్ధసన్నద్ధుఁడై నగరము వెలువడి వచ్చెను. అచట ఇరువురకు లోక విస్మయకర మయిన యుద్ధము జరిగెను. పదాతులు ఏనుఁగుల తోను గుఱ్ఱములతోను సమముగా యుద్ధము చేసిరి. క్రమ ముగా నరసింహుని పదాతులు కోటిమంది విక్రమాదిత్యుని హయగజములను నాశము చేసిరి. విక్రమాదిత్యుఁడు ఓడిపోయి తనరాజధానిపాటలీపురమునకు పాఱిపోయెను. అతనిమిత్త్రులు తమతమనగరములకు పోయిరి. నరసింహరాజు శత్రువును జయించి వంధిమాగధులచేత పొగడ్ఁ బొందుచు నిజనగరము సొచ్చెను. కార్యము చెడి విక్రమాదిత్యుఁడు 'శస్త్రసాధ్యుఁడు కానట్టి యీశత్రువును ప్రజ్ఞచేత జయించెదను, ఎవ రయినను దూషించినను దూషింపుదురుగాక, నాప్రతిజ్ఞ తప్పకుండును గాక.' అని నిశ్చయించుకొని, రాజ్యమును యోగ్యమంత్రులకు అప్పగించి, తననగరమునుండి రహస్యముగా బుద్ధివరుఁ డను ప్రధాన మంత్రితోను కొన్నివందలమంది రాజపుత్త్రులతోను ఉత్తమకులస్థు లయిన యయిదుగురు శూరులతోను కూడుకొని తాను సన్న్యాసివేషము ధరించి శత్రునగరమునకు పోయి అచట మదనమాల యని ప్రసిద్ధ యయిన వారకామిని యింటికి చనియెను.

ఆయిల్లు రాజభవనమువలె నుండెను. దానిప్రాకార శిఖరములమీఁద పిల్లతెమ్మెరలకు కదలుచున్న జెండాలు ఇతని రమ్మని సంజ్ఞచేయుచున్నవియుంబోలె నొప్పుచుండెను. తూర్పు ద్వారమందు ఇరువదివేలమంది ఆయుధపాణులు పదాతులు చేయుంబగలు కాచుచుండిరి. కడమ ప్రతిద్వారమును పదివేల మంది శూరులు కాచుచుండిరి. ప్రతిహారులచేత తెలుపఁబడినవాఁడై విక్రమాదిత్యుఁడు లోపల ప్రవేశించెను. ఆవేశ్యనగరు, ఒకవంక అనేకములైన యుత్తమాశ్వముల బారులును, మఱియొకచోట ఏనుఁగుమందల వరుసలును, ఒకతావున ఆయుధశాలల శ్రేణులును, ఒకవైపున రత్నకాంతులంతో వెలుఁగుచున్న పెక్కు బొక్కసములును, ఒకయెడ సేవకసమూహములు, ఒకస్థలమందు బిగ్గరగా పొగడ్తలు పాడుచున్న వందిమాగధులును, మఱియొక ప్రదేశమందు కోలాహలముతోడి మృదంగాది వాదనములును, కలిగి, భాసిల్లుచుండెను. ఏడు కక్ష్యలుగా విభక్తమయి యున్నయానగరిలోనికి సపరివారముగా ప్రవేశించి విక్రమాదిత్యుఁడు మదనమాలా వాసగృహముకడకు పోయెను. మదనమాల ఎదురువచ్చి యతనిని లోనికి తోడ్కొని పోయి ఆతనిని రాజోచిత మయిన యాసనమందు కూర్చుండఁబెట్టి గౌరవించెను. అతఁడును దానిరూపలావణ్యావినయములకు ఆశ్చర్యపడి తన్ను తెలియఁబఱుపకయే దానిని స్తుతించెను. మదనమాల స్నానపుష్పానులేపనముల

తోను వస్త్రాభరణములతోను ఆరాజును గౌరవించెను. అతని పరివారమునకు దినవృత్తి యిచ్చి, అతనిని అతని మంత్రిని నానావిధము లయిన యాహారములతో నుపచరించి, ఆపగలు పానాదిక్రీడలతో వారితోఁ గడపి, అతనికి దర్శనమాత్రముననే లోఁబడినదై ఆరాత్రి తన్నర్పించుకొనెను. అట్లు పూజ లందుచు విక్రమాదిత్యుఁడు అచటనే ప్రచ్ఛన్నుఁడై యుండెను.

యాచకులకు ఆతఁడు ఏమి యెంత యిచ్చెనో మదనమాల అది యంతయు ఆయనకు తాను తనదే ఇచ్చుచుండెను. అతనియనుభవముచేత తనకును తనధనమునకును ధన్యత్వము భావించి ఇతరపురుషపరాఙ్ముఖిగా నుండెను. అతనితగులములో పడినదై ప్రేమచేత తనకడకు వచ్చుచున్న నరసింహరాజును యుక్తులచేత నివారించుచుండెను. ఇట్లు ఆమెచే సేవలుగొనుచు విక్రమాదిత్యరాజు ఒకనాఁడు ఏకాంతమందు బుద్ధిమనునితో ని ట్లనియె:—'వేశ్యలు ధనకాంక్షిణులు, కామమందుఁ గూడ ధనము లేక అనురాగము పూనరు. వారికి బ్రహ్మ యాచకులను సృజియించి లోభము నిచ్చినాఁడు. ఈమదనమాల తనధనమును నేను ఎంత వ్యయించు చున్నను విరక్తి పొందదు సరియే గదా, పైగా అతిస్నేహము కలదై సంతోషించు చున్నది. ఇందులకు ఏమి ప్రత్యుపకారము చేయుదును? దానివలన నాప్రతిజ్ఞ కూడ సిద్ధించును గాక.' ఆమాట విని మంత్రి యి ట్లనియె:— 'దేవా, అ ట్లయిన ప్రపంచబుద్ధి యను సన్యాసి నీకు ఏ

మహార్ఘ రత్నములు ఇచ్చెనో వానిలో కొన్నిటిని దానికి ఇమ్ము.' రాజిట్లనియె:—'వాని నన్నిటిని ఇచ్చినను ఇది చేసినదానికి కొంచెమయినను ప్రత్యుపకారముకాదు. ఈవిషయములో ఏప్రత్యుపకృతియు నాకు అగపడలేదు.' 'దేవా, ఆభిక్షువు ఏల నిన్ను అట్లు సేవించెనో చెప్పుము.' అని మంత్రి యడిగెను. ఆకథను వినుమని రాజు చెప్ప నారంభించెను.

పూర్వము పాటలీపుత్త్రములో ప్రతిదినము నాయాస్థానమునకు వచ్చి ప్రపంచబుద్ధియనుభిక్షువు ఒక్కొక్క చిన్న పెట్టె యిచ్చుచుండెను. సంవత్సరకాలము నేనును ప్రతిదినము పెట్టెను తెఱవకయే కోశాధ్యక్షునిచేతికి ఇచ్చుచుంటిని. ఒకనాఁడు దైవవశమున అతఁడిచ్చినపెట్టె నాచేతినుండి క్రింద జాఱి పడి పగులఁగా అందునుండి అంతవఱకు తెలియకుండి అపుడు నాకు తెలిసిన యాభిక్షువుయొక్క హృదయమో యన మహాశ్చర్యకరమయినరత్న మొకటి వెలువడెను. అంత నేను ఆపెట్టెల నన్నింటిని తెప్పించి అందలిరత్నముల నన్నింటిని తీయించి చూచి, ప్రపంచబుద్ధిని, 'ఏల నన్ను నిత్యము ఇట్టి రత్నము లిచ్చి యాశ్రయించుచున్నావు?' అని యడిగితిని. భిక్షు విట్లనియె:— 'రాఁబోవు కృష్ణచతుర్దశినాఁడు మహాశ్మశానములో నే నొకవిద్యను సాధింపవలసియున్నది. అందుకై నీవు సహాయుఁడవు గావలయును. వీరులసాహాయ్యముచేత సిద్ధులు నిర్విఘ్నముగాను సులువుగాను సిద్ధించును.' ఇట్లు

భిక్షువు పలుకఁగా నే నంగీకరించితిని. అతఁడు సంతోషించి పోయెను. పిమ్మట కృష్ణచతుర్దశి రాఁగా నేను ఆశ్రమణుని వచనమును జ్ఞప్తికి తెచ్చుకొని, ఆహ్నికక్రియలు గడపి, ప్రదోషము నెదురు సూచుచు, సంధ్యావందనాదికము చేసి, దైవవశమున నిద్రపోయితిని. ఆక్షణముందే హరి లక్ష్మీసమేతుఁడై గరుడు నెక్కి వచ్చి స్వప్నములో అగపడి యిట్లాన తిచ్చెను: "ఈప్రపంచబుద్ధి సార్థకనాముఁడు. వీఁడు మండలార్చనకై నిన్ను శ్మశానమునకు కొని పోయి బలివేయును. అందుకై నిన్ను చంపువాఁడై వాఁడు ఏమి చెప్పునో ఆపని చేయకుము. 'నీవు ముందు చేయుము, చూచి నేర్చుకొని నేను చేసెదను.' అనుము. అంతట వాఁడు ముందుగా అట్లు చేసి చూపును. ఆ సందులో వానిని తెగవేయుము. అంతట వాఁడు కోరినసిద్ధి నీకు లభించును." ఇట్లు పలికి విష్ణువు అంతర్ధానము పొందెను.

అంత నేను 'ఆహా! ఈమాయావిని శ్రీహరికృపచేత కనుఁగొంటిని. వీనిని చంపవలసిన దని హరియాజ్ఞ యయినది.' అని తలపోసి రాత్రి రెండవజామున కత్తి చేతఁబూని ఏకాకినై మహాశ్మశానమునకు పోయితిని. అప్పటికి భిక్షువు మండలము నర్చించియుండెను. అతఁడును నన్ను చూచి సంతోషించి 'రాజా, నీవు కన్నులు మూసికొని తలవంచుకొని భూమిమీఁద పడుము, అట్లు చేసిన మన కిద్దఱకును సిద్ధి కలుగును.' అనెను. 'నీవు ముందు చేసి చూపుము, చూచి నేర్చుకొని నేను చేసె

దను.' అంటిని. శ్రమణుఁడు అట్లే చేసెను. ఒకవ్రేటుతో వాని తలను ఖండించితిని. అంతట ఆకాశమునుండి 'రాజా, బళిబళి! ఈపాపాత్ముని భిక్షువును బలివేసితివి, నీవు చేసినపని సరి. ఇతఁడు కోరిన యాకాశగమనసిద్ధి నీకు కలిగినది. నీధైర్యమునకు నేను మెచ్చుకొంటిని. నేను కుబేరుఁడను. ఇంక నావలన ఏమివరము కావలయునో అడుగుము.' అని వాక్యము వినఁబడెను. అంత నేను కుబేరుని నమస్కరించి 'నిన్ను నేను తలంచుకొన్నప్పుడు వచ్చి నాకోరికను నెఱవేర్పుచుండు గాక.' అని వేఁడితిని. సరియే యని కుబేరుఁడును అంతర్హితుఁ డాయెను. నేను సిద్ధిని పొంది నానగరికి పోయితిని. నీకు ఆవృత్తాంతమును చెప్పినాఁడను. ఈయుపాయముచేత నేను మదనమాలకు ప్రత్యుపకారము చేసెదను. కనుక బుద్ధివరుఁడా, వేషచ్ఛన్నమైన ఈ రాజపుత్రి పరివారమును తోడ్కొని నీవు పాటలీపురమునకు పొమ్ము. నేను ప్రియతమకు ప్రత్యుపకారము చేసి, మరల ఇక్కడికి వచ్చుటకే, అక్కడికి వచ్చెదను.

విక్రమాదిత్యభూపతి యిట్లు పలికి దినకృత్యములు సలిపి అతనిని పరివారముతోఁగూడ పంపెను. మంత్రి పోఁగానే రాజు రాఁబోవువియోగమునకు కొందలం బడుచు ఆరాత్రిని మదనమాలతోఁ గడపెను. ఆమెయు అతఁడు దూరమునకు పోవు నని తనయంతరాత్మచే బోధింపఁబడినదో యన అతనిని మాటిమాటికి ఆలింగనముచేసి రాత్రి నిద్ర పోదాయెను. మఱు

నాఁడు ప్రాతఃకాలమునందు రాజు ఆవశ్యకక్రియలను జరిపి నిత్యదేవతార్చనగృహము ప్రవేశించి యచట కుబేరుని తలఁచుకొని, ఆదేవుఁడు దర్శన మీయఁగా 'దేవా, పూర్వ మిచ్చిన వరము ప్రకారము నాకు అయిదుగురను మహాప్రమాణులను అక్షయ సువర్ణ పురుషులను ఇమ్ము, వారి యవయవములను కొట్టి యుపయోగించుకొనుచున్నను ఆయవయవములు మరల పుట్టుచుండవలయును.' అని వేఁడెను. కుబేరుఁడు సరియే అని యంతర్హితుఁ డాయెను. రాజు తత్క్షణమే దేవతార్చనగృహములో ఆకస్మికముగా వచ్చియున్న సువర్ణపురుషులను ఏవురను చూచి యాశ్చర్యపడి, అచటినుండి ఆకాశమార్గమున తన నగరము పాటలీపురమునకు పోయెను. తనప్రతిజ్ఞనుమాత్రము మఱవ లేదు. అచట మంత్రులు పౌరులు అంతఃపురములు సకలమైనవారు సంతోషింపఁగా రాచకార్యములు చూచుకొనుచు మనస్సును మాత్రము ప్రతిష్ఠానమం దుంచియుండెను.

అంతట ఎంతసేపటికిని బయటికి ప్రియుఁడు రాఁడే మని సందేహించి మదనమాల దేవతార్చనగృహములోనికి వచ్చి అతనిం గానక అయిదుగురను సౌవర్ణపురుషులను చూచి, దుఃఖపడి 'నిశ్చయముగా నాప్రియుఁడు గంధర్వుఁడో విద్యాధరుఁడో? అతఁడు నాకు ఈపురుషులను ఇచ్చి ఆకాశమునకు ఎగిరిపోయినాఁడు, అతఁడు లేక ఈభారములు నాకేల?' అని చింతించి, తన పరిజనమును అతనివృత్తాంతము నడుగుచు, ఇల్లు

వెడలి సర్వత్ర తిరిగి ఎక్కడను అతనిం గానక ఏడ్చుచు, మరలి, మేడలయందును ఉద్యానములయందును ప్రీతి పొందక, దేహత్యాగమునకు నిశ్చయించుకొని యుండెను. 'దేవీ, దుఃఖపడకు, అతఁడు ఎవఁడో, కామచారి యైన దేవుఁడు, మరల నతఁడు నిన్ను కలసికొనును.' అని పరిజనము ఆశ కొలిపి ఓదార్పఁగా ఆవారనారీశిరోమణి ఊఱడిల్లి 'ఆఱుమాసములలోపల ఆమహాపురుషుఁడు నాకు మరల దర్శనము అనుగ్రహింపఁడేని, నేను సర్వస్వము దానమిచ్చి అగ్నిప్రవేశము చేసెదను.' అని ప్రతిజ్ఞ చేసి యతనిని ధ్యానించుచు దానములు చేయుచు ఉండెను. ఒకనాఁడు ఆమె ఆ బంగారపుమనుష్యులలో నొకని బాహువులను తెగఁగొట్టించి బ్రాహ్మణులకు దానము చేసెను. మఱునాఁడు ఆపురుషునికి మరల బాహువులు మొలచి యుండెను. అందులకు ఆశ్చర్యపడి క్రమముగా ఆయితరుల భుజములను కూడ తెగఁగొట్టించి దానము చేసెను. అందఱకును మరల భుజములు పుట్టినవి. మదనమాల ఆయక్షయత్వమును చూచి వారి భుజములను నిత్యము బ్రాహ్మణులకు వారు వారు చదివిన వేదములు ఎన్నియో అన్ని యిచ్చుచుండెను.

కొలఁదిదినములలో ఈదానకీర్తి సకలదేశములకును పర్వి, పాటలీపురమునుండి సంగ్రామదత్తుఁడను బ్రాహ్మణుఁడు దరిద్రుఁడు నాలుగు వేదములును చదివినవాఁడు ఆమెవలన దానము గొనుటకై వచ్చి ద్వారపాలకనివేదితుఁడై ఆమె

కడకు పోయెను. ఆమెయు వ్రతక్షామములును విరహపాండు రములు నయిన యవయవములతో అతనిని పూజించి అతఁడు చదివినవేదము లెన్నియో అన్ని సువర్ణబాహువులు అతనికి దానము చేసెను. దుఃఖితు లయిన యామెపరివారజనులవలన ఆబ్రాహ్మణుఁడు ఆమెయొక్క వృత్తాంతమును సర్వమును ఆమె ప్రతిజ్ఞను విని, ఆబంగారపు భుజములను లొట్టిపిట్టలమీఁద వేసి కొని, పాటలీపురమునకు పోయి, 'రాజు కాపాడనియెడల ఇంత ధనము ఉంచుకొని యనుభవించుట కష్టము' అని యాలోచించి, రాజసన్నిధికి పోయి యిట్లనియె:—"ఓ మహారాజా, నేను ఈ నగరములోనే నివసించుచుంటిని, బ్రాహ్మణుఁడను. నేను ప్రతి గ్రహార్థనై నరసింహరాజునగరములో మదనమాల యను వేశ్యయొక్క మహాకీర్తిని విని దానియింటికి పోయితిని. దాని యొద్ద ఎవఁడో దివ్యపురుషుఁడు ఉండి అక్షయ సువర్ణ పురుషులను ఏపురను ఇచ్చి ఎక్కడికో పోయినాఁడు. అది మొదలుగా ఆవియోగమునకు దుఃఖించుచు ప్రాణము విషము గాను, దేహము నిష్ఫలము గాను, ఆహారము దొంగబాధగాను, తలఁ చినదై పరివారజనులు ఓదార్పఁగా 'ఆఱుమాసములలో ఆ మహాపురుషుఁడు మరల దర్శన మీయఁడేని నేను అగ్నిప్రవేశము చేసెదను.' అని ప్రతిజ్ఞ చేసి మరణనిశ్చయము చేసికొని మహా సుకృతము కోరినదై ప్రతిదినము అమితముగా దానములు చేయుచున్నది. ఆహారము మానినను అత్యంతము శోభిల్లుచు

దానంతో యాస్వీకృతకరయు మీలితాళికులాకులయు మూఃస్థితయు నై కామకరియొక్క మదావస్థయుంబోలె నున్నట్టి యామదన మాలికను చూచి వచ్చినాఁడను. ఆమెను వదలిన యాకాము కుఁడు వంద్యుఁడును నింద్యుఁడు నని తలఁచెదను. అతనికై ఆమె ప్రాణము లర్పింప నున్నది. ఆమె నాకు నాచరించిన నాలుగు వేదములకు యథావిధిగా నాలుగు సువర్ణపురుష బాహువులను ఇచ్చినది. ఏలినవారు రక్షించు నెడల నేను మంచి యాగగృహము నిర్మించుకొని స్వధర్మము ననుష్ఠింపఁ గోరుచున్నాను.”

ఇట్లు ప్రియావృత్తాంతమును విని విక్రమాదిత్యమహా రాజు ఆమెను ఉత్కంఠతో తలంచుకొని బ్రాహ్మణుని కోర్కెని నెఱవేర్పఁ బ్రతీహారుని నియమించి, ఆమెయొక్క దృఢాను రాగమును ప్రతిజ్ఞను ఇంక నాయాఱుమాసముల కాలములో కొంచెమే శేషించి యుండుటను ఆలోచించి, వెంటనే మంచి మంత్రులకు రాజ్యము నొప్పగించి ప్రతిష్ఠానమునకు పోయి, జ్యోత్స్నాచ్ఛవసనయు విబుధాస్థితవైభవయు కృశయు నై అట్టి ప్రతిపచ్చంద్రరేఖనుంబోని యామదనమాలను చూచెను. వేశ్యయు ఆకస్మికముగా వచ్చినయతనిని నేత్రసుధాసారముం బోలె చూచి వెంటనే ఉద్భ్రాంతురాలై కౌఁగిలించుకొని, మరల పాఱిపోవు ననుభయముచేతనుంబోలె అతనిమెడను భుజలతాపాశముతో కట్టివైచి ‘నిరపరాధను నన్ను కృప లేక ఏల వదలితివి?’ అని యతనిని గద్గదస్వరముతో అడిగెను. రహ

స్యముగా చెప్పెద నని రాజు ఆమెను లోపలికి కొనిపోయెను. అచట ఆమెకు తన్ను తెలియఁబఱచుకొని నరసింహరాజును యుక్తిచే జయించుటకై తా నచటికి వచ్చినప్రతిజ్ఞను, ప్రపంచ బుద్ధిని చంపి ఆకాశగమనశక్తిని పొందుటను, కుబేరుని వరము వలన ఆ సువర్ణపురుషులను ఆమె కిచ్చుటను, బ్రాహ్మణుని వలన ఆమె వృత్తాంతమును ఆయాఱుమాసముల ప్రతిజ్ఞను వినుటను, చెప్పి మఱియు నిట్లనియె:—'ప్రియా, ఈనరసింహుఁడు దండు గలవాఁడు. వీనిని దండుతో గెలువ శక్యము గాదు. ఇతనిని ద్వంద్వయుద్ధములో కొట్టెదను. నేల నుండు నితనిని ఆకాశగామినై నేను చంప నుద్యమింపను. అధర్మయుద్ధము చేత జయమును క్షత్రియుఁ డెవఁడు కోరును? అతనిరాకను నాద్వారము దండవంములు నా కెఱింగించునట్లు ప్రతిజ్ఞ చేసి యుంటిని. ఈ విషయములో నీవు సాహాయ్యము చేయవలయును.' ఈ మాట విని ఆమె ధన్య నయితి నని పలికి అతని తోనే ఆలోచించి తనవందులను పిలిచి ఇట్లాజ్ఞాపించెను:—"నరసింహరాజు ఇంక నాయింటికి వచ్చునప్పుడు మీరు ద్వార ముందు జాగ్రత్తగా చూచుచు నిలిచి యుండుఁడు. అతఁడు ప్రవేశించునప్పుడు 'దేవా, నరసింహరాజు, నీయందు అనురక్తుఁడును భక్తుఁడును.' అని పలుమాఱు బిగ్గరగా పలుకుఁడు. 'ఇక్కడ లోపల ఎవఁ డున్నాఁడు?' అని యతఁ డడిగిన, 'విక్రమాదిత్యుఁ డున్నాఁడు' అని చెప్పుఁడు." ఇట్లు వారి కాజ్ఞా

పించి ద్వారపాలకురాలితో 'నరసింహరాజు వచ్చునప్పుడు ఆటంకపఱుప వలదు' అని యాజ్ఞాపించెను. మరల తననాయకునిఁ గూడి అత్యానందమగ్నురాలై యథేచ్ఛముగా దానములు చేయుచుండెను.

ఆ దానము బంగారపు మనుష్యులవలనఁ గలిగిన దని విని నరసింహరాజు ఆమెయింటికి వచ్చుటను తత్పూర్వము మానుకొన్నవాఁ డయినను కౌతుహలముతో ఇప్పుడు చూడ వచ్చెను. అతఁడు లోపలికి పోవుచుండఁగా చూచి బహిర్ద్వారము మొదలుకొని వందు లందఱును 'దేవా, నరసింహరాజు, నీకు ప్రణతుఁడు భక్తుఁడు' నని బిగ్గరగా పలికిరి. అంతట శంక గలిగి నరసింహరాజు 'ఇచట లోపల ఎవ రున్నారు?' అని యడుగఁగా, వందులు 'విక్రమాదిత్యమహారాజున్నాఁడు' అని చెప్పిరి. అంత నతఁడు 'ఆహా, ఈతఁడు పూర్వము తాను చేసిన ప్రతిజ్ఞను నిర్వహించినాఁడు! ఈరాజు ప్రతాపవంతుఁడు, ఇతని నేను దండుతో గెలువఁగూడదు. ఇతఁడు ఏకాకిగా నాయింటికి వచ్చియున్నాఁడు' అని తలపోయుచు వందిబృందనివేదితుఁడై విక్రమాదిత్యుని యొద్దకు పోయెను. ప్రవేశించుచుండఁగానే అతనిని నవ్వుచు విక్రమాదిత్యుఁడు ఎదురువోయి కంఠాలింగనము చేసికొనెను. అంతట ఆ రాజులు ఇద్దఱును కూర్చుండి పరస్పర కుశల మడిగికొనిరి. మదనమాల వారిప్రక్కను నిలిచి యుండెను. అంతట ప్రస్తావవశమున నరసింహరాజు విక్రమా

దిత్యుని ఆసువర్ణపురుషులు ఎట్లు కలిగిరని యడిగెను. విక్ర మాదిత్యుఁడు తాను శ్రమణాధముని తెగటార్చుటయు, కుబే రుని వరమువలన ఆకాశ గమన శక్తిని అక్షయ సువర్ణ పురు షులను పొందుటయు, మొదలయిన యద్భుత చరిత్రమును చెప్పెను. అంతట నరసింహరాజు అతఁడు మహాబలుఁ డనియు, పాపబుద్ధి కాఁడనియు నెఱిఁగి అతనితో చెలిమి చేసికొని తన రాజధానికి కొనిపోయి గౌరవించి పంపెను. పిమ్మట విక్రమా దిత్యుఁడు మరల మదనమాలయింటికి వచ్చెను. ఈరీతిని ఆ రాజు ఆ యసాధ్యప్రతిజ్ఞను తన మహిమచేత నెఱవేర్చుకొని తనరాజధానికి పో నుద్యోగించెను. మదనమాలయు అతనిని బాయలేక తానును కూడఁ బోవునదై తన యిల్లంతయు బ్రాహ్మ ణులకు ఇచ్చివేసెను. తన్నే కోరియున్న యీ మదనమాలతోఁ గూడ విక్రమాదిత్యమహారాజు తననగరము పాటలీపురమునకు పోయి సుఖముగ నుండెను.

దేవా, ఈప్రకారము వారకాంతకూడ రాణివాసము వలె నిత్యానురక్తయై యుండును. కులస్త్రీవృత్తాంతము చెప్ప వలయునా? ఇట్లు మరుభూతివలన కథ విని నరవాహనదత్తుఁ డును రత్నప్రభయు మిగుల సంతోషించిరి.

---

## ౫-వ తరంగము.



### గుణవరాదేవి కథ.

ఈప్రకారము మరుభూతి చెప్పఁగా నరవాహనదత్తుని ప్రోల సేనాపతి హరిశిఖుఁ డిట్లు చెప్పఁ దొడఁగెను:—సత్యముగా మంచియిల్లాండ్రకు భర్తకంటె పరాయణము లేదు. అందులకు నిదర్శనముగా ఈచిత్రకథను వినుము. వర్ధమానమని నగరము కలదు. దానిని వీరభుజుఁడనురాజు ధర్మాత్ముఁడు ఏలుచుండెను. ఆయనకు నూఱుగురు భార్య లుండిరి. వారిలో గుణవర యనురాణి ప్రాణములకంటె ప్రియతమయై యుండెను. నూఱుగురు భార్య లున్నను దైవయోగమువలన ఒకతెకయిన పుత్త్రుఁడు కలుగఁడాయెను. అంతట రాజు శ్రుతవర్ధనుఁడను వైద్యుని 'సంతానకర మయిన యౌషధ మే మయిన కలదా' యని యడిగెను. 'కలదు, సాధించెదను, అడవిమేఁకను తెప్పించి యిమ్ము' అని వైద్యుఁడు పలికెను. రాజు వెంటనే ప్రతిహారుని ఆజ్ఞాపించి అడవిమేఁకను తెప్పించి వైద్యుని కిచ్చెను. వైద్యుఁడు ఆమేఁకను రాజుగారివంటవాండ్రకు అప్పగించి దాని మాంసముతో ఉత్తమ మయిన రసకము చేయించెను. రాజు దేవేరుల నందఱను ఒకచోట చేర నాజ్ఞాపించి దేవతార్చనకు పోయెను. అంతట రాణు లందఱు ఒకచోఁ గూడిరి. గుణవర

మాత్రము వారితో చేరక దేవతార్చన చేయుచున్న రాజునొద్ద నుండెను. చేరియున్న యామాతులకందఱకు ఆ వైద్యుఁడు రసకమును చూర్ణయుక్తముగా త్రాగ నిచ్చెను, కొంచె మయినను శేష ముంపఁ డాయెను. అంతలో రాజు వచ్చి రసకము సర్వము వినియుక్త మయిన దని యెఱిఁగి వైద్యుని 'ఏమోయి, గుణవరకొఱకు కొంచమైనను మిగిలింపవైతివి? ఈ యత్నము సర్వము ఎవరికొఱకో దానినే మఱచితివి!' అనెను. ఆమాటకు వైద్యుఁడు వెలవెలఁ బోఁగా, మహారాజు వంటవాండ్రను ఆమేఁకమాంస మే మయిన శేషించియున్న దేమో అడిగెను. కొమ్ములు మాత్రము కల వని వారు చెప్పిరి. వైద్యుఁడు 'మంచిది, కొమ్ముల మాంసమున మంచిరసక మౌను.' అని అట్టి రసకము చేయించి చూర్ణము కలిపి గుణవరకు త్రాగ నిచ్చెను.

యథాకాలము తొంబదితొమ్మండుగురు రాణులును పుత్త్రులను కనిరి. కడమవారికంటె పిమ్మట గర్భిణి యైన గుణవరాదేవియు ఉత్తమలక్షణుని కుమారునిఁ గనెను. అతనికి శృంగమాంసరసపానముచేఁ గలిగినవాఁడు గాన శృంగభుజుఁ డని తండ్రి పేరు పెట్టెను. అతఁడు అన్నలతో ఎదుగుచు వయస్సులో వారందఱకంటె చిన్న యయ్యును గుణములలో పెద్దయై యుండెను. క్రమముగా రూపములో కాముఁడును బలములో భీమసేనుఁడును గా నుండెను. ఆ పుత్త్రునితోడి రాజ

ప్రియతమను గుణవరను చూచి కడమరాణులు ఓర్వలేక పో యిరి. వారిలో దుర్ణయతము అయశోలేఖ యనురాణి కడను సవతులతోఁ గూడఁబలుకుకొన్నదై రాజు తనయింటికి వచ్చి నప్పుడు, ముఖమున విన్నఁబాటు తోఁప నిట్లనియె. 'ఆర్య పుత్రా, ఇతరులను దోషమునుండి రక్షించువాఁడవు, నిదోష మును కాపాడుకోలేవు. నీయంతఃపురపాలి నయనువాఁడు సుర క్షితుఁడని కలఁడే, వానితోఁ గూడి యున్నది సుమా నీగుణవర. కంచుకిరక్షిత మయిన యంతఃపురములో మఱియొకఁడు దొర కమిచే ఈమె వానిని తగులుకొన్నది. ఈ వృత్తాంతము అంతః పురములో అందఱకును తేటతెల్లమే.' ఇట్లామె చెప్పఁగా రాజు ఆలోచించి కడమరాణులకడకు పోయి ఒక్కొక్కతెను అడిగెను. అందఱును కపటముచే ఆప్రకారమే పలికిరి. అంత రాజు క్రోధమును జయించి, యిట్లు తలపోసెను. 'ఇది ఆ యిరువురకు సంభవింపదు. ప్రవాదమా ఇట్టిదిగా నున్నది. కనుక నిశ్చయ మెఱుఁగక నే నేమియు చేయఁగూడదు. ఇపుడు వారి నిరువురను యుక్తిగా దూరీకరించి, అంతము చూచెదను.' ఇట్లు నిశ్చయించుకొని అంతఃపురరక్షకుని సురక్షితుని మఱు నాఁడు ఆస్థానములో 'ఓరి పాపీ, నీవు బ్రహ్మహత్య చేసితి వని నాకు తెలిసినది. కనుక నీవు ఉత్తమతీర్థయాత్ర చేయక నాకు మరల అగపడఁ గూడదు.' అనెను. 'దేవా, నే నెక్కడ బ్రహ్మ హత్య చేసితిని?' అని వాఁడు విభ్రాంతుఁడై యడుగఁగా

రాజు 'ఓరీ, గణకుఁడ నీవు చూపకుము. కాశ్మీరమునకు పొమ్ము. విజయక్షేత్రము, పావన మయిన నందిక్షేత్రము, వారాహ క్షేత్రమును, చక్రపాణిచే పవిత్రీకృతము లయినవి అచట కలవు. అందు గంగ వితస్త యనుపేరఁ బ్రవహించుచుండును. మడన క్షేత్రము, ఉత్తరమానసమును అందు కలవు ఆతీర్థములయం దెల్ల పూతుఁడ వయి పిమ్మట నన్ను చూడుము?' అని ఆజ్ఞాపించి వానిని దూరము పంపెను.

రాజు స్నేహకోపవిమర్శములు మనంబునఁ బెనంగొన గుణవరాదేవియొద్దకు పోయెను. అతనిని చూచి ఆమె 'ప్రాణేశ్వరా, ఏల యిట్లు నీమొగము చిన్నఁబోయి యున్నది?' అని యడిగెను రా జిట్లనియె;—'దేవీ, ఒక మహాజ్ఞాని ఈ దినము వచ్చి నాతో 'ఓ రాజా, కొంతకాలము గుణవరాదేవిని భూగృహములో నుంపవలయు, నీవును బ్రహ్మచారివిగా నుండవలయును; అట్లు చేయవేని నీకు రాజ్యము పోవును, ఆమెకు మృతి నిశ్చయము.' అని చెప్పి పోయినాఁడు, అందువలన నాకు ఈ ఖేదము కలిగి యున్నది.' పతివ్రత యయిన గుణవరాదేవి భయవిభ్రాంతులతో ని ట్లనియె:—'ఆర్యపుత్త్రా, ఏల నన్ను ఈ క్షణమే నేలమాళ్యములో వేయవు? నాప్రాణముచే నీకు ఉపయోగమయిన నేను ధన్యురాలనే గదా. నాకు మరణ మైన నగుఁగాక, నీకు ఖేదము కలుగకుండును గాక. స్త్రీలకు ఇహపరములయందు పతియేగదా గతి.' ఇట్లు ఆమె

పలుకఁగా బాష్పాకులలోచనుఁడై ప్రభు విట్లు తలపోసెను:—ఈమెయందు దోష మున్నట్లు అగపడదు. వారసు ముఖచ్ఛాయ వాడకయే భయము లేకయే అగపడినాఁడు. అయినను ఈ ప్రవాదముయొక్క నిశ్చయమును కనిపట్టెదను.' ఇట్లు తలపోసి, ఆమెతో 'దేవీ, ఇచటనే భూగృహము చేయ సెలవిమ్ము.' అని యడిగెను. ఆమెయు అంగీకరించెను. రాజు అట్లే ఆమెను భూగృహములో నుంచెను. కుమారుఁడు శృంగభుజుఁడు తల్లిగతి యెఱిఁగి దుఃఖితుఁడై వచ్చి యడుగఁగా, రాజు ఆమెకు చెప్పిన కారణమునే అతనికిని చెప్పెను. ఆమెయు రాజునకు హితమని తలఁచి ధరాగృహమును స్వర్గముగా తలంచి యుండెను. పతివ్రతలకు స్వసుఖము లేదు, భర్తృసుఖమే వారిసుఖము.

ఇట్లు జరుగఁగా అయశోలేఖ నిర్వాసభుజుఁడను తన కుమారునితో నిట్లనియె:—రాజు మనపగతురాలిని గుణవరను గోతిలో వేసినాఁడు. ఆమెకుమారుఁడు ఈ దేశమునుండి పోయిన మనకు మంచిది. కనుక శృంగభుజుని దేశమునుండి త్వరగా వెడలఁగొట్టు నట్టు భ్రాతలతోఁ గూడి యుక్తి వెదకుము. ఇట్లు తల్లి యుపదేశింపఁగా, అతఁడును కడమ భ్రాతలకు ఆ యుద్దేశ్యమును తెలిపి యుక్తి వెదకుచుండెను. ఒకనాఁడు ఆ రాచకొమరులందఱు మేడమీఁద ఘోరరూప మయిన యొక గొప్ప కొంగను చూచి ఆశ్చర్యపడుచుండఁగా, ఒక క్షపణకుఁడు

జ్ఞాని ఆదారిని వచ్చి, వారితో 'రాజపుత్త్రులారా, ఇది కొంగ గాదు అగ్నిశిఖుఁడను నొక రాక్షసుఁడు, ఈ రూపమున నగరములను నాశము చేయుచు సంచరించుచుండును. కనుక నీవిని బాణములతోఁ గూల్పుఁడు. ఇక్కడ దెబ్బతిని పోవునుగాక.' అనెను. ఆతొంబదితొమ్మండుగురును కొంగమీఁద బాణములను ప్రయోగించిరి. ఒకటియయినను కొంగకు తగుల లేదు. అంతట నాదిన్నమొలకుపణకుఁడు మరల వారితో ని ట్లనియె:—'మీ తమ్ముఁడు శృంగభుజుఁడు ఈ కొంగను కొట్టఁగలఁడు. అతఁడు తగిన ధనుస్సును చేపట్టును గాక.' ఆ మాట విని దుర్మార్గుఁడు నిర్వ్యాసభుజుఁడు తల్లిమాట జ్ఞప్తికి తెచ్చుకొని, యిట్లు ఆలోచించెను. 'ఇదే శృంగభుజుని వెడలఁగొట్టుటకు ఉపాయము. ఇతనికి నాయనగారి బంగారపు ధనుర్బాణముల నిచ్చెదను. ఆ బంగారుబాణమును రాక్షసుఁడు హరించుకొని పోయెనేని మేము ఆ బాణమును వెదకుచుండెదము; అంత నితఁడు దానిని తెచ్చుటకు రాక్షసునివెంటఁ బోవును. రాక్షసుని వెదకి కానలేక శరము లేక రాలేక ఇట నట ఇతఁడు తిరుగుచుండును.' ఇట్లాలోచించి ఆ పాపాత్ముఁడు శృంగభుజునికి తండ్రిగారి బంగారపు ధనుర్బాణముల నిచ్చెను. అతఁడు పుచ్చుకొని వి ల్లెక్కువెట్టి రత్నపుంఖ మయిన యా సువర్ణ బాణముతో కొంగ నేసెను. దెబ్బ తగిలినమాత్రాన కొంగ రక్తధారలు కాఱుచుండఁగా బాణముతోనే ఎగిరి పోయెను. అంతట నిర్వ్యాసభుజుఁడును వాని

కనుసన్న చే నితరభ్రాతలును శృంగభుజుని తమ తండ్రియొక్క-సౌవర్ణబాణములను గైకొనియు దానిని పోఁగొట్టె నందులకు తండ్రి తన్ను వెడలఁ గొట్టు ననియు అట్టిదానిని మఱి యొకటి చేయుట గాని సంపాదించుట గాని శక్యము గాదనియు మొఱ వెట్టుకొనిరి. శృంగభుజుఁడు వారికి ధైర్యము చెప్పి 'ఆ రాక్షసాధ ముని చంపి ఆబాణమును దెచ్చెద' నని పలికి తన ధనుర్బాణ ములు చేతఁ గొని నెత్తురుజాడను బట్టి ఆ బకము పోయిన మార్గము నెఱింగి ఆ దిక్కుననే పోయెను. ఇతరు లందఱును సంతోషించి తల్లులయొద్దకు పోయిరి.

రూపశిఖాశృంగభుజీయము.

శృంగభుజుఁడు దూరము పోయి, ఒక అడవిమధ్యను కాలమందు భోగార్థ మై లభించిన పుణ్యాతిశయఫలమువలె నున్న యొక పురమును చూచి, అందు ఉద్యాన తరు మూలమందు క్షణము విశ్రమించెను. ఆసమయమందు ఆచటికి త్రైలోక్య సుందరి యగు నొక కన్య వచ్చి ప్రేమపూర్ణము లయిన చూపులతో తన్ను చూచుచు సమీపింపఁగా ఆకన్యను శృంగ భుజుఁడు 'ఓహరిణాక్షీ, ఈపురము పే రేమి? ఇది ఎవరిది? నీ వెవతవు? నీ విచటి కేల వచ్చితివి?' అని యడిగెను. అంత నామె లజ్జాపరవశ యై నేలఁ జూచుచు 'ఇది ధూమపుర మను పట్టణము, సకలసంపదల కాస్పదము, ఇందు అగ్నిశిఖుఁ డను రాక్షసపుంగవుఁడు వసించుచున్నాఁడు. నేను ఆయన కొమారి

తను, నాపేరు రూపశిఖ. నీ యసామాన్య సౌందర్యమును చూచి నీయొద్దకు వచ్చితిని. నీ వెవరవు? ఇక్కడి కేల వచ్చినాఁడవు? చెప్పుము.' అని యడిగెను. అంత నతఁడు తన పేరు, తండ్రిపేరు, తాను బాణమునిమిత్తము ఆ ధూమపురమునకు వచ్చుటయు, సర్వమును తెలిపెను. ఆమె సర్వమును తెలిసికొని అతనితో 'నీ సాటి విలుకాఁడు ముల్లోకములలోను లేఁడు. ఎట్లనఁగా, నీవు బకరూపి యయిన మానాయనను కూడ కొట్టితివి. ఆబంగారపుబాణము నేను క్రీడార్థము పుచ్చుకొంటిని. నాయనకు మహాదంష్ట్రుఁ డనుమంత్రి అప్పుడే విశల్యకరణి మొదలైన మహౌషధములతో గాయమును మాన్పినాఁడు. నేను ఇప్పుడు పోయి నాయనకు తెలిపి నిన్ను కొని పోయెదను. ఆర్యపుత్రా, నీకు నా యాత్మను సమర్పించితిని.' అని పలికి, రూపశిఖ తండ్రియొద్దకు పోయి 'నాయనా, దేవాంశ సంభూతుఁ డొకరాజపుత్త్రుఁడు వచ్చియున్నాఁడు, అతఁడు మనుష్యుఁడు కాఁడు. అతని కిచ్చి నన్ను పెండ్లి సేయువేని ప్రాణము వదలెదను.' అనెను.

తండ్రి యిట్లనియె.—'అమ్మా, మనుష్యులు మనకు ఆహారము, అయినను నీకోరిక యంత దృఢ మేని ఆ రాజపుత్త్రుని ఇచటికే కొని రమ్ము.' రూపశిఖయు అట్లే చేసెను. ఎదుట వచ్చి నమ్రుఁడై యున్న శృంగభుజునితో అగ్నిశిఖుఁడు 'రాజపుత్త్రా, నామాట కొంచె మైనను అతిక్రమింప వేని రూపశిఖను నీ కిచ్చెదను.' అనెను. 'నీ మాట కొంచెమేని అతిక్రమింపను'

అని శృంగభుజుఁడు పలికెను. అగ్నిశిఖుఁడు సంతోషించి 'అట్లైన నీవు స్నానము చేసి రమ్ము. స్నాన గృహమునకు పొమ్ము.' అని శృంగభుజునితో పలికి, రూపశిఖను ఆమె భగినుల నందఱను తోడ్కొని రమ్మని యాజ్ఞాపించెను. వారిద్దఱును అట్లే పోయిరి. రూపశిఖ శృంగభుజునితో నిట్లనియె. "ఆర్యపుత్రా, నాకు నూఱుగురు భగినులు లున్నారు. మాకందఱకు ఒకటియే రూపము. అందఱకు కంఠములో సమానమయిన హారలత లున్నవి. మానాయన మమ్మందఱను కూర్చి నీతో 'వీరిలో నీ ప్రియ యెవతెయో దానిని వరింపుము.' అని పలుకును. ఇతని వ్యాజాభిప్రాయ మిది యని నే నెఱుంగుదును. ఇందులకుఁ గా దేని ఈయన మమ్మందఱను ఏల ఒక చోటఁ గూర్చును. ఆసమయమునఁ నేను నా హారలతను మెడను దాల్పక శిరంబునఁ దాల్చెదను. ఆయానవాలు చూచి వరణమాలను నా కంఠమున నుంపుము. మా తండ్రి పిశాచప్రాయుఁడు. ఇతనికి వివేకము లేదు. జాతిసిద్ధమయిన యితని స్వభావము నా విషయమునఁ గూడ ఎచ్చటికి పోవును? కనుక ఈయన ఏమేమి చెప్పినను అంగీకరించి నాతో చెప్పవలసినది. ఆపై యుపాయము నాకు తెలియును." ఇట్లు పలికి ఆమె భగినులయొద్దకు పోయెను. శృంగభుజుఁడు చేటికలు గొలువ జలకమాడి మరల అగ్నిశిఖునియొద్దకు పోయెను. అతఁడును, వీరిలో 'నీప్రియకు దీని నిమ్ము' అని శృంగభుజునిచేతికి పుష్పమాల నిచ్చెను. అతఁడు దానిని పుచ్చుకొని పూర్వము

ఏర్పఱుచుకొన్న సంకేతమువలన రూపశిఖ నెఱిఁగి ఆమెకంత మందు ఉంచెను. 'అగ్నిశిఖుఁడు జేపు మీకు వివాహాము చేసెదను.' అని ఆయిరువురతో పలికి అందఱను పంపెను.

మరల శృంగభుజుని పిలిచి యిట్లనియె: 'ఈ నుక్కి కొడ్లను రెంటిని ఊరివెలుపలికి తోలుకొనిపోయి అచట చేసి యున్న పుట్టెడునువ్వులరాశిని పొలములో చల్లిరమ్ము.' అందుమనకు శృంగభుజుఁడు సరియే యనియు, దిగులుపడి ఆవృత్తాంతమును రూపశిఖతో చెప్పెను. ఆమె తన మాయచే ఆపని సాధించెద నని చెప్పి అతని దిగులు తీర్చెను. ఆ మాటప్రకారము అతఁడు పొలమునకు పోయి దిగులుతోనే దున్నుచు చల్ల నారంభించెను; ఆ క్షణమందే ప్రియయొక్క మాయాబలముచే చల్లకము ముగిసినది. అందుమనకు ఆశ్చర్యపడి, పోయి, నువ్వులు చల్లితి నని అగ్నిశిఖునికి తెలియఁజేసెను. వంచకుఁడయిన యారాక్షసుఁడు మరల నిట్లనియె:— 'నాకు తిలలను చల్లుటవలన ప్రయోజనము లేదు. వానిని మరల రాశి చేయుము.' అంత నతఁడు ప్రియయొద్దకు పోయి ఆవృత్తాంతమును చెప్పెను. ఆమెయు అతనిని ఆచోటికి పంపి తనమాయచే అసంఖ్యముగా చీమలను సృజించి వానిచేత మరల ఆ నువ్వులను రాశి చేయించెను. దానిని చూచి అతఁడు మరల పోయి అగ్నిశిఖునితో నువ్వులు రాశిచేసితి నని చెప్పెను.

మూర్ఖుఁడు అగ్నిశిఖుఁడు శౌర్యముచే మరల నిట్లనియె:

"ఇచటికి దక్షిణముగా రెండామడలదూరమున అరణ్యములో శివాలయ మున్నది; అందు నాప్రియభ్రాత ధూమశిఖుఁడున్నాఁడు. అచటికి నీ విప్పుడు పోయి ఆ దేవాలయము నెదుట ఇట్లు చెప్పవలయును: 'ఓ ధూమశిఖుఁడా, రేపు ఉదయమున రూపశిఖకు వివాహము కాఁబోవుచున్నది. నీవు సపరివారముగా అందులకు రావలయును. నిన్ను పిలుచుటకు అగ్నిశిఖుఁడు నన్నుఁ బంపఁగా వచ్చినాఁడను.' ఈ మాట అక్కడ చెప్పి నీవు త్వరగా ఇచటికి ఈ దినమే రమ్ము. రేపు నాకొమారితను రూపశిఖను వివాహ మాడుము." అందుల కంగీకరించి ఆ దంతయు శృంగభుజుఁడు రూపశిఖతోఁ జెప్పెను. ఆసాధ్వి అతనికి తన గుఱ్ఱము మట్టి నీళ్లు ముళ్లు నిప్పు ఇచ్చి ఇట్లనియె: 'ఈ గుఱ్ఱ మెక్కి ఆదేవళమునకు పోయి మానాయన చెప్పిన పిలుపును ధూమశిఖునిఁగూర్చి త్వరగా పలికి శీఘ్రము ఈ గుఱ్ఱముమీఁద దాఁటు గొట్టి రమ్ము. మాటిమాటికి మెడ త్రిప్పి వెనుక చూచుచుండుము. ధూమశిఖుఁడు గనుక నీవెనుక వచ్చుచుండెనా, అతని కడ్డముగా నీవెనుక ఈమట్టిని పడవేయుము. అప్పటికిని మరల అతఁడు నీవెనుక వచ్చెనేని ఈజలమును నీవెనుక అతనికి అడ్డముగా పోయుము. అప్పటికిని వచ్చెనేని ఈముండ్లను అట్లే వేయుము. అప్పటికిని వచ్చెనేని ఆప్రకారమే ఈ నిప్పును చల్లుము. ఇట్లు చేసితివేని దైన్యములేక ఇచటికి వత్తువు. సందేహపడ వలదు. పొమ్ము. నా విద్యాబలమును చూడుము.'

అట్లే శృంగభుజుఁడు మట్టి మొదలయినవానిని కొని యడవిలో దేవాలయముకడకు పోయి, అందు ఎడమ వైపున గౌరియు కుడివైపున వినాయకుఁడును ఒప్పుచున్న విశ్వేశ్వరుని దర్శించి నమస్కరించి, ఆ యాహ్వానమును ధూమశిఖు నుద్దేశించి పలికి గుఱ్ఱము నెక్కరించి తఱుము నారంభించెను. క్షణములో వెనుకకు తిరిగి చూడఁగా ధూమశిఖుఁడు వచ్చుచుండెను. వానిని చూచి తత్క్షణమే ఆమట్టిని తన వెనుక వాని కడ్డముగా పాఱవైచెను. అది వెంటనే పర్వతాకారముగా నెదిగెను. రాక్షసుఁడు ఆపర్వతమును ఎట్టకేలకు దాఁటి రాఁగా ఆప్రకారమే రాజపుత్త్రిఁడు ఆ జలమును చల్లెను. అది వారిరువుర నడుమ ఉల్లోలకల్లోలములతోడి మహానది యాయెను. దానిఁ గూడ దాఁటి రాక్షసుఁడు రాఁగా శృంగభుజుఁడు ముండ్లను అడ్డము వేసెను. అవి గొప్ప యడవియై మధ్య ముండ్లతో నిండి యుండెను. దానిని కూడ దాఁటి రాక్షసుఁడు రాఁగా శృంగభుజుఁడు నిప్పును అడ్డము వేసెను. అది ఖాండవమువలె మండుచుండెను. దానిని చూచి ధూమశిఖుఁడు ఖిన్నుఁడై వచ్చిన దారినే మరలి పోయెను. ఆసమయములో రూపశిఖయొక్క మాయచే మోహితుఁడై యారాక్షసుఁడు నడచియే వచ్చి నడచియే పోయెను గాని ఆకాశ గమనమును మఱచియే పోయెను. రాజపుత్త్రుఁడు ఆమెయొక్క మాయాబలమునకు ఆశ్చర్యపడుచు భయము తీఱి ధూమపురము చేరెను. రూప

శిఖకు గుఱ్ఱమును అప్పగించి ఆవృత్తాంతము నంతయు చెప్పి సంతోషపెట్టి అగ్నిశిఖునియొద్దకు పోయి 'నీభ్రాతను ధూమ శిఖుని పిలిచి వచ్చితిని' అనెను. అందునకు ఆశ్చర్యపడి అగ్ని శిఖుఁడు 'నీ వక్కడికి వాస్తవముగా పోయి వచ్చితివేని అచటి గుర్తులు చెప్పుము' అని యడిగెను. రాజపుత్త్రుఁడు 'వినుము, అచట దేవాలయములో పరమేశ్వరునికి ఎడమనైపున పార్వతియు కుడినైపున వినాయకుఁడును కలరు.' అని చెప్పెను. అది విని అగ్నిశిఖుఁడు 'ఎట్లు ఇతఁడు నాభ్రాతయొద్దకు పోయియు ఆతనికి భక్షించుటకు వశపడక తప్పించుకొని వచ్చినాఁడు? కనుక నిశ్చయముగా ఇతఁడు మనుష్యుఁడు గాఁడు, ఎవఁడో దేవుఁడు. కనుక నాకొమారితకు తగిన భర్తయే.' అని యాలోచించి కృతార్థుఁ డయిన యారాజపుత్త్రుని రూపశిఖయొద్దకు పంపెను. తన కూఁతురే చేయుచున్న రహస్యభేదము నెఱుఁగఁ డాయెను. రాజపుత్త్రుఁడు ఆరాత్రి ఆమెతోఁగూడ భుజించి త్రాగి వివాహము నెదురు సూచుచు గడపెను. తెల్లవాఱఁగానే అగ్నిశిఖుఁడు ఆకుమారికను తనసిద్ధులకు తగిన విభవముతో అగ్నిసాక్షికముగా శృంగభుజుని కిచ్చి పెండ్లి చేసెను. రాజపుత్త్రుఁ డెక్కడ? రాక్షసకన్య యెచట? వీరికి వివాహ మెచట? పూర్వకర్మగతి చిత్రము గదా. ఆరాజపుత్త్రుఁడు పాపసంభూత యైన రాక్షసకన్యను రాజహంస బురదలో పుట్టిన తామరతీఁగనుం బోలె పొంది రాజిల్లుచుండెను.

అతఁ డచటనే రక్షస్సిద్ధికల్పితము లయిన వివిధ భోగములననుభవించుచు కొంతకాలము ఉండి, పిమ్మట రూపశిఖతో 'వర్ధమానపురమునకు రమ్ము, అది మా రాజధాని. అందు నుండి ఇతరులు నన్ను వెడలఁగొట్టుటను నేను ఓర్వలేను. నాబోఁటివారికి మానమే గదా ప్రాణము. కనుక నీవు నీజన్మభూమిని నాకొఱకు వదలివేయుము. నీతండ్రికి చెప్పుము. ఆబంగారపు బాణమును చేతఁ గొని రమ్ము.' అనెను. అందులకు ఆమె, 'ఆర్యపుత్రా, నీవు ఏమి యాజ్ఞాపింతువో అది నేను తప్పక చేసెదను. జన్మభూమి యేమి? స్వజన మేమి? నాకు సర్వము నీవే. మంచి యిల్లాండ్రకు పతికంటె వేఱు గతి లేదు. నాయనతో మాత్రము చెప్పఁగూడదు. అతఁడు మనలను పోనీయఁడు. కనుక ఆయనకు తెలియకయే మనము పోవలయును. పరిజనమువలన తెలిసికొని మనవెంట వచ్చెనేని బుద్ధిహీనుని భూతతుల్యు నతని నామాయచేత వంచించెదను' అనెను. ఆమాటకు అతఁడు సంతోషించెను.

మఱునాఁడు ఆమెయు రాజ్యార్థము నిచ్చి వెల లేని రత్నాలతో నిండిన యొక చాదుగను బంగారపుబాణమును చేతఁ గొని యతనితో బయలు వెడలెను. శృంగభుజుఁడును ఆమె గుఱ్ఱమును శరవేగ మనుదాని నెక్కెను. ఇద్దఱును ఉద్యాన వనవిహారమున కని మిష పెట్టి పరిజనమును వంచించి వర్ధమానపురముదారిని పోవుచుండిరి. వారు దూరము పోఁగా

ఆ వృత్తాంతము నెఱింగి తండ్రి కోపముతో ఆకాశమార్గమున వెంటఁబడి వచ్చెను. అతని యాగమనమును దాని వేగమువలని రొదచేత నెఱింగి రూపశిఖ పతితో 'ఆర్యపుత్రా, మనలను మరలించుటకై మానాయన వీఁడుగో వచ్చినాఁడు. నీవు నిర్భయముగా నుండుము. ఇతనిని నేను వంచించెదను చూడుము. నావిద్యచేత నీవు ఈయన కగపడవు.' అని చెప్పి ఆతనిని మాయచే కప్పి తాను పురుషరూపము దాల్చినదై అచట కట్టెలకొఱకు వనమునకు వచ్చిన యొక కట్టెలవానితో 'ఇచటికి గొప్పరాక్షసుఁడొకఁడు వచ్చుచున్నాఁడు, నీవు ఊరకుండుము.' అని పలికి వానిగొడ్డలి చేతఁగొని కట్టెలు కొట్టుచుండెను. అంతలో నా మూఢుఁడు రాక్షసుఁడు ఆమెను చూచి ఆకాశమునుండి దిగి 'ఓయి, ఈదారిని ఇద్దఱు స్త్రీపురుషులు పోయినారా? నీవు చూచితివా?' అని కట్టెలమోపువానిరూపమున నున్న తన పుత్త్రిని అడిగెను. అందున కామె ఖిన్నుఁడుం బోలె నభినయించుచు 'అయ్యా, కట్టెలు కొట్టు నాయాసముచే కంట నీళ్లు కాఱుచున్న మాకు ఎవరును అగపడలేదు. మేము చనిపోయిన రాక్షసపతి యగ్నిశిఖుని దహనము నిమిత్తమై కట్టెలు కొట్టుచున్నాము.' అనెను. ఆమాట విని యామూఢుఁడు 'ఓహో! ఏమి! నేను చచ్చిపోయితినా! కొమారితమాట అటుండ నిమ్ము. నేను ఇంటికి పోయి వాస్తవముగా చచ్చితినేమో అడిగెదను.' అని మరలి పోయెను.

ఆమె భర్తతోఁ గూడ నవ్వుచు మరల బయలు వెడలి పోవుచుండెను. రాక్షసపతి క్షణములో పోయి పరిజనుల నడుగఁగా వారు నవ్వుచు, అతఁడు బ్రదికియే యున్నట్లు చెప్పిరి. తాను బ్రదికియే యున్నట్లు విని సంతోషించి తత్క్షణమే మరల బయలువెడలి వచ్చెను. ఆరూఢ చేత తెలిసికొని తనపతిని మాయచే కప్పి, మగరూపము దాల్చినదై, ఆదారిని పోవుచున్న యొక టపావానిచేతిజాబులను పుచ్చుకొని యుండెను. అంతలో రాక్షసుఁడు వచ్చి ఆమెను చూచి 'ఓయి, ఈదారిని స్త్రీతోఁ గూడ పోవుచున్న యొక పురుషుని నీవు చూచితివా ?' అని యడిగెను. పురుషరూపిణి యైన రూపశిఖ నిట్టూర్పులు నిగుడ్చుచు 'అయ్యా, నేను త్వరగా పరుగున వచ్చుచున్నందున దారిలో అట్టివానిని చూడ నైతిని. తన నగరములోనే యుద్ధములో నిహతుఁడై కొనప్రాణములతో నున్న రాక్షసాధిపతి యగ్నిశిఖుఁడు తనభ్రాతకు ధూమశిఖునికి ఈజాబును నాచేత నిచ్చి పంపినాఁడు. నేను ధూమశిఖునియొద్దకు పోవుచున్నాను.' అంతట అగ్నిశిఖుఁడు సంభ్రాంతుఁడై 'ఏమి, నన్ను శత్రువులు చంపివేసినారా?' అని సందేహపడి ఆసంశయమును నివారించుకొనుటకై మరల తననగరికి పోయెను. 'నే నేమి చచ్చుట ఏమి? బ్రదికియే యున్నాను గదా'; అని యూమూఢుఁడు తలంపఁడాయెను. అహాహా! బ్రహ్మ చేసిన యీ తామసస్పష్టి యెంత చిత్రముగా నున్నది! రాక్షసాధిపతి యింటికి పోయి

అందఱును హసించునట్లుగా తాను బ్రదికియే యున్నట్టు విని సంతోషించి కూఁతును మఱచి వరల ఆమెవెంట రాఁడాయెను. ఆమెయు ఆప్రకారము తండ్రిని వంచించి పతిని గూడి పయనము జరిపెను. పతివ్రతలు పతిహితముకంటె వేఱేమియు నెఱుఁగరు గదా.

ఇట్లు శృంగభుజుఁడు భార్యతోఁగూడ ఆశ్చర్యమయిన యాగుఱ్ఱము మీఁద సవారి చేసి త్వరగా వర్ధమానపురము చేరెను. భార్యాసమేతుఁడై కుమారుఁడు వచ్చె నని విని తండ్రి వీరభుజుఁడు అతనికి ఎదురుగా వచ్చెను. సత్యభామాసమేతుఁడైన శౌరినింబోలె ఆసుతుని చూచి రాజు తన కష్టమే క్రొత్తగా రాజ్యసంపద గలిగి నట్లు సంతోషించెను. గుఱ్ఱము దిగి పాద ప్రణామము చేసిన కుమారుని సభార్యుని లేవనెత్తి కౌఁగిలించుకొని, హర్షబాష్పాంబువులతో తన కనుదోయి నిర్వేదశమనమంగళమును చేయుచుండఁగా, మహోత్సవముతో వారిని రాజధానికి తోడ్కొని పోయెను. 'ఎక్కడికి పోయితివి?' అని తండ్రి యడుగఁగా శృంగభుజుఁడు ఆమూలాగ్రముగా తన వృత్తాంతమును వక్కాణించెను. వారియెదుటనే రూపశిఖ శృంగభుజుని భ్రాతలను నిర్వాసభుజాదులను రప్పించి బంగారపు శరమును వారికి ఇచ్చివేసెను. దానిని చూచి అడిగి తెలిసికొని వీరభుజుఁడు నిర్వాసభుజాదులపై విరక్తుఁడై శృంగభుజు నొకనినే తనకు సుతునిగాఁ దలఁచెను. మఱియు బుద్ధి

మంత్రుఁ డయిన యా రా జిట్లు ఆలోచించెను. 'వీనిని నిరప రాధుని ద్వేషముచేత భ్రాతృనాము లైన యీశత్రువులు ఎట్లు వెడలఁ గొట్టినారో ఆప్రకారమే నిశ్చయముగా నాప్రియతమను నిర్దోషను గుణవరను వీని తల్లిని వీరితల్లులు దూషించినారు. కనుక ఇప్పుడే ఆమెను భూగృహమునుండి తెచ్చెదను. ఎంత కాలము ఈకష్టము పెట్టుదును?' అని యాలోచించి అయశో లేఖ యనురాణి యొద్దకు పోయెను. తన రాకకు సంతోషిం చిన యా యయశోలేఖను విశేషముగా సారాయి త్రాగించి తాను త్రాగక మేలుకొని యుండెను. రతాంతసుప్తయై యా రాణి 'ఆహా! గుణవరమీఁద లేనిదోషములు చెప్పనేని రాజు నాయొద్దకు వచ్చియుండునా?' అని పలవరించెను. అంత నామె యొక్క దౌష్ట్యమును గుణవరయొక్క నిర్దోషతను నిశ్చయ ముగా నెఱిఁగి రాజు ఆకోపముతో లేచి వెడలిపోయెను.

తనయింటికి పోయి మహత్తరులను పిలిచి 'వెంటనే గుణవరను నేలమాలియ నుండి బైటికి తీసి స్నానము చేయించి తెండ'ని యాజ్ఞాపించి, 'ఈక్షణము జ్ఞానిచే అనిష్ట శాంతికి చెప్పఁబడినది, అతని మాట ప్రకారము ఈమెయొక్క భూగృహవాసము ఈక్షణముతో సరి.' అని పలికెను. వారు సరియే యని పోయి ఆమెను ఆప్రకారమే స్నానము చేయించి కొని వచ్చిరి. ఆదంపతులు విరహసముద్రమును దాఁటి అన్యో న్యాలింగనములచేత తృప్తినొందక ఆరాత్రి గడపిరి. రాజు

శృంగభుజుని వృత్తాంతమును సంతోషముతో దేవికి వర్ణిం చెను. ఇంతలో అయశోలేఖ మేలుకొని తనమాట పొరపాటు వలన రాజు కోపగించి లేచిపోయె నని యూహించి మిక్కిలి దుఃఖించెను. తెల్లవాఱఁగానే రాజు గుణవరయొద్దకు కుమారుని శృంగభుజుని రూపశిఖాసమేతముగా పిలిపించెను. అతఁడును వచ్చి భూగృహమునుండి వెలువడినతల్లిని చూచి మిక్కిలి సంతోషించి నవవధూసమేతముగా తల్లిదండ్రుల కిరువురకు నమస్కారములు చేసెను. ప్రయాణము దాఁటి వచ్చిన యా పుత్త్రుని కోడలిని కౌఁగిలించుకొని గుణవర ఉత్సవముకంటె ఉత్సవము పొందెను. తండ్రి యాదేశమున శృంగభుజుఁడు తల్లికి సవిస్తరముగా తనవృత్తాంతమును రూపశిఖా వృత్తాంతమును వర్ణించెను. అంతట గుణవర సంతోషించి 'పుత్త్రా, నీకొఱకు ఈ రూపశిఖ ఏమి చేయలేదు? తన జీవితమును బంధువులను దేశమును వదలి ఈమె ఇచటికి వచ్చి ఈమాటని నీకు ఇచ్చినది. నీకొఱకు విధివశమున అవతరించిన దేవత సుమీ యీమె. ఈమె సకలపతివ్రతల శిరస్సునను పాదము నుంచినది.' అని పలికెను. ఆమాటలకు రాజు సంతోషించెను. రూపశిఖ వినయముచే తల వాంచి యుండెను.

ఆసమయములో పూర్వము అయశోలేఖచే దూషితుఁడయిన యంతఃపురాధ్యక్షుఁడు సురక్షితుఁడు తీర్థసేవలు చేసి వచ్చినాఁడు. ద్వారపాలకునిచే తెలుపఁబడి ప్రవేశించి పాదము

లకు మ్రొక్కిన యతనిని జూచి రాజు సంతోషించి మిక్కిలి సత్కరించెను. అతనిచేతనే కడమ రాణులను దుష్టురాండ్రను రప్పించి వారి నందఱను భూగృహములో వేయు మని వానికే ఆజ్ఞాపించెను. ఆమాటప్రకారము భూగృహములో పడి భయ పడి దుఃఖించుచున్న యారాణులను చూచి యాగుణవరాదేవి రాజు పాదముల వ్రాలి యిట్లు విన్నపించుకొనెను: 'దేవా, నన్నే మరల చిరకాలము భూగృహములో వేయుము, కనిక రింపుము, ఈభీతల దుఃఖమును నేను చూడ నోల్లను.' ఇట్లు ప్రార్థించి ఆమెయే వారి చెఱలను తప్పించెను. గొప్పవారికి శత్రువులయందు కనికరమే గదా ప్రతీకారము. అంతట వారు లజ్జితలై రాజు పొమ్మనఁగా రాజుయొక్క భుజాంతరమును అతఁడియ్యక పోయినను కోరుచున్న వారై తమ తమ యిండ్లకు పోయిరి. మహానుభావురాలిని గుణవరను రాజు మిక్కిలి గౌరవించి ఆమెవలన తన్ను కృతార్థునిఁగా తలఁచు కొని యుండెను.

పిమ్మట కడమకుమారులను విర్యాసభుజాదులను పిలి పించి రాజు యుక్తిచే కపటముగా నిట్లు పలికెను. 'పాపాత్ములు మీరు వర్తకుని బాటసారి నొకని చంపితిరి, నాకు తెలిసినది. కనుక మీ రిచట నుండఁగూడదు, తీర్థయాత్ర చేయుఁడు.' ఆ మాట విని ఎవ్వరును రాజునకు బోధింప లేరయిరి. ప్రభువు హితముఁనకు చొచ్చినయెడల ఎవరు వారింపఁ గలరు? అంతట

భ్రాతలు పోవుచుండఁగా శృంగభుజుఁడు చూచి జాలి గొని బాష్పాకులలోచనుఁడై తండ్రి పాదముల వ్రాలి వారి యొక్క యపరాధమును క్షమింపు మని వేఁడుకొనెను. రాజు ఆసుతుఁడు యశోదాశ్రితుఁడైన కృష్ణునింబోలె బాల్యమందు భూభృద్భారమును సహింపఁగలవాఁడని మెచ్చి అభిప్రాయమును మనస్సులోనే దాఁచుకొని ద్వేషమును తప్పించువాఁడై అతనిమాట నెఱవేర్చెను. భ్రాత లందఱును శృంగభుజుని ప్రాణప్రదునిఁగా తలంచిరి. సకల ప్రకృతులును శృంగభుజుని గుణవిశేషముచే అతనియందనురక్తు లయిరి. మఱునాఁడు రాజు గుణజ్యేష్ఠుని శృంగభుజుని అతనికన్న జ్యేష్ఠులు భ్రాతలున్నను యౌవరాజ్య పట్టాభిషిక్తుని చేసెను. అంత శృంగభుజుఁడు తండ్రి కెఱింగించి బలమును వెంటఁగొని దిగ్విజయార్థము బయలువెడలెను. తనబాహుపరాక్రమమున సకల రాజమండలమును జయించి, దిక్కులలో తనయశస్సును చల్లి, సిరిని ఇంటికి తెచ్చెను. పిమ్మట రాజ్యభారమును వహించిన వాఁడై, భ్రాత లందఱు నమ్రులై తన్నుఁ గొలుచుచుండ తల్లిదండ్రులను రంజించుచు, బ్రాహ్మణులకు దానములు చేయుచు, మూర్తీభవించిన యర్థసిద్ధివోలె రూపశిఖ ఒప్పుచుండ, సుఖముగా నుండెను. పతివ్రత లైన గుణవరా రూపశిఖలు పతులను సర్వవిధములచేతను ఆరాధించుచుండిరి.

ఇట్లు నరవాహనదత్తుఁడు రత్నప్రభాసమేతుఁడై హరి

శిఖునివలన కథ విని మిక్కిలి సంతోషించెను. పిమ్మట లేచి ఆహ్నికము చేసి తండ్రియొద్దకు భార్యాసమేతుఁడై పోయి భుజించి అపరాహ్ణమును గీత వాద్య వినోదములచేఁ గడపి రాత్రిని అంతఃపురములో రత్నప్రభాసహితముగాఁ గడపెను.

---

## ౬ - వ తరంగము.

### మరుభూతి సురద్రావిన కథ.

మఱునాఁడు ఉదయమున రత్నప్రభా గృహమం దున్న వత్సరాజు నొద్దకు గోముఖాది మంత్రులు యథాప్రకారము వచ్చిరి. మరుభూతి కొంచెము సురద్రాగి మదాలసుఁడై పూవులు దాల్చి గంధ మలంది ఆలస్యముగా కాళ్లు తడఁబడుచు కొందుకు మాటలచే నరవాహనదత్తుని నవ్వించుచు వచ్చెను. ఆసమయ మందు అతనిని నీతిపూర్వకముగా రంజితముఖుఁడైన గోముఖుఁ డి ట్లనియె:— 'యౌగంధరాయణుని కుమారుఁడ వయ్యును నీతి యెఱుఁగ వేమి? ప్రాతఃకాలమందు మద్యము త్రాగితివి, కైపుతో ప్రభువుకడకు వచ్చితివి.' ఆమాటకు కోపగించి మరుభూతి కైపుతో ని ట్లనియె: 'ఈమాట ఈ ప్రభువు గాని నాతండ్రి గాని చెప్పవలసినది, ఓరి ఇత్యకాత్మజుఁడా, నీ వెవఁడవురా నన్ను శిక్షింపను ? చెప్పుము.' ఇ ట్లతఁడు పలుకఁగా గోముఖుఁడు నవ్వుచు మరల ని ట్లనియె:— 'ప్రభువులు అవి

నీతుని స్వయముగా బెదరింతురా యేమి? వారి పార్శ్వస్థులు వానితో యథోచితముగా పలుక వలయును. సత్యముగా నేను ఇత్యకపుత్త్రుఁడను, నీవు మాత్రివృషభుఁడవు గదా. నీ వృషభత్వమును నిజడత్వమే చెప్పుచున్నది, రెండు కొమ్ములుమాత్రము నీకు తక్కువ.' గోముఖుఁ డిట్లు పలుకఁగా మరుభూతి యుత్తరము చెప్పుచున్నాఁడు: 'నీకే గోముఖునికి వృషభత్వము సరిపడియున్నను, దాంతుఁడవు గావుగాన నీకేజాతిసాంకరత కలిగినది.' ఆమాటకు అందఱు నవ్వుచుండఁగా, గోముఖుఁడు మరల నిట్లనియె: ఈమరుభూతి యత్నశతములచే నయినను రంధ్రము పడని వజ్రరత్నము. ఇందులోనికి గుణమును ఎవఁడు దూర్పఁగలఁడు? అయత్నముగా రంధ్రము పడునట్టిది పురుషరత్నము, అది వేఱు. ఇందులకు ఇసుక యానకట్టు వృత్తాంతము నిదర్శనము, వినుము.

పూర్వము ప్రతిష్ఠానములో తపోదత్తుఁడని బ్రాహ్మణుఁడొకఁ డుండెను. ఆతఁడు తండ్రి యెంతశ్రమ పెట్టినను బాల్యములో విద్యనేర్చినవాఁడు కాఁడు. పిమ్మట అందఱును నిందించుటచేత పశ్చాత్తాపము కలవాఁడై విద్యాసిద్ధికొఱకు గంగాతటాకమునకు పోయి తపస్సు చేయ నారంభించెను. అచట నతని యుగ్రతపస్సున కాశ్చర్యపడి, దానిని మాన్పుటకై ఇంద్రుఁడు బ్రాహ్మణవేషము వేసికొని సమీపమునకు వచ్చి, గంగ యొడ్డునుండి నీటిలోనికి ఇసుక యెత్తి యెత్తి వేయ

చుండెను. దానిని తపోదత్తుఁడు చూచుచుండి మౌనము మాని 'ఓ బ్రాహ్మణుఁడా, విసుగు లేక ఏల యిట్లు గంగలో ఇసుక వేసెదవు?' అని యడిగెను. నిర్బంధపూర్వకముగా అడుగఁగా ఆమాయ బ్రాహ్మణుఁడు 'అయ్యా, ప్రాణులు దాఁటిపోవుటకై ఈ నదిలో ఆనకట్టు వేయుచున్నాను,' అనెను. 'ఓయి మూర్ఖుఁడా, గంగలో ప్రవాహపు వడికి కొట్టుకొని పోవునదైన యిసుకతో ఆనకట్టు ఎప్పటి కయిన కట్ట నగునా ?' అనెను. 'ఇంత తెలిసినవాఁడవేని ఎట్లు చదువక వినక వ్రతోపవాసములచేతనే విద్యను సాధింప నుద్యోగించి యున్నావు? ఈ నీయిచ్ఛ, అధ్యయనము చేయక విద్యను సాధించుట కుండేటి కొమ్ము, ఆకాశమున చిత్రకల్పన, అక్షరము లేని వ్రాఁత. ఇట్లే సాధ్య మేని ఎవఁడును ఇఁక చదువఁడు,' అని యింద్రుఁడు పలికెను. అంతట తపోదత్తుఁడు అలోచించుకొని అది సరియే యని తలంచి తపస్సు మాని యింటికి పోయెను.

ఇట్లు బుద్ధిమంతునికి సులువుగా తెలుప వచ్చును. మరుభూతి దుర్మతి. ఇతనికి తెలుప శక్యము గాదు. తెలిపిన కొలఁదియు ఇతఁడు కోపగించును.

ఈప్రకారము గోముఖుఁడు పలుకఁగా మధ్యలో హరిశిఖుఁ డిట్లనియె:—దేవా, నిజముగా బుద్ధిమంతులకు తెలియఁజెప్పుట సులువు. పూర్వము కాశిలో విరూపుఁడును నిర్ధనుఁడు నయిన బ్రాహ్మణుఁ డొకఁడు విరూపశర్మ యనువాఁ డుండెను.

అతఁడు రూపహీనతకును దారిద్ర్యమునకును దుఃఖితుఁడై యిల్లు వదలి అడవికి పోయి రూప ధనములకై తపస్సు చేయ సాగెను. అంతట ఇంద్రుఁడు వికారపు రోగినక్క రూపమును దాల్చి యాబ్రాహ్మణుని యెదుట నగపడెను. ఒడలే అగపడ కుండునట్లు ఈఁగలు ముసరుకొనియున్న యానక్కను చూచి బ్రాహ్మణుఁడు ఇట్లు తలపోసెను. 'సంసారములో పూర్వకర్మ చేత ఇట్టివి కూడ పుట్టుచున్నవి. బ్రహ్మ నన్ను ఇట్టిదానినిగా చేయలేదు, కనుక నాకు కొంచెమే చెఱుపు చేసినాఁడు. దైవము కలిగించిన యనుభవమును తప్పించుకొనుటకు ఎవఁడు శక్తుఁడు?' ఇట్లు తలంచుకొని విరూపశర్మ మెల్లగా తపస్సు చాలించి ఇంటికి పోయెను. ఈప్రకారము బుద్ధిమంతునికి స్వల్ప యత్నముచేతనే బోధ చేయవచ్చును. మతిహీనునికి ఎంత చెప్పినను తెలియదు.

ఈప్రకారము హరిశిఖుఁడు చెప్పుటయు గోముఖుఁడు అంగీకరించుటయుఁ గని మరుభూతి తన్ను తా నెఱుంగక కైపుచే మఱియు కోపించి యిట్లనియె. 'గోముఖా, నీబోంట్లకు బలము వాక్కునసే గాని బాహుబలమునుము లేదు. నపుంసకు లగు వాచాలురకే కలహము బాహుశాలురకు లజ్జాకరముగా నుండును.' ఇట్లు పలుకుచు కలహమునకు కాలు ద్రవ్వుచున్న మరుభూతిని చెఱునగవు నవ్వుచు నరవాహనదత్తుఁడు ప్రభుని స్వయముగా సముదాయించెను. బాలసఖవాత్సల్యముచేత నతి

జని ఇంటికి పంపి దినకృత్యములు సేయుచు ఆదినమును సుఖముగాఁ గడపెను.

మఱునాఁడు మరల మంత్రు లందఱును రాఁగా మరుభూతి లజ్జావనతవదనుఁడై యుండఁగా రత్నప్రభ రాజుతో నిట్లు పలికెను. 'ఆర్యపుత్రా, ఆబాల్యస్నేహనిగళబద్ధమానసులు వీరు నీకు సచివు లగుటచేత నీవు ధన్యుఁడవు. ఇట్టి స్నేహపరుఁడవు నీవు ప్రభువ వగుటచేత వీరును ధన్యులు. మీరు ఒకరొకరిని ప్రాక్కర్మచే ఆర్జించినవారు.' ఇట్లామె పలుకఁగా వసంతకపుత్త్రుఁడు తపంతకుఁడు నరవాహనదత్తుని నర్మమిత్రుఁడు ఇట్లనియె:—మాకు సత్యముగా ఈయన పూర్వపుణ్యార్జితుఁ డయిన స్వామి. ఈలోకములో సమస్తము పూర్వకర్మవశముగానే ఉండును. అందునకు ఈకథను వినుము:—

## అ జ రు ని క థ.

శ్రీకంఠములో విలాసపురమునందు వినయశీలుఁ డని యన్వర్థ నామకుఁడు రాజుండెను. ఆతనికి కమలప్రభ యని ప్రాణసమానదేవి యుండెను. ఆయన ఆమెతో భోగాసక్తుఁడై చిరకాల ముండెను. ఇట్లుండఁగా కాలవశమున రాజునకు సౌందర్యహారిణి యయిన ముదిమి సంభవించెను. అందులకు రాజు మిక్కిలి దుఃఖితుఁడై 'మంచునఁ దోఁగిన కమలమువలె నరపవెండ్రుకలతో వాడిన యీ మొగమును దేవికి ఎట్లు చూపుదును? ఇసీ! నాకు ఇంతకంటె మరణము మేలు.' అని చింతించి

సభలో తరుణచంద్రుఁడను వైద్యుని చేరఁ బిలిచి ఆదరించి యి ట్లనియె:—'తరుణచంద్రుఁడా, నీవు మాయందు విశ్వాసము కలవాఁడవును సమర్థుఁడవు నని యెఱుఁగుచున్నాను, ఈముసలి తనమును పోఁగొట్టుటకు ఉపాయము కలదా?' ఆమాట విని కళామాత్ర సారుఁడైన యాతరుణచంద్రుఁడు వక్రుఁడు అన్వర్థ నాముఁడు పూర్ణతను కోరినవాఁడై 'ఈరాజు మూర్ఖుఁడు, వీనిని నేను ఉపక్రమముగా భుజింపవలయును.' అని తలపోసి 'ఓరాజా, ఎనిమిదిమాసములు భూగృహములో ఒంటరిగా నుండి యౌషధమును సేవింపుదువేని నీ ముసలితనమును పోఁగొట్టెదను.' అనెను. వెంటనే రాజు భూగృహ మొకటి చేయించెను. విషయలోలుపు లయిన మూర్ఖులు విచారింపరు గదా. 'రాజా, పూర్వులకు సత్త్వముచేతను తపస్సుచేతను యుగ ప్రభావముచేతను రసాయనములు సిద్ధించినవి. ఈకాల ములో అవి వినఁబడుచున్న వేగాని సాధ్యములు గావు. మఱియు సామగ్రి చాలనందున అవి అపాయమునే కలిగించును. కనుక ఈప్రయత్నము యుక్తము కాదు. మోసగాండ్రు తెలియని వాండ్రతో ఇట్లు క్రీడింపుదురు. దేవా, పోయినవయస్సు మరల వచ్చునా?' ఇత్యాదిమంత్రివచనము గాఢ భోగతృష్ణా వృత మైన తేనిహృదయము లోనికి చొర దాయెను. ఆ వైద్యుని మాటప్రకారము ఏకాకియై రాజు తనకు తగిన సకలపరివార మును నివారించి ఆభూగృహములోన ప్రవేశించెను. వైద్యుఁ

డొక్కఁడు తనయేకభృత్యునితో మాత్రము రాజునకు ఔషధా దికమందు పరిచారకుఁడై యుండెను. రాజు చీఁకటిగా నున్న తన హృదయములో ఇముడక బయటికి వ్యాపించి యంధకార మయ మైన యజ్ఞానమో యన నున్న యా భూగృహములో నివసించి యుండెను.

ఆఱు మాసములు కడచిన పిమ్మట ముసలితనము హెచ్చు టను చూచి శఠుఁడు వైద్యుఁడు రాజును పోలిన యొకానొక పురుషుని యౌవనవంతుని 'నిన్ను రాజును చేసెదను రమ్ము.' అని మొదుబడిక చేసి తీసికొని వచ్చెను. ఆ భూగృహమునకు దూరమునుండి సొరంగము త్రవ్వి రాజు రాత్రిలో నిద్రించు చున్నప్పుడు చంపి ఆసొరంగముగుండ కొనిపోయి ఒక చీఁకటి నూతిలో పాఱవైచెను. ఆపురుషుని ఆమార్గముననే భూగృహము లోనికి ప్రవేశపెట్టి సొరంగము కప్పివైచెను. మూర్ఖులయొద్ద నిరర్గళముగా అవకాశము పొందిన దుర్మార్గులు ఏమి సాహసము చేయరు? వైద్యుఁడు మఱునాఁడు మంత్రులు మొదలయిన యుద్యోగస్థు లందఱితోను ఇట్లు చెప్పెను. 'ఈరాజును నేను ఆఱుమాసములలో పడుచు వానిని చేసితిని. ఇఁక రెండుమాస ములలో ఈయనరూపము కూడ మాఱిపోవును, కనుక మీ రందఱును దూరమునుండియే కొంచెము మిమ్ములను అగపఱచు కొనుఁడు.' ఇట్లని వారిని ఒకొక్కరినిగా భూగృహద్వార మునకు కొనిపోయి వారి పేర్లు వారివారి యుద్యోగములును

క్రమముగా లోపలి పురుషునికి తెలుపుచుండెను. భూగృహము లోనున్న యాపుసుచువానికి ఈప్రకారము అంతఃపురపర్యంతము రెండు నెలల కాలము ప్రతిదినము యుక్తిగా తెలియఁబఱుచు చుండెను. సమయము రాఁగానే భోగములచే పుష్టుఁడయిన యా పురుషుని ధరాగృహమునుండి బయటికి తెచ్చి 'వీఁడుగో మన రాజు, ఈయనకు ముసలితనము తీఱినది' అని పలికెను. అంతట 'ఓహో! ఈతఁడు మన మునుపటి రాజే ఓషధుల చేత ఇట్లయినాఁడు.' అని సంతోషించి ఉద్యోగస్థులు ఆ పురుషుని చుట్టుకొనిరి. వాఁడు స్నానము చేసి రాజ్యము గ్రహించి ఉత్సవపూర్వకముగా సకలరాజ్యకార్యములు నెఱ వేర్పఁ దొడంగెను. అజరుఁడని పేరు పొంది రాజ్యము ఏలుచు అంతఃపురస్త్రీలతో క్రీడించుచు సుఖముగా నుండెను. ఇది అంతయు ఆశ్చర్యకర మైన వైద్యుని మహిమచేతఁ గలిగిన మార్పు అని తలఁచి యెల్లవారును ఆ కొత్తవానిని తమ పూర్వరాజే యని నమ్మియుండిరి. అజరుఁడును ప్రకృతులను రంజించి కమల ప్రభాదేవిని కూడ రంజించి, భేషజచంద్రుఁడు పద్మదర్శనుఁడు నను తన పూర్వమిత్త్రులను తనకు సమానులనుగా హస్త్యశ్వ గ్రామపూర్ణులను జేసి, భోగము లనుభవించుచుండెను. వైద్యుని తరుణచంద్రుని మాత్రము లోకసమాధానముకొఱకు సమ్మా నించెను గాని, సత్యధర్మహీనుఁడయిన యాతనియందు విశ్వాస ముంపఁడాయెను.

ఒకనాఁడు వైద్యుఁడు ఏకాంతమందు రాజుతో నిట్లనియె:—'ఏమి నన్ను గణింపక స్వతంత్రముగా వ్యవహరించుచున్నావు? నాచేతనే నీవు రాజవగుటను మఱచితివా యేమి?' ఆమాట విని అజరుఁడు వైద్యునితో నిట్లనియె:—'ఏమి! మూర్ఖుఁడవు నీవు, ఎవఁడు ఎవనికి కర్త? ఎవఁడు ఎవనికి దాత? పూర్వకర్మమే సకలమును చేయును, ఇచ్చును. కనుక నీవు అహంకారపడకు, నాకు ఈయైశ్వర్యము తపస్సుచే సిద్ధించినది. ఈవిషయమును నీకు త్వరగానే చూపెదను.' అంతట భయపడి వైద్యుఁడు 'ఓహో! ఏమి యితఁడు జ్ఞానివలె మాటలాడుచున్నాఁడు. స్వామిని వశపఱుచుకొనుటకు సాధనమైన స్వామిరహస్యజ్ఞత కూడ ఇచ్చట పనికి రాలేదు. ఇతనిని అనువర్తింపక నాకు విధిలేదు. ఇతఁడు నా కేమి ప్రత్యక్షముగా చూపునో చూచెదను గాక.' అని యాలోచించి ఊరకుండెను. మఱునాఁడు అజరరాజు తరుణచంద్రాదిసఖులతోఁ గూడ సికారి పోయి, నదీతీరము చేరి, ప్రవాహములో కొట్టుకొని వచ్చుచున్నయైన సువర్ణకమలములను చూచి, భృత్యులచే తెప్పించి, దగ్గఱనున్న తరుణచంద్రునికి వైద్యునికి చూపి, 'నీవు ఈగట్టుమీఁద ఎగువకు పోయి ఈకమలముల యుత్పత్తిస్థానమును వెదకి చూచి రమ్ము. నాకు ఈయద్భుతపద్మములయందు మిక్కిలి కుతూహలము గలిగి యున్నది. నీవు సమర్థుఁడవు నామిత్రుఁడవును.' అని పంపఁగా, ఏమియు చేయలేక వైద్యుఁడు తేనె చూపిన దారిని

నడచి పోయెను.

వైద్యుఁడు క్రమముగా ఆదారిని పోయి ఆనది యొద్దను ఒక శివాలయమును చూచెను. దాని యెదుట ఆనదీతీరమందు ఒక గొప్ప మఱ్ఱిచెట్టును దానియందు వ్రేలాడుచున్న మనుష్యుని యస్థిపంజరమును చూచెను. అంతట బడలికచే స్నానము చేసి దేవుని పూజించి కూర్చుండి యుండఁగా మేఘోదయమై వాన గురిసెను. కొన్ని వానచినుకులు ఆ మనుష్యకరంకముమీఁదఁ బడి క్రిందినదీజలములో పడినవి. అవి తత్క్షణమే పొందామర లాయెను. వానిని చూచి వైద్యుఁడు 'ఓహో! ఏమి యాశ్చర్యమిది! ఈనిర్జనవనములో ఎవనిని అడుగుదును? కాకపోయిన బ్రహ్మదేవుని సృష్ట్యద్భుతమును ఎవఁడెఱుఁగును? ఈ కనకపద్మముల చోటిని చూచితిని. ఇఁక నీ నరకళేబరమును ఈతీర్థములో పడవైచెదను. ఇందువలన ధర్మమయిన నగును గాక, దీనిమీఁద కమలము లయినను కలుగును గాక.' అని యాలోచించి, ఆదినము అక్కడఁ గడపి సిద్ధకార్యుఁడై మఱునాఁడు తనదేశమునకు మరలి పోయెను. కొన్ని దినములకు విలాసపురమునకు పోయి ప్రయాణముచే కృశించి దుమ్ము గమ్మి అజర రాజునొద్దకు చని ద్వారికులచేత రాజునకు తెలుపఁబడినవాఁడై రాజదర్శనము చేసి, రాజు అడుగఁగా ఆవృత్తాంతమును చెప్పెను.

అంతట రాజు ఆచోట ఎవరిని లేకుండఁ జేసి 'చెలి

కాఁడా, నీవు బంగారు తామరల చోటిని చూచితివి, ఆక్షేత్రము ఉత్తమము, అచట నీవు చూచినకళేబరము నా పూర్వజన్మదేహము. అచట ఊర్ధ్వపాదుఁడనై వ్రేలాడుచు దేహమును శోషింపఁ జేయుచు నేను పూర్వము తపస్సు చేసితిని. ఆ తపస్సుయొక్క మహిమచేత ఆ దేహముమీఁదుగా జాఱిన వర్షబిందువులచే బంగారవుఁదామరలు పుట్టును. ఆకరంకమును నీవు తీర్థములో వేయుట మంచి పనియే. నీవు ఆజన్మములో నాకు మిత్త్రుఁడవు సుమా. భేషజచంద్రుఁడు పద్మదర్శనుఁడును ఆజన్మములో నామిత్త్రులు. కనుక మిత్త్రుఁడా, తపోమహిమచేత నాకు రాజ్యమును పూర్వజన్మజ్ఞానమును గలిగినవి. నీ కిది యెల్ల యుక్తిగా ప్రత్యక్షముగా చూపితిని. నీవు నీళ్లలో వైచిన యస్థిపంజరమును కూడ గుర్తుతో వర్ణించితిని. కనుక నాకు నీవు రాజ్య మిచ్చితి వని ఇఁక అహంకారము వహింపకుము. కలంగి యున్న నీమనస్సును సమాధాన పఱుచుకొనుము. ప్రాక్తనకర్మకంటె దాత మఱి లేఁడు. ప్రాణి గర్భములో నున్నప్పటినుండి పూర్వకర్మవృక్షముయొక్క-ఫలమును అనుభవించుచుండును.’ అని చెప్పెను. అంతట వైద్యుఁడు అది యట్లే యని తెలిసికొని మరల అసంతుష్టిపడక అతనినే సంతుష్టితో సేవచేయుచుండెను. రాజు జాతిస్మరుఁడై వైద్యుని యథోచితముగా ధనములతో సమ్మానించి అంతఃపురములతోను మిత్త్రులతోను తన నీతిమహిమచేత రాజ్యము

నెల్ల జయించి తపఃప్రాప్త మయిన యా రాజ్యమును నిష్కంటక ముగా నేలుచు సుఖముగా నుండెను.

దేవా, ఈప్రకారమే ఈలోకములో ప్రాక్కర్మోపార్జిత మయిన శుభాశుభము సర్వమును ప్రాణులకు అనుభవమునకు వచ్చుచుండును. కనుక నీవు కూడ మాకు జన్మాంతరార్జితుండ వయిన స్వామివి, కావేని ఇతరు లెందఱో ఉండఁగా మాకే ప్రసన్నుఁడ వేల ?

ఇట్లు అపూర్వరమణీయ కథను తపంతకునివలన భార్యాసమేతముగా విని నరవాహనదత్తుఁడు ఆనందించెను. పిమ్మట స్నాన మై తల్లిదండ్రుల యొద్దకు పోయి వారి నేత్రములలో అమృతము గురియుచు వారితో భోజనము చేసి మంత్రులతోను భార్యతోను దినమును రాత్రిని గడపెను.

---

౭-వ తరంగము.

---

పిమ్మట రత్నప్రభ యింట ఆమెతో నరవాహనదత్తుఁడు కథాప్రసంగమున నుండి మందిరము వెలుపల ఆకస్మికముగా పురుషుని యాక్రందన ధ్వని విని, ఏ మది యని యడుగుచుండఁగా చేటికలు వచ్చి 'ప్రభూ, కంచుకి ధర్మగిరి ఏడ్చుచున్నాఁడు. మూర్ఖుఁడు ఇతని మిత్త్రుఁడొకఁడు తీర్థయాత్రలు చేసి ఇక్కడికి వచ్చి యితనితో ఇతనిభ్రాత మృతిఁ బొందినాఁ డని చెప్పి

నాఁడు. అందుచేత రాజగృహములో నున్నా నని కూడ తలం పక ఇతఁడు ఏడ్వసాగఁగా వెలుపలికి పరిజనులు ఇతనిని పిలుచు కొనిపోయినారు.' అని పలికిరి. ఆమాటకు యువరాజు జాలి పడుటఁ గాంచి రత్నప్రభ జాలి గొని యి ట్లనియె: 'అహా! ప్రియబంధుమరణమువలనఁ గలుగు దుఃఖము సహింప రానిది. అయ్యో! ఏల బ్రహ్మదేవుఁడు జనులను అజరామరులనుగా చేయఁ డాయెను!' ఇట్లు రాణి పలుకఁగా మరుభూతి ఆమెతో ని ట్లనియె:—దేవీ, మర్త్యులకు అమరత్వ మెట్లు గలుగును? అందులకు ఈకథను వినుము.—

## నా గా ర్జు ను ని క థ.

పూర్వము చిరాయు వనునగరములో చిరాయు వను రాజు వాస్తవముగా చిరాయువే ఐ సర్వసంపదలకును నిధి గా నుండెను. ఆయనకు బోధిసత్త్వాంశసంభవుఁడుఁ, దయాళువు దానశీలుఁడు నాగార్జునుం డనుమంత్రి విజ్ఞానవంతుఁ డుండెను. అతఁడు సర్వౌషధియోగము లెఱిఁగినవాఁ డయి రసాయనము సాధించి తన్ను తనరాజును చిరజీవులను చేసికొనెను. ఒకనాఁడు నాగార్జునుని కొడుకొకఁడు అందఱుకొడుకులలోను అతనికి ప్రియ మయినవాఁడు మృతిఁ బొందెను. అందువలన అతఁడు సంతాపస్వరూపమును అనుభవించినవాఁ డై మనుష్యులకు చావు తప్పుటకు ద్రవ్యములతో తపోదానప్రభావముచేత అమృతము చేయ నారంభించెను. చిట్టచివర ఒకయోషధిని

అందులో చేర్చుటకు కాలయోగము నెదురు చూచుచుండఁగా ఆవృత్తాంతము నింద్రుఁ డెఱిఁగి అశ్వీదేవతలను పిలిపించి వారితో "మీరు భూలోకమునకు పోయి నాగార్జునునితో నామాటగా 'ఏ మయ్యా, నీవు మంత్రి వయ్యును అనీతి నారంభించినాఁడవు? సృష్టికర్తను జయించుటకు యత్నము చేసెదవు. మరణధర్ములనుగా మర్త్యులను బ్రహ్మ చేసి యుండఁగా, నీవు అమృతమును సాధించి వారిని అమరులను చేయఁ జూచుచున్నావు. ఇట్లు చేసిన దేవమనుష్యులకు భేద మే ముండును? యష్టవ్యులు యాజకులు లేనియెడల లోకస్థితి యే మగును? కనుక ఈప్రయత్నము మానుము. మాన వేని దేవతలు కోపగించి శపింతురు. ఎవని కైనశోకముచేత ఈప్రయత్న మారంభించితివో ఆ నీసుతుఁడు స్వర్గములో సుఖముగా నున్నాఁడు.' అని చెప్పుఁడు." అని యాజ్ఞాపించెను. వారును ఆప్రకార మే నాగార్జునునియొద్దకు వచ్చి సత్కారములు వడసి ఆతనికి ఇంద్రుని యాజ్ఞను తెలిపి యతనికుమారుఁడు స్వర్గములో దేవతలతో సమానముగా నున్నాఁ డని చెప్పిరి. అంతట నాగార్జునుఁడు విషణ్ణుఁ డై 'ఇంద్రుని యాజ్ఞను చేయనేని దేవతలమాట యటుండనిమ్ము, ఈ యశ్వీదేవతలే నన్ను శపింపరా? కనుక ఈయమృతముమాట యటుండును గాక. నాకోరిక నెఱవేఱక పోయినది, నాకుమారుఁడు పూర్వసుకృతములచేత అశోచ్యమయినగతిని పొందినాఁడు.' అని యాలోచించుకొని అశ్వీ

దేవతలతో 'ఇంద్రునాజ్ఞను అనుష్ఠించితిని. అమృతప్రయత్న మును పూనితిని. ఇంక అయిదు దినములు మీరు రాకుండిన అమృతము సిద్ధించి యీలోకము అజరామర మై యుండును.' అని చెప్పి వారి యెదుట వారి మాటమీఁద సిద్ధప్రాయ మైన యీ యమృతమును నేలఁ బాఁతి పెట్టెను. అంతట అశ్వులు అతనిని వీడ్కొలిపి ఇంద్రునియొద్దకుఁ బోయి కార్య మయిన దని చెప్పిరి. దేవరాజు సంతోషించెను.

ఆసమయమున నాగార్జునుని ప్రభువు చిరాయువు తన పుత్త్రుని జీవహారుని యౌవరాజ్యపట్టాభిషిక్తుని చేసెను. అభిషిక్తుఁడై ప్రణామార్థ మై తనయొద్దకు సంతుష్టుఁడై వచ్చిన కుమారుని యతనితల్లి ధనపర చూచి 'పుత్త్రా, యౌవరాజ్యము వచ్చిన దని వృథా ఏల హర్షించుచున్నావు? రాజ్యప్రాప్తికి ఇది మెట్టు, రాజ్య ప్రాప్తి యేమో నీకు లేదు. నీతండ్రియొక్క యువరాజులు నీవంటివారు ఎందఱో పోయినారు. రాజ్యము నొకఁడయినను పొందలేదు. అందఱును మోసపోయిరి. నాగార్జునుఁ డిచ్చిన రసాయనమువలన నీతండ్రి ఇప్పటికి ఎనమన్నూఱు సంవత్సరములు బ్రదికి యున్నాఁడు. ఈరాజు అల్పాయువులను ఇంక నెందఱను యువరాజులను చేయునో ఎవ రెఱుఁగుదురు?' అనెను. అందులకు విషణ్ణుఁ డయిన పుత్త్రునితో ఆమె మరల, ''నీకు రాజ్యము వలయు నేని ఈ యుపాయము చేయుము. నాగార్జునమంత్రి ప్రతిదినము ఆహ్నికము తీర్చు

కొని ఆహారసమయమందు దాన మిచ్చువాఁడై 'ఎవని కేమి కావలయును?' అని యుద్ఘోషించును. ఆ సమయమందు నీవు ఆతనితలను నీ కిమ్మని యాచింపుము. అతఁడు సత్యవచనుఁడు. కనుక తల యిచ్చి మృతుఁడు కాఁగానే, ఆశోకముచే రాజు చచ్చి నైనను పోవును, తపోవనమున కైనను పోవును. ఇంతకంటె ఉపాయము లేదు." అని చెప్పెను. తల్లి యిట్లు చెప్పఁగా అతఁడు సంతోషించి అట్లే చేయుటకు నిశ్చయము చేసికొనెను. అయ్యో! రాజ్యలోభము బంధుస్నేహమును గూడ నాశము చేయును గదా.

మఱునాఁడు రాజసుతుఁడు నాగార్జునునియింటికి భోజనవేళకు పోయి కనుపెట్టుకొని యుండెను. మంత్రి బయటికి వచ్చి 'ఎవనికి ఏమి కావలయును?' అని యడుగఁగా, రాజకుమారుఁడు అతని తలను యాచించెను. 'పిల్లవాఁడా, నీకోరిక ఆశ్చర్యముగా నున్నది! మాంసాస్థిమయ మయిన నాతల నీ కెందునకు పనికి వచ్చును? అయినను ఇది నీకు కావలసినదే యేని కోసి తీసికొమ్ము.' అని నాగార్జునుఁడు పలికి మెడ సాచెను. రసాయనదృఢ మయిన యామెడను ఖండించుచున్న రాజపుత్త్రుని చేతిలో ఎన్నియో కత్తులు విఱిగి పోయినవి. అంతలో ఈవృత్తాంతము విని రాజు వచ్చి వారింపఁగా నాగార్జునుఁ డిట్లనెను:—'రాజా, నాకు పూర్వజన్మజ్ఞానము కలదు, నేను ఇదివఱకు జన్మజన్మమందును తొంబదితొమ్మిది జన్మములలో

నాతలను ఖండించి యిచ్చి యున్నాను. ఇది శిరోదానమునకు నాకు నూఁటవజన్మ. కనుక నీ వేమియు చెప్పకుము. నా యాచకుఁడు విముఖుఁడై పోఁడు. ఇప్పుడు నీపుత్త్రునికి నాశిరస్సు నిచ్చెదను. భవన్ముఖదర్శనార్థమై ఈ యాలస్యము చేసితిని.' ఇట్లు పలికి రాజును కౌఁగిలించుకొని యేదో చూర్ణము తెచ్చి రాజపుత్త్రుని కత్తికి పూసెను. దానితో నతఁడు కొట్టి నాగార్జునునిశిరమును తూఁటినుండి కమలమును బోలె ఛేదించివైచెను. అంతట గొల్లు మని రోదనము ఆరంభము కాఁగా, రాజు ప్రాణత్యాగము చేయ నుద్యోగింపఁగా ఆకాశవాణి యిట్లు పలికెను:—'రాజా, అకార్యము చేయకుము. ఈ నీచెలికాఁడు శోచనీయుఁడు కాఁడు, జన్మరాహిత్యమును పొంది బుద్ధునితో సమాన మయినగతిని పొందినాఁడు.' ఆవాణిని విని రాజు మరణప్రయత్నము మాని శోకముచేత దానములు చేసి తపస్సు కయి వనమునకు పోయి కాలక్రమమున తపస్సుచేత ఉత్తమ గతిని పొందెను. అంత నతనిపుత్త్రుఁడు జీవహారుఁడు రాజ్యమును పొందెను. రాజ్యము వచ్చెను గాని వెంటనే నాగార్జునునికుమారులు తమతండ్రిని అతఁడు చంపినద్వేషముచేత అతనిని చంపిరి. అతనితల్లి గుండె పగిలి చచ్చెను. దుర్మార్గమందు ప్రవేశించినవారికి క్షేమ మెట్లు కలుగును? మంత్రిముఖ్యులు మఱి యొకరాణికుమారుని శతాయువును రాజ్యమునకు అభిషేకము చేసిరి. ఈరీతిని నాగార్జునుఁడు ఆరం

భించిన మృత్యునాశన ప్రయత్నమును దేవతలు సహింపరైరి. అతఁడును మృత్యువశుఁ డైనాఁడు. కనుక బ్రహ్మ యీ జీవలోకమును అనిత్యముగాను దుర్వారదుఃఖ బహుళముగాను చేసినాఁడు. బ్రహ్మ యుద్దేశింపని దానిని చేయుటకు మనుష్యులకు నూఱు యత్నములచేత నయినను సాధ్యము గాదు. ఇట్లు కథ చెప్పి మరుభూతి విరమింపఁగా నరవాహనదత్తుఁడు మంత్రులతోఁ గూడ సభ చాలించి దినకృత్యశేషమును నిర్వర్తించెను.

---

## ౮ - వ తరంగము.

### కర్పూరికా నరవాహనదత్తీయము.

మఱునాఁడు ప్రాతఃకాలమందే నరవాహనదత్తుఁడు సోత్కంఠుఁడై మరరత్నప్రభను త్వరగా వచ్చెదనని చెప్పి సమాధానపఱిచి తండ్రితోడను వయస్యులతోడను గజాశ్వాదిపరివార సమేతుఁడై వేఁటకు వెడలెను. అచట ఏనుఁగుల కుంభములను చీల్చి వీరిచే నిహతములయి సొమ్మసిల్లిన సింహముల గోళ్లనుండి రాలిన ముత్తెములచే చల్లకము పొంది, బల్లెములకు తునిఁగిన పులులకోఱలచే మోసులెత్తి, లేళ్లరక్తధారలచేత చిగిర్చి, ఒడలెల్ల బాణములు గ్రుచ్చుకొన్న పందులచేత పూగుత్తులుదాల్చి, బాణహతములై పడినశరభములచేత ఫలితమై, గొప్పరొదతోడ పైఁబడుచున్న శిలీముఖములు గలిగి, వేఁటతీఁగ

అడవి కెల్ల శోభ యొసంగుచు అతనికి ప్రీతి చేసెను. క్రమ క్రమముగా అతఁడును బడలి విశ్రమించి మఱియొక వనమునకు గోముఖుఁడును తానును మాత్రము గుఱ్ఱము నెక్కి పోయి అచట గుళికాక్రీడ నారంభించెను; అంతలో నొక తాపసి యా మార్గమున రాఁగా ఆమె తలమీఁద అతనిచేతినుండి దూసిన గుళిక యొకటి పడెను. అంత నామె కొంచెము నవ్వి అతనితో 'ఓయి, నీ కింతగర్వమేసి, కర్పూరిక నీకు భార్య యాయెనా అప్పటి కెంత గర్వింతువో?' అనెను. వెంటనే నరవాహన దత్తుఁడు గుఱ్ఱము దిగి ఆమె పాదముల వ్రాలి యిట్లనియె:— 'అమ్మా, నిన్ను నేను చూడలేదు, దైవవశమున గుళిక నాచేతి నుండి దాఁటిపోయినది, ఓభగవతీ, నాపొరఁబాటును క్షమిం పుము.' అంత నామె 'పుత్త్రా, నాకు కోపము లేదు' అని శాంతముగా పలికి అతనిని ఆశీర్వాదముతో సంతోషపెట్టెను. నరవాహనదత్తుఁడు ఆమె జితేంద్రియయు సత్యతాపసియు నని యెఱిఁగి ఆమెను 'అమ్మా, నీవు చెప్పిన కర్పూరిక యెవతె? నన్ను క్షమించితి వేని దయ చేసి చెప్పుము, నాకు కుతూహల ముగా నున్నది.' అని యడిగెను. తాపసి యిట్లనియె:— 'సముద్రము నవతలిగట్టున కర్పూరసంభవ మనుపురము గలదు. అందు కర్పూరకుఁ డని సార్థకనాముఁడు రాజున్నాఁడు, అతనికి కర్పూరిక యని వరాంగి కుమారి కలదు. ఒక లక్ష్మిని దేవతలు మథించి కొని పోయి రని సముద్రుఁడు రెండవ లక్ష్మిని

అచట దాఁచుకొనెనా యేమి అను నట్లు ఆమె యొప్పుచున్నది. ఆమె పురుషులను రోసి వివాహము నంగీకరింప కున్నది. నిన్ను చూచినయెడల వివాహ మాడును. కనుక పుత్త్రికా, అచటికి పొమ్ము. అమెను పొందుదువు. పోవునప్పుడు నీకు అడవిలో మహాక్లేశము కలుగును. అందులకు నీవు బెదరవలదు. అది యెల్లను శుభపర్యవసాయి యగును.' ఇట్లు పలికి ఆతాపసి అంతర్ధానము పొందెను.

అంత నరవాహనదత్తుఁడు ఆమెహా కన్యను మదనాజ్ఞ ఆకర్షింపఁగా పార్శ్వవర్తిని గోముఖుని పిలిచి 'కర్పూర సంభవమునకు పోదము, కర్పూరికను చూడక క్షణ మైనను నేను ఉండఁజాలను, రమ్ము.' అనెను. గోముఖుఁడు 'దేవా, చాలు చాలును. ఏల యీసాహసము? ఆపుర మెక్కడ? ఆ సముద్ర మెక్కడ? అకన్య యెక్కడ? నీవు విన్నమాత్రమున ఏకాకివై ఈ వ్యాఘ్రనాజనమును వదలి, సందిగ్ధవిషయములో మానుషిని ఉద్దేశించి పోఁదలంచెదవు!' అని పలుకఁగా, నరవాహనదత్తుఁడు 'అట్లు గాదు, సిద్ధతాపసి పలుకు అనృతము గానేరదు. నేను అవశ్యముగా ఆరాజకన్యను సంపాదించుటకు పోవలయును.' అని పలికి, గుఱ్ఱ మెక్కి తత్క్షణమే బయలు వెడలెను. గోముఖుఁడును మఱుమాట ఆడక తనకు ఇష్టము కాకయున్నను వెంబడినే పోయెను. ప్రభువురు భృత్యులు మఱుమాట ఆడక అనుసరింపవలయుఁ గదా. ఇంతలోపల వేట

సాలించి వత్సరాజు తన కుమారుఁడు బలమునకుమ నున్నా డని తలఁచి తనపురమునకు పోయెను. తమదొర సైన్యమధ్య మం దున్నాఁ డని తలఁచి రాజకుమారుని బలము కూడ మరు భూత్యాదులతో నగరమునకు పోయెను. పోయి అచట విచారించి వత్సరాజాదు లందఱు నరవాహనదత్తునిఁ గానక రత్నప్రభయొద్దకు పోయిరి. ఆమె మొదట ఆవృత్తాంతమునకు విగులుపడి పిమ్మట తన విద్యచేత అతనిస్థితి నెఱింగి 'ఆర్య పుత్రుఁడు వనములో తాపసి చెప్పిన కర్పూరికను సంపాదించు కొనుటకు కర్పూరసంభవపురమునకు పోవుచున్నాఁడు. త్వర లోనే సిద్ధకార్యుఁడై గోముఖునితోఁ గూడ ఇచ్చటికి వచ్చును. చింతింప నక్కఱ లేదు. ఇది నావిద్యచేత తెలిసినది.' అని పలికి సపరివారుని వత్సరాజును ధైర్యపఱిచి, నరవాహనదత్తునికి మార్గక్లేశములు మాన్పుటకై యొక విద్యను పంపెను. సుస్త్రీలు భర్తహితమునే కోరుదురు గాని ఈసుపూనరు గదా!

ఈలోపల నరవాహనదత్తుఁడు అడవిలో గోముఖునితోఁ గూడ చాలదూరము గుఱ్ఱపుస్వారి చేసెను. అంతట దారిలో ఆకస్మికముగా ఒక కుమారి అతని కగపడి 'నేను మాయావతి యను విద్యను. నన్ను రత్నప్రభ పంపినది. మార్గములో నేను నిన్ను రక్షించెదను. నీవు చింత లేక పయనము నడపుము.' అని పలికి యదృశ్య యాయెను. అతఁడు చూచుచుండఁగానే

అదృశ్యురా లాయెను. దాని ప్రభావముచేత నరవాహన దత్తుఁడు దారిబడలిక తీఱి, రత్నప్రభయొక్క యనురాగమును పొగడుచు, సాయంకాలమున ఒకవనములో తేటనీళ్లు గల యొక సరస్సును దఱిసి, అందు గోముఖునితోఁ గూడ స్నానము చేసి, తీయని పండ్లు భుజించి మంచినీళ్లు త్రాగి, గుఱ్ఱములను రాత్రికి ఒకచెట్టు క్రింద కట్టి గడ్డి వేసి, తాను విశ్రమార్థము ఆగొప్ప చెట్టుపై ఎక్కియుండెను. దాని పెద్దకొమ్మలమీఁద నిద్రించు చున్నవాఁడై, కొంతసేపటికి గుఱ్ఱములు బెదరి విస్తారముగా సకిలింపఁగా, మేల్కొని, క్రింద చూడఁగా ఒక పెద్దసింహము గుఱ్ఱములమీఁదికి వచ్చియుండెను. దానిని చూచి నరవాహన దత్తుఁడు గుఱ్ఱములను కాపాడుటకై దిగుచుండఁగా గోముఖుఁడు నివారించి 'ఓస్వామీ! ప్రాణమునకు చూడక మంత్రాలోచన చేయక త్వరపడుచున్నావు! రాజత్వము మంత్రమూలము. నఖదంష్ట్రాయుధము లైన తిర్యగ్జంతువులమీఁదికి పోరాడఁ బోయెదవు. అరక్షార్థమే గదా మనము ఇక్కడి కెక్కితిమి." అనఁగా, ఆమాటవలన నిలిచి యువరాజు గుఱ్ఱమును సంహ రించుచున్న సింహమును చెట్టుమీఁదినుండియే కత్తి విసరి కొట్టెను. ఆ దెబ్బ తగిలియు బలి యయిన యా సింహము రెండవగుఱ్ఱమును కూడ చంపెను. రాజపుత్త్రుఁడు గోముఖుని కత్తిని తీసికొని దానిని విసరి సింహమును రెండుఖండములుగా కొట్టెను. సింహదేహమునుండి కత్తి తెచ్చుకొని చెట్టెక్కి ఆ

రాత్రి యెల్ల గడపెను. తెల్లవాఱఁగానే దిగి గోముఖునితోఁ గూడ కాలినడకను కర్పూరిక యుండెడినగరమును గూర్చి పోవుచుండెను. దారిలో గోముఖుఁడు వినోదార్థము ఈ కథను చెప్ప సాగెను.—

### ఇందీవరసేనుని కథ.

దేవా, ప్రసంగవశమున చెప్పెదను వినుము. అలకను జయించునది ఐరావతి యనునగరము కలదు. అందు పరిత్యాగసేనుఁడను రాజు ఏలు చుండెను. ఆయనకు ప్రాణప్రియలు ఇద్దఱు దేవేరు లుండిరి. ఒకతె అధికసంగమ యనునది అతని మంత్రికూఁతురు. రెండవది కావ్యాలంకార యనునది ఒకరాజు కూఁతురు. అతఁడు అపుత్త్రుఁడై వారితోఁ గూడ నిరాహారుఁడై పుత్త్రార్థము అంబికను గూర్చి తపస్సు చేసెను భక్తవత్సలయైన దేవి తపస్సునకు మెచ్చి స్వప్నములో అతనికి దివ్యఫలములు రెండు ఇచ్చి 'లే, ఈపండ్లను నీభార్యల కిచ్చి భక్షింపుమను. నీకు ఇందువలన ఇద్దఱు వీరులు పుత్త్రులు పుట్టుదురు.' అని చెప్పి అంతర్ధానము పొందెను. రాజు మేలుకొని చేతరెండుఫలములను చూచి సంతోషించి తెల్లవాఱఁగానే స్వప్నమును భార్యలకు చెప్పి సంతోషపెట్టి స్నానము చేసి పార్వతిని పూజించి వ్రతపారణ చేసెను. మొదటిరాత్రి అధికసంగమను గూడి ఒకపండు ఆమె కిచ్చెను. ఆమె దానిని భుజించెను. తన మంత్రిముఖ్యుఁడయిన యామె తండ్రిమీఁది గౌరవముచేత రాజు

ఆరాత్రి ఆమె యొద్దనే గడపెను. ఆరెండవ పండును రెండవ భార్యకై తన తలగడ క్రింద నుంచెను. రాజునకు నిద్ర పట్టఁగానే అధికసంగమ తనకే ఇద్దఱు కుమారులు సమానులు కలుగుదురు గాక యని కోరి, లేచి, రెండవఫలమును కూడ తలగడ క్రిందినుండి తీసి భక్షించెను. స్త్రీలకు సవతులయందు ద్వేషము స్వభావసిద్ధము గదా. తెల్లవాఱఁగానే రాజు లేచి పండును వెదకఁగా ఆమె చూచి 'ఆ రెండవ ఫలమును నేనే భుజించితిని' అని చెప్పెను. అంతట రాజు విమనస్కుఁడై అటనుండి పోయి ఆపగలు గడపి రాత్రి రెండవరాణి యొద్దకు పోయెను. ఆమె తన కొక పండు యాచింపఁగా ' నేను నిద్రించినప్పుడు నీ సవతి మోసము చేసి ఆపండును కూడ తినినది.' అని చెప్పెను. పుత్త్రదాయకమయిన యాఫలము తనకు లేక పోయినందులకు కావ్యాలంకార మిక్కిలి ఖేదపడెను.

పిమ్మట కాలక్రమమున అధికసంగమకు ఇద్దఱు కుమారులు కలిగిరి. రాజుకూడ పుత్త్రజన్మకు సంతోషించి కృతార్థుఁడై మహోత్సవములు చేసెను. వారిలో పెద్దవానికి ఇందీవరనిభేక్షణునికి ఇందీవరసేనుఁడనియు, రెండవవానికి తన యిచ్ఛ లేక యతనితల్లి ఆరెండవపండును భుజించినందువలన అనిచ్ఛాసేనుఁడనియు పేరులు పెట్టెను. సపత్నికి ఇట్లు కుమారులు గలిగినందులకు కావ్యాలంకార మిక్కిలి ఓర్వలేక యిట్లు తలపోసెను. ' ఆహా, ఈమె నాకు పుత్త్రులను కలుగనీయక

నన్ను వంచించినది గదా. ఈమె మీఁద నేను అవశ్యము పగ తీర్చుకో వలయును. ఈమె తనయుల నిద్దఱను, యుక్తిచే నాశము చేయ వలయును.' ఇట్లు తలంచి అందులకు ఉపాయము వెదకు చుండెను. ఆకుమారులు ఎదిగిన కొలఁదియు ఈమె హృదయ ములో నైరవృక్షము ఎదుగుచుండెను. వారు క్రమముగా యౌవనవంతులై జిగీషువులై తండ్రితో నిట్లు విన్నవించు కొనిరి:—'నాయనా, మేము అస్త్రములు నేర్చితిమి. యౌవన వంతుల మైతిమి. ఈభుజములను వ్యర్థముగా ఎట్లు భరించుచుం దుము. జిగీష లేనిక్షత్రియునికి బాహువు లేల? యౌవన మేల? కనుక, నాయనా, మాకు దిగ్విజయమునకు సెల వియ్య వల యును.' ఇట్లు కుమారులు విన్నవింపఁగా తండ్రి సంతోషించి వారికి యాత్రారంభమునకు సకలసన్నాహములు చేయించెను. 'మీకు ఎక్కడనయిన కష్టము కలిగెనేని ఆర్తిహరను అంబికను స్మరించుకొనుఁడు. ఆమెగదా మిమ్ము నా కిచ్చినది,' అని పలికి వారిని మంగళము చేసి పంపెను. రాజు వారి మాతాహుని తనమంత్రిప్రధానుని ప్రజ్ఞాసహాయుని ప్రథమసంగమనాముని వారికి తోడుగా పంపెను.

రాజపుత్త్రులు మొదట తూర్పును జయించి, జితులైన రాజు లనేకులు వెంట రాఁగా, దక్షిణదిక్కును జయించిరి. ఆవృత్తాంతమును విని తల్లిదండ్రులు మిగుల సంతోషించిరి. సవతితల్లి కావ్యాలంకార ద్వేషవహ్నిచేత మండిపడి సంధ

విగ్రహకాయస్థునికి లంచము లిచ్చి వానిచేత రాజుపేరు పెట్టి

"ఈ నాకుమారులు భుజదర్పముచే పుడమి నెల్ల జయించి నారాజ్యమును పట్టుకొనుటకు ఆలోచించి యున్నారు, కనుక మీరు నాభక్తు లేని విచారింపక వీరిని నాకుమారులను ఇద్దఱను చంప వలసినది."

అని రాజాజ్ఞను జాబు వ్రాయించి, రహస్యముగా ఆజాబును టపాలావానిచేతి కిచ్చి ఆకుమారులదండులో నున్న సామంతులకు పంపినది. వాఁడును రహస్యముగా రాజకుమారుల శిబిరమునకు పోయి జాబును సామంతులకు అప్పగించెను. వారందఱు దానిని చదువుకొని రాజనీతి అతికర్కశ యనియు రాజాజ్ఞ దాఁటరా దనియు ఊహించి, వేఱేమియు చేయ లేక కలియఁబలికికొని ఆకుమారులను వారి గుణాతిశయముచే అనురక్తు లయ్యును సంహరింప నిశ్చయించుకొనిరి. దానిని మాతామహుఁడు ఒక మిత్త్రునివలన నెఱిఁగి వారికి తెలిపి మంచిగుఱ్ఱము లెక్కించి శిబిరమునుండి రహస్యముగా అడవికి తోడ్కొని పోయెను. అతనితో రాత్రి పోవుచు రాజకుమారులు మార్గ మెఱుఁగక వింధ్యారణ్యము చొచ్చిరి. మఱునాఁడు మధ్యాహ్నమువఱకును పయనము పోయిన మూఁ రాజపుత్త్రుల గుఱ్ఱములు దప్పిచేత పడి చచ్చిపోయినవి. ఆఁకలి దప్పులచే మూర్ఛిల్లి, యెండదెబ్బయు తగిలి, తాతయు, వారు

ఏమియు చేయు లేక చూచుచుండఁగా నే మృతిఁ బొందెను. 'నిరప
రాధుల మయిన మమ్ము నాయన దుష్ట మయిన సవతితల్లికి ప్రీతి
గా ఇట్టిదశకు పాలు చేసెను గదా!' అని యాయన్నదమ్ములు
దుఃఖపడుచు పూర్వము తండ్రియే యుపదేశించినప్రకారము
అంబికను స్మరించిరి. శరణాగతవత్సలను దేవిని స్మరించిన మా
త్రాన ఆఁకలియు దప్పియు బడలికయు తీఱి బలవంతు లైరి.
అంత నానమ్మకముచేత దారికష్టము లేక పోయి, దేవినే వింధ్య
కాంతారవాసినిని దర్శించి, ఆమె యెదుట నిరాహారు లయి తప
స్సారంభించిరి.

ఈలోపల ఆశిబిరములో సామంతు లందఱును కూడి
వారి నిద్దఱను సంహరించుటకు వచ్చి, ఎంత వెదకియు ఎక్కడను
గానక తాము మంత్రభేదము చేసినట్లు రాజు తలంచు నని భయ
పడి, అందఱును పరిత్యాగసేన మహారాజు నెదుటికి పోయి,
ఆజాబును చూపి, జరిగినవృత్తాంతమును నివేదించిరి. రాజు
ఆవృత్తాంతమును విని ఉద్భ్రాంతుఁడై కోపించి వారితో ని
ట్లనియె:—'అది నాజాబు కాదు. ఇదేమో ఇంద్రజాలము.
మీరు ఈ మాత్రము తెలిసికో లేక పోయితిరా మూఢులారా?
మహాతపస్సువలన పొందిన సుతులను నేను చంపుదునా?
మీరు వారిని చంపియే యుందురు. వారి పుణ్యము వారిని
కాపాడినది. వారి తాత మంత్రితో ఫలమును చూపినాఁడు.'
ఇట్లు పలికి, రాజు, ఆతప్పుజాబు వ్రాసిన కాయస్థుని పిలిపించి,

వాఁడు పరారి యైనప్పటికిని పట్టించి తెప్పించి, చక్కఁగా విచారించి యథార్థము తెలిసికొని దండించి, ఆపని చేయించిన పుత్త్రీఘాతినిని భార్యను కావ్యాలంకారను పాపాత్మురాలిని భూగృహములో వేయించెను. అంతమును విచారింపక సాహసముచేత పాపము చేయువారికి విపత్తి రాకుండునా? రాజు పుత్త్రులతోఁ గూడ పోయి వచ్చిన సామంతులను తొలఁగించి, వారి యధికారములో క్రొత్తవారిని నియమించి పుత్త్రుల వార్తను సర్వదా విచారించుచు వారి తల్లితోఁ గూడ దుఃఖితుఁడై ధర్మములు చేయుచు అంబికను ధ్యానించుచుండెను.

ఈలోపల వింధ్యవాసిని ఇందీవరసేనుని తపస్సునకు మెచ్చి స్వప్నములో ప్రత్యక్షమై ఖడ్గ మొకటి ఇచ్చి ఇట్లాన తిచ్చెను:—'పుత్త్రా, ఈ కత్తి మహిమచే నీవు దుర్జయు లయిన శత్రువులను జయింతువు. నీవు ఏమి కోరినను అది నీకు లభించును. ఈకత్తిచేత మీయిద్దఱ యభీష్టములును నెఱవేఱును.' ఇట్లు ఆనతిచ్చి దేవి యంతర్ధానము పొందఁగా, ఇందీవరసేనుఁడు మేలుకొని, చేత ఖడ్గముం గాంచి తమ్మునికి దానిని చూపి స్వప్నమును చెప్పి సంతోషపఱిచి, ప్రాతఃకాలమందు వన్యాహారములతోఁ పారణ చేసి, దేవిని దర్శించి నమస్కరించి, ఆమె ప్రసాదముచేత బడలిక వాయఁగా, హృష్టచిత్తుఁడై కత్తిని చేతఁ బూని, తమ్మునితోఁ గూడ నచటినుండి బయలువెడలెను. కొంత దూరము పోయి మేరుశిఖరములం బోని బంగారు మేడలతో

నెప్పారుచున్న యొకపురవరమును దాని ద్వారమును కాచు చున్న రౌద్రాకారు నొకరాక్షసుని చూచి, వానిని ఆపురము పేరును తత్పతిపేరును అడిగెను. 'ఇది శైలపురము, దీనిప్రభువు యమదంష్ట్రుఁడను రాక్షసుఁడు మాదొర, శత్రునాశకుఁడు.' అని వాఁడు చెప్పెను. వెంటనే ఇందీవరసేనుఁడు యమదంష్ట్రుని చంపుటకు పురములో ప్రవేశించెను. పోనీయక అడ్డపడిన యా ద్వారపాలకుని ఆమహాభుజుఁడు కత్తితో ఒకవ్రేటువేసి తలద్రుంచి నేలఁగూల్చి పోయి రాజభవనము చొచ్చి యచట సింహాసన స్థితుని దంష్ట్రాఘోరముఖుని యమదంష్ట్రుని చూచెను.

వానికి ఎడమవైపున ఒకవరాంగనయు కుడివైపున దివ్య రూపిణి యొక కుమారియు నిలుచుండిరి. ఇందీవరసేనుఁడు ఆరాక్షసుని చూచుచునే యుద్ధమునకు పిలిచెను. రాక్షసుఁడును కేలఁగత్తి బూని లేచెను. ఆయిరువుర యుద్ధములో రాక్షసుని తల ఎన్నిమార్లు తెగి పడినను మరల మరల మొలచుచుండెను. ఆ మాయను చూచి అతని పార్శ్వమం దున్నకుమారి ఇందీవర సేనునిపై దర్శనమాత్రముననే అనురక్తురాలై సంజ్ఞ చేయఁగా రాజకుమారుఁడు ఒక వ్రేటుతో వానితలను రెండుగా చీల్చి వేసెను. ఆప్రతిమాయచే రాక్షసునిమాయ నశించి మరల తల మొలవదాయెను. రాక్షసుఁడును మృతిఁ బొందెను. అంత సంతోషించిన యావరాంగనాకుమారికలను రాజకుమారుఁడు తమ్మునితోఁ గూడ కూర్చుండి యడిగెను. 'ఒకఁడే ద్వారపాల

కుఁడు కాచుచున్న యీపురమందు ఈరాక్షసుఁ డెవఁడు? వీని మృతికి మీరు సంతోషించుచున్నా రేల?' కుమారి చెప్పుచున్నది:—'ఈ శైలపురమందు వీరభుజుఁ డని రాజుండెను. ఈమె మదనదంష్ట్రి యని యతనిభార్య. ఈ రాక్షసుఁడు ఆరాజును మాయచేత భక్షించినాఁడు, ఆయన పరివారమును కూడ భక్షించినాఁడు, ఈమె యందగత్తె యని ఈమెను మాత్రము భక్షింపక తనకు భార్యగా నుంచుకొన్నాఁడు. విజన మయిన యీ రమ్య నగరమందు బంగారపుగృహమును నిర్మించుకొని పరివారమును పొమ్మని ఈమెతో క్రీడించు చున్నాఁడు. నాపేరు ఖడ్గదంష్ట్రి, నేను ఇతని చెల్లెలను కన్యకను, నిన్ను చూచిన మాత్రాన నీయందు అనురక్త నయితిని. కనుక వీని మృతికి సంతసించితిని కనుక ఆర్యపుత్రా, ప్రేమతో స్వయముగా నీకు అర్పించుకొన్న నన్ను పెండ్లి యగుము.' అంత నతఁడు ఆమెను గాంధర్వవిధిచేత వివాహ మై దేవీఖడ్గప్రభావముచే తలంచిన మాత్రమున కలిగినభోగములను అనుభవించుచు తమ్మునితోఁ గూడ అచటనే ఉండెను.

ఒకనాఁడు అతఁడు తనఖడ్గచింతామణిని ధ్యానించి, ఒక విమానమును నిర్మించి, తమ్ముని అనిచ్ఛాసేనుని దానిలో నెక్కించి, తమ వృత్తాంతమును తల్లిదండ్రులకు నివేదింపఁ బంచెను. అని చ్ఛాసేనుఁడు ఐరావతీపురికి పోయి ఎండకు సోలిన చకోరము లను చంద్రమండునుం బోలె తల్లిదండ్రులను దర్శనముచేత నే

సంతోషపెట్టి వారిపాదముల వ్రాలెను. వారును వరుసగా కౌఁగిలించుకొనఁగా, అన్న క్షేమమును తను పడిన యిడుమలును సకలమును వక్కాణించెను. పాపాత్మురాలు సవతితల్లి ద్వేషముచే తమనాశముకై చేసిన యీవంచన నెల్ల వారివలన విని, తల్లిదండ్రులకడ కొంతకాలము జనులచే పూజలువడయుచు సుఖ ముండెను. పిమ్మట ఒకప్పుడు దుఃస్వప్నము కాఁగా అన్నను తలఁచుకొని తండ్రితో 'నాయనా, నేను పోయి మీకోరికను తెలిపి అన్నను కొనివచ్చెదను, నాకు సెలవిమ్ము' అని యడిగి పుత్రోత్సుకులైన తల్లిదండ్రులచేత అనుమతుఁడై, ఆ విమానమునే ఎక్కి ఆకాశమార్గమున శైలపురమునకు పోయి, ప్రాతఃకాలమందు భ్రాతృమందిరమును చేరి, అచట నిస్సంజ్ఞుఁడై పడియున్నయన్నను చెంతను ఏడ్చుచున్న ఖడ్గదంష్ట్రి మదనదంష్ట్రిలను చూచెను. సంభ్రాంతుఁడై ఇదేమని యడిగెను. అంతట ఖడ్గదంష్ట్రి తన్ను రెండవది దూషించుచుండఁగా ఇట్లు ఉత్తరము చెప్పెను. 'నీవు పోయిన పిమ్మట నేను ఒకప్పుడు స్నానార్థము పోయి యుండఁగా నీభ్రాత ఈమెతోఁ గూడెను; నేను క్షణములో స్నానము చేసి వచ్చి, ప్రత్యక్షముగా అతఁడు దీనితోఁ గూడియుండఁగా చూచి, పట్టరాని యీసు పూనినదాననై, ఇతఁ డెంత బతిమాలినను మెత్తఁబడక 'ఇతఁడు నన్ను లక్ష్యపెట్టక మఱియొకతెను పొందుచున్నాఁడు, ఇది ఖడ్గమహాత్త్వమువలని గర్వము, కనుక ఇతని ఖడ్గమును దాఁచెదను

గాక, యని తలంచి రాత్రి, ఇతఁడు నిద్రపోవుచుండఁగా ఖడ్గమును నిప్పులో వైచితిని. ఖడ్గము మలిన మయినది. ఇతఁ డిట్లు పడియున్నాఁడు. మదనదంష్ట్రి నన్ను తిట్టసాగినది. నేను పశ్చాత్తాప పడితిని. అంత మే మిద్దఱము శోకాంధల మై మరణనిశ్చయము చేసికొనియుండఁగా నీవు వచ్చినాఁడవు. కనుక నీవే ఈకత్తితో ఖడ్గకర్మ గాలిని జాతిధర్మము మానని నన్ను ఖండించి వేయుము.'' ఈప్రకారము వదినె పశ్చాత్తాపముచే పలుకఁగా నతఁడు ఆమె వధ్యురాలు గాదని తలంచి, తానే తనతలను తఱుఁగుకొనుటకు ఖడ్గము నెత్తెను. అంతట ఆకాశమునుండి 'రాజపుత్రా, సాహసము చేయకుము. నీయన్న చావ లేదు. ఖడ్గమును ఏమఱిన కోపముచేత దేవి ఇతనికి మూర్ఛ కలిగించినది. ఖడ్గదంష్ట్రి అపరాధిని గాదు. శాపముచే ఈలోకమునఁ బుట్టిన వీరలకృత్యము ఇది. ఈయిరువురు పూర్వజన్మములో నీయన్న భార్యలు. కనుక ఇపుడు నీయిష్టసిద్ధికొఱకు దేవినే ప్రసాదింపుము.' అని వాక్కు వినఁబడెను.

దానిని విని అనిచ్ఛానేనుఁడు మరణ ప్రయత్నము మాని అగ్నికళంకిత మైన యాఖడ్గమును కొని ఆవిమానము నెక్కి వింధ్యవాసినిపాదమూలమునకు పోయి అచట తన శిరస్సు బలి యిచ్చి దేవిని తృప్తినొందించువాఁడై ఖడ్గ మెత్తఁగా 'కుమారా, సాహసము చేయకు, నీయన్న బ్రతుకును. నీభక్తికి మెచ్చితిని. కత్తి నిష్కళంక మగును.' అని వాక్కు వినఁబడెను.

అంత నిష్కలంక మైన ఖడ్గమును చేతఁగొని, దేవికి ప్రదక్షిణము చేసి, మనోరథము వోలె సిద్ధమును శీఘ్రగామియు నయిన విమానము నెక్కి, ఉత్సుకుఁడై శైలపురమునకు పోయి, యచట ఆక్షణమే మూర్ఛ తేఱి లేచిన యన్నను చూచి, సాశ్రులోచనుఁడై పాదముల వ్రాలెను. అతఁడును ఇతనిని కంఠాలింగనము చేసెను. నీవు మాభర్తను రక్షించితి వని పలికి వదినెగార్లు వానిపాదముల వ్రాలిరి. ఇందీవరసేనుఁ డడుగఁగా తమ్ముఁడు యావద్వృత్తాంతమును చెప్పెను. ఇందీవరసేనుఁడు నియతిని తలఁచి ఖడ్గదంష్ట్రిపై కోపగింప లేదు. భ్రాతనుగూర్చి, మిగుల సంతసించెను. మఱియు నతనివలనే తల్లిదండ్రులు తన్ను చూచుటకు ఉవ్విళ్లూరు చుండుటయు సవతితల్లి చేసిన మాయయు విని, తమ్ముఁ డిచ్చినఖడ్గమును గైకొని, దానిప్రభావమువలన ధ్యానించినమాత్రాన వచ్చిన విమానమును సువర్ణమందిరభార్యానుజసమేతముగా ఎక్కి, తన నగరము ఐరావతికి పోయి, లోకులచేత ఆశ్చర్యదృష్టుఁ డగుచు ఆకాశము నుండి దిగి రాజగృహమున తండ్రి యొద్దకు పోయెను. తండ్రిని తల్లిని చూచి యానందబాష్పములచే తనముఖము క్షాళితమగుచుండఁగా వారిపాదముల వ్రాలెను. వారు ఆకస్మికముగా నగపడిన పుత్త్రుని కౌఁగిలించి యమృతములో స్నానము చేసిన వారుంబోలె తాపశాంతి నొందిరి. తమను వచ్చి పాదప్రణామము చేసిన దివ్యరూపనుల కోడండ్ర నిరుపురను చూచి మిగుల సంత

సించిరి. ప్రస్తావవశమున వారిరువురును అతనికి పూర్వజన్మ భార్యలని దివ్యవాణి చెప్పె నని విని తల్లిదండ్రులు సంతసించిరి. విమానగమనము బంగారుమందిరము తెచ్చుట మొదలయిన తపఃప్రభావమున కత్యంతము హర్షించిరి.

పిమ్మట ఇందీవరసేనుఁడు సభార్యుఁడయి తల్లిదండ్రుల యొద్ద కొంతకాలముండి ఒకనాఁడు తండ్రిని విన్నవించుకొని యనుమతుఁడై తమ్ముఁ గూడి మరల దిగ్విజయమునకు బయలు వెడలెను. ఖడ్గప్రభావముచేత పృథివి నెల్ల జయించి ఆమహాభుజుఁడు సువర్ణగజాశ్వరత్నములను రాజులవలననుండి తెచ్చి తననగిరి చేరెను. విజిత యయిన భూమి భయముచే సైన్యధూళి మిషచేత నతని వెంబడినే వచ్చుచుండెను. వానికి తండ్రి ఎదురు పోయెను. ఇందీవరసేనుఁడు సానుజుఁడై రాజధాని సొచ్చి, తల్లి నధికసంగమను ఆనందసాగరములో ఓలలాడించెను. రాజులను సమ్మానించి స్వభార్యాస్వజనాన్వితుఁడై ఆదినము మహోత్సవములో నుండెను మఱునాఁడు కరద్వారముగా తండ్రికి భూమిని సమర్పించి, ఆకస్మికముగా పూర్వజన్మజ్ఞానము రాఁగా, నిద్రించి మేలుకొన్న వాఁడువలె తండ్రికి నిట్లనియె.

నాయనా, నాకు పూర్వజన్మజ్ఞానము కలిగినది. చెప్పెదను వినుము. హిమవత్పర్వతము చఱియయందు ముక్తాపుర మను పురము కలదు. దానిని ముక్తాసేనుఁడు విద్యాధరేశ్వ

రుడు ఏలుచుండును. ఆయనకు కంబుమతి యనుదేవి కలదు. ఆదంపతులకు పద్మసేనుడు రూపసేనుడు అను సద్గుణులు కలిగిరి. వారిలో పద్మసేనుని ఆదిత్యప్రభ యనెడి విద్యాధర కన్య స్వయముగా వరించెను. దానిని చూచి ఆమె చెలి చంద్రమతి యను విద్యాధరకన్యయు కామార్తయై ఆతనిని వరించినది. ఇరువురు భార్యల యీసులచే పద్మసేనుడు నిత్యము ఖేదపడుచుండి ఒకప్పుడు 'ఈర్ష్యాంధలైన యీభార్యల పోరాటమును నేను సహింపజాలను. తపోవనమునకు పోయి ఈదుఃఖమును తప్పించుకొనియెదను. అందులకు, నాయనా, నాకు అనుజ్ఞ యిమ్ము.' అని ముక్తాసేనునికి విన్నపించుకొనెను. వాని పట్టుదలకు అలిగి తండ్రి 'తపోవనమునకు పోనేల? మర్త్యలోకమునకు పొమ్ము. కలహాసక్తయైన యీ నీభార్య ఆదిత్యప్రభ రాక్షస జాతిలో పుట్టి నీభార్యయే యగును. నీయందు అనురక్తయై నీకు నతివల్లభ యయిన యీచంద్రమతి రాజస్త్రీయు రాక్షసియునై భూమిలో నిన్నే మరలఁ బడయును. నీవెంట రాఁగోరుచున్న యీ నీతమ్ముడు కూడ నచటను నీకు తమ్ముడుగానే పుట్టును. ద్విభార్యత్వదుఃఖము నచటను కొంచెము పొందుదువులే.' అని శపించి, మరల శాపాంతము నిట్లు చెప్పెను. 'రాజపుత్త్రుండవై పృథివిని జయించి తండ్రికి నీ విచ్చినప్పుడు వీరితోఁ గూడ జాతిని స్మరించి శాపమోక్షము పొందుదువు.' ఇట్లు తండ్రి పలుకఁగా పద్మసేనుడు తన యితరస్వజనులతోఁ గూడ మర్త్య

లోకమున నవతరించెను. నాయనా, నేనే ఆపద్మసేనుఁడను నీ కొమరుఁడను ఇందీవరసేనుఁడను. నాకృత్యము నెఱవేర్చితిని. రూపసేనుఁ డను రెండవ విద్యాధరకుమారుఁడే ఈ నాతమ్ముఁ డనిచ్ఛాసేనుఁడు. ఆయాదిత్యప్రభయు ఆచంద్రమతియు ఈ ఖడ్గదంష్ట్రామదనదంష్ట్రలే. ఇప్పుడు మాశాపమున కంతము. నాయనా, మేము మా వైద్యాధరపదమును పొందెదము.

ఇట్లు పలికి యతఁడు తానును భార్యలును తమ్ముఁడును మనుష్యరూపములు వదలి తల్లిదండ్రులకు పాదప్రణామముచేసి భార్యలనుతొడమీఁద కూర్చుండఁ బెట్టుకొని ముక్తాపురమునకు పోయెను. వీరిని చూచి ముక్తాసేనుఁడును అతనిదేవి కంబు మతియు మిగుల సంతసించిరి. ఆదిత్యప్రభయు చంద్రమతియు పర స్పరాసూయ లేక భజిచుచుండ పద్మసేనుఁడు సుఖంముండెను.

ఇట్లని గోముఖుఁడు మార్గములో రమ్య మయినకథ చెప్పి మరల నరవాహనదత్తుని కిట్లనియె:—ఈప్రకారము గొప్పవారికే గొప్ప క్లేశమును పిమ్మట మహాభ్యుదయమును కలుగును. ఇతరులకు సామాన్యులకు క్లేశము గాని ఉదయము గాని స్వల్పముగానే యుండును. రత్నప్రభాదేవియొక్క విద్యా మహిమచేత సురక్షితుఁడ వై రాజకన్యను కర్పూరికను సులు వుగా పొందెదవు.

ఈప్రకారము నరవాహనదత్తుఁడు గోముఖునివలన విని మార్గశ్రమ మెఱుఁగక నడచెను. సాయంకాలమునకు స్వచ్ఛ

శీతలము నుమంజుకూజితరాజహంసరాజీవిరాజితవారిపూరమును వికచవారిరుహమును రసాల పనస దాడిమీ రమ్యతీరమును అయిన యొక సరస్సు చేరి, దాన స్నానము చేసి భక్తితోఁ శివార్చన సేసి, సురభి మధుర ఫలములు ఆరగించి, చెలికానితో గూడ చివురుఁబాన్పుపై పవళించి, రాజపుత్త్రుఁడు ఆసరస్తీరమున రాత్రిని గడపెను.

---

### ౯-వ తరంగము.

తెల్లవాఱఁగానే మేల్కాని సరస్తీరమునుండి బయలు వెడలి నడచుచు నరవాహనదత్తుఁడు గోముఖుని కిట్లనియె:— "మిత్త్రమా, ఈరాత్రి తెల్లవాఱు జామున స్వప్నములో ఎవతెయో ఒకకుమారి దివ్యరూప ధవళాంబర అగపడి యిట్లనియె: 'వత్సా, చింతింపకుము. త్వరలోనే ఇటనుండి సముద్రతీరమందు అడవి చివరను గొప్పనగరము చేరుదువు. అచట విశ్రమించి కర్పూరసంభవపురికి పోవుదువు. ఆరాజకన్యక కర్పూరికనచటఁ బడసెదవు.' ఇట్లు పలికి ఆమె అంతర్ధాన మాయెను. నేను మేలుకొన్నాఁడను." ఆమాటకు మంత్రి 'దేవా, నీయందు దేవత లనుగ్రహించియున్నారు. నీకసాధ్య మే మున్నది? తప్పక సులువుగా నీకోరిక సిద్ధించును.' అనెను.

ఇట్లతఁడు పలుకఁగా సంతసించి నరవాహనదత్తుఁడు త్వరత్వరగా పయనము నడచి సముద్రసమీపమున పర్వతము

లంతటి యట్టాలక ద్వారగోపురములు మేరువునంతటి స్వర్ణసువర్ణ ప్రాసాదములును గలిగిన యొక గొప్పనగరమును అపరభూమండలమో యన నొప్పుచున్నదానిని చూచి బజాఱువీథిని ప్రవేశించెను. అందు ఎచ్చటను కొయ్యబొమ్మలు వణిగ్విలాసినీ జనరూపములతో మాటమాత్రము లేక సచేతనములవలె సకల చేష్టలును చేయుచుండినవి. నరవాహనదత్తుఁడు క్రమముగా గోముఖునితోఁ గూడ రాజగృహము నొద్దకు పోయి చూడఁగా, అదియు ఆతీరుననే యుండెను. అచటను గుఱ్ఱములును ఏనుఁగులును యంత్రమయములుగానే యుండినవి. అతఁడు ఆపురమున మిగుల నున్నతముగా నున్న బంగారురాజభవనమును ఆశ్చర్య పడుచు మంత్రితోఁ గూడ ప్రవేశించి, అచట యంత్రమయ ప్రతీహారవారనార్యాది పరివృతుఁడును జడములయిన యీ సకలయంత్రములను నడపించుచు ఇంద్రియములకు ఆత్మవోలె వాని కెల్ల అధిష్ఠాతయు నై రత్నసింహాసనాసీనుఁడైన యొక భవ్యపురుషుని చూచెను. అతఁడును ఉత్తమాకారుని నరవాహనదత్తుని చూచి లేచి కుశల మడిగి తన యాసనమందు కూర్చుండఁబెట్టి తాను ఎదుటఁ గూర్చుండి, 'అయ్యా, నీ వెవరవు?' ఎందులకు ఒకనినే వెంటఁబెట్టుకొని యీభూమికి వచ్చినాఁడవు?' అని యడిగెను. అంతట నరవాహనదత్తుఁడు తన వృత్తాంతము చెప్పి వినీతుఁడైన యతనిని నిశ్శేషముగా అతని వృత్తాంత మంతయు, అతఁ డెవఁడో, ఆశ్చర్యకర మయిన యీపుర

మేమో, చెప్పు మని యడిగెను. అతఁ డిట్లు చెప్పఁదొడఁగెను.

## వ ్ర డ ం గి ్ర భా త ల క థ.

"భూదేవియొక్క కాంచియో యన సద్గుణగుంభిత కాంచి యను నగరి కలదు. అందు బాహుబలుఁ డని రాజు కలఁడు. అతఁడు శ్రీని భుజబలముచే ఆర్జించి చపలత్వము పోవునట్లుగా కోశగృహములో కట్టివైచినాఁడు. అతని రాష్ట్రములో ఇద్దఱము అన్నదమ్ములము వ్రడంగులము మయప్రణీత కాష్ఠాది మాయా యంత్ర నిర్మాణ ప్రవీణులము ఉంటిమి. నాయన్న ప్రాణధరుఁ డనువాఁడు వేశ్యాలంపటుఁడు. నాపేరు రాజ్యధరుఁడు. అతఁడు మా పైతృకధన మంతయు మాత్రమేగాక, నాస్వార్జితము కూడ నేను స్నేహముచేత నీయఁగా వ్యయము చేసికొనెను. అప్పటి కిని అతివ్యసనియై వేశ్యకొఱకు ధనము సంపాదించువాఁడై త్రాటియంత్రముచే నడచునట్టి కొయ్యహంసలను రెంటిని చేసెను. త్రాడు లాగినయెడల ఆరెండుహంసలును రాత్రి వెడలి బాహుబలరాజుయొక్క కోశమునుండి యంత్రప్రయోగముచేత గవాక్షమార్గమున ప్రవేశించి పెట్టెలో నున్న యాభరణ మును మాయన్నయింటికి తెచ్చుచుండినవి. దానిని అమ్మి మా యన్న వేశ్యతోఁ గూడ అనుభవించుచుండెను. అట్లే ప్రతి దినము మాయన్న రాజు బొక్కసమును దోఁచుకొనుచుండెను. నేనెంత వల దన్నను ఆ యకార్యమును మాత్రము మానఁ డాయెను. వ్యసనాంధుఁడు సన్మార్గమును గాని దుర్మార్గమును గాని

చూచునా? అట్లు రాజుబొక్కసము రాత్రులలో ఎలుకలు లేకయే గడియలు వీడకయే కొల్లఁ బోవుటను కని ప్రతిదినము వెదకి దొంగను కనిపట్ట లేక భాండారికుఁడు పరితప్తుఁడై రాజునకు ఆవృత్తాంతమును నివేదించెను. రాజు తత్త్వమును కనిపట్టుటకై అతనిని ఇతరులను రాత్రి బొక్కసములో మేలుకొని యుండునట్లు ఆజ్ఞాపించెను.

మహారాజవానులు అట్లు మేలుకొని యుండఁగా, రాత్రి, మాయన్నచే ప్రేరితము లయిన యాహంసములు కిటికీగుండ బొక్కసములో దిగి యంత్రప్రయోగముచే తిరుగుచు ముక్కుతో భూషణమును కఱచుకొని పో నుండినవి. అంతట వారు వాని త్రాళ్లను త్రెంపి వానిని పట్టుకొని తెల్లవాఱఁగానే రాజునకు చూప నుద్దేశించి యుండిరి. ఆసమయములో మాయన్న తొట్రుపాటుతో నాతో 'తమ్ముఁడా, నాహంసలను బొక్కసములోని మహారాజాంత్రము పట్టుకొన్నారు. త్రాడు సళ్లి పోయినది. యంత్రములో మేకు జాఱి పోయినది. కనుక మనము ఇప్పుడే ఇక్కడినుండి లేచి పోవలయును. ఉంటిమేని మనలను రేపు రాజు దొంగలనుగా పట్టుకొనును. మనమే గదా మాయాయంత్ర విశారదుల మని ప్రఖ్యాతి పొందియున్నాము. కనుక ఒకమాఱు మఱ త్రిప్పఁగానే ఎనిమిదివందల యోజనములు పోవునట్టి నా వాతయంత్రవిమానము నెక్కి దుఃఖప్రద మయినను పరదేశమునకు పోవుదము. నీ హితవాక్యమును ఆదరింపని నా దుష్కృ

తమునకు ఫలము నిరపరాధుఁడ వైన నీమీఁదికి కూడ వచ్చి నది.' అని చెప్పి సకుటుంబముగా ఆకాశగామి యయిన విమాన మెక్కెను. అతఁడు రమ్మన్నను నేను అనేకులు చేరియున్న యావిమాన మెక్కలేను. అంత నతఁడు ఆకాశమున కెగిరి ఎక్కడికో దూరమునకు పోయెను.

అన్వర్థనాముఁ డై ప్రాణధరుఁడు అట్లు పోఁగా నేను తెల్లవాఱిన యెడల రాజువలన భయము కలుగు నని తలఁచి నావాతయంత్రవిమానము నెక్కి త్వరగా రెండువందలయోజ నములు పోయితిని. మరల విమానమును ప్రేరించి ఆకాశమా ర్గమున మఱి రెండువందలయోజనములు పోయితిని. అంతట సముద్రసమీపమున సందేహము చేత విమానమును వదలి నడచి యీశూన్యపురమునకు వచ్చితిని. వస్త్రాభరణశయ్యాదిరాజో పకరణసమన్వితమయిన యీరాజభవనమును కుతూహలముచే ప్రవేశించితిని. సాయంకాలము ఉద్యానములోని డిగ్గియలో స్నానము చేసి ఫలములు భుజించి రాజశయ్యమీఁద పరుండి రాత్రి ఏకాకి నై యిట్లు ఆలోచించితిని.— మనుష్యులు లేని చోట నేనేమి చేయుదును. తెల్లవాఱఁగానే ఇక్కడినుండి ఎక్కడి కైనను పోయెదను. బాహుబలరాజువలని భయము తీఱి నది.— ఇట్లాలోచించి నేను నిద్ర పోఁగా స్వప్నములో దివ్య రూపుఁ డొకపురుషుఁడు నెమలి నెక్కినవాఁడు వచ్చి నాతో ని ట్లనియె: 'ఓయి ఇక్కడనే ఉండుము. మఱి యెచటికిని

పోవలదు. ఆహారకాలమందు మధ్యమపురమునకు పోవలసి నది.' ఇట్లు పలికి ఆపురుషుఁడు అంతర్ధానము పొందఁగా నేను మేలుకొని ఇది కుమారనిర్మిత మయిన దివ్యస్థాన మనియు, పూర్వపుణ్యములచేత నాకు కుమారస్వామి అనుగ్రహము చేసె ననియు, ఇచట నుండుటచేత నాకు మేలు కలుగు ననియు, తలఁచి నేను లేచి ఆహ్నికము చేసి ఆహారకాలమందు మధ్యమ పురమునకు పోయితిని. అంతట బంగారపుగిన్నెలు ఎదుట అగపడి వానియందు నేయి పాలు అన్నము మొదలయిన భోజ నము నిండినది. ఇంక నేను తలఁచుకొన్నది యెల్ల అందు ఉద్భ వించినది. దానిని నేను భుజించి మిక్కిలి సంతుష్టుఁడ నైతిని. అది మొదలు నేను ఈపురములోనే ప్రతిదినము తలంచిన మాత్రానఁ గలుగు సర్వభోగములను అనుభవించుచు వసించు చున్నాను. భార్యాపరిజనములు నాకు ధ్యానముచే వచ్చి నిలి చినవి కావు. కనుక, నేను ఈసకలజనమును యంత్రమయముగా నిర్మించితిని. ఇట్లు దేవా, నేను వడ్రంగి నయ్యును ఏకాకినై విధివశమున రాజలీల నెల్ల జరుపుకొనుచున్నాను. దేవనిర్మిత మయిన యీపురమందు మీరు ఈదినము విశ్రమింపుఁడు, నేను యథాశక్తి పరిచర్య చేసెదను.

ఇట్లని రాజ్యధరుఁడు పుష్పోద్యానమునకు నరవాహన దత్తుని గోముఖుని తోడ్కొని పోయెను. అచట నరవాహన దత్తుఁడు బావిసెల్లలో స్నానము చేసి తామరలతో శివార్చన

గావించెను. వారిని రాజ్యధరుఁడు భోజనార్థము మధ్యమ పురమునకు కొనిపోయెను. అచట ధ్యానమాత్రముచే రాజ్యధరుఁడు గిన్నెలలో నిండించిన యాహారమును రాచకొమారుఁడు తానును గోముఖుండును భుజించెను. ఎవరో కంటికగపడక యే భోజనస్థానమును శుద్ధి చేయఁగా నరవాహనదత్తుఁడు తాంబూలము గ్రహించి ఆసనములు సేవించి సుఖముండెను. చింతామణివంటి దైన యాపురమహిమకు ఆశ్చర్యపడి నరవాహనదత్తుఁడు రాత్రి రాజ్యధరుఁడును భుజించిన పిమ్మట శయనోత్తమము నాశ్రయించెను. కర్పూరికను తలంచుకొని నిద్ర పట్టక ఆమెకథ నడిగిన రాజకుమారునితో, చెంత శయనస్థితుఁడైన రాజ్యధరుఁడు ఇట్లనియె.—ఏల నిద్ర పోవు? నీవు కోరిన ప్రియను తప్పక పొందుదువు. అంగన, సిరివోలె ఉదారసత్త్వని స్వయముగా వరించును. ఇందునకు నేను ప్రత్యక్షముగా చూచిన నిదర్శనమును చెప్పెద వినుము:—

### మా న ప ర క థ.

నేను చెప్పిన కాంచీపురరాజు బాహుబలునియొద్ద అర్థలోభుఁడని అన్వర్థనాముఁడు ప్రతీహారుఁ డుండెను. ఆతనికి మానపర యని రూపవతి భార్య యుండెను. అతఁడు ధనలోభముచే సేవకులను నమ్మక, వర్తకవ్యాపారములయందు భార్యను నియోగించెను. ఆమె ఇష్టము కాకున్నను అతని మాటను త్రోయలేక వర్తకులతో బేరములు చేయుచుండెను. ఆమె

యొక్క మధుర వచనములచేతను సౌందర్యముచేతను లోకులు ఆకృష్టు లగుచుండిరి. ఆమె చేసిన గజాశ్వరత్నవస్త్రాదిక వ్యాపారములచే విస్తారము లాభము రాఁగా అర్థలోభుఁడు సంతోషించెను. ఒకనాఁడు అచటికి దూరదేశమునుండి సుఖధనుఁ డని యొక గొప్పవర్తకుఁడు విస్తారముగా గుఱ్ఱములు, వస్త్రములు, ధనము మొదలైనవానితో వచ్చెను. అతని రాక నెఱిఁగి అర్థలోభుఁడు భార్యతో 'ఓసి, సుఖధనుఁ డనువర్తకుఁడు దేశాంతరమునుండి వచ్చియున్నాఁడు. ప్రియా, అతఁడు ఇరువదివేల గుఱ్ఱములను, చీనాదేశమునుండి లెక్కలేని సద్వస్త్రయుగములను తెచ్చి యున్నాఁడు. నీవు పోయి అయిదువేలగుఱ్ఱములను పదివేలదోవతులచాఁపులను అతనియొద్దనుండి కొని తెమ్ము. ఇప్పుడు నాకున్న గుఱ్ఱములతోను కొనఁబోవువానితోను రాజదర్శనము చేసి వర్తకము చేసెదను. ఇట్లు అర్థలోభుఁడు బోధించి పంపఁగా మానపర సుఖధనునియొద్దకు పోయి గుఱ్ఱములను వస్త్రములను వెల కడిగెను. సుఖధనుఁడు ఆమెరూపముచే మోహితుఁడై, ఆమెను కుశల మడిగి కామవివశుఁడై, ఏకాంతమునకు కొనిపోయి 'నీకు ఒకవస్త్రమును గాని గుఱ్ఱమును గాని వెలకు నేనీయను, నాతో ఒకరాత్రి యుందు వేని అయిదువందల గుఱ్ఱములు, అయిదువేల వస్త్రములు నిచ్చెదను.' అని యాసుందరిని ప్రార్థించెను. స్త్రీలు అడ్డము లేక సంచరించుచున్న ఎవనికి ఇచ్ఛ కలుగదు? ఆమె తనభర్త నడిగి వచ్చెద ననియును,

అందులకుఁ గూడ అతఁడంగీకరించు ననియును, సుఖధనునితో పలికి పోయి, భర్తతో సుఖధనునికోరికను తెలిపెను.

వాఁడును లోభాకృష్టుఁడై యిట్లనియె.— 'ప్రియా, అయిదువందలగుఱ్ఱములు అయిదువేలవస్త్రములును ఒకరాత్రికి లభించుచుండ, ఈవిషయములో దోష మేమి? పొమ్ము, అతనియొద్దకు, తెల్లవాఱఁగానే ఇచటికి రమ్ము.' ఇట్లని కాపురుషుఁడయిన యాభర్త పలుకఁగా, మానపర తలపోసెను:— 'సీ! ఏల వీఁడు! భార్య నమ్ముకొను మహాపాపి, హీనసత్త్వుఁడు. సదా లోభమునే భావించుచు లుబ్ధుఁడయినవాఁడు. వందలకొలఁది గుఱ్ఱములను వేలకొలఁది వస్త్రములను ఒకరాత్రి నాకూటమికి ఇచ్చెడు వర్తకుఁడే ఉదారుఁడు, వాఁడే నాభర్త.' ఇట్లాలోచించి, తన దుష్టభర్తతో 'నాయందు దోషము లేదు.' అని చెప్పి, సుఖధనునియొద్దకు పోయెను ఆమె రాఁగా కాంచి సుఖధనుఁడు అడిగి తెలిసికొని ఆశ్చర్యపడి తన్ను కృతార్థునిఁగా తలంచుకొని, అందులకు శుల్కమయిన గుఱ్ఱములను వస్త్రములను లెక్కప్రకారము వెంటనే అర్థలోభునికి పంపి, ఆమెతో మూర్తీభవించి వచ్చిన నిజసంపత్ఫలశ్రీతోనుం బోలె, ఆరాత్రి గడపి పూర్ణకాముఁ డాయెను. తెల్లవాఱఁగానే క్లీబుఁడు అర్థలోభుఁడు లజ్జ లేక మానపరను పిలుచుకొని రమ్మని నౌకరులను పంపఁగా వారితో మానపర యిట్లనియె:— 'నేను అమ్ముడుపోయి ఇతరునిభార్యనై వానితో సంగమించి మరల

ఎట్లు అర్థలోభునికి భార్య నౌదును ? అతనికి లజ్జ లేనట్లు నాకును లేదా? మీరు చెప్పుఁడు. ఇది తగునా? పొండి. ఎవఁడు నన్ను కొనియెనో అతఁడే నాకు పతి.' ఆమె ఇట్లు పలుకఁగా భృత్యులు పోయి అధోముఖులై అట్లే అర్థలోభునితో చెప్పిరి. వాఁడు ఆమెను బలాత్కారముగా తెచ్చుకో నిచ్చగించెను.

అంత హరబలుఁ డను వైద్యుఁడు అర్థలోభునితో ని ట్లనియె:— 'సుఖధనునివలననుండి ఆమెను నీవు తేఁ జాలవు. అతఁడు గొప్ప వీరుఁడు. అతని యెదుట నీకు ధైర్య ముండదు. అతఁడు తన యీవికి అనురక్తయైన మానపరచే ప్రోత్సాహితుఁడై యున్నాఁడు, స్వయము బలవంతుఁడు, బలవంతు లగు మిత్త్రులెందఱో అతనితో నున్నారు. నీవు లోభముచేత అమ్మఁగా భార్య నిన్ను విడిచినది, అవమానముచే నీకు ఉత్సాహాము లేదు, నీవు నిందింతుఁడవు క్లీబుఁడవును అయితివి. నీకు వాని వలె స్వయము బలము లేదు, మిత్త్రబలము కూడ లేదు, అట్టి శత్రువును ఎట్లు జయింపఁ గలవు? నీ భార్యా విక్రయ దుష్కృత మెఱిఁగినచో రాజు కూడ కోపగించును. కనుక ఊరకుండుము, మఱియు బ్రదుకు నగుఁబాట్లు చేసికొనకుము.' ఇట్లు మిత్త్రుఁడు వారించినను వినక, అర్థలోభుఁడు కోపముతో పోయి సుఖధనుని యింటిని ముట్టడించెను. అంతలో అతని సైన్యమును అతని మిత్త్రసైన్యమును చేరి అర్థలోభుని సైన్యమును నాశము చేసినవి. అంతట అర్థలోభుఁడు పలాయితుఁడై రాజునొద్దకు పోయి

'దేవా, సుఖధనుఁ డనువర్తకుఁడు నాభార్యను హరించినాఁడు.' అని తన మర్మాంగమును దాఁచి మొఱపెట్టుకొనెను. రాజు సుఖధనుని పట్టుకొని దండింప నుద్దేశించెను. అంతట సంధానుఁడను మంత్రి రాజుతో ని ట్లనియె:— 'ప్రభూ, ఆ వర్తకుని పట్టుట సులువు గాదు. అతనితో పను నొకండుగురు మిత్త్రిలు వచ్చి యున్నారు. అతనికి లక్షకెక్కువ గుఱ్ఱము లున్నవి. వాస్తవము తెలియ లేదు. ఇది నిష్కారణ మై యుండను. కనుక దూతను పంపి అతఁ డేమి చెప్పునో విచారింప వలయును.' ఇట్లు మంత్రి చెప్పఁగానే రాజు ఆప్రకారమే దూతను పంపెను. రా జాజ్ఞచే పోయి దూత యడుగఁగా మానపర వానితో తన వృత్తాంతమును చెప్పినది. ఆ యాశ్చర్య వృత్తాంతమును విని ఆమెరూపమును చూడఁ గోరి రాజు అర్థలోభునితోఁ గూడ సుఖధనుని యింటికి వచ్చెను. సుఖధనుఁడు వినతుఁడై రాజును గౌరవించెను. బ్రహ్మదేవునికి లావణ్యలక్ష్మిచే ఆశ్చర్యము కలిగించునదియైన మానపరను రాజు చూచెను. పాదానతురాలైన యామెను రాజు అడుగఁగా ఆమె అర్థలోభుఁడు వినుచుండ యథావృత్తము చెప్పెను. అర్థలోభుఁడు విని ఏమియు చెప్పక యుండఁగా, రాజు అది వాస్తవమే యని తలఁచి ఆమెతో 'ఇప్పు డేమి చేయ వలసినది?' అని యడిగెను. ఆమె మనస్సులో నిశ్చయించుకొని యున్నదై యి ట్లనియె:— 'దేవా, నన్ను ఆపద

లేనప్పుడు ఇతరునికి ఎవఁడు విక్రయించెనో ఆలుబ్ధుని నిస్సత్త్వుని మరల ఎట్లు పొందుదును?'

ఈమాటకు రాజు సరియే యని ఒప్పుకొనఁగా, అర్థలోభుఁడు కామక్రోధ లజ్జాకులుఁడై 'రాజా, ఈ సుఖధనుఁడును నేనును మా మాదండులేక మా బాహుబలముచేతనే యుద్ధము చేసెదము, సత్త్వాసత్త్వములు అప్పుడు తెలియును గాక.' అనెను. సుఖధనుఁడు 'అట్లయిన మన మిద్దఱమే పోరుదము. సైన్యము లేల? మానవపర గెలిచినవానిసొమ్ము.' అని పలికెను. అది సరియే యని రాజు అంగీకరించెను. అంతట రాజును మానవపరయు చూచుచుండఁగా ఆయిరువురును యుద్ధభూమికి గుఱ్ఱము లెక్కి వచ్చిరి. యుద్ధారంభములోనే కుంతప్రహారముచే అర్థలోభుని గుఱ్ఱము ఎగిరిపడఁగా అర్థలోభుని సుఖధనుఁడు నేలఁ గూల్చెను. అట్లు మూఁడుపర్యాయములు గుఱ్ఱము చచ్చి, నేలఁ గూలిన యర్థలోభుని ధైర్యము గొల్పుచు ధర్మయోధుఁడైన సుఖధనుఁడు వానిని చంపఁడాయెను. అయిదవ మాఱు గుఱ్ఱము క్రిందఁ ద్రోసి తన్నఁగా నిశ్చేష్టితుఁడై పడి యున్న యర్థలోభుని భృత్యులు ఇంటికి కొని పోయిరి. అంతట అందఱును సుఖధనుని బాగుబాగు అని అభినందించిరి. బాహుబలమహారాజు కూడ వానిని సత్కరించెను. అతఁడు పెట్టిన కానుకను అతనికే ఇచ్చెను. అర్థలోభుఁడు అక్రమముగా ఆర్జించిన సర్వధనమును రాజు అపహరించెను. అతని యధికార

మందు మఱియొకని నియమించి తుష్టుఁడై తన నగరికి పోయెను. సత్పురుషులు పాపసంపర్కము పోఁగొట్టుకొని సుఖ ముందురు గదా. సుఖధనుఁడును బలముచే తాను సంపాదించిన యాయను రక్తభార్య మానపరతో యథేచ్ఛభోగము లనుభవించుచు సుఖ ముండెను.

## కర్పూరికకథ.

ఇట్లు భార్యయును ధనములును హీనసత్త్వుని వదలును; సత్త్వవంతుని స్వయముగా ఆశ్రయించును. కనుక ఓ ప్రభూ, చింతిల్లకుము; సుఖముగా నిద్రింపుము, రాజపుత్త్రి కర్పూరికను నీవు పొందుదువు. ఇట్లు రాజ్యధరుఁడు రాత్రి అర్థయుక్తముగా చెప్పఁగా నరవాహనదత్తుఁడు గోముఖునితోఁ గూడ నిద్ర పోయెను. తెల్లవాఱిన పిమ్మట భోజన మయిన వెంటనే ధీమంతుఁ డయిన గోముఖుఁడు రాజ్యధరునితో, 'అయ్యా, నాప్రభువునకై యంత్రవిమానము చేయుము, దాని నెక్కి ఈయన కర్పూరసంభవ పురమునకు పోయి ప్రియను పొందును గాక.' అనెను. ఆమాట విని వెంటనే ఆవడ్రంగి నరవాహనదత్తునికి తనపూర్వరచిత మైన వాతయంత్ర విమానమును తెచ్చి యిచ్చెను. మనోవేగమును ఆకాశ గామియును ఐన యా విమానమందు సగోముఖుఁడై యెక్కి నరవాహనదత్తుఁడు, తనధైర్యముచే సోల్లాస మైనదో యనునట్లు ఉప్పొంగుచున్న తరంగములు గల సముద్రమును దాఁటి తత్తీరమందలి

కర్పూరసంభవపురము చేరెను. అచట విమానము ఆకాశము నుండి దిగఁగా నరవాహనదత్తుఁడు అందుండి దిగి కుతూహలము చేత ఆపురమందు సంచరించుచు వారిని వీరిని అడిగి నిశ్చయముగా అదే ఆపుర మని తెలిసికొని సంతోషించి రాజమందిర సమీపమునకు పోయెను. అచట నొక చక్కని యింట నొక ముసలిది నివసించి యుండి తనకు సమ్ముఖురాలై బస ఇయ్యఁగా విడిసెను. యుక్తి వెదకుచు క్షణములో ఆమెను 'అమ్మా, ఈ పుర మేలు రాజు పే రేమి? అతనికి సంతాన మేమి? ఆ సంతానముయొక్క సౌందర్య మెట్టిది? మేము వైదేశికులము కాఁబట్టి ఇదియెల్ల నడుగుచున్నాము, చెప్పుము.' అని యడిగెను.

ఆమె చెప్పెను.—మహానుభావుఁడా, ఇది కర్పూరసంభవ మను పురము, ఇందులరాజు కర్పూరకుఁడు, ఆయన సంతానము లేక తదర్థమై శంకరునిఁ గూర్చి బుద్ధివర యను పట్టపుదేవితోఁ గూడ నిరాహారముగా తపస్సు చేసెను. మూఁడు రాత్రులు ఉపవసింపఁగా శివుఁడు స్వప్నములో ఇతనికి 'లే లెమ్ము, పుత్త్రుని కంటె అధికురా లగుకన్య నీకు కలుగును, దానిపతి విద్యాధరులకు చక్రవర్తి యగును.' అని వర మిచ్చెను. అంతట రాజు మేలు కాంచి ఆకలను బుద్ధివరకు చెప్పి సంతోషముతో ఆమెతోఁగూడ వ్రతపారణ చేసెను. పిమ్మట త్వరలోనే రాణి గర్భము దాల్చి యథాకాలమున సర్వాంగసుందరి యైన కన్యను కనియెను. ఆశిశువుయొక్క దేహకాంతికి పురుటింటి

దీపములు ఓడినవై కాటుక మిషమున నిట్టూర్పులు నిగిడించిన ట్లుండెను. ఆమెకు కర్పూరిక యని తండ్రి తనపేరే పెట్టి యుత్సవము చేసెను. ఆమె లోకలోచన చంద్రిక యై క్రమ ముగా ఎదిగి ఇపుడు యౌవనమందున్నది. తండ్రి యామెకు పెండ్లి చేయఁ గోరి యున్నాఁడు గాని, ఆమె పురుషద్వేషిణి యై వివాహమును రోసి యున్నది. 'కన్యాత్వఫల మయిన వివాహమును, చెలీ, ఏల ఒల్లవు?' అని స్వసఖి యయిన నా కౌమారిత యడుగఁగా ఆమె యిట్లు చెప్పినది.—

నాకు జాతిస్మరణ కలదు. నాపూర్వవృత్తాంతము వినుము. మహాసముద్రతీరమందు గొప్ప గంధపు మ్రానొకటి కలదు. దానియొద్ద వికచకమలాలంకృత మయిన సరస్సు కలదు. అందు నేను కర్మవశంబున పూర్వజన్మమందు హంసినై నివసించి యుంటిని. నేను ఒకప్పుడు ఆ గంధపు మ్రానిమీఁద నాభర్తతోఁ గూడ గూఁడు కట్టుకొంటిని. ఆగూఁటిలో నేను గన్న లేఁత శిశువులను ఆకస్మికముగా ప్రబలమైన సముద్ర తరంగము వచ్చి యపహరించినది. పిల్లలను ప్రవాహము హరిం పఁగా నేను ఏడ్చుచు మేఁత మాని సముద్ర తటమందలి శివ లింగము ముందఁ బడి యుంటిని. అంతట నాపతి రాజ హంసుఁడు వచ్చి 'లే, పోయినపిల్లలకై ఏల దుఃఖించెదవు? మరల మనకు పిల్లలు పుట్టుదురు, బ్రదికియున్న సకలము కలుగును.' అని పలికెను. ఆపలుకు నాహృదయములో బాణమువలె

తాఁ కెను. నేను, 'ఛీ, ఎంతపాపాత్ములు పురుషులు, పసిపిల్లల విషయమందే ఇంత కఠినులు. స్త్రీలకు ప్రేమ కలదుగాని పురుషులకు లేదు. ఈపతి నా కేల? దుఃఖకర మయిన యీ దేహ మేల?' అని తలంచి, ఆశివునే హృదయమందు నిలుపుకొని నాభర్తను చూచుచుండఁ గానే 'జన్మాంతరమందు పూర్వ జన్మజ్ఞానము కల రాజపుత్త్రినిగాఁ బుట్టెదను గాక' అని కోరుకొని ఆదేహమును సముద్రములో విడిచితిని. అందువలన సఖీ, ఈజన్మములో ఇట్టిదాననై పుట్టితిని. ఆపూర్వజన్మమందలియీ భర్తయొక్క చిత్తకాఠిన్యమును స్మరించుచున్న నాకు ఏవరుని యందును మనస్సు తగులకున్నది. కనుక నేను వివాహము కోరను. అటుపై దైవాధీనము.——

ఇట్లు రాజసుత రహస్యముగా చెప్పఁగా నాకుమాఱియు నాకు రహస్యముగా చెప్పినది. నాయనా, నీ వడిగిన విషయము చెప్పితిని. ఆమె నీకే భార్య కాఁగలదు. సకలవిద్యాధరులకు చక్రవర్తి యగువానికి ఈమె పట్టపు దేవి యగు నని పూర్వము శంకరుఁడు వర మిచ్చినాఁడు. ఆలక్షణములు తిలకాములు నీయందగపడుచున్నవి. బ్రహ్మ అందులకే నిన్ను ఇక్కడికి తెచ్చి యుండవలయును. లెమ్ము భోజనమునకు, నాయింట నుండుము. ఏమి జరుగునో చూతము గాక.— ఇట్లని వృద్ధ చెప్పఁగా, నరవాహనదత్తుఁడు గోముఖుఁడుం దాను లేచి భోజనముచేసి ఆరాత్రి గడపెను.

కాఁగా దానితో సముద్రతీరమున చందన వృక్షముందు నివసించి యుండెను. తరంగము వాడిపిల్లలను సముద్రము లోనికి కొట్టుకొని పోఁగా శోకముచే హంసి అందులోనే పడి ప్రాణములు వదలెను. ఆ హంసయే శంకరుని ప్రసాదమువలన వత్సేశ్వరాత్మజుఁడవై పుట్టి నాఁడవు, నీకు పూర్వజన్మజ్ఞానము కూడఁ గలదు. ఆహంసియు ఇట్లే సముద్ర పారమున కర్పూరసంభవపురమున కర్పూరికా యనుపేర రాజసుతయై యున్నది. పొమ్ము, నీప్రియభార్యను పొందుదువు.' ఇట్లు పలికి ఆమె ఆకాశమున కెగిరి అదృశ్యురాలాయెను. ఈ మా ప్రభువు ఆవృత్తాంతము తెలిసిన తత్క్షణమే నాతోఁ గూడ ఇచటికి బయలువెడలి వచ్చినాఁడు. నీమీఁది స్నేహము ఈడ్వఁగా ప్రాణములకు తెగించి వేలకొలఁది యడవులు దాఁటి సముద్రతీరము చేరినాఁడు. అచట హేమపురస్థుఁడు రాజ్యధరుఁ డనువడ్రఁగి మాకు యంత్రవిమానము నిచ్చినాఁడు. భయంకరమైన యావిమానమును మూర్తీభవించిన సాహసమును బోలె ఎక్కి సముద్రకాంతారములను దాఁటి మేము ఈపురమునకు వచ్చితిమి. ఇందునిమిత్తము నాయీస్వామి, ఇట్లు 'హా హంసి' అని పలుకుచు తిరుగుచు నీయొద్దకు వచ్చినాఁడు. ఇప్పుడు నీముఖ మనెడుపూర్ణిమాచంద్రుని దర్శనముచే అపరిమేయ మయిన దుఃఖతమస్సును పోనాడుచున్నాఁడు. దేవి, ఈమహాతిథిని నీ వీక్షణనీలనలినమాల్యములతో అర్చింపుము."

గోముఖుఁడు చెప్పిన యావద్వృత్తాంతమును తన యనుభవమునకు సరిపడఁగా కర్పూరిక అదియెల్ల సత్యమే యని తలంచి 'ఓహో, నాయందు ఎంత ప్రేమ ఆర్యపుత్రునికి! వృథాగా నేను విరక్త నయితిని.' అని ప్రేమావేశముతో మనస్సులో ననుకొని 'అయ్యో, ఎవనికొఱకు రెండుజన్మములయందును ఆర్యపుత్రుఁ డీకష్టము అనుభవించినాఁడో ఆహా నేను ధన్యురాలను కదా!' అని, నరవాహనదత్తు నుద్దేశించి 'మీకు నేను ప్రేమచే విలువఁబడిన దాసిని.' అని పలికి, ఆయనకు స్నానాది సమ్మానములు చేయించెను. పరివారముఖముగా యావద్వృత్తాంతమును తండ్రికి తెలిపెను. అతఁడును తెలిసికొని ఆమెయొద్దకు వచ్చినవాఁడై వివాహము నంగీకరించిన కొమారితను, చిరకాలమునకు లభించిన యుచితవరుని నరవాహనదత్తుని విద్యాధరమహాచక్రవర్తి లక్షణలక్షితుని, చూచి కృతార్థుఁడ నైతి నని సంతోషించెను. యథావిధిగా సాదరముగా కొమారితను నరవాహనదత్తునికి దానము చేసెను. అల్లునికి ఒక్కొక్కయగ్ని ప్రదక్షిణమునకు మూఁడుకోటుల స్వర్ణమును అంత కర్పూరమును ఇచ్చెను. ఆరాసు లచట వివాహమాహాత్మ్యమును చూచుటకై వచ్చిన పార్వతీవివాహసాక్షు లయిన మేరుకైలాససానువులో యన నొప్పుచుండెను. ఇంక పదికోటులవస్త్రములను సుభూషిత లైనమున్నూఱుగురుదాసీజనులను ఇచ్చెను. వివాహమైన నరవాహనదత్తుఁడు కర్పూరికతో సుఖానుభవించిన

